# ఆంధ్రపత్రికసంవత్సరాదిసంచిక.

## 1912 వ సం॥ ఏప్రిల్ నెల 10 వ తేది.

పరీధావినామసంవత్సర చైత్రశుద్ధపాడ్యమి మంగళవారము.

వివిధవ్యాసములతోను, దర్బారు చిత్రపటములతోను, సంస్థానాధీశుల చిత్రపటములతోను,

## ఆంధ్రపత్రికాధిపతిచే బ్రకటింపబడి

తత్వవివేచక ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

## బొంబయి.



# ANDHRAPATRIKA.

## 'HE ANNUAL AND DURBAR NUMBER

CONTAINING

Pictures of Delhi Durbar and Eminent Persons

And Contributions from Telugu Scholars, etc.

*April 10, 1912.*

**BOMBAY.**

by BHIVA HARI at the "Tatva-Vivechaka Press" Nos. 1, 2, and 3, Khetwadi Back Road &
e Proprietor K. Nageswara Rao, 109, Frere Road, Fort, Bombay.

# ప్రస్తావన.

ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే । నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥

ఉగాది సురుచిరచైత్రమున కాదిమదివసము చైత్రమాసము వసంత ఋతువునకు తొలిమాసము. మధుమాసము చాంద్రమానాబ్దమునకు మొదటి ఋతువు. పరీధావివత్సరారంభమున నూతన విలాస విరాజితంబులైన సంవత్సరాదియును పుష్పమాసంబును సంప్రాప్తంబులగుచున్నవి. చైత్రము చిత్రవిరాజమానము. నవ్యదివ్యశోభావిభాసమానము. నూతనోజ్జీవనమయము. నూతన చిత్రపర్ణవసనాలంకృతంబులైన తరులతా గుల్మంబులు నూతన చైతన్యంబునుఁ బ్రదర్శించుచుండును. కోమలంబులైన చూతప్రసవంబులు భావిఫలప్రాప్తినిఁ బ్రకటించుచుండును. స్నిగ్ధవర్ణప్రసూన ప్రకీర్ణంబులైన నింబతరుబృందంబులు పరిమళామోదంబులను వెదఁజల్లుచుండును. రక్తపర్ణప్రాయంబులైన కింసుక కుసుమంబులు నూతన వికాసమును వ్యక్తీకరించుచుండును. చిత్రవర్ణాలంకృతంబులైన కిసలయ పల్లవంబులు నూతనసృష్టిని నిర్ణయించుచుండును. రమణీయంబులైన సుమప్రసూనంబులు లోకసౌందర్యంబునుఁ జాటుచుండును. విశుద్ధంబులైన కుసుమసౌరభంబులు సువాసనానుష్ఠానంబు నుపదేశించుచుండును. సుస్వరోపేతంబులైన శుకపిక మంజులారావంబులు గీతారావంబులను సంస్మరింపఁ జేయుచుండును. మలయాగతంబులైన మందమారుతంబులు తాపోపశమనంబును జేయుచుండును. శీతలంబులైన తరుచ్ఛాయలు గమనాయాసంబు నపనయించుచుండును నిర్మలంబులైన పానీయంబులు దాహోపశమనంబునుఁ జేయుచుండును. ప్రకృతియంతయును నూతన చైతన్యమయముగా నొప్పుచుండును.

ఈనూతన చైతన్యసంసర్గమువలన నూతనాశలు ...ట సహజము. గతము కాలగర్భమునందు లీనమ... తము కాలగర్భమునుండి నూతనవికాస...గుచున్నది. గతాగతములతోఁ బ్రపం... పరిభ్రమించుచున్నది. గతము వర్త...ము. వర్తమాన మాగతమునకుఁ గారణము. గతాగత వర్తమానము లనవచ్ఛిన్నములు. గతంబునకు వగచుట యవివేకము. నిరుత్సాహమువలనఁ బ్రయోజన మేర్పడదు. ఇష్టార్థసిద్ధికిని సాధనముగాదు. భగ్నాశాపూరణమున కిది సాధనోపాయముగాదు. వర్తమానమునకై పాటుపడుట వివేకము. ఈవివేకము కార్యసిద్ధికి సాధనము. ఉత్సాహమునకు మూలము. జయప్రాప్తికిఁ గారణము. వసంతాగమన సమయమునఁ బ్రకృతియంతయును నూతనోత్సాహమయముగా నొప్పుచుండును. సహవాస సంసర్గమువలన నీయుత్సాహము మనుజులకు సంక్రమించుట సహజము. నూతనాశాభరితంబైన యీయుత్సాహంబు సంవత్సరాదిపండుగ దినంబున వ్యక్తీకృతంబగుచున్నది.

ఆనుదినంబున జనులు సురుచిరాంబరాభరణంబులనుఁ దాల్చెదరు; మిష్టాన్నంబుల నారగించెదరు; దానధర్మములంజేసెదరు; జగన్నాయకు నారాధించెదరు; నూతనోద్యమంబుల నారంభించెదరు; వర్తమాన వర్షఫలంబుల నాకర్ణించెదరు. ఈయుత్సాహభరితారంభనిర్వాహణములు వర్తమానఫల సంచయమునకు సాధనములు. సంవత్సరాదిసంచిక నలంకరించుముఖచిత్రపట మీయుత్సాహభరిత భావావస్థకు నిదర్శనము. సుందరోద్యాన వనము. వసంతకాలము. పుష్పశోభితము. రూపవతి. సురుచిర వస్త్రాలంకృత. ఎలజవ్వని. కుసుమాపచయము. పరమోత్సాహము. చిత్రకారునిచే నీభావావస్థలన్నియును నూతనోత్సాహమునకు నిదర్శనములుగాఁ జిత్రీకరింపఁబడినవి. నవీనోత్సాహముతో వర్తమానవత్సర మారంభింపఁబడి వాంఛాఫల ప్రదమగుఁగాత!

## విరోధికృన్నామ సంవత్సరము.

గతవర్షము లోకచరిత్రమునందొక సుప్రసిద్ధాబ్దముగ నెన్నఁబడఁగలదు. పదేండ్లుగా లోకమునందుఁ గ్రొత్తతలంపులు ప్రాకనారంభించినవి. ఈతలంపులు క్రమక్రమముగాఁ బెరిగి ఫలోన్ముఖంబు లగుచున్నవి. అసహిష్ణుతాభావ మన్నిదిశల

ను వ్యాపించుచున్నది. అశాంతి పెరుగుచున్నది. అసంతృప్తివర్ధిలుచున్నది. ప్రజాప్రబోధమె ఈయశాంతికి మూలము. ఈయశాంతి నానాదేశములందును దేశకాలపాత్రానుకూలముగ నానారూపములను ధరించుచున్నది. ఈప్రజాప్రబోధము పాశ్చాత్యదేశములందు బరిశ్రామిక సంగ్రామంబుగను ప్రాగ్దేశములందు బ్రజాస్వామ్యత్వ సంగ్రామంబుగను బరిణమించుచున్నది. పాశ్చాత్యదేశములందు బనివాండ్ర సమ్మెకట్టులు ప్రబలినవి. ప్రాగ్దేశములందు రాజ్యాంగ పరివర్తనములు వ్యాపించినవి. ఉభయభాగంబులందును విజయము ప్రజాపక్షమునకు గలుగుచున్నది. పాశ్చాత్యదేశములందు యజమానులు పనివాండ్ర పట్టునకు లోబడుచున్నారు. ప్రాగ్దేశములందు నిరంకుశాధికారాభిమానము తగ్గి ప్రజాస్వామ్యత్వాభిమానము వర్ధిలుచున్నది.

### చీనాపరివర్తనము.

చీనాపరివర్తనము ప్రపంచచరిత్రమునందలి విఖ్యాతవృత్తములలో నొకటి. గతాబ్దమునందా ప్రాచీన సామ్రాజ్యము నిరంకుశ పరిపాలనాయత్తముగానుండెను. ఈయేడచట నొక్కపెట్టున బ్రజాసత్తాకపాలనము స్థాపింపంబడినది. చీనాసామ్రాజ్యమునందు 44కోట్ల ప్రజలుగలరు. చీనాదేశీయులు సత్యశౌర్య సంపన్నులు. ఈమహాప్రజాప్రబోధము ప్రపంచాభ్యుదయమునకై తోడ్పడుట భగవత్సంకల్పము. పరివర్తన స్థాపనకయి పాటుపడిన దేశభక్తులు సన్‌యాట్‌సేను యుఅన్‌షికాయిగారులు వందనీయులు.

### ఇటలీ తురుష్కయుద్ధము.

ప్రపంచమునందు దుర్బలులు బలవంతులవాతబడుట సర్వసామాన్య సంభవము. ఈసిద్ధాంతము సకలవిషయములందును జెల్లుచున్నది. యూరపుదేశరాజ్యముల ధనమంతయును యుద్ధనావల నిర్మాణమునకును యుద్ధోపకరణ సంచయమునకును నుపయోగింపబడుచున్నది. ఈప్రయత్నముల ఫలము మహాసంగ్రామముగ బరిణమించుట సహజము. కొన్నిమాసములక్రిత మింగ్లాండు జర్మని దేశములకు మొరోకోదేశవిషయమై యుద్ధమాసన్నమైనది. కాని యది భగవత్సంకల్పమువలన బ్రస్తుత మాగిపోయినది.

ఈకాలమున మహమ్మదీయ రాజ్యములును దుర్బలాయత్తములుగా నున్నవి. క్రైస్తవమతమును నన్యదేశాన్యాయాక్రమణమును యూరపువాసులకు సహజధర్మములుగా నున్నవి. తురుష్కదేశముయొక్క యసహాయస్థితివలన నిటలీదేశము ట్రిపోలి దేశము నన్యాయముగ నాక్రమించుకొనజాలినది. యూరపుఖండ రాజ్యములెవ్వియు నీయన్యాయాక్రమణము విషయమై యిటలీని మందలించుటకు సాహసించలేదు. తురుష్కదేశము దన యసహాయస్థితి నొప్పుకొనక ప్రజ్ఞకయి పెనుగులాడుచున్నది. ట్రిపోలిదేశ మిటలీరాజ్యమునందు జేర్పబడుట నిశ్చయము. శక్తిసామర్థ్యములులేని తురుష్కదేశ మీయేర్పాటుల కంగీకరించుటయె ప్రస్తుతకర్తవ్యము. ఈయుద్ధము మహమ్మదీయుల యేకత్వమునకు దోడ్పడుచున్నది.

### పారసీకము.

పారసీకదేశస్థితి నానాటికి మోహమయావస్థకు దిగుచున్నది. దేశమును బోషించుటకు దగిన ధనము లేదు, రక్షించుటకు దగినబలము లేదు, శిక్షించుటకు దగిన సమర్థులేరు. దేశస్వతంత్రము నామావశిష్టమాత్రము. దేశము బందిపోటులకును దోపిడిగాండ్రకును జేరొందినది. ఈవిషమావస్థావశమైన పారసీకదేశముయొక్క భావిస్థితి దుర్గ్రాహ్యము.

### బ్రిటిషుసామ్రాజ్యము.

ఈసామ్రాజ్య మంతరాయము లేక నభివృద్ధినొందుచున్నది. సామ్రాజ్యాంతర్భాగములకును సామ్రాజ్యజనకస్థానమునకునుగల సంబంధము దృఢానురాగ పాశబద్ధమగుచు బెంపొందుచున్నది. స్వరాజ్యపాలనాయత్తములైన యంతర్భాగములు సామ్రాజ్యరక్షణార్థము యుద్ధనౌకాదళములను సిద్ధముచేయుచున్నవి. మాతృస్థానమందును యుద్ధనౌకాదళ నిర్మాణమతి గంభీరముగ నిర్వహింపబడుచున్నది. విస్తీర్ణమునందును,
సంపదయందును, ధర్మపరిపాలనమునం
ప్రమాజ్యమునకు సాటియైన సామ్రా
దనుట యథార్థము. ప్రజాప్రాత్యావ
లకు బుట్టినిల్లయిన బ్రిటిషురాజ్యాం

స్వామ్యత్య పాలనము వర్థిలుచున్నది. ప్రభువులనభాధికార ములనుఁ బ్రతిషేధించు శాసనమొకటి గతవత్సరమున నిర్మింపఁబడినది. ప్రజల సభామతము సమ్మానీయమని యంగీకృతమైనది. ప్రజాప్రభువుల సభలసంవాదములందు శ్రీ పంచమజార్జి రాజేంద్రుడు ధర్మమార్గమునవలంబించి స్థిరకీర్తినిగడించెను. గతవత్సరమునందు బ్రిటిషుద్వీపముల ఆదాయము 181621000సవరనులు లేక 272,43,15,000 రూప్యములు. వ్యయముపోగా నిలువ 9,81,75,000 సవరనులు. గతసంవత్సరమునందు వృద్ధాప్యమునందు జీవనాధారమును గలిగియుండనివారికై రక్షక ధనశాసన మొకటి నిర్మింపఁబడినది. ప్రస్తుత మీశాసనము వివాద గ్రస్తముగనున్నను నాగామికాలమునందు మహోపకారిగా నుండగలదు.

హిందూసామ్రాజ్యము.

గతవర్షమునందు హిందూసామ్రాజ్యము బ్రిటిషుసామ్రాజ్యమున కమూల్యాభరణమనులోకోక్తిధృవపడినది. అదృష్టపూర్వంబైన మహాసామ్రాజ్యాభిషేచనంబు ఢిల్లీ నగరంబునందు మహావైభవంబుతో జరుపఁబడినది. ఢిల్లీ దర్బారువార్తఆసేతుహిమాలయ వ్యాప్తంబైన భరతఖండంబుననున్న మూలలను మ్రోగినది. ఆబాలగోపాలము విదితమైనది. గతించిన డిశంబరుమాసమునందు హిందూదేశసంపదలన్నియును ఢిల్లీ నగరంబునందుఁ బుంజీకరింపఁబడినవి. రాజులు దమయమూల్య వస్త్రాలంకారంబులతో నేతెంచిరి. మహారాజులు దమ వస్తువాహన సుభటవర్గముతో నరుగుఁదెంచిరి. నవాబులు దమదివ్యసంపదలతో విచ్చేసిరి. రాష్ట్రపాలకులు దమరక్షకభట సమూహముతో దయచేసిరి. శ్రీమంతులు దమసిరిసంపదలతో వచ్చియుండిరి. ... దమవిలువగల సరుకులతోఁజేరియుం ...దారుణాస్త్రంబులతో పలుదిక్కులరకముల గుఱ్ఱపుబండ్లు, మోటారు వాహనంబులు, జనవిపహంబులును వంబుగానుండెను శ్రీ పంచమజా ...శముతో నీమహావైభవంబద్భు రాజ్యాభిషేచన సంస్కారము ది.

ఢిల్లీదర్బారు గతవత్సర సంభవములందు మొదటిది గానున్నది. దర్బారువలన స్థిరీకృతవ్యవస్థ లస్థిరములైనవి; హిందూసామ్రాజ్యమునకు గౌరవమేర్పడినది; నూతనరాష్ట్రములు నిర్మింపఁబడినవి; రాజధాని ఢిల్లీనగరమునకు మార్చఁబడినది. రాజదంపతులకు హిందూదేశము మీద గాఢానురాగమేర్పడినది; ప్రజలుత్సాహభరితులైరి. ఇట్టి సుమహత్కార్యము మున్నెన్నఁడును నీదేశమునందు జరిగియుండలేదు. ఈదర్బారుఫలము దూరాధిరూఢమై హిందూసామ్రాజ్యముయొక్క సుఖసంపదలకును సత్పరిపాలనమునకును సాధనభూతముగాఁ గలదను నాశ ...నించుచున్నది.

దేశపరిపాలనము.

సంస్కరిత శాసనసభలు పరిపాలనమునకు బలము నొసంగుచున్నవి. ప్రజాప్రతినిధులు ప్రజలవాంఛితములను వ్యక్తీకరించుచున్నారు. పాలకులు వారివాదములను సానుకంపభావములో నాలకించుచున్నారు. కాని వారివంట జేర్చించిన యధికారాభిమానమును నింతత్వరగా వారు వదులుకొనెదరనుటకు వీలులేదు. సామ్రాజ్య శాసనసభవలన బాసుగారి లౌకికవివాహశాసనము నిరాకరింపఁబడినది. సర్వజనాంగీకారమునుఁ బొందిన విద్యాశాసనమునకును నీదుర్గతియెపట్టినది. కాని ఈయపజయము దేశభక్తులను నిరుత్సాహులనుఁ జేయఁజాలదు. వర్తమానసంతతియొక్క యపజయములు భావిసంతతియొక్క విజయములకు బీజములు. నిశ్చలప్రయత్నములు కాలాంతరమున ఫలప్రదములగుట సహజము. గోపాలకృష్ణ గోఖలేగారి గట్టిపూనికవలన నారంభోచిత విద్యవలనఁగలుగు మిక్కుటమైన లాభమందరకును వ్యక్తమైనది. పాలకులును నుచితవిద్యను వ్యాపింపఁజేయుట ముఖ్యమని యొప్పుకొనిరి. విద్యావ్యాపనకై వర్తమానవత్సరమునందు రూ. 125లక్షలు వ్యయముసుఁజేయుటకు పాలకులునిశ్చయించిరి. దేశమునందు విద్యను నారోగ్యమును వ్యాపింపఁజేయుట తమపాలనాకాలమునందు జరుగవలసిన ముఖ్యప్రయత్నములని శ్రీ హార్డింజిప్రభువుగారు దెలిపియున్నారు. ఈయుద్యమము సఫలమగుటకుఁ బ్రజలునుఁ బాలకులకు దోడ్పడుట యవసరము.

గతసంవత్సరమునందనావృష్టిదోషమువలన పంటలుబాగుగ పండలేదు. ధరలుపెరిగినవి. ఘూర్జరదేశమునందుఁ గాటకమేర్పడినది. పశువులకు మేతదొరుకుటలేదు. ప్రజలన్నమునకై కష్టపడుచున్నారు. కాని యీక్షామబాధ అంత దుర్భరముగానుండలేదు. పాలకులును ప్రజలును కాటకముగల ప్రదేశమునందలి ప్రజలకును పశువులకును సంరక్షణార్థమై తగిన సహాయమును జేయుచున్నారు. ఈశాన్య సీమాంతవాసులైన అబోరులతో నొక చిన్నియుద్ధము సంప్రాప్తమైనది. మొత్తమున దేశము శాంతిభూయిష్టమై వర్ధిల్లుచున్నది. దేశాదాయము పెరిగినది. ఆదాయపుమొత్తము 122 కోట్లు. ఆమొత్తములో 125లక్షల సొమ్మియేడు విద్యావ్యాపనకయి వ్యయముసేయబడును.

జాతీయోద్యమములు.

పుష్యమాసాదిని గలకత్తానగరమునందు దేశీయమహాసభలు యథాప్రకారము గూడినవి. పండిత విష్ణునారాయణధరుగారు దేశీయమహాసభకు అధ్యక్షతను వహించిరి. వారిప్రసంగము స్వాతంత్ర్యవ్యక్తి సహితముగానుండినది. సభాప్రతినిధులు యథోచితముగా రాజ్యాంగవ్యవస్థలనుఁ జర్చించిరి. అవసరములైనమార్పులను నిరూపించిరి. సభ్యులందరేకగ్రీవముగ వంగవిభజనోప సంహారమునుఁ గొనియాడిరి. కీర్తిశేషులైన మోరుభంజిమహారాజుగారి యగ్రాధిపత్యముక్రింద పరిశ్రామిక సభగూడినది. పరిశ్రమలు, వ్యవసాయము, ద్రవ్యసంచయము మొదలగువాటిని నభివృద్ధిజేయుమార్గములు విచారింపఁబడినవి. సంఘసంస్కరణసభయందు సంఘదురాచారములు విమర్శింపబడినవి. మహిళాపరిషత్తునందు హిందూస్త్రీల నుద్ధరించుటకుఁ దగినమార్గములు యోచింపఁబడినవి. కాలమాటిలో స్థాపింపబడిన లోహయంత్రాలయము జాతీయ వ్యవసాయములలో నుత్తమ వ్యవసాయముగా నెంచఁదగియున్నది. హిందూవిశ్వవిద్యాలయ స్థాపనమును మహమ్మదీయ విశ్వవిద్యాలయ స్థాపనమును విద్యావ్యాపనవిషయ ప్రజలయొక్క దినదినాభి వర్ధమానాభిమానమునకు నిదర్శనములు. డక్కా విశ్వవిద్యాలయస్థాపనము పాలకులకువిద్యావ్యాపనపట్లగల దృఢాభిలాషను విశదీకరించుచున్నది. హైందవుల శ్రద్ధామయంబైన వ్యవసాయ వ్రతారాధనము శ్రేయఃప్రాప్తికి మూలము.

చెన్నపురిరాష్ట్రము.

గతవత్సరమునందు సర్ ఆర్థరులాలిగారి పరిపాలనాకాలముముగింపునకువచ్చినది. కార్మికెయిల్ప్రభువుచెన్నపురిగవర్నరుగానవంబరునందునియమింపఁబడిరి. వారు రాష్ట్రపాలనమునువహించిన స్వల్పకాలమునందే జనానురాగమునుఁగడించిరి.చేసిన మహత్కార్యమేదియును లేకున్నను వారి సదయహృదయ మీ ప్రజాసన్మానమునకుఁ గారణము. ఇపుడు కార్మియికెల్ప్రభువు వంగరాష్ట్రమునకు పాలకులుగానున్నారు. పెట్లండుప్రభువు చెన్నపురిరాష్ట్రపాలకులుగా నియమింపఁబడిరి. వారివిలంబాగమనమువలన సర్ మురెహామికుగారు ప్రస్తుతము పాలకులుగానున్నారు. చెన్నపురి శాసననిర్మాణసభయందును నధికార నభ్యులతీర్మానములు పాలకులచే నామోదింపఁబడలేదు. కరణముల జీతములను హెచ్చించుటకయి కేశవపిళ్ళగారిచే నుపపాదింపఁబడిన తీర్మానమును నిరాకరించుట శోచనీయము. శ్రీకృష్ణస్వామయ్యరుగారి యకాలమరణమువలన దేశమునకు లోటుగలిగినది. వారు సంస్కృతభాషాభిమానులు, దానధర్మపరాయణులు, ప్రజ్ఞానిధులు, స్వాతంత్ర్యప్రియులు. గౌ. శివస్వామయ్యరుగారిపుడు కార్యనిర్వాహక సభికులుగానున్నారు. చెన్నపురిరాష్ట్రమును నితరరాష్ట్రములవలె దేశాభివృద్ధికయి పాటుపడుచున్నది. రాష్ట్రీయసభలు యథాప్రకారముగాఁ గూడినవి. రాష్ట్రాభివృద్ధి కవసరములైన విషయములు విమర్శింపఁబడినవి.

ఆంధ్రదేశము.

ఇతరభాగములవలె నాంధ్రదే
శముంచుచున్నది. కాని యభివృద్ధి
లె వేగముగా జరుగుచున్నటులు
వాణిజ్య పరిశ్రమలయందును నా
యున్నారు. వారిపుడైనను స్వే
కయి పాటుపడినగాని ప్రఖ్యాత
దేశమునందు నిరుడెప్పటిరీతిని
లుగూడినవి. నియోగి మహా

ఆర్యవైశ్యులు, విశ్వబ్రాహ్మణులు, కమ్మమహాజనులు మొదలగువారు దమశాఖాసభలను జయప్రదముగ నడిపించిరి. సభలప్రయోజనము స్వకీయజాత్యభివృద్ధి. ఈయభివృద్ధి మాటలవలనగాకఁ గ్రియారూపమునుఁ గైకొనినపుడుగాని ప్రయోజనమేర్పడదు. కులాభిమానులు ప్రతి సమావేశ సమయమునందును చందాలను వసూలుచేసి యాసొమ్మును దమజాతివారి విద్యాభివృద్ధికయి వినియోగించవలసియుందురు. యువ్వనులకు స్వదేశమునందునుఁ బరదేశములందును విద్యనుఁ జెప్పించుభారము సంఘము పైఁగలదు. ఈవిషయమై ప్రతిజాతివారును దమభారమునుఁబూనిన విద్యావ్యాపనయును సంఘాభివృద్ధియును నతిత్వరితముగఁగాఁగలవు. ఇందుకు వ్యతిరిక్తముగా నీసభలు కులపక్షపాతసభలుగాఁ బరిణమించిన దేశానర్థమునకు మూలముగాఁగలవు. సంఘము నీమహోపద్రవమునుండిఁ గాపాడుట దేశాభిమానులవిధి.

విద్యావ్యాపనము.

వంగమహారాష్ట్రద్రవిడదేశములందువలెఁ దెలుగు దేశమునందు విద్య వ్యాప్తినిఁగాంచుటలేదు. పునహానగరమునందలి ఫర్గ్యూసనుకళాశాలనుబోలిన కళాశాల యాంధ్రదేశమునందులేదు. బందరు జాతీయకళాశాల పోషణములేకను వృద్ధినొందుటలేదు. స్త్రీవిద్య మిక్కిలి హీనస్థితిలోనున్నది. బొంబయినగరమునందు యువ్వనవతులు పాఠశాలలకుఁ బోవుటనుజూచినపుడు పరమాహ్లాదము గలుగుచుండును. తెలుగుదేశమునందీయువతులు నలుగురుపిల్లలకుఁ దల్లులై యుత్సాహమునుఁగోల్పోయి వార్ధక్యస్థితియందుందురు. బొంబయి కలకత్తానగరములందీ యువతీమణుల ముఖపంకజములనుండిఁ దేజోవిలాసంబు లుట్టిపడుచుండును. వారు యువతులకనురూపమైన పరమోత్సాహమునుఁ గలిగియుందురు. ఆంధ్రదేశమున కీమహద్దశ యెపుడుపట్టునో తెలియదు.

విద్యాభ్యాసార్థ మాంధ్రులితరరాష్ట్రవాసులవలెఁ బరదేశములకుఁ బోవుచున్నారు. వంగరాష్ట్రమునందువలె వారలఁ బోషించుటకుఁ దగిననిధులుగాని ప్రోత్సహించుటకుఁ దగిన సంఘములుగాని లేవు. విద్యార్థుల పరదేశగమనార్థ మొకనిధిని నేర్పాటుఁజేయుట యవసరము. మహారాష్ట్రులు (పైసాఫండు) కానీనిధిని స్థాపించి విద్యాభివృద్ధినిఁ బరిశ్రామికాభివృద్ధినిఁ జేయుచున్నారు. ఆంధ్రులు పరదేశమునకేగినవారలను బహిష్కారముతో సత్కరించుచున్నారు. వారు స్వదేశమును స్వగృహమునువదలి విద్యనభ్యసించుటకయి పరదేశములకుఁ బోవుచున్నారు. వారే భావిపౌరులుగానున్నారు. విదేశవాసమువలనఁ బ్రజ్ఞాపాండిత్యములను గడించుచున్నారు. ఆవిద్యాధికులు స్వదేశమునకు వచ్చినపుడు వారలను వెలివెలుల పాలుచేయకుండుటయే గాకఁ బరిపూర్ణాదరముతో సంఘమునందుఁజేర్చుకొనుట యాంధ్రుల ముఖ్యవిధి. శ్రీ తి రామమూర్తిగారు గతసంవత్సరమునందుఁ బౌరసేవా పరీక్షలో నుత్తీర్ణులై యాంధ్రదేశమునకు సత్కీర్తినిఁ గడించిరి. ఈకఠినపరీక్షయందుఁ గృతార్థులైన యాంధ్రబ్రాహ్మణులలో రామమూర్తిగారు మొదటివారు. రాగలనవంబరులో వారు స్వదేశమునకువచ్చినపుడాంధ్రులు వారికి హృదయంగమంబైన స్వాగతంబు నొసంగుట యుచితము.

సంఘ సంస్కరణము.

సంఘమునందు మెల్లమెల్లగా మార్పులేర్పడుచున్నవి. మతములు మారుచున్నవి. నూతనాచారములు ప్రబలుచున్నవి. ప్రాచీనాచారము లుద్ధరింపఁ బడుచున్నవి. దేశమంతయుఁ బరివర్తనాయత్తమైనది. సంఘసంస్కరణ విషయమునం దాంధ్రులు ద్రావిడులకు ముందంజను వేయుచున్నారు. కాని వారి సంస్కార ప్రయత్నము దృఢరూపమును వహించలేదు. అతిబాల్య వివాహములు, కన్యాశుల్కములు, వరశుల్కములు స్వచ్ఛంద విహారమునుఁ జేయుచున్నవి. అతిబాల్యవివాహములు సంఘాభివృద్ధికి వేరు పురుగులుగానున్నవి. దుర్బలత్వమునకు, వ్యాధిగ్రస్తతకు, నల్పాయుష్యమునకు నీవివాహములు పుట్టినిల్లులు. వీటి యుపసంహారమునుఁజేసి ప్రాచీనార్యాచారావలంబనము నవలంబించుటయే చేయుదగిన సంస్కరణములలో మొదటి సంస్కరణము. రజస్వలానంతర వివాహములు పూర్వము శాస్త్రసమ్మతములై యాచరణ

యందుండెడివి. ఇపుడీయాచార మపరూపమైనది. దాని యపరూపమె సకలానిష్టములకును గారణమైనది. ఈదురాచారము నుపసంహరించుటకై దేశమునందంతటను వివాహసంస్కరణ మండలులు స్థాపింపఁబడుచున్నవి. సంఘసంస్కరణాభిమాను లందరును నీమండలులయందుఁజేరి సంస్కరణ ప్రతిజ్ఞనుఁ బూనుట ముఖ్యము. విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి వ్యవస్థాపకుడైన శ్రీఆచంట లక్ష్మీపతిగారు హిందూవివాహ సంస్కరణ మండలియొక్క చెన్నపురి శాఖకుఁ గార్యదర్శులు. గత వత్సర వృత్తాంతములలో వారివివాహ మెన్నికను గాంచినది. శ్రీమతి రుక్మిణమ్మగారి పరిణయము పురాణప్రసిద్ధ రుక్మిణీకల్యాణము వలె జనాదరణమును గాంచినది. బొంబాయియం దిట్టి వివాహ మింకొకటి జరిగినది. ఆపరిణయమునం దొక యాంధ్ర బ్రాహ్మణుడు మహారాష్ట్రనారీమణిని వివాహమాడెను. శ్రీమతి తారాబాయిగారు మెట్రిక్యులేషను పరీక్షయందునెగ్గి ఉపాధ్యాయినిగా నెలకేబది రూప్యములను గడించుచున్నది. పెండ్లియాడిన కోటంరాజు పున్నయ్యగా రాంధ్రపత్రికాభివృద్ధికై పాటుపడుచున్నారు. బాల్యవివాహములుపోయి యిట్టి యవ్వనవివాహములు ప్రబలుట శ్రేయస్కరము.

### ఆంధ్రభాష.

గత వత్సరమునం దాంధ్రభాషా చరిత్రమునందొక నూతనయుగ మేర్పడినది. భాషాభివృద్ధికై చెన్నపురియందు "ఆంధ్రసాహిత్యపరిషత్తు" స్థాపింపఁబడినది. ఆపరిషత్తునకు శ్రీపిఠాపురము రాజాగారు అగ్రాసనాధిపతి; జయంతి రామయ్యపంతులుగారు కార్యనిర్వాహక సభాధ్యక్షుడు; పురాణం నాగభూషణం పంతులు, వేదము వెంకటరాయ శాస్త్రి, ఆచంట లక్ష్మీపతిగారులు కార్యదర్శులు. ఈపరిషత్తుయొక్క ముఖ్యోద్దేశము "తెలుగు భాషయొక్కయు వాఙ్మయము యొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్నికార్యములను జేయుట" అయియున్నది. పరిషత్తును స్థాపించుటవలన నాంధ్రభాషకుఁగల యొకగొప్ప కొరత తీరినది. కార్యనిర్వాహక సభ్యులు శ్రద్ధాళువులై కార్యములను నిర్వర్తించిన భాషాభ్యుదయమునకై యీపరిషత్తు మహోపకారమునుఁ జేయఁగలదు. గత సంవత్సరమునందు దానికి వెనుకటిసంవత్సరమునందువలె రమారమి 600 గ్రంథములు తెలుగుభాషయందుఁ బ్రచురింపఁబడినవి. వాటియందు మువ్వాలు పద్యరూపములను వహించినవి. శేషించినవి గద్యరూపమును గైకొనినవి. గ్రంథప్రచారిణీసంఘము లభివృద్ధిఁ జెందినవి. ఆసంఘములు నూతనగ్రంథములనుఁ బ్రచురించుచు భాషాసేవను యథాశక్తిని జేయుచున్నవి. నిరుడు కవివరులందరును దమ ప్రజ్ఞాపాండిత్యములను శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుని రాజ్యాభిషేచన మహోత్సవమును వర్ణించుటకై వినియోగించిరి. నానావిధములైన పద్యములు పాటలు శతకములు గ్రంథములు శ్రీజార్జిచక్రవర్తిని ఢిల్లీదర్బారును వర్ణించుచుఁ బ్రచురింపఁబడినవి. కొన్నిపద్యము లీసంచికయందు హైందవుల రాజభక్తికిని, నాంధ్రుల కవిత్వాభిమానమునకును, కవిత్వాభినివేశమునకును నిదర్శనములుగ ముద్రింపఁబడినవి. విద్యావ్యాప్తినిఁ గాంచిన పాశ్చాత్యదేశములందు వచనగ్రంథము లధికముగను పద్యగ్రంథములు స్వల్పముగను రచియింపఁబడుచుండును. గ్రంథకర్తల విద్యాభినివేశమును జనసామాన్యమునకుఁ గల గ్రంథపఠనాసక్తియును దీనికి గారణములు. తెలుగు గ్రంథకర్తలు దమపాండిత్యమును వచనరచనలకై యధికముగా నుపయోగించిన జ్ఞానము వ్యాపించి భాషాభ్యుదయమును దేశాభ్యుదయమునుఁ గాఁగలవు. గతవర్షమునం దాంధ్రలోకమునందుఁ గవుల కలహములు ముదిరినవి. ఈకలహములు పక్షపాతభావమునుఁ బెంపొందించినవి; యుక్తాయుక్త విచారమును వెనుక నుంచినవి; తుదకు జాతిద్వేషాభిమానములుగాఁ బరిణమించినవి. భాషామోహ నియోగి వైదిక భేదమును బ్రాహ్మణ శూద్ర పక్షపాతమును బూనకఁ దనబిడ్డలను సమానభావముతో సంభావించుచున్నది. ఈదురవస్థనుండి భాషాభిమానులు భాషను గాపాడవలసి యుందురు.

### గ్రామ్యగ్రాంథికభాషలు.

గ్రామ్యగ్రాంథికభాషా వివాదములు పెరుగుచున్నవి. విద్యాధికుల ప్రయత్నము లాంగ్లేయభాష యందు సాహిత్యమును సంపాదించుటకై వినియోగింపఁబడుచున్నవి. సాహిత్య లాభార్థము గాకున్నను నుదర నిమిత్తమైనను నాంగ్లేయభాష యభ్యసింపఁ బడుచున్నది. ఆంగ్లేయభాష పరిపూర్ణత్వమునొందిన రాజభాష. రాజకీయ కార్యాలయములం దీభాష వాడుకయం దున్నది. న్యాయసభలయం దీభాష యుపయోగింపఁ బడుచున్నది.

శాస్త్రీయవిద్య నభ్యసించుటకె భాషా పాండిత్య మవసర మగుచున్నది. విద్యార్థులు ఆభాషను పది పదునాలుగేండ్లభ్యసించుచున్నారు. పల్లెలయందును నింగ్లీషుమాటలు తలవని తలంపుగ ముచ్చటలయందుఁ జేర్చఁబడుచున్నవి. ఆంగ్లేయభాషయందుఁ బ్రవేశముగల వారి సంభాషణములు సగమింగ్లీషుమాటలతోను సగము తెలుగు పదములతోను నిండియుండును. కారణ మింటను దెలుఁగు వాడఁబడుచున్నది. పాఠశాలయం దింగ్లీషు నేర్పఁబడుచున్నది. ఆంగ్లేయభాషనుఁ దప్పులులేకుండను మాటలాడుట వ్రాయుట యవసరము. ఆయవసరము తెలుగుభాషవిషయమైలేదు. ఇట్టి యవసరము గలిగినపుడె జనులు దేశభాషల నభ్యసించెదరు. వాటిని జక్కగ మాటలాడను వ్రాయను నేర్చెదరు. మహారాష్ట్ర దేశమునందు మధ్యతరగతి పాఠశాలలలో జనువంతయును మహారాష్ట్రభాషయందుఁ గఱపబడుచున్నది. మహారాష్ట్రులు ముచ్చటలాడునపు డింగ్లీషుపద ప్రయోగములు దక్కువగా వారి ప్రసంగములయందుఁ గాననగును. ఆంధ్రులకు జనసమూహమునఁ దెలుగుభాష నభ్యసించుటకుఁ దగిన యవసరము గలుగలేదు. పూర్వమునుండియును వాడుకభాషకును గ్రాంథికభాషకును సన్నిహిత సమావేశ మేర్పడి యుండలేదు. ముందెపుడైనఁ గలుగనున్నదేమో తెలియదు.

సంస్కృతభాషాచరిత్రమును బరిశీలించిన సంస్కృతము కేవలము గ్రాంథికభాషగాను ప్రాకృతము వాడుకభాషగాను నుండినవని స్పష్టమగుచున్నది. విద్యావంతులు ముఖ్యముగా బ్రాహ్మణమతాభిమానులు దమ గ్రంథములను సంస్కృతభాషయందు వ్రాయుచుండిరి. అది సామాన్యజనులకు దుర్భేద్యముగ నుండెను. బౌద్ధులు సామాన్యజనులకుఁ దెలియుటకై దమ గ్రంథములను బ్రాకృతభాషయందు వ్రాయుచుండిరి. తెలుగుభాషకీస్థితి యవసరమేమొ విచారణీయము.

నన్నయ భట్టారకుని కాలమునుండియును వాడుకభాషయును గ్రాంథికభాషయును వేరువేరుగా నుండినవని యొప్పుకొనవలసి యున్నది. ఆకాలమునందును సంస్కృతపద జటిలమైన గ్రాంథికభాష గ్రంథస్థముగ నుండియుండును. 100 కి 98 వంతునఁ జదువను వ్రాయను నేర్చిన యింగ్లాండునందు నయితము గ్రాంథికభాషకును వాడుకభాషకును సంపూర్ణ సమావేశ మేర్పడలేదు. కాని విద్యావంతులు గృహములందు మాటలాడు భాషకును వ్యవహారములందు వాడుకజేయు భాషకును, విద్యాలయములందు నేర్చుకొను భాషకును విశేష వ్యత్యయముండదు. విద్యావిహీనుల విషయములో నాంధ్రదేశమునందువలె వ్యత్యయముగలదు. ఈవ్యత్యయము విద్యావ్యాపించినకొలది యంతరించుచున్నది. ఆంధ్రదేశమునందును నాంధ్రభాష యభ్యసింపఁబడిన కొలది వాడుకభాషకును గ్రాంథికభాషకునుఁ గల దూరము తగ్గి యవి సన్నిహిత సాహచర్యమును వహింపఁగలవు. ఇపుడు కేవలము గ్రంథస్థమైన భాష యపుడు సామాన్యజనముఖస్థముగాఁ గలదు. సామాన్యజనుల విద్యావివేకముల పెంపున వారి ముఖస్థమైన భాష గ్రంథస్థము గాగలదు. ఈఫలప్రాప్తికిఁ జిరకాలము పట్టవచ్చును. కాని ఈసన్నిహిత సమావేశమునకై భాషాభిమానులు పాటుపడవలసియుందురు. విద్యాప్రవీణులు వాడుకపదములను దమ పుస్తకములందుఁ జేర్చుటవలన నీసంయోగమునకు మార్గదర్శకులు గాగలరు. నిర్దుష్టముగ నాంధ్రభాషయందొక లేఖనైనను వ్రాయుశక్తి సామాన్యులకులేదు. విద్యార్థులకుండవచ్చును. అర్ధానుస్వారములను, శకట రేఫలను, కళలను, దృశ్ప్రకృతికములను, పరుషములను, సరళములను, సంధులను బూర్తిగ నుపయోగించుచు వ్రాయువాడుక తగ్గుచున్నది. కాని నింద్యమైన వాడుకభాష యంతయును నేవిధమున జూచినను గ్రాంథికభాషగా మారనేరదు. విద్యావ్యాపనమువలన నింద్యమైన గ్రామ్యమునింద్యముగా మారఁగలదు. గ్రాంథిక భాషయందలి యనవసర నియమములు మారఁగలవు. కొండమీదఁ గూర్చున్న గ్రాంథికభాషకును పల్లపుభూమియందు నిలిచియున్న వాడుకభాషకును విద్యావ్యాపనవలన సమానప్రదేశమున సమావేశ మేర్పడఁగలదు. ఆంధ్రదేశమునందు రవీంద్రనాథునివంటి భాషానిర్మాణకుడు పుట్టినగాని యీసంయోగము గలుగుటకు వీలుగలుగదు. అం

పరస్పరము నీరెండుపక్షములవారును తగవులాడుచుండుట సహజము. ఉభయపక్షములందును లోపములుండవచ్చును గాని వారి యుద్యమములు భాషాసేవకై యని యొప్పుకొనవలసియున్నది.

వ్యాసములు.

వంగ మహారాష్ట్రదేశములందు విద్యావంతులు పత్రికా నిర్వాహకులకు సంవత్సరాది సంచికలను ప్రచురించుటకై విశేష సహాయమును జేయుచు భాషాసేవను జేయుచున్నారు. ఉన్నత న్యాయాధీశులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, ఉద్యోగస్థులు, డాక్టరులు దమ కెంతటి తొందర పనులున్నను దీరికను గల్పించుకొని సంచికలకు వ్యాసములను వ్రాయుచున్నారు. మాసిక మనోరంజని, సంధ్యావర్తమాని, మొదలగు వార్తాపత్రికల సంవత్సరాది సంచికలకు సర్ గణేశనారాయణ చంద్రావార్కరు, వాఘాగారు మొదలగు దేశాభిమానులు వ్యాసములను వ్రాసి దేశమునకు మహోపకారమును జేయుచున్నారు. ఆంధ్రమహాజనులీ విషయమునందు వెనుకంజను వేయుట శోచనీయము. సంవత్సరాది సంచికను బ్రకటించుటకుగల ప్రయోజనము విద్యావంతుల యభిప్రాయములను బ్రచురించి సామాన్యజనుల కుత్సాహ వివేకములను బుట్టించుటయై యున్నది. విద్యావంతుల వ్యాసములె సంవత్సరాది సంచికకు సుభూషణములు. ఆ యలంకారములులేని సంచిక రాణింపనేరదు. ముందైనను విద్యావంతులు దమ యమూల్య విద్యాభరణంబులచే నీసంచిక నలంకరించి మాతృభాషను బోషించుటకు బ్రార్థితులు.

ఈ కొరతను నివారించుటకును వ్యాసలేఖకులకు బ్రోత్సాహమును గలిగించుటకును నీసంచికయందు ముద్రించిన వ్యాసములలో గొన్ని వ్యాసములకు బహుమతు లొసంగబడినవి. ఆ వ్యాసములంత యుత్తమములు గాకున్నను వ్యాసలేఖకులు దమ శక్తికొలది వ్రాసిపంపినందులకు సంతసింపవలసి యున్నది. వ్యాసలేఖనమునకు ముప్పది విషయములు నిర్ణయింపబడినవి. వాటిలో బదియేడు విషయములను గురించి మాత్రము వ్యాసములు వ్రాయబడినవి. రాజ్యాంగ వ్యవహారముల నుగురించి యొకరును వ్రాసియుండలేదు. మూడు వ్యాసములకు మాత్రమే బహుమతులు ఇవ్వబడినవి. ఆరోగ్య పరిపాలనా లాభములను గురించి వ్రాసిన వ్యాసములు విస్తారముగా గలవు. ఆ వ్యాసములన్నియును బరీక్షింపబడి బహుమానములకు దగినవ్యాసములు నిర్ణయింపబడి ముద్రింపబడినవి. రెండు వ్యాసములు సమానముగా నున్నందున బహుమానము పంచబడినది. బహుమతులందిన వ్యాసములు విషయానుక్రమణికయందు దెలుపబడినవి.

సంచికయందు 40 వ్యాసములు ముద్రింపబడినవి. వ్యవసాయ పరిశ్రమలనుగురించిన వ్యాసములు పది, రాజకీయ విషయములను గురించినవి యారు, సంఘస్థితికి సంబంధించినవి పది, ఆరోగ్యము, సంగీతము చరిత్రము, భాషాస్థితి మొదలగు విషయములకు సంబంధించినవి పదునాలుగును గలవు. ఢిల్లీనగర చరిత్రము, ఢిల్లీ దర్బారు, సంస్థానముల చరిత్రములు విపులముగా వ్రాయబడినవి. శ్రీపంచమజార్జి రాజేంద్ర రాజ్యాభిషేచన వర్ణనమును గురించిన పద్యములు 200 ప్రచురింపబడినవి. వ్యాసముల దు దేశాభ్యుదయమున కవసరములైన విషయములను జేర్చుటకు యత్నము చేయబడినది. దేశాభిమానము, భాషాభిమానము, వ్యవసాయము, పరిశ్రమలు, రాజ్యాంగములు, సంఘస్థితి, దేశచరిత్రము, స్త్రీలస్థితి మొదలగు విషయములను గురించిన వ్యాసములు గలవు. చదువరులు వ్యాసములందలి లోటుపాటులను నిర్ణయింపనోపుదురు.

చిత్రపటములు.

శ్రీరాజదంపతుల ఢిల్లీ రాజ్యాభిషేచన మహోత్సవము దేశచరిత్రమునందొక సుప్రసిద్ధేతిహాసము. దేశమంతయును నీమహోత్సవమయమైనది. రాజభక్తిభరితంబులైన సత్కార్యములన్నిచోట్లను నడుపబడినవి. శ్రీ రాజదంపతులకు స్వాగత రమణీయంబైన స్వాగతమొసగబడినది. రాజులు, మహారాజులు, శ్రీమంతులు, రాష్ట్రపాలకులు, సైనికబృందంబులు దర్బారుకై ఢిల్లీనగరమునందు గుమిగూడిరి. శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుని, శ్రీమేరీ రాజరాజేశ్వరిని, రాజకుటుంబమును, రాజాగమనమును, బొంబయి ఢిల్లీనగర పరిసరములను, ఢిల్లీదర్బా

రును, పేటాడుటను, కలకత్తా వినోదములను, స్వదేశగమనసమయమునఁ దెలుపు చిత్రపటములు 50 గలవు. పురాతన సుప్రసిద్ధ సంస్థానాధీశుల చిత్రపటములు 55 గలవు. ప్రాచీన ఢిల్లీనగర స్థితినిదెలుపు చిత్రపటములు 12 గలవు. హిందూదేశ పాలకులనుఁ జూపు పటములు 24 గలవు. సామ్రాజ్యశాసన సభయొక్కయు, మద్రాసు బొంబాయి రాష్ట్రముల యొక్కయు సభాపటములుగలవు. సుప్రసిద్ధులైన మహాజనుల చిత్రపటములునుఁ జేర్చఁబడినవి. చీనాదేశ పరివర్తనమువలన సుప్రసిద్ధిఁ గాంచిన చీనాదేశ నాయకుల పటములునుఁ జేర్చఁబడినవి. జాతీయ సభాధ్యక్షుఁడైన విష్ణునారాయణ ధరు గారి పటము నయితముగలదు. మొత్తమున 172 చిత్రపటములు ముద్రింపబడినవి. చిత్రపట వీక్షణమువలన జదువరులు దర్బారు వైభవ మహోత్సవములను నూహింపనోపుదురు. ప్రాచీన నూతన ఢిల్లీ నగరముల స్థలనిర్దేశమును జూపుటకొక స్థలపటము నయితమిందుఁ జేర్చఁబడినది. చదువరులే ప్రియభారముల నూహింపనోపుదురు.

స్వవిషయము.

దైవకృపవలన మూఁడవ సంవత్సరాది సంచిక బహిర్గతమైనది. పత్రికా నిర్వహణము కష్టసాధ్యము. దేశభాషా పత్రికానిర్వహణ మత్యంతకష్టసాధ్యము. ఆంధ్రేతర రాష్ట్రమధ్యమున నాంధ్రపత్రికానిర్వహణము దుస్సాధ్యము. సామాన్యముగా దేశీయవార్తాపత్రికా నిర్వాహకులకు లాభము పూజ్యము. గౌరవము శూన్యము. భార మధికము. విషమావస్థలవలన విషాదము జనించుటసహజము. నిరుత్సాహము గలుగుట నిశ్చయము. విషాద నిరుత్సాహములు రక్షింపవు. ప్రజ్ఞావాదములు నిరుపయోగములు. పరధర్మాన్వేషణము సుకరము. గుణగ్రహణముదుష్కరము. చేసినవి కొంచెము. చేయఁదగినది విస్తారము. తప్పులెక్కువ. ఒప్పులుతక్కువ. సంగతిసందర్భములిట్టులుండగా స్వవిషయక నివేదనమసంగతము.

మూఁడేండ్లనుండి యాంధ్రపత్రిక క్రమము తప్పక ప్రచురింపఁబడుచున్నది. మూఁడుసంవత్సరాది సంచికలు గ్రాహకుల కందింపఁబడినవి. ఈసంచికలకై వేలకొలఁది రూపాయలు వ్యయమైనవి. మూఁడవసంచికయందలి దర్బారుపటములను సంస్థానాధీశుల పటములను సమకూర్చుటకయి వందలకొలఁదిరూపాయలు వ్యయమైనవి. ప్రచురణభార మధికమైనది. ఆంధ్రదేశభాషాభ్యుదయముల కీపత్రిక యించుకంతయైననుఁ దోడ్పడిన ప్రియభారములు నిష్ఫలములుగాక సఫలములగునను నాశ నూతనోత్సాహమునుఁ బుట్టించుచున్నది.

ఆంధ్రుల యాదరణ పోషణములవలన నాంధ్రపత్రిక దినదినాభివృద్ధిని జెందుచున్నది. రాజులు మహారాజులు, విద్యావంతులు సామాన్యులు, బీదలు భాగ్యవంతులు స్త్రీలు పురుషులు పత్రికను దమయుదార సంకల్పములచేతను, వ్యాసములతోను, చందాలవలనను బోషించుచున్నందులకు వారల కనేక వందనంబులు. ఆంధ్రపత్రికాభివృద్ధి యితరాంధ్రపత్రికలతోఁ బోల్చినపుడాశ్చర్యకరముగా నుండినను నది విశేషముగాదని యంగీకరింపవలసి యున్నది. ఆంధ్రభాష దేశభాషలందు మూఁడవదిగా నున్నది. మాధుర్యమున మొదటిదిగా నున్నది. ఇతరభాషలందు 20,000 చందాదారులు గల వార్తాపత్రికలును దైనిక పత్రికలును నుండగా నాంధ్రభాషయందు మంచివ్యాపకముగల వార్తాపత్రిక లేకుండుట శోచనీయము. ఇదియె ఢిల్లిదర్బారుసందర్భమున నాంధ్రపత్రికల పరాభవమునకు ముఖ్యకారణము. ఈకొరతనుఁ దీర్చి పత్రికావ్యాపనమును జేయుట కాంధ్రులు ప్రార్థితులు. సంవత్సరాది సంచికనుఁ జదువువారందరును గట్టిపట్టునుఁ బట్టిన నచిరకాలమునం దాంధ్రపత్రిక విశేషవ్యాకమునుఁ గలిగి దేశాభ్యుదయమున కింతకన్న నెక్కుడుగాఁ దోడ్పడఁగలదు. ఆంధ్రదేశ బాంధవులు పూర్వమువలె ముందునుఁ దమ యుదారాశ్రయముతో నాంధ్రపత్రికను సమ్మానించుటకుఁ బ్రార్థితులు. ఆంధ్రపత్రికాభివృద్ధికై పత్రికానిర్వాహకులకును, గ్రాహకులకును బ్రోత్సాహము నొసంగుటకు సర్వేశ్వరుని యపారకృప దోడ్పడుగాత!

వందనములు.

చందాదారులకును, వ్యాసములను వ్రాసినవారలకును, ఛాయాచిత్రపటముల నంపినవారలకును, నితరసహాయకులకును ననేకవినతులు. సంచికయందలి చరిత్రాంశములన్నియును సుప్రసిద్ధాంగ్లేయ చరిత్ర గ్రంథములనుండి సమీకరింపఁ బడినవి. ఇంపీరియల్ గెజెట్టీరు, పురుషోత్తమ విశ్రామమహాజని గారి దర్బారు చిత్రపుస్తకము, ఢిల్లీ చరిత్రగ్రంథములు మొదలగునవి విశేషముగా నుపయోగింపఁబడినవి. ఈగ్రంథోపకృతి కృతజ్ఞతాపూర్వకముగా స్వీకరింపఁబడుచున్నది. ఛాయాచిత్రపటములను ముద్రించుటకుఁ దగిన పటఫలకములను జేసిన శిల్పకారులకును, సంచికను ముద్రించిన తత్త్వవివేచక ముద్రాక్షరశాలాధిపతులకును, నితరవిధముల సహాయముఁ జేసినవారలకును వందనములు.

పరీధావినామ సంవత్సరమునందు సకలజనులును సదాశాసనసన్నులై మనోవాంఛాఫలసిద్ధినిఁ బొంది సుఖించెదరుగాత! సకల ప్రపంచమునకును నీశ్వరుడు శాంతిసుఖములనుఁ బ్రసాదించెడుగాత! హిందూదేశము ధనధాన్యసమృద్ధిఁ గలిగి యారోగ్యప్రదమై వర్ధిల్లుగాత!

పత్రికాధిపతి.



# విషయానుక్రమణిక.



* ఈ గుర్తుగల వ్యాసములకు బహుమతు లొసంగబడినవి.



His Imperial Majesty King-Emperor George V.

శ్రీ పంచమజార్జి రాజరాజేంద్రుడు.



Her Imperial Majesty Queen-Empress Mary

శ్రీ మేరీ రాజరాజేశ్వరి.

# శ్రీమత్పంచమజార్జి రాజరాజేంద్ర రాజ్యాభిషేక పద్యావళి.

మ.రా.శ్రీ, వడ్డాది సుబ్బారాయకవిగారి విరచితము.

సీ॥ శ్రీరామవిక్రమస్థిరచిహ్నమైనట్టి సేతువు, దనకుమంజీరముగను। మేరుమహోత్సర్యాన మినుమానికమునాఁగ్రాలిన మల, మొలనూలుగాను। వసుమతీధేనువువత్సమైనఘనాద్రి, చేర్పుక్కరత్నాలచేరుగాను । సింధుగంగానదీజీవనభర్త లోకూపారములు, కేళకూళులుగను। గీ॥ గ్రాలుభారతఖండ సామ్రాజ్యలక్ష్మి । నెనయ, ఢిల్లికిఁదర్లి వచ్చినవిభుండ!। జయము! విక్టోరియా జగజ్జననిపౌత్ర, సప్తమైడ్వర్డుసుత! జ్యార్జిసార్వభౌమ॥

సీ॥ గ్రహసమూహము భూమిఁగలసికొన్నటుదోఁచుమూర్ధాభిషిక్తుల మూఁకజూడఁ। దారాగణము వసుంధరడిగ్గినటు దోఁచురత్నోపహారములఁజూడఁ। కొండలెన్నో గుంపుగూడినట్టులు దోఁచుగంధసింధుర మహాంగములఁజూడ। శరనిధుల్ ధర వెల్లి విరిసినట్టులు దోఁచు సకలదిగ్దేశప్రజలజూడ। గీ॥ నవియువననేల? నేల శ్రీలన్నిచూడఁ। గనరె నీదుపట్టాభిషేకంబు జూడ!। జయము విక్టోరియా జగజ్జననిపౌత్ర। సప్తమైడ్వర్డుసుత జ్యార్జిసార్వభౌమ॥

సీ॥ దూరదేశంబులు చేరువయూళ్ళయ్యె, మరుభూములన్ని వార్మయములయ్యెఁ। జౌటిపఱ్ఱలు శాలిసస్యగర్భములయ్యెఁ, బాథోనిధానముల్ పడియలయ్యెఁ। గంభీరనదులనౌకప్రతార్యములయ్యె, విపినాద్రు లురురాజవీథులయ్యె। నమితయోజనవార్తలంగలోనివియయ్యె, నంధులు చదువ వ్రేళ్ళతులయ్యె॥ నీదుపూర్వులయేల్బడి; నీదుప్రభుత। నిన్నిటిని మీఱుమేల్మి మాకెసగకున్నె?। జయము! విక్టోరియా జగజ్జననిపౌత్ర। సప్తమైడ్వర్డుసుత! జ్యార్జిసార్వభౌమ॥

సీ॥ ఐదుఖండముల రాజ్యాధిపత్యముగాంచు నాంగ్లోప్రభుండ దీర్ఘాయువగుము!। భారతఖండసర్వస్వామ్యము వహించు చక్రవర్తీ! నీకు స్వాగతంబు!। సౌందర్యరాశ్యలగ్జాండ్రాసతీగర్భశుక్తిముక్తాఫలా! శుభమునీకు!। సత్పుత్రికాపుత్ర సంతానబహుతా సకరుణాంతరంగ! మంగళమునీకు!। గీ॥ ననుచు భూప్రజదీవింప, నఖిలగోత్ర। యేలుమేకాతపత్రమిూవేపవిత్ర। జయము విక్టోరియా జగజ్జననిపౌత్ర। సప్తమైడ్వర్డుసుతజ్యార్జిసార్వభౌమ॥



మ.రా.శ్రీ, రాయప్రోలు సుబ్బారావుగారి రచితము.

సీ॥ కన్నసంతానముఁ గాపాడుచందాన। నెల్లదేశజులఁ బాలింతువనుచు। ఆప్తబంధుజనంబు నాదరించెడి మాడ్కి-। నధికారసంతతి నరయుదనుచు। ప్రాణమిత్రులను గారామారఁగనురీతి। సోదరరాజులఁ జూచెదనుచు। దుష్టవర్తనుల నిర్దూలించుపగిది। వైరిసమూహములను గాఱింతువనుచు॥ గీ॥ నీదుదివ్యచరిత్ర నిర్నిద్రమహిమ। ననుదినంబును స్తోత్రమాలావళులను। బూజయొనరింత్రు పూర్ణిమాభ్యుదయసోమ। స్వాగతంబిదె శ్రీజార్జి సార్వభౌమ॥ 1.

సీ॥ చింతించి తత్తటించిన యెడ్వరుఁడు సార్వభౌమనిర్యాణ శోకామితాప్తి। భరియించి తాకులపాటునందిన రాజ్యనిర్మాణమున శాంతినిండితొలఁక। వెలయించి తాంగ్లపూర్వీక కీర్తిగౌరవో। న్నతిరాష్ట్రమహితకంటక మొనర్చి। అలరించితివి హైందవులవాంఛితార్థస। స్యములపైఁ గరుణారసంబుఁజిలికి॥ గీ॥ సంతసించిరి తావకోత్సాహగరిత। రాష్ట్రసామ్రాజ్యపాలనారంభమునకు। సకలసద్గుణధామ! ప్రశస్తనామ। స్వాగతంబిదె శ్రీజార్జిసార్వభౌమ!॥ 2.

సీ॥ సత్యంబుతోడఁ బ్రశస్తచరిత్రుఁడై। సద్గతిగను హరిశ్చంద్రుఁడొకఁడు। బ్రహ్మచర్యవ్రతప్రతిభతో నైక్యమై। సుకృతియైనెగడు భీష్ముండొకండు। ధర్మంబుతో సమత్వముఁగాంచి బుధగేయ। చరితుఁడై తగుయుధిష్ఠిరుఁడొకండు। నీతిశాస్త్రవిచక్షణాతిశయజ్ఞాన। రీతిశారదుడగు కృష్ణుడొకఁడు॥ గీ॥ అవతరించి తదీయమహాత్వ

తత్వ! దర్పితములగు నున్న తాదర్శములఁ। బవిత్రమొ
నరించిరీ పుణ్యపృథివినపుడు। చెలిమిఁ బాలింపుమిపుడు
జార్జిక్షితీశ॥ 3.

సీ॥ బౌద్ధధర్మవ్యాప్తి బహుళీకరించి। యశముఁ బెంచిన
యశోకచక్రవర్తి। మధురసారస్వత ప్రథితవనాంతదో।
హదమొనర్చిన విక్రమార్కవిభుఁడు। సామ్రాజ్యపాల
నాచాతురీరీతి సమర్థనుండగు హర్షవర్థనుండు। కులమ
తద్వేష శృంఖలలూడ్చిన ప్రతాపహేళి యగ్బరుపా
దుషేశ్వరుండు॥ గీ॥ ఎంచిపాలించి కీరితినించి, సుకృతి।
గాంచి యీపుణ్యధాత్రి భరించిరేగి। రట్టిధన్యుల
మరపించి యరయుమయ్య। చక్రవర్తిలలామ! శ్రీ
జార్జిసోమ!॥ 4.

సీ॥ కులమతాంతర భిన్నకలన నేకముగాని। ప్రజలకైక్యత
గూర్చు భారమొకటి। విద్యలేమినిమాఢ్య విస్తరాబ్ధి
మునుంగు(వారి యంధతఁద్రోయుభారమొకటి। కేవల
వ్యవసాయ జీవనమగుభువిన్। వాణిజ్యకలలుంచు భార
మొకటి। సాటిసీమలవాసిఁ జాలని దేశంపు గౌరవంబు
నుబెంచు భారమొకటి॥గీ॥ ఇన్నిభారంబులను భరియిం
పనోపి। తాత్మసాక్షిగ నీపుణ్యమనుపమంబు। సకలరా
జన్యమస్తకశస్తరత్న। మంగలాసాంద్ర శ్రీజార్జి మా
నవేంద్ర॥ 5.

బ్రహ్మశ్రీ, బలిజేపల్లి లక్ష్మీకాంతకవి రచితము.

శా॥ శ్రీకల్యాణగుణాఢ్యయై త్రిభువనక్షేమంకరోల్లాసయై
లోకేశుల్పరిచర్యసేయ విబుధాళుల్ శాస్త్రసంబద్ధధ
ర్మైకారూఢి సమస్తకార్యములఁ దోడైదిద్ద ద్వీపంబులన్
సాకల్యంబుగనేలు దేవి దయ నిచ్చల్ బ్రోచుజార్జిప్రభున్ ॥

సీ॥ చిత్తుబుస్సనెడు నాశీవిషాధిపుచెల్మి తుదవెళ్ళనేయ
ని పెదవి విఱిచి। సతతంబు మధువ సంగతినుండుమద
మత్త మాతంగపతిఁజూచి మూతిఁద్రిప్పి। జడసంగతికిఁ
బాలువడి పంకమునదోగు కిటిఁగాంచి వలుమాఱు మె
టికవిఱిచి। కలకాలము విపత్సుగతికిఁబాల్పడు ధరా
భృత్కులంబెలంచు నీనడేంచి॥ గీ॥ సకలకల్యాణగు
ణధాముసార్వభౌము। నిన్నె వరియించె భారతనీరజాక్షి।
శౌర్యవిస్ఫూర్తి! పావనసన్నివర్తి!॥ సత్యగుణకీర్తి!
శ్రీజార్జిచక్రవర్తి!॥

సీ॥ తనవారికన్న హైందవులన్న దయయన్న తనపల్కు
నకుఁ గ్రియాత్వంబొసంగ। తరతరంబులనుండి జరుగు
చుట్టఱికంబుఁ గనులారఁగని కల్పికొనుట కొఱకు।
ప్రత్యక్షముగను స్వప్రభుఁజూడనికోఱంత దేశంబువా
రికిఁ దీర్పుకొఱకు। ప్రభుభక్తి హైందవప్రజలకెట్లున్న
దో తనకు। దానే కనుంగొనుట కొఱకు ॥ గీ॥ ఇచటి
కరుదెంచి నీప్రజ కింపుమీరఁ। బట్టభద్రుఁడవైన నీపద
విఁజూపి। అద్భుతానందమున నోలలార్చితయ్య। చా
రుతరకీర్తి! శ్రీజార్జిచక్రవర్తి! ॥

సీ॥ అద్దంబులట్లు రథ్యావితానంబుల వలపుగొజ్జగినీటఁ గ
లయనలికి। ఫలభారనమ్ర రంభాస్తంభ ములఁ దెచ్చి
ప్రతి కవాటమునఁ జిత్రముగనిల్పి। మందిరాళిందసీ
మందళ్కుముత్యాల లీలగారంగవల్లికలఁదీర్చి। ఫుల్ల
వాసంతికా మల్లికావల్లరీ సౌగంధ్యతోరణసమితిగట్టి
గీ॥ తొగలు కేతువితానంపుఁ దోపుచీరె। దాల్చి వాసక
సజ్జికాత్వము బూని। నీకునై వేచె భారత నీరజాక్షి।
యేలికొనుమింక జార్జి భూపాలతిలక! ॥

సీ॥ నినుగాక యన్యునెవ్వని భర్తగాఁగోర దనయంబునీక
థలాడికొనును। ప్రాతికూల్యమటన్న పలుకెప్పటికిలేదు
పౌలయల్కయన్న నేమోయెఱుంగ। దనిశంబునీశు
భం బాసించు నుంత నీమాటయన్నను జవదాటవెఱ
చు। శిరసావహించు నీచీటికేతకిరీతి నీరూపపటము మ
న్నించుచుండు। గీ॥ వేయుమాటలిఁకేటికి విన్నవింప। అ
ధిప! నీతోడిదేలోకమని తలంచు। మాభరతఖండరాజ్య
రమామతల్లి। కేలుగ్రహియించి ప్రీతిమైనేలుకొమ్ము॥

మ॥ అనురూపుండగు భర్తవీవనుచు నిన్నర్థించి మాహైం
దవం। బనుకన్యామణి నప్పగించితి మసంఖ్యంబైన భా
షాళినే। ర్పినదీకన్య గయాళిగంపయనుచున్ జింతింపక
య్యా! లస। ద్వినయాపుంగని నుమ్మియేలికొను ము
ర్వీనాథచూడామణీ ॥

సీ॥ జగమెల్లఁజెల్లఁబోఁజరియించియిల్లువాకిలిఁగూడఁబట్టని
కీర్తికాంత। ప్రత్యర్థిపైననూరకఁ గాలుఁద్రవ్వుచుఁ జేరి
పోరాఁడెడు వీరలక్ష్మి। అలుకేమిలేక రచ్చలకెక్కి మి
గుల వాచాలమైతిరుగు భాషాలతాంగి। అనయంబు
రాజనవ్యాప్తిసంచలియించునర్వసర్వంసహాసారసాక్షి॥
గీ॥ సాహసంబునఁజేపట్టి స్వచ్ఛతయును। శాంతియర్థ, వి
నయంబునుక్షమయునేర్పి। నవతిపోరాటములు నుంత
సాగనీవు। మాయురే ! నీవె దక్షిణనాయకుఁడవు ॥

సీ॥ తలిరాకువంటిచేతులుకందు హాఱంగ వేడ్కఁగోలాటం
బువేయువారు। చిన్నారిపొన్నారి చిల్కపల్కులతో
డ నీచరిత్రంబు వర్ణించువారు। చిఱుత కోయిలలుగూ
సినరీతి నీమీఁది పద్దెముల్ వింతగాఁ బాడువారు। వ
లపురాయంచ కన్నెలరీతినొయ్యారమలవడనాట్యం
బు లాడువారు॥ గీ॥ నగుచు నూరూర బాలిక లనువు
మీర। యుష్మదీయ పట్టాభిషేకోత్సవంబు। జరుపు
చున్నారవధరింపు చాటునిదియె। మాకుఁగల రాజభ
క్తియో మానవేంద్ర ! ॥

శా॥ ఊరుంబల్లెలఁబట్టణంబులను నత్యుత్సాహమేపారఁగాఁ
బౌరుల్ నిర్మలరాజభక్తివిషయవ్యాహారనీహారవాః
పూరంబుల్ వెదజల్లుచుండిరి దిశాపుంజంబు దీర్ఘాయువౌ
ధీరశ్రీకరజార్జి నా జయజయేతిధ్వానముల్ మ్రోగెడిన్ ॥

శా॥ వింతౌపిల్లనగ్రోవులందిగుములై భిల్లాంగనల్ నీకథల్।
సంతోషంబునఁబాడుచుండఁగ నుదంచత్సాంద్ర గంధాచల।
ప్రాంతారణ్యనగంధగంధవిటపివ్యాలీఘనాగాంగనా ।
సంతానంబు ఫణంబులెత్తి యెఱుర్జాలించి యాలించెడున్ ॥

మ॥ మనుమీాయవ్వయుఁ దండ్రియున్ నమత మమ్మున్
బిడ్డలంబోలెఁ బెం। చినవృత్తాంతము నీకునుండెలియు
మాచేనీవుచెప్పించుకో। వని మీావంశమె చాటుచుం
డినను మర్యాదానుపూర్వంబుగా। మనవిం జేయుట
తప్పుగాఁగానెదు సుమ్మా జార్జిభూమీపతీ! ॥

సీ॥ స్మరణమూనెదవు సుమ్మా ! మున్ను మీాయవ్వ విక్టో
రియారాజ్ఞి విధముకొంత। ఎంచకుండెదవు సుమ్మీ !
నిన్నుగన్నయ్య మమ్ముఁబాలించు క్రమమున్నకొంత।
మఱచిపోయెదవుసుమ్మా ! "నాకు హైందవ ప్రజలన్న
దయ" యన్న పల్కుబడిని। ఏమఱించెదవుసుమ్మీ !
సుంత మేమునిన్ వినయంబుననుగోరు విన్నపముల॥
గీ॥ వేయిమాటలిఁకేటికివినుము "నాదు। తాన్పుతోఁబాటు
మిమ్ములన్ గాతు" ననుచుఁ। జేతిలోఁజేయివేసి వ
చింపుమయ్య। సకలగుణధామ ! శ్రీజార్జిసార్వభౌమ ! ॥

ఆశీస్సు.

సీ॥ ఆయురారోగ్యభాగ్యప్రాప్తి జార్జికిన్ మేరిగారికి నమ
కూఱుఁగాక। దేశంబునందు శాంతిక్షాంతి నమకూడి
ప్రజలకుసౌఖ్యంబు వరగుఁగాక। పైరుపచ్చయుఁ బసి
పాడి పంటలుగల్గి యుర్వీసుభిక్షమై యుండుఁగాక। ని
శ్శేషశాత్రవనికరమై రాజ్యంబు రామరాజ్యము లీలఁ
గ్రాలుఁగాక॥ గీ॥ భవ్యమైసర్వలోకసంభావ్యమగుచు।
ధన్యమై నర్వరాజ్యమూర్ధన్యమగుచు। బ్రహ్మకల్పంబు
వరకు శాశ్వతముగాను। హూణరాజ్యంబు విజయం
బు నొందుఁగాక ॥

మ.రా.శ్రీ, వుప్ప్రమే అలీసాకవిగారిచే వ్రాయబడినవి.

మ॥ చిరకాలంబున శార్యసోదరులు విచ్ఛిన్నంబు గాకుం
డఁగా। మరలన్ గూడిరి హిందుదేశమున సమ్మానింప
నానామతాం। తరులైయుండినఁ గాక యింగ్లిషుప్రభు
త్వంబీధరామండలిన్। ధరణీచంద్రులతోడనిల్చి మము
నిత్యంబేలు నిచ్ఛారతిన్ ॥

ఉ॥ భారతదేశమంతయు కృపాణముపట్టి జయించినాము
నేఁడారయ దానివీడవలదంచు వచించిన వల్వదంటి
వీ। ధారుణి భీముఁడున్ గెలువ ధర్మజుఁడేలినయట్టులీవు
వి। స్ఫారవినీతి ఛత్రమును చాటిడి ప్రోవుము జార్జి
భూవరా॥

ఉ॥ తల్లులకెల్లఁదల్లివయి తండ్రులకెల్లను దండ్రివయ్యు
మా। కెల్లనభీష్టసంపదల నీయఁగ రాజులకెల్ల రాజువై
చల్లనిచూపులన్ మనుచు సామివి మాయపరాధము
న్న నీ। యుల్లమునన్ దలంపక సమున్నతిఁ బ్రోవుము
జార్జిభూవరా॥

మ॥ భవదీయంబగు పాదపంకజములన్ ♦ బల్మారు రారాజు
లున్। నవమాణిక్య కిరీటపంక్తులొరగన్ ♦ నందింతు
రింద్రుండవో। యవనీ చంద్రుఁడవో దయామృతము
మా♦యందిష్టు వర్షింపఁగా। జవమీపారఁగ నేగుదెంచి
తివహో♦ జార్జీనృపాలాగ్రణీ॥

శా॥ ఓఢిల్లీపురమా! ధరాగళపురో♦ద్యత్తారరత్నంబవై।
యీడున్ జోడునుకాని యట్టిసిరివై♦యీ రేడు భూ
పాళినీ। నీడన్ నిల్పితివెంతప్రోడవొకదా♦నీతొల్లిచారి
త్రమున్। జూడన్ వేడుకయయ్యె నీచెలువమున్♦ జో
ద్యంబు లోకంబునన్॥

ఉ॥ ఆదినికోయటన్ వెనుక♦నార్యులు మూరుమహామ్మ
దీయులా। మీదట గీసుడచ్చి పర♦మేశ్వరుఁడంపఁగ
వచ్చి మెచ్చివా। రేదొకమేలుఁజేసినను♦నెవ్వరినీవు వ
రింపవైతివో। మేదిని యింగిలీష్ప్రభుల♦మేకొని తెంతటి
భాగ్యశాలివో॥

ఉ॥ స్వార్థపరత్వమున్ వదలి♦సత్యముబల్కుము నీవెగాక
నీ। యర్థమరాజ్యధాని ప్రజ♦లందరు గోరుచునుండిరం
చు ధ। ర్మార్థపరాయణుండవగు♦రాజవు మమ్ముదరింప
సేయఁ బ్రాణార్థము ధారబోదుము ధ♦రాధిపయంచు
నమస్కరింపుమా॥

ఉ॥ ఏనృపురాజ్యమందు ప్రజ♦లెంతయు సాధుపథంబు ధ
ర్మవి। జ్ఞానము వీడకుండురొ ని♦జంబుగ నాతఁడెరాజు
వాని సం। స్థానమె స్వర్గమాతని వి♦ధానమె దైవవిధా
న మాతఁడే। యో నృపుఁడంచుఁ బీఠమునఁ♦బొల్పుగ
నిల్పుట కర్థమిద్ధరన్॥

సీ॥ నీరాజ్యమున సిరి♦నిరతంబు సంపదలేనాటి కానాడు♦
నీనుగాక। నెలకుమూడేసి వా♦నలు చాలగురియఁగఁ
బాడిపంటలు చాలఁ♦బండుగాక। నీసైన్యశతములు♦
నీయుద్ధనావలు నెచట కేగినజయ♦మిడునుగాక।నీమంత్రి
వర్గంబు♦నీతిసంపన్నులై మంచిచెడ్డలవిమ♦ర్శించుగాక॥

తే॥గీ॥ నీదుపట్టపు దేవియు ♦ నీదుసుతులు, నీదుజనని
యు బంధులు ♦ నీదుప్రాజ్య రాజ్యలక్ష్మియు నీదగు♦
ప్రజ ధరిత్రి, నెల్లసుఖములఁదేలి వ ♦ ర్ధిల్లుగాత ॥

మ. రా. శ్రీ, శ॥ వేంకటరంగశాస్త్రిగారి రచితము.

శా॥ శ్రీమత్కీర్తినిజార్జినామకధరిత్రీ చక్రవర్తిన్ గుణ,
స్తోమస్ఫూర్తిని మేరిరాజ్ఞిని దయాశుంభన్మతిన్ బ్రోచు ని
స్సామాన్యాద్భుతలోకతంత్ర రచనాచాతుర్యధుర్యుండు ని
స్సీమస్ఫారకృపారసాంబునిధి లక్ష్మీనాథుఁడెల్లప్పుడున్ ॥

ఉ॥ నిక్కముభారతప్రజల నిర్భరభాగ్యఫలంబు పండి పెం
పెక్కఁగ జార్జిరాజు మహిమేలెడు, నాతఁడు పార్థివాసనం
బెక్కెడ నెక్కినప్పుడె నిజావన మొందెడుభారతప్రజన్
మిక్కిలిగూర్మిబ్రోతునని మేలిప్రతిజ్ఞ యొనర్చుటొప్పదే ॥

చ॥ ప్రజలను సర్వకాల మనురాగభరంబునఁ బ్రోచుటన్
గుణ। ప్రజనిధియైనజార్జిజన వల్లభుఁ డొప్పెడు రాజ
శబ్ద మ। క్కజముగ సర్థవంతముయి ప్రాల దిశారమణీ
మణీముఖాంబుజదరహాస కోరకితభూరి యశోవిభవా
భిరాముడై ॥

పురాణం రామచంద్రశాస్త్రి గారిచే వ్రాయఁబడినది.

ఉ. భారతమాతనీకు బహు*భంగుల సౌఖ్యము గూర్చు
చుండెడిన్, భారతపుత్రులెంతఁ బ్రభు * భక్తినివృద్ధి
నొనర్చుచుందురో, వారలనంతప్రేమఁ బరి*పాలన నీ
వు కొనర్తు గావుతన్, శ్రీరమణుండు మీకిమిత*శ్రేయ
ము నాయువు జార్జిభూవరా.

ఉ. పాండవశేఖరుండు మును*పట్టముదాల్చిన పట్టణంబు
లో, నిండియు చక్రవర్తివై*యెంతయు నుత్సవమందు
వాఁడవో, పాండవుఁగొల్చువారివలె * భారతపుత్రులు
సౌఖ్యరాశిచే, నుండుతనీకుభోగ విజ*యోన్నతి గల్గు
త జార్జిభూవరా.

శా. శ్రీగౌరీప్రియుడార్తపాలుఁడు శునా*సీరాది లేఖార్చి
తుం, డాగోగాథ తమఃప్రభాకరుఁడు వే*దాంతైక వే
ద్యుండు సద్ధీగమ్యుండు పరాత్పరుండిడుతన*త్కీర్తిన్
మహైశ్వర్యముల్ । శ్రీగోవృద్ధిని పట్టభద్రునకు జా*
ర్జిమేదనీభర్తకున్.

## మ.రా.శ్రీ, తల్లాప్రగడ సూర్యనారాయణగారిచే రచితము.

సీ. శ్రీమదాఖండల*శ్రీమహామహిమాభి రామనిస్తంద్రసా * మ్రాజ్యమ
స్తు। ఖండఖండాంతరా*ఖండవిఖ్యాతభూ రిప్రభుత్వ! యశస్స*
మృద్ధిరస్తు। విద్యావివేకసు*విక్రమౌదార్య సద్వైభవసంపూర్ణ!
దిగ్విజయమస్తు। పరదేశపాలనా*ప్రతిమానప్రతిభా విశేషధౌ
రంధర్య!*క్షేమమస్తు. ప్రణమితాశేషభారత * ప్రభువరేణ్య!,
లలితసద్గుణగణ్య! క*ల్యాణమస్తు, హృష్టబహుజనయూధ! మే *
రీసనాథ!, స్వస్తిశుభధామ! శ్రీజార్జి*సార్వభౌమ!.

ఉ. భారతవర్షవాసులిల* బ్రస్తుతికెక్కిరి రాజభక్తికిన్!
జేరెక్కశంకమిందు; నిది చేకొనిరెల్లరునిట్టివారలే
వీరలటంచనంగనదు విశ్రుతమై తగురాజభక్తి నిం
డారెను దేశమెల్లెడ యథార్థము జూడఁగదయ్యభూవరా.

సీ. ప్రజకువిద్యలనేర్పి *బ్రతుకుతెరువుఁజూపి యారయ రాజానుగురుం*
డనఁగవలయు। ప్రజలబిడ్డలపోలిక*పరిపాలనముసేయ నతిప్రేమ
గలతండ్రి* యనఁగవలయు। రోగపీడితులనా * రోగ్యవంతులఁజే
సి యారయుటను తల్లి *యనఁగవలయు, పక్షపాతములేక * పర
మానురక్తిచే నరయుచుండుటదైవ*మనఁగవలయుఁ. గాటికిని గు
డ్డకునుకూడ* కొరతపడిన, వారిఁబ్రోచుటదాతనా*వలయుప్రజకు,
నేఁడుగడయాతఁడౌట భూ * మీశునెడల, భక్తియుతులౌట మ
నప్రాభ * వంబుగాదె.

ఉ. భూజనులెల్ల సౌఖ్యములఁ బొందిసుఖింపఁగఁ జూచువారెటన్.
రాజులుగారె? తద్బలపరాక్రమ సంపదకాదె యెవ్వరే
రోజనుసంచరించిన శుభోదయమున్ గనఁజేయు వారికుం
దీజగతీ ప్రియత్వమలరింపఁగ నొప్పదెయుత్సవావళుల్.

చ. పయనపువేళ నడ్డుకొనఁ బాల్పడెగాలియువాన; వానినే
మయినను లెక్కఁజేసితివె? యాత్మనిరూఢి ప్రశస్తిఁగాంచ నీ
నియతమునిల్పుకొంటివిటు నేర్తురెభూపతులందఱున్; మనో
జయముగలట్టివారి శుభసంపద కింతకొఱంతగల్గునే.

ఉ. నారయెడఁజాలగాఁగ నభిమానము గల్గుటతెల్లమయ్యె ము
న్నియెడకీవువచ్చినపు డెంతయు; నయ్యదియాదిగాగ మి
మ్మొకదైవమట్లు మదిసెంచినవారు ప్రభుత్వమందు దే
శీయులకున్ స్వతంత్రములు చేకురుచాలఁగ నంచు నెంచి నా
రా; యతమైనదేశ మిది; యజ్ఞులుగాతిటనున్నవారు వి
ద్యాయుతు లెందరోగలరు తత్పరిపాలనమందు వారికెం
తోయభిమాన మబ్బసది దేశపువృద్ధినిగోరి రాజ్య మాం
గ్లేయులు జేయుచుండిరను కీర్తియొక్కటి నిండియుండె నా;
న్యాయము దప్పిపోవమని నాఁడుభవజ్జనకుండు; తల్లిమా
ేయసె; యాడెనాతఁడును నేయదిమున్ననినారొ వారు, మే
మాయది గోరుచుంటిమిపు; డంతకుమించియుఁ గోరలేదు, దే
శీయుల మాదుపూర్వికుల శేముషి మీరువినంగలేదె? ప్ర
జ్ఞాయుతులందఱున్ మరలఁ గన్పడుచుండిరియట్టివారె య
త్యాయతబుద్ధిమంతు లిపు డయ్యదిమీకును ద్యోతకంబ; యాం
గ్లేయులపాలనంబె తిలకింపఁగఁజేసె పురాతనంపు దే
శీయులయున్నతిన్, జనుల చిత్తములన్ జిగురింపజేసె; మా
కీయధికారశయంబులు జనిఁపఁగఁ గారణమేమొ హూణవి
ద్యాయుతులౌటయే, యదెకదాభవదీయ మహాశయంబునున్
జేయఁమటందురద్ది యిది, చెల్లును, కల్పకజంబుఁజేరియున్
గాయలుగోరఁగా మదిని, కామ్యముఁలెయ్యవి యవ్విదెల్పెదన్
జేయవలెన్ బరిశ్రమల జేయముగా విలసిల్లనిచ్చుటన్,
మాయధికారముల్ సరిసమానముగావలెఁ దెల్లవారితో
ఆయముభూమిపైమిగులు నట్లుగఁబన్నులు శాశ్వతంబుగా
జేయవలెన్ మితిన్గనఁగ శ్రీవిలసిల్లగ, దేశమందు వి
ద్యాయతనంబులందు భృతినందకవిద్యలనేర్చునట్లుగాఁ
జేయవలెన్ బలాత్కృతులఁ జేసియునైనమహీజనావళిన్,
జేయననేల దేశమభివృద్ధికిఁ దేవలెనెల్లభంగులన్.

## మ.రా.శ్రీ, వేదులసూర్యనారాయణశాస్త్రిగారిచే రచితము.

ఉ. నీ*ము సంగ్రహించి యవ * నీస్థలినిండ విశేషవర్షము।
న్వారిజమిత్రుఁడిచ్చు జన * భాగ్యముకోరి యదేప్రకార మీ.।
భూరమణుండు జార్జి కర*మున్ గ్రహియించి ప్రజాళిఁబ్రోవసా।
భూరిధనంబుఖుస్సలు * పున్గొనియాడుఁడు మీరలాతనిన్.

చం. సుజనహృదంబుజంబులకు * సూర్యుఁడు కల్పకవర్ధికోటికి।
న్కుజనహృదంబు జాతముల * కున్నశశాత్రవధూమకేతు వు।
న్నిజపరిచారకప్రియుఁడు * నిందితచంద్ర శరీరరమ్యుఁడు।
న్భుజబలభానురుండు పర* పూతుఁడు పంచమజార్జివర్ధిల్లుతన్.

చం. జయముగుఁగాక హూణకుల* జాతునకున్గుణవారిరాశికి,
న్జయముగుఁగాక సర్వజన* సన్నుతమూర్తికి మేదిభర్తకు।
న్జయమగుఁగావుతన్ధరణి * చక్రికిఁ బంచమజార్జికిన్మహా।
జయమగుఁగాక భద్రము*ప్రశస్తజయంబు జయంబుగావుతన్.

## మ.రా.శ్రీ, బి. సీతాపతిరావుగారిచే వ్రాయఁబడినవి.

మ. వశజాతాప్తుడు నస్తమింపని మహీభాగంబు దోర్దండశ
క్తిబాలించు యశోవిశాలు ఘనధాత్రీ రాజరాజేంద్రుఁబా
ఉచ్చారిత్రు సుధర్మమిత్రుఁ గరుణాపారీణుఁ డత్సార్వభౌ
ముని గాఁగాంచిన భారతీయుల మహాపుణ్యంబు సామాన్యమే.

## మ.రా.శ్రీ, జంధ్యాల, వెంకటప్పయ్యశర్మగారిచే వ్రాయబడినవి.

చ॥ ఇలగలవారికెల్లరకు * నీశ్వరుఁడై దనరారి సర్వలో
కులుఁ దనుసంస్తుతింపఁ బలు * కూర్మలఁజూపుచు వారలందునన్
మెలగుచు లోకమంతటను * మేల్మియశంబును నింపి భార్యతోఁ
గలసి జయంబునొందుత సు * ఖస్థితి జార్జివిభుండు భూస్థలిన్॥

### మ. రా. శ్రీ, వేంకటరామసత్యనారాయణకవులు గారిచే వ్రాయబడినవి.

సీ. తనపదాబ్జములకు వినతరాణ్మకుట రత్నద్యుతుల్ నీరాజనములు
గాఁగ। తనప్రతాపాగ్ని కుద్ధతనృపాల విరోధి మండలంబు ప
తంగమండలముగ। తనప్రాభవమునకు మనుదండనీతులు సకలం
కులైన సేవకులు గాఁగ। తనభవ్యకీర్తిలతావితానమునకు పద్మభ
వాండమ్ము ప్రాకుగాఁగ. తే.గీ. ధాత్రిశోభిల్లు సద్గుణతతికియిల్లు,
తరుణరూపవిభూత కందర్పదర్ప। సత్కృపావర్తి శ్రీజార్జిచక్ర
వర్తి, బూర్ణకృపచేత నెన్నఁడు బ్రోచుఁగాత.

చ. గగనతలమ్మునందున ప్రకాశమునొందెడువారి వాహమున్।
దగనణగింపచాతక కదంబకముల్ గనుమాట్కి మానవుల్।
జగతిని భద్రపీఠమున సన్నుతిజెందెడు నీమహోత్సవ।
మ్మగని సుఖించిరీజనులఁ బ్రోవుము సంచముజార్జిభూవరా.

ఉ. దీనజనాళి పోషిత సుదీక్షితదేహుని నిర్జితాహితా।
జానుమహోహిబాహుని రసాతలనిస్తులచక్రవర్తినిన్।
భానుసమానమూర్తిని కృపాళుని జార్జినృపాలమౌళినిన్,
శ్రీనళినాక్షు నెల్లెడల శ్రీనళినాక్షుఁడు బ్రోచుగావుతన్.

### మ. రా. శ్రీ, బి. భగవంతరావుగారిచే వ్రాయబడినవి.

సీ. అఖిలమతంబులకాధారమను ఖ్యాతి, నెసఁగు హిందూమతం బె
చటఁ గలిగె, వివిధవేదాంతార్థ విజ్ఞానులకుఁదృప్తి, నిచ్చునుప
నిషత్తు లెచటఁగలిగె। అన్యమతద్వేష మన నెఱుంగనియార్యు,
లిడిన సర్వసమత్వమెచటఁగలిగె। పరరాజు లెందరు పాలకులై
నను, హెచ్చు స్వధర్మేచ్ఛ యెచటఁగలిగె. గీ॥ నట్టి యిండి
యాదేశంబు నందుఁబ్రజలు। చేరియొనరించు పట్టాభిషేక మొందు।
ప్రథమవిభుఁడగు శ్రీజార్జిప్రభువరునకు। నతనిదేవికిదీర్ఘాయువమరుఁగాక॥

సీ॥ స్వపరభేదములేక సకలజనంబుల, బిడ్డలవలెఁబ్రోచు ప్రేమ యొ
కటి। అబాలగోపాల మందఱకును విద్య, కొల్లగా నేర్పినకూర్మి
యొకటి। శిల్పాదిహైందవ శ్రేష్ఠవిద్యలనెల్లఁ, గాపాడినట్టి మీ
ఘనతయొకటి। ఖడ్గంబుఁజూపక కరుణనేచూపుచు, దేశంబు నే
లినదీక్షయొకటి గీ॥ కారణములయి మీర లేకాలమిటులె। మా
కుఁ బ్రభులుగ నిల్తురు గాకయనుచు। వంశతముఁగోరఁజేయు నో
జార్జిభూప!। సరసపథవర్తి! యిండియా చక్రవర్తి!

### మ. రా. శ్రీ, బొమ్మరాజు జానకిరామశర్మగారు.

సీ. వారిధివలయిత వసుధాతలంబెల్ల ఘనభుజాకేయూరమణిని సల్పి,
యబ్జభవాండంబు నాత్మకీర్తిసతికిఁ బొలుపారనాసికాభూషఁ
జేసి। యరిరాజసంఘంబు ననుపమతేజోగ్నికిని ముదమార నింధన
మొనర్చి। ఆర్తజనంబుల ననయంబుత్వత్కృపా ఘనరాజికిని
చాతకములఁజేసి. గీ. నీముపరిపాలనంబు సంమోదయుక్తి। పుష్ప
వంతులుఁగలకాలమును బొనర్చి। మేలుఁగాంచు ముధాత్రి శ్రీమేరి
మాన। సాబ్జ ఖరధామ శ్రీజార్జి సార్వభౌమ.

### మ. రా. శ్రీ, చెమికల చెన్నారెడ్డిగారిచే వ్రాయబడినవి.

సీ. మాహితంబర్థించు మాయన్నగారైన గోఖలే ముఖబుధముఖ్య గు
ణులు లెమ్మ। చెవినిల్లుగట్టి హైందవహితంబులు దెల్పు మంత్రి
మార్లెబుద్ధిమంతుడమ్మ। అర్ధాంగలక్ష్మి పట్టాభిషేకము గాంచు
మేరిరాణీ మహోదారిసుమ్మ। భూతదయాబుద్ధి బుట్టింపహృద
యమందున్న దేవుని గొప్పనెన్న కొమ్మ. గీ. యిట్టిసాధులసంగతి
నెనయుజార్జి సార్వభౌముడు మాకొట సౌఖ్యమమ్మ। యవనిపై
ధాత్రిపై మాకనలయునీవు భయము విడువంగదమ్మ శ్రీభరతధరణి.

సీ. ధర్మసారమునకాస్థానమౌ భరతఖండాలవాలంబున నంకురించి।
భారతీయవరార్థి వారకారణభూత ధారాళదానవార్ధారబెరిగి।
కాయమానీకృతాకాశవాటంబున నిరవకాశంబుగా నెరయబెరశి।
నయనపర్వంబుగా నక్షత్రములనఁగదనరు పుష్పంబులంకటుసుబూచి.
గీ. ఆశ్రితాళులకు సదామోదములరించి యమృతరుచిఫలంబునండిజగతి।
జార్జిచక్రవర్తివతీ కీర్తి కల్పకవల్లి యెపుడు సల్లసిల్లుగాత.

సీ. తిరుగబోతలసాద్వదు పరగెవంటలయిఁడ్ల పువులసాద్వదులఁ గోష్ఠి భ
వనములను। యిల్లిల్లలంకృతి నిందిరాముఖశోభ సభసభసురరాజవ
భలశోభ। యింతింతయనరాని సంతోషభావములుగాన సుబ్బబ్బ
సుఖప్రదంబు। పాకీయమన్ననో మాననీయరసంబె యమృతమట్టి
దనాటియున్న మెల్ల. గీ. గంధయుతశీతలంబున గాలిదనరె। గిట్టి
పంచేంద్రియ సుఖంబు లిప్పుడబ్బె। ఘనములౌజార్జి సామ్రాజ్య
దినములెల్ల। నిట్టిసుఖమునె యీవృతయిండియాకు.

### మ. రా. శ్రీ, గాడేపల్లి చిరంజీవిరావుగారిచే వ్రాయబడినవి.

మ. సరగజ హూణప్రభుత్వమందు మనకున్ సౌకర్యమున్ మెండుచే।
కు నెనంచుం వచియింతురెల్లరది మీకుండేట తెల్లంబు నేఁ।
బొరివానింవివరించి వ్రాయజతనంబుంజేయ లేదిందు నె
క్వరెటుల్ పల్కిన సత్యమెప్పటికి నేబావంచుచాప్పెంచదే.
తే గీ. ప్రజలునిరతంబుఁ బ్రభుభక్తిఁ బరగవలయుఁ
ప్రబలవలెఁబతియుఁ బ్రజానురక్తిఁగలిగి
యట్టియన్యోన్య సంబంధమమరియొప్పు
చున్నదో లేదో సాక్షి యీయుత్సవంబె.

ఉ. శాంతదయాగిసర్వవిలసద్గుణపుంజవిరాజితుండు సా
మంతనృపాలమౌళిమణి మండిత పాదసరోరుహుండు ధీ
మంతుఁడు సుప్రతాపుఁడసమానయశోవిభవుఁడు జార్జిభూ
కాంతుఁడు న్యాయరీతిఁ జిరకాలము నీభువినేలుఁగావుతన్.

### మ॥ రా॥ శ్రీ, కశిరెడ్డి వెంకటసుబ్బరెడ్డిగారిచే వ్రాయబడినది.

హిందూదేశోద్ధరణనిరతాః గోఖలేముఖ్యవిజ్ఞాః।
మార్లేమంత్రీకుశలమతిమాన్ సానుకంపశ్చజార్జిః।
మేరీరాజ్ఞీపృథువితరణీ పుణ్యపాకోఽభిషేకః।
ఏతద్యోగోభరతధరణీ క్షేమసంపద్భ్య ఏవ.

**మ. రా. శ్రీ, ఇవటూరి సుందరయ్యగారిచే వ్రాయబడినది.**

సీ. పాండుపుత్రాదుల* పరిచితి గలదయ్యెఁ బౌత్రత్వమెట్టులఁగని *
బాలకుమ్ము, చదువుకొన్నదియయ్యె * సకలశాస్త్రంబులు గర్వ
మింతయులేని * కలికిసుమ్ము। బల్సిరుల్ గలదయ్యెఁ * బలుపో
కడలుపోక నడఁకువతోనుండు సతిసుమ్ము। వీరురాలని చాల*
పేరుపొందినదయ్యెఁ బతిభక్తినెరపెడి * పడఁతిసుమ్ము, వరభా
రత భూదేవి * సంతతమును, బుజ్జగించుచు నామెను * ముదము
తోడ। సకలసౌఖ్యంబులందుమా* జనవరేణ్య, చంద్రనిభమూర్తి
శ్రీజార్జి * చక్రవర్తి.

సీ. వరమౌళిఁదాల్చిన * వజ్రనాయకమణి లీలఁదాల్చినచంద్ర * శేఖ
రాంగ, వామభాగంబున * వఱలు మేరీరాణి తుహినాచలేంద్రుని*
దుహితగాఁగ, ధవళదీధితినొప్పు * తనుకాంతిపుంజంబు భసితాంగ
రాగ లే * పంబుగాఁగ, వల్లెవాటుగనున్న * వలిపట్టుపట్టంబు
తెలివన్నె పాపజం * దెంబుగాఁగ, నిన్ను శివుగాఁగ మనముల*
నెన్ని జనులు, నీవు నీపాళమునకేగు * శివుఁజూచి, శ్వశురు నింటి
కినేగెడు*శంభుఁ డండ్రు, చంద్రనిభమూర్తి శ్రీజార్జి * చక్రవర్తి

సీ. తీఁగచేవార్తలు * తెలియుటబ్బురమన్న తీఁగ లేకయె వార్త *
తెలియునంట, పొగబండిమీదను * పోవుటేమింతన్న నాకాశగ
మనంబు * అమరునంట, చూడుటదూరంబు * చోద్యమన్నను
వార్తిపస్తుతెల్లనుజూడ * వచ్చునంట, కోసిమైలోఁజూచి * కు
టుటబ్రింబన్న జర్మముండఁగఁజూడఁ * జనెడినంట, నీదుపరి
పాలనంబున * నిఖిలభువిని, నహహ గొనియాడఁదర మె? సీ*మహి
తమహిమ, బ్రహ్మకైనను వేనోళ్ల * ఫణికినైనఁ జంద్రనిభమూర్తి
శ్రీజార్జి చక్రవర్తి.

సీ. కోహినూరు రత్నంబు * కోటీరమునఁ దాల్చి రహిమించు శ్రీమేరి*
రాజ్ఞితోడ, ఘనయశో విక్రమ * గాంభీర్య నిధులౌచు సొబగు
మీఱిన నీదు * సుతులతోడ, సౌందర్యరాశులై * సద్గుణాధార
లైన తాల్మిబూనిన నీదు * తల్లితోడ, విమల గుణాఢ్యయై * విజ్ఞా
న వతియౌచుఁ గొమరొప్పు నీకూర్మి * కూఁతుతోడ, సర్వసౌఖ్యం
బు లొందుచు * సంతతమున, సర్వకాలంబు నీధరా*చక్రమెల్ల,
పాలనము సేయుమా రాజ*పార్థివేంద్ర, చంద్రనిభమూర్తి శ్రీ
జార్జి చక్రవర్తి.

**మ. రా. శ్రీ, బండేపల్లె- శేషశాస్త్రిగారిచే వ్రాయబడినది.**

శ్రీమాన్ భాసుర సర్వసుగుణతయా శ్రీరాజమౌళిత్వతః
స్స్వర్వారాతిపుర ప్రమాపణతయా సర్వజ్ఞతాత్వేనచ।
సర్వప్రాణిశివంకృతే ర్మదన ధిక్కారేణ వైశ్వర్యత
శ్శర్వజ్జార్జి మహీపతిర్విజయతాం శ్రీచంద్రమౌడోయథా.
యశ్శ్రీమాన్నృతకోటిమేవ వితరన్వ్రిత్యర్థిలోకం సకృ
చ్చిత్రం పాదపయోజయుగ్మకలితానేక ప్రణామాన్నృపాన్।
దీనాంశ్చ ప్రముదాతిరేక విలసద్వక్త్రాన్ క్రరోత్యన్వహం
సోయం జార్జి విభుశ్చిరం విజయతాం సామ్రాజ్యలక్ష్మీం వహన్.

**మ. రా. శ్రీ, శ్రీవిక్రమదేవవర్మగారిచే వ్రాయబడినవి.**

గీ. శ్రీకరుండవు సర్వేశుండవు * శ్రీయుతులను।
మిమ్ముఁ జిరజీవులుగఁ జేసి * మీప్రభుత్వ
మెప్పుడును భారతంబున * నెసఁగఁజేయుఁ।
చారుమూర్తి! పంచమజార్జి! * చక్రవర్తి.

గీ. మీదయారసంబువలన * గాదె? భరత
ఖండజనులు నిర్భయులైరి * ఖండితఖిను
నిరతమును గాంచుచున్నారు*నృపకులేశ!
చారుమూర్తి! పంచమజార్జి! * చక్రవర్తి!

గీ. భరతఖండంబు మీపరి*పాలనమునఁ।
బొందియున్నట్టియును మహి*పొందనన్న
యమితలాభంబులెన్నంగ*నగునె? కరము
చారుమూర్తి! పంచమజార్జి*చక్రవర్తి!.

గీ. భారతస్థులపైఁ గల*పరమకృపను
వెల్లడించితి రిప్పుడ*డిల్లియందుఁ
బట్టపరము గట్టుకొనుట*వలన మీరు
చారుమూర్తి! పంచమజార్జి!*చక్రవర్తి!.

**మ. రా. శ్రీ, దేవులపల్లి వెంకటశాస్త్రిగారిచే వ్రాయబడినవి.**

మ. కలితప్రాభవ చక్రవర్తి పదవిఖ్యాతుండు జార్జిప్రభుం।
డిలలో సాధుల బ్రోచుచు న్విమత సంఘంబులం ద్రుంచుచు।
న్విలసద్విశ్వమనోహరుండగుచు సద్వీర్యప్రతాపంబులం।
న్బలవచ్ఛౌర్యములన్ జెలంగుచు మహిం బాలించు నశ్రాంతమున్.

సీ. ఏరాజుపూర్వులహీనపరాక్రమం బలరారభూఖండములను నేలె
ఏప్రభుపితృమాతహితులు నౌనని మెచ్చ ధర్మమార్గంబున ధరణి
బ్రోచె। ఏమహామహుతండ్రి భూమండలంబెల్ల కరగతంబుగఁజే
సి పరిఢవిల్లె। ఏసార్వభౌముండు హితపురోహితమంత్రి సామం
తజనవర్గ సమ్మతముగ, గీ. ధరణిఁబాలించుచును దారపరగుణముల।
స్థిరత నౌదార్య సంపద్విశేషయుక్తు। డై ప్రవర్తించునట్టి జార్జిప్ర
భుండు। నాయురారోగ్యవంతుడై యలరుగాత.

**మ. రా. శ్రీ, ఆర్. వి. రాయజగపతిరాజుగారు.**

చ. ప్రవిమలకీర్తిసాంద్రయయి * భాసురలీల నవారితంబుగా
భవరిపు జార చోర జన * బాధలుదూలిచి యేకరీతిమై
జనముఘటింపకన్ జనులఁ * సామము నేలియశేషభూమితా
మవనిని కీర్తిశేషులగు * నామెమనూర కుమారవర్తముం
డవిరళచక్రవర్తి ప్రభు * డైవజార్జిని బ్రోచుదేవుడున్.

చ. వరసుగుణాలవల్లి*సుతవర్గముల భువిఁగన్నతల్లియా
పరమదయాబ్ధివెల్లి*భవబంధవిముక్త ప్రకీర్తిమల్లి*యీ
ధరఁగలభారతీయులము * దంబునఁగుక్షినిఁగన్నతల్లి*యా
సరసిజ మేరిరాణినని * శంబును దేవుడు బ్రోచుగావుతన్.

## శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారిచే వ్రాయబడినది.

శా. వేమాటల్ పనిలేదు ముఖ్యమగు మావిజ్ఞాపనంబిద్దియే
నీమూర్తిన్ గనుటావినిన్ దలచి యెంతేవింతగానున్నదా
హా! యీ హైందవ రాజ్యలక్ష్మియిదెనీ హస్తాబ్జమందుంచుచు
న్నాను న్నా! యెటులేలుకొందొ?, కోరమిన్నా జార్జి భూపాలకా.

ఉ. అంచితమౌ భవత్కమలము. నందలిజార్జి పదమ్ము వ్రాలిలోఁ
పంచముజార్జి వంచు నినువాడుక చేసినఁ జేయ నిమ్ము మ
మ్మంచితరీతి నేల వసుయం బొనరించినవాఁడ వౌటచేఁ
బాచను లోకపాలునిగ భావన సేయుదుమయ్య యెప్పుడున్.

## మ. రా. శ్రీ, ఏ. రామారావుగారిచే వ్రాయబడినది.

ప్రభువునకు నమ్రులై-ప్రజలుండ్రఁగాత
క్షమ్మపాలుఁడౌజార్జి-కాపాడుమమ్మ,
ఎల్ల తంత్రంబుల-నెల్ల కుట్రలను
మాన్పివేయును గాత మారాజు జార్జి,
దిక్కు మాకతఁడని-స్థిరము గానమ్మి
బ్రతికెదము మమ్మతఁ-డెపుడు బ్రోచుగాత.

## మ. రా. శ్రీ, అల్లమరాజు వేంకటగౌరీ రాజుగారు.

ఉ. శ్రీధరణీసతీహృదుల చిత్తసరోజవిభాకరుండు, వా
జ్ఞాధుఁడు; పాలితార్యుఁడు; ననారతసద్విభవోజ్వలుండు గో
నాధుఁడు; ధర్మరాజును బొనర్తునుగాక తమంతవానిఁ బే
మాధిక చిత్తులై గుణగణాఢ్యుని జార్జిని సార్వభౌమునిన్.

మ. చిరకాలంబును రాజ్యమేలి భువినాశీతాంశు. తారార్కము
రవిభ్రాజిత కీర్తిశాలియయి పుత్రీపుత్ర పౌత్రాదులన్
నిరతానందమనస్కుఁడౌచు శతమున్నిర్నిద్రసౌఖ్యోన్నతిన్
మెఱయుంజార్జి సార్వభౌముఁడిల శ్రీమేరీమహారాజ్ఞితోన్.

## మ. రా. శ్రీ, కొంపెల్లి సుబ్బారాయశాస్త్రిగారిచేరచితము.

సీ. పరజాతి విద్వేషభావమొందక సర్వజాతిప్రజామోదశాలియయ్యెఁ
బరమతవిధ్వంసపరతనూనక సర్వమతధర్మరక్షణమహితుఁడయ్యెఁ
బరకోశనాశన పటుతఁజూపక సర్వ కోశసంగ్రహవృద్ధి గోప్తయయ్యెఁ। బరగుణాపమానంబు పాలఁబడక సర్వ సద్గుణగ్రాహిత మ
రసుఁడయ్యె. గీ. పచ్చరిత్రుఁడు మనజార్జిచక్రవర్తి।దుష్ప్రభుత్వా
ప్తదుఃఖముల్తొలఁగ పోయె। నింకభయమంద నేల నిశ్శంకవగుమా।ర
మ్యభారతవర్ష ధరాపురంధ్రి.

సీ. అలహరిశ్చంద్రాదులైనసత్చక్రవర్తుల పతిపాలనంబులహానించి।
యాపుష్పవద్వంశ్యులైన పోడశమహారాజుఁ శాసనక్రమము నెంచి।
యఖిలలోక ఖ్యాతయైనవిక్టోరియాచక్రవర్తిని రాజసముఁదలంచి।
శాంతివిధానవిచక్షణుండైన యెడ్వర్డుసప్తము నేలఁ బడసినిమించి।
గీ. విబుధగణమెల్ల మేలనివినుతిఁజేయఁ। ధర్మపథమున భారతధర
ణినేలి।నీయశముశాశ్వతముగాఁగ నెఱపుమయ్య। సకలనుతనామ
శ్రీజార్జిసార్వభౌమ.

సీ. శ్రీపరమేష్ఠి మేరీజార్జులకుసదా శ్రేయఃపరంపరలొసఁగుఁగాత।
భారతవర్షమీభవ్యపాలనమున నాచంద్రతారార్కమమరుఁగాత।
ప్రభుపదాశ్రయులెల్లఁ బ్రజలకోర్కెలఁ దీర్ప నాబాలగోపాల
మలరుఁగాత। ప్రజలెల్లనిజరాజభక్తులైవిలసిల్ల విబుధావళీప్రభ
ల్వెలయుఁగాత. గీ. భారతోర్వరవరభోగభాగ్యయగుచు। నిం
డుమనమున ముదముతోనుండుఁగాత। నిజసనాతనధర్మంబు నెగ
డుఁగాత। యెల్లలోకంబు పరమేశు నెఱుఁగుగాత.

## మ. రా. శ్రీ, బూ. పూర్ణయ్యశర్మగారి రచితము.

సీ. ప్రజలబిడ్డలభంగి భావించిసతతంబు ప్రేమంబునూపెడు ప్రియత
ముండు। పరులకష్టముల దానరయుచునిత్యంబు సౌఖ్యముల్ గూ
ర్చెడు పరసగుణుఁడు। దుష్టులఁబోకార్చి కష్టంబులనుదీర్చి యి
ష్టంబులొసఁగుని కృప్తపరుఁడు। న్యాయసంస్థాపనా ధీయుతు
డైయొప్పి ధర్మమున్ పాలించు ధర్మశాలి. గీ. సత్యవాక్పరిపాల
నాసక్తుఁడుండు। విబుధలోకైకనుతకీర్తి విమలమూర్తి। సాధుజన
వర్తి శ్రీజార్జిచక్రవర్తి। ధరణివరలుత నాచంద్రతారకముగ.

## మ. రా. శ్రీ, కె. శ్రీనివాసరావుగారిచేవ్రాయబడినవి.

శా. నానాదేశములందునేడు కడునానందంబు లొల్కాడఁగన్।
నానాదీప మణిప్రభావళులు నానారూప భూషాదులై।
యీనాఁడిమ్ముల నీదుపూజ్యపతియౌ యీజార్జిపట్టాభిషే।
కానందాంబుధి దేలఁజుండె ధరణీయన్చున్ ధరాదేవి న।
త్యానందంబున బెండ్లికూతురుగ జేయఁజూచుటల్ రమ్యమౌ.

సీ. జనపతి పన్నీట జలకమాడకమున్నె జతికినదులచేజలకమమరె
కాంచనాంబరములు ఘనుడు గట్టకమున్నె తేజోంబరములకు దె
లివినమరె। కుసుమమాలలరాజు కొమరొప్పటకుమున్నె తరుపు
ష్పతతులెల్ల ధరణికమరె। రత్నపీఠంబు శ్రీ రాజుబొందకమున్నె
భోగీంద్రుపీఠంబు భూమికమరె॥ హేమకిరీటంబు స్వామిబొందక
మున్నె మేరుకిరీటంబు మెఱసెక్షితికి. గీ. ముత్తియంబులగొడుగు
నాభూరమణుడు। పట్టుటకుమున్నె యుత్సాహపడుచువేగ। దా
ళనారికేళాదిభూజాళియునవ ఛత్రములమైతిపన్చను జాటిచెప్పె.

క. క్షితిపతికంటెనుమున్నగ।క్షితిశృంగారించుకొనుట చిత్రమె।ధరలో
బతి తనుకరియించుటకై। సతి సింగారించుకొనుట సహజముకాదే.

ఉ. ధారుణియిట్టు జార్జివసుధాధవు పెడ్కవరింప కో
భనశ్రీరుచి నెల్లవారలకు జిత్తములన్ ముదమొప్పచేయగా।
వారనినున్ననల్గొను చవార్యపరాక్రమశాలి లీల వి।
క్టోరియ మన్మడిప్పు శుభగుండయి భూభరణార్థియైతగన్.



H. M. S. S. "Medina."

శ్రీరాజదంపతు లెక్కివచ్చిన మెడీనా నౌక.



Their Imperial Majesties Set foot in India.

శ్రీరాజదంపతులు బొంబాయి రేవులో దిగుట.

KING EMPEROR EDWARD VII.



శ్రీసప్తమరాజరాజేంద్రుడు.

QUEEN ALEXANDRA.



శ్రీఅలెగ్జాండ్రారాణి.

QUEEN EMPRESS VICTORIA.



శ్రీవిక్టోరియామహారాణి.

KING EMPEROR GEORGE V.



శ్రీపంచమజార్జిచక్రవర్తి.

QUEEN EMPRESS MARY.



శ్రీమేరీమహారాజ్ఞి.

Prince Albert Frederick.



ఆల్బర్టు ఫ్రిడరిక్ రాజకుమారుడు.

Prince George Elward.



జార్జిఎడ్వర్డు రాజకుమారుడు.

Prince of Wales.

Elward Albert.



యువరాజు ఎడ్వర్డు ఆల్బర్టు.

Prince John Charles.



జాన్ ఛార్లెసు రాజకుమారుడు.

Princess.

Victoria Alexandra Mary.



రాకుమారి

విక్టోరియా అలెగ్జాండ్రా మేరి.

Prince Henry William.



హెన్రివిలియం

రాజకుమారుడు.



H. H. Lady Hardinge హార్డింజి ప్రభ్విణి.

His Excellency Lord Hardinge of Penhurst Viceroy & Governor General of India.



హార్డింజి ప్రభువు హిందూ దేశ రాజప్రతినిధి, గవర్నరు జనరలు.

మ.రా.శ్రీ, చింతలవల్లి నరసింహశాస్త్రిగారి రచితము.

శా॥ వీరాగ్రేసరత్వత్పితామహి లసద్విక్టోరియారాణిమా
వారిన్ భారతవర్షవాసులను గాపాడంగఁదాబద్ధ సా
ల్లేరీతిందగఁ దీర్చికొందుమె న్నృలోకేశాదురాచారులన్
ఘోరాజిన్ దునుమాడిపాపెభయముంగుంఠీభవద్వైరినై

శా॥ మున్నీవిచ్చటకేగుదెంచిమదిస మ్మోదంబునిండారగాఁ
గన్నుల్ పండువుగాగ నిచ్చటిసు విఖ్యాతస్థలంబుల్ దగన్
గొన్నింటింగని పోయిలండనునభన్ గొండాడితీదేశమున్
ఎన్నంగానిదిమాకు గౌరవముగా దే మర్వమెన్నాళ్ళకున్.

మ.రా.శ్రీ, వి. రంగాచారిగారిచే వ్రాయఁబడినవి.

ఉ॥ శ్రీరమణీమణీవిభవ ♦ శ్రీరుచిమించు నురఃస్థలంబుతో
వారిజబంధుఁడున్నెలయు ♦ వాసముజేసెడి కన్నుదోయితో
వారిదమా! యనందగుచు ♦ వర్ధిలుచుండెడి మేనికాంతితో
శ్రీరమణుండు జార్జికిడు ♦ శ్రీయును దేజముఁ గీర్త్యుదారతల్॥

శ్రీ, కొప్పరపు వేంకటసుబ్బరాయ వేంకటరమణకవులు

సీ॥ పూజ్యమైన బ్రిటీషురాజ్యమం దిండియాదేశ ముత్తమమంచుఁ దెలు
పుకొలదు। మా రాజవంశంబు వారికీదేశమందే ప్రీతియనుచు బో
ధించుకొలదు। బ్రాక్పశ్చిముముల కావంతైనభేదంబు. సేయమంచు
సెలవంగఁజేయుకొలదు। సెల్లజాతిమతంబు లెలమినిగావంగ జను
లైకమత్యంబు జరుపుకొరదు॥ గీ॥ హైందవులభక్తిసంపత్తులరయు
కొలదు। లండనుపురంబునందుఁడి యిండియాదు। వచ్చినభవత్ప్ర
పాశక్తి వశమెపొగడ। చంద్రనిభమూర్తి! శ్రీజార్జిచక్రవర్తి॥

సీ॥ రవియస్తమించని భువియంతయును గల్గి ప్రతిలేని చతురంగబలము
గల్గి। యఖిలరాజుల కప్పమందుచుండుట గల్గి, పుణ్యానగారణ్యము
లను గల్గి। బహుళోహరత్నముల్ వడయుఖనుల్ గల్గి ముదము
గూర్చెడి మహానదులు గల్గి; ప్రకట ధనార్జనోపాయంబులును గల్గి
సకలయంత్ర క్రియాశక్తి గల్గి॥ గీ॥ గ్రాలుమీరాజ్య మభివృద్ధిగాం
చుగాత। మీదు శ్రీమేరిరాజ్ఞికి మాదురాట్కు। లీనుజమంగళ
ము దేవుఁడిచ్చుఁగాత। శత్రుసమవర్తి! శ్రీజార్జిచక్రవర్తి॥

సీ॥ అవ్వపెట్టినబిత్తుకడ్డుగల్గకయుండఁ దండ్రిజూపినదారి తలఁగకుండ,
కీర్తికాంతామణీ కేళిదగ్గకయుండ విజయలక్ష్మిమనంబు విఱుఁగ
కుండ। ధర్మంబు నాల్గు పాదములఁదప్పకయుండ రిపువంశమెం
దంకురింపకుండ। ప్రజలందఱును రాజభక్తిఁగొంకకయుండఁగరత
రాకించుకలోటు గలుగకుండ, గీ. నిచ్చ మేరీమహారాజ్ఞి మెచ్చు
చుండ। నుర్వినీవెల్ల గొడుగొక్క డౌనగుచుండ। నేలుకొనుమయ్య
యూళ్వరుండేలునిన్ను। సకలగుణధామ శ్రీజార్జిసార్వభౌమ.



మ॥రా॥శ్రీ, వడ్డపాటినిరంజనాహ్వాయునిచేత వ్రాయబడినది.

సీ॥ ప్రత్యక్ష పతిఁజూచి * భరతధరాదేవి యతిశయామోదత * నా
దరించె। తండ్రిని గనుగొన్న * తనయులకైవడి భారతీయులు
హర్ష * భరితులైరి। ధర్మరాజాధికో * త్తముఁడవౌట నెఱింగి
హస్తినాపురిపీఠ * మతిశయిల్లెఁ। దగిన కార్యమ్మందుఁ * దాత్ప
ర్య గరిమ సామంతరాజన్యులు * సంతసించి॥ తే॥ రహహపా
శ్చాత్యనృపులెవ్వ * రననియట్టి। హైందవక్షోణి సింహాపీ * ఠాధి
రోహణాభిషేక మహోత్సవ * మందుకొనుట। దలఁపనెంతయ్యొ
జార్జి భూ * ధరమహేంద్ర!

సీ॥ కన్నబిడ్డలకంటె * గారాముఁజూపింపఁ బ్రజలింక నీకృపా * పా
త్రులయ్య!। అడుగనేరక కోర్కు * లంతరంబునడాఁచు భారతీ
యుల సుతప్రాయులయ్య!। నీపితామహినుండి * నిరుపమసౌ
ఖ్యంబు లందుచుండుటసత్య * మౌఁగదయ్య!। నీతండ్రియతిశాంత *
నీతిచే లోకముల్ గాపాడుటనిజంబు * గాదెటయ్య!। తే॥ నీకుఁ
దాదృశ ధర్మంపు * నియతిగలదు; గాని మఱిపేఁడనజ్ఞత * యౌ
నటయ్య!। యింక వేయేల ప్రాగ్భూమి * కిటులరాఁగ। జాల
దేవేరితో శ్రీజార్జి సార్వభౌమ!.

సీ॥ ధర్మంబు నాల్గుపా * దమ్ములఁజరియించి నీశాసనప్రౌఢి * నెగ
డుఁగాత!, రాజ్యమ్ము శ్రీరామ * రాజ్యమ్మనుకరించి ప్రజలను
సంతోష * పఱచుఁగాత!, సత్యమ్ము సర్వథా * నిత్యమ్ము భరి
యించి వాగ్వృత్తిపరలక * వరలుఁగాత!, త్యాగమ్ము రిక్తుల *
భోగమ్ములలరించి సామాన్యవర్తన * చాటుఁగాత!, తే॥ నీకుఁదే
జేరికిని ధర్మ * నిత్యరాజ్య। భాగ్యభోగ్య చిరాయుష్య * భా
గ్యభూతి। పెంపగునుగాత న్యాయాభి * వృద్ధిజగతి। నింపగు
నుగాత! జార్జి మ * హీధరేంద్ర!

మ.రా.శ్రీ, మేడసీరావు విజయలక్ష్మి నృసింహవర్మగారు.

సీ॥ పంచాయుధునిమాట్కి ప్రజలనెల్లప్పుడు కంటికిఱెప్పవలెఁ గాచు
చుంట। పంచాక్షరీ మంత్రపఠనంబుకైవడి జనులపద్ధతుల పావను
లనేఁత। పంచపాండవులట్లు పాలనబలపరాక్రమ హయాగ్రహ
ణజ్ఞయుతుఁడగుట। పంచభూతగుణ ప్రపంచకల్పిత కళోదంచిత,
బుద్ధివిరించి యగుట॥ తే గీ॥ వలన మనసార్వభౌమునకలరుచుండె
నవనిపంచమజార్జి సమాఖ్యయంచు। ప్రాజ్ఞులునుతింప ఢిల్లీపుర
మున రాజ్ఞి, యుక్తుఁడగుచును పట్టాభిషిక్తుఁడయ్యె॥

సీ॥ దేవతాకోటిలో దేవదేవునికైవి రాజులయందు శ్రీరాముపగిది। గ్ర
హములలోన భాస్కరుని కైవడి నక్షత్రములందునుచంద్రునట్టు
జడనిధులందు పాల్కడలి రత్నంబునమణులలో కౌస్తుభమణీ
విధమున। అద్రులలోన హేమాద్రిపోలికను భూజములలో సుర
మహిజంబుమాడ్కి॥ తే.గీ. సకలరాజన్య కోటిలో జార్జిచక్ర
వర్తి సింహాసనస్థుఁడై వఱలుచుండె। ప్రచురతర కోహనూర్వజ్ర
ఖచితమకుట। హారిమేరీసమేతుఁడై భూరిమహిమ.

### మ.రా.శ్రీ, హోతా వెంకటకృష్ణయ్యగారు.

మ॥ బహుళోద్యన్మహితోత్సవంబులను త*త్పట్టాభిషేకోత్సవం|
బహహా యన్నవరంబునన్ జరిగె నే*త్రానంద మేపారగా,
గృహముల్వీథులు చత్వరంబులును రా*గిల్లంగ దీపావళీ,
మహిమన్ దోరణపఙ్క్తులున్ సిడములన్*బ్రొంచత్కలాపంబులన్.

మ. పగటిన్ దీనులకన్నవస్త్రములు వి*ప్రశ్రేణికిన్ దానముల్
సొగడన్ జేసియు శ్రీయము ల్గలంగ మే*రీరాణికిన్ జార్జికిన్
ఖగరాడ్వాహనుకుండు వారిపటమున్ * గ్రాలంగ నారాత్రి ది
వ్యగతి న్స్ఫూరికరోత్సవం బెసఁగ దీ*పవ్రాత తూర్యంబులన్.

సీ. అంబుజోద్భవుఁడు దీ*ర్ఘాయువొసఁగంగ నచ్యుతుం డనుకీ
ర్తి * నలరఁజేయ | శంకరుం డనిశంబు * సౌఖ్యంబు గలిగింపఁ
జంద్రుఁ డాహ్లాదంబు * సంఘటింప, సప్తాశ్వుఁ డతులతే*జస్స్ఫూ
ర్తి వెలయింప వాయువుజవము స*త్వమునిడంగ | ధర్మదేవత
పూర్ణ*ధర్మబుద్ధి నిగొల్ప దేవేంద్రు డైశ్వర్య * దీప్తిమనుప.

గీ. పంకజాలయ విపుల సం*పదలిడంగ, నలువయిల్లాలు జిహ్వపై*నా
ట్యమాడ, బ్రీతి నైదవజార్జి కౌ*రీనిగూడి, ధరణినేలుత నా
చంద్ర*తారకముగ.

### మ.రా.శ్రీ పొ. కృష్ణమూర్తిగారిచే వ్రాయబడినది.

మ. ఉరవొప్పన్నృవరాజు వేల్సునవునయ్యన్ బ్రేమనీదేశమున్ |
బరికించె న్మనుగాఢ మాహృదయపూర్వంబైన వాత్సల్యత |
స్ఫురణన్నేఁడిదె పట్టభద్రుఁడగుచు న్శోభిల్లుచున్నాఁడు మే|
లరశేభక్తిని గొల్వుఁడీరు జనులారా జార్జి సామ్రాట్టునిన్ ॥

చం. కరుణఁగలాఁడు నెల్లరసుఖంబుగ నేలఁగలట్టివాఁడు స|
ద్వరదుఁడు దారుఁడెందు దనవారనుచు న్బరవారటంచు భే|
దరచనసేయఁడింతయును దప్పఁడుపల్కినపల్కు జార్జిభూ|
సురతర సార్వభౌముఁడిదె శోభిలు భారత పట్టభద్రుఁడై॥

### ఘపుత్రరపు జగన్మోహనసంఘమువారిచే వ్రాయబడినది,

శా. శ్రీవిష్ణుండఖిల క్షమావనకళా శ్రీనిచ్చి కాపాడుతన్
శ్రీవాణీశుడు సంతతాయు రధికశ్రీనిచ్చి రక్షించుతన్
శ్రీవిశ్వేశుడు రాజరాజసదృశ శ్రీనిచ్చుచున్ బ్రోచుతన్
శ్రీవిభ్రాజిత జార్జినాయక విభున్ శ్రీమేరిదేవీయుతున్.

### మ.రా.శ్రీ మాదిరాజు మోహనరాయుడుగారిరచితము.

సీ రాజ్ఞీసమేతుడై రాజేంద్రుడేతెంచె మనభాగ్యమేమని యనగవ
చ్చు | రాజులెన్నడురాని రాజ్యంబునకువచ్చె మనభాగ్యమేమని
యనగవచ్చు | నేత్రోత్సవంబుగా నిపుడురాజనుఁగాచు మనభా
గ్యమేమనియనగవచ్చు | మనరాణి మేరిని ఘనముగా దర్శించు
మనభాగ్య మేమనియనగవచ్చు. గీ కృష్ణుడలనాడు నిలమీద
కృపయొనర్చి పాదరేఖలు పుడమిని బడగనడిచె | నట్లనేయిండి
యాపైననడచుజార్జి పాదరేఖల భూదేవి భ్రమసిమెచ్చె.

### మ.రా.శ్రీ, కల్లూరి వెంకట్రామశాస్త్రిగారు.

చ. అవనికి మిత్రుఁడెడ్వరుడు నస్తమిలింగనఁ గాఁజనోనవో
భవతి" యటన్న వేదపరిపాటిని జార్జియుఁ జక్రవర్తితన్
వ్యవధిని బొంది శూరకరసంగ్రహుడై ప్రతి పక్షలోకశాం
కవిధమునం జెలంగ మనుకన్నుల నద్దిభజింపఁ గాఁదగున్.

శా. శ్రీవిష్ణు ప్రతిబింబమై తనరుజార్జిన్ సర్వసర్వంసహా
దేవీసంగ్రహణాభిషేకమున ధాత్రీసాధులేతెంచి సం
సేవంగాంచి సరోజల ప్రతిభలన్ మిత్రున్ సమీపించు రా
జీవంబుల్ బలెలక్ష్మికిన్ నెలవులై చెన్నొందఁ జూడన్ దగున్

ఉ. దూరమునుండి జార్జిగుణధుర్యుడు కూర్మిని గన్నఁజేరు; మే
రీరమణీమణిన్ క్షణముఁ బ్రేమను వీడకయుండుఁ; దన్మనో
హారిణులైన మీయిరువురందలి యంతరమెంచఁజాలరె
వ్వారలు గొప్పరా చెపుమ ! భారతవర్ష వసుంధరామణీ.

శా. శ్రీజార్జిధ్రువసార్వభౌమ! కరుణాసింధూ ! విధింబాయక
వ్యాజప్రేమఁ బితామహీమణి యొనర్పంజాలె రాజ్యంబు ము
న్నోజన్మాలియుఁ దండ్రిమిత్రతను సుద్యోగించి భాసిల్లె నా
యాజాడన్ ద్విజరాజసంస్ఫురణ దీర్ఘాయుండవై యేలుతన్.

మ. రవి యెందాఁక దివిన్ గ్రహావళిపయిన్ రాజ్యంబుచెల్లించునో
యవదాతాంశుఁడు తారకాదయితుఁడై యానందమున్ జెందునో
ధ్రువుఁడున్ సప్తఋషీంద్రమండలిపయిన్ రూఢస్థితిన్ బొందునో
యవనీదేవత సాఁగిలేయ విభుసే యందాఁకఁ బాలించుతన్.

### మ.రా.శ్రీ, అక్కిరాజుఉమాకాంతంగారిచేవ్రాయబడినవి.

ఉ॥ ఎంతదయారసంబు! దమ మెంత! క్షమా గుణమెంత! వైభవం
బెంత! ఘనత్వమెంత! బలమెంత! ప్రజాప్రియభావమెంత! తే
జెంత! వివేకమెంత! యశమెంత! విధాన విలాసమెంత! యి
ట్లింతటివాఁడు రాజగుట హైందవజాతి యదృష్టమద్దిరా!

శా॥ తెల్లంబయ్యె భవత్పురాకృతతపో ధిక్యంబునంజేసి నీ
హృల్లీలా వశవర్తియై సుగుణహారీణుండవై యేలిరం
జిల్లంజేసెదు త్వత్ప్రియోత్తముఁడు వచ్చెంధర్మరాజిప్పుడో
డిల్లీపట్టణమా! కనుంగొనుము సంశీభూతమోదంబునన్॥

సీ॥ నీతండ్రియొద్దను బ్రీతి నేలెడునా డు విచ్చేసిచూచినవిధము సాక్షి
చూచిపెద్దలస్త్రీల సురుచిరచిత్రత వ్రాసుచ్చిపోయిన వ్వరము
సాక్షి | పోయియింగ్లాండులో భోజనోత్సవవేళ ఘనముగూర్చి ప
ల్కినమాట సాక్షి | పల్కి భారతవర్ష పట్టంబువ్వయముగాఁ గొ
నుటకుఁగోరిన కోర్కి సాక్షి | గీ॥ కోరియాపైనివచ్చుట గొప్ప సా
క్షి | సాక్ష్యమింకేలమామీఁది యతులదయకుఁ గృత్తదీ సార్తి! ద
శదిశో ద్వ్యాప్తకీర్తి! | సత్యగుణమూర్తి! శ్రీజార్జి చక్రవర్తి! ॥

## మ.రా.శ్రీ, శాంతలూరి శోభనాద్రాచార్యులుగారు.

సీ. అతిదూరదేశమునకు నేల జననిసుంతయు మదిలోన జింతగొనక
మనపూర్వులరుగనిమార్గంబునను నిప్పడరుగు టెట్లనుసందియంబు లేక
పథమధ్యమునంబునబడిన యాయాసము లెంతయుమదిలోన లెక్కగొనక
పెందటినుండి ప్రయాణమునకుబూనినపూన్కి నితరులమాట
లన్నడడ నిడక, గీ. హిందువులమీదిదయ మదియందునిలిపి, యరు
గుదెంచిన శ్రీజార్జి యవనిపతికి, నాయురైశ్వర్యముల గూర్పుమ
నుచు హరిని, వేడుడందరు మదిలోన వేడ్కలూఱ.

సీ. ఈరాజుపాలన నెల్లరు సుఖముగా నధికసంపదలచే నలరునట్లు,
పుడమిసస్యములచేబూర్ణమైజనసంఘులంబును నై యెప్పుడమరునట్లు,
నఖిలజనంబులు నన్యోన్యహితకార్యకార్యులై తేజంబుగాంచునట్లు
నీచక్రవర్తిదానింతియు బుత్రపౌత్రాయురారోగ్యము లందునట్లు,
గీ. దుర్జనాధిక్యమెల్లను ద్రుంగునట్లు, నందఱికినిదనయందునవధికభక్తి
నాటునట్లును జగదేకనాయకుండు, బ్రోచుగావుతదయబరిపూర్ణుడగుచు.

## మ.రా.శ్రీ, ఈశ్వర సత్యనారాయణశర్మగారిచేరచితము.

సీ. నిత్యంబుజపతపోనిష్ఠ ఛాందసులైన బాపనయ్యలచేతఁ బట్టువడక
అత్యుగ్రతామసాహంకరులై చన్న రాజాధములచేత రాపువడక
హల్లొంబల్లోయనునట్టి కిరాతముఖ్యుల హస్తములఁజిక్కికొల్లబడక
పక్కానిషాబాజిభక్కినివ్వనులైనక ఱకుతుఱకలచేతనిఱుకుబడక
గీ. మాయదృష్టవశమ్మున మహితధర్మ,
సంపదఁజెలంగు నాంగ్లేయ సార్వభౌము,
పాలనంజిక్కినావంతె చాలుతల్లి,
ధీయుతాత్మజ తతిపూత? దేశమాత?.

సీ. శ్రీజార్జిపట్టాభిషేకోత్సవంబంచుఁబొచ్చెమందని వేడ్కముప్పతించి
ప్రభుభక్తిసూచక బహుధర్మకార్యముల్ ప్రేమమీఱఁగ నునీపేరసల్పి
వెలలేని మీదంపతుల చిత్రపటముల నెనకేనిబత్తి నూరేగఁజేసి
జయజయాశీర్వాదశబ్దంబుతోడనె కరతాళములను ఖేచరులఁబిలిచి
గీ. భారతీయులు మోదసంభరితులగుదు
రీది "ఎంబరు సంగ్రెంట" నిదియనుమ్మ
ప్రజలహృత్క్షేత్రముల ననురాగబీజ
తతిని నాటఁగఁదగు మహూర్తమునరేంద్ర.

## మ.రా.శ్రీ, భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు.

ఉ. పంచమజార్జిభూవరుఁడు భారతఖండపురీవరంబునన్
బ్రాంచదమూల్యరత్నచయ ధర్మసముజ్జ్వల సింహపీఠికో
దంచితమూర్తియై సకలధాత్రిని ధర్మనిరూఢినేలఁగా
సంచితపుణ్యసంచయము సార్థకమయ్యెను భారతక్షితిన్.

సీ. రాజసూయ మహాధ్వరంబునఁ గౌంతేయపూర్వజావిభవంబు పొం
దుగలోర్చి సాకేతపురసముజ్వలరామసామ్రాజ్య విభవానుకరణం
బు విశదపరిచి, సత్యహరిశ్చంద్ర సకలభూమండల స్వామిత్వ
సంపదనొరుదాల్చి, భువనత్రయోద్దామ భూతివహించి నసురరా
ట్ప్రభుత్వంబు పొంపుపొంది, గీ. భరతఖండెక్షమాధీశపాలిగొ
లువ, ఢిల్లిపురభద్రపీఠాన కీవిసుందు, జార్జిభూపాలమౌళికి సతికి
నెపుడు, నాయురారోగ్యసంపద్బలబ్బుగాక.

## మ.రా.శ్రీ, అడిదము రామారావుగారిచే రచితము.

సీ. ధర్మప్రవృత్తితోధరణి పాలించుచు వరలునీయాంగ్లేయ దొరతనంబె
సర్వమతమ్ముల సమదృష్టిజూచుచు వరలునీయాంగ్లేయదొరతనంబె
జనసమ్మతముదెల్పు సభలసాయము గొంచు వరలునీయాంగ్లేయదొరతనం
బె భారతక్షితినంత పాలనసేయుచు వరలునీయాంగ్లేయ దొరతనంబె
గీ. ప్రజలకష్టంబులనుబాపి ప్రబలసుఖము
నెరపునయ్యది యాంగ్లేయ దొరతనంబె
యిట్టియాంగ్లేయదొరతనంబేలుగాత
భారతక్షితి నాచంద్రతారకముగ.

సీ. ప్రజలెల్ల సుఖముగా బ్రతుకగల్గుదురేని బలముగాంచును మాను
పాలనంబు, ప్రజలెల్ల సంతుష్టిబ్రబలు మమనిరేని స్థిరతఁగాంచును
మాదుదొరతనంబు, ప్రజలెల్లవిశ్వాసభావంబు నెరపిన బడెడుమా
శ్రమకు దెప్రతిఫలంబు, సంకల్పములన్నల్ల చక్కగ నెరవేర్ప దైవ
పుతమాకుఁ దగినబలము. గీ. అనుచుఁజెప్పెను విక్టోరియాంబమున్ను,
"అట్లెచేతును నేను" అని యభయమిడితి, నిండియానందు ప్రజలకు
నిండుకృపను, రాజదేవేంద్ర శ్రీజార్జిరాజచంద్ర.

## మ.రా.శ్రీ, మ.హా.శ్రీ.పా. కొ. వేంకటరత్నశర్మగారు.

బంగారు. పంచాననుండైన పరమేశ్వరుండు నిజసాటి బంచమజా
ర్జిచక్రవర్తి * సార్వవర్తి, పంచాస్యరథప్రోచుఁబంచాస్యపీఠధ్వజ
యుతుబంచమజార్జిచక్రవర్తి శౌర్యమూర్తి, పంచాయుధుఁడుశ్రీహ
రిభగవంతుఁడేలెడు శాంతుఁబంచమజార్జి చక్రవర్తి సత్వమూర్తి,
పంచమరమమేరిప్రహ్లాదమునగంగఁజల్పుఁ బంచమజార్జి చక్రవర్తి
చక్రవర్తి. విధిచిరంజీవిజేయుత విశ్వవినుతు విజయహితుఁ,
సర్వభాషాసమాదరుఁజలుపుఁగాత శారదయుఁ.

*మే—౫పంచమ—౫ + ౫=౧౫—అతురాభ్యాసముచేత, ౧౫=రమ, అంకన్యాసముచేత ౧౫=మేరి, అనియగును. రమ=లక్ష్మి, మేరి=చక్రవర్తిని.

ప్రణవమవుక్రౌసునందోఁచు పరమయోగి వరగురుండు
ఘనుడుజ్ఞాని యేసుక్రీస్తుగాచు నిన్నుత్మ్మపాహేంద్ర.
౧=అ౩=ఉ అ ఇ ఉ ఋస్వాత్రము చేత,
౫=ము పాణిపంచక పరిభాషచేత, ౭=ఓ ఏ ఓ. ఋస్వాత్రముచేత,
౯=౦ఓం=ప్రణవము. అకారోకార మకారనాద బింద్వా
త్మక పంచాంగ మోంకారము ప్రణవము.

## మ.రా.శ్రీ, గాదె శ్రీజగన్నాథస్వామిగారిచేవ్రాయబడినవి.

ఉ॥ గోవులవంటి హిందువుల*కీజదగ గోపులవంటి హూణులన్
దైవముగూర్చిపెట్టినక*లంబున మీరిక మాసుఖంబుకై

యేవగనైనఁ జూడవలె * నెందులకన్నను మేతపుష్టిగా
గోవులకున్నఁగాదె మఱి * గోవులభాగ్యము వృద్ధిఁజెందుటల్.

చం. ప్రజఁ బ్రజవోలెఁజూచుకొని * పాలనచేయుట ధర్మమంచు మీ
స్వజనముపార్లమెంటు పభ * వారికి నచ్చఁగఁజెప్పి . భారత
ప్రజకతిబాధకంబయిన * పన్నులఁజట్టములం దొలంచి శి
ష్టజనులు మెచ్చఁ బాలనము * సల్పగడంగుఁడు జార్జిభూవరా.

ఉ. మున్నొకసారి మావిషయ * ముఁదిలకించి స్వకీయశక్తి యా
పన్నులు భారతప్రజల * పాలనకున్ దగుకీలు ప్రేమ యం
చెన్నఁగ గిల్డుహాలుసభ * నేర్పడఁ జెప్పితిరిప్డునాటి మా
టన్న డుపంగ వీలొగిఁద * టస్థపడెంజుడిమీరు భూవరా.

ఉ. రాజట దోషవర్తి దిశ * రాజట యుగ్రకరుండు దేవతా
రాజట భార్తృహంతనగ * రాజట గుప్తసువర్ణుఁ డంబికా
రాజట భిక్షుసుండు ఫణి * రాజట చూడన నేకజిహ్వుఁ డా
రాజుల జాడఁబోకప్రజ * రంజిలఁ బాలనచేయుఁడీనృపా.

**మ. రా. శ్రీ, బాలకవి వేంకటరమణాచార్యులుగారు**

సీ॥ మునుసర్వరాజాది పుణ్యభూపులనెల్ల నలరించుఢిల్లి సింహాసనంబ!
పృథ్వీపునారాజవీరుని మిక్కిలియలరించు ఢిల్లిసింహాసనంబ!
విపులమానసులగు జేబరక్బరులతో. నలరిన ఢిల్లిసింహాసనంబ!
చిరకాలముగ రాజవిరహితమైయుంటి వమలంపుఢిల్లిసింహాసనంబ!
తే.గీ॥ వీరలందరికంటెను గౌరవంబు,
దాల్చి వీరుడై, పుణ్యుడై దయగలాఁడు
నిన్ను నాదరించెనుగూర్మి నేడు సుదిన
మయ్యెధన్యవౌ ఢిల్లిసింహాసనంబ.

**మ. రా. శ్రీ, బి. పట్టాభిరామశర్మగారిచే వ్రాయబడినది.**

సీ. ఇంగ్లాండు నీమపే * రెవనన్న మాత్యాల, హారంబునవు దాల్చి * యైరహించ। గానడాసౌత్రాఫ్రి * కాలు బాహువ్వయి, గేయూర యుగమణి * శ్రీయమర్చ। నాస్ట్రేలియానిలో * నంతరీపంబులు, కంకణంబులరీతి గారవించ। సింగపూరు మలాక * హాంగాకా గియా నాది, రాజ్యముల్ రత్నాభ * రణతగాంచ. గీ. నెగడునీకు గిరీట మా * ణిక్యముగుచు, భరతవర్షం బుదంచిత * ప్రభదనర్చు। జోక తో ప్రీతిపాత్రంబు * గాకయున్నె, జారుకీర్తి పంచమజార్జి చక్రవర్తి.

మ॥ చతురంభోధిపరీత భూవలయమున్ * శాసించెనీయవ్వ, య
ప్రతిమానక్రియ సర్వరంజనముగా * బాలించె నీతండ్రి వా
క్చతురోపాయత నిండియా జనుల సో * త్సాహక్రియాదృష్టి నూ
ర్జిత మొప్పారగ నెట్టులేలెదవో జా * ర్జీరాజకంఠీరవా.

సీ. మగశిరశరీరంబు * గగమాక్రమించిన, కొండలరాయని * కూఁతు కంటె, పతితోమ్మమైనెక్కి * వసియించుచుండిన, దిట్టయౌము న్నీటి * పట్టికంటె, ధవుని మోమున కాళ్వ * తంబుగానిలిచిన, పలుకులచెలియను * పడఁతికంటె, ధర్తనె త్తినునికి * పట్టుగాఁజేకొన్న, బోటులమేటిమి * న్నటికంటె. గీ. కాంతునివ్వాదంత రమును సౌ * ధాంతరమున * వతమువిడియక నీవెగ * పతివ్రతవు సూడ, భువనరుహపాణి! వాగ్వాణి! పుణ్యవరణి! భూరిగుణమణి! శ్రీందాణి! మేరిరాణి!.

సీ. ఆమోదమునఁజంద * నావనీజమెగాని, ఫణివంవృతంబౌట * వాసిగనదు, అందంబునందుహి * మాంశుబింబమెగాని, మధ్యనల్పుంటప * మాఖ్యగనదు, గంభీరమునశూర * కంధియేయగుఁగాని, తూరాంబువౌట * యశంబుగనదు, మృదులవైఖరియందు * మేటితమ్మియెగాని, కలుషకడౌటన * ఖ్యాతిగనదు. గీ. గానిమీరాజ్యలక్ష్మికిఁ * గానఁబడదు, స్థిరవిభవయశములలోటుదివ్యమూర్తి! గళితచిత్తార్తి! నిఖిలది * గంతకీర్తి! విక్రమస్ఫూర్తి! శ్రీజార్జిచక్రవర్తి.

**మ. రా. శ్రీ, కోరంకి కుప్పుస్వామిఅయ్యరు బి. ఎ. గారు.**

క. కృపయును జిత్తైకాగ్రత * విపులమనోబలము శౌర్యవితతులస్థైర్యం బపమితసౌర్యలక్ష్మియుఁ * గపటవిహీనతయునతనిపుణసుగుణంబుల్.

మ. పరఁగన్ గాంచితినిండియాయనెడు భూభాగంబుయూరోపుతో
పరియాకొండొకఖండ మంచుఁ గడువిస్తారంబునన్ దత్ప్రజల్
పారయన్ దంబము లేనిజీవనము నోర్పున్ దైవనిర్వాహమున్
స్థిరమానిస్తులరాజభక్తియును నేఁడెల్లంబుగాఁ జూచితిన్.

చ. బలిమి బ్రిటిష్షుధర్మపాలనపంగతి నిండునమ్మికన్
గలిగెడువారు వారికిఁ దగన్ మతికొంత దయానుకూలమా
వలను గ్రహించి యింకమునవారు చరించిన నిండియాకడున్
సులభముగాఁగ నేలుటకుఁ జో టగునంచుఁ దలంతు నెమ్మియిన్.

శా. శామామండన మేరి నామకమహారాజ్ఞీ సమేతంబుగాఁ
శ్రీమోదంచితవాక్సుధారస మపారిన్ వెల్లిపొడ్వన్ బ్రజా
క్షేమంబున్ మదిఁగోరి భూరిదయఁ గోర్కుల్ వేగవీడేర్ప మా
సీమం ద్రొక్కుడుమీరు స్వాగత మహో! శ్రీజార్జిరాజోత్తమా.

కవిరాజవిరాజితము.

నవమణిభూషణమండిత సజ్జనసాయకకోటి సమావృతుఁడౌ
దివి నుడుసంతతి మధ్యసుధానిధిదీధితి జార్జిమహీపతి గా
రవమున రాణి సతీమణి మేరియు రత్నకిరీటవిరాజితులై
భువిని సభాస్థలి నొప్పుదు రల్లదె పోలికదెచ్చు మహేంద్రసభన్.

సుగంధివృత్తము.

భూరిధర్మరాజ్య భారభోగభాగ్యవంతుఁడై
సారనీతినేలుగాత జాతివర్ణభేదముల్
పేరులేక ధర్మమున్ సుభిక్ష మొప్పమెప్పగాఁ
జారుకీర్తి మేరితోడ జార్జిచక్రవర్తియున్.

**మ. రా. శ్రీ, డి. రాజశేఖరము,**

**హెచ్. సుబ్బారావు గార్లచే రచితము.**

సీ॥ జననుతంబగునిత్య సత్యవ్రతంబునన్, సలిపె హరిశ్చంద్ర చక్రవర్తి జనులనాకన్న తనయులవలెగాచె, సదయుండు శ్రీనళ సార్వభౌమ। డిలనెల్ల సాధుల కేబాధలేకుండ, రక్షించె శ్రీరఘురా

మమూర్తి। శాంతాత్ముఁడై చాల సద్గుణుండయి యజా, తవిరో
ధియనఁనొప్పె ధర్మరాజా. తే॥ గీ॥ వారలొక్కొక్కరికిగల వర
గుణముల। నన్నిటిని నజాఁడొక్కనియందెచూడ। గోరి సృష్టిచేసి
న మహాధీరుఁడనగ। చాలయలరారు శ్రీజార్జి చక్రవర్తి.

సీ॥ చెలువారనలతీవి యల మొత్తములనుండి యల్లిబిల్లిగబాఱు నల
రులందు। తెలితెలి రాలపై జిలిబిలిగాబాఱు సెలయేటిబారుల
కెలసలందు।సుపవనంబులలోని కపురంపుటనటుల చాయలపైశ
తస్థలములందు। సూర్యరశ్మినొకింత జొరనీక మేలి తావులవెద
జల్లు పూపొదలయందు. తే గీ. చాలవిహరించుచును మేరిసతిని
గూడి। సంతతంబును మా జార్జి చక్రవర్తి। యిండియాలోన నిల
చినమ్మెలెనేని భువిని। గల్గుదు రేమమ్ము బోలుప్రజలు.

మ.రా.శ్రీ, కసుమర్తి నారాయణరావుగారిచే వ్రాయబడినవి.

ఉ. ఎట్టితపంబులన్ వ్రతము లెట్టిజపంబులఁ జేసినారలో।
పట్టుగ భారతాత్మజులు పంచమజార్జి చక్రవర్తియో।
నట్టులఁగాకయున్న బల ధైర్యవివేక.ధనాభిరామ స।
మ్రాట్టు ఘటిల్లులెట్టులనమానుష సిద్ధమెగా? దలంపఁగన్.

ఉ. వానిదె! జన్మసార్థకము*వానిదె? భాగ్యఫలంబు పుణ్యమున్।
వానిదె? రాజ్యసంపదయు*వానిదె? పో సకలార్థసిద్ధియౌ।
వ్వానికి మేరిరాణియుత*పంచమజార్జి చక్రవర్తిది
వ్యాననపంకజంబు గను*భాగ్యముగల్గును డిల్లిలోపలన్.

మ.రా.శ్రీ, వేరేపూప సత్యనారాయణంగారి రచితము.

శ్లో॥ మేరీప్రాణవిభో? కిమస్తి భవతే ప్రాశాస్యమన్యన్మయా
రాజ్యంతే త్విత్విలిచేద్వ్యృథాభవతి యస్మాన్మండలా ధీశ్వరః
పుత్రాన్సంత్వితి చేద్వృథైవ భవతో యస్మాత్సుపుత్రీభవాన్
దీర్ఘాయుర్భవ సర్వథేతిచ వృథావిష్ణ్వంశజాతో యతః.

శ్లో॥ ఆచంద్రార్కమయింజనో నిరవధి ప్రీతిర్భజంతం ప్రభో
భూచక్రం పరిపాలితుంనయవిదం నిష్కంటకం యాచతే
యాచ్నాజార్జి నృపాలసద్గుణఖనేః త్వాంనిష్ఫలానాభవ
ద్భూపాయాచితవస్తుదాన నిరతాస్సర్వే ప్రమాణంనను,

మ.రా.శ్రీ, అ. శేషగిరిరావుగారిచే రచియింపబడినవి.

సీ. సౌజన్యమేమీదు సహజంబనెడుమాట, సాధ మీయాగమనంబె
సాక్షి, జాతివైషమ్యంబు, సైపకీవనుటకు, స్థిరమైన సజ్జనాదర
మె సాక్షి, విద్వాంసులను గారవించెదీవనుటకు, సతతభాషా పరి
జ్ఞతయె సాక్షి, సర్వసమతము మీసహజ సద్గుణమన, సకలజాతు
లకలయికయె సాక్షి, గీ. యట్టిమీగుణరాజినే మరయగలమె,
సకృప్పాస్వాంత శ్రీజార్జి సార్వభౌమ. హస్తిపురభద్రపీఠమావధి
వసింప జూడగా హైందవులకిదే శుభదినంబు.

సీ. భారతవర్షమే పారసస్యసమృద్ధయై రత్నగర్భయై యలరుగాక,
ప్రజలవర్ణాశ్రమ ప్రాజ్ఞతనిజధర్మ పరతసద్వర్తన ప్రబలుగాక,
హైందవుల్ వాణిజ్య, వ్యాపారఫలమున, చిరసుఖమనుభవించె
దరుగాక, నైజామురాజన్యభూనాథుండు రారాజు చేఘనమాన్యత
చెందుగాక. సాధురక్షక శ్రీజార్జి చక్రవర్తి, యాయురైశ్వర్యవృ
ద్ధితో నవని నేలి జనుల పుత్రులవలె సదామనుచుగాక దేశమెల్ల
సుఖావాప్తి నేలుగాక.

మ.రా.శ్రీ, వఝ్ఝుల వెంకటసత్యేశముగారిచే రచితము.

చ పతిధనవంతుఁడన్ ప్రభుడు * భాసురకీర్తియు యూజ్యుడైన త
త్సతిసుకృతంపుపంటలవి * ధారుణిగావున నింకనీకు భా
రతి గనలోపమేమియగు * రాజవరుండగు జార్జిసద్వరుం
డతిదయ హస్తినాపురిని * హావిభవంబున నిర్వహించుటన్.

చ. వెనిమిటిజార్జియందుగడు * ప్రేమవహించి సమస్తలక్ష్మలం
గనిగని వైగొనంబులకు * గౌరవమొందుచు తోటిమేదినీ
వనితలకన్న వన్నెయును * వాసియు హెచ్చగ దైవభక్తిమై
ఘనతవహించి శాశ్వతసు*ఖంబును బొందుము భారతావనీ.

శా. మేరీదేవినిగూడి జార్జిపతినీమీదన్ గడున్ మక్కువన్.
సారాచారపరాయణుండయి మహాసామ్రాజ్యసౌఖ్యంబులన్
ధీరోదారుడుగాంచుచున్ విశదకీర్తిన్నిన్ను బాలించుతన్
తారాసూరసుధాంశులుండు దనుకన్ తాత్పర్యసంయుక్తుడై.

ఉ. ఐదవజార్జి యేడిదగొ * హస్తిపురంబునకేగుదెంచి నీ
మీదనుగల్గుమక్కువను * మిక్కిలిజూపుచు సింహపీఠిపై
సాదరమొప్పఁగూర్చొని మ*హావిభవంబున నిర్వహించునో
మేదిని నీయదృష్టమిది * మేరికి నీవుసపత్నివద్దిరా.

మ.రా.శ్రీ ము. నరసింహదాసుగారి రచితము.

సీ. వినియుండమేమున్న జనపతులెందరో, యీధరాచక్రంబు, నేలి
రనుచు, నెవ్వరినాడైన నీప్రకారంబుగ, ప్రజలకునిర్భయత్వమ్ము
గలదె, యీవస్తునిర్మాణ మిట్టియంత్రపుపనుల్, పొందారెనెపు
డైనబుట్టబడెనె, యింతయేలనులోక, మీహణాశకము నందల్లై
న్నడైనసౌఖ్యమ్మువడెనె. గీ. ఇట్టిప్రభువంశమునబుట్టి యిపుడుపట్ట
భద్రుడై రాజ్యమేలఁగ బరగుజార్జి, చక్రవర్తికి ధర్మరక్షణము
నందు, దండితోడయి కృపదేవుడుండుగాత.

సీ. ఇండియాయను వ్యోమమండలంబునరోహి, ణీందుఁటట్లుగ వెల్గుచుం
డురెవరో, అనుమతితో నెల్ల జనులకుతగినవృ, త్తులఁజెప్పి పోషిం
పదలతు రెవరో, విద్యలన్నియుఁబ్రజల్ విపులముగా నేర్వ భాతి
మీరగనాజ్ఞజేతు రెవరో, న్యాయమార్గమునరా, జ్యఘుపనుల్నడు
పుట, కెంతొమోదమున వర్తింతు రెవరో. గీ. కనకమాణిక్యముల
రీతి గలసిరెవరో, పాటిగాదేవుడా వధూవరులు వేఁటి, జాణలౌ
మేరిరాణిని జార్జిచక్రవర్తినిం బ్రోచుగాత ।ఒల్ కీర్తదనర.

మ.రా.శ్రీ చెన్నుభొట్ల నారాయణయ్యగారిచే రచితము.

సీ. శీలుడై కరుణాలవాలుఁడై సద్గుణజాలుడై యరుఁదుగాఁడయ్యె,
శాంతుడైవిమలసుస్వాంతుడై పండితాక్రాంతుడై ప్రియపతీకాంతుడ
య్యె,రాముడై బుధజనస్తోముడై మంగళనాముడై కుమతిదుర్దాముడయ్యె
సారుడైసంతతోదారుడై సురుచిరాకారుడై వనధిగంభీరుడయ్యె.

గీ. పట్టినృపచంద్రు డెడ్వరు [illegible]గపుత్రుఁ
మేరునగధైర్య భూపతిమేదవర్య
చారుతరమూర్తి శ్రీజార్జిచక్రవర్తి
నీశ్వరుడు సత్కరుణ నేలుఁగాత.

## మ.రా.శ్రీ, కొండూరి నరసింహశాస్త్రిగారి విరచితము.

ఉ. అంచితరీతి మానవులనందర నొక్కటఁ బ్రోచుదేవుఁ డే
వంచనలేక హైందవులఁ బాలనసేయఁగ బద్ధదీక్షుఁడై
మించెడు జార్జిచక్రవుని మేకొని బ్రోవుత నమ్మహామహుం
డంచితరీతి హిందువుల నారసిగావ చిరాయుగావుతన్.

## మ.రా.శ్రీ, సత్యవోలు కామేశ్వరరావుగారు.

సీ. వైభవోన్నతిశాలి వైభవోన్నత కృపాపాంగతను మేలుపడయు
మయ్య, యాసురగురుఁగేరి యాసురగురుమీఱివరనీతి ధీరీతి నెరపు
మయ్య, యలరమాయుక్తి పెంపలర మాయుక్తి పెంపరని యేలు
చు ముదంబరపుమయ్య, రుచి మీరుమీరుమీరు చిరాత్మజాయులెల్ల
రు చిరాయువులరై వఱలుఁడయ్య. తే గీ, మమ్మునిరతమ్ము మిగు
లనేమమ్ముతోడ నెనయొచటలేని సుఖములు నెనయఁజేసి, యనయ
ములనెల్లఁ దొలఁగించి యనయమీవె పాలనమొనర్పుమయ్య, భూ
పాలవర్య.

సీ. అరుదెంతు ఢిల్లినానమృతమై ప్రవహించె నిండియాసిండియా హి
తనువార్త, తనరె బొంబయిఁ జేరి తనునుదంతమదెంతో సర్వమై
సర్వమై పరవశంబు, చెలఁగిరెల్లరు దేశములఘుసౌఖ్యము లీనుగేల
గానేలఁ గాజాలెదనుచు, పాడిరింతులు కృతుల్ బలుతేనె సోనల
నింపుగా నింపుగానంపురుచుల. తే గీ. నహహ! నీయొప్పె వినవొ
ప్పెసహారహంబు జార్జిభూనేత! కల్పభూజాదికాతోరహ, వరయ
శముకొంచెమనిపించి వరలుదాత! పొసఁగ నీకుఁ జిరాయువింపొ
సఁగుఁగాత.

## మ.రా.శ్రీ, హరినాగభూషణం బి. ఏ, గారు.

ఉ. ఈదినమెంతయోసుదిన * మేమనిచెప్పదు భారత ప్రజా
మోదము జార్జిప్రభుస * మున్నతపట్టవిశేష రమ్యత
న్మేదుర భాగ్యశేముషులు * మించు వరంబులు మాకుఁగల్గుటన్
లేదనఁగల్గునేనరుఁడు * లేఁగొమరుల్మదిఁ గోరుభాగ్యముల్.

చ॥ జనవిభుఁడిష్ట ఢిల్లిపురిఁ * జాతురియొప్పఁగఁ బట్టభద్రుఁడై
జనులమనంబులంగలుగు * జాడ్యములన్నియుఁ దోలశత్రువ
ర్గనమనిచెప్పనొప్పఁగుప * రప్రమదాంతక మీవిరోధికృ
త్తనినుడువందగుంబితృప * మంచితుఁజేరునె శత్రువర్గముల్॥

ఉ॥ భారతభూమిశోభఁ గాఁడమి * పార్థివకోటి కిరీటమాళియై
ధీరతఁగన్న కోహినురు * దేశనివాసము వాసియొన్నొ యేం
డ్లైరహిమించి మాతృభువ * నాంకముఁజెందఁగఁ బొందువారమెం
తేరతిఁ గోమలాంగి తని * యింపడెబంధులఁ బుట్టినింటిలో॥

చ॥ అతులమతంబులొక్కపర * మార్థమె గుత్తి తెగించునంచుఁ దా
నతతవిరాగియై తనదు * ఛాత్రులజ్ఞాన విశాలతేజులన్
బ్రతతదిగంతజాతులవి * వర్ధనకంపెడు రామకృష్ణులన్
యతనఁపుఁబోడుముల్ గలుగు * నార్యవసుస్థలి నీవు మాన్యమా.

శా॥ వేదాంతానుభవజ్ఞుఁడై సదమలా * విర్భావుఁడౌ రామకృ
ష్ణోదారన్ భజియించి జ్ఞానవివశుం * డుద్భూతమేధావి వి
ద్యావ్యోత్సాహనవాఙ్ఘరీపరిగాతి * ప్రాగల్భ్యుఁడై మేదినీ
మోదంబందు వివేకానందుసహాజ * సుశ్లాఘ్యజనుల్ ప్రేమనన్.

మ. అనయంబాత్మవిచారమున్వెలిపి బ్ర * హ్మానందసౌఖ్యోన్నతి
న్గనియాతత్వము దేశదేశములకు * న్గాంక్షించి చాటించి దే
శనికాయంబులప్రేమనొందనొదవెన్ * సామ్రాజ్యమీయార్యమే
దినికాదేశము చక్రవర్తివగునీ * దేసమ్ముపాలింపఁగన్.

శా॥ సారంబెంచఁగ నాత్మయొక్కఁడనుచున్ * స్వాతంత్ర్యపుంజంబటం
చారూఢిన్ మునిపుంగవుల్ బలికియా * త్మానందముం బొంది రా
ఢాగార్కంబుగ నార్యభూమినివ్వతం * త్రంబె ప్రజాజీవితో
త్సాహంబంచుఁ దరించె గ్లాడ్స్టనుయఁ నీ * సామ్యంబు వీక్షించుమా.

ఉ. భారతరాజ్యభారవహ * భాసురకీర్తివిహాస్తినాపురీ
యారమణీయసంపదల * నంతమునింకొకసారిఁ బొందఁగన్
గారణమాయెనీదినము * కాంతభువీశ్వర పట్టభద్రతన్
దోరఁపుభాగ్యమబ్బుటను * దుల్యమెనీకెదియేని మేదినిన్.

చ. భువనములేడునుందనను * భోజ్జధరించి వరించి, సాటియౌ
యువవిధానమేర్పడఁగ * నన్నిటిఁ బ్రోచుచు బిడ్డలం గృపా
వనము వీచుదైవమిల * భాసురకీర్తి నెలంగఁ దాదృశాం
శవరజనిన్ననున్నతిని * శమ్ముభృశమ్మిడి ప్రోచుఁగావుతన్.

## మ.రా.శ్రీ, పురాణం రామశర్మగారిచే వ్రాయఁబడినది.

శా. మిత్రుండై సుగుణాళికెప్పుడు సుచా, రిత్రుండునైయొప్పి దా
శత్రుండై దుర్జనంబులెల్లరకు సౌ, మిత్రేయుఁడై వెల్గు సు
స్తోత్రీపాత్రుఁడు సార్వభౌముఁడయి సం, తోషించు విక్టోరియా,
పౌత్రున్ దైవము సర్వసంపదలతోఁ, బ్రాపించు నిర్ధారణన్.

మ. సముడై సర్వజనంబులందు గడుసం, రంభించు శౌర్యంబునన్,
కమలాప్తుండు వెలుంగురీతి ఘనమా, కారుణ్యదీప్తిన్ ధరన్,
సుమనస్కుండు చిరాయువున్ సుగుణమున్, శోభిల్లగాఁజేయ సం,
భ్రమతన్ లేశముసైనగాంచక మహాప్రాజ్ఞత్వబంధానతన్.

## మ.రా.శ్రీ, తుర్లపాటి హనుమంతరావుగారిచే రచితము.

సీ. కష్టముల్ దొలఁగె సౌఖ్యమ్ములాహెచ్చాయె- ధనధాన్యముల్ గలె
ఘనత హెచ్చె, మోదమ్ముఘటిల్లె భేదమ్ము నశియించెఁ దెక్కు-
బాధలుపోయె జిక్కుచచ్చె, విద్యలువచ్చె సర్వప్రీతమ్ములు సేకు-
రవిభవమ్ములఁ బెంపువవురుగాంచె, కరువునశించె నాగరికత
మెండాయె-మా గాణిపంటలు మతియుఁగల్గె, గీ. మీదు పాలన
మ్మున; లేదు లేదు లేదు, కొలఁతహిందువులకు లేశమరయనింక, నేల
కొలఁది యేడులుమీరె యేలవలయు సర్వసంపదలునుగల్గి జార్జిరాజ.

మ.రా.శ్రీ, తిరుపతిరాజుగారిచే వ్రాయబడినది.

మ. భరితాశాంతను కీర్తిమండలుడు, విశ్వక్షేమ సంపాదనా
పరతంత్రాత్ముడు, సామనీతినిపుణత్వం బేర్పడన్ మాన్పె, సం
గరముల్ పెక్కులనూనశాంతినిలిపెన్ సర్వంసహాధీశ శ్రే,
ష్ఠుఁడెడ్వర్డు భవస్థుఁడుండు ధరఁగన్ కళ్యాణముల్ మీరఁగన్.

మ.రా.శ్రీ, ఉప్పలూరి వెంకటసుబ్బారావుగారు.

సీ. సౌఖ్యప్రదాయంబు సంతోషనీయంబు, నాంగ్లేయపాలనంబందఁజిక్కిని
శత్రుసంహారంబు సఖ్యసంపాద్యంబు, నాంగ్లేయపాలనంబందఁజిక్కిని
నభయప్రదానంబు నన్నదానంబును, నాంగ్లేయపాలనం బందఁజిక్కిని
క్షాత్రప్రహారంబు క్షేత్రప్రదాయంబు, నాంగ్లేయపాలనంబందఁజిక్కిని
గీ. నెన్నివిధములఁజూచిన నెన్నఁదగుచు
బూజ్యనీయమౌ నాంగ్లేయరాజ్యవర్గ!
యెప్పగానెప్డు సంపదలొప్పఁగుచుండ
నుర్వి నాంగ్లేయపాలనం బుండుఁగాత.

సీ. ధనధాన్యవంతులై తగుధర్మకాములై, సంతానవంతులౌ నరసు
లుండ్రి। నిరతంబు శాంతంబు నెలకొల్పభటులుండ్రి, భటులను దం
డింపఁ బ్రభువులుండ్రి। సహగమనంబిలఁజాతుర్యమున మాన్పఁగడు
సంతసించెను సదతులుండ్రి। న్యాయమార్గంబు చోన్యాయాధిప
తులుండ్రి, వారిపైనధికార్లు వరలుచుండ్రి। గీ. సదరులాభంబు
లాదిగాఁజాలఁగలిగె నవ్యతరమైన భోగముల్ నరులకుండె, బూ
ర్వమిట్టివిశేషయె పొసఁగుచుండె, బూజ్యనీయమౌ నాంగ్లేయ
రాజ్యమందు.

సీ. ప్రజలవిద్యకుఁ దగుసదవకాశమిచ్చుచునుండె, నాంగ్లేయపాలనం బను
రుకతన। వారంబులందాదివారంబు సెలవయ్యె, నాంగ్లేయపాల
నం బనురుకతన। బెలరాజులెవ్వారి కెలపేమిలేకుండె, నాంగ్లేయ
పాలనం బనురుకతన। జూవంగదేశముల్ సులభంబుగానుండె,
నాంగ్లేయపాలనం బనురుకతన। గీ. తస్కరభయంబు తొలఁదొ
లఁగె దా!గుపడియె, ద్రవ్యమార్జింపవీలయ్యె దాచుకొనఁగ, బూర్వ
మిట్టివిశేషయె పొసఁగెనిపుడు, బూజ్యనీయమౌ నాంగ్లేయరాజ్యమందు.

మ.రా.శ్రీ, గూడ కృష్ణకవిగారిచే వ్రాయబడినది.

చ. పటుమగు బాణసంచ లనవారిగఁ గాల్చుచుమంచి కంచుత
మ్మటలు స్వనాయిజోడులును మద్దళముల్ రముడోల్లుడోల్లుది
క్తటములు మ్రోయ మేరిసహితంబుగ జార్జిభూపుగూర్పుఁ జొం
బటముగలంకరించి కడుభక్తి నిద్రిప్పుచు వీధులెల్ల గో
పటులొనరించి రౌరయసమానపు టుత్సవమీపురమ్మునన్.

మ.రా.శ్రీ, కోడూరు రంగయ్యశర్మగారిచే వ్రాయబడినవి.

ద్రుతవిలంబిత గీతగర్భితోత్పలమాల.

శ్రీదదయాంబుధీ సతతసేవితసజ్జన జార్జి పాలకా
వేదవిహారయా, వితత విప్లవనాశన విశ్వపా, ధ్యతా
పాదనమోస్తుతే పతితపావన పాతక భంజనాత్మ యా
హ్లాదిత మేరియా, ప్లుతద యామృతవర్ధిత భూజనార్దనా.

మ.రా.శ్రీ, డి. బి. ఆనందశాస్త్రిగారిచే వ్రాయబడినవి.

మ. కనకేహర్యాణ కులప్రదీపకు సల * జ్గాంధ్రామహాదేవి; పం
డితవేద్యున్ వరియించె నేగుణఖనిన్ * మేరీమహాదేవియున్;
వినయాగారము వత్సరప్రాకరము శ్రీ * విక్టోరియా పౌత్రుండా
యన జార్జీవిభుఁడేలు హిందువుల భా * గ్యంబుల్ ఫలింపన్ గడున్.

మ.రా.శ్రీ, రావులలోకనాథంపంతులుగారిచే చదువబడినవి.

ఉ॥ శ్రీమదశేష లోకముల జీకటి వెల్గును దానెయై పరం
ధాముడు నాదిదేవుడును దారసపూర్ణుడు సర్వకారకుం
డీమహి జార్జిభూప్రభుడు, నిచ్చలునాయువుచాల కాలముం
బ్రేముడి భాగ్యసంపదల బెద్దను జేయుత నిండియాధరన్.

సీ. సమరంబునను భారతసమితి జంపుటజేసి భువిని బంధుక్షేమ ము
లుఘటిప। ఘనదుర్గముల నోడి వశ్రిమమ్మరుటజేసి భాసురరాజ్యా
నుభవము నొంద। ధర్మమార్గము మీరి తాజనించుటజేసి లలితధ
ర్మానుకూలత మెలంగ। అతిశయవిక్రమోద్యమము బాయుటజేసి
ఘనతరవిభవంబు గైకొనంగ. గీ. తొల్లితనకైన న్యూనముల్ దొల
గుటకును ధర్మజుడె నేడె జార్జియై ధరను హస్తి। పురమునందున రా
జ్యంబు బూనెనతని కాయురారోగ్య మైశ్వర్య మలరుగాత.

మ.రా.శ్రీ, గంగవరపు పట్టాభిరామ శర్మగారు.

శ్లో. స్వరాష్ట్రే సర్వశత్రూణాం। యమవత్ భక్షయంస్వయం।
మిత్రాణాం రక్షయన్ సమ్య। గ్వర్ధతామభివర్ధతాం.

శ్లో. మేరీపతే మహారాజన్, మేరుమందరధైర్యవన్,
మంగళంభవతే రాజ్యం, మహతే జార్జితే శుభం.

మ.రా.శ్రీ, కరణం గుండూరావుగారు.

మ. ఘనుడై జార్జినరేంద్రచంద్రుడు భువిన్ కల్పద్రుమంబై ప్రజన్
మనుపన్ కోరినకోర్కెలన్ మగసామంతుల్ ప్రమోదంబుచే,
దనుగొల్వన్ గను ధీరశాంతుడయి రత్నాసీనసింహాసనం
బున, నాసీనతపట్టభద్రుడగు సర్వోత్కృష్టభాగ్యంబునన్.

ఉ. అతతకీర్తిపొందుత్రిను మహామహీంద్రుడు సురేంద్రుబోలు
ధాత్రీతలసార్వభౌముడు సతీసుతబాంధవమిత్రయుక్తమై
ప్రీతివహింప దిక్పతులరీతి నృపాలురుగొల్వ జార్జిభూ
నాథుడు పట్టభద్రుడగు నంచు వరించెను రాజ్యలక్ష్మియున్.

సీ. నాంగ్లేయరాజ్య మాదఖిలసంపత్తిని గలుగింప బహుపదంబులనొ
నర్చి, నౌకలకౌకదానికి నౌకర్లకరినిశాస్త్రవేత్తలౌ విహి
తుల విభులజేసి, నందరికిని బెద్దయై గొన్న రుననంగ మండలాధి
పులను నుండజేసి, దమకుమారుగనొక్క ధర్మాత్ముననుప సమా
నంబైన ప్రాభవ్యము నొసంగెనట్టి, గీ. జగతి వైస్రాయి గౌర్నరుజనర
లనగ, సజ్జనావను నియమవిశాలరాజ్య, పాలనాధుర్య సత్కీర్తి
బడసినట్టి, శత్రుదమనవర్తి శ్రీజార్జిచక్రవర్తి.

## మ.రా.శ్రీ, పాచిపేట జమీన్‌దారుగారు.

క. రాజేశుని మనసుప్రభృత, రాజేశునివిరోధిభూమిరమణులురజనీ,
రాజేశునితాప మంయుతు, లీజార్జినె యెన్నవలయునీప్సితములకై.

సీ. గాంభీర్యమున సరిత్కాంతుడై యశరుచువిసమయాత్మతచేత వెల
యఁ డెప్పు, డనిశోన్నతి సుమేరువై చెలువారుచు శృంగభంగంబె
పుఁ జెందకుండు, పురుషోత్తమశ్రీల బోలుపును గాంచుచు బుణ్యజ
నాశిత బొందకుండు, జతురాననత చేతజక మీఱుచుండియు బహ్మ
నవతచేత బరగకుండు, గీ. రాజశేఖరభావాన రాజిలుచును గరళ
కంఠత్వమెన్నడు గనకయుండు, నారయీ రేడెయని జనులభిను
తింప, నమరు భాస్కర వసుధామవిమతభీమ, సరసగుణధామ
శ్రీజార్జిసార్వభౌమ.

## మ.రా.శ్రీ, మల్కపల్లి లక్ష్మీనారాయణరావుగారు.

ఉ. ఇంద్రపురంబుఁ బోలు వరఢిల్లీపురంబున, స్వర్గపీఠము
దండముగాను బోలు నవరత్నవిరాజితపీఠమందు దే
వేంద్రుని భాతి నూర్చుని సురాసుల నింద్రుడు గాచు రీతిగా,
హిందువులందఱిన్ కరుణ నేలెడి యైదవజార్జిభూపతిన్..

ఉ. దేవుడు గాము గాక తనదివ్యదయామృత దృష్టిచేత యా
పావనసూర్యచంద్ర గణభాసురులుండెడి యంతదాక స,
ద్భావము జీవమున్ మరియు పాలనధర్మగుణంబులాదిగా,
భావుకలీలనిచ్చి తనపావనసరోజము జూపె బాగుగన్.

ఉ. శ్రీశుడు గాము గాక వర సజ్జనతోషు దయావమేతు సం,
తోషమువోయకున్ పరమధర్మ దురాత్ముల నెల్లగొట్టి భీ
మాంశుబవిత్రలోక జనముంగళ కారణు నాశ్రితావనున్,
భాసుర జార్జిపంచముని భవ్యకవీంద్రప్రపోషితామణిన్.

## మ.రా.శ్రీ, బి. వోలూర్ల రాజుగారు.

సీ. సురమంత్రిబోలు భాసురమంత్రులొకచోట, వసియించి హితము
లువలుకుచుండ। బుధునితో సెనయగు బుధచంద్రులొకచోట,
ధర్మమూల్ దెలుపుచు దనరుచుండ, కవిరాజవముల్లైన కవిరాజు
లొకచోట, క్రమశాస్త్రములు ప్రసంగములు సలుప। సేనానిమప
మింము సేనానులొకచోట వక్రపాణపాణులై సాగినిలువ. గీ.
వంతుకెక్కిన సామంతవరులు ప్రజలు, కొన్కలర్పించియొక్కచో
గడిసి కొలువ, పరగ పట్టాభిషిక్తుడై ప్రబలెనేడు, చక్రిసమమూర్తి
శ్రీజార్జిచక్రవర్తి

చ. జయజయసార్వభౌమ వరశాత్రవశిక్షణ సాధురక్షణా
జయజయసర్వదిగ్విగతి శాంతిమయప్రయశోధురంధరా
జయజయ మేదిరాజ్ఞిమణి చారుమనఃకమలార్కవిన్న భా
జయజయసుప్రతాపనిధి జార్జిమహామహారాజ చంద్రమా!

---

ఉ. అంచితదాన శీలమున నాసురభూజమునబ్దరాజమున్,
మంచువెలుంగు ధేనువు సమానముగాఁ గొనియుండుటన్ గదా
పంచవశేనికీర్తిని యహారముగాఁగనఁగల్గి వెండియున్
బంచమజార్జినామమును బట్టెను భూరిదయావిలాసతన్.

ఉ. వేలకొలంది మైళులను వేకలియంగనుజేసి దేశమున్
మేలుకనంగఁజేసి తరమేయిది నానవభావరీతులన్
బోలఁగనిల్వజేసి మురువున్‌గను హూణజనంబునందు స
త్శీలత శ్రేష్ఠుఁడైతగువశీకృతశత్రుఁడు జార్జి యారయన్.

మ. అరిభూపాలక సామజంబులకుఁ బంచాస్యంబు మిత్రాళికిన్
వరసంబో కుసుమంబు ధీరపికవాసంతంబు సన్మార్గసం
చరణాబ్జార్కవిభాసితంబునగు భాస్వన్నామసంవేద్యుఁడై,
యురుదారన్ దగు జార్జిభూవిభుని శౌర్యంబేనుతుల్ సేయఁగన్.

## మ.రా.శ్రీ, మోచెర్ల హనుమంతరావుగారిచే రచితము.

మ. మును పేనాఁడభిషేకమొందిరో గదా * భూపాలకుల్ ఢిల్లి, లో
చనపర్వంబుగఁ జూడనేటికిఁ దట * స్థంబయ్యె జార్జిప్రభుం
డును సద్రాజ్ఞియుఁ బట్టభద్రులుగ, హిం * దూదేశసౌభాగ్యమే
మని వర్ణింపఁదరంబు? చూడఁదగుఁగా * కత్తి ప్రమోదంబుగన్.

ఉ. ఆయతబాహువిక్రమస * మూర్జిత వంశపరంపరాగత
శ్రీయుతరాజ్యవైభవవి * శేషముఁ జెందితి ధర్మరక్షణో
పాయవిదుండవైతి నర * పాలశిఖామణి! యేలుమయ్య దీ
ర్ఘాయురుపేతకీర్తిన్ జగ * మంతయు సజ్జన సమ్మతంబుగన్.

మ. చనరానట్టి ప్రదేశముల్ చనుటకున్ * సాధ్యంబులైయొప్పె ని
ర్జనభూముల్ మనుజప్రకీర్ణముగుచున్ * రంజిల్లె ఘోరాటవుల్
కనదుద్యానవనంబులై యొసఁగెనాం * గ్లోరాజ్యమందెంతచ
క్కని యేర్పాటులు చేయఁగాఁబడియెలో * కస్తుత్యమౌరీతిగన్.

మ. జగతిన్ పంచమజార్జి సాధుజనర * క్షాదుష్టశిక్షాపరుం
డగుచున్ బాలనసేయుతన్ ప్రజకుస * ర్వాభీష్టసౌఖ్యమ్ములి
మ్ముగఁ జేకూరుత రాజభక్తికలనన్ * భూదేవి సస్యాఢ్యయై
సుగతిన్ గాంచుత ధర్మమే జయముఁగాఁ * చుంగాత వేదోద్లమున్.

## మ.రా.శ్రీ, కొళ్ళకూరి సాంబశివరావుగారిచే రచితము.

ఉ. జాతిమతాదిభేదము విచారము నూనక గొప్ప కొద్ది వాఁ
డీతఁడు నాక యూరపియనీతఁడు హిందువు వీఁడటంచు వే
ఱేతతి నైననెంచక సమృష్టవిచారణఁ జేసి నేరమం
దాతురత న్వహింప కనయంబు నయంబుగ న్యాయమబ్బెడిన్.

ఉ. ఇన్నిటికంటె నెక్కుడుగ నింగ్లిషు భావప్రజాళికబ్బె వి
ద్యోన్నత దానఁబూజ్యతయుఁ, నావిరినాగరికంబు జ్ఞానమున్
సన్నుతశీలమబ్బె నది సాధకమయ్యెను సర్వకార్యసం
పన్నతమీఱ నన్నిటినివాకొన, నేరువ నన్ని శాస్త్రముల్.

ఉ. ధారుణినేలు నట్టి తలిదండ్రులఁ గోల్పడి పిన్నవాడె భూ
భారముపైనిబడ్డ నృపబాలురఁ జేకొని పెంచి విద్యల
న్నేరిపి శస్త్రులౌదనుక నేర్పున భూముల నేలుటన్ మహో
దారత, రాజపుత్త్రిలు నితాంత శుభంబుల నొంది రెన్నఁగాన్.

# ఢిల్లీనగరము.



ఇంద్రప్రస్థము, పృథ్వీరాజనగరము, అలాయిదుర్గము, తుఘలకాబాదు, ఫిరోజాబాదు, షర్షాహి, పురాణదుర్గము, జహనాబాదు మొదలగునామములతో లోకవిఖ్యాతమైన ఢిల్లీనగరము ప్రాచీన నగరరాజము. లోకములో నీనగరమునకుసాటిగానైననగరము వేఱొకటిలేదనిచెప్పవచ్చును. ప్రాచీనసామ్రాజ్యముల రాజధానులు నామావశిష్టములు. నూతనసామ్రాజ్యముల రాజధానులు నూతననిర్మాణములు. బేబిలను పేరునకుమాత్రము నిలిచియున్నది పెకిను లండను నగరములు నూతననిర్మితములు. రోమునగరముకంటె నింద్రప్రస్థము పురాతనము. కాని యాప్రదేశ మాదికాలమునుండియును కొంతకాలము వృద్ధిని గొంతకాలము క్షయమును వరశాపముల భంగిని ననుభవించుచుండినది. ఢిల్లీనగరనామము సామాన్యముగ నీశిథిలపట్టణముల కన్నిటికిని జెల్లుచున్నది. వాటిసామగ్రితో ఢిల్లీసామ్రాజ్యనిర్మాణకులు స్వేచ్ఛానుసారముగఁ బ్రాతపట్టణములం బరిత్యజించి నూతనపట్టణముల నిర్మించుచువచ్చిరి. ఇట్టిపట్టణంబులు పదుమూఁడు ఖాండవప్రస్థములోఁబుట్టి నశించినవి. ఈపట్టణంబు లరువది చతురపుమైలుల ప్రదేశము నాక్రమించుకొనినవి. వాటిలోనిపుడు షహజహానుచేఁ గట్టఁబడిన జహనాబాదుమాత్రము నిలిచియున్నది. నష్టనగరములవైభవము శిథిలమందిరములవలనను పురాణగాథలవలనను నూహించవలసియున్నది.

## ఢిల్లీనామ నిర్ణయము.

ఈనగరముల కీపేరెటులు గలిగినది నిర్ణయించుట కవీలులేదు. ఢీలుడను రాజుచేస్థాపింపఁబడుటచే ఢిల్లీనామముగలిగినదని ఫెరిస్తావ్రాసియున్నాఁడు. నేల (ఢీలగా) పట్టులేకుండానుండుటచే నీపేరు కలిగినదని యొకవాడుక గలదు. అనంగపాలునిచేఁ బ్రతిష్ఠించిన లోహస్తంభము వదులుగా (ఢీలగా) నుండుటచే నీనామమేర్పడినదని మరొకవాడుకగలదు. లోహస్తంభముమీఁదను "సంవత్ ఢిల్లీ 1109 అనంగపాలబహి" యనివ్రాసియున్నది. 1327 లో జెక్కఁబడిన యొకశిలాశాసనముమీఁదను "ఢిల్లీకాఖ్యాపురీ" యని వ్రాయబడియున్నది. పూర్వకాలమున ఢిల్లీ లేక దిల్లీ యనఁబడుచుండెడిదనియును మహమ్మదీయుల కాలమునుండి యీను వ్రాతలలోఁగల వ్యత్యాసము వలన ఢిల్లీ యనఁబడుచుండెననియును నూహింపవలసియున్నది. ఏదెట్లున్నను ప్రస్తుతము ఢిల్లీ, ఢిల్లీ (Delhi) యని జనులువాడుచున్నారు.

## ఖాండవప్రస్థము.

శ్లో॥ పురాకు విజయో రాజా ఖాండవీ నామ తాం పురీ ॥
ఛింక్త్వా వనం తతశ్చక్రే తేన తత్ఖాండవం వనం ॥

(కాలికాపురాణము.)

ఉన్నత సమవిశాల ప్రదేశము ప్రస్థమనబడుచున్నది. ఖాండవప్రస్థము జీలము యమునానదులకు నడుమను శివాలికపర్వతములకు దక్షిణమునను రాజపుత్రస్థానమున కుత్తరభాగమునను నుండు సారవంతమైన ప్రదేశముగనుండియుండును. ఈదుర్గమ వనప్రదేశమున సుదర్శనుడను చంద్రవంశరాజు ఖాండవీనగరమును నిర్మించెననియును కాశీరాజైన విజయుఁడు సుదర్శనునోడించి శత్రుని ప్రార్థనలవలన పట్టణమునుఁ బాడుపెట్టెననియును, ఫల్గుణుడు వనమును దహింపజేసి జనవాస యోగ్యప్రదేశముగఁ జేసెననియును కలికపురాణములోఁగలదు. ఈప్రస్థమునకీ ప్రఖ్యాతిగలుగుటకుఁ గారణము దీనిమధ్యస్థస్థితి. హిందూదేశముపై దాడివెడలి వచ్చినవారందరును పూర్వభాగములందును దక్షిణదేశములందును స్థావరముల నేర్పరచుకొనుటకిది నడిబాటగానుండినది. ఈప్రాంతాధీశునిపై దేశసంరక్షణభారము మోపఁబడియుండెడిది. ఈప్రాంతాధీశుడు సామ్రాజ్యాధీశుడుగా నెంచఁబడియెడివాడు. ఇచ్చటజరిగిన ఘోరసంగ్రామములు లోకములో ఋతెచ్చ

టను జరిగియుండవు. స్థలమంతయును యమునానదీజలములచేతనువలె రక్తప్రవాహములచేఁ దడుపఁబడినదనుట యతిశయోక్తి గాఁజాలదు. ఈమధ్యదేశ లాభార్థముజరిగిన హత్యలకును సంగ్రామములకును లెక్కలేదు. ఒకకురుక్షేత్ర యుద్ధమునందు లక్షలకొలదిజనులు మడిసిరి. నారాయణు, స్థానేశ్వరము, పానిపట్టు మొదలగు సంగ్రామములందుఁజంపఁబడిన వారిసంఖ్యకు లెక్కగలదా? ఒకయుగమున మితిలేనిసంపదలకును వేరొకకాలమున సకలవినాశనమునకును నాలవాలమైన యీఖాండవప్రస్థములోఁ బదమూఁడు ఢిల్లీనగరములుపుట్టి లీనములైనవి. ఆలీననగరములలో నింద్రప్రస్థము మొదటిపట్టణముగా నెన్నదగియున్నది.

ఇంద్రప్రస్థపురము.

ధృతరాష్ట్రుఁడు పాండురాజపుత్రులకు రాజ్యమును బంచియిచ్చిన విధము మహాభారతమువలన స్పష్టముగఁదెలియుచున్నది. పాండురాజు మరణానంతరము కుంతి తనకొడుకులతోఁ గరినగరముఁజేరెను. పాండవులు సకలవిద్యల నభ్యసించి బలపరాక్రమములతో వర్ధిలుచుండిరి. కౌరవులకుఁ బాండవులపొడ గిట్టకుండెను. దుర్యోధనుడు వారినిసంహరించుటకు మాయోపాయములనుఁ బన్నెను. లక్కయింటఁ గాల్పించెను. విషమును బెట్టించెను. దైవానుగ్రహమువలన వారు ముప్పులేక దృపదుపురంబున సుఖంబుగనుండిరి. ధృతరాష్ట్రుఁడు విదురుంబుత్తెంచి పాండవులరావించి వారలనాదరించి వారిపైతృకంబైన యర్థరాజ్యమునకై ఖాండవప్రస్థమును వారలకిచ్చెను. ఖాండవప్రస్థమునం దింద్రప్రస్థపురము నిర్మింపఁబడినవిషయ మీపద్యమువలన వ్యక్తమగుచున్నది.

సీ॥ ద్వైపాయనుండును * ధౌమ్యుండు నాదిగా
భూసురుల్ సూత్రవి * న్యాసమమరఁ
జేసి శాంతిక విధుల్ * సేయంగ సుప్రశ
స్తంబైన రమ్యదే * శంబునందు
దానవాధిష్ఠుఁడై * వసుధకు నేతెంచి
నేర్మితో నవ్విశ్వ * కర్మ పురము
నిర్మించె నదియును * నిరుపమలీలలఁ
దనరి యింద్రప్రస్థ * మనగ నింద్ర

ఆ॥ పురముతోఁ గుబేరపురముతో వరుణుని
పురవరంబుతోడ * నురగరాజ
పురవిభూతితోడ * నురువిలాసంబుల
పరిఢవంగ నొప్పె * ధరణిమీఁద॥ భా. ఆ.

ఇంద్రప్రస్థవైభవ మాదిపర్వమునం దతిరమ్యంబుగ వర్ణింపబడినది. ఈపుర నిర్మాణానంతరము విజయుడు శ్రీకృష్ణునిసహాయమువలన ఖాండవవనమును దగ్ధముచేసి నాగులసంహరించి యాప్రస్థము నార్యజనులకు వాసయోగ్యముగఁజేసెను. ఈవినాశమునుండి తక్షకుఁడు ముందేతప్పించుకొనఁగనెను. మయుఁడు నశ్వసేనుండును మందపాలసుతులు నలువురును దహనవినాశనమునుండి ధనంజయునిచేఁ గాపాడఁబడిరి. అన్యులు ఖాండవవన దహనమున విగతజీవులైరి. దానవ విశ్వకర్మయైనమయుండు ప్రత్యుపకారార్థము ధర్మజునకొక యపూర్వశృంగార విలాసశోభాయమానంబైన సభను నిర్మించెను. ధర్మరాజు తమ్ముల బాహుపరాక్రమమున సకలరాజులను జయించి రాజసూయాధ్వరముఁజేసి యింద్రప్రస్థపురంబున సామ్రాజ్యాభిషిక్తుండయ్యెను. పాండవులిచట నిరువది మూడేండ్లు సుఖంబుగనుండిరి. కురుక్షేత్రసంగ్రామానంతరము ధర్మజుడు కౌరవులకు రాజధానియైన కరినగరములో ముప్పదియైదేండ్లేలి మహాప్రస్థానమున కేగెను. యాదవకులక్షయానంతరము కృష్ణమూర్తి మునిమనుమఁడైన వజ్రనాభుని బాండవు లింద్రప్రస్థపురములో నభిషిక్తునింజేసిరి. ఈయింద్రప్రస్థపురమె యిపుడు యింద్రపట్ అనఁబడు ప్రదేశమని జనులవాడుక. ఇది షహజహానాబాదుకు దక్షిణదిశను మధురకుఁబోవుమార్గములో రెండుమైలుల దూరమునందున్నది. హాస్తినాపుర మింద్రప్రస్థమున కేబదిమైళ్ళదూరమున గంగానదీతీరమున నుండెడిది. హాస్తినాపురమును ఢిల్లీనగరమనుట సమంజసముగాదు. ఇంద్రప్రస్థమును ఢిల్లీయనుట సమంజసము. ఈప్రదేశములోని మధ్యకాలమందిరములను నిరూపించుటకుఁ బూర్వము ప్రాచీన ఢిల్లీనగరమునుఁగూర్చి వ్రాయుట యుచితము.

## పృథ్వీరాజ డిల్లీనగరము.

భారతయుద్ధకాలమిప్పటికి మూడువేలేండ్లకుఁ బైగా నుండియుండును. అప్పటినుండి మౌర్యసామ్రాజ్యమువరకు హిందూదేశచరిత్ర మంధకారబంధురముగనున్నది. ఈ మధ్యకాలములో నార్యులు క్రమముగాఁ బ్రాగ్దేశములకు బోయి గంగానదీ తీరములందు రాజ్యములనుస్థాపించిరని యిటు లూహించవలసియున్నది. మౌర్యులకు మగధరాజ్యములోని పాటలీపుత్రము రాజధానిగనుండెను.

నాల్గవశతాబ్దాంతమున సముద్రగుప్తుని పుత్రుడు రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుడు హిందూదేశములో జాలప్రదేశమునకు రాజుగనుండెను. వాని విజయములు డిల్లీలోనున్న లోహస్తంభముపైఁ జెక్కఁబడినవి. కాని గుప్తులకును డిల్లీ రాజధానిగనుండెనదనుటకు నిదర్శనములులేవు. ఎనిమిదవ శతాబ్దములో డిల్లీ తోమరు రాజపుత్రులకు రాజధానిగనుండెను. ఇంతకుఁబూర్వము డిల్లీ యుండియుండును. ఈనగరనిర్మాణము 993-4లో నారంభమై యుండవచ్చును. ఈవంశజుడైన యనంగపాలుడు ధామదుర్గమును దేవళంబులను నిర్మించి 1052లో మధురనుండి విక్రమాదిత్యుని విజయములందెలుపు పంచలోహస్తంభమును దెప్పించి దేవళంబులకు ధ్వజస్తంభముగఁ బ్రతిష్టింపించి నగరప్రతిష్ఠాపనమును స్థిరముగఁజేసెను. చాహుమానవంశజులు సాకంబారుకు రాజులుగనుండిరి. ఈవంశజుడు విశాలదేవుడు 1151లో ననంగపాలుని వంశజులనోడించి డిల్లీని దనరాజ్యమునందుఁజేర్చెను. పృథ్వీరాజు విశాలదేవునిపౌత్రుడు. ఈరాజచంద్రుడు డిల్లీ అజిమీరులకు రాజై పృథ్వీరాజదుర్గమునుఁ గట్టించెను. పృథ్వీరాజు మహమ్మదుఘోరితోఁ బదుమూడుసారులు పోరాడి వాని ననేకసారులోడించెను. కాని 1191 లో మహమ్మదుఘోరి విశేషసైన్యముతో పృధ్వీరాజుపై దాడి వెడలెను. హిందూరాజు లీయుపద్రవమునుండిఁ దప్పించుకొనుటకుఁ బృథ్వీరాజునకుఁ దోడ్పడిరి. కాని 1192లో తలావరీసమీపమున జరిగిన యుద్ధములోఁ బృథ్వీరాజోడింపబడి శత్రువులచే వధింపఁబడెను. ఈయుద్ధముతో డిల్లీసామ్రాజ్యము మహమ్మదీయుల వశమైనది. పృథ్వీరాజచరిత్రము చందరైసా పృథ్వీరాజవిజయము అను గ్రంథములలో సవిస్తరముగ వర్ణింపబడినది. పృథ్వీరాజు మహాశూరుడనుటకు వానివిజయములె నిదర్శనములు. శ్రీకృష్ణుని రుక్మిణీకళ్యాణమువలెఁ బృథ్వీరాజ సంయుక్తాపరిణయము లోకవిఖ్యాతము. ఇప్పటికిని పృథ్వీరాజ వృత్తాంతము పాటలుగను పద్యములుగను నుత్తరహిందూస్థానమునందు జనులచేఁ గొనియాడఁబడుచున్నది.

పృథ్వీరాజదుర్గము అయిదుమైలుల చుట్టుకొలతను గలిగియుండెడిది. కోటగోడలు 30అడుగుల వెడల్పును 60 అడుగులయెత్తును గలిగియుండెడివి. కోటచుట్టును 18-35 అడుగుల వెడలుపుగల కందక ముండెడిది. అన్ని దిశలందును నెత్తయిన గోపురములును పదిద్వారములును నుండెడివి. పశ్చిమదిశను రంజితసింహద్వారము దృఢముగ నమర్చఁబడినది. కోటలోపల సుందరమందిరంబులు హిందూదేవళంబులు నుండెడివి. 37వ పుటలోని హిందూమంటప మాకాలపు హిందూశిల్పికారుల శిల్పినిర్మాణనైపుణ్యమునుఁ బ్రకటించుచున్నది. ఈమంటపము విష్ణుదేవాలయమునకు సంబంధించిన సహస్రస్తంభమంటపముగనుండెడిది. మహమ్మదీయులు దానిని మసీదుగ మార్చుటవలన దాని ప్రాచీనస్థితిని నిరూపించుట కవకాశములేదు. మహమ్మదీయు లనేకహిందూదేవళంబులలోని 2000 స్తంభములను మసీదునుఁగట్టించుటకు దెప్పించిరి. అందువలన స్తంభముల కాకృతియందును, చిత్రరచనాకల్పన నిర్మాణంబునందును సామ్యత్వములేదు. విష్ణుదేవాలయమును 1200 లో కుతుబుద్దీనుమసీదుగ మార్పించెను. కుకబ్-ఉల్-ఇస్లాము మసీదునకు దక్షిణోత్తరభాగములను 1220లో అల్తమషుచేర్చెను. అలాయుద్దీను 1300లో దూర్పుదిశను బెంచెను. ఈమసీదు కుతుబుద్దీను కాలమునందుత్తరదక్షిణములు 163 అడుగులు, తూర్పుపడమరలు 147 అడుగులు, అల్తమషుకాలమునందుత్తరదక్షిణములు 230 అడుగులు తూర్పుపడమరలు 380అడుగులు ప్రదేశమునుగలిగియుండెడిది. ఈక్రొత్త చేరికలతోఁగలిసి తూర్పుపడమరలు 700 అడుగులును దక్షిణోత్తరములు 430 అడుగులును పరిమితినిగలిగి

యుండెడిది. కుతుబు-ఉల్-ఇస్లాము 142 అడుగులు పొడవును 108 అడుగులు వెడల్పునుగలిగి నాలుగుదిశలను ప్రాంగణములను సోపానములనుగలిగియుండెడిది. ప్రాంగణములు బారులుతీర్చిన శిలాస్తంభములచే నమర్చబడినవి. ప్రార్థనామందిరము 147 అడుగులు పొడవును 4/ అడుగుల వెడల్పునుగలిగి అయిదువరుసల స్తంభములపై నమర్చబడిన కప్పునుగలిగియొప్పుచుండెడిది. ఈయంతర్భాగముకొరాను వాక్యములతోను చమత్కార కల్పనాకారములతోను నలంకరింపఁబడినది. ఇపుడీమసీదునకు సంబంధించిన కమానులును శిలాస్తంభములును మాత్రము నిలిచియున్నవి. కుతుబుద్దీను హిందువులదేవాలయమును మసీదుగఁ దనకవసరమని తోచినమార్పులతో మార్పించెను. హిందూమతమునకు సంబంధించిన విగ్రహాదులను గొన్నిస్థలములందు మార్పించెను. కొన్నిప్రదేశములందు దట్టమైన సున్నపు పూతతో గప్పించెను. ఆ సున్నపు పూత జారి కప్పబడిన విగ్రహములు బయలుపడినవి. ఆల్తమషు కుతుబుద్దీనుని మార్గము నవలంబించెను. అలాయుద్దీను నూతనశిల్పిరచనను నారంభించెను. తాజమహాలు దివ్యమందిరమునందు సంపూర్ణదశను నొందిన మహమ్మదీయ శిల్పిరచన యలాయుద్దీనునికాలములో నారంభమైనదనవచ్చు. కుతుబు-ఉల్-ఇస్లాము మసీదంతయును నిపుడు శిథిలమైనది. శేషించిన రాతికంబములపైఁగన్పడు పనితనము మహమ్మదీయాక్రమణమునకు ముందటి హిందువుల శిల్పిదక్షతను జూపుచున్నది.

నలుదిక్కులను చిత్రాకారములను నాలుగుకోణములనుగలిగిన పీటలపై కంబములమర్చఁబడినవి. ఉపరిభాగములు నానాకోణములుగల స్తంభములు. స్తంభములనడుమభాగములును కొనలును చొక్కటపు చెక్కడములతో మనోహరంబుగ నున్నవి. ఒక స్తంభముమీఁదఁ బూదండ లల్లిబిల్లిగా నల్లినటులు చెక్కబడినవి. ఒకచోట పూలగుత్తులు కోణాగ్రములనుండి వ్రేలాడుచున్నటుల్లు చెక్కబడినవి. ఒకతావున చిన్నిగంటలు సన్నగొలుసులతో గట్టబడినటులు చిత్రింపబడినవి. ఒకప్రదేశమున సన్నతీగ లల్లుకొనినటులు చెక్కబడియున్నవి. అడ్డకంబములు పంకజములతోను త్రిపతాకములతోను సుందరముగ నమర్చబడినవి. స్తంభములు సన్ననగిషీపనితో సుందరతరముగ నలంకరింపఁబడినవి. గర్భమంధిరమునందు హిందూపురాణగాథ లతివిచిత్రముగ గోడలపైఁ జిత్రింపఁబడినవి. ఒకప్రక్కను విష్ణుసభావర్ణనము చిత్రరూపములఁ బ్రదర్శింపఁబడినది. ఉత్తరదిశను శ్రీకృష్ణుని లీలలతినిపుణముగ జిత్రింపఁబడినవి. వితానాచ్ఛాదితంబైన పర్యంకంబుపై శ్రీకృష్ణసహితయై పరిచారికావృతయై యశోదాదేవి శయనించుచున్నటులును, సుందరాంగులు దమపిల్లలం జంకనెత్తుకొని లోకరక్షకుని సందర్శించుటకై జంటలు జంటలుగాఁ బోవుచున్నటులును జెక్కబడినది. ఈశాన్యదిశయందలి తాళ్వారమునందుఁద్రిమూర్తులును నింద్రాదిదేవతలును జిత్రింపఁబడిరి. ఈసన్నచెక్కడంబులును సుందరాకారంబులును పృథ్వీరాజనగరపు తొల్లింటివైభవంబును బ్రకటించుటకు జాలియున్నవి.

## మహమ్మదీయ ఢిల్లీనగరములు.

పృథ్వీరాజుతో హిందూసామ్రాజ్య మంతము నొందినది. మహమ్మదీయ సామ్రాజ్య మారంభమైనది. మహమ్మదు ఘోరి దనసేనాధిపతినిఁ గుతుబుద్దీనుని ఢిల్లీకిఁ బాలకునిగా నియమించెను. కుతుబుద్దీను మహమ్మదు ఘోరిచేఁ గొనఁబడిన బానిస. ఆయన దన శక్తిసామర్థ్యములవలన ఢిల్లీసామ్రాజ్యమును 1205-10 వరకుఁ బాలించెను. పరువు ప్రతిష్ఠలకుఁ దెలివి తేటలు గారణములుగాని పుట్టుక కాదనుటకు వీనిచరిత్రము నిదర్శనము. కుతుబుద్దీనుని యనంతరము వాని యల్లుడు ఆల్తమషు సింహాసనము నధిష్టించెను. వాని మరణానంతరము రజియా సుల్తానా రాణిగా ఢిల్లీసామ్రాజ్యము నధిష్టించెను. ఫెరిస్తా యామె ప్రజ్ఞా ప్రతాపములను గూర్చి బాగ వ్రాసియున్నాడు. ఘియాసుద్దీనుని పాలనము విద్యాపోషణమునకును మహావైభవములకునుఁ బేరొందినది. 1288 తో బానిసవంశ మంతము నొందినది.

## కుతుబు మీనారు.

కుతుబుమీనారు అను నపూర్వవిభవాభిరామంబైన జయస్తంభము కుతుబుద్దీనునిచే నారం

భింపఁబడి ఆల్తమషుచే ముగింపఁబడినది. పృథ్వీరాజు దనకూఁతురు కాళింది జలంబులనుఁ జూచుటకై దీని గట్టించెనను గాధను నమ్ముట కాధారములు లేవు. కుతుబుద్దీను దనవిజయములను జాటుటకును మహమ్మదీయులకుఁ బ్రార్థనాకాలమునుఁ దెలుపుటకును దీనిం గట్ట నారంభించె ననుట విశ్వసనీయము. కుతుబు మీనారు 1200 లో నారంభింపఁబడి 1220 లో ముగింపఁబడినటులు శాసనములు దెలుపుచున్నవి. మీనారు నేలమట్టమునకు రెండడుగుల యెత్తయిన పీఠముమీఁదనుఁ గట్టఁబడిన యొంటిస్తంభప్రాసాదము. స్తంభము 24 కోణములును 5 అంతస్తులునుఁ గలిగి యున్నది. 94 అడుగుల 11 అంగుళముల యెత్తుగల మొదటియంతస్తు కుతుబుద్దీనునిచేఁ గట్టఁబడినది. 50 అ. 8½ అంగుళములును, 40 అడుగులు 9½ అంగుళములును, 25 అడుగులు 4 అంగుళములును, 22 అడుగులు 2 అంగుళములును క్రమముగా నెత్తును గలిగిన రెండుమూఁడు నాలుగైదు అంతస్తు లాల్తమషుచేఁ గట్టింపఁబడినవి. క్రిందిభాగమున మీనారు మధ్యకొలత 47 అడుగులు 3 అంగుళములు. పోనుపోను మధ్యకొలత క్రమముగ తగ్గుచు శిఖరభాగమున 9 అడుగులకుఁ దేలుచున్నది. మొత్తము మీనారు పొడవు 234 అడుగులు 1 అంగుళము. 1365 లో ఫిరోజషా దీనికి 12 అ. 10 అంగుళముల యెత్తుగల శీర్షభాగమునుఁ జేర్పించెను. స్తంభపు మొత్తము పొడవు 246 అ. 11 అం. భూకంపమువలన 1803 లో శీర్షభాగము నేలపైఁ గూలగా నాంగ్లేయ శిల్పికారునిచే నది వికారాకృతితోఁ బునరుద్ధారితము సేయఁబడినది. కాని హార్డింజిప్రభువు దానిని 1848 లోఁ దీసివేయించెను. ఆ భాగమిపుడు మిట్టప్రదేశమున నుంచబడినది. ఇపుడు మీనారు స్తంభము నేలమట్టమునుండి చివరకు 238 అ. 1 అంగుళము పొడవును గలిగియున్నది. ఈ యొంటిస్తంభపు మేడకు 379 మెట్లు గలవు. మీనారుయొక్క మొదటి మూఁడంతస్తులు వాలుకాశిలలతోఁ గట్టఁబడినవి. నాలుగైదంతస్తులు మర్మర తామ్రశిలలు చేర్చికట్టబడినవి. మీనారుయొక్క మధ్యదండము మొదటి మూఁడంతస్తులలోను సిలువుగాను తక్కిన రెంటియందును నడ్డముగాను సంధింపఁబడినది. సంధింపఁబడిన పట్టెలపైన శాసనములును విచిత్రాకారములును జెక్కఁబడినవి. ప్రతియంతస్తుయొక్క పైభాగమును పిడిగోడలు గలిగిన చుట్టు వసారాలతో నావృతమునై యున్నది. వసారా పిడిగోడలు జాలాకృతిని సుందరతరముగ నిర్మింపఁబడినవి. "ఈపనితనమునకు మించిన పనితనము డిల్లిలో నింకొకచోటను గాని గ్రనడాలోని అల్హాంబ్రాలోగాని లేదు" అని స్టీవెను క్యాంబెలు గార్లు వ్రాసియున్నారు. అన్ని యంతస్తులలోను వసారాలకుఁ బోవుటకు ద్వారము లేర్పరుపఁబడినవి. మీనారును గట్టినవిధమును కొరాను నుండి ప్రమాణ వాక్యములును మీనారులోని శిలలపై నిపుణముగాఁ జెక్కఁబడినవి. "కైరోనగరమునందలి మీనారు దీనికంటె నెత్తుగనున్నను సూత్ర విన్యాసమునందును నిర్మాణ నైపుణ్యమునందును దీనికిసాటియైనది లోకములో వేఱొకటి లేదు." అని శిల్పిశాస్త్రజ్ఞుడయిన ఫర్గూసను గారి మతము. ప్రపంచాద్భుత నిర్మాణములలో నొకటియైన కుతుబు మీనారుగంభీరవైభవాకారముతోఁ బ్రాచీన డిల్లీ నగరమును నలంకరించుచున్నది. దీని యాకృతి 39 పుటలో జూడనగును. ఇది పటమునందు నైరుతి దిశయందున్నది.

ఆల్తమషు గోరి.

రెండవ బానిస రాజైన ఆల్తమషుగోరి హిందూదేశములోని మహమ్మదీయ సమాధులలో నతిపురాతనమయినది. ఇది కుతుబు-ఉల్-ఇస్లాముకు వాయవ్యదిశనున్నది. మీనారు కాలమునందు గట్టఁబడినది. ఇది 14 అడుగుల పొడవును 9 అడుగుల వెడల్పును భూమట్టమునుండి 7½ అడుగుల ఎత్తునుగలిగి క్రిందిభాగము తామ్రశిలలతోను నుపరిభాగము మర్మరశిలలతోను గట్టబడినది. గోరీయున్న గోడలు సన్నపని చెక్కడములతోను కొరాను వాక్యములతోను నింపబడియున్నవి. కమానులకు మధ్యరాయిలేనందున నీనిర్మాణము హిందూశిల్పియుగములోనిదని స్పష్టమగుచున్నది. పూర్వము దీనిపైన గోపురముండి యుండును. అది శిథిలమై పైననిపుడు

కప్పులేక నున్నది. "ఈసమాధి మిక్కిలి చిన్నదైనను మహమ్మదీయ కార్యార్థము హిందూశిల్పిరచన ఘుపయోగింపఁబడిన విధమును దెలుపుట కిది ప్రాచీన ఢిల్లీలో నుత్తమ నిదర్శనము. ఇది మిక్కిలి చక్కగా నున్నది." అని ఫర్గసన్‌గారు వ్రాసియుండిరి. దీని చిత్రపటము 40 పుటలో గలదు.

లోహ స్తంభము.

దీని నిర్మాణమును నిర్ణయించుట కాధారములు లేవు. ఇప్పటికి 2807 ఏండ్లకు మునుపు పాండవ వంశజుఁడైన మేధావునిచే నిర్మింపఁబడినదని యొకరి మతము. ఇంద్రప్రస్థమునుండియో మధురనుండియో ప్రాచీనఢిల్లీనగరమునకుఁ దీసికొని రాబడి యుండును. దానిమీఁద గల శాసనము లన్నియును నిటీవల వ్రాయబడినవి. ఢిల్లీనామ నిర్ధారణమునుఁ జేయుటలో నిది మొదటి యనంగపాలునిచేఁ బ్రతిష్ఠింపఁబడి నటులును రెండవచంద్రగుప్తుని కాలమునకు లోగడి దనియును లోఁగడ వ్రాయఁబడినది. ఏది ఎట్లున్నను పృథ్వీరాజకాలములోనిది విష్ణుదేవాలయమునకు ధ్వజస్తంభముగా నుండెడిది. దేవాలయమును మసీదునకు మార్చిన కుతుబుద్దీను స్తంభమును గదల్చలేదు. స్తంభపు పొడవు 23 అడుగులు 8 అంగుళములు. పాతులో 14 అంగుళములును 22 అడుగులు 10 అంగుళములు పైనను గలవు. మొదటిభాగము 15 అడుగులు పొడవును 16 అంగుళముల వ్యాసమును గలిగి నున్నగా నున్నది. మధ్యభాగము 4 అడుగుల పొడవును గలిగి గ ఱ గ ఱ గా ను న్న ది. చి వ ర భా గ ము ౪½ అడుగులు పొడవును 12 అం గు ళ ము ల వ్యాసమును గలిగి గాట్లను గలిగి యున్నది. ఇప్పటికి 1600 ఏండ్ల క్రిందను జేయబడినదని యూహించినను గాలివానల తాకిడికి త్రుప్పు పట్టకుండుట యచ్చెరువుగా నున్నది. ఈ స్తంభ మేధాతు సంయోగము వలన నిర్మింపఁబడినది సరిగా దెలియదు. కంచు, ఉక్కు, పంచలోహములు, ఇనుము అను భిన్నాభిప్రాయములు గలవు. రసాయన శాస్త్రజ్ఞులు మేలయిన యినుముతోఁ జేయఁబడినదని నిశ్చయించిరి. ఈరచన కనుకూలించిన గుప్తప్రక్రియ ప్రాచీన లోహకారులతో నంతరించియుండును. ప్రపంచములో మహదద్భుతములయిన లోహనిర్మాణములు గలవుగాని యవి బోలువి, ఇత్తడితోను రాగితోను చేయబడినవి. ఢిల్లీయందలి స్తంభము గట్టిదైన యేకకాండ లోహస్తంభముగా నున్నది. ప్రబల యంత్రసహాయము గలయీకాలమునందు సయితి మిట్టి స్తంభములను నిర్మించుట కష్టతరముగా నున్నది. అట్టిచో నీయద్వితీయ లోహ స్తంభము చూపరుల కచ్చెరువునుఁ బుట్టించుచు హిందువుల కళాకౌశలమునకు నిదర్శనముగా నుండుట యొకవింతగాదు. 38 పుటలో దీని చిత్రపటము గలదు.

కిలాఖేరి.

ఖానిసరాజులలోఁ గడపటి రాజైన కైకాబాదు యమునా నదీతీరమున నీనూతన నగరమును నిర్మించెను. జలాలుద్దీను వానింజంపించి1289లో సింహాసనమునధిష్ఠించెను.జలాలుద్దీను ఖిల్జివంశస్థాపకుడు. ఈసుల్తాను శత్రువులపట్లను నయితము క్రౌర్యములేక శాంతస్వభావముతోఁ బ్రవర్తించెను. వానికాలములో ఢిల్లీ పండితులకును, కవులకును, గాయకులకును పోషణస్థానముగా నుండెడిది. జలాలుద్దీ నీనగరమునందు 1289-1295 రాజుగానుండెను.

సిరిదుర్గము.

అలా ఉద్దీను తనమేనమామయైన జలాలుద్దీను నింజంపి 1295 లో రాజ్యభారమును వహించెను. వానిచే మూడవఢిల్లీ 1303 ప్రాంతమున గట్టింపఁబడి 1323 వరకు మహమ్మదీయ సామ్రాజ్యమునకు రాజధానిగా నుండెను. ఇది పృథ్వీరాజనగరమునకు వాయవ్యదిశ నుండెడిది. ఈకోటలో సహస్ర స్తంభ మంటపము, తామ్రప్రాసాదము, జహానపాన మొదలగు దివ్యమందిరము లుండెడివి. ఈప్రదేశముననే మాలికాఫూరు తాను ఓరుగల్లునుండి కొల్లగా గొనివచ్చిన యపారసంపదలను నలాయుద్దీనునకుఁ బ్రదర్శించెను. ఇచట మాలికాఫూరు, కుతుబుద్దీను, ముబారక్‌షా, ఖుస్రూఖాను వధింపబడిరి. పద్మినిని మోహించి యలాయుద్దీను చిత్తూరును ముట్టడించిన యితిహాసము సుప్రసిద్ధము.

జహానపాన.

ఖిల్జీవంశజులు లేనందున ఘియాసుద్దీను తుఘ్లుకు 1321 లో రాజుగా నియమింపబడెను. వానికాలములో నోరుగల్లునకు ప్రతాపరుద్రుడేలికగా నుండెను. ఆశూరుని చరిత్రమీ సంచికలోని వేరొక వ్యాసములోఁ జూడనగును. ఘియాసుద్దీను దనకొడుకు దనకై నిర్మించిన కృత్రిమ సౌధమునందు 1325 లో జంపబడెను. సిరిదుర్గము 1542 లో షర్షావలన వినాశము సేయబడి యాసామగ్రితో షర్షా క్రొత్తడిల్లీని గట్టించెను. ఇది పాడుపడక మునుపు 13 ద్వారములను గలిగి యుండెడిది. అలాఉద్దీనునిచే గట్టింపఁబడిన అలయిదర్వాజ యతి రమణీయంబుగ నున్నది. ఇది కుతుబుద్దీనుని మసీదునకు నగరసింహద్వారముగ నుండెడిది. ద్వారబంధములు, గోడలు, గవాక్షములు మంచి సన్న పనితనమును బ్రదర్శించుచున్నవి. వీనికాలమునందు హిందూమహమ్మదీయ శిల్పికళలకు సంయోగ మేర్పడి హైందవ శిల్పికళా నిర్మాణములో రెండవయుగ మేర్పడినది. కుతుబుమినారువలె నలయిమినారును గట్టించ నారంభించెను. వాని యకాలమరణమువలన నది యాగిపోయినది. ఈద్వారపు చిత్రపటము 35 వుటయందు గలదు.

తుఘ్లుకాబాదు.

ఘియాసుద్దీను దన రాజ్యకాలమును బ్రకటించుటకు నూతన డిల్లీని నిర్మించెను. రాజధానిని 1323 లో తుఘులకాబాదునకు మార్చెను. మహమ్మదుషా తుఘులకు దీనిని దన రాజధానినిగా జేసికొని పృథ్వీరాజనగరమును, సిరిదుర్గమును, జహానపానను, తుఘులకాబాదును నొకటిగా జేర్చ యత్నించెను. తుఘులకాబాదు దుర్గమొక గుట్టపై గట్టబడి కందకంబులతోను బురుజులతోను గాపాడబడుచు దుర్భేద్యంబుగా నుండెడిది. కొన్నిచోట్ల కోటగోడలు 90 అడుగుల యెత్తును గలిగియుండెడివి. ఈదుర్గ నిర్మాణ మద్భుతరచనలలో నొకటిగా నెంచబడుచున్నది. కోటయును కోటద్వారములును పెద్ద నల్లరాళ్ళతోఁ గట్టఁబడి దుర్భేద్యములుగా నుండెడివి. ఘియాసుద్దీనుని గోరి చెరువునడుమను గట్టబడి యిప్పటికిని మంచి స్థితిలోనుండి దర్శనార్హంబుగ నున్నది. ఆకాలములో పీరోటలో జుమ్మామసీదు, సుందరహర్మ్యము లుండెడివి. ఇవన్నియును శిథిల స్థితిలో నున్నవి.

అదిలాబాదు.

ఇది తుఘులకాబాదున కాగ్నేయ దిశను మహమ్మదుషా తుఘులకుచే గట్టింపబడినది. తుఘులకు శ్వేత హర్మ్యమునందు సింహాసనంబు నధిష్ఠించి పిమ్మట నదిలాబాదునకు రాజధానిని మార్చెను. అదిలాబాదనగా ధర్మనగరము. తుఘులకు దుష్టస్వభావమునకును నీపేరునకును హస్తిమసికాంతరమైన వారగలదు. తుఘులకు క్రూరరక్కసి. జనుల నష్టకష్టములపాలు సేసెను. రెండుసారులు ప్రజలనందరను దౌలతాబాదునకు బలవంతముగా దోడ్కొనిపోయి డిల్లీనగరమును జనసూన్యముగా జేసెను. మోయలేని పన్నులనీయలేక ప్రజలు వనవాసములను గైకొనిరి. క్రూరరాజను బిరుదుతో 1351 లో తుఘులకు మృతినొందెను. నిజాముద్దీనను సాధువు "తుఘులకాబాదు జనసూన్యమగు గాక లేక నిమ్నజాతులకు నివాసయోగ్యమగుగాక" యని శపించెననియును నాశాప ఫలమమోఘముగా జరిగెననియును నొకవదంతి గలదు. "ప్రపంచములోని విశాలనగరము జనసూన్యమైనది. ఇండ్లు పాడు పడినవి. నగరము ఘూకశృగాలములకు నివాసయోగ్యమైనది......" అని బటూటా వ్రాసెను. ప్రాచీన డిల్లీలోనున్న పృథ్వీరాజకూపము, అనంగపాలతటాకము, అలాఉద్దీను సమాధి, మహ్రౌలిలోని కుతబుషాసమాధి మొదలగు పురాతన ప్రదేశములు దర్శనార్హములు.

ఫిరోజాబాదు.

ఫిరోజషా తుఘ్లుకు 1354 లో నీనగరమును నిర్మించి తనరాజధాని నిచటికి మార్చెను. అది ఇంద్రప్రస్థమున కుత్తర దిశను యమునానది యొడ్డున నారుమైలుల పొడవును రెండుమైళ్ళకు పైగా వెడల్పును గలిగియుండెడిది. ఇది ప్రస్తుతపు డిల్లీకి మూడురెట్లు పెద్దదిగానుండె

డిది. ఆనగర సామగ్రి ఫేర్షాహికిని జహానాబాదునకును నుపయోగ పరుప బడినది. ఆనగరములో నెనిమిది మసీదులు, మూడు దివ్యహర్మ్యములు, అనేక ధర్మశాల లుండెడివి. ఇపుడు మహాజహానాబాదునకు దక్షిణముననున్నయశోక స్తంభమీనగరములో నుండెడిదని బటూటా వ్రాతలవలన నూహింపవలసి యున్నది. ఆకాలమున సుప్రసిద్ధమైన జుమ్మామసీదు అశోక స్తంభమునకు దక్షిణదిశ నుండెడిది. తైమూరు డిల్లీని దోచుకొని నపు డిచట నమాజును జేసినట్లులు స్టీఫెను వ్రాసియున్నాడు.

అశోక శిలా స్తంభము.

హిందూదేశములో నశోకస్తంభము లారు గలవు. డిల్లీయందు రెండు, ప్రయాగయందొకటి, తొరియాయందు రెండు, సంచీయందొకటి. ఫిరోజషాహా మీనారి జరీన్ లేక స్వర్ణస్తంభము అనబడిన యశోకస్తంభమును డిల్లీకి 120 మైళ్ళదూరము నందుండెడి నహీరానుండి దెప్పించిన విధమును షంసి సిరాజ్ అను చరిత్రకారు డీ క్రింది విధమున వ్రాసియున్నాడు:—

"డిల్లీకి 90 క్రోశముల దూరమునందుండిన ఖిజిరాబాదునుండి యీ స్తంభమును దెప్పించి డిల్లీయందుం బతిష్టించుటకు సుల్తాను నిశ్చయించెను. ఈపనిని నిర్వహించుటకై నానాప్రదేశములనుండియును తగిన సాధనములతో బనివాండ్రను పదాతులను నాశ్వికులను రప్పించెను. దూది బస్తాల ననేకములనుం దెచ్చుట కుత్తరు వొసంగబడెను. దూది స్తంభముచుట్టును పేర్చబడి రాళ్ళను దీసినపుడు స్తంభము దూదిపరుపుపైన వాలినది. పిమ్మట దూది తీసివేయబడి స్తంభము నేలమీదను సమానముగ వాలునటులు సేయబడినది. పునాదులక్రిందను స్తంభమునకు బీఠముగానుండిన పెద్దరాయి నయితము తీయబడినది. శిలా స్తంభమునకు మొప్పము గలుగకుండుటకు జమ్ముగడ్డియును గొర్రెతోళ్ళును నామూల్యాగమును స్తంభమునకుం దొడుగువలెం గప్పబడినవి. దీనికై ప్రత్యేకముగా నిర్మింపబడిన 42 చక్రముల రథములపై నిది విశేష పరిశ్రమతో నెక్కింపంబడి వేలమంది జనులచే నీడవబడి యమునానది యొడ్డునకుం జేర్చబడినది. నదిలో 2000 మొదలు 7000 మణుగులవరకు బరువును మోయగలిగిన పడవలు సిద్ధముగా నుంచబడినవి. సుల్తాను స్వయముగా వెళ్ళి స్తంభమును బోట్లమీద నెక్కించి ఫిరోజాబాదునకు జేర్పించెను.

దీనిని నిలువబెట్టుటకు నిపుణులైన శిల్పకారులు నియోగింపబడిరి. స్తంభము 20 అడుగుల యెత్తయిన పీఠముపై నిలుపబడినది. ఒకమెట్టుకట్టుట పూర్తికాగానే పైమెట్టున కెత్తబడుచుండెడిది. ఇటులు క్రమక్రమముగా పైమెట్టువరకుం జేర్చబడినది. లావుమోకులు స్తంభమునకుచివర బంధింపబడి కప్పీలయొక్కయు నిలువు స్తంభములయొక్కయు సహాయమువలన నిటారుగ నిలువ బెట్టబడినది. పిమ్మట స్తంభముతో దీసికొనిరాబడిన పీఠము దీనిక్రింద నమర్చబడినది. ఈ స్తంభభారమును వహించుటకొక కలశము రాయితోను సున్నములోనుం గట్టబడినది."

అశోకస్తంభము తామ్రవాలుకా శిలానిర్మితమైన యేకకాండస్తంభము. దీనిపొడవు 46 అడుగులు 8 అంగుళములు. పాతులో 4 అడుగులు 1 అంగుళమును పైభాగమున 42 అడుగులు 7 అంగుళములును గలదు. స్తంభవ్యాసము క్రిందిభాగమున 38 అంగుళములు పైభాగమున 25 అంగుళములు. బరువు 36 టన్నులు. నాలుగు దిశలందును చుట్టూక్రిందుభాగమునను నశోకుని ధర్మశాసనములు పాలీభాషలోం జెక్కబడినవి. ఇతర స్తంభములమీదను లేని కొన్ని విషయములీ స్తంభముమీద నధికముగాంగలవు. దీని చిత్రపటము 38 వ పుటలోగలదు. ఫిరోజిషా సత్పరిపాలకుడు. వానికాలములో డిల్లీసుఖస్థితిలోనుండెను. ఫిరోజిషా 38 ఏండ్లు పాలించి 1388 లో మృతినొందెను.

దీనపన. (హుమాయూనుని డిల్లీ.)

తుఘలకు వంశానంతరము సయ్యదువంశమును తరువాతను లోడీవంశమును మహమ్మదీయ పాలకులుగా నుండిరి. సికందరు లోడి రాజధానిని నాగ్రాకుమార్చెను. మొగలుసామ్రాజ్య నిర్మాణకుడు బాబరు ఇబ్రాహిం

లోఁడీ నోడించి యాగ్రాలోఁ బాలించుచుండెను. హుమాయూను రాజధానినిఁ దిరిగి డిల్లీకిమార్చి పురాణదుర్గముండెడిచోట 1530 లో నగరమును కోటను నిర్మించెను. ఈనగరమునకు దీనపన (దీనులకాశ్రమము) యని పేరునుఁబెట్టెను. హుమాయూను ఈప్రదేశములోనున్న షేరుమండలమను మందిరమునుండి జారిపడుటవలన దెబ్బతగిలి కొంతకాలమునకు మృతినొందెను.

షర్షాహి డిల్లీ.

ఇది 1540 లో షర్షాచే నారంభింపబడి 1545 లో వానికొడుకుచేఁ బూర్తి చేయబడినది. ఈకోటగోడలు తొమ్మిదిమైళ్ళ పొడవునుఁ గలిగియుండెడివి. మొదటి లాల్దర్వాజా ఉత్తరద్వారముగను రెండవలాల్దర్వాజా పశ్చిమద్వారముగను నుండెడివని కన్నింగుహాముగారు నిర్ణయించిరి. దీనిలోనున్న కోనమసీదు సుందరతరముగ నున్నది. ఈమసీదు 168 అడుగులు పొడవును 44½ అడుగుల వెడలుపును 44 అడుగులు ఎత్తునుగలిగి తామ్రవాలుకా శిలలచే నిర్మింపబడినది. మసీదు మణిశిలలతోను మర్మర శిలలతోను రంగురాళ్ళతోను ముచ్చటగ నలంకరింపబడినది. ఉన్నతమైన కమానులైదు దీనికిగలవు. "దీనినిజూచిన సన్నపనితనమునందుతప్ప హిందూశిల్పికళ మరుపునకు వచ్చుచున్నది. లోకమునందలి పరిపక్వశిల్పి నిర్మాణములకొక నిదర్శనమిందు గాననగును." అని పరగస్సన్ గారు వ్రాసిరి. హుమాయూను 1555 లో విజయమునొందినపుడు డిల్లీని రాజధానినిగాజేసికొని షేరమండలము పఠనమందిరముగా నేర్పాటుజేసికొనెను. షర్షాహి నగరము 1556 నుండి క్షీణించ నారంభించినది.

హుమాయూనుని సమాధి.

హుమాయూను మొగలుసామ్రాజ్య స్థాపకునకుఁ బుత్రుడు. ఆసామ్రాజ్య స్థిర నిర్మాత కుఁ దండ్రి. ఆసుల్తానుని సమాధి షర్షాహికి దక్షిణమునందున్నది. తాజమహాలు మహమ్మదీయసమాధులలో శ్రేష్ఠమైనది. హుమ్మాయూనుని సమాధి రెండవదిగా నెన్నదగియున్నది. ఈ సుల్తాను రాజ్యభ్రష్టుడై పదియేనేండ్లు దేశద్రిమ్మరియై 1555 లో దిరిగి రాజ్యమును గడించిన యితిహాసము సుప్రసిద్ధము. హుమాయూను మృతినొందినపుడు వాని పుత్రరత్నమాక్బరు లాహోరులోనుండెను. హామీదాబీగమీసమాధినిఁగట్టించ నారంభించెను. ఆక్బరు చక్రవర్తి పదియేనులక్షలు రూప్యములను వెచ్చించి దీనింగట్టించెను. అనుదినమును రెండువందల మేస్త్రీలవంతునఁ బనిజేయగా దీనిని ముగించుటకుఁ బదియైదేండ్లు పట్టినవి. ఈదివ్య మందిరమందుగల తైమూరులంగు వంశజుల సమాధులు వేరొకచోటను లేవు. సుల్తానా హామిదాబీగముయొక్క కళేబరమును నిచట స్థాపితము సేయబడినది.

చతురశ్రాకృతిగల 11 యకరముల మధ్యభాగమునందీ సమాధి నిర్మింపఁబడినది. స్థలమంతయును ప్రాకారముచే నావరింపఁబడియున్నది. ద్వారములు దక్షిణ పశ్చిమ దిశలందుమాత్రము గలవు. పూర్వమిచటఁ బాటసారులకు ధర్మశాలలుండెడివి. సీటికాలువ లావరణమునందు నలుదిశలనుఁ బ్రవహించుచుఁ బచ్చని పచ్చికను బోషించుచున్నవి. నాలుగడుగుల యెత్తును 300 అడుగుల చతురశ్రమునుఁగల పీఠముమీద నీమందిరము గట్టబడినది. ఆపాద పీఠమున 20 అడుగులయెత్తును 254 అడుగుల చతురశ్రమునుఁ గలిగిన మందిరపీఠము గట్టబడినది. దానిమీదను 135 అడుగుల చతురశ్రముగల ప్రధానమందిరము నిర్మింపబడినది. ప్రధానమందిరము చుట్టును 20 అడుగులు వెడలుపుగల తాళ్వారము గలదు. రెండడుగుల యెత్తయిన పిడిగోడ తాళ్వారముచుట్టును నున్నది. మూలమందిరమున కెనిమిది ముఖములుగలవు. నాలుగు చిన్నముఖములు మరినాలుగు పెద్దముఖములు. చిన్నముఖములతోఁజేరి ప్రతిమూలను నెనిమిది ముఖములనుగల గదియొకటిగలదు. అగదులు 40 అడుగుల యెత్తును 20 అడుగుల వ్యాసమునుఁగలిగి చలువరాళ్ళచేఁ బరుపఁబడినవి. అగదులమీదను సొంపైన చిన్నిచప్పరములు గలవు. తాళ్వారములకును చప్పరములకును బోవుటకు నాలుగువైపులను పడికట్లుగలవు. మూలమందిరము మీదను గుమ్మటాకారముగల పెద్దకలశమును, కలశము మీద శిఖరమును,కలశము చుట్టును చిన్నిచప్పరములును గలవు. మూలమందిరముయొక్క కప్పు పీఠమునుండి 140

అడుగులును మూలమందిర పీఠమునుండి 80 అడుగులను ఎత్తును గలిగియున్నది. ఈకలశము తెల్ల మర్మరరాళ్ళచే నిర్మింపబడినది. మూలమందిరముయొక్క యంతర్ముఖములును వాటి మీదిభాగములును మర్మర శిలానిర్మితములైన రేఖావిన్యాసములతోను నంచులతోను లోభాగమునఁ దీర్చబడినవి. ప్రతికోణమునందును నష్టముఖాకారముగల శ్వేత మర్మర శిలాశిఖరము లమర్చఁబడినవి. కమానుల పైభాగములందు షట్కోణ చక్రాకారములు నిర్మింపబడినవి. కలశాచ్ఛాదితమైన మూలమందిరముయొక్క మధ్యభాగమున 6 అడుగులు పొడవును 2 అడుగులు ఎత్తునుగలిగి చలువరాతి పీఠముమీదను హుమాయూనుని చైత్యమమర్చబడినది. దీనికిసరిగాఁ గ్రిందను మూలపీఠముయొక్క మధ్యప్రదేశమునందు హుమాయూను సమాధి సున్నపురాయితో గట్ట బడినది. ఈసుందర మందిరములో రాజపుత్రుల యొక్కయు రాజాంగనలయొక్కయు సమాధు లనేకములు గలవు.

ఈమందిరము తామ్రవాలుకా శిలానిర్మితము. మర్మరశిల లచ్చటచ్చట వాడబడినవి. తాజమందిరమందు దర్శనీయంబులైన శృంగార శృంగంబు లీమందిరంబున లేకున్నను నిది యత్యంత శోభాశోభితంబై యొప్పుచున్నది. మధ్యాహ్న సమయంబున నీసుందర మందిరంబున కెదుటనున్న నీటి తొట్టెయందు బింబప్రతిబింబితములైన సూర్యకాంతులీ శోభనుఁ జెంపొందించుచుఁ జూచుటకిది రమ్యంబుగనుండును. దీని చిత్రపటము 40 పుటలోగలదు.

నిజాముద్దీను ఔలియా.

హుమాయూనుని సమాధి కనతిదూరమున సాధుసంపన్నుడైన నిజాముద్దీనునిగోరి గలదు. ఇది శ్వేతమర్మర శిలలచేఁ గట్టబడి మంచి గంధపుబల్లల తలుపులతోను మంచి పనితనముతోను నొప్పుచు నతి రమ్యంబుగనున్నది. ఈఫకీరు 92 ఏండ్లు జీవించి 1324 లో మహమ్మదు సన్నిధి కేగెను. మహమ్మదీయులీ సమాధిగలప్రదేశము నొక పుణ్యక్షేత్రముగాఁ బరిగణించుచుందురు. ఏటేట నిచట వసంతకాలమునందొక యుత్సవము జరుగును. నానాదేశములనుండియును జనులీ సాధుసమాధిని దర్శించుటకు వచ్చుచుందురు. ఈప్రదేశము నందు జహనారాబీగము, మహమ్మదుషా, మీర్జాజహంగీరు, అమీరుఖుస్రు, అజమ్‌ఖాను, మీరాఅజీజు, మొదలగు సుప్రసిద్ధ పురుషులయొక్క సుందరములైన సమాధులుగలవు. ఇచ్చటను 180 అడుగులు వెడలుపును 120 పొడవును 100 అడుగులు లోతునుగల యొక బావిగలదు.

సఫదరుజంగు గోరి.

సఫదరుజంగు పారసీక దేశస్థుడు. అయోధ్యారాష్ట్రమునకు రాజప్రతినిధిగా నుండెను. నాదిర్షాదోపిడి తరువాతను అహమదుషా బాదుషాకు మంత్రిగానుండి1753 లో బరలోకమున కేగెను. తండ్రి జ్ఞాపకార్థము వానితనయునిచే నీసమాధి గట్టింపబడినది. ఇది సామీప్యమున నున్న హుమాయూనుని సమాధినిఁజూచికట్టబడినను దానికేవిధమునను సాటిరాదు. "చిత్రమైన యద్భుతమందిరము" అని బర్నఫోర్డుగారును, "విమర్శనార్హముగాదు" అని ఫర్గన్సన్‌గారును దమ మతములనుఁ దెలిపియున్నారు. 89 పుటలో నీసమాధి చిత్రపటము గలదు. దానింజూచి చదువరు లందలి విశేషంబులను గ్రహించెదరుగాక!

యంత్ర మంత్రాలయము.

జయపురము మహారాజు రాజా జయసింగు జ్యోతిషశాస్త్రవేత్త. మహమ్మదుషా చక్రవర్తికై యాదృగ్గణిత నక్షత్రాలయము 1730 లోఁ గట్టుట కారంభమయినది. యోజకుని యకాల మరణమువలన నీశాలానిర్మాణము పూర్తిగాలేదు. ఇచట నొక నాడీమండల సూర్యయంత్రము గలదు. ఛాయాయంత్రము దానియంచులు కమానులు చలువరాళ్ళచే నిర్మింపబడినవి. అంశలను జూపు వృత్తపరిధియును కీలకమును జాలచోట్లను చెడినవి. కీలకముయొక్క లంబము 56 అ. 9 అం., కర్ణము 118 అ. 7 అం, మూలరేఖ 104 అ. 1 అం, పొడవును గలిగియున్నవి. దీని కుపరిభాగమున రెండువైపులను ప్రాక్పశ్చిమస్థ వస్తువుల యున్నతాంశను నిర్ణయించుటకై యంశచిహ్నితమైన యర్ధవృత్తము గలదు. వీటికి దక్షిణభాగమున వ్యోమగోళమును దెలుపు మధ్యనిమ్నిత నిర్మాణ

ముగలదు. దీనికి దక్షిణదిశను గ్రహతారకముల దిగంశ
కోటిని నున్నతాంశను గనుగొనుటకు రెండువర్తులాగార
ములు గలవు. వృత్తముయొక్క 360 అంశలను దెలుపు
టకే యంత్రాగారములనుండి మూడడుగుల యెత్తుగల
ముప్పది యనువస్త్రశిక్యలు శిలచే నిర్మింపబడినవి. ఈదృ
గ్గణితశాలయంతయును నతివిచిత్రముగా నొప్పుచున్నది.
ప్రాచీన ఢిల్లీనగరములందింకను దర్శనయోగ్యములైన స
మాధులు, మందిరములు, కాసారములు, కూపములు వి
శేషముగాగలవు. ఇంతటితో నీశిథిల నగరముల సంక్షేప
వృత్తాంతమును నావలబెట్టి వర్తమాన ఢిల్లీనగర వృత్తాం
తము నించుక పరిశీలించుట యుచితము.

### షహాజహానుకోట.

అక్బరు జహంగీరు షాహుషాల కాగ్రానగరము రా
జధానిగానుండెను. వారికాలములో నానగరరాజము ది
వ్యసుందర మందిరములచేతను, నవ్యోద్యాన వనములచే
తను నలంకరింపబడినది. షహాజహాను రాజధానిని ఢిల్లీ
నగరమునకు మార్చెను. ఈమార్పుదలకు గారణము వా
నిమందిరనిర్మాణదాహమని యూహించవలసి యున్న
ది. ఆగ్రాయందు దివ్యసుందర తాజమహాలును నిర్మించు
టతోనైనను షహాజహానుని మందిరనిర్మాణతృష్ణ కుపశ
మనము గలుగలేదు. ఈదాహశాంతికి ఆగ్రానగరమునం
దు సాధనములు లేవు. శిల్పికళాదక్షత్వము దివ్యసుందర
తాజమందిర నిర్మాణమునందుఁ బరిపూర్ణత్వమునుఁ గాం
చినది. షహాజహాను మందిర నిర్మాతలకు నాయకుడు.
ఆచక్రవర్తి మందిరనిర్మాణ తృష్ణాసంపూరణము షహాజ
హానాబాదు రూపమునఁ బరిణమించినది.

షహాజహాను త్రామదుర్గములేక లాల్కోటను
1638 లోఁ గట్టింప నారంభించి 1648 నందు ముగింపున
కుఁదెచ్చెను. అనంతరము పదేండ్లకు షహాజహానాబాదు
నుఁ గట్టించెను. ఈనగరమును కోటయును నిప్పటికిని
కొంచెమించు మించుగా మంచిస్థితిలో నున్నవి. పట్టణ
ముయొక్క గోడల కైవారము 5½ మైలులు. కోటను
కోటగోడలను హర్మ్యప్రాసాదంబులనుఁగట్టుటకు 120లక్ష
లరూప్యములు వ్రయమైనటు లెంచఁబడినది. నగరమున
కుత్తరదిశను కాశ్మీరు మోరియని రెండును, పడమటకా
బూలు లాహోరు అజ్మీరు అని మూడును, దక్షిణమున
తురుష్క ఢిల్లీ యని రెండును, తూర్పున ఖరియాతి, రా
జఘాటు, కలకత్తా, నిగంబోధ, కేలాఘాటు, పథారుఘా
ట్టి, బదరురావు అనియేడును మొత్తమున పదునాలుగు
ద్వారము లమర్చబడినవి. మరి పదునాలుగు దిడ్డిత్రోవ
లును నిరువదియేడు కోట బురుజులును నుండెడివి. ఆం
గ్లేయుల యాక్రమణానంతరము వీటిలో విశేషభాగము
శిథిలములైనవి. కోటయందు బ్రవేశించునపుడు లాహో
రుద్వారము దర్శన యోగ్యముగనుండును. ఇది 110 అ
డుగుల యెత్తునుఁగలిగి యిరుప్రక్కలను నెనిమిదిముఖ
ములుగల బురుజులతో నొప్పుచున్నది. బురుజులమీద
ను శంకుబద్ధ మండపములు గలవు. బురుజుల నడుమను
శిథిలప్రాకారముగలదు. దానిమీదను చిత్రవిచిత్రముగా
నిర్మింపబడిన పంచపాళిగలదు. దానిమీదను శంకుబద్ధ
మర్మరశిలా నిర్మితకలశములేడు గలవు. కలశోపరిభాగ
మున నొకశిఖరమును శిఖరాగ్రమున చలువరాతి చప్పర
ములును గలవు. చప్పరముల వెనుకభాగములందు జిన్ని
మంటపము లమర్చఁబడినవి. లాహోరు ద్వారమునకు
మూడంతస్థులుగలవు. 1857 సెప్టెంబరు 20 వ తేదిన
ద్వారమునుఁ బగులగొట్టి యాంగ్లేయులు నగరులోఁ బ్ర
వేశించిరి.

ఈద్వారమున కంతర్ముఖమున రాజకుటుంబమున
కై యొక పణ్యశాల పూర్వముండెడిది. పణ్యశాలకను
సంధానమై యుమ్రావుల నివాసమునకై యేర్పడిన న
కారుఖానాయుండెడిది. తూర్పుభాగమున నౌబతుఖానా
యుండెడిది. రాజపుత్రులు దప్పఁ దక్కినవారందరును న
కారుఖానానుండి పాదచారులై రాజగృహ ప్రవేశమునుఁ
జేయుచుండెడివారు. దీవాని ఆమ్నకుఁ బోవుటకు నకా
రుఖానా ద్వారముగా నుండెడిది. దీవాని ఆము 550 అ
డుగులు పొడవును 300 అడుగుల వెడలుపునుఁ గలిగిన
ప్రాంగణమునుఁగలిగి చుట్టును నొక యంతస్తుగల గదుల
నుఁగలిగి యుండెడిది. ఈగదులు రాజకీయోద్యోగస్థులకు
ను నుమ్రావులకును వాసస్థలములుగనుండెడివి. ఈప్రాం

గణమున కుత్తరదిశను రాజమహాసనమును దక్షిణమున రాణివాసములును తూర్పున రాజసభయును పశ్చిమదిశ నొకగోడయును నుండెడివి. దివాని ఆము అని పిలువబడెడి ఈసభాభవనముయొక్క తూర్పుదిశను మధ్యభాగమునపదియడుగులయెత్తున మయూరసింహాసనముండెడిది. “మయూర సింహాసన మారు బంగారుకోళ్ళపై నిర్మింపబడినది. కోళ్లు నవరత్నఖచితములు. సింహాసనము 6 అడుగులు పొడవును 4 అడుగులు వెడలుపునుఁ గలిగి వెనుకభాగమున రెండు మయూర విగ్రహములనుఁ గలిగియుండెడిది. నెమలులకు నడుమను నచ్చని పచ్చతో నిర్మించబడిన చిలుక యుండెడిది. సింహాసనమున కిరుపార్శ్వములందును రెండుఛత్రములుండెడివి. ఛత్రములదండములు స్వర్ణనిర్మితములు రత్నఖచితములు. గొడుగు గుడ్డ సరిగతోను ముత్యములతోను నలంకరింపబడిన యెర్రముకమలు. సింహాసనముపైన పండ్రెండు స్తంభములపై నమర్చబడిన బంగారు కప్పుండెడిది. మయూరముల సహజవర్ణములు గోచరించునటు లారూపములు నవరత్నములచేఁ జెక్కబడినవి. ఈసింహాసన మంతయును బంగారముతోను వెలలేని రత్నరాసులతోను నిర్మింపబడినది. దీనిమూల్యము కోటిన్నరమొదలు తొమ్మిదికోట్ల రూప్యములవరకు నుండునని వదంతి” అని బెరనుఫోర్డు వ్రాసియున్నాడు. దీనిని 1739 లో నాదిర్షా 120 కోట్ల రూప్యములు విలువగల ద్రవ్యముతో సహా దోచుకొని పోయెను.

ఈకోటయందు మర్మరశిలలచే నిర్మింపబడి రజతసువర్ణరత్నఖచితమైన దివానిఖాను అనుమందిర మతిసుందరముగ నుండెడిది. మహారాష్ట్రులు దీని తొడుగును దోచికొని పోయి కరిగించగా వారికి 28 లక్షలరూప్యముల ద్రవ్యము లభించినది. సాదుల్లాఖాను దీనినిగుఱించి యిటులువ్రాసెను, “భూలోకమందు స్వర్గమున్న నది యిదేను ముమ్మాటికిదియేను.”

ఖాస్ మహాలు, ఆమ్ఖాను, రంగ్ మహాలు, ఇమ్తియాజ్ మహాలు, మొదలగునవియును, ఔరంగజేబుచే గట్టింపబడిన మోతీమసీదును దర్శనయోగ్యంబులైన సుందరమందిరంబులు. ఇపుడీ దివ్యమందిరములు బ్రిటిషు సైనికులకు నివాసస్థలములుగను, మందుసామానులను దాచుటకు గదులుగను, మూత్రపురీషములను విసర్జించుటకుఁ దగినచోట్లుగను వాడబడుచున్నవి. ఈసర్వసంహారము న్యాయదూరులైన మహారాష్ట్రులును, పశుప్రాయులైన యాఫ్గనులును, లుబ్ధాగ్రేసరులైన రోహిలాలును, దుష్టులైన ప్రేక్షకులును గావించిన నష్టమున కనేకమడుంగు లధికముగా నున్నదని యొకయాంగ్లేయుఁడు వ్రాసియున్నాడు.

షహజహాను నగరము.

ఢిల్లీయందు రైలుదిగినవెంటనే రాణీతోటయును చాందినీ చౌకుయును దృక్పథంబునఁ బడుచున్నవి. ఈ రెండును షాజహానుని ప్రియసుతయైన జహానారా బీగముచే నిర్మింపబడినవి. ఆంగ్లేయాక్రమణానంతరమీతోట రాణీతోటగా మార్చబడినది. దానిలో యాత్రికులు దిగుటకొక సత్రము, పఠనమందిరము, నగరపారిశుద్ధ్యసంఘకార్యాలయము, విక్టోరియామహారాణి చలువరాతివిగ్రహమునుగలవు. ఇవి ఆలిమిర్దానుచే నిర్మింపబడినవి. ఈవిశాలోద్యానవనము చూచుట కతిరమణీయముగనున్నది. నీటికాలువలు తోటగుండా పారుచుండును. తోటకెదుటను 110 అడుగుల యెత్తయిన గంటా గోపురము చాందిని చౌకునకు నడుమను గలదు. చాందినిచౌకు 40 గజముల వెడలుపును 1520 గజములపొడవును గలిగి మధ్యభాగమున చెట్లపంక్తులతోను నిరుపార్శ్వంబులందును సుందరప్రాసాదంబులతోను విరాజిల్లుచున్నది.

ఈవీధికి పశ్చిమభాగమున షాహజహాను భార్య ఫతేపురి బీగముచేఁ గట్టింపబడిన యొకచక్కటి మసీదు గలదు. పూర్వము ఢిల్లీ వైభవమంతయును నీవీధిలో దాండవమాడుచుండెడిది. ఒకయంగడియందతి చిత్రములైన రత్నకంబళులు ప్రదర్శింపబడుచుండెడివి. ఒకదుకాణమునందు చీనిచీనాంబరములు రమ్యంబుగ నొప్పుచుండెడివి. ఒకపణ్యశాలయందు సన్నసెల్లాలు నేతగాండ్రనైపుణ్యమునుఁ జాటుచుండెడివి. ఒకవిక్రయశాలయందు వెండిసామానులును, సువర్ణాభరణములును, రత్నఖచితభూష

ణములును నిర్వైరపాటునుఁ గలిగించుచు స్వర్ణకారుల విన్నాణంపు పనితనమునుఁ బ్రకటించుచుండెడివి. ఒకయాపణమునందు విచిత్రాకృతులచే నంతర్ఖచితములైన దంతపుసామానులచ్చెరువునుఁ బుట్టించుచుండెడివి. ఒకప్రదేశమునందు జల్తారుబుటేదారుపనితో విచిత్రముగఁ గుట్టబడిన కంచుకాంబరంబులమందానందంబుఁ బుట్టించుచుండెడివి. ఒకచోట సరిగపనితో నతివిచిత్రముగా కుట్టబడిన పాదరక్షలు సహితమానగరవైభవమునకు నిదర్శనముగా నుండెడివి. ఆనగరావతంసము సకలసంపదల కాకరముగ నుండెడిదనుట కొకనాదిర్షా కొల్లగొనిపోయిన 120 కోట్లద్రవ్యమును నెమలిసింహాసనమును జాలియున్నవి. లోకవిఖ్యాతులైన శిల్పికారులకును, చిత్రకారులకును, స్వర్ణకారులకును వాసస్థలముగ నుండినదనుటకు షాహజహానుని సుందరమందిరములును, మయూర సింహాసనమును ప్రత్యక్షప్రమాణములు. ఢిల్లీవర్తకు లిపు డితరప్రాంతవర్తకులవలెఁ బరదేశవస్తు వ్యాపారమువలన ధనమునార్జించుచున్నారు. కాని గతడిశంబరుమాసమునందు చాందినీచౌకులోని వెండిసామానులను, బుటేదారువస్త్రములను, దంతపుసామానులనుఁ జూచినవారలకు బ్రాచీనఢిల్లీవైభవము మనోగతంబగుచు హైందవకళా నైపుణ్యము నన్నగిలినను నశించలేదను నమ్మకమేర్పడగలదు.

సోనేరి మసీదు.

ఇది చాందినీచౌకునకు తూర్పుభాగమునందున్నది. దాని ప్రాముఖ్యతకు గారణము నాదిర్షా ఘోరకృత్యము గాని మందిర సహజసౌందర్యముగాదు. నాదిర్షాఢిల్లీనగరవాసులను స్త్రీలనకఁ బురుషులనకఁ బెద్దలనకఁ బిన్నలనక నొక్కపెట్టున జంపుటకు సేనకాజ్ఞనిచ్చి యీమసీదుమీద నెక్కికూర్చుని ఘోరవధనుజూచుచు సంతసించెనట!

జినాతల్ మసీదు.

ఇది ఔరంగజేబుకూతురు జినాతుల్ నిస్సాబీగముచేతను 17[illegible]0లో గట్టింపఁబడినది. ఈరాకుమారి బ్రహ్మచారిణిగానుండెను. ఈమసీదు యమునానదీతీరమున కోటప్రక్కనున్నది. మసీదు 14 అడుగులయెత్తుగల పీఠముమీదను గట్టబడి 150 అడుగులు పొడవును 60 అడుగులవెడల్పును గలిగియున్నది. మసీదుముందుప్రాంగణమును తటాకమును గలవు. మధ్యకలశము 37 ప్రక్కకలశములు 30 అడుగుల యెత్తునుగలిగియున్నవి. ఈమసీదు ఎఱ్ఱరాతితోఁ గట్టబడినది. సిపాయిల తిరుగుబాటు సమయమునను పిమ్మటను నిది బ్రిటిషుసైనికుల మూర్ఖత్వమునకుబలియై శిథిలావస్థలోనున్నది. ఈమసీదు జూమామసీదు ఢిల్లీయందు సందర్శింపదగిన మందిరములని కన్నింగుహాముగారు వ్రాసియున్నారు.

నిగమబోధ ఘట్టము.

ఇపుడు నిగంబోధఘాట్ అను ప్రదేశమునందు ద్వాపరమునందు ధర్మజుడు రాజసూయాధ్వరమునుఁ జేసినాడనియును దానికిసమీపమునందున్న నీలిఛత్రియను చోటను ధర్మజుడు దేవళంబునుఁ బ్రతిష్ఠించెననియును పురాణప్రతీతిగలదు. ఇప్పటిదేవళంబును మహారాష్ట్రులు గట్టినారని కన్నింగుహాముగారి యభిప్రాయము.

ఖాసు మైదానము.

పాదుషాల కాలమునందిచట చక్రవర్తికొలువులోనున్న రాజులగుడారము లుండెడివనియును నశ్వపరీక్షకు డశ్వములం బరీక్షించుచుండెడి వాడనియును బర్నియారు వ్రాసియున్నారు. ఈమైదానమునందు శ్రీసప్తమ ఎడ్వర్డు స్మరణచిహ్నమునకు శంకుస్థాపనము శ్రీపంచమజార్జి రాజేంద్రునిచేఁ జేయబడినది. దీనిపటము 48పుటలోఁ గలదు.

సాలిమ్ గఢ.

ఈకోట షర్షాకొడుకైన సలీంషాచే 1546లో యమునానదీ జలమధ్యంబుననుండెడి లంకమీఁదను గట్టబడినది. 1552లో నీకోటను ముగించుటకుఁ బూర్వము సలీంషా పరలోకమున కేగెను. ఈకోటప్రక్కను ఈస్టిండియా రైలుకంపెనీచే యమునానదిమీదనుఁ గట్టఁబడినవంతెనగలదు. 2640 అడుగుల పొడవైన ఈవంతెనకురూ. 16,60,355 వ్యయమైనవి. శ్రీపంచమజార్జి చక్రవర్తి సలింగఢకోటగుండా ఢిల్లీనగరములోఁ బ్రవేశించిరి. ఈదుర్గమిపుడు పాడుపడియున్నది.

### కాలా మసీదు.

ఇది 1386నందు ఫిరోజషహావలన గట్టింపఁబడి ఫిరోజాబాదు నగరమునందుండెడిది. దీనియందు మిగిలిన మసీదులందుండు చెక్కడపుఁపనులుగాని చిత్రనిర్మాణములుగానిలేవు. ఇదిసామాన్యమైన నల్లరాతితోఁ గట్టఁబడి సహజసౌందర్యమును గలిగియున్నది. ఈమసీదునకు గోపురములుగాని శిఖరములుగానిలేవు. దానిప్రాచీనత్వమె దానిప్రసిద్ధికిఁగారణము. దీనిపొడవు 71అడుగులు వెడలుపు 41 అడుగులు భూమట్టమునుండి ఎత్తు 66 అడుగులు. ఇంకను జూడదగిన సుందరప్రదేశము లనేకములుగలవు. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించి సుప్రసిద్ధమైనజూమామసీదుయొక్క నిర్మాణము విచారణీయము.

### జూమామసీదు.

సౌందర్యరాసియైన తాజమహాలునకును, నింద్రసభాసదృశంబైన దివానిఖాసునకును, నిరుపమానంబైన మయూరసింహాసనంబునకును నిర్మాత, మందిరనిర్మాతలకు రాజు షహాజహానుచక్రవర్తి జూమామసీదునుఁ గట్టించెను. ప్రప్రథమమున మనుజుల శిల్పికళాదక్షత్వము దేవాగారనిర్మాణమునకై వినియోగింపఁబడుచుండెడిది. హిందూదేవళంబులు, బౌద్ధవిహారంబులు, మహమ్మదీయ మసీదులు, క్రైస్తవప్రార్థనామందిరంబులు పరిపక్వ శిల్పిరచనా నైపుణ్యంబునకు నిదర్శనంబులుగానున్నవి. దివ్యాంతఃపురంబులందును చైత్యనిర్మాణంబులందును నయిత మీకళానైపుణ్యంబుప్రదర్శింపఁ బడుచున్నది. ఈకాలంబునజనోపయోగమందిరంబులం దీనైపుణ్యంబు విశేషంబుగఁ బ్రదర్శింపఁబడుచున్నది. డిల్లీయందు షాహజహాను నిర్మితంబులైన యనేకమందిరంబులు శిథిలావస్థయందున్న నుజూమామసీదు మంచిస్థితియందున్నది.మహమ్మదీయులందు స్థలములందు ప్రార్థనకై సామాన్యముగ మసీదులుండును. వాటియందు విశేషభాగము జూమామసీదులనఁబడును న్నవి. ఆ మసీదులలో సుందరతరమైనది డిల్లీయందలి జూమామసీదు.

ఈమసీదునిర్మాణము 1644 లోనారంభమై 1650 లో జాలభాగము సిద్ధమై 1658లో సంపూర్తినొందినది. మొదటియారేండ్లలో ననుదినము 5000 పనివాండ్రు పనిఁజేయుచుండిరనియును పదిలక్షలు రూప్యములు వ్యయముచేయబడినవనియును మసీదునందలి శాసనంబులందు వ్రాయంబడినది. ఈమందిరనిర్మాణము పూర్తియైన వత్సరంబుననే ఔరంగజేబు తండ్రిని కారాగృహవాసునింజేసి సింహాసనంబునధిష్ఠించెను. "భోగ్లాపహాడ్" అనుకొండగుట్టచదునుచేయబడి మసీదు దానిమీదనుఁ గట్టబడినది. గుట్టయొక్క వికారాకృతిని మరుగుపరచుటకుఁ గ్రింది భాగమంతయును గొప్పచదరపురాళ్ళచేతనుఁ జుట్టునుగప్పఁబడినది. "దీనినిర్మాణ మాగ్రాకోటయందలి మోతిమసీదువలెనున్నది. దానికంటె నిది మిక్కిలిపెద్దది. దానియందులేని రెండుశృంగారశృంగంబు (Minarets) లిందుగలవు... చూచినతోడనే పరమానందమునుఁ బుట్టించుటకై గట్టఁబడిన లోకాలంకారములైన మసీదులలో నొకటియని చెప్పనగును" అని ఫర్గస్సనుగారు వ్రాసిరి.

మసీదుపీఠము 30 అడుగులయెత్తును 1400 చతురపుగజముల ప్రదేశమును గలిగియున్నది. ఈపీఠముమీదను నాలుకాశిలాస్తంభములును, స్తంభోపరిభాగంబులందుఁ గృత్రిమ తోరణంబులును, తోరణంబులమీద దీర్ఘచతురశ్రాకారములును గలిగి బహిర్ముఖంబులందు సంధింపఁబడి లోతట్టును వాలియుండు పైగోడతోఁ గలియకను గలిగియున్నవి. గోడకను సంధానముగా గప్పునకప్పుమీదను సైన్యము పగిదిబారులు తీర్చిన పిడిగోడలునుగలవు. ఈవిధమున నాలుగుదిశలందును రమ్యంబుగా మసీదమర్చబడినది. మసీదునకు నాలుగుప్రక్కలను వేదికలను మధ్యభాగంబులందు మూడుదిశలనుద్వారంబులునుగలవు. ద్వారంబులంజేరుట కుత్తరంబున 39,తూర్పున 35, దక్షిణంబున 33 పడికట్లుగలవు. పడికట్లిపుడు క్రయవిక్రయస్థలములుగా వాడబడుచున్నవి. తూర్పుద్వారము రాజద్వారమని పేరొందినది. చక్రవర్తులకుమాత్ర మిది పూర్వము మార్గముగనుండెడిది ఇప్పుడైన నిదిమూయబడియుండి బ్రిటిషు రాజ్యాధిష్ఠాతలును రాజప్రతినిధులును విచ్చేయునపుడుమాత్రము దెరువబడుచున్నది. మూడు ద్వారములలోను నిదియెత్తయినది, సొగసయినది, విశాలమయినది.

ప్రాగ్ద్వారము సమానాష్టముఖములుగలమూడంత స్తుల గోపురము. ద్వారము 60 అడుగులు వెడల్పును 50 అడుగులు మందమును 50 అడుగులు ఎత్తునుగలిగి దుశ్ఛేద్యముగానున్నది. ఉపరిభాగమున పట్టెలుదీర్చిన పిడిగోడ యందముగా సమర్చబడినది. పిడిగోడమీదను ముందుభాగమున 19 ప్రక్కలను 3 కమానులుగలవు. ఈకమానులు సన్నరాతి స్తంభములమీద సమర్చబడినవి. ప్రత్యేక ముఖకోణమునను తామ్రపువాలుకాశిలానిర్మిత మైన యష్టముఖ స్తంభమును దానిపై చలువరాతి కలశమును కలశాగ్రమున శ్వేతశూలమునుగలవు. ప్రతివెనుకకోణమునను మర్మరశిలా స్తంభమును తదుపరిభాగమున శ్వేతశూలోపేతమైన చిత్రాగ్రమును నొప్పుచున్నవి. సింహద్వార మొకవిశాల తోరణాకృతిని బూర్వదిశయందు గలదు. గర్భద్వారము నయితము తోరణాకృతిని గలిగి పైభాగమున మూడుచిన్నికమానులను గలిగియున్నది. వీటిలోని మధ్యకమానుమీదను ప్రలంబవరండముగలదు. ఆవసారా గురుపీఠముగ నుపయోగపడుచున్నది.

దక్షిణోత్తరద్వారములు తూర్పుద్వారమునకన్న చిన్నవియైనను నాకృతి నిర్మాణములయందు మూటికిని వ్యత్యాసములేదు. ఆద్వారము లసమానములైన అయిదు ముఖములను గలిగియున్న రెండంతస్తులగోపురములు. ఈరెండుద్వారముల పైభాగములందును కలశములనుగల స్తంభములు పదియైదును చిత్రాగ్రములను గల స్తంభములారును గలవు. మూడుద్వారములకును పెద్దతలుపులుగలవు. అరంగుళము మందముగల యిత్తడిరేకులు తలుపులకు దొడుగు తొడుగఁబడినది. ఇత్తడిరేకు మీదను సుందరమైన సన్నపనితనము గలదు.

ఈద్వారములనుండి లోపలప్రవేశించినపుడొక పెద్దప్రాంగణము కంటఁబడును. ఈముంగిలి తామ్రపువాలుకాశిలలచేత చౌకములుగా గప్పబడి మధ్యభాగమునందు 40 అడుగులు పొడవును 36 అడుగులు వెడల్పును గల చలువరాతికొలనును గలిగియున్నది. కొలనుయందలి ధారాయంత్రములిపుడు చెడిపోయినవి. ద్వారముల కిరుపార్శ్వంబులందును ప్రాంగణంబునకు మూడువైపులను దై ర్ఘసోపానసకైగదులుగలవు. ఇట్టిగదులు తూర్పుద్వారమునకు రెండుప్రక్కలను 15చొప్పునను నుత్తరదక్షిణద్వారములకు రెండుప్రక్కలను 17 చొప్పుననుగలవు. ఉత్తరభాగమందొక వివిక్తప్రదేశమునందు బవిత్రములైన మహమ్మదు దేవదూతయొక్క స్మరణచిహ్నము లత్యంతశ్రద్ధతోఁ గాపాడబడుచున్నవి. "కొరానుయొక్క 28వ అధ్యాయము. ఇదిమహమ్మదుయొక్క అల్లుడైన అలిచేవ్రాయఁబడిన [illegible] ధ్యాయము. ఇది మహమ్మదు మనుమడైన హుస్సేనుచే వ్రాయఁబడినది. మహమ్మదుధరించిన పాదరక్ష. (కఫీష్ ముబారక్.) మహమ్మదుగడ్డమునందలి తామ్రకేశము(మూయిముబారక్.) మహమ్మదుమర్మరశిలాపాదాంకము" ఈపవిత్రచిహ్నములు మొగలు వంశజులకు మూలపురుషుండైన తైమూరుచే మెక్కానుండి తీసుకొని రాఁబడినవని ప్రతీతిగలదు. మసీదుయొక్క నాలుగు మూలలందును పైభాగములందును గుమ్మటాకారము గల చలువరాతిచప్పరములుగలవు. కలశాగ్రములందు స్వర్ణమండిత తామ్రశిఖరములు ప్రకాశించుచున్నవి.

పశ్చిమదిశను మసీదునకు ముఖ్యాంగమైన గర్భమందిరముగలదు. ఆగర్భాగారము 261 అడుగుల పొడవును 90 అడుగుల వెడలుపునుగలిగి 5 అడుగుల యెత్తు పీఠము నలంకరించుచున్నది. గర్భాగారప్రవేశమున నొక గొప్పద్వారమునుబోలిన మార్గము మధ్యభాగమునను రెండుప్రక్కలను కమానులుగల పంచద్వారములును గలవు. మధ్యద్వారమున కిరుపార్శ్వంబులందును మంటపకలశశిఖరోపేత స్తంభములుగలవు. ద్వారమునకు మధ్యప్రదేశమున వేదికయును నుపరిభాగమున పట్టెలుదీర్చిన పిడిగోడయునుగలదు. గర్భాగారమునందొక మధ్యశాలయును రెండుపార్శ్వశాలలునుగలవు. వీటికి పృష్ఠభాగమున సప్తశాలలుగలవు. ప్రతిశాలయందును వెనుకగోడయందు మిహ్రాబును ముందుభాగమున తోరణబద్ధ ప్రవేశమార్గమునుగలవు. రెండుచివరలనుండు శాలలకును బహిర్మార్గములునుగలవు. అంతర్భిత్తిముఖములు మూడడుగుల యెత్తుగల మర్మరశిలా నిర్మితకీలములచే నలంకరింపఁబడినవి.

నేలయంతయును 3అడుగులు పొడవు 1½ అడుగులు వెడల్పునుగల చిత్రాసనములమాడ్కి దైవోపాసనార్థము 899 గళ్లుగా నల్లపలకరాళ్ళ యంచులుతీర్చిన తెల్లచలువరాళ్ళచేఁ బరువఁబడి యతిరమణీయంబుగ నొప్పుచున్నది. మధ్యమిహ్రాబునకు సమీపమునందు గోడయందు గమానుగల పెద్దగూడొకటిగలదు. ఆగూడున కన్యశిలా సంధానములున్నటులు గన్పించినను నది యేకమర్మరశిలానిర్మితము [illegible] నునై శోభిల్లుచున్నది.

మధ్యాగారంబున కిరుపార్శ్వంబులందును రెండు విశాలోన్నత శృంగార శృంగంబులు చలువరాళ్ళ నిలువుపట్టెలనుగలిగి, యెఱ్ఱరాతితోఁగట్టబడి, 130 అడుగులయెత్తును, 130 మెట్లను, మూడంతస్తులను, చుట్టుతాళ్వారంబులను, మర్మశిలా నిర్మితమంటప కలశ శిఖరంబులను గలిగి మసీదుయొక్క దివ్యసౌందర్యంబునుఁ జాటుటకు నిలుపఁబడిన జయస్తంభముల భంగిని భాసిలుచున్నవి.

మధ్యాగారంబునకు వెనుకతట్టున మధ్యమిహ్రాబునకుపరిభాగంబున రెండువైపులను మర్మరశిలా కలశంబును సువర్ణమండితశిఖరంబును గలిగిన యష్టకోణమంటపంబును నలుమూలలందు చతుష్కోణమంటపంబులును గలవు. మసీదున కుపరిభాగంబున మూడు బ్రహ్మాండకలశంబులుగలవు. మధ్యకలశము మూటిలోను పెద్దది. ఈకలశములు నల్లనిలువుపట్టెలనుగలిగి శ్వేతమర్మరశిలలచే నిర్మింపబడి సువర్ణమండిత శిఖరంబులతో మెరయుచున్నవి.

ఈసుందరమందిర దివ్యవిభవాభిరామంబును దానిం జూచినవారు పరిపరివిధంబుల వర్ణించిరి. మసీదునందలి సుందర తోరణంబులును, గంభీరద్వారంబులును, విలాస మంటపంబులును, శృంగార శృంగంబులును, బ్రహ్మాండకలశంబులును మందిరవైశాల్య రామణీయకంబులకుఁ దగినపగిదిని సాహచర్యంబును వహించుచు సందర్శనమాత్రమునఁ బ్రేక్షకులకనిర్వచనీయంబైన భక్త్యుత్సాహంబులం బుట్టించుటకిది భూలోకాలంకారంబులైన దివ్యమందిరంబులలో నొకసుప్రసిద్ధ మందిరముగా నెన్నఁబడుచున్నది.

దీని చిత్రపటములు 36,43,44 పుటలలో జూపబడియున్నవి. 36 పుటలోని పటములు గర్భమందిరముగల పడమటిదిశపటములు. 43, 44 పటములు శ్రీపంచమజార్జి రాజేంద్రుని సందర్శించుటకు జనులు దక్షిణతూర్పుదిశలందు గూడుటను జూపుచున్నవి.

## ఆంగ్లేయ ఢిల్లీనగరము.

హైందవ సైన్యాపరాగానంతరము ఢిల్లీనగర మాంగ్లేయులవశమైనది. నిరపరాధులైన యాంగ్లేయులనేకులను 1857 మెయినెలలో మహమ్మదీయులు వధించిరి. హతశేషులు ఫ్లాగుస్టాఫ్గోపురమున దాగియుండిరి. హోమ్సు సాహెబ్లు, బజ్జెను, కార్మకెయిలు మొదలగుశూరులు కాశ్మీరద్వారమునకు బెట్టిన సురంగమునకు నిప్పంటించుటలోఁ బ్రాణంబులం గోల్పోయిరి. ప్రజ్ఞావంతుండును సాహసికుండును నగు జనరలు నికోల్సనుకోటలో బ్రవేశించినవెనుకను బ్రాణంబులం గోల్పోయెను. లక్షలకొలది శత్రువులనడుమ నాంగ్లేయులు దమప్రాణంబులం గాపాడికొనినవిధంబును ఆమూకల నోడించి ఢిల్లీనిఁ బట్టుకొనిన విధంబును ఢిల్లీచరిత్రలో వీరకరుణారస పూరితంబైన కడపటి యితిహాసంబు. ఆయేడు 21వ సెప్టంబరు ఢిల్లీనగర మాంగ్లేయాక్రమణమునకుఁ బాలైనది. ఆక్రూరహత్యలను నాంగ్లేయసైనికుల పరాక్రమమును గుర్తించుట కనేక స్మరణచిహ్నము లిప్పటి ఢిల్లీయందు నెలకొలుపబడినవి. వాటిలో ముఖ్యమైనవి జనరలు నికోల్సనుగారి విగ్రహము సైన్యాపరాగ స్మరణచిహ్నము, ఫ్లాగ్స్టాఫ్ గోపురము, హిందూరావు గృహము మొదలగునవి.

ఆంగ్లేయాక్రమణానంతర మీపట్టణమును నితరపట్టణంబులవలె నభివృద్ధినిఁ జెందుచున్నది. జనసంఖ్య 1881లో 173,397, 1891లో 1,92,579 1901లో 2,08,575 1911లో 232,859గా నున్నది. ఈజనాభివృద్ధికి గారణము పరిశ్రామికాభివృద్ధి. ఢిల్లీపట్టణము పూర్వమునుండియును వెండిబంగారు నగలకు, ఇత్తడిరాగిపాత్రలకు, దంతపువనులకు, మట్టిపాత్రలకు, సన్నసెల్లాలకు, జలతారు కుట్టుపనులకు, సూక్ష్మాకార పటలేఖనమునకు జగత్ప్రఖ్యాతినిఁగాంచినది. చిత్రవిచిత్రమైన దంతపు సామానులు

The Marquis of Crewe.



క్రూ ప్రభువు, హిందూ దేశపు మంత్రి.

The Marchioness of Crewe.



క్రూ ప్రభ్వీణి.

His Excellency Sir Goerge Clarke.
Governor of Bombay.



సర్ జార్జి క్లార్కుగారు
బొంబాయి గవర్నరు.

Her Excellency Lady Clarke.



క్లార్కు దొరసానిగారు.
బొంబయి గవర్నరుగారి భార్య.

Their Majesties starting for the State entry into Bombay City.



శ్రీరాజదంపతులు అపోలోబందరునుండి బొంబాయి నగర
సందర్శనమునకు బయలు దేరుట.

The Pavillion at the Apollo Bundur.



బొంబాయి అపోల్లో బందరులో శ్రీ రాజదంపతులు దిగుటకయి
కట్టబడిన మందిరము.

His Excellency Lord Carmichael, Governor of Madras.



కార్మయికేల్ ప్రభువు. చెన్నపురి గవర్నరు.

Her Excellency Lady Carmichael.



కార్మయికేల్ ప్రభ్వీణి.

యారుచేయఁబడుచున్నవి. ఈసామానులు ఉద్ఘటిత చిత్రములతోను రేఖావిన్యాసంబులతోను రమణీయంబుగనుండును. ఒకటి రెండు దుకాణములందుఁ బదిలక్షలరూప్యములవిలువగల సామానులుగలవు. ఆదుకాణదారు లీనిర్మాణనైపుణ్యమును గోప్యముగ నుంచుచున్నారు. కల్తీలేని మందిజలతారిచట సిద్ధముసేయుబడుచున్నది. జలతారుచేయువాండ్రు పట్టణ పారిశుద్ధ్యసంఘమునకు సంవత్సరమునకు రూ. 25,000ల నిచ్చి కలితీలేని జరీ తయారుచేయుటకు దగిన కట్టుబాటులను వారిచే జేయించుచున్నారు. అందువలననే ఢిల్లీజరీకలితీలేనిదని ప్రసిద్ధికెక్కినది.

నూతనముగ దూదియంత్రాలయములు, పిండియంత్రాలయములు, సర్కరయంత్రాలయములు, లోహయంత్రాలయములు, బిస్కోతులనుజేయు శాలలుస్థాపింపబడినవి. కొద్దిపరిశ్రమలనేకములు నూతనముగ స్థాపితములైనవి. ఉత్తరమునుండి ప్రాక్పశ్చిమదిశలకు వ్యాపారమును నడపుటకిది ముఖ్యరంగముగానున్నది. హిందూదేశములోని ముఖ్యధనాగారములకు శాఖలిచ్చటగలవు. ఇచ్చటి వర్తకులు దూరదేశములతో వ్యాపారములను నడపుటకు సామర్థ్యమును గలిగియున్నారు. కాలక్రమమున నీపట్టణమభివృద్ధిని జెందుననుటకు శుభసూచన లనేకములుగలవు.

ఢిల్లీనగరవృత్తాంత మింద్రప్రస్థపుర నిర్మాణముతో నారంభమయినది. పాండవులపిమ్మట యాదవులు, తోమరులు, చోహానులును ఢిల్లీయందు బాలించిరి. పృథ్వీరాజు హిందూపాలకులలో గడపటి రాజు. ఆరాజేంద్రుడు ప్రాచీన ఢిల్లీనగరమునందు దివ్యమందిరంబులను దేవళంబులను గట్టించెను. ఢిల్లీనగరమునందు 1206-1288 వరకు బానిసరాజులు పాలించుచుండిరి. వారికాలమునందు కుతుబుమినారు, కుతుబు-ఉల్-ఇస్లాము మొదలగు సుందరమందిరంబులు గట్టఁబడినవి. ఖిల్జీవంశజులు 1289-1321 వరకు బాలించిరి. అలాలుద్దీనుఖిల్జీ హిందూదేవాలయంబులను విధ్వంసముచేసి మసీదులను మందిరములను కోటలనుగట్టించెను. తుఘలకువంశజులు 1321-1412 వరకు ఢిల్లీకిరాజులుగనుండిరి. దుర్మార్గశిఖామణియైన మహమ్మదు తుఘలకును సన్మార్గప్రవర్తకుడైన ఫిరోజిషహయును నీవంశజులు. వారికాలమునందు తుఘలకాబాదు ఫిరోజాబాదులు గట్టబడినవి. అశోకస్తంభము లాకాలమున ఢిల్లీనగరమునకుఁ జేర్చబడినవి. 1399లో తైమూరు ఢిల్లీనిజట్టుకొని లక్షలమందిజనులను నిర్హేతుకముగా జంపించెను. పిమ్మటను 1412-1478వరకు సయ్యదులు పాలించిరి. వారికాలమునందు ఢిల్లీ మిక్కిలి హీనస్థితిలో నుండినది, అనంతరము 1478-1526 వరకు లోడీలుపాలించిరి. వారికాలములో షెర్షాహినిర్మింపబడినది. పిమ్మట రాజధాని యాగ్రానగరమునకు మార్చబడెను. మొగలు సామ్రాజ్య నిర్మాణకుడు బేబరు 1526 నందు లోడీరాజులనోడించి మహమ్మదీయ సామ్రాజ్యాధిపత్యమును వహించెను. బేబరుమరణానంతరము హుమాయూనురాజధానిని 1530లో ఢిల్లీకిమార్చెను. అక్బరు జహాంగీరుల కాలములో 1556 మొదలు 1627 వరకు మొగలాయిచక్రవర్తులకు ఆగ్రా రాజధానిగనుండెను. షహజహానుకాలమునుండి 1857 వరకు మొగలుసామ్రాజ్యమునకు ఢిల్లీ రాజధానిగానుండినది. మహారాష్ట్ర సేనాధిపతి బాజీరావు 1736 నందు దీనినిముట్టడించి 13,00,000 రూప్యములను వ్యయపూర్తికై స్వీకరించెను. పారసీకదేశపురాజైన నాదిర్షా 1739లో మొగలులనోడించి ఢిల్లీప్రజలను ఘోరహత్యలకు పాలుచేసి మయూరసింహాసనమును నూరుకోట్లరూప్యములను కొల్లగొనిపోయెను. మహారాష్ట్రనాయకుడు సదాశివరావు 1759లో ఢిల్లీనాక్రమించుకొని రాజాంకోశపుములోని విలువగలనగలను దోచుకొనిపోయెను. ఆఫ్గనుదేశస్థుడు అహమ్మదుషా 1759లో ఢిల్లీనాక్రమించుకొని ధనమును కొల్లగొనిపోయెను. ఆంగ్లేయులు 1857లో నీప్రాచీన నగరము నాక్రమించుకొనిన విధము వేరొకచోటఁ జెలుపఁబడినది. ఆయాక్రమణముతో మహమ్మదీయసామ్రాజ్య మంతమునొంది యాంగ్లేయ సామ్రాజ్యము స్థాపింపబడినది

జార్జినగరము. (నూతనఢిల్లీ)

ఢిల్లీనగరనామ మాత్రాంతమునందు నిర్మింపబడిన పట్టణములకన్నింటికిని జెల్లుచున్నను ప్రతిపట్టణమునకును ప్రత్యేకనామము కలదని నగరచరిత్రములవలన విశదమగు

చున్నది. పూర్వమునుండియు డిల్లీశ్వరులు సామ్రాజ్యాధీశులుగా నెన్నబడుచుండెడివారు. బ్రిటిషు పరిపాలకుల కింతవరకుఁ గలకత్తా రాజధానిగనుండినది. పూర్వాచారమున ననుసరించి యిపుడుతిరిగి డిల్లీ రాజధానిగా జేయబడినది. శ్రీ పంచమజార్జి చక్రవర్తి డిల్లీనగరమునందు మహావైభవముతో సామ్రాజ్యాభిషిక్తులైరి. రాజధాని నచటికి మార్పించిరి. నూతననగరమునకు శంకుస్థాపనముజేసిరి. ఈకారణంబులవలన నూతన డిల్లీనగరమును జార్జినగరమనుట సమంజసముగానుండును.

డిల్లీనగరము దేశమునకు నడుమనున్నది. అన్ని ప్రదేశముల నుండియును రాకపోకలకు దగిన రయిలుమార్గములు గలవు. బొంబయికి 982, కలకత్తాకు 956, కరాచికి 907, చెన్నపురికి 1100 మైళ్ళ దూరమున గలదు. ఇది సిమ్లానగరమునకు సమీపముననున్నది. శీతోష్ణస్థితి దుర్భరముగాదు. విశాలమైన మైదానము గలదు. నగరనిర్మాణమునకు దగిన సాధనసంపత్తి సమీపమునఁగలదు. నగరచరిత్రము ధర్మనిరతుడైన ధర్మరాజతో నారంభమగుచున్నది. హిందూమహమ్మదీయ రాజ్యములకిది చిరకాలము రాజధానిగనుండినది. బాగుగ విమర్శించినవారలకీనగరమె హిందూసామ్రాజ్యమున కనుకూలమైన రాజధానియని తోచుట సహజము.

ప్రాచీన ప్రస్తుత నవీన డిల్లీనగరములు 12 మైళ్ళ పొడవును 5 మైలుల వెడల్పునుగల ప్రదేశము నాక్రమించుకొనుచున్నవి. ఇంద్రప్రస్థము ప్రజాపాలకులకు ధర్మానుష్ఠానమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. అశోక స్తంభము ప్రాచీనహిందూవిజ్ఞానమును స్మరణకుఁ దెచ్చుచున్నది. పృథ్వీరాజదుర్గము రాజపుత్రవీరుల దేశమతాభిమానమును బ్రకటించుచున్నది. కుతుబుమీనారు ధర్మపరిపాలనమునకు ధ్వజమువలె వెలయుచున్నది. మహాపురుషులసమాధులు పవిత్రజీవన ఫలమునకు నిదర్శనముగానున్నవి. తామ్రదుర్గమునందలి శిథిలమందిరములు ప్రపంచవైభవముల యస్థిరతను వ్యక్తీకరించుచున్నవి. నూతనస్థాపితములైన దూదియంత్రాలయములు దేశసంపదల కనుకూలములైన పరిశ్రమావలంబనమునుఁ బురికొల్పుచున్నవి. సాధుసంపన్నుడైన శ్రీ పంచమజార్జి చక్రవర్తివలన స్థాపింపబడిన జార్జినగరము నగరరాజమై హిందూసామ్రాజ్యాభివృద్ధికి దోడ్పడగలదు.

---

* మిహ్రాబు మసీదులందుఁ బశ్చిమ దిక్కునందు గోడలయందమర్చబడెడి యొక పవిత్రస్థలము.

# ఢిల్లీ దర్బారు.

ఢిల్లీ ప్రాచీన నగరరాజము. ఇచ్చోటు రాజ్యాభిషేచన ప్రక్రియల ననేకముల వీక్షించినది. ధర్మరాజ రాజ్యాభిషేక మహోత్సవంబతి రమణీయంబుగ భారతంబున వర్ణింపఁబడినది, పృథ్వీరాజ వైభవంబతి విచిత్రముగఁ జందరైసాయందు వ్రాయఁబడినది. ప్రథమ మహమ్మదీయ సామ్రాజ్యంబుల ప్రాభవంబతి విపులంబుగ ఇబ్నుబటూటు మొదలగు లేఖకులచే నిరూపింపబడినది. మొగలుల సామ్రాజ్య సౌభాగ్యంబు మహమ్మదీయాంగ్లేయ చరిత్రకారులచే నతిజాగ్రతతో వ్యక్తీకరింపఁబడినది. ఢిల్లీయందు రాజ్యభారమును వహించిన రాజులు నూర్గురుండవచ్చును. దర్బారు పదము మహమ్మదీయ పాలనము నుండి వాడుకకు వచ్చినది. ఆంగ్లేయులచే నీపదము రాజకీయసభల కుపయోగింపఁబడుచున్నది. మండలాధిపతి బిరుదములు సంస్కారార్థమై చేయుసభ దర్బారనంబడుచున్నది. రాష్ట్రపాలకు లీసంస్కారార్థమైచేయు సభలును దర్బారులనంబడుచున్నవి. సామ్రాజ్యాభిషేచన మహోత్సవమును దర్బారనంబడుచున్నది. ఈపదప్రయోగమును నియమించుట యుచితము.

బ్రిటిషుసామ్రాజ్య మారంభమైనపిదప రెండు దర్బారులు జరిగినవి. మొదటిది లిట్టనుప్రభువు కాలమునందు బేకన్సుఫీల్డు ప్రభువుగారి ప్రోత్సాహమున జరిగినది. విక్టోరియారాణి 1877 లో హిందూదేశ సామ్రాజ్ఞిగా నభిషిక్తయై మహారాణి బిరుదమును వహించెను. రెండవది కర్జనుప్రభువు కాలమునందు జరిగినది. అపుడు శాంతిస్థాపకుడని ప్రఖ్యాతిని బడసిన శ్రీ సప్తమ ఎడ్వర్డు ప్రభువు చక్రవర్తి పదవి నధిష్ఠించెను. ఈరెండు దర్బారులతి వైభవముతో జరుపఁబడినవి. ఆరెండు దర్బారులందును రాజచిహ్నములైన గజములు నూరేగింపుకై రాజ్యాధికారులును సంస్థానాధీశులును వాడిరి. మూడవ దర్బారునందేనుగు లపరూపములైనను దీనికి సాటియైన దర్బారు ఢిల్లీయందేకాక మరెచ్చటను జరుపఁబడలేదని వలసియున్నది.

### మూడవ ఢిల్లీ దర్బారు.

భరతఖండ చారిత్రమునందు 1911 మార్చి 22 తేది ఒక సుదినము, ఆసుదినంబున ఢిల్లీ నగరంబునందు స్వయముగ రాజ్యాభిషిక్తులగుటకుగల రాజసంకల్పము ప్రకటింపబడినది. డిశంబరు 12 వ తేది నీమహోత్సవము జరుపుటకు నిశ్చయింపబడినది. రాజును వారి సముద్యానమునుండి మరల్చుటకు బంధుమిత్రాదులు యత్నించిరి. ధీరులు కృతనిశ్చయమునుఁ బరిత్యజింపరుగదా! నవంబరు మాసాదిని వానగాలి వీచుచుండగా శ్రీరాజదంపతులు పరివారయుతముగా మెదీనా పొగయోడయందు బయనమైరి. సర్ కాలిన్ కెప్పెలుగారి యాధిపత్యముక్రిందను నాలుగు యుద్ధనావలా నావ ననుగమించినవి. నవంబరు 13 న జిబ్రాల్టరును 27 న ఏడెనును జేరిరి. డిశంబరు రెండవతేదిని హిందూదేశమునకు సింహద్వారమైన బొంబయినగరమునుఁ జేరిరి.

### బొంబయి స్వాగతము.

శ్రీరాజదంపతుల కనురూపంబైన స్వాగతంబునొసంగుట కానగరంబునం దత్యంత శ్రద్ధతోఁ దగిన ఏర్పాటులు సేయఁబడినవి. అపోలోబందరు యొద్దను రాజదంపతులు దిగుచోటను రాజమందిరమును బోలిన యొకశాల నిర్మింపఁబడినది. దాని చిత్రపటము 7 పుటలో గలదు. దానికెదుటను 200 గజముల దూరమున రాజదంపతులకు స్వాగతంబు నొసంగుటకై 3000 జనులు కూర్చుండుటకుఁ దగిన యర్థచంద్రాకృతిని గలిగిన రంగము నిర్మింపఁబడినది. ముఖ్యవీధులందు రెండు పార్శ్వంబులందును 10 గజముల కొకటివంతున కలశాలంకృత ధవళస్తంభములు వరుసగా నిలువ బడినవి. ఈస్తంభములు కృత్రిమ కుసుమదామములతోను, పలురంగుల పతాకములతోను, సుందరతరంబుగ నలంకరింపఁబడినవి. మార్గమధ్యప్రదేశమున నచ్చటచ్చట స్వాగత తోరణంబు లమర్చబడినవి. ఈతోరణంబులు జెండాలతోను పూదండలతోను, చిత్రదీపము

లతోను సింగారింపఁబడి చిత్రమందిరములనుఁ బోలియుండినవి. మొదటి స్వాగతతోరణము మహమ్మదీయ శిల్పికళావైఖరిని అపోలోబందరు రేవుకెదుటను రెండవది జస్టిసుల యా శిల్పికళారీతిని నున్నత న్యాయమందిరమున కెదుటను నిర్మింపఁబడినవి. ఇట్టితోరణంబు లనేకము లచ్చటచ్చటఁ గట్టఁబడినవి. వాటిలో దూదితోరణము ముఖ్యమైనది. బొంబయి సంపదలకు మూలమును దాని ముఖ్యపరిశ్రమ కాధారభూతమును నైన దూదిబస్తాలతో నిది కట్టఁబడినది. 2000 దూదిబస్తాలు దీనికై వాడఁబడినవి. ఈ మూఁడు తోరణముల పటము 41 పుటలోఁ గలదు.

సుందర మందిరములును, చిత్రవర్ణాలంకారములును, చక్కటి మెరుపుదీపములును హార్న్బీవీధి కనిర్వచనీయంబైన శోభను గలిగించినవి. రాత్రులందు విద్యుద్దీపరాజు లసంఖ్యాకంబులైన తారకాగణంబులు స్వస్థానంబులం బరిత్యజించి రాజదంపతులకు స్వాగతంబు నొసంగుటకు దివ్యప్రాసాదోపరి భాగంబులందు నివాసంబులం గైకొనినటులు తోఁచుచుండెను. ముఖ్యమందిరముల మీదను వెలిగింపఁబడిన తెల్ల మెఱుపుదీపపు వరుసలు వజ్రతోరణములను, ఎఱ్ఱదీపపు పంక్తులు కెంపులతోరణములను, పచ్చదీపపు బారులు పచ్చలతోరణములనుఁ బోలి కడు రమ్యంబుగ నొప్పుచుండెను.

మెదీనా పొగయోడ డిశంబరు 2 వ తేదిని 10 గంటలకు బొంబయి రేవునుఁ జేరినది. చక్రవర్తిని గవర్నరు జనరలు గవర్నరు పొగయోడయందు సందర్శించిరి. సాయంత్రి నాలుగుగంటల వేళను రాజదంపతులు పరివార సమేతముగ నొడ్డునకువచ్చిరి. మెదీనాపొగయోడను దానినుండి దిగుటను దెలుపు రెండుపటములు 1 పుటలో గలవు.

రాజదంపతు లొడ్డునకువచ్చినపుడు రాజప్రతినిధి, సేనాధిపతి, మఠాధిపతి మొదలగు ప్రముఖులు వారలకు స్వాగతంబునొసంగి వారికై నిర్మింపఁబడిన మంటపమునకుఁ దోడ్కొని తెచ్చిరి. జను లేకగ్రీవముగ మహామహులకు స్వాగతంబొసంగిరి. నగర పారిశుద్ధ్యసంఘాధ్యక్షుఁడు సర్ ఫిరోజిషా మెహతా గంభీరోచ్చస్వరముతోఁ బ్రజలపక్షమున శ్రీవారికి స్వాగతంబునొసంగి యాస్వాగత పత్రంబు నొక వెండిపెట్టెయందుంచి శ్రీవారికి దానిని సమర్పించెను. దీనిపటము 21 పుటయందుగలదు. ఈకరండమును స్వీకరించి వందనంబుల నర్పించుచు శ్రీరాజేంద్రుఁడిటులు సంభాషించెను:—

“నేను మీసుందరనగరమునకుఁ గ్రొత్తవాఁడను గాను. ఆరేండ్లకుఁ బూర్వమిచటికి మేము మొదటవచ్చినపుడు మీరొసంగిన హృద్గతప్రేమపూరితంబైన స్వాగతంబిప్పటికిని మఱవు రాకున్నది..................... నా ప్రియజనకుని మరణమువలన వంశపరంపరాగతమైన రాజ్యభారమును నేను వహించవలసి వచ్చినపుడు నాసాధుహైందవప్రజల పునస్సందర్శనము నాయభీష్టములం దొకటిగానుండెను..............మీరును మీపూర్వికులును నీనగరమును బ్రిటిషుసామ్రాజ్యమున కమూల్యాభరణమునుగాఁ జేసితిరి. మీరు నాకును రాణీకిని నొసంగిన స్వాగతంబునకు మనఃపూర్వకంబైన వందనంబుల నర్పించుచున్నాఁడను. మాహిందూసామ్రాజ్యముమీద భగవదనుగ్రహముండుటకును, ఆసామ్రాజ్యప్రజలు నిరంతరము సుఖసంపదలనుఁ గలిగి యుండుటకును మేము ప్రార్థించుచున్నాము.” అని శ్రవణానందముగ రాజు సంభాషించెను. ఈసభా చిత్రపటము 6 పుటయందుగలదు.

అయిదుగంటలవేళను ప్రజలకు దర్శనమిచ్చుటకై బయలుదేరిరి. వేనవేలు జనులు రాజదంపతులనుఁ జూచుటకై వీథులందును మేడలమీదను వేచియుండిరి. వారు జయజయ ధ్వనులతో నొసంగిన స్వాగతము సముద్రతరంగములరీతినిఁ బోనుపోను పొంగిపొరలినది. బడిపిల్లలు 30,000 మంది జెండాలను బట్టుకొని మధురస్వనంబుతో రాజదంపతుల నభినందించిరి. చక్రవర్తి యడుగడుగుకు జనులకు దలవంచి సలాములను జేయుచుండెను. శ్రీమేరీ మహారాణియును సుందర మందహాసముతో జనుల నభినందించెను. సంధ్యాసమయంబునకు శ్రీరాజదంపతులు పొగయోడకుఁ జేరిరి. ఊరేగింపు 7,44,45 పుటలలో జూడనగును.

రాజదంపతులు బడిపిల్లలకు దర్శనమిచ్చుటకు 4 వ తేది ప్రొద్దున నగరమునందు బ్రవేశించిరి. మైదానమునందు 26,000 బడిపిల్లలు గూడియుండిరి. వారు మహారాష్ట్ర, ఘూర్జర, ఉర్దూ, ఆంగ్లేయభాషలందు "దేవుడు రాజును రక్షించునుగాక" యను గీతమును బాడిరి. గుజరాతి బాలికలు గర్భనృత్యమునుఁ జేసిరి. పిల్లలకుఫలహార బహుమానాదు లొసంగఁబడెను. రాజదంపతులు ప్రాచీన బొంబయి ప్రదర్శనమును సందర్శించి పొగయోడకుఁబోయిరి. డిశంబరు 5 వ తేది రాత్రి బొంబయిని వదలి 7 వ తేదిని ప్రొద్దున డిల్లీనగరమును రాజుగారి రైలుబండి చేరినది. దీనితో మొదటిరంగము ముగిసినది.

డిల్లీనగరములోని ఏర్పాటులు.

దర్బారు ఏర్పాటులను జేయుటకు సంయుక్తరాష్ట్రపాలకుడు సర్ జాన్ హ్యూయెటు నియమింపబడెను. ఆమేధావంతుని యధ్యక్షతక్రిందను డిల్లీనగరమున కుత్తరమునందుండు మైదానమంతయును మహాపటకుటీపట్టణముగ మారినది. ఆప్రదేశమంతయును మంచిబాటలతోను, నీటికాలువలతోను, మెఱుపుదీపములతోను నింపఁబడినది. ప్రతిరాష్ట్రమునకును ప్రత్యేకశిబిర మేర్పరుపఁబడి ఆశిబిరములందు రాష్ట్రపాలకులు వారియతిథులు సకల సౌకర్యములను గలిగియుండుటకు దగినయేర్పాటులు సేయబడినవి. స్వదేశసంస్థానాధీశులు ప్రత్యేక శిబిరములను నిర్మించిరి. సంస్థానాధీశుల శిబిరములు సుందరతోరణాలంకృతంబులై లక్ష్మీనివాసంబులుగానుండినవి. నాభానవాబుశిబిరముసందలితోరణపటము 48 పుటయందుగలదు. ప్రత్యేకశిబిరమునందును సభామంటపమొకటినిర్మింపబడినది. వాటియందు రాష్ట్రపాలకులు, రాజులు, మహారాజులు, నవాబులు మొదలగు శ్రీమంతులు దమవైభవసంపదలం బ్రదర్శించుచు నచ్చెరువును బుట్టించుచుండిరి. ఈ నాగరిక శిబిరంబులేకాక సైనికశిబిరంబు లనేకంబులు నిర్మింపబడినవి. అన్నిశిబిరంబులందును నూరువేల గుడారంబులుండియుండెను. సంస్థానాధీశుల శిబిరములు 120. సైనికశిబిరంబులు 200. రాష్ట్రపాలకుల వారియధికారులశిబిరములు 70. ఈశిబిరములన్నియును 25 మైళ్ళప్రదేశము నాక్రమించుకొనినవి. ఆప్రదేశము రాత్రులందు 80,000 మెఱుపుదీపములతో వెలుగుచుండెడిది. దీనింబట్టి మహాపటకుటీపట్టణమెంత పెద్దదిగాను, సుందరతరముగాను నుండినది యూహింపనగును. ఆడేరాలయొక్కయొక ప్రదేశపుచిత్రపటము 46 పుటయందు గలదు. దానింజూచి శిబిరవైశాల్యమును గుడారముల సంఖ్యను చదువరు లూహింపనోపుదురు.

రాజనివాసము.

రాజశిబిరము రిడ్జికి పడమటను సర్ కుర్యాటుగృహమునకుఁజుట్టును నిర్మింపఁబడినది. ఈశిబిరమంతయును సుందరోద్యానవనమయముగాఁ జేయబడినది. దీనియందొక యెత్తయిన చోటను రాజసభామంటపము గట్టఁబడినది. దానియందు 3000 మందికిదగిన యాసనములమర్పఁబడినవి. ఒకవైపునరాజవాసమునకుఁ దగిన పెద్దమంటపము గట్టఁబడినది. వేరొకదిశను భోజనశాలనిర్మింపఁబడినది. వెనుకభాగమున గోశాలలు పరివారజనమునకు కుడివైపునను శాలలునిర్మింపఁబడినవి. ఈమంటపము లేటవాలుగల మిట్టపై నిర్మింపఁబడి శ్వేతశ్యామ పీతాంబరములచే నలంకరింపబడి సూర్యకాంతులచేతను చిత్రవిచిత్రవిద్యుద్దీప ప్రభలచేతను దేజరిల్లుచు నపూర్వ శృంగార విలాసమునకు నిలయములుగనుండినవి. రాజగృహమున కెదుటిభాగమున రాజప్రతినిధి శిబిరము నిర్మింపఁబడినది. రాజశిబిరపుపటము 46 పుటయందుగలదు.

రాజదంపతుల యాగమనము.

శ్రీరాజదంపతులు సలీముఘుడకోట బురుజుగుండా డిల్లీకోటయందు డిశంబరు 7వ తేదిని పదిగంటలకు రైలునుండి దిగిరి. హార్డింజిప్రభువును హార్డింజి ప్రభ్వియును రాజదంపతుల నెదుర్కొని సత్కరించి సభామంటపమునకు వారలఁదోడ్కొనిపోయిరి. శ్రీవారి రాకను దెలుపుటకుఁ గాల్పఁబడిన ఫిరంగులును తుపాకులును మేఘగర్జనమువలె భయంకరముగ మ్రోగుచుండెను. రాష్ట్రపాలకులు మొదలుగాఁగల యధికారులను వృద్ధసైనికులను రాజుసంభావించెను. పిమ్మటను స్వదేశ సంస్థానాధీశులను సంభావించుటకై నిర్మింపబడిన మంటపమునకు రాజదంప

తులు విజయముచేసిరి. సంస్థానాధీశులు దమరాజభక్తిని దెలుపుచు శ్రీజార్జిచక్రవర్తికి బ్రణామంబుల నర్పించిరి. సిక్కుమహారాజు దనపైనున్న దివ్యమైనశాలువను రాజుకాళ్ళమీదను గప్పితనపట్టరాని భక్త్యుత్సాహంబులను బ్రకటించెను.

ఢిల్లీనగర ప్రవేశము.

నగరప్రవేశము ఢిల్లీద్వారమునుండి జేయుట షాజహానునాటినుండియును సమాశ్రుతముగా వచ్చుచున్నది. శ్రీపంచమజార్జి రాజేంద్రుడును నావాడుకరీతిని ఢిల్లీద్వారమునుండి నగరప్రవేశమునుజేసెను. చక్రవర్తి యుత్తమయవనాశ్వమునెక్కి యుత్సవశ్రేణికి ముఖమునందుండెను. సింధియా, బికనీరు మహారాజులును రాంపురనవాబును శ్రీవారికి సన్నిహితానుచరులుగ వారివెంటనంటియుండిరి. శ్రీమేరీ మహారాణి ఆరుగుర్రముల బండినెక్కి రాజకుమార పటాలములచే ననుగమింపబడి చక్రవర్తి ననుగమించెను. వారివెనుకను రాష్ట్రపాలకులు రక్షకసైన్యములతో బయలుదేరిరి. పిమ్మట సంస్థానాధీశులు సపరివారసేనాపరివృతులై గౌరవానుక్రమణముగ బయలుదేరిరి. ఉత్తమసంస్థానాధీశులైన శ్రీనిజాముగారు మొదటివారుగనుండిరి. సంస్థానాధీశులలో లోకప్రియులైన బరోడామహారాజుగారు రెండవస్థానము నలంకరించిరి. దక్షిణదేశసంస్థానాధిపతులలో సుప్రసిద్ధులైన మైసూరు మహారాజుగారు మూడవస్థానమునందుండిరి. కాశ్మీరమహారాజుగారు నాల్గవవారుగనుండిరి. నూర్గురు సంస్థానాధీశులీవిధముగ సపరివారసేనాసమేతులై యూరేగింపునందుజేరియుండిరి. సంస్థానాధీశుల ప్రక్కను బ్రిటిషుప్రతినిధులు కూర్చుండియుండిరి. ఈయూరేగింపును జూచుటకు వేనవేలుజనులు మార్గములందుగూడియుండిరి. జూమామసీదుప్రాంతము జననివహము గలప్రదేశములలో మొదటిది. జనవ్యాకీర్ణమైన మసీదుపటములు 43,44 పుటలందుగలవు. ఈయూరేగింపు చాందిని చౌకునందు 10 గంటల 10 నిమిషములకు బ్రవేశించి 1గంట 20నిమిషములకు నిర్గమించినది. ఆప్రదేశమున చిత్రాంబరాలంకృతులై కూడిన జననివహంబు లతిసుందరముగనుండినవి.

ఈయుత్సవశ్రేణి 8 మైళ్ళ పొడవుండియుండును. ఈమహోత్సవ సందర్శనంబున జనించిన భావావస్థ వర్ణనాతీతము. దీనిగంభీర పటాటోపములను నిర్ణయించుట యసాధ్యము. సేతుశీతనగమధ్యంబునంగల సంస్థానాధీశులందరును మత్సరభావములేక నొకచోటను బ్రిటిషుసామ్రాజ్యప్రభావమునంగూడంగలిగిరి. సంస్థానాధీశులు చిత్రవిచిత్రములైన గుఱ్ఱపుబండ్లనెక్కిరి. వెండిబండ్లు దంతపు బండ్లు బంగారుపూతబండ్లు మొదలగు సుందర యానములు చూచుటకు ముచ్చటగానుండినవి. వివిధవేషాలంకృతులైన సైనికబృందము సంస్థానాధీశుల వైభవ ప్రతాపములను బ్రకటించుచుండెను. సంస్థానాధీశుల వస్త్రాలంకరణములును, పరివారమును, సైన్యమును, వాద్యవిశేషంబులును హిందూదేశపు తొల్లింటివైభవమునకు సజీవనిదర్శనములుగానుండెను. బ్రిటిషుపరిపాలకులు దేశమునందంతటను నవిచ్ఛిన్నమైన శాంతిని స్థాపించిరి. వారు సంస్థానాధీశులను బ్రజలను సమానదృష్టితో జూచుచున్నారు. ఈయపార సామ్రాజ్యమునకు ముఖ్యనాయకుడు శ్రీపంచమజార్జి చక్రవర్తి. ఆమహామహుడొక యుత్తమ యవనాశ్వము నెక్కి డాబుడంబములేక ప్రజలనవ్యాజానురాగముతో నభినందించుచు నీయుత్సవశ్రేణి కగ్రభాగమునం బ్రసన్నవదనముతోం బోవుటనుజూచిన ప్రజల హృదయంబులు భక్త్యుత్సాహభరితంబులగుట కేమియింక! ఈయుత్సవశ్రేణికి రెండువైపులను 40,000 సైనికు లెడమీకుండను బారులుదీర్చి నిలువంబడియుండిరి. సైనికులకు వెనుకను వేనవేలుజనులు గుంపులుగుంపులుగాంగూడియుండిరి. ఈగుంపులత్యుత్సాహానురాగములతో శ్రీరాజదంపతులను, రాష్ట్రాధీశులను, సంస్థానాధీశులను దీవించుచు జయజయధ్వానములతో సంభావించిరి. మహాసైన్యమునకు నాయకుడును, సంస్థానాధీశులకు సామ్రాజ్యాధీశుడును, ప్రజలకు నియమితపాలకుడును, ధర్మనిష్టాగరిష్ఠుడును, విశాలసామ్రాజ్యమున కేకఛత్రాధిపతియును నగు శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుడు శ్రీమేరీరాజ్ఞితోంగూడి ఢిల్లీనగరమునందు ప్రవేశించుట చిరకాలము హైందవులచేతను బరమానందముతో సంస్మరింపంబడుచు హిందూదేశచరిత్రమునందు గంభీరవృత్తాంతము సుప్రసిద్ధేతిహాసముగ నుండంగలదు.

శాసననిర్మాణ సభికుల స్వాగతము.

రాజు మిట్టమధ్యాహ్నసమయమునం దనశిబిరము నుజేరెను. శ్రీవారిరాకకై సామ్రాజ్యశాసన సభాసభ్యులును, సామ్రాజ్యాధికారులును, రాష్ట్రీయ శాసనసభాసభ్యులును, రాష్ట్రీయాధికారులును వేచియుండిరి. ప్రతీహారులు రాజాగమనమును ప్రకటించిరి. సామ్రాజ్యశాసన సభాప్రత్యధ్యక్షులు గౌరవనీయ జంకిన్సుగారు ప్రజాపక్షమున స్వాగతంబునొసంగుచు సన్మానపత్రము నిటులు చదివిరి:— "మహామహులు ప్రసన్నులగుదురుగాక!

బ్రిటిషు హైందవులపక్షమున సామ్రాజ్యశాసన సభా సభ్యులమైన మేము సవినయముగ హృద్గతా వ్యాజపూర్వకంబైన స్వాగతంబును మీరాజదంపతుల కొసంగుచున్నాము. ఈవిశాలదేశమున కేకచ్ఛత్రాధిపత్యమును వహించుటకై యీప్రాచీననగరమునకు విచ్చేసిన మహాప్రభువునకు మేము స్వాగతంబొసంగుచున్నారము. ఈదేశమునం దనేకరాజులు రారాజులు పాలించిరి. వారిలో నుత్తమోత్తములైనను తమ ప్రభుత్వముక్రిందనుండు విశాలసామ్రాజ్యమున కేకచ్ఛత్రాధిపత్యమును మహాభాగు నిరీతిని వహించియుండలేదు. గాన నేడిచటి దేవరసన్నిధానము హిందూదేశచరిత్రముయొక్క వివిధప్రవర్తకరంగములం దదృష్టపూర్వంబును నిరంతరసంస్మరణీయంబును నైయున్నది.

రాజభక్తి హైందవుల కుత్కృష్టధర్మము. అదికాలమునుండియును మునులు గురువులు నీధర్మమును బోధించిరి. దేవరయొక్క జగద్వ్యాప్తసామ్రాజ్యమునందు మహామహులిపట్ల బ్రిటిషు హైందవప్రజలకు మించిన భక్తివిశ్వాసములుగల ప్రజలులేరు. హిందూసామ్రాజ్యమునం దనేక జాతులు మతములు భాషలుగలవు. కాని ఆసేతుహిమాచలపర్యంతమును, పడమటికొండ హద్దులకును, చీనాసయాము సీమాంతములకును నడుమనుండు జనులందరును రాజభక్తిని, స్వామిభక్తినిం జూపుటయం దేకభావమును గలిగియున్నారు. మహాప్రభువులు మానడుమనుండు స్వల్పకాలమునందు మేముచూపు సంతోష గర్వభావము లీవిశాలదేశమునందుగల ప్రతినగరమునందును, పట్టణమునందును, పల్లెయందును నింతకు తక్కువవైభవముతోనైనను సమానోత్సాహముతోఁ బ్రదర్శింపఁబడును. మహాభాగుల కాయురారోగ్య సుఖంబులను ప్రసాదించుటకు వేడుచున్నాము. మహాభాగుల పాలనాకాలమందు హిందూసామ్రాజ్యము శాంతి సంతృప్తి సౌభాగ్యమార్గములయం దభ్యుదయ పరంపరను గలిగియుండుటను గోరుచున్నాము. మహామహుల హృదయములకు దీనికంటె సన్నిహితమైన యభీష్టము లేదని మాగట్టినమ్మిక."

శ్రీచక్రవర్తి యీక్రిందిరీతిని ప్రత్యుత్తరమిచ్చెను.

"భక్తివినయ పూరితమైన మీసన్మానపత్రమునకు నేను రాణికిగాను నాకుగాను మనఃపూర్వకంబుగ వందనముల నర్పించుచున్నాను. మీమాటలు మాహృదయములను రంజింపజేసినవి. మేమింగ్లాండులో రాజ్యాభిషిక్తులమైనపుడు మారాజ్యమునందలి సకలభాగములతోటి పాటుగ హిందూదేశము దయావాత్సల్యములతో మమ్ము సత్కరించిన యసంఖ్యాకములైన సందేశముల మేమీదేశమునకు వచ్చినప్పటినుండియు నాహైందవప్రజలలోని సకలజాతిమతముల వారివలనను బహిఃప్రతిపాదితములైన యానందేశములను మీప్రసంగము తిరిగిస్మరణకుఁ దెచ్చుచున్నది. తనసభయందలి బ్రిటిషుహిందూదేశమునకు ప్రతినిధులైన సభ్యులయొక్క విశేషానుభవమువలన దాను పొందు బలపోషణములను నాగవర్నరు జనరలువలన నేను వినియున్నాను.

ఈదేశప్రజాపక్షమున మీరు మాకొసంగిన స్వాగతస్వారస్యమును నేగ్రహించితిని. మీసన్మానపత్రములో దెలిపినటులు "హిందూసామ్రాజ్యము శాంతిసంతృప్తి సౌభాగ్యమార్గములం దభ్యుదయ పరంపరల గలిగియుండుటకన్న మాహృదయములకు సన్నిహితమైన యభీష్టము లేదని మీరు గట్టిగ నమ్ముడు."

ఈరాజసంభాషణ మందరునువిని సంతసించిరి. ఆమంటపమునుండి రాజదంపతులు స్వకీయశిబిరమునకు జేరిరి. అప్పుడుత్సవశ్రేణిలోనుండు సపరివార సామంతులైన సంస్థానాధీశులు రాజసమక్షమునుండి వారియనుజ్ఞను గైకొనుచు దమతమ శిబిరములకేగిరి. దీనితో రెండవయంగము ముగిసినది. ఆదినము సాయంత్రము స్వదేశాధీశులకు రాజు దర్శనమిచ్చెను. శ్రీరాణి కోటలోని దివ్యమందిరములను సందర్శించెను.

శుక్రవారము ప్రొద్దున సంస్థానాధీశులకు దర్శనమిచ్చుటకును, సాయంత్రి ఎడ్వర్డుస్మరణ చిహ్నమునకు శంకుస్థాపనము చేయుటతోడను, రాత్రి విందుభోజనముతోను ముగిసినది. శంకుస్థాపనముచేయక మునుపు

శ్రీవారి ప్రసంగము.

“మీసంభాషణము నాహృదయంగమంబై కీర్తిశేషులైన నాప్రియజనక చక్రవర్తిపట్ల మనమందరమును, ముఖ్యముగా నేనును నెరవేర్చవలసినవిషయములు మనోగతంబులగుచున్నవి. ఆయన హిందూదేశ దర్శనార్థమువచ్చిన పూర్వవంశజులలో మొదటివారు. వారి యాజ్ఞానుసారముగ యూరోపియన్ల కొద్దికాలముక్రిందట నేనివిశాలాద్భుతదేశమునకు వచ్చియుంటిని. అయ్యో! వారిచావునకై మన మింతత్వరలో విచారమును బొందవలసియుండునని మనమూహింపజాలకుంటిమి. నాతండ్రియొక్క స్మృతిపంచములాభముగాగిన కొలదినుండియే కాక వారియొక్కయు, నాయొక్కయు పేరనేల హైందవప్రజలుమనిచ్చిన చందాలే స్మరణచిహ్నరూపమును వహించినవని మీరు తెలియఁబల్కితిరి. వారికి హిందూదేశమువల్లగల సుస్థిరగాఢానురాగము దేశసంతానుల హృదయములందంతటి యుత్సాహప్రతిబింబముతో జేరజాలినదని వినుటకు నాకానందదాయకముగా నున్నది. ఈప్రతిమ భావివంశజులకు మీభక్త్యనురాగములను, వారి (రాజుగారి) నిర్వ్యాజానుకంపములను స్మరింపజేయుటకై సుప్రసిద్ధ సుందరప్రదేశమునందుగల గంభీరస్మరణచిహ్నముగా నిలచియుండునని తలంచుటకు నాకాహ్లాదమగుచున్నది. ఈభావనలు దైవానుగ్రహమువలన నిరంతరము నావంశజులకును హిందూదేశమునకును బూర్ణప్రసిద్ధములుగా నుండుగాక!”

చక్రవర్తి క్రిందికి దిగినప్పుడు కార్యనిర్వాహక సంఘముయొక్క జ్యేష్ఠసభ్యుడు ప్రభువునకీస్మరణచిహ్నముయొక్క సూక్ష్మాకారమును సమర్పించెను. చక్రవర్తి దానినిగ్రహించి సపరివార సమేతముగా స్వస్థానమునకేగెను. దీనిచిత్రపటము 44వ పుటలో గలదు.

శనివారము నాడుదయమున చక్రవర్తి సంస్థానాధీశులకు దర్శనమిచ్చెను. ఆరోజు సాయంత్రి మహారాణికి హైందవస్త్రీలు కానుకలనర్పించిరి. ఈసదుద్యమమునకు పాటియాలా మహారాజు, వారిమంత్రియు కారకులు. మహారాణికి బహుమానమును సమర్పించుటకు వెళ్ళిన నారీమణులలో నీక్రిందివారుగలరు. పాటియాలా, కపూర్తలా, మోర్భంజ్, విజయనగరము మహారాణులు, జంజీరబీగము, శ్రీమతితాతా, మెహతా, హైదరీ, దాదాబాయి, మధోల్కర్ గార్లు కొందలగు యువతీమణులును. ఈనారీమణులు వజ్రఖచితమును, చిత్రనామాంచితమునునగు విశాల చతుష్కోణ మరకతము నొకకానుకగానర్పించిరి. ఈమరకతము ఢిల్లీబాదుషాల కాలమునుండి వచ్చుటవలన చక్రవర్తినికిఁ దగిన పారితోషకము. రెండవది మధ్యను ఒకపెద్ద పచ్చజిగినీగల కంఠహారము. ఆకంఠహారము యేడుపచ్చలనుగలిగి, ప్రతిపచ్చచుట్టును గులాబిరంగుగల వజ్రఖచితమై సుందరతరముగనున్నది. ఈబహుమానమును స్వీకరించి యీక్రిందిరీతిని చక్రవర్తిని బదులు చెప్పెను.

“మీయాహ్వానముయొక్క సద్భావము నామనంబున దృఢంబుగనాటినది. నేనన్నిచట గలిసికొనినవారు వారిప్రియాభివందనములకును నవ్యాజభక్తికిని నా హృదయంగమంబులైన వందనంబుల గ్రహింతురనియును, సామ్రాజ్య సోదరీసమాజమునకు వాటిని దెలియజేయుదురనియును గోరుచున్నాను. రాణివాసస్త్రీల యోగక్షేమార్థము నాదినదిన ప్రవర్ధమానాదరణమునందు మీకందరకును నమ్మికనుఁ బుట్టించుట నాసంకల్పము. హైందవస్త్రీలు స్వగృహములందు మంచికై యెంతప్రశస్తమైన సామర్థ్యముగలిగియున్నది చరిత్రవలన స్పష్టమగుచున్నది. తల్లులు తమబిడ్డలమనోహృదయంబులందు నాటినబోధనలకుఫలముగా హిందూదేశకులీన చారిత్రములు స్వామిసేవకును, ప్రభుభక్తికిని సువర్ణితములు. రాణివాసస్త్రీలలో నెక్కుడుగా నైనను నిశ్చయముగా ప్రబోధమేర్పడుచున్నదని నేనుసంపూర్ణసంతోషముతో గ్రహించితిని. మీపిల్లలు వారికావిభర్తలకుఁ దగినహితాభ్యస్త సహచరిణులుగా పెరుగుటకై వారివిద్యాభివృద్ధిని మీరందఱు గోరుచున్నారని నానిశ్చయము. మీరిచ్చినకానుక నాక

మూలాభ్యాభరణముగనుండును. నేనుదానిని నెప్పుడుధరించినను సహస్రయోజనముల భూసముద్రములు మననడుమనున్నను నాభావనలు హిందూగృహములపై బ్రసరించి యీసుఖసమావేశము మఱల మఱలకల్పితమై మీకోమలహృదయములు సమర్పించినప్రేమను సంస్మరించెదను. మీయాభరణము భావిసంతతికి సామ్రాజ్యకులాభరణముగా సంక్రమించి యొకయాంగ్లేయరాణికి హైందవనారీమణులతో గలిగిన ప్రథమసమావేశమునకు స్మరణచిహ్నముగా నుండును. మీరునాపట్లను, రాజరాజేంద్రునిపట్లను బ్రకటించిన మీసత్సంకల్పాభివందనములకు గృతజ్ఞతను దెలుపుచు నేనునుసామ్రాజ్యయోగక్షేమ బలానుసంభావములకై ప్రార్థనలను మేళగించుచున్నాను॥

భానువాసరము సామాన్యముగా శ్రీరాజదంపతులకు విశ్రాంతిదినము. వారాదివసంబున క్రైస్తవప్రార్థనాగారమునకు బోవుట తప్పనిపనిగానుండును. ఆవాడుకప్రకారము ఢిల్లీనగరమందును ఆదివారంబున ప్రార్థనామందిరమునకుబోయిరి. చెన్నపురిబిషపుగారొకసద్బోధనుజేసిరి.

సోమవారముప్రొద్దున పటాలములకు జెండాలనిచ్చుటలోను, మధ్యాహ్నము పోలోఆటను జూచుటలోను గడుపబడినది.

## దర్బారు.

హిందూదేశచరిత్రమునందీదినము సుదినము. ఆరుమాసములనుండి జేయుప్రయత్నములన్నియు నాదినమున ఫలప్రదములైనవి. శ్రీపంచమజార్జిరాజేంద్రుని రాజ్యాభిషేకమహోత్సవైభవముతో నేవిఘ్నములునులేక సంతసమునొందినది. అభిషేచనార్థమై యొకమహారంగము నిర్మింపబడినది. ఈమహారంగము రెండర్ధచంద్రాకార రంగములనుగలదిగనిర్మింపబడినది. స్వల్పార్ధ చంద్రాకార రంగమునందు రాష్ట్రపాలకులు, వారియధికారాతిథులు, సేనాధ్యక్షులు, స్వదేశసంస్థానాధీశులు, వారియధికారాతిథులు, వారినిమంత్రితులు, విశిష్టప్రేక్షకులు గూర్చొనుటకై 12000 ఆసనములుగలవు. విపులార్ధ చంద్రాకార రంగమునందు 50000 జనులుచూచుటకు దగినయేర్పాటులుగలవు. ఈరంగమునందు 6000 ఆసనములు విద్యార్థులకును, 8000 ఆసనములు నిమంత్రితులకును నిలుపుదలచేయబడినవి. స్వల్పరంగమునకునడుమ నొకమంటపముగలదు. ఇదిసంస్థానాధీశుల వినతులను గైకొనుటకై నిర్మింపబడినది. దానికివల చలువరాతితోను, సువర్ణమండితాంబర శిఖరములతోను పట్టాభిషేకార్థమై యొకసుందరమైన మంటపము నిర్మింపబడినది. దానికిని, పెద్దరంగమునకును నడుమను 20000 సైనికులు నిలుచుటకు స్థావర మేర్పఱచబడినది. ఈరంగప్రదేశమునందే శ్రీవిక్టోరియా మహారాజ్ఞియును శ్రీసప్తమఎడ్వర్డు సార్వభౌముండును హిందూదేశసామ్రాజ్యాభిషిక్తులైరి. మంగళవారము మధ్యాహ్నము పండ్రెండుగంటలకు శ్రీరాజదంపతులు రక్షకభటావృతసమావృతులై రంగస్థలమునందు బ్రవేసించిరి. రంగమంతయు పరమోత్సాహభరితులైన జననివహములతో నింపబడెను. రాజదంపతులు రంగస్థలమునందు ప్రవేశించినపుడు 101 ఫిరంగులు కాల్చబడెను. సైనికులు తుపాకిశబ్దములతో సన్మానించిరి. బ్యాండులన్నియును నేకముగ జాతీయగీతమును బాడెను. జనులు జయజయధ్వనులతో చక్రవర్తిని చక్రవర్తినిని సంభావించిరి. రాజదంపతులంతర్నాటకస్థపీఠముల నధిష్ఠించిరి.

ఈసంకులము మాటుమడిగినతోడనే శ్రీపంచమజార్జిచక్రవర్తి యిట్టులుచదువ నుపక్రమించెను.

“నేనునేడు మీనడుమను సంతోషకృతజ్ఞతాజాతమైన నిష్కపట భావములతో నిలబడితిని. ఈయేడునాకును చక్రవర్తినికిని ననేకసత్కార్యానుమాన సహితంబును నానందకరంబైనను నసామాన్యశ్రమభార సహితంబును నైన యేడుగాఁ బరిణమించినది. కానినేము వెనుకను హిందూదేశమును జూచినపుడుగలిగిన హృద్యానుచింతనములు దూరభారములను లక్ష్యమునేయక మాప్రేమకు భాజనంబైన యీదేశంబునకు మరల రప్పించినవి. మేముమునుపు స్వగృహ సౌఖ్యముల ననుభవించిన యీదేశమును దిరిగిచూచుటకై నిర్మల ప్రతీక్షతో దూరదేశప్రయాణమును జేయగడంగితిమి. దైవప్రసాదమున నాపూర్వికుల కిరీటము ప్రాచీనసంస్కారములతోను, గంభీ

రవైభవముతోను నాశిరముపైనుంచబడి జూను 22 వ తేదిన వెస్టుమినిష్టరు ఆబియందు జరిగినరాజ్యాభిషేచనమును నేనుమీకు స్వయముగ బ్రకటించుటకై గతజులైనెలలో బంపిననాసందేశమందు శృతపరచిన నాసంకల్పమీయాగమనము వలన ఫలించినది. విశ్వసనీయులైన హిందూదేశప్రజలకును రాణిమ్నగల సంస్థానాధీశులకును, మాయనురాగమును, హిందూసామ్రాజ్య యోగక్షేమములు మాహృదయముల కెంతిహృద్యము లైనదియును మహారాణితోగూడిన నాసాన్నిధ్యమువలన దెలుపదలంచియుంటిని.

మరియును నామహోత్సవ వైభవంబును జూచుటకు సదుపాయము లేనివారు ఢిల్లీయభిషేచనము నందు బ్రమేయమును గల్పించుకొనుటకు వీలును గలిగియుండవలయునని నాసంకల్పము. నాగవర్నరులు, విశ్వసనీయాంధికారులు, నాసామంతులు, ప్రజాప్రతినిధులు, నాహిందూసామ్రాజ్య సైనిక, నియోజకులును గల యీమహాజనసమూహ సందర్శనము పరమాహ్లాద సంతోషకరముగ నున్నది. నాకుధర్మనిష్ఠతోజూపనున్న వారిస్వామిభక్తిని, రాజభక్తిని నేనుసంపూర్ణసంతోషముతో స్వయముగ స్వీకరించెదను. ఈప్రఖ్యాతసమయమున ప్రభువులను, ప్రజలను, సానుకంపభావమును, సానురాగహితాభిలాషయును, నాతోనేకీభావులను జేయుచున్నవను భావము నాహృదయస్థమైనది. ఈభావప్రదర్శమున కనురూపముగా నారాజ్యాభిషేకమును ప్రత్యేకసమీపమునను గ్రహమును దెలుపు విశేషలాంఛనములతో స్మరణీయముగా జేయనిశ్చయించితిని. వాటిని యీమహాసభికిరోజున ముందునా గవర్నరుజనరలుద్వారా ప్రకటింపించెదను.

మీయోగక్షేమసంతోషములకై నాకుగలసద్భావమును, మీహక్కులను, స్వానుభోగములను గాపాడుటకై పూజార్హులైన మాపూర్వీకులు చేసిన ప్రతిజ్ఞలనునేనుస్వయముగ పునఃప్రతిపాదితములనుఁ జేయుటకునునాకీశరుణము చిక్కినందులకు నేనానందించుచున్నాను.

పరమేశ్వరుని యపారకృప నాప్రజలనుగాపాడుగాత! వారియోగక్షేమాభివృద్ధికైన నాసకలప్రయత్నములందును నాకుదోడ్పడుగాత!

సామంతులకును, ప్రజలకును, ఇచటనున్నయందరకును నాసానురాగాభివందనము లర్పించుచున్నాను.''

రాజప్రతినిధి, సేనాధిపతి, సామ్రాజ్యసభాకార్యనిర్వాహకులు, హైదరాబాదు, బరోడా, మైసూరు, కాశ్మీరము, రాజపుత్రస్థానము, మొదలగు సంస్థానాధీశులును, వంగరాష్ట్రోన్నతన్యాయాధీశులును సామ్రాజ్య శాసనసభాసభ్యులును, చెన్నపురిగవర్నరు, వారికార్యనిర్వాహక సభికులు, వారికిసంబంధించిన సంస్థానాధీశులు, చెన్నపురిరాష్ట్రీయ ప్రతినిధులు యీతీరుననే బొంబయిమొదలగు రాష్ట్రముల రాష్ట్రపాలకాదులును రాజదంపతులయెదుటనిలిచి సవినయ వినమితోత్తమాంగములతో నొకరివెనుకను నొకరు దమప్రభుభక్తిని వెల్లడించిరి.

ఈకార్యక్రమానంతరము శ్రీరాజదంపతులు చేతులను గలిపికొని సువర్ణఛత్రాచ్ఛాదితులై సింహాసనంబులు గల మంటపంబులంజేరిరి. వారులేచినవెంటనే సకలజనులు నిలఁబడిరి. శ్రీరాజదంపతులు సింహాసనము నధిష్ఠించిన పిమ్మట రాజప్రతినిధియును, మంత్రిమును, పరిజనులును సింహాసనమునకు బ్రక్కను నిలువఁబడిరి. దర్బారు సంస్కారాధిపతి సర్ హెన్రీమెక్మాహను రాజానుమతిని దర్బారును వ్యక్తీకరించెను. ప్రతీహారులీవార్తను ఘోషించిరి. మంగళతూర్యపటహనినాదంబులును, వాదిత్రగణమంగళ వాద్యంబులును, ప్రజల జయజయాశీర్వాదనాదంబులును బ్రతిధ్వనిల్లుచు సంతోషాబ్ధి తరంగములవలెఁ బొంగిపొరలి మహారావములతో మిన్నుముట్టెను.

పిమ్మట దర్బారు సంస్కారాధిపతులీ విధమున రాజశాసనమును బ్రకటించిరి.

శ్రీమహారాజచక్రవర్తిగారి రాజప్రకటనము.

శ్రీజార్జి మహారాజచక్రవర్తి.

మాప్రభుత్వపు ప్రథమసంవత్సరమగు, క్రీస్తుశకము వేయిన్నితొమ్మన్నూట పదవసంవత్సరపు జూలైనెల దీ 19 వ తేది గలిగినట్టియు నవంబరునెల దీ 7 వ తేది గలిగినట్టియు మారాజప్రకటనముల మూలమున, వేయిన్ని తొమ్మన్నూట పదునొకండవ సంవత్సరపు జూనునెల దీ 22 వ తేదిని సర్వశక్తుడగు భగవంతుని కృపాప్రసాదములచే మా రాజ పట్టాభిషేక మహోత్సవమును జరుపగలందులకు మా

రాజచిత్తమును ప్రకటించి వ్యక్తపరచియుంటిమిగావునను; కడచిన జూను నెల ది 22 వ తేది గురువారమున సర్వశక్తుడగు భగవంతుని కృపాప్రసాదమువలన, పైనిచెప్పిన మహోత్సవమును జరుపగలిగితిమి గావునను, పైనచెప్పిన మహోత్సవమట్లు జరిగినదని మాహిందూ రాష్ట్రములలోని ప్రేమగల మాప్రజలకు మేము స్వయముగా తెలియపరచుటయును, మాగవర్నరులను లెఫ్టినెంటు గవర్నర్లను, మాయితర ఆఫీసర్లను, మాసంరక్షణలోనున్న స్వదేశరాజులను, సంస్థానాధిపతులను, ప్రభువులను, మాహిందూసామ్రాజ్యపు పరగణాలన్నిటిలోను ఉన్న మాప్రతినిధులను, మాసన్నిధికి బిలుచుటయును, మా ఆపేక్షయు అభిలాషయునై యున్నదని మేము మాప్రభుత్వపు ప్రథమసంవత్సరము క్రీస్తుశకము వేయిన్ని తొమ్మన్నూట పదునొకండవసంవత్సరపు మార్చినెల ది 22 వ తేదిగల మారాజప్రకటనము మూలముగ విశదపరచియుంటిమిగావునను;

ఇప్పుడు మేము మారాజప్రకటనముగు దేనిమూలమున దానిని విశదపఱచుచు మాఆఫీసర్లందరికిని, ఢిల్లీలో సమావేశమయియున్న రాజులకు సంస్థానాధిపతులకు ప్రజలకుఅందరికిని, మహారాజచక్రవర్తిగా మా పట్టాభిషేకోత్సవములో సంగ్రహించిన ఇండియాసామ్రాజ్యముయెడల మాకుగల గాఢవాత్సల్యమును అంతరిక్షేమాభ్యుదయముల విషయమున మాకు ఉన్నట్టియు సర్వదా ఉండునట్టియు, శ్రద్ధను దృఢముగా స్పష్టపఱచుచున్నాము.

మాప్రభుత్వపు ద్వితీయసంవత్సరమైన వేయిన్నితొమ్మన్నూటపదునొకండవ సంవత్సరపు డిశంబరునెల ది 12 వ తేదిని, ఢిల్లీ పట్టాభిషేకమునందు మాయాసనమునుండి సాదరుచేయబడినది.

శ్రీమహారాజ చక్రవర్తిగారిని భగవంతుడు రక్షించుగాక.

“ఫోర్టుసెంటుజార్జి గెజెట్టునుండి ఎత్తి వ్రాయబడినది”

అప్పుడు తూర్యనాదంబులును, వాదిత్రగణ శోభనవాద్యంబులును, జనాశీర్వాదంబులును, తుపాకుల బారులును ఫిరంగిగుండ్లును శ్రీ మేరీమహారాజ్ఞీ సమేతుడైన శ్రీ పంచమజార్జి రాజేంద్రుని ఢిల్లీరాజ్యాభిషేచనమును దిగంతంబులందు వ్యాపింపజేసెను. ఈసంతసుల మారిన పిదప గవర్నరుజనరలు రాజాజ్ఞానుసారముగా యీక్రింది వరదానములను తెలియజేసెను.

1. విద్యాభివృద్ధికై ప్రతియేట యేబదిలక్షల రూప్యములనుసధికముగనిచ్చుట. 2. ఏబదిరూప్యములు తక్కువజీతములుగల యుద్యోగస్థులకు నెలజీతముతో సగము బహుమానముగ నొసంగుట. 3. హైందవ సైన్యాధికారులకు నయితము సాహస ధైర్యములకై విక్టోరియాక్రాసుపతకము నిచ్చుట. 4. సంస్థానాధీశులు రాజ్యభారమును వహించునపుడు నజరానాల నిచ్చుపద్ధతిని మాన్పుట. 5. ఖైదీలను కొందరిని విడుదలచేయుట. స్వల్పఋణములకై ఖైదులో బెట్టినవారు విడుదలజేయబడుట. 6. ప్రసిద్ధ పురుషుల కీనామిచ్చుట. 7. సైన్యాధికారుల వితంతువుల కాజన్మాంతము పవేతనమిచ్చుట మొదలగునవి. ఈప్రకటనానంతరము ప్రతీహారులును, సైనికులును, ప్రజలును శ్రీరాజదంపతుల నేకగ్రీవముగ నభినందించిరి. రాజదంపతులు వినయవినమితోత్తమాంగములతో ప్రజలనభినందించుచు సంతర్మంటపమునకు బోయిరి. అపుడు శ్రీపంచమజార్జి చక్రవర్తి యీక్రింది మార్పులను ప్రకటించెను.

1. రాజధానిని ఢిల్లీకిమార్చుట, 2. గవర్నరుతోగూడిన వంగదేశరాష్ట్ర నిర్మాణము, 3. బీహారు, చోటానాగపూరు, ఒరిస్సాలనుజేర్చి ప్రత్యేకరాష్ట్రమును నిర్మించుట. 4. అస్సామునకు చీఫుకమీషనరును నియమించుట. ఈప్రకటనము శ్రోతలసమక్షమున బిగ్గరగ జెప్పబడెను. వీనినామోదించువారు కొందరు. ఖండించువారుకొందరు. నిందించువారు మరికొందరు. వినియూరకున్నవారు కొందరు. ప్రతీహారులానసమయమున పటహతూర్యనినాదములతో దర్బారును ముగింపునకు దెచ్చిరి. శ్రీరాజదంపతులు దమ గుఱ్ఱపుబండినెక్కి సకల జనాశీర్వాదంబులను గైకొనుచు స్వకీయ శిబిరమునకుబోయిరి. రాజప్రతినిధియును నితరులును వారి గౌరవానుక్రమణముగ స్వకీయ వాసస్థలములకుం బోయిరి.

దర్బారునంగమును జూపు చిత్రపటములు 6 దీనియందుగలవు. 47 పుటలో నుత్తరభాగమున గల పటము సింహాసన మంటపమును ప్రదర్శించుచున్నది. శ్రీచక్రవర్తి చక్రవర్తినులు దానియందు నిలబడియున్నారు. ఈ మంటపమున క్రిందివైపున సైనికులును రెండవప్రక్కను ప్రేక్షకులునుగలరు. ఆపుటయందున్న రెండవపటము రాజదంపతులకు గౌరవరక్షకులుగానుండిన రాజకుమారుల పటాలమును జూపుపటము. 49 పుటయందలి పటము

అంతర్మంటపమును జూపుచున్నది. రాష్ట్రపాలకులు వారియతిథులు, సంస్థానాధీశులు వారి యతిథులు మొదలగు వారామంటపమునకు వెనుకతట్టున పెద్దమంటపమునందును దానికి బ్రక్కనుగలరు. 50 పుటయందుండుపటమును నాభాగములో నుత్తరదిశను దెలుపుచున్నది. 51 పుటయును 47 పుటయందలి విషయమును వ్యక్తీకరించుచున్నది. 52, 53 పుటలయందలి పటములు దర్బారు పెద్దరంగములోని సామాన్యజనులను సైనికులను బ్రదర్శించుచున్నది. ఈపటములన్నియును 600 గజములు మధ్య కొలతగల ప్రదేశమును బ్రదర్శించుచున్నవి.

ఈపటావలోకనంబున దర్బారురంగ వైశాల్యంబును, సింహాసన మంటప సౌందర్యంబును, సామంతరాజుల వైభవంబును, విపులసేనాబృందంబును, మహాజననివహంబును, రాజ్యాభిషేచనంబును జనువరు లూహింపనోపుదురు.

మంగళవారము రాత్రి రాజశిబిరమునందు 4000 మందికి గొప్పవిందు సేయబడెను. ఢిల్లీలోనుండు ప్రముఖులందఱావిందారగించవచ్చిరి. హైందవస్త్రీలు సహితము దివ్యాంబరాభరణాలంకృతలై వచ్చియుండిరి. రాజదంపతు లతిథులతో సదయహృదయులై మాటలాడుచు వారికానందమును గలిగించిరి. బుధవారము ప్రొద్దున శ్రీమేరీ మహారాజ్ఞి మహారాణులకును, రాకుమారికలకును, ఆతిథ్యము నొసంగెను. భోపాలు బీగము, బరోడామహారాణీ, ఇండిరా రాజకుమారి, బర్మా రాజాంగనలు మొదలగు నూర్గురు రాజాంగనలు వచ్చియుండిరి. చక్రవర్తిని వారు లోగడనిచ్చిన కానుకలకై ప్రత్యేకముగా ప్రతిసుందరాంగికిని వందనము లర్పించెను. బుధవారముసాయంత్రి రాజదంపతులు కోటలోని దివానిఖాను మందిరసామీప్యమున తోటవిందునుజేసిరి. ఈవిందున కనేకవందల జనులువచ్చిరి. ఆదినముననే రాజదంపతులు కోటబురుజులపై నిలిచి బాదుషాహి మేలాలోని లక్షలకొలది జనులకు దర్శనమిచ్చిరి. చూచినవారందఱును పరమోత్సాహభరితులై రాజదంపతుల గొనియాడిరి. గురువారము ప్రొద్దున బద్లికీసరయి ప్రదేశమున 50000 సైనికబృందము గూడినది. ఈసైనికబృంద విమర్శనార్థము చక్రవర్తి యశ్వారూఢుడై చనుదెంచెను. సామ్రాజ్ఞియును గుఱ్ఱపుబండినెక్కి వచ్చెను. చక్రవర్తి స్వయముగ సేనాధిపతితో గూడి సేనాదళంబులం బరీక్షించెను. అనంతర మాంగ్లేయ పతాక మునరోహింపఁబడిన స్తంభసామీప్యమున నశ్వారూఢులై చక్రవర్తియును, సేనాధిపతియును, రాజప్రతినిధియును నిలఁబడిరి.

సప్తదళములుగా విభజింపఁబడిన సైన్యమంతయును బ్రతిదళమునందును శతఘ్నిదళము, తురంగదళము, పదాతిదళము, పరిచారదళము మొదలగు దళములతో గూడిన సప్తదళంబులును చక్రవర్తి ముందుగా వరుసకిరువదియైదుమందిగల వరుసలుగా మందగమనముతోను, పిమ్మట ద్విగుణీకృత వేగముతోను, ననంతరము సత్వరగమనముతోను బోయెను. బ్రిటిషు సైన్యవిన్యాసానంతరము సామ్రాజ్య సామంత సైన్యమును నీరీతిని గమనమును జేసిరి. సామ్రాజ్య సామంతసైన్యమును జూచినపుడును బ్రిటిషుసైన్యమును జూచినపుడును వీరావేశమును దేశాభిమానమును జూపరుల కవితర్కితముగ జనించినవి. రాజపుత్రసంస్థానాధీశులు వారి సైనికబృందములకు స్వయముగ నాయకత్వమువహించి వారి లోకవిఖ్యాత పౌరుషప్రతాపములను బ్రకటించిరి. ప్రతాపసింహ మహారాజును జూచినపుడు జను లుత్సాహభరితులైరి. బికనీరు మహారాజు దన దివ్యమైన యొంటెలపటాలమునకు నాయకత్వమును వహించెను. భావనగరు జోధపూరు రాజకుమారుల వీరోత్సాహమునుజూచిన వారందరును వారలనభినందించిరి. ఈసైన్యవిన్యాస సందర్శనమున బ్రిటిషుసామ్రాజ్యబలమును భరతవర్ష భావిబల బీజాంకురములును గనుపట్టినట్టులుండెనని. వీరాభిమాన వినాశము దేశదుస్థితికి మూలమైనది. దేశమునందు శాంతి ప్రజలమనంబులందు వీరాభిమానము బ్రిటిషుపరిపాలనాలాభము వలన వర్ధిలుచున్నది. సైన్యవిమర్శన పటము 54 పుటయందుగలదు.

శుక్రవారమునాడు చక్రవర్తి నూతన డిల్లీనగరమునకు శంకుస్థాపనమును జేసెను. శంకుస్థాపనమునకు చక్రవర్తి యొకరాతిని చక్రవర్తిని రెండవరాతిని నియుక్తస్థలములో నుంచిరి. ఆరోజునను రక్షకభట విమర్శనమును మల్లయుద్ధ ప్రావీణ్యమును జూడఁబడినది. శనివారము మధ్యాహ్నము ఒకగంటవేళ చక్రవర్తి వేటాడుటకై నేపాళ దేశారణ్యమార్గమును బట్టెను. చక్రవర్తిని విశ్రాంతికై యాగ్రాకోటకుబోయెను. శ్రీపంచమజార్జి రాజేంద్రుని నిర్గను సమయమునందును నాగమన సమయమునందువలె నధికారులు సామంతులును నుత్సవశ్రేణిగా నేర్పడి చక్రవర్తిని వీడుకొలిపిరి.

చక్రవర్తికి వేటాడుటయందు మంచిప్రజ్ఞగలదు. వారిగురి యమోఘము. నేపాళదేశారణ్యములందనేక పులులను, ఖడ్గమృగములను, భల్లూకములను, నితర క్రూరసత్వములను శ్రీవారు సంహరించిరి. వేటచిత్రపటములు 70 పుటలోగలవు. శ్రీమేరీమహారాణి రాజపుత్రస్థానమునందలి సుప్రసిద్ధ స్థలములను నాగ్రాయందలి దివ్యమందిరములను జూచుచుఁ గాలమును గడపెను. ఆగ్రాకోటయందు సామ్రాజ్ఞిని జూపు చిత్రపటము 71 పుటయందుగలదు.

రాజదంపతు లిద్దరును పాట్నా సామీప్యమున రైలుబండిలో గలిసికొని 30 తేదిని కలకత్తా నగరమునుఁ జేరిరి. కలకత్తానగర పారిశుద్ధ్య సంఘమువారు శ్రీ రాజదంపతులకు స్వాగతంబు నొసంగిరి. వంగవిభజనోపసంహారమువలన వంగదేశీయులు ముదితహృదయులై, రాజభక్తిపూరితులై పరమోత్సాహభరితులైరి. కలకత్తా నగరమునందుఁ బ్రదర్శింపఁబడిన రాజభక్త్యుత్సాహములు బొంబయి డిల్లీనగరములందు జూపబడియుండలేదు. వంగదేశవాసులకుత్సాహము సహజగుణము. రాజాగమనమువలన వారియుత్సాహముశాంతిభూయిష్టమైరాజారాధనమునకై మరల్పబడినది. కలకత్తానగరమునందు రాజసాన్నిధ్యమును బ్రకటించుటకు రమ్యమైన యుత్సవంబులు జరుపబడినవి. వాటికి సంబంధించిన చిత్రపటములు 69 పుటయందుగలవు.

జనవరి 8 వ తేదిని కలకత్తానువదలి 10 బొంబయిచేరిరి. ఆదినమునందే మెదీనా పొగయోడనెక్కి స్వదేశోన్ముఖులైరి. శ్రీరాజదంపతులు బోటునెక్కబోవుటను జెలుపుపటములు 71 పుటయందు గలదు.

## దర్బారుఫలము.

శ్రీపంచమజార్జి రాజేంద్రుడు గత జూనుమాసమునందు ముందింగ్లాండులో రాజ్యభారముతో బాటుఁగ నితరభారములను స్వీకరించెను. ఆభారములను నధికారులకును, ప్రజలకును, సామంతరాజులకును విశదీకరించుటకు దర్బారవసరమైనది. శ్రీపంచమజార్జి చక్రవర్తి సామ్రాజ్యాధిపతి, సేనాధ్యక్షుడు, పౌరవశ్రేష్ఠుడు, పవిత్రగృహస్థ ధర్మపరిపాలకుడు, శౌర్యగాంభీర్యాది గుణపోషకుడు, దానధర్మనిర్మాణకుడు, సదాచార శిక్షకుడు. డిల్లీనగరములో దర్బారు మహోత్సవములను జూచినవారికి రాజేంద్రుని యీగుణ విశేషములు బోధ్యములగుచున్నవి. రాజ్యాధిష్ఠాతలకుగల గౌరవ వైభవాధికారములు జనులకు స్ఫురించునట్లు వారిబాధ్యతలు స్ఫురించుట దుర్లభము. శ్రీ పంచమజార్జి చక్రవర్తి దనసామ్రాజ్య స్వామ్యత్వమునకనువుగ నొకవేళను మంత్రిపుంగవుల నిర్ణయముల విమర్శించుచుండెను. ఒకసమయమున సేనానివహముల బరీక్షించుచుండెను. ఒకకాలమున సంస్థానాధీశులను, నధికారులను సంభావించుచుండెను. ఒకప్రొద్దు పౌరుషేయములైన యాటలనాడువారికి నుత్తేజమును గలిగించుచుండెను. ఒకదినమున సద్గృహస్థుల నతిథిసత్కారముల సంతృప్తులంజేయుచుండెను. ఈవిధమున చక్రవర్తి కాలమంతయును సామ్రాజ్య హితార్థము వినియోగముగుచుండెను. రాజేంద్రుడు దన యాగమనము వలన నధికారులకును, ప్రజలకును బ్రత్యక్షముగ నీవిధ్యుపాసనాశీలమును బోధించెను. సామ్రాజ్యపౌరులలో నగ్రగణ్యులైన రాజేంద్రునివలె నధికారులును, ప్రజలును స్వకీయసుఖలాభములను బాటింపక సమయానుసారముగ బ్రజాదేశహితార్థమై బాటుఁబడవలసియుందురు.

### రాజాగమనఫలము.

శ్రీపంచమజార్జి చక్రవర్తి నిష్కపట ప్రసంగములు శ్రీవారికి హైందవులపట్లగల సదభిమానానురాగములను వెల్లడించుచున్నవి. ఆరేండ్లకుబూర్వ మీ దేశమును యువరాజుగా సందర్శించినపుడు దేశముపై దృఢానురాగమేర్పడి బ్రిటిషు హిందూదేశాధికారులకు అనుకంపా సందేశమును బ్రకటించెను. ఢిల్లీ దర్బారు ప్రకటనలయందు స్వకీయ హృదయమందు దయానురాగములను వ్యక్తీకరించెను. కలకత్తా విశ్వవిద్యాలయ సమ్మానపత్రమునకు బ్రత్యుత్తరమిచ్చుచు హైందవులకు ఆశ యను బ్రత్యేయ వచనము నుపదేశించెను. స్వదేశోన్ముఖులైనపుడు బొంబాయి శాసనసభాసభ్యుల సన్మానపత్రమునకు నైకమత్యము అను మహామంత్రము నుపదేశించెను.

అధికారులు, అనధికారులు, హిందువులు, మహమ్మదీయులు, అతివాదులు, మితవాదులు, సామ్రాజ్యవాదులు, ప్రజాహితార్థవాదులు, యూరపియనులు, హైందవులు రాజభక్తిని బ్రకటించుట కేకభావముతో బ్రవర్తించిరి. హిందూదేశ కల్యాణమున కీయేకభావము మూలమని దర్బారువలనను, రాజోపదేశమువలనను గ్రహింపనగును.

హిందూసామ్రాజ్యము బ్రిటిషుసామ్రాజ్యమునకు శిరోభూషణమను లోకోక్తి ఢిల్లీదర్బారువలన ధృవపడినది.

రాజప్రతినిధిద్వారా హైందవప్రజలును, సామంతరాజులును, బ్రిటిషుద్వీపవాసులకు బంపిన వాత్సల్య సందేశము హైందవులకు బ్రిటిషుసామ్రాజ్యమునందుం బౌరత్వ ప్రయోజనమును బ్రకటించుచు సామ్రాజ్యములోని యంతర్భాగములకు హైందవులపట్ల గౌరవమేర్పడుటకును, బ్రిటిషుద్వీపములకును హిందూదేశమునకును గల సంబంధము దృఢపాశబద్ధమై సామ్రాజ్యాభివృద్ధికిని హిందూదేశాభివృద్ధికిని దోడ్పడుటకునుం బ్రయోజనకారి కాగలదు.

ఢిల్లీదర్బారువలన హిందూదేశ చరిత్రమునందొక నూతనయుగ మేర్పడినది. ఆయుగస్థాపనమునకుం గారకులైన శ్రీపంచమజార్జి రాజేంద్రునకును శ్రీమేరీమహారాజ్ఞియును భగవదనుగ్రహమువలన నాయురారోగ్యైశ్వర్యవంతులై వర్ధిల్లెదరు గాత!



## నాల్గవసంవత్సరాదిసంచిక.

ఇది క్రొత్తవిధమున ముద్రింపబడును. సంచికయంతయును దళసరిదైన తెల్లకాగితములపైన ముద్రింపబడును. దానియందు సుందరమైన చిత్రపటములు నుండును:—

1. హిందూదేశమునందలి పుణ్యక్షేత్రములు, హిందూదేవాలయములు. 2. సుందరమందిరములు. 3 రమ్యస్థలములు. 4. ప్రాచీనమందిరములు 5. బౌద్ధస్తూపములు. మొదలగు వాటి సచరిత్ర చిత్రపటములు చక్కగా ముద్రింపబడును.

ఆంధ్రదేశమునందలి దేవాలయములు, బౌద్ధస్తూపములు, సుందరమందిరములు, రమణీయప్రదేశములు మొదలగువాటి చిత్రపటములను వాటి చరిత్రమును త్వరగాపంపుట కాంధ్రదేశీయులు ప్రార్థితులు. ఈపెద్దసంచికను ముద్రించుటకు కాలముపట్టునుగాన రెండుమాసములలో ముద్రణమారంభమగును.

సంచికకు సంబంధించిన క్రొత్తయభిప్రాయములను దెలిపిన నవి వందనపూర్వకముగ గ్రహింపబడును.

పత్రికాధిపతి.

## మ. రా. శ్రీ, యన్. కూరత్తాళ్వార్ అయ్యంగారు.

శ్రీభారత యాంధ్రగీతము, సుగంధివృత్తము.

దేవరాజ చక్రవర్తిఁ బ్రసన్నుఁ బ్రోవుమా
చేవ గల్గి మమ్మునేలఁ జెల్మిబల్మిఁ గావుమా
శాత్రవంబడంచి మైత్రిశాస్త్రవృద్ధిఁ జేయుచున్
గాత్రశక్తిహస్తశిల్ప శౌర్యభాగ్యమానుచున్
మాతృభక్తి రాజునందు మానకుందునందఱున్
చిత్రవస్తుకల్పనంబు చేసివృద్ధిఁ గాంచుచున్.

సీ. మా రాజ్యచక్రమం దారూఢముగ వత్య . సంధతన్యాయము శాంతిఁ గూర్చు। ఆదరంబున దేవయాశీర్వదింపుము నిగ్రహింపక మమ్మనుగ్రహించి। రాజు లప్రజలను రక్షించుటనుగల్గి ప్రజలు రాజులయెడభక్తిఁ గొలిచి। ఐకమత్యంబున నలరింపఁ దూదేశ జనులకుండఱివను సమతఁ బెరుగ గీ. అతఁడు దీర్ఘాయువును బొంది యావగమున ప్రజలవంతల నడగించి వారిసుఖము। తనసుఖముగ నిరూపించి ధర్మమూన దేవమా చక్రవర్తిని గావుమెపుడు.

సీ. నేలపాటును దుడ్డు నిలుకడతో మేము, కూలిపనుల్ చేసి కూర్పఁ జేయుఁ। ధనధాన్యసంపదల్ తగురీతి నార్జించి బాగొందఁజన వినియోగకఱచి దేశబాంధవ్యంబు కోశసాహిత్యంబు చవవుసాములనేర్చి సజ్జనులమై, వాఁడివీడక మేము తూఁడరులముగాక యాత్మకలంజనంబు పెరుగ గీ. అతఁడు దీర్ఘాయువును బొంది యాదరమునఁ బ్రజలవంతలనడగించి వారిసుఖము తనసుఖముగా నిరూపించు ధర్మమూన దేవమా చక్రవర్తిని గావుమెపుడు.

## మ. రా. శ్రీ, కేసిరాజు సీతారామయ్యగారు.

సీ. దిటమైన దోషంపు తిమిరంబులడఁగంగ కరముల కనుబంతగములనలము। దిక్కులకౌశవింత లెలివిసేకూఱంగ నరిబృందములక్రీడలడుగువడఁగ। క్రమముగానిండారు కళలెల్ల దైవాఱఁ గుపలయంబునకెందు కొదలుదీఱ। సతతంబు తనకెందు సన్మార్గ గతియొప్ప నర్మలితోడ మండలముబూన। నలయలఙ్గాంద్ర గర్భపయోంబు రాశి। నుదయమొందిన యశోజ్యోత్స్నలావగనట్టి। జార్జినృపచంద్రుఁ డా మేరిసరగఁ గూడి। భువినిపాలింప దైవంబు బ్రోచుఁగాత!

సీ. ఘనఘనాపఘనాము సంజనితాంబు భృద్వేణి గంధసామజయాన కనకగాత్రి। సౌధాగ్రఘటిత భావ్వరకుంభకుస్తని ప్రస్ఫుటాహస్త విశాల గృహపి। రంపరాబద్ధతోరణకంజదళనేత్ర రంభోరువును దీవిరాజమాన। ప్రమదాంగుళీధూత వల్లకీసుస్వర ప్రోద్దామ ముకుర కపోలయైన। ఢిల్లిపురలక్ష్మిఁ జేపట్టితేవమిఱు। శ్రీలు దైవార పట్టాభిషేకమొందు। జార్జిప్రభువును మేరీని శాశ్వతముగ। భువినిపాలింప దైవంబు బ్రోచుఁగాత!

## మ. రా. శ్రీ, త్యాడవీరపరసాపతిగారు.

సీ. వేయిగన్నులజూచు వేడుకిన్నాళ్లకు గలిగెనో యంచు సంక్రందనుండు। రెప్పవేయక గన్చూప్పనకు ఫలంబు గలిగెనేడని తెరగంటిమూక। ద్వివసహస్రజిహ్వాలఁ గనటుదీరనుతించు సమయముబ్బెనటంచు సర్పరాజు। పలుకుల చెలినన్న పలుకునకు ఫలంబుఁ గలిగెనేడను మను పలుకువెలది. గీ మార్గసుందరి జార్జిపట్టాభిషేక। సంభ్రమముగాంచ వినుతించ సకలభాష। లనుగ్రహించఁ దరమె భూజనులకెల్ల। వసుధఁ బట్టాభిషేకోత్సవంబుఁ బొగడ.

సీ. చిరకాలమీ వసూనరు లిండియారాజ్య మేలుగావుత యంచు నెల్ల జనులు। కలకాల మీదంపతుల నేక రాజ్యాధిపతులుగావలెనంచు బాధువితతి। యెల్లప్పుడీవధూతల్లజేశ్వరల స్నేహముగావలెనటంచు నవ్యనృపులు। సర్వదా యీరాజదంపతులు పుత్రపౌత్రవాప్తిఁ గొనుఁగాక నను చుత్రితులు. గీ. సపతాప్రార్థనము లెల్ల దేశములము। దంబునను జేయు ఢిల్లీపురంబునందు। మతగురూత్తమశాస్త్రసమ్మతముగాను। శ్రీమహారాజ్ఞితో నభిషిక్తుఁడయ్యె.

## మ. రా. శ్రీ, బుక్కపురి వెంకటశపిగారు.

సీ. రాజీవమందిర రమణీయలావణ్య హృదయవికశితాంబుజదినరాజు। నిరుపమవ్యమనుముంత నిర్భరశౌర్యపూర్వ సుపర్వశైలసుపర్వరాజు। వరభయక్లేశ నికరభోగిజాల సంసారపంకేజ నిశాధిరాజు। యనుపమధ్యాననిజాశ్రితప్రకర దోషాటకపటల శేషాహిరాజు. తే. గీ. పిత్రుపమానీత రాజ్యంబుప్రీతిబ్రోవ। రాజులందరుగొల్వఁగ రాణిగూడి। వేగ పట్టాభిషిక్తుఁడై వెలయుచున్న। జార్జిభూవరేంద్రున కిడుగాత సౌఖ్యమెలమి.

సీ. మతిచమత్కృతి సురమంత్రికిదీటయి. గాంభీర్యమందునకడలిబోలి సత్యమందల హరిశ్చంద్రుని సరియయి. యీవినికానీను నీసడించి। వలనొప్పకల్మిని వైశ్రవణుదెగడి, పరులగెల్చెడి పట్లపార్థునీఁగి ధర్మమధర్మముల్ దాల్మిమైనెరుగుచు బ్రీతిదిద్దెడి యాడరాముఁ డెనశి. తే. గీ. భూరికారుణ్యమూర్తియై మొనశిప్రజల। బుత్రులను బోలె బోషింపబూనియున్న। రాజ్యమేలుచున్న యా రాజరాజ। జార్జిచక్రవర్తినిగృప శౌరిగాచు.



Lord Lytton.



లిట్టను ప్రభువు.

Lord Curzon.



కర్జను ప్రభువు.

H. E. General Sir O'Moore Creagh.



[illegible] క్రేగ్.

Lieut. Governor of Bengal.



బంగాళాదేశపు లెఫ్టినెంటు గవర్నరు. సర్ విలియం డ్యూకు.



Sir Louise, Dane K.C.S.I., Lieut.Governor of Punjab.

సర్ లూయిడేను కె.సి.ఎస్.ఐ. పంజాబు లెఫ్టినెంటు గవర్నరు.



Sir John Prescot Hewett Lieut-Governor of the United Provinces.

సర్ జాన్ ప్రెస్కాటు హ్యూయిటు.
సంయుక్తరాష్ట్ర లెఫ్టినెంటు గవర్నరు.
దర్బారు సన్నాహ నాయకుడు.

Sir Reginald H. Craddock, K.C.S.I. Home Member.



సర్ రెజినాల్డు క్రాడకు. స్వదేశాంగమంత్రి.



Sir Charles Bayley, K. C. S.I., Lieut. Governor of Behar.

బేహారు లెఫ్టినెంటు గవర్నరు.

Sir Guy Fleetwood Wilson.



సర్ ఫ్లీటువుడు విల్సను. కోశాధ్యక్షుడు.

Sir Robert Carlyle.



రెవిన్యూమెంబరు. సర్ రాబర్టు కార్లైలు.

Hon. Sir Harcourt Butler K.C.S.I.
Member for Education.



గౌ॥ సర్ హార్కోర్టు బట్లరు. విద్యాంగమంత్రి.

Hon. Mr. Clark. C. S. I.



గౌ॥ క్లార్కు-దొరగారు
వాణిజ్యవ్యాపారమంత్రి.

Sir Lawrence Jenkins, Chief Justice of Bengal.



కలకత్తా హైకోర్టు ప్రధాన న్యాయాధిపతి.

Sir Basil Scott, Chief Justice of Bombay.



బొంబయి హైకోర్టు ప్రధాన న్యాయాధీశుడు.

Rear Admiral Sir Collin Keppel, K. C. I. E.



రేర్ అడ్మిరల్ సర్ కాలిన్ కెప్పెల్ మెడినానావాధికారి.

Mr. E. A. Gait, Census Commissioner.



ఇ. ఎ. గైటుగారు, జనాభ లెక్క కమిషనరు.

# ప్రతాపరుద్ర మహారాజు.

మ.రా.శ్రీ, మాడపాటి హనుమంతరావుగారిచే వ్రాయఁబడినది.

మ॥ "సతతంబ్రశ్రుఝరిన్విలోచనముల * న్జాఱింపక, న్కామునో
ధృతిదూలన్ హృదయప్రదేశముల భే * దింపంగ నుంకింప, కీ
గతికిన్గారణమేమొ, పాయుటకుమా * ర్గంబేదొ యీదుస్థితిన్,
పతితోన్నత్యము! మానసీవిషయఁపు * న్వ్రాతంబు నేర్వఁగదే"!

దేశచరిత్రలందు మనకగపడు మహాపురుషులలోఁ గొందరతిహీనస్థితినుండి, స్వీయసామర్థ్య బలమున నత్యున్నతదశ నధిరోహించి, యామరణమునట్టి యుచ్చదశవలని సుఖముల ననుభవించియుండ, మఱికొందరు, శేముషీ విశేషమున నేమి శౌర్యసాహసములందేమి పైవారికేమాత్రముఁ దీసిపోవువారు కాకపోయినను, జీవితసంగరమున నెంతయో నిపుణతతోఁ బోరాడి బహుకాలము విజయలక్ష్మి దృగంచలముల నాకర్షించియుండినను తుదకుఁ దమకాలముననే తమవైభవము క్షీణమార్గము ననుగమించుటఁ గన్నులారగాంచు దుర్దశకుఁ బాల్పడియుందురు. బాబరుచక్రవర్తివలన హిందూదేశాలవాలమున నాటబడిన మొగలు సామ్రాజ్యలత తరువాతిరాజులకాలమున నలుదెసలకెగఁబ్రాకి, చివరకు ఔరంగజేబు కాలమందు నిరుపమాన విస్తృతిని వహించి యంతకుఁ బూర్వమెన్నడును నెఱుంగనంత దట్టముగఁ బూచి తనసౌరభముల దిగంతముల కనిపియుండుట మనకువిదితము. అయిన నంతటిసామ్రాజ్య విస్తారము ననుభవించిన యా ఔరంగజేబే యంత్యకాలమునఁ దన యధికార వైశాల్యమును గోల్పోయి యపారదుఃఖమునకుఁ గుఱియగుటసంభవించెను. ఇట్టి స్థితులందు వారి వైభవక్షీణతకుఁ గారణములేవో కొన్ని తోఁచుచుండినను, తార్కికదృష్టితోఁ గాక సామాన్యదృష్టితో నవలోకించువారలకీమార్పు లనివార్యములగు దైవికకారణముల ఫలితములుగఁ దోపక మానవు. మనకథానాయకుఁడగు ప్రతాపరుద్రుఁడు నైతమిట్టిచారిత్రిక పురుషుల తరగతికి సంబంధించినవాఁడే.

వీరరుద్రదేవుఁడు, రెండవ ప్రతాపరుద్రుఁడను నామాంతరములుగల ఈమహాపురుషుని జన్మస్థానమైయొప్పు భాగ్యము కాకతీయ రాజపుంగవుల రాజధానియుఁ ద్రిలింగసామ్రాజ్య రమకావాసమును నగు 'ఓరుగల్లు' పురమునకు లభించినది. పదునాఱుసంవత్సరముల వయస్సునఁ గిరీటాధిపతి యయ్యెనను ప్రతాపచరిత్రలోని వాక్యమునుఁబట్టి, ఈయన క్రీ॥శ॥ 1280 లోఁ జన్మించినట్లూహింపఁబడుచున్నది. దేశచరిత్రలును, తదితరగ్రంథములును నీయన తండ్రినామమునుగూర్చి మూకీభావము వహించియున్నను నీతఁడు ఆంధ్రదేశమందెల్లెడలఁ దనశుభ్రయశశ్చంద్రికల వెదజల్లి ఎడతెగని విజయములచేతను విమలవర్తనముచేతను, నెన్నికఁగాంచిన గణపతిరాజునకును, రాజ్యతంత్ర వైశారద్యమువలననుఁ బ్రజానురాగ మహిమవలనను, నద్వితీయగఁ బొగడొందిన దుర్గయొక్కయవతారముగఁ జనులచే మ్రొక్కులందిన రుద్రమదేవికి దౌహిత్రుఁడు; ఉమ్మక్కగర్భశుక్తి ముక్తాఫలము. ఈతని బాల్యకాలవృత్తాంతములఁ దెలియుటకుఁ దగుసాధనములంతగా లేకపోయినను వీరయుగమనఁ దగు నక్కాలమున శౌర్యధనులగు రాజన్యుల పుట్టుకచేఁ బవిత్రమైన తనవంశగౌరవమును, యోగ్యమగువిధమునఁ గాపాడుకొనుటకునుఁ బూర్వికుల యశస్సును మఱింత వృద్ధిచేయుటకును వలయు విద్యాసంపద నతఁడు పదునేనువత్సరముల ప్రాయమునాఁడే గడించెనని చెప్పెదరు. స్వకీయమగు మేధావిశేషమునకును దోస్సారమునకును మాతామహియగు రుద్రమదేవియొక్కసచ్ఛిక్షతోడ్పడసర్వవిధముల నాఱితేఱి మన ప్రతాపరుద్రుఁడు క్రీ॥శ॥ 1296 న సింహాసనారూఢుఁడయ్యెను.

రాజ్యాంగసూత్రములఁ గేలఁబూనిన తరువాతఁ బ్రప్రథమమున నాతఁడు రాజధానియందు వసించియుండు వివిధప్రజల ధనప్రాణరక్షణమునకై గట్టికట్టుదిట్టములఁ జేయనారంభించెను. ఆదినములలో నొక్కనాఁడు ఆకుల పురుషోత్తముఁడను పండితునింట దోఁపిడికాండ్రుపడి సంపదనంతయుఁ జూఱగొనుటయేకాక అతనిమర్దించి

గాయపఱచిరఁట. మహారాజున కవ్వార్త పిడుగువలెవిన వచ్చినందున సత్వరమే శౌర్యవిరాజితులగు డెబ్బదియేడ్గురు పద్మనాయకులనుఁ దనసేననుండి రప్పించి పట్టణపుఁ బ్రహారీపైనుండిన డెబ్బదియేడు బురుజులమీద నొక్కొక నాయకునిగను నాతనిక్రింద నలుగురు సరదారులను వారికి సహాయమొనర్చుటకు వలయు భటనికాయమును నేర్పఱచెను. ఈయేర్పాటులకొఱ కెంతయో ద్రవ్యము వ్యయమైనను దరువాతఁ బ్రజలధనాదుల కెట్టి నష్టమును వాటిల్లక వారు నెమ్మదిగ జీవనములఁ గడుపుకొనుట సంభవించెను. మఱియుఁ బరిపాలితుల సుఖజీవనమునకు వలయు నితరకార్యముల నొనర్చి దిగ్విజయ యాత్రకై వెడలి కటకపురముపై దాడియొనర్చి యాతనిఁ జయించి యమూల్యరత్నములఁ గానుకగాఁగొనెను. పిదప దక్షిణదేశోన్ముఖుఁడై చని రామేశ్వరము వఱకేగి మధ్యమార్గమున ననేకరాజులఁ బరాభూతులఁ జేసెననియు, వారలవలన ననర్ఘములగు నుపాయనములఁబడసి తులలేనిసంపదలతోను నసంఖ్యాకమగు జతురంగబలములతో నునిజరాజధానిఁ బ్రవేశించెననియుఁ జెప్పఁబడుచున్నది. ముకుందదేవి యను రాజ్ఞి దేశముపైనఁగూడ నీతని సేనలు దండయాత్రనడపి విజయోపేతములుగ వెనుకకు మఱలెనని తెలియవచ్చుచున్నది; కాని యాయమ దేశమెచ్చటనుండెనో తెలిసికొన సాధనమువెవ్వియు నగపడవు. ఇవిగాక ఘూర్జరదేశముపైనెత్తి యచ్చటిరాజును రణరంగమున నోడించెననియు, నాతనినుండి ప్రబలసైన్యముఁ గొనెననియుఁ గొన్ని గ్రంథములు చెప్పుచున్నను, నిదియెంతవరకు విశ్వాసార్హమో చారిత్రిక ప్రమాణములు లేనిది నిర్ణయింప వలనుపడదు. ఇవ్విధముగ నితఁడు గొప్పభూభాగమునుఁ దనకు లోఁబఱచుకొని యక్కాలమునందలి రాజులలో నసమానఖ్యాతినిఁ గడించియుండెను. ఎందఱో దేశాధీశులితనికి మాండలికులుగను చమూపతులుగను నుండినట్లు గ్రంథములును, శాసనములును సాక్ష్యమిచ్చుచున్నవి.

ఈతనికాలమున సామంతరాజుల పాలనముక్రింద నున్నదికాక, స్వీయపరిపాలనమునకు లోఁబడిన దేశము తూర్పున గోదావరీనదివఱకును, నుత్తరమున బీరారు వఱకును, దక్షిణమున గృష్ణానదివఱకును వ్యాపించియుండినట్లగపడుచున్నది. వేఱుశబ్దములలో, నీభూభాగము మొత్తముమీఁద నిప్పుడు నిజామురాష్ట్రమెంతయున్నదో, యాతకుఁ దక్కువకాని వైశాల్యముఁ గలిగియుండినట్లు తోఁచెడిని. అనుదినకలహములచే స్వల్పవైశాల్యముగల రాష్ట్రములుతప్ప గొప్పరాజ్యముల నిర్మాణమున కవకాశములేని యక్కాలమున, నాంధ్రదేశరంగమందుఁ గాకతీయసామ్రాజ్యనాటకము సుమారు వేయివత్సరముల వరకు నవవిలాసములతోఁ బ్రదర్శింపఁబడియుండుట యొక సామాన్య కార్యముకాదు. కాకతిప్రళయుని నాఁటనుండి, తనపూర్వులార్జించిన రాజ్యమునుఁ దనబాహుపటిమచే విశాలతరముగనొనర్చి వంద్యముగఁ బాలనమునల్పిన ప్రతాపరుద్రుని కీర్తియెంతయు, గొనియాడఁదగియున్నది. ఇతనిరాజ్యపు వార్షికాదాయమును, సామంత భూపాలురవలనవచ్చు గప్పములునుఁగలసి యనేకకోట్ల రూప్యములుగ లెక్కింపఁబడినవి. ఈతనికాలమున ఓరుగల్లు పురవైభవము మేఱమీఱియుండెను. ఇప్పటి ఓరుగల్లుచుట్టును నాలుమైళ్ళదూరమును సుమారు 15 అడుగుల యున్నతియు, 14అడుగుల మందమును కలిగి, యావరించియున్న మట్టికోట మొదటిది. *సుమారు ముప్పదిమైళ్ళకొలతగల యీకోటగోడ, అచ్చటచ్చటఁ జెఱువుకట్టగ నుపయోగింపబడి, యాప్రదేశమందు నిలచుఁజలము వ్యవసాయముకొఱకు వాడఁబడుటకుఁ దగినవ్యవస్థ చేయఁబడియుండినట్లిప్పటికినిఁ గాననయ్యెడిని. ఈకోటకు నడుమనున్న స్థలమంతయు జనసమ్మర్దముగల యావాసములచేతనుఁ బేటలచేతనునిండియుండెడిది. ఆగ్నేయదిశన నీకోటద్వారము, హనుమకొండకిప్పుడు 9మైళ్ళదూరముననున్న గవిచర్లయను గ్రామసమీపమున నుండెననియు, నీగ్రామనామము గవిని (ద్వారము) చర్లయొక్క సంకుచితస్వరూపమనియు జెప్పెదరు. మట్టెవాడయను పేరనిప్పుడు ప్రసిద్ధిఁజెందియున్నస్థల మక్కాలమున మట్టెలవాడ (మట్టెలమ్మువీధి)గ

* ఓరుగల్లుచుట్టు నేడుకోటలుండెనని జనులు వాడుకొనుచుందురు; కాని నిజముగ మూడుమాత్రమే కానవచ్చుచున్నవి. ఈమట్టికోట యొక్క యెత్తును మందమునుఁ బ్రతాపరుద్రుని కాలము నాఁడిప్పటికంటె నెన్నియోరెట్లు హెచ్చుగనుండెనని యూహింపబడుచున్నవి.

నుండెననియు వాడుకగలదు. ఇట్లే వేళ్ళుమాటి పూర్వము
నుండినిలచియున్న గ్రామము లిప్పుడీప్రాంతమున నెన్ని
యోకలవు. పైకోటకు లోపలిభాగమున నిప్పటి ఓరుగల్లు
గ్రామము నావరించియున్న మట్టికోట సుమారు మైలు
న్నరపొడవును సంతియవెడల్పును, నష్టకోణాకారమును
గలిగియున్నది. దానిలోపల రాతికోటయొకటి సుమారొ
క చదరపుమైలు వైశాల్యముఁ గలిగియున్నది. దీనిలోన
మఱియొక మట్టికోటయుండెననిచెప్పి, ప్రాతయిటుకలతోడి
కట్టడపుగుర్తుల నిప్పటికినిఁజూపెదరు. ఈరాతికోటలో
పలనే రాజప్రాసాదములును, భవ్యదేవాలయములును
నుండినట్లు తచ్ఛిథిలములు చాటుచున్నవి. ఓరుగల్లను
నామము నీపురమునకొసంగిన యొక యొంటిరాతిగుట్ట,
చిన్న దేవళముతోను, నుత్సవాదిసమయములందు రాజధి
ష్ఠించుటకైవిచిత్రముగను నెత్తుగను నిర్మింపఁబడిన యున్న
తవేదికతోను నొప్పుచుఁ, దానొకకాలమునఁ జూచియుం
డిన విభవాతిశయములనుఁ, గాకతీయసామ్రాజ్య మహా
మహిమమును నేఁడుసైతము చూపఱకు వాగ్రహితమగు
భాషయందుపన్యసింపుచున్నది. కాకతీయవంశపు రాజ
ధాని హనుమకొండనుండి ఓరుగల్లునకు మార్పఁబడుట
కెయ్యది కారణమయ్యెనని చరిత్రలు వాకొనుచున్నవో,
యట్టి పరశవేది లింగముగల దేవాలయమని చెప్పఁబడు
చిన్నగుడియొకటి సగము నేలలో నడఁగికానవచ్చుచున్నది.
హృదయమున కానందమును, నాశ్చర్యమునుఁ గలిగించు
చు, జక్కనిపనితనముచే బ్రకాశించుచుఁ గానవచ్చు నా
ల్గుశిలాద్వారములును రాజుగారిభవనమునకు సంబంధిం
చియుండెనని చెప్పుచున్నారు. కోటలలో నిమిడియున్న
ప్రదేశమంతయు నక్కాలమున నొకప్రబల సామ్రాజ్య
లక్ష్మి కలంకారభూతములగు వివిధవర్తకశాలలతోను,
గర్మాగారములతోను నిండియుండెడిదఁట. చిత్రకార స్వ
ర్ణకారులయొక్కయుఁ, బరిమళద్రవ్యవిక్రేతలయొక్కయు,
శిల్పులయొక్కయు, నితరవృత్తులు గలవారియొక్కయు,
గృహములసంఖ్య సహస్రముల పరిమితికలిగియుండెను.
సామాన్యముగ దేవాలయములయొక్కయు, ముఖ్యముగ
శివాలయములయొక్కయు సంఖ్య, వందలకు మించియుం
డెను. ఇవిగాక నింకననేకజాతుల జనుల గృహములసంఖ్య
ప్రతాపచరిత్రయందుఁ జూపబడియున్నది; దానిలో గొం
త యతిశయోక్తి యుండుట కొప్పుకొనినను, నాయాజా
తులకును, వృత్తులకును సంబంధించిన వారవ్వారమున
నివసించి యుండిరనుటమాత్రము నిర్వివాదాంశము. ఒక
ప్పుడీమహారాజనుదినము భాగీరథీ పవిత్రజలములతోఁగాని
మహేశ్వరుని బూజింపనను దీక్షఁబూని, కాశీక్షేత్రము
నుండి ప్రతిదినమునీరందునట్లుచేయుటకై మూడు వేలయి
దువందలబ్రాహ్మణులనేర్పఱచిమూడువత్సరములకాలము
తనప్రతిన నిల్పుకొనినపిదప శివుడాతని మనోబలమునుబరి
క్షింపగోరి యేడుదినములవరకునునిరంతమగుగాలివానన్ను
ష్టించెననియు,గంగాతోయ[illegible] ందునఁబ్రతాపరుద్రు
డా యేడుదినము లుపవసించుట[illegible]ఁడాతనిభక్తికిమె
చ్చి యోరుగల్లునకుత్తరమున క్రోసుదూరముపైన భాగీ
రథీఝరి యుద్భవిల్లునట్లనుగ్రహించెననియు నొకకథ కల
దు. దీనిమూలమెట్టిదైననుఁ, గాశిబుగ్గయనుపేర నొకబావి
ఓరుగల్లున కనతిదూరమున నున్నది. ఆషాఢమాసమున
బర్వదినములందు జనులచ్చటికిఁబోయి, యందలిజలముల
స్నానములొనర్చి గంగాస్నానఫలము లభించినదని సంత
సించుటయు, మృతకులకు సద్గతిలభించుటకై వారియస్థికలీ
యపరగంగానలిలములందుఁ బడుటయు, నిప్పటికిని జరుగు
చున్నది. ఈబావికడ మహారాజుగారుకట్టించినదని చెప్పఁ
బడు దేవళముసైతము శిధిలావస్థయందు నిలచియున్నది.

ప్రజాహితతత్పరత హిందూరాజులకుఁ జిరకాల
మునుండి సహజభూషణమైవిలసిల్లినది. ఈనరపాలాగ్రణి
పాలితుల సుఖముకొఱకును, సంపద్వృద్ధికొఱకును సహ
కారములగు దివ్యతటాకములనేకములఁ గట్టించెను. 8000
గజములపొడవును, 6000 గజములవెడల్పును, నిండియుం
డినప్పుడు 13 చదరపుమైళ్ళ జలోపరిభాగమునుఁగలిగి,
కృష్ణానది కుపనదియగు మున్నేఱనుదానికి జన్మస్థానమును
సముద్రోపమానమును నగు పాకాలచెఱువీ రాజశ్రేష్ఠుని
కాలమున నిర్మింపబడినదేయని చెప్పుదురు; చరిత్రకారులు
సైతమట్లేవ్రాసిరి. కాని యిటీవలనాతటాకపుఁగట్టపైనున్న
శాసనమునుఁ బరిక్షించుటవలన నాయభిప్రాయము సరి

కాదనియు, నాచెఱువు గణపతిరాజుకాలమున నిర్మింపబడియుండవలయుననియుఁ దెలియుచున్నది. పైశాసనములోని శ్లోకములరచించిన రామనాథకవి తన్నుఁ గాకతీయ గణపతిరాజు నాస్థానకవిగఁ జెప్పుకొనియున్నాడు. ఈవిషయమింకనువిచారణీయము. ప్రతాపరుద్రునికాలమునఁ గట్టబడిన దేవాలయము లెన్నియో యిప్పటికిని జీర్ణావస్థయందు దమయేలిక యౌదార్యమునుఁ జాటుచున్నవి. ఈయన యెన్నియోమారులు తులాభారమునఁదూగి తనయెత్తు స్వర్ణమును బేదలకు బంచిపెట్టెను. గ్రహణకాలమందొకనాడు మాద్గల్యక్షేత్రమున 11 బంగారపుటావులను భూసురులకు దానమిచ్చెను. కృష్ణమాచార్యుండను పండితుని కోరికప్రకారవ [illegible] బంగారపువర్షముఁ గురిపించెనను కథ సిప్ర [illegible]తములందలి బాలురుసైత మెఱుంగుదురు! మానుకోటతాలూకాలోని మాలేడు గ్రామసమీపముననున్న యొకశాసనమునుబట్టి, శా. శ. 1232 (క్రీ. శ 1310)నకు సరియగు సాధారణసంవత్సర శ్రావణ బహుళాష్టమి సోమవారమునాఁడు ప్రతాపరుద్రుఁడచ్చటి కేగి, యంతకుమున్నచ్చట కాకతిప్రభయుని సామంతుఁడగు మల్లనాయకునిచేఁ గట్టింపఁబడిన దేవాలయముం దర్శించి, శివదేవయ్య మొదలగువారనేక భూదానములొసంగినట్లగపడుచున్నది. వేయేల? శుష్కవచనములచే గాకఁ గ్రియాపూర్వకముగ నౌదార్యముఁ బ్రకటించుటయే యప్పటిరాజుల కీర్తిని చిరస్థాయిగాజేసిన ముఖ్యరహస్యము!

మొదటినుండి తుదవరకుయుద్ధప్రసంగములచేనిండియుండిన యీతని పరిపాలనకాలమున, విద్యావిషయములుఁగూడఁ గొంతశ్రద్ధనందియుండుట కన్పట్టుచున్నది. సంస్కృతవాఙ్మయమున కమూల్యాలంకారమై, ప్రతాపరుద్రీయమను నామాంకితమై, యొప్పు లక్షణగ్రంథమీ మహారాజు నాస్థానపండితుడగు విద్యానాథకవియొక్క విజ్ఞానఫలితమే. ఈజనపాలశేఖరుఁడు తానుప్రతాపమార్తాండమను పేర నొకయుద్ధగ్రంథమును దేవభాషయందు రచించెను. విఖ్యాతకవియగు పాలకురికి సోమనాథుఁడు తనవిద్యామహిమచే దొంకిపర్తి మొదలగు నగ్రహారముల బడసెను. మారనకవికృతమగు మార్కండేయ పురాణమున కీమహారాజు సేనానియగు గన్నమంత్రియే కృతిభర్తయయ్యెను!

ఇంతకుఁబూర్వము రెండుమూడు శతాబ్దములనుండి హిందువుల స్వాతంత్ర్యమును మ్రింగివైచుచుండిన మహమ్మదీయుల దండయాత్ర లిదివఱకును దక్షిణమునకు వచ్చియుండలేదు. ఈరాజుకాలముననే క్రీ.శ.1308వ సంవత్సరమున ఢిల్లీచక్రవర్తియగు నలాఉద్దీన్ మలిక్ కాఫూరను వానిక్రింద నొకప్రచండసైన్యమునునిచ్చి,యాతని వంగదేశమార్గమున, నోరుగల్లుపై కనిపెను. మ్లేచ్ఛసైన్యము హనుమకొండ కాఱుమైళ్ళదూరమునందున్న రేచర్లనగరమువద్ద విడిసెననియుఁ, బ్రతాపరుద్రుని వాహినీవీర మద్దానినెదుర్కొని పూర్తిగఁ బరాభవించి యంపెననియు, నీసంగ్రామమున మహారాజునకు నరపతిరాయఁడను శూరవరుఁడమిత సహాయమొనర్చెననియుఁ బ్రతాపచరిత్రకర్త వ్రాసియున్నాడు. చందగిరియనుపేర నిప్పుడు వ్యవహరింపఁబడుచున్న యీరేచర్లనగర ముక్కాలమున బ్రతాపరుద్రుని ప్రాంతాధీశులై త్రిభువనగిరిరాజు కొండసింగపురము మొదలగు స్థలములఁ బాలించుచుండిన వెలమ వంశజుల ముఖ్యస్థానమై యుండినట్లు అయ్యనప్రోలు శాసనమువలనఁ దెలియుచున్నది. ఈయుద్ధమున మహమ్మదీయసేనలు పరాజయమునొందుట యగపడుచుండినను, మహమ్మదీయ చరిత్రకారులు పోరుజఱుగకపూర్వమే చక్రవర్తికార్యాంతరమునఁ దనసేనల ఢిల్లీకిఁ బిలుపించుకొనెనను సనత్యపువ్రాతల వ్రాసియున్నారు.

రెండవమాటి కాఫూరు క్రీ॥శ॥ 1309 సంవత్సరమున ఢిల్లీనుండి వెడలి దేవగిరి మార్గమునఁ ద్రిలింగరాజ్యముం బ్రవేశించి (ఇప్పటి నిజామాబాదు)వచ్చి తత్సమీపముననుండిన సార్బార్ కోటను హస్తగతముచేసికొని యపరిమిత రక్తపాతమొనర్చెను. అటనుండి యాతఁడు ఓరుగల్లుపైనెత్తిరాగా ప్రతాపరుద్రుని సైన్యము లాతనితో డీకొని ధైర్యముగఁ బోరునల్పెను. కాని దేశద్రోహియైన కటకరాజు తురుష్కులకు సహాయము చేసినందువలనను, మాతృద్రోహులగు కోటలోనికొందరు నాయకులు

ధనాశచేఁ దురుష్కులకు ననుకూలురైనందునను అదివరకు బాధఁజెందియున్న జైనులు రాజ్యములోనిగుట్టును శత్రువులకుఁ జెప్పినందువలననుఁ' దుదకు హిందూసైన్యములకుఁ బరాభవము వాటిల్లుటచేతఁ 'ప్రతాపరుద్రుఁడు ఢిల్లీశ్వరునకుఁ గప్పముకట్టునట్లు సంధిచేసికొనవలసినవాఁడాయెను.' హనుమకొండయందుఁ గాకతిరుద్రదేవుని కాలమున నిర్మింపఁబడి నేటికిని పురాతన శిల్పిచాతుర్యమునకొక యుత్కృష్టోదాహరణముగ నిలచియున్న వేయిస్తంభముల దేవాలయమును భిన్నభిన్నముగ నొనర్చిన గౌరవము కాఫూరుయొక్కయు నాతనిసేనలయొక్కయు నీతూరిదౌర్జన్యదుర్నయముల కేచెందుచున్నదనిచెప్పుదురు.

తరువాతఁ గొలదికాలమునకే ఢిల్లీసార్వభౌమత్వముఖిల్జీ వంశమునుండి తుగలుఖు వంశమునకుమారెను. ఓరుగంటిరాజు దక్షిణహిందూదేశరాజులతోఁ గూడి యీమధ్యకాలముననే ఢిల్లీసింహాసనమునకుఁ గప్పముఁ గట్టుట మానినందున నప్పటి చక్రవర్తియగు గయాసుద్దీనుని పుత్రుఁడునుఁ దనమందబుద్ధియొక్క యతిశయముచేత హిందూదేశ చరిత్రయందొక క్రొత్తయధ్యాయముఁ గల్పించినవాఁడునునగు ఉల్లూఖానుఁడొక గొప్పసేనను వెంటఁగొని మలిక్‌తైమూర్, మలిక్ అఫ్ఘాన్, మలిక్‌తగీన్ మున్నగుసేనాధీశులతోఁ గూడి క్రీ॥శ॥ 1321 సంవత్సరమున నోరుగంటికోటను ముట్టడించెను. ప్రతాపరుద్రుఁడు స్వయముగ నాసేనలతో మిగులశౌర్యమునఁ బోరాడి యంతకుముందు దనకంటియుండిన పరాజయకళంకమునుఁ బూర్తిగఁ గడిగివైచికొనెను. ఆంధ్రసేనలా ఘోరసంగ్రామమునఁ బ్రాణముల నరకుసేయక పోరి తామొక్కకాలమున మగధరాజ్యమువంటి ప్రబలరాష్ట్రమును జయించినవారి సంతతులమనిచూపిరి. ఆంధ్రుల ప్రతాపమునెదుట నిలువఁజాలక మ్లేచ్ఛసైన్యములు చెల్లాచెదరుకాసాగెను. మ్లేచ్ఛసేనాధీశులు యువరాజుతోఁబాటు పిక్కబలిమిఁజూపిరి. ప్రతాపరుద్రునిసేనలు మ్లేచ్ఛసైన్యములవెంటనంటి మలిక్‌తైమూరునుబట్టి వధించి మిట్టిపడుచుండిన ప్రతిపక్షులకు బుద్ధిసెప్పిరి. మలక్ అఫ్గానుపలాయనమాత్రమునుఁ బఠించుచుండ నంతకుముందీ మహమ్మదీయులవలన స్వాతంత్ర్యమునుఁ గోల్పోయియుండిన మహారాష్ట్రులాతనిఁ బట్టుకొని చర్మమొలిపించి చిత్రవధ గావించి క్రీ॥శ॥ 1318 వయందు దేశస్వాతంత్ర్యమునకై యత్నించుచు మ్లేచ్ఛులవలనఁ జంపఁబడిన హరపాలదేవుని హత్యకుఁ బ్రతీకారమొనర్చిరి!

కాకతీయ సామ్రాజ్యవనమిట్టి మహోన్నతపదవియందుండ నందు బ్రతికూలవాయువులు వీవసాగెను. అంతఃకలహములు క్రమముగవృద్ధియై రాజ్యఁపుఁబలమునుఁ దగ్గింపఁ దొడఁగె. గణపతిరాజుయొక్కయు తరువాతిప్రభువులయొక్కయు శైవమతావేశమునకు గుఱియైయుండిన జైనుల ప్రతీకారాసక్తి నాఁటి నాటికిఁబెరిగి సామ్రాజ్యవినాశనమునకు సాధనములగూర్చుచు మహమ్మదీయుల నాకర్షింపసాగెను. అట్లుకాదేని యంతకు వెనుకటివత్సరముననే బ్రతుకుజీవుఁడాయని కాళులకుఁ బుద్ధిసెప్పియుండిన తురుష్కులకు మఱల క్రీ॥శ॥ 1323 వ సంవత్సరమున నోరుగంటిని ముట్టడించునంతటి ధైర్యమెటనుండి రాగల్గును? ఉల్లూఖానుఁడు మరల నొకసైన్యముగొని త్రిలింగరాజ్యములోనిదగు బీదరుమార్గమున నోరుగల్లుబ్రవేశించి ప్రతాపరుద్రునోడించి ఢిల్లీకి జెఱగొనిపోయెను. ఖాజాహాజీ, మలిక్ భేధార్ ఖానులను సేనానుల నాతనివెంటనంపి ఓరుగల్లుకు సుల్తానుపురమనుపేరుబెట్టి ఉల్లూఖానుఁడు తానునుకొన్నిదినములకు ఢిల్లీకిఁబోయెను.

శాత్రవసేనాటవియందు స్వైరవిహారము సల్పిన యారాజసింహము కాలవశమున ఢిల్లీలోఁ గొన్నినాళులు చెఱయందుండెను. అప్పుడు ఢిల్లీని పాలించుచుండిన చక్రవర్తియగు గయాసుద్దీనుయొక్క సౌజన్యమును నాతనితల్లియొక్క సద్బుద్ధియు మనకథానాయకుని కారాగారవిముక్తికిఁ గారణములయ్యెను. ఆచక్రవర్తి యుచితమర్యాదలతోఁ బ్రతాపరుద్రుని స్వరాజ్యమునకంపెను. స్వదేశోన్ముఖుఁడై త్రిలింగదేశమున కొకదిశనహద్దగు కాళేశ్వరమునకాతఁడువచ్చెను. అంతకుమున్ను శత్రువులచే నొందిన పరాభవమును నెడతెగని యుద్ధప్రసంగములును నాతనిమనస్సును స్తబ్ధముగఁజేసెను. మిగిలిన జీవితభాగమును బ్రాపంచిక సుఖాభిరతిచేఁ గళంకితముకానీక

గౌతమీసలిలములచేఁ దనశరీరమును ఈశ్వరసేవార్చనలచేఁ దనయాత్మనుఁ బవిత్రముగఁ జేసికొనఁ గృతనిశ్చయుఁడై యతఁడు రాజ్యాంగవ్యవహారముల సోదరుఁడగు నన్నమదేవునకునుఁ గుమారుఁడగు కృష్ణదేవునకును నప్పగించి తాను పత్నీయుతముగ నచ్చటనేవసియించి క్రీ॥శ॥ 1328 సంవత్సరమున రుధిరోద్గారి సంవత్సర మాఘశుద్ధాష్టమీ గురువారమునాఁడు శివసాయుజ్యమునందెను. ఆయన భార్యయు సహగమనవిధిచే భర్తననుగమించెనని చెప్పఁబడుచున్నది.

ప్రతాపరుద్రుని మరణముతోఁ గాకతీయవంశవైభవము నిశాంతదీపికయయ్యెను. ప్రాంతాధీశులును సామంతులును స్వతంత్రులైరి. ఓరుగంటిరాజ్యమున మ్లేచ్ఛుల ప్రాముఖ్యత హెచ్చసాగెను. అట్లనుటవలన నీవంశమంతటితో నశించెనని తలపఁరాదు. కృష్ణదేవుఁడు తండ్రిపదవి నధిష్ఠించినతరువాత క్రీ॥శ॥ 1344 నఁ గాకతీయవైభవదీపిక కోలానునందుజఱిగిన యుద్ధరూపమున విజయనగరరాజ్య సహాయమునఁ దుదిమారు భగ్గునమండి సేనాధిపతియు యువరాజునునగు వినాయకదేవుని వీరశయనముతోఁ గొండయెక్క వేయిసంవత్సరములనుండి శత్రురాజులకన్నుల మిఱుమిట్లుగొల్పుచుండిన రాజ్యమందిరము నంధకారబంధురముగ నొనర్చెను. ఓరుగంటి యువరాజు దేశరక్షణోద్యమమున నసువులఁబాసి షేక్స్పియరుయొక్క యీక్రిందివచనముల ననుసరించెను.

చ. నడుపుము ధర్మమార్గమున నమ్మికతో; భయమొందకోపు మె
  న్నడును; తలంపులన్నియును, న్యాయమునందు, స్వదేశమందు, నె
  క్కుడు భగవంతునందెపుడుఁ గూరిమినిల్పు; మటుల్పొనర్చినన్
  బడితివయేనిధన్యుడవు; భాగ్యమిదే! కనుమయ్య క్రాముపెల్॥



# వాసిరెడ్డి సంస్థానము.

గుంటూరు డిప్యూటీతహశ్శీలుదారగు చిరుమామిళ్ల లక్ష్మీనారాయణప్రసాద్ బి. ఏ., గారిచే వ్రాయఁబడినది.

---

వాశిరెడ్డిసంస్థానము చెన్నరాజధానియందుత్తర సర్కారులలో నెన్నదగు సంస్థానములలో నొకటి. ఈసంస్థానికులు కమ్మవారు, షుమారు ఎనిమిదివందల సంవత్సరములకు పూర్వము దక్షిణహిందూస్థానమున 'వాసి' యనునామముతో నొకవంశము ప్రభుత్వముజేయుచుండెను. వారిప్రభుత్వస్థానమున కనతిదూరములో బహుయోజనవిస్తీర్ణంబగు నొక యరణ్యంబుండెను. అందునచ్చటచ్చట ఫలపుష్ప సమన్వితంబులగు వృక్షరాజములతో చుట్టుకొనబడి స్వభావసిద్ధమగు నందమును వెలిబుచ్చుచుండెడు గ్రామములుకలవు. ఏతదరణ్యంబునకు నాథుండులేని కతంబున 'వాసి' వంశీకులు, అందుముఖ్యగ్రామములగు, వల్లుట్ల, వాసివి,కలకట్టలను బాహుపరాక్రమము నెఱపి స్వాధీనపర్చుకొనియు, మఱికొన్నిగ్రామముల క్రొత్తగ నేర్పఱిచి వృద్ధిచేసియు తమరాజ్యమును బలపఱచుకొనిరి. వదపడి సామీప్య సంస్థానాధీశులగు రెడ్లతో వీరు చెలిమివాటించి ప్రజాతృప్తికరముగ రాజ్యపాలన చేయుచుండిరి. ఇట్టిస్థితియందు రెడ్లప్రభుత్వమునకు లోబడినవారు కప్పమునుచెల్లించక ప్రభువులయెడ తిరస్కారభావంబును జూపింప ప్రజానాశనకరంబు గాకుండుటకునై యోచించి యుభయపక్షులవారును తులారణంబు నేర్పాటుగావించుకొనిరి. కాని రెడ్లప్రభువగు జౌడభూపతికి తనసైన్యంబున దులారణంబునకు తగినవీరుండు కానరాడయ్యె. 'వాసి' వంశంబున సదాశివయ్య యనునాతడు ప్రతిలేనివీరుండై బాహుపరాక్రమంబున యర్జునున కన్నమిన్నయై వెలయుచుండు కతన దనకుదానై మిత్రునకు దోడ్పాటుగానెంచి జౌఢభూపతిపక్షమున తానుతులారణంబున కేగనిశ్చ

యించి తనమనోనిశ్చయమును రెడ్డిప్రభువున కెఱుంగింప నాతండమితానంద పరవశుండై కౌగలించుకొని దీవనలిచ్చి యుద్ధంబునకనపెను. సదాశివయ్య త్రిపురసంహారకర్తయగు కేవల యాసదాశివుఁడో యనునట్లు విజృంభించి ప్రతిపీరుని నిమేషమాత్రంబున బొఁటిపుచ్చెను. ఇట్టియప్రతిమానవిజయంబు సహింపలేక ప్రతికక్షివారు తొలినియమంబునుదిగద్రావి పెక్కురొక్కుమ్మడి సదాశివునిపైబడ నాతఁడును భూధరంబు పగదిచలింపక శత్రుసైన్యంబుల నుఱుమాడి జౌడభూపతి సంస్థానంబునుస్థాపించెను. ఇవ్విధంబున రెడ్లకు వాసి (గౌరవమును) తెచ్చినందున సదాశివయ్యయు తద్వంశీకులు నప్పటినుండియు వాసిరెడ్డివారని పిలువబడుచున్నారు. సదాశివయ్య తనకొనర్చిన మేలునకై జౌడభూపతి యాతనికి పెక్కుగ్రామంబులిచ్చి సత్కరించెను. తదాది సదాశివయ్య నెట్టులయిన వంచించి నిర్జించుటకుగాను శత్రువులు క్రూరాలోచనలు చేయుచుండి పూర్వము ద్వాపరయుగమందు నశ్వత్థామ పాండవశిబిరంబున నొనర్చిన దుష్టకృత్యంబును జ్ఞప్తికిదెచ్చుకొని సదాశివయ్య భవనమును రాత్రివేళ నిద్రాసమయమున ప్రవేశించి యాతనిని తద్బంధువులను బాలురనక స్త్రీలనక నతికౄరులై వధించి వాశిరెడ్డిసంస్థానము నాక్రమించుకొనిరి. ఆసమయమున దైవనియతిని సదాశివయ్యపత్ని రెండుసంవత్సరముల వయస్సుగల తనకుమారునితో నచ్చటికి సామీప్యగ్రామముననున్న తనపుట్టినింటనుండెను. ఆపె యిట్టిఘోరవిపత్తును వినినతోడనే తన బాలకుమారుని నయితము శత్రులెట్టులయిన మోసగించి చంపెదరను వగపుతో తనకు మిక్కిలినమ్మకముగల యొకబ్రాహ్మణ యువతిచేతి కబ్బాలునొప్పగించి యవసరమగు ధనంబును భూషణాంబరంబులనిచ్చి యెట్లులైన నప్పాపని దూరదేశంబుగొనిపోయి రక్షించవలసినదనియు, తగువయస్సున విద్యాబుద్ధులుగఱపి సమయానుకూలముగ తన పెద్దలమొడల శత్రువులొనర్చిన ఘోరకృత్యంబును విశదీకరించి యందుల ప్రతీకారంబుచేయ ప్రోత్సాహపరచవలసినదనియు దిటవుగ నాపెకుబోధచేసి తానుసహగమనం బొనర్చెను. తరువాత నాబ్రాహ్మణాంగన శ్రీగిరి మల్లిఖార్జునుడను నామముగల యబ్బాలుని తీసుకొని గుంటూరునకు సుమారు 10.12 మైళ్ళదూరములోయున్న నూతక్కియను గ్రామముప్రవేశించి యచ్చట శక్తీశ్వర స్వామిపేర నొకయాలయముకట్టించి యందునివశించుచుండెను. ఆపె కడుజాగ్రతతో పెంచినందున శ్రీగిరి మల్లిఖార్జునుడు అసమానవిద్యాపారంగతుండై యుక్తవయస్సువచ్చిన పిదప నాపెచే తనకుటుంబమునకు సంభవించిన దుర్దశను విని దండతాడితమహోరగంబు కరణిమండిపడి ప్రతీకారంబునకుగాను తనస్వదేశంబునకు బోవనుద్యమింప నాటిరాత్రి శక్తీశ్వరస్వామి వృద్ధబ్రాహ్మణవేషంబున నాతనికి బొడగట్టి యాతనియుద్యమమును నిరుత్సాహపరచి యాతండు కొలదికాలములో నొకప్రభుత్వమున కధినాథుండగునని చెప్పినదృశ్యుఁడాయెను. పిమ్మట మల్లిఖార్జునుడు అప్పటికి గుంటూరు సీమయందు నివసించుచుండు కమ్మవారిలో నొకకన్యను పాణిగ్రహణం బొనర్చెను. అతండును అతనివంశీకులును కొండవీటియందు కొన్నిగ్రామంబుల స్వాధీనపర్చుకుని యేలుచుండిరి.

కొన్నిసంవత్సరంబులు గడచినతరువాత వాశిరెడ్డి వంశములో చంద్రమౌళీశ్వరుడను నొకప్రముఖుడు ప్రభుత్వమునకువచ్చి స్థిరమగు సంస్థానమును స్థాపించవలెనను తలంపుతో కొంతసైన్యమును పోగుచేసుకొని హైదరాబాదునకువెళ్ళి సుబేదారుగారిని సందర్శించి అచ్చటనే వారిదండు సంబంధమగు కార్యములను కొంతకాలమువరకు నిర్వహించుచుండ సుబేదారనుగ్రహించి నూతక్కి తాటికొండ మఱికొన్నిగ్రామములను జాగీరిచ్చి గొప్పబహుమతులుచేసి బంపివేసెను. అంత కొన్నితరములకు వీరప్పనాయుడను ముఖ్యపురుషుడు జనించెను. ఈయన కుమారులలో రాఘవయ్య, రామన్న చంద్రమౌళియనువారు ప్రాముఖ్యులు. రాజ్యాభివృద్ధికాంక్షచే యీముగ్గురు సోదరులు మొగల్ చక్రవర్తియగు షాజహాను దర్శనార్థమై ఢిల్లీకివెళ్ళి తద్దర్శనంబుగానక పెక్కువత్సరంబులు వేచియుండి సేనానులయొక్కయు, దేశప్రముఖ్యులయొక్కయు స్నేహము సంపాదించిరి. ఇంతలో షాజహాను చక్రవర్తియొక్క సుబేదారులు కొందరు పన్నునీయక తిరుగబ

డినందున చక్రవర్తిచే యుద్ధమునకుగాను పంపబడిన సేనాధిపతులతో కలసి వాసిరెడ్డిసోదరులు ముప్వురు దండువెడలి తమ అసమానయుద్ధకళానైపుణ్యంబున యాసుబేదారుల నశ్రమంబున స్వాధీనపర్చుకొనిరి. జరిగిన స్థితి తనసేనానులవల్ల చక్రవర్తి వినినవాడై సోదరులనురావించి నందిగామ పరగణాను దఖల్ పరచి మరికొన్ని యినాముల నిచ్చెను. అంతట వారుముప్వురు సంతృప్తులై స్వదేశము నకువచ్చి దువరగాహంబులగు నరణ్యంబుల ఖాళీచేసి పెక్కుగ్రామంబులు నిర్మించి హైదరాబాదునకువెళ్ళి 1080 ఫసలీలో యిస్టేటుయందు సమభాగములుగ ముప్వురు షుబేదారువల్ల సనదునుబడసిరి. ఈముప్వురు సోదరులలో రామన్నయొక్క వంశము కొలదిసంవత్సరములలో నంతరించెను. చంద్రమౌళియొక్క వంశీకులు కృష్ణాజిల్లా నందిగామతాలూకా చింతలపాటివంటి ప్రభువులై ప్రస్తుతమున శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద్‌బహద్దర్ మన్నెసుల్తాన్‌గారు కడుశ్లాఘనీయముగ ప్రజానురంజకముగ రాజ్యపాలన జేయుచున్నారు. ఇకను ముగ్గురిలో మిగిలియున్న రాఘవయ్యగారివంశము జ్యేష్టవంశము. ఇందు పదునేడవ శతాబ్దమున రాజావాశిరెడ్డి వెంకటాద్రినాయుడుగారను దివ్యపురుషుండుదయించి సత్తెనపల్లితాలూకా చింతపల్లి ముఖ్యపట్టణముగా రాజ్యమేలెను. ఇద్ధాత్రీంద్రుని వైభవమహాత్మ్యములనుగురించి వాల్టరు ఇల్లియెటు దొరవారు గవర్నమెంటుకు 1846 సంవత్సరం యేప్రియలు 14 తేదీన వ్రాసినరిపోర్టుయొక్క తర్జుమా సంగ్రహముసు యీక్రింద బొందుపఱచుచున్నాను.

"వాసిరెడ్డి ప్రొప్రైటరగు వెంకటాద్రినాయుడు తన కుటుంబ సంస్థానమగు చింతపల్లి ఎస్టేటునకు తోడు రేపల్లె ఎస్టేటులో భాగమగు వెంగుపురం డిస్ట్రిక్టును, కొల్లూరు, నిజాము పట్నములను కొని కొన్ని కారణాంతరములచే అమరావతిని రాజధానిగా నేర్పరుచుకొని అచ్చట దివ్య భవనములను శృంగారోద్యానంబులను నిర్మించెను. చేబ్రోలు మొదలగు మఱికొన్ని గ్రామములలోకూడ రాజభవనములను మంగళగిరియందు పదునొకండుద్వారములుగల అత్త్యున్నతగోపురమును అమరావతి చేబ్రోలు మున్నగు ననేక దివ్యస్థలములయందు దేవాలయములను కట్టించెను. తనరాజ్యమున ముఖ్యమగు పుణ్యస్థలములయందు ముప్పదియమగుల యెత్తుగలిగి బంగారు మొలామచేసిన 180 యిత్తడి స్తంభములను స్థాపించి రెండుమారులు వెండితోడను ఒకమారు బంగారుతోడను తులాభారముతూగి సద్బ్రాహ్మణులకు పంచిపెట్టెను. రామేశ్వరము మొదలుగాగల యాత్రలుసేవించి, కాశీకి పోవునపుడు పేష్వాబాజీరావుగారికి అమూల్యములగు నజరులు సమర్పించెను. తనపేష్‌కష్‌ను ముందుగజెల్లించి తనమార్గవ్యయములకుగాను 2 లక్షలరూపాయలు పబ్లికు గవర్నమెంటు బొక్కసములో అనామతుగానుంచిరి. నైజామువద్దనుండి మన్నెసుల్తాన్ అనుబిరుదును లక్ష పెగోడాలు (సుమారు 4 లక్షల రూపాయలు) నజరుపోసికొనిరి." ఈ వెంకటాద్రీంద్రుని దాతృతాస్వభావము తనయిస్టేటునుండి 66 గ్రామముల సద్బ్రాహ్మణులకు నగ్రహారంబులుగ నిచ్చుటయె చాటిచెప్పుచున్నది. గుంటూరు. కృష్ణాజిల్లాలయందు నిప్పటికి బహుకుటుంబములు నయ్యగ్రహారంబులకల్లనే జీవించుచున్నవి. ఇతండు కేవల మనుష్యమాత్రుండు కాడనియు తపోవిష్ణుముచే భూమియందవతరించిన నొకానొక ఋషిశ్రేష్ఠుడనియు చెప్పుటకుగాను కొన్నికథలను వంశపరంపరగా యీజిల్లాలజనులు చెప్పుకొనెదరు. వాటిసత్యాసత్యంబులు దురూహ్యంబులు గావున నవి నిందుదహరింపబడలేదు. బుస్సీనామమును పిన్నవయస్కుల భయపెట్టుటకెటుల "బూసి, బూచి" యనివాడబడుచున్నదో అటులనేగొప్పతనమందును దాతృతాస్వభావమందును వాశిరెడ్డి వెంకటాద్రినాయుడిగారిపేరు ఆబాలగోపాలము ఈదేశమందుసామెతగాజెప్పుకొనెదరు.

ఈవాసిరెడ్డి సంస్థానమును ప్రథమతః స్థాపించుటకై వీరిబంధువులగు కమ్మవారు అనేకయుద్ధములయందసమాన శౌర్యపటిమను కనుబఱచి పెక్కుమంది తమ ప్రాణంబులం గోల్పోయిరి. వాశిరెడ్డిప్రభువులకు శత్రువులతో యుద్ధము సంభవమగుచున్నదని వినినమాత్రమున (యెచ్చటయున్న కమ్మప్రముఖు డచ్చటనుండియే యాలుబిడ్డలతో జెప్పక రణరంగంబున దుమికెను. ఇట్టిమహా

పకారంబుజేసిన బంధువులనియెంచికాబోలు పెక్కుమంది కనేకాగ్రహారంబు లొసంగబడెను. కాని వెంకటాద్రీంద్రుడు యుక్తిచే మోసగించి అయ్యాయి యగ్రహారంబుల సనదులు తగులబెట్టించి రూపుమాపెను. చంద్రునకు కళంకమున్నటులీయన సద్గుణసంపత్తి కియ్యదియే పెద్దకళంకము. కొదువ విషయంబుల వెంకటాద్రీంద్రుడు కేవల దేవేంద్రుడనియే జెప్పనొప్పును. భూలోక దేవేంద్రుడని వాడబడుటకయి నందనవనమును ఐరావతనామముగల గజమును అమరావతిపట్టణమును యేర్పాటు గావించినటుల జెప్పుకొనెదరు. వైకుంఠపురమందును అమరావతియందును దేవాలయములలో స్వామికి ఎదురుగనుండు శిలావిగ్రహములు యిమ్మహామహునవని దృష్టాంతములు గలవు. ఈయనకు జగన్నాథబాబు రామనాథబాబులను యిద్దరు దత్తపుత్రులుగలరు. వీరిరువురు అన్యోన్య రాజ్యకాంక్షతో వ్యాజ్యెము లాడదొడంగిరి. ఇట్టులనే యేదియో నొకకారణముచే వాసిరెడ్డి యిస్టేటు 1816-17 మొదలు 1843 - 44 వరకు అప్పటి మండలాధికారియొక్క నిర్వాహకములోనుండెను. 1825 సంవత్సరములో జగన్నాథబాబుగారు మరణించిరి. 1832-33 సంవత్సరముల కరువు యీ సంస్థానమును కడుదీనదశకు తీసుకునివచ్చెను. గవర్నమెంటు బాకి వృద్ధియాయెను. తాత్కాలికముగ ప్రభుత్వమునకువచ్చిన రామనాథబాబుగారి దురాలోచనలవల్ల మరింతబీదగిల్లెను. కేవలస్వోదర పోషణార్థమై పయోముఖ విషకుంభములవలె నక్కవినయములతో కొలువొనర్చుచుండిన దివానులయొక్కయు గుమాస్తాలయొక్కయు గృహములయందు ధనరాసులు మెండయ్యె. సంస్థానపునొకర్లు స్వామిద్రోహులై మోసగించి సంస్థానపు ధనముతో తమపేరను తమభార్యలపేరను పెక్కు యీనాములను పంటభూములను సంపాదించిరి. ఇంటియందు వంటచేసి తద్దినములు పెట్టించెడు పౌరోహితులు సహితము సమయమువేచి వెండిబంగారులను హరించి లక్షాధికారులయిరి. ఇన్నికారణంబులినుమడింప 1844 సంవత్సరము వచ్చునరికి నవరత్నరాసులతో నిండియుండిన సంస్థానపుబొక్కసమున పైసాకూడకఅవమ్యెను. ఆసంవత్సరములోనే యిస్టేటును గవర్నమెంటువారు స్వాధీనపర్చుకొని ఋణవిముక్తిజేయుటకు ప్రయత్నించియు వలనుపడక 1844 సంవత్సరములో అప్పులక్రింద వేలమువేసి గవర్నమెంటువారే స్వాధీనపరచుకొనిరి. ఎప్పటికైనను తిరుగ యిస్టేటుహక్కుదారుల స్వాధీనపరచునటుల యప్పటి యొడంబడిక. కాని జమీందారుల స్థితిగతులరయుటకై నియమింపబడి తమతావుకు విచ్చేసిన వాల్పరు యిల్లెయటు దొరవారికి మనోతృప్తికరముగ నడుచుకొనని హేతువచే అదివరలో యిస్టేటు స్వాధీనపరచుకొన్నది మొదలుకొని యిచ్చుచువచ్చిన రూ. 1000 అల్లవున్సును మాత్రమే అప్పటిజమీందారునకు ఖాయపరచిరి. జగన్నాథబాబుగారి కుమారులు లక్ష్మీపతినాయుడుగారు విద్వత్ప్రభువులని ఖ్యాతివడసిరి. వీరు రత్నపరీక్షయందు మిగుల నిపుణతగలవారని వాడుక. వీరిదత్తపుత్రులే కంచిమైనరుగారని వాడుకగల శ్రీరాజా వాశిరెడ్డి వెంకటలక్ష్మీనృసింహనాయుడు బహద్దరు మన్నెసుల్తాన్‌గారు. వీరిదాతృతా స్వభావమును ధైర్యగాంభీర్యాదిగుణములుసు లోకవిదితంబు గావున వేరుగ వక్కాణింపబనిలేదు. తొలుత దక్షిణహిందూస్థానము కాపురము గాగల వాశివంశము ప్రస్తుతమున కృష్ణాగుంటూరుజిల్లాలయందు వాశిరెడ్డి యనునామముతో నెట్లు వ్యవహరింపబడుచున్నది క్లుప్తముగా వ్రాసితిని. "వాసిరెడ్డీయము"ను నొకగ్రంథము అమరవాది రామకవిగారిచే వ్రాయబడి కొలదికాలములో నచ్చొత్తింపబడునని వినుచున్నాను. అదిసత్యమైనచో నద్ది లోకోపకారిగనుండుననుటకు సందియములేదు. గుంటూరు సమీపమున తుమ్మపూడి గ్రామమున వాశిరెడ్డి వెంకటసుబ్బయ్యగారను నొకరు యేతద్వంశచరిత్రను విపులముగా వ్రాసితిరని వినుటకెంతయు సంతసించుచున్నాను. ఈసంవత్సరము కృష్ణాజిల్లా కేసరపల్లి గ్రామమున జరుగబోవు ద్వితీయ కమ్మమహాజనసభయందు శ్రీరాజా వాశిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి వర్ధంతిని జరుపుకొనుటకొక చిత్తుతీర్మానము జేయబడెనని తెలిసినది. అట్టిమహాపురుషునియందు కమ్మజనుల కుడవలసిన భక్తిగౌరవములకుగాను తగినయేర్పాటు గావింపబడెనని సంతోషపూర్వకంబుగ నుడువుచు నింతటితో విరమించుచున్నాను.

# ఆంధ్రవార్తాపత్రికల వ్యాపింపఁజేయు సాధనములు.

మ॥రా॥శ్రీ, అష్టావధానియగు నందగిరి శేషగిరిరావుపంతులు గారిచే రచియింపఁబడినది.

ఆంధ్రదేశాభిమానులారా ? మనదేశమభివృద్ధి గాంచవలెనన్న దేశమంతట ముందు మన స్వభాషాపత్రికలు వ్యాపింపవలయునని యందఱకుం దెలిసినదేకదా. మనకు శుభకర్మలలో విఘ్నేశ్వరపూజ యెట్టిదో మనము నాగరికత నొందుటకుఁ బత్రికావ్యాపనంబట్టిది. ఒక్కొకజిల్లా కొక్కొకపత్రిక స్థాపించి దానికిఁ బదివేలచందాదార్లను జదువరులనుగాఁ జేసినచో, నపుడు మనదేశములోఁ బత్రికలకు మంచివ్యాప్తికలిగినదని, మనము సంతసింపవచ్చును. కాని మనయాంధ్రదేశములోఁ బ్రస్తుతము లెక్కకుమాత్రము (మాసపత్రికలతోఁగూడ)నుమారిరువదియున్నను, జందాదార్లను, రెండువేలకుఁబైగా సంపాదించిన పత్రికలు నాల్గుకంటె నెక్కువలేవు. ఒకయాంధ్రపత్రికమాత్రము 7000 చందాదార్ల నాకర్షించుకొని దినదినప్రవర్ధమానమగుచున్నది. తక్కినవన్ని, యన్నమో రామచంద్రాయని నానాటికి క్షీణించుచున్నవి. వీటినభివృద్ధిలోనికిఁ దెచ్చుమార్గమును మనము కనుఁగొన్నయెడల, నివి క్షీణించుటకుఁ దగినకారణమేదో యదియును మనకు బోధపడఁగలదు. కాన వార్తాపత్రిక లభివృద్ధియగు పద్ధతుల నాకుఁ దోచినంతవఱకు మనవిచేయుచున్నాను.

1. పత్రికచదువరుల మనస్సుల నాకర్షించుట:— ఇది పత్రికావ్యాప్తికి మొదటిహేతువు. అరువదియారు పిండివంట లాప్పుచంటిలోనున్నటుల దీనిలోనే పత్రికాజీవితమంతయు నిమిడియున్నది. అట్లుమనస్సు నాకర్షించువానిలోఁ బ్రాముఖ్యములైనవాటి నీక్రిందఁ బొందుపరచుచున్నాను. పత్రికలోనివ్యాసములు మృదుమధురమగు నిర్దుష్టశైలితోను నవరసములలో నాయారసముల కనునైన కల్పనాచాతుర్యముతోను, విలసిల్లుచుండవలయు. మఱియు శాస్త్రచర్చ, మతచర్చ, భాషాచర్చ, వ్యవహారచర్చ మొదలగు సచ్చర్చలంజేయుచుఁ దగినసన్నివుటలతో నొప్పుచుండవలయును. పెద్దవై సుందరమైన యక్షరములతోడను, మందమైన నున్ననికాగితములతోడను, దేశభక్తులు, సంస్కర్తలు, మొదలగువారి చిత్రపటములతోడను జూపఱ కమితానంద మొసంగుచుండ వలయు. వేయేల ? “ఈసారిపత్రికయం దేరసము వెల్లువగొల్పఁబడునో, యేచిత్రపటము కన్నులపండువుసల్పునో యేవ్యాసము నాశక్తింబురికొల్పునో, యేమిచిత్రవిచిత్రములు, మనోవైచిత్ర్యముం గల్పించునో, పరదేశాచార వ్యవహారము లేమి వింతలఁదెచ్చిపెట్టునో” యని ప్రతిచందాదారుఁడు నువ్విళ్లూరునట్లుండవలయు.

2. సంపాదకుఁడు కేవలము స్వలాభమునే పరిగణింపక, చందాదారులకుఁ బ్రోత్సాహము కలిగించుట:— పత్రికవలనవచ్చు లాభములోఁ దనకుటుంబపోషణకుఁ దగినంతద్రవ్యము నుపయోగించి మిగిలినధనమును సంవత్సరాదిసంచిక లుచితముగాఁ బంచిపెట్టుట మూలముగను, బత్రికకుఁ జందాతగ్గించుట మూలముగను, వ్యాసములవ్రాయువారికి బహుమతులిచ్చుట మూలముగను, వినియోగముచేయవలెను. ఈభారమెుక్క సంపాదకునియందే యాధారపడియున్నది. ఇట్లుచేసిన పత్రికాధ్యక్షునియందు జనులకు గౌరవముహెచ్చి, కుప్పతిప్పలుగఁ బత్రికకుఁ జందాదారులుగఁ జేరుదురు. ఇందుకాంధ్రపత్రికాధిపతియేగొప్ప సాక్ష్యము.

3. సంపాదకుఁడు దివ్యమైన భాషాపాండిత్యము యాధ్యాత్మిక ప్రకృతిశాస్త్రాదులయందు సంస్కారము, విదేశచరిత్రజ్ఞానము, ముఖ్యముగాఁగలిగియుండవలయు:— ఇప్పటికవులు రచించు గ్రంథములలో “నిదిదుష్టము, ఇది నిర్దుష్టము, ఇది నీతిబోధకము, ఇది నీతిబాధకము, ఈసంస్కరణమేలు, ఈసంస్కరణకీడు” అని మహాజనులకు బోధింపఁగల సామర్థ్యము పత్రికాసంపాదకునియం దున్ననే పత్రికశోభించును. పత్రికాభివృద్ధికిదియు నొకహేతువే.

4. సంపాదకునకుఁ ద్రికరణశుద్ధియుండుట:— ఇదియుఁ బత్రికావ్యాప్తికొక కారణమే. ఏవి జనసమ్మతము

న్యాయసమ్మతమునగునో దానినే సంపాదకుఁడు యోజింపవలయు. యోజించినదానిం బత్రికలోఁ బ్రచురింపవలయు. ఆప్రచురించినదానిని ముందుతానే యాచరింపవలయు. సంపాదకుని నడవడి మంచిదిగానిచో, జనులచే దూషింపఁబడుటయేగాక, యతని దుర్జనత్వముపత్రికయందుఁగూడ నారోపింపఁబడి క్షీణింపఁజేయును.

5. సంపాదకుఁడు స్వదేశస్థుఁడై యుండుట:—ఇది ప్రాముఖ్యమైనది. విదేశీయుఁడైనచో, సంఘసంస్కరణాదులవిషయమై, యతఁడు వ్రాయువ్రాఁతలయందు, జనులకు విశ్వాసము కుదురనేరదు.

6. పత్రిక నియమితకాలముందప్పక, చందాదారుల హస్తంబుల నలంకరించుట:—చంద్రకిరణములకై నిరీక్షించు చకోరములవలె నియమితదినంబునం బత్రికలకెదురుచూచుచున్న చదువరుల మనఃపద్మములు ముకుళించునట్లు కొన్నిపత్రికలు నాలుగుదినములు లెంచుమించుగా వచ్చుచున్నవి. ఇది పత్రికాగౌరవంబునకుఁ గొంతభంగకరము. పత్రికావ్యాప్తిఁ గోరువారు సకాలంబునఁ బత్రికలంపవలయు.

7. ఉపవిలేఖరులకుఁ బ్రోత్సాహముంగల్గించుట:- కొందఱు పత్రికాసంపాదకులు తమకుఁదోఁచిన తుక్కుసంగతులను వ్రాయుదురేకాని, యుపవిలేఖరులంపు లోకోపయోగమైన వ్యాసముల నైతము సకాలములోఁ బ్రచురించుటలేదు. వీలగునంతవఱకు యుపవిలేఖకుల నేర్పాటుచేసికొని, ద్రవ్యమూలకముగా వారిని రంజింపఁజేయనిచోఁ బత్రికలు మంచివ్యాసముల వ్రాయఁజాలవు. నాగరికతహెచ్చినపు డుపవిలేఖకు లూరకయే వ్యాసముల వ్రాసి పంపుచుండుట తటస్థించును.

8. పత్రికలయందలి వ్యాసములు వ్యాకరణయుక్తములుగాఁగూడ నుండుట:—కొన్నిపత్రికలలోని వ్యాసములు, వ్యాకరణమన నేమోయెఱుంగనివారివలన, వ్రాయఁబడుచుండుటచేఁ బత్రికలకు మర్యాద తగ్గుచున్నది. పుటకొక పొరఁబాటుండుట తగుఁగాని, పదితొటుకులున్నచో సంపాదకుఁడు లఘుత్వమునకుం బాల్పడుఁగదా.

9. ప్రతిసంచికయందు నేదోయొక దివ్యమైనవ్యాసముండుట:—మనపత్రికలలో నొక్కొక్కప్పుడు మనోహరములైన వ్యాసములుండును. ఒకప్పుడన్నియుఁ జేలపిండి వ్యాసములేయుండును. అట్లుగాకుండ పత్రికాధిపతులుజాగ్రత్తపుచ్చుకొని చదువరుల మనంబుల రంజింపఁజేయవలయు. లేనిచో నొకప్పుడు చందాదారులధికముగా జేరుటయు నొకప్పుడు చేరకుండుటయుఁ దటస్థమగును.

10. అనైకమత్యహేతువులగు వ్యాసములం బ్రచురింపకుండుట:—ఇది ముఖ్యవిచారణీయము. ఒకపత్తనమందు, యల్లప్పయను శూద్రుడును, బుల్లప్పయను బ్రాహ్మణుండు నేదోయొక విషయములో నేనెక్కువంటే నేనెక్కువయని, వివాదపడుచుండగాఁ గొందఱు యల్లప్పపక్షమును గొందఱు బుల్లప్పపక్షమునుఁజేరి వాడు వెధవయనివీరును, వీడుకుంకయని వారును బత్రికలకుఁ దఱుచుగా వ్రాయుచుండుటయు, నట్టివ్రాఁతలంజూచిన గ్రామములలో నైతము వారిపక్షమునఁ గొందఱు, వీరిపక్షమునఁ గొందఱుచేరి, కుడిచికూర్చుండి తగవులాడుటయుఁ జూచుచున్నాము. జాత్యభిమానముచేఁగాని, స్వశాఖాభిమానముచేఁగాని, వ్రాసినట్లు గాన్పించు వ్యాసములకుఁ బత్రికాధిపతు లెడమియ్యకుండుట సంఘమునకు శ్రేయస్కరము. వారిగౌరవమున కభివృద్ధికరము.

11. పక్షపాతముంజూపకుండుట:—ఇది పత్రికకు శిరోభూషణము. ఒకరిలావునుజూచి, మొదటిలెక్క వారిదేమైనను మిన్నకుండుటయు నల్పులగువారి దోషపరమాణువులఁ బర్వతంబులుగాఁజేసి నిందించుటయుఁ బక్షపాతదోషంబున కాకరంబగు. దీనిని దరిఁజేరనీయకుండఁ బత్రికాధిపతులొక కంటితోఁజూడవలయు.

12. ఏవిషయమైనను నున్నదియున్నట్లుచూపుట:—ఇది ముఖ్యముగా నుపవిలేఖరుల కన్వయించునేని, లంచగొండి యధికారుల భయపెట్టి వారినిం బ్రజానుకూలముగాఁ బ్రవర్తింపునట్లు చేయునుగాన, నీవిషయముచేఁ బత్రికమీఁద జనసంఘమున కభిమానము హెచ్చి, దాసులుగా నుండురు.

13. అవశ్యకర్తవ్యమం దాలస్యముమానుట:—అదిగోయన్నపని కారుసెలలుగడపుట యెట్టిపనికైనను మంచిదికాదుగదా. కవులెవ్వియో గ్రంథములఁజేసి, గు

ణాగుణములం దెల్పుటకై, బత్రికలం బంపినపుడు పత్రికా సంపాదకులు విమర్శింపక, నెలలతరబడి నూరకుండి చివరకు “కాగితములు నున్నగనున్నవి, అక్షరములు మిన్నగనున్నవి, శైలి వెన్నగనున్నది, నీతి మన్నుగనున్నది, పద్యములసొంపుసున్నగనున్నది” అని నాల్గుతడిపొడిమాటలువ్రాసి, తమయసామర్థ్యమును వెల్లడిచేసికొనుచుఁ జదువరులకు నవ్వుఁ బుట్టించుచున్నారు. అట్లుకాకుండ వీలైనంతత్వరలో గ్రంథముయొక్క ప్రయోజనమును గొంచెము విపులముగా వ్రాసి జనులకు వెల్లడియగునట్లు చేయుచుండవలయు. ఇదియును బత్రికకొక ముఖ్యాలంకారమై పదుగురి నాకర్షించును.

14. చచ్చుపుచ్చు వృత్తాంతములు వ్రాయక, యుపయుక్తమైన వ్యాసములనే వ్రాయుచుండుట:—ఇది కష్టసాధ్యమైనపని. హంగులేనివారికి సాధ్యపడదు. కృషి, వాణిజ్యము, చేతిపనులు, విద్య, కవిత, వైద్యము, రాజకీయవ్యవహారము, శౌచము, దయ, శాంతము, మొదలగువానియొక్క లాభములను గూర్చియు, మతద్వేషము జారత్వము, అనైకమత్యము, క్రోధము, అసూయ, డంబము గర్వము, అతిబాల్యవివాహముచేయుట, స్త్రీపునర్వివాహములు సల్పకుండుట మొదలగువానివలన వచ్చు నష్టకష్టములంగూర్చియు, నొక్కొకసంవత్సరములో వ్రాసినది వ్రాయకుండ వ్రాయుచుండవలయు. అట్లు సంఘమునకు మేలుసేయువ్రాఁతల విడిచి “అమెరికాలో నొకకోటీశ్వరునకున్న మేడ యాకాశమున కంటుచున్నది; మాగ్రామమునందొక సభజరుపబడెను. ఆనాడు నూర్వురు సభనలంకరించిరి. చప్పట్లతో మీటింగు చక్కఁగాజరిగెను. పిమ్మట ఫలహారముల మెక్కిరి.” అనెడుసంగతులతోడనే పత్రికలోని యర్ధభాగముం బూరింపఁదగదు. అట్టివి మన యాంధ్రభాషాపత్రికలలో నొకటి రెండుగలవు. ఇట్టివానికి విశేషవ్యాప్తి కలుగనేరదుగదా.

15. విద్యావ్యాప్తి:—పత్రికావ్యాపకత్వమున కిది ప్రాణంబని చెప్పఁదగు. “పెండ్లియైనఁగాని పిచ్చికుదురదు. పిచ్చికుదిరినంగాని పెండ్లికాదు” అనులోకోక్తి, విద్యావ్యాప్తికిని బత్రికావ్యాప్తికిని సంబంధించును. మనయాంధ్రులలోని స్త్రీపురుషసంఖ్యలో నర్ధభాగమైనను బ్రైమరీ జ్ఞానము సంపాదించినచో, మనపత్రికలు పెంపొందఁగలవు. ఈవిషయమునిర్బంధోచితవిద్యాశాసనమును మన గవర్నమెంటువా రంగీకరించిననే ఫలించును. అపుడుగాని మన దేశమందుఁ బత్రికావ్యాప్తి సంపూర్ణము కానేరదు.

16. పత్రికా వార్షికోత్సవము:—సంపాదకుఁడు తన పత్రికావిషయమైన లాభనష్టములు మంచి చెడ్డలు బోధించి ప్రోత్సాహముచేయుటకు, నాంధ్రమహాజనులను రావించి యుక్తమైనచోట నొకటిరెండురోజు లేటేటసభ చేసి, పత్రికోత్సవంబు సల్పవలయు. అట్లుచేసినచో జనులకడు సంతసిల్లి పత్రికలఁ దెప్పించుకొనుటకుఁ దారట్లాడుదురు. ఇదిపత్రికలు వ్యాపించుటకు మంచి యుపాయమగును.

పైనఁజెప్పిన పదునాఱువిషయములలో, నేలోపము లేకుండఁ బత్రిక నడుపఁబడెనేని నప్పత్రిక, షోడశకళాపరిపూర్ణమగు చంద్రబింబమువలె మహాజనుల మనంబులంగప్పియున్న మౌఢ్యతాంధకారమును బటాపంచలుగావించి వివేకము, నీతి, ఐకమత్యము, ధైర్యము మొదలగు దేశోద్ధారకగుణసస్యములం బెంచి, దిగంత విశ్రాంతకీర్తితో వెల్గొందును. ఇట్టివ్యాసముల వ్రాయుటకై యస్మదాదులకుం బ్రోత్సాహము కల్పించిన శ్రీమదాంధ్రపత్రికాధిపతిగారికీ క్రిందిపంచరత్నములర్పించి యింతటితో విరమించుచున్నాఁడను.

ఉ. శ్రీపదమైన ధైర్యనిధి * శిష్టజనాదరణంబొసంగి, ది
గ్వ్యాపకమైన కీర్తియును * వాగితతేజమునిచ్చి, నిత్యస
ద్రూపము శాశ్వతాయువును * దూరపుదూపునొసంగి. ప్రేముడిన్
శ్రీపతి యాంధ్రపత్రికకు * శ్రేయముఁ బెంపుఁగుత నెల్లకాలమున్.

సీ॥ అవివేకతిమిరంబు * నంతరింపఁగఁజేయు,
భాస్వత్ప్రచారమై * పరగునెద్ది
జనచిత్తకుముదముల్ * చయ్యనవికసింపఁ,
బొల్చుకళానిధిఁ * బోలునెద్ది
నీతిబోధనమణి * వ్రాతంబులనొసంగ,
నలఘురత్నాకరం * బైనదెద్ది
వాణిజ్య కృష్యాది * వార్తాలసత్సుమం,
బుల విరజల్లఁగ * వల్లితయెద్ది

యదియెగా యాంధ్రపత్రిక * యంద్రుబుధులు,
పుడమి నాచంద్రతారక * మ్మగ నిసంగి,
యాంధ్రదేశమందంతట * నలరునట్లు,
సోమశేఖరుఁడద్దాని * నోముఁగాత.

సీ. వివిధవినోదముల్ * వేడ్కతోఁ నెఱుఁగనిక
బరియించి బాలురు * వడయుఫలము
వృష్టిలోనున్న వై * చిత్ర్యంబుగననిన్నుఁ
బరియించి వృద్ధులు * వడయుఫలము
పరదేశ వనితల * పద్ధతులెఱుఁగనిక
వనితలు పఠియించి * పడయుఫలము
దేశచారిత్రల * స్థితిఁగన నిన్నువీ
క్షించి వంస్కర్తలు * నెందుఫలము
నూరకేపోదు నీతండ్రి * పేరు నీదు
సౌరుతీరులు నూరూర * సాటకుండ
యాంధ్రపత్రికారాజమా? * యరయనాంధ్ర
గౌరవంబుంటముంచునీ * కతనఁగాదె.

సీ. శ్రుతులతో లోకవి * శ్రుతులతో బహుశబ్ద
గతులతో జ్ఞానముం * గఱపికఱపి
శ్రీలతో శుభకర * శ్రీలతో జయకర
శ్రీలతో లోకంబు * తేలియేలి
రుచులతోఁ దనరత్న * రుచులతోఁ
బటుచిత్ర రుచులతో జగముల * ప్రోచిప్రోచి
కల్మితో నీతుల * కల్మితో బోధల
బల్మితో భువనముల్ * ప్రాఁకిప్రాఁకి
భారతీకాంత వసువునఁ * బరగునాంధ్ర
పత్రికాకల్పవల్లిఁ జేఁ * బట్టుఁడయ్య
వసిగ నభిమతార్థంబులఁ * బడయుఁడయ్య
యాంధ్రజనులార ఘనులార * యార్యులార.

క. ఎన్నికబుర్లం జెప్పినఁ
గ్రన్నన నీయాంధ్రపత్రి * కను జదువనిచో
నున్నయొజ్ఞానము * గావునఁ
మన్ననఁ గొనుఁడయ్య తెల్గు * మానవులారా.



# తెలుగుదేశములో వ్యవసాయమభివృద్ధికి తగినమార్గములు.

మ.రా శ్రీ, కొచ్చర్లకోట వెంకటలక్ష్మీనరసింహారావు గారిచే వ్రాయఁబడినది.

తెలుగుదేశములో వ్యవసాయ మభివృద్ధిగావలెనని రయితులు పూర్వపుపద్ధతులు సమూలముగ విడనాడి నూతనమార్గము లవలంభించవలయును. రయితుక్షేమమే దేశక్షేమమని నమ్మి భాగ్యవంతులు, జమీందారులు మహారాజులు మొదలగువారు రయితులకు మంచిమార్గముల యందభిరుచిగలుగున ట్లుపదేశములుచేసి, వలయునప్పుడు ఇతరులకిచ్చు ఋణములకువడ్డీస్వీకరించుదానికంటె తక్కువవడ్డీకి అప్పులీయవలసియున్నది. రయితునకు భూమినియెట్లు సస్యముల కనుకూలముగ బాగుచేయవలయునో ఇప్పటికిని తెలియదు. పూర్వము అనేకసంవత్సరములనుంచి పాడుకచేయు నాగలినే ఇప్పటికిని ఉపయోగించుటచూడ బహువిచారమును కలుగజేయుచున్నది. సుమారు 500 సంవత్సరములనుంచి వేటిలోనయినను మార్పులుచెందినవిగాని నాగలిలో నేవిధమైన మార్పుకలుగలేదు. నాగలి మార్పుచెందకున్న భూమిని కావలసినట్లు ల శుభ్రపరచుటకు మంచిమార్గములు కానరాకున్నయవి. తక్కువ పరిమితముగల భూమిలోరయితుకుకావలసిన విధముగ గునపము, పార మొదలగు చేతిసాధనములతో బాగుచేయుటకు పూనుకొనునేగాని యెక్కువపరిమితముగల భూమిలో చేతిపనిముట్లతో పనిచేయుటకు సాహసించడు. ఎక్కువపరిమితముగల భూమిలో చేతిపనిముట్లవలన పనినెరవేరదు. భూమిని యెప్పుడు లోతుగదున్నుటయే మంచిపద్ధతి. లోతుదుక్కివలన యనేకలాభములను రయితుపొందగలడు. భూగర్భములో తొమ్మిదంగుళ

ముల లోతునపురుగులు నివసించుటయేగాక అక్కడ గ్రుడ్లుపెట్టును. గ్రుడ్లుపెట్టినపురుగులు చచ్చిపోవును. కొన్ని మాత్రము జీవముగలిగియుండును. పంటకాలము సమీపించునమయమునగాని, అంతకుపూర్వముగాని గ్రుడ్లన్నియు చితికి పురుగులగును. ఈపురుగులుచేయుహాని ఇంతంతయని వర్ణించుటకలవిగాదు. ఇదిగాక సస్యములకు హానికలుగజేయు చెడుమొక్కలయొక్క వేళ్లు భూగర్భములో సుమారు 10అంగుళములవఱకు వ్యాపించును. తడి తగిలినతోడనే చెడుమొక్కలు చిగర్చి సస్యముల కాహారముగ నుపయోగించిన విలువగలిగిన ఎరువులను చెడు మొక్కలు తమపోషణ కుపయోగించుకొని, సస్యములకు తగిన ఆహారము లేకుండజేయును. అందుచే సస్యముపాడగుటకు హేతువు. కాబట్టి భూమిని చక్కగ దున్నుట అనగా 9 లేక 12 అంగుళముల లోతువఱకు దున్నుట మిక్కిలి ఆవసరమైనపని. ఇంతలోతుగ దున్నుటకు కఱ్ఱనాగలిగాక ఇనుపనాగలినే యుపయోగించవలసి యున్నది. ఇనుపనాగలిని ఎద్దులులాగలేవని, మెక్కువ ఖరీదుయుండునని తెలియని రయితులనుకొనుచున్నారు. అందుచే రయితులు ఇనుపనాగళ్ళను కొనుటకు జంకుచున్నారు. అనేక ఆంగ్లేయ వర్తకశాలలలో తక్కువ కిమ్మతుగలిగినట్టియు, పల్లెటూరి కమ్మరవానిచే అవసరమైనప్పుడు మరమ్మతు చేయించుకొనుట కనుకూలించునట్టియు ఇనుపనాగళ్లు దొరుకుచున్నవి. ఇనుపనాగళ్ళకుండు నాగలికఱ్ఱు భూమిలో లోభాగమునకు ప్రవేశించుట కనుకూలముగా నుండును. తెలుగుదేశపు రయితులుపయోగించు కఱ్ఱనాగలియొక్క కఱ్ఱు భూమిలో 3 అంగుళములకంటె మెక్కువ లోతునకు పోజాలకున్నది. ఇదిగాక కఱ్ఱనాగలియొక్క మట్టిపలక ఒల్లబరువుగా యుండుటచే భూమిని దున్నునప్పుడు మట్టి దానిపైభాగమునం బడి అంటుకొనుచున్నది. ఆవిధముగమట్టి పలకకు అంటుకొనిన మట్టివలన కఱ్ఱులోపలిభాగమునకు ప్రవేశించజాలకున్నయది. కఱ్ఱనాగలితో దున్నునప్పుడు నాగలియొక్క చేతిపిడిని తఱచునదుముచుండవలయును. దున్నునప్పుడు నాగలి నదుముచుండుట మిక్కిలి ప్రయాస. కఱ్ఱనాగలితో దున్నుటవలన భూమి చక్కగ కదపబడదు. ఇనుపనాగలికుండు మట్టిపలక గుండ్రముగ నుండుటనుబట్టి దున్నునప్పుడు మట్టిపలక పైబడుమన్ను నిలిచి అంటుకొనక ప్రక్కబడుచుండును. భూభాగముయొక్క లోపలిభాగముచు వెలుపలకును, వెలుపలభాగములోభాగమునకును పోవులాగున ఇనుపనాగలిచేయగలదు. ఇనుపనాగలికఱ్ఱు చక్కనిమొనగలిగి భూమియొక్క లోభాగమునకు చులకనగ ప్రవేశించును. భూగర్భములోయుండు చెడుమొక్కలవేళ్ళను నూడబెరికి వెలుపలభాగమునకు దెచ్చుటవలన చెడుమొక్కలు ఎండకుయెండి చచ్చిపోవును. వీటిని తిరుగ భూమిలో పూడ్చుటవలన మట్టిలోగలసిపోవుచున్నవి. చెడుమొక్కలు భూమిలో గలియుటవలన భూమినుండి అవిగ్రహించిన ఆహారము తిరుగ భూమిలోజేరుచున్నది. భూమియొక్క లోభాగము వెలుపలకు వచ్చుటవలన గాలిపోసుకొని భూమిబాగుపడును. లోభాగమునసుండు పురుగులగ్రుడ్లు పురుగులు పైభాగమునకువచ్చి ఎండవేడిమికి తాళజాలక నశించును. కొన్నిపురుగులను పక్షులు భక్షించుచున్నవి. కాబట్టి రయితునకు భూమిని చక్కగదున్నుట యొక పనిగావున తగినమంచి ఇనుపనాగలిని గొనవలసియున్నది.

విత్తనములు:—సాధారణముగ విత్తనములనిమిత్తము జాగ్రత్తజేయు గింజలనుమంచిస్థితిలోనుంచుట, తగినజాగ్రత్త బుచ్చుకొనుట రయితునకు విధాయకమైనపని. ఒక్కచెడ్డవిత్తనమువలనతనపొలములో వేయజడిన చేనంతయు నాశనమవును రయితుతసపొలములో పండుమంచివిత్తనమునే ముందుసంవత్సరమునకు జాగ్రత్తబెట్టుచుండును. రానురానువిత్తనములు బలహీనత జెందును. మంచివిత్తనములను ఇతరస్థలములనుండి తెప్పించి వేయుటవలనసస్యమనుకూలముగనుండిమంచిఫలితమునిచ్చును. విత్తనములలోజచ్చు, పగుల్లు, పురుగులు మొదలగునవిలేకుండ జూచుట రయితునకు మిక్కిలివిధాయకమైనపని. మంచివిత్తనము లుపయోగించుటవలన పంటలభివృద్ధిపొందును.

మొక్కలను మార్చివేయుట:—రయితుయెప్పుడు తనభూమిలో ఒకసస్యమునేవేసి పంటజేయుటవలన భూ

మిబలహీనతచెందును. ఒకసస్యము భూమినుండి గ్రహించిన ఆహారమును తిరుగభూమి కూడదీసుకొనలేక క్రమేపిభూమి బలహీనతజెందును. గనుక ఒకసారిభూమిలోలోతుగ వేరుపాఱుమొక్కలను వేసినయెడల మలిసంవత్సరముగాని రెండవపంటకుగాని భూమిపైభాగములోవేఱుపాఱు మొక్కలను వేయవలయును. ఈరీతిగ జేయుటవలన కొంతకాలము అడుగుభూమికిని, కొంతకాలముపై భూమికిని స్వస్థతగలిగి అదివఱకు మొక్కలుగ్రహించిన ఆహారమును గూడదీసుకొనును. కాబట్టి మొక్కలను మార్చి వేయుటవలన పంటలధికము కాగలవు.

బీడుపరచుట:—బీడుపరచుటలో రెండుపద్ధతులున్నవి. చేనుకోసినతరువాత భూమిలో తడియుండగానే వెంపలి, పెసర, వులవ, జీలుగు మొదలగునవి భూమిలో జల్లి, మొక్కలయినతరువాత కొంతకాలమునకు పూవు బూయుట కారంభించును. అప్పుడు యీమొక్కలను భూమిలోనకు దున్ని వేయవలయును. ఇదియొకపద్ధతి. ఇక రెండవది భూమిలో యేమొక్కలనువేయక, భూమినిదున్నక వదలివేయుట మొదటిది పసిరకబీడు, రెండవది వట్టిబీడు. ఈరెండుపద్ధతుల వలన భూమిబాగుపడి పంటలు యెక్కువగును.

ఎరువులు:—మొక్కలు భూమినుండి గ్రహించిన ఆహారమును తిరుగ భూమికికలుగజేయుటకు ఎరువులే ముఖ్యమైనవి. ఎరువులుగా నుపయోగించు వస్తువులను నితరదేశములకు పంపకుండుటవలన విశేష రయితులుండు మనదేశము బాగుపడగలదు. చమురుగింజలయొక్క చమురునుదీసి చమురునే విదేశములకెగుమతి జేసిమిగిలినదియెరువులక్రిందనుపయోగించవలయును. ఎముకలను విదేశములకంపబడకుండుటవలన హిందూదేశములోనుండు భూములు బాగుపడుననుట కెంతమాత్రమును సందియములేదు. కావున యెరువనుకొనునట్టి ఏవస్తువయినను, ఏరీతిగానైనను విదేశములకు ఎగుమతి చేయకుండుటవలనను వాటినిమనభూముల కుపయోగించుటవలనను మనహిందూదేశ నిస్సారభూములన్నియు సారవంతములయి ఫలధరిశములగుటకు సందియములేదు.

పశువులపేడ, మూత్రము:—పశువులపేడను పిడకలనుజేయక యెరువుగ నుపయోగించుట రయితునకుమిక్కిలి విధాయకమైనపని. పశువులకొట్టములు ఏటవాలుగనుంచి చివరభాగమున గాలువత్రవ్వి యాకాలువచివరనొకగోయిత్రవ్వి ఆగోతిలో కాలువగుండ ప్రవహించు పశువులమూత్రము పడులాగుననొకకుండను పెట్టవలయును. అనుదినము కుండలో బడుమూత్రము, పేడ, చెత్త, వేరొకగోతిలో నిలవజేయవలయును. 15దినములకొకసారిగోతిలోనిలవజేసిన పేడమొదలగువాటిని తిరుగ వేయుచుండుట యొకవిధాయకమైనపని. తిరుగవేయనియెడల వేడిజనించి మొక్కలయాహారము పైకెగసిపోవును. ఈవిధముగ నిలవజేయబడినయెరువు పొలములోపరచి దున్నుటవలన మంచిఫలితము దీయవచ్చును. పిడకలుజేసి అమ్ముటవలన సస్యములకు పనికివచ్చు మంచివిలువగలిగిన యెరువు పాడయిపోవుచున్నది. పేడకుప్పలు వెలుపలనిలువజేయుటవలన ఎండకుఎండి వానకుదడిసి సస్యములకు పనికివచ్చు మూత్రలవణము పైకెగసిపోయి వట్టినిరర్థకపుయెరువగుచున్నది. ఇట్టినిరర్థకపు యెరువువలన భూములు చక్కగ ఫలించవు. కాబట్టి పశువులపేడను జాగ్రత్తచేయు విధములు నేర్చుకొని నిలవజేయుటవలన, పొలములలో ఉపయోగించుటవలన భూములు మంచిఫలితము నిచ్చుననుటకు సందియములేదు.

పశువృద్ధి:—పశువృద్ధి నిమిత్తము తగినశ్రద్ధతీసుకొనవలసియున్నది. పశువులను చక్కగజూచినయెడల మనయెడల నవియెక్కువ ప్రేమగనబరచును. పశువులకు తగినమేతపైరులను రయితుచేయుట బహు ముఖ్యము. హిందూదేశ వ్యవసాయమునకు పశువే ముఖ్యమయినది గనుక రయితు పశువృద్ధినిమిత్తము మిక్కిలి పాటుపడవలసియున్నది. ఎద్దుదూడలను ఆవులపై దాటనీయకుండగ దగినశ్రద్ధ తీసుకొనవలయును. ఎద్దుదూడలకు సంవత్సరములోపలగాని, రెండుసంవత్సరముల లోపలగాని విచ్చలను దీయించి వేయుటమంచిది. పశువృద్ధినిమిత్తము ప్రతిగ్రామములోను మంచిజాతియెద్దులను జాగ్రత్తబెట్టుట రయితునకు విధాయకమైనపని. ఈరీతిగా జేయుటవలన

బలముగల యెద్దుదూడలుపుట్టును. ఈదూడలు మంచిజాతియెద్దులయి లోతుదుక్కిచేయుట కనుకూలించును. వ్యవసాయాభివృద్ధికి మంచిజాతియెద్దులే మూలాధారము.

అన్యోన్య ఋణసహాయసంఘములు:—రయితు ఏమిచేయుదు మన్నను ధనములేమిచే కుందుచున్నాడు. పల్లెటూరి షాహుకారులు పెట్టుబాధలపరిమితము. రయితులకుపెట్టుబళ్లుపెట్టి షాహుకారులు కుబేరులగుచున్నారు. ఇట్టిషాహుకారులు పెట్టుబాధలనుండి రయితులనుతొలగించవలెనని అన్యోన్యఋణసహాయ సంఘములను ప్రతిగ్రామములోను నెలకొల్పి రయితుచేతిలోనికి తక్కువవడ్డీకి ధనమువచ్చుమార్గము లాలోచించుటవలన మనహిందూదేశవ్యవసాయ మచిరకాలములోనే అభివృద్ధిపొందగలదు. ధనములేమిచే మంచిబళువులను, తగిననాగళ్ళను, యెరువులను కొనజాలకున్నారు. జమీందారులు మొదలగు భాగ్యవంతులు అన్యోన్య ఋణసహాయ సంఘములను నెలకొల్పి వాటినివృద్ధిచేయుటకు పూనినయెడల హిందూదేశవ్యవసాయ మభివృద్ధిపొందగలదు.



# సత్పథము.

మ. రా. శ్రీ, వి. సీతాపతయ్య బి. ఏ, గారిచే వ్రాయబడినది.

శ్రీసచ్చిదానందస్వరూపుఁడగు నీశ్వరుని సృష్టియందలి భూతములలోఁ బ్రాణులుత్తమములు. ప్రాణులందు బుద్ధిజీవులుమేలు. బుద్ధిజీవులయందు నరులుశ్రేష్ఠులు. మనుజులందు విద్వాంసులు ముఖ్యులు. వారిలో బ్రహ్మవిదు డెక్కుడని మనువుసెప్పె. జీవుఁడు ప్రవృత్తిమార్గమున ననేకజన్మములెత్తి బహుకష్టములంది నానాటఁజ్ఞానముదయింప సంసారము నిస్సారమనియు నిహలోకసుఖంబులెల్ల నీటిబుగ్గలనియు భావింపఁజొచ్చు. ఆతెలివి పుట్టినతోడనె వాఁడు బ్రహ్మముంగాంచఁగోరి సత్పథంబున నడవమొదలిడవలయు. ఈమార్గమునఁ జరించువారలెసుమ్ము లోకోపకారార్థమై దమదేహంబుల ధనంబులధారవోయువారు. ఎద్దియేనొక్క తెరువునఁ దమపొట్టవోసికొని వేఱొండుదలంపక నూతికప్పవిధంబున బ్రతుకువారెందఱున్నను దేశమునకు వన్నెయు వాసియు నెట్టులబ్బు. మనదేశపువారు మోక్షమార్గమన ముసిఁగిడి మూల గూర్చుండుట గాఁదలంతురు. అదిసరికాదు. లోకమునకు మేలుసేయుటకంటె మోక్షమన వేఱొకటిగలదే? జగమునకుఁగర్తయు భర్తయు నగు నీశ్వరుండు లోకహితార్థమై చరించుచున్నవాఁడుగదా. అట్టగుటంజేసి మనుజుఁడొక్కొక్కఁడును దానట్టివాఁడుగావుటకు యత్నింపవలయు. దీనికిసాధనములు నాల్గుగలవు. వానిపేరు లెఱింగినంతనే యొక్కఫలంబును గలుగనేరదు. అనుష్ఠానంబునఁగాని యవిసిద్ధింపవు. అట్టుగాని నాడాతెలివి నీటవ్రాసినవ్రాత సుమ్ము. ఒక్కపెట్టనన్నింటిఁ దుదముట్ట సాధింపరాకున్నను గొంతగొంతగనైన సాధింపఁబూనుటమేలు.

ఈసాధనములలో మొదటిది వివేకము. ఒక్కొక్క విషయమునందును వివేకముతో వర్తింపవలయు. సమస్తధనమ్ములు ప్రాభవంబును నీదేహపాతముతోడనె నశించుఁ గాన నివి యెల్ల నశాశ్వతములు. ప్రళయకాలమందును గందనికుందని వానింగోరుటయే వివేకము. ఇట్టితెలివియే గదా జ్ఞానికి నజ్ఞానికింగల తారతమ్యము. నరునకీవివేకము గలిగెనా వాఁడెవ్వఁడైననేమి? ఏదేశస్థుఁడైననేమి? ఏమత

H. H. Maharajadhiraj Maharaja Prithwi Veer. Vikramshah. Maharaja of Nepal.



కీర్తి శేషులైన నేపాళమహా - జా. పృథ్వీ వీర విక్రమషా.

H. E. Maharaja Sir Chandra Samsher Jung Bahadur Prime Minister of Nepal.



నేపాళదేశ మంత్రి. చంద్ర శంషేరు జంగు బహాదూరు.

H. H. Nizamul Mulk Mir Osman Ali Khan Bahadur.
Nizam of Hyderabad.



శ్రీ నిజాముల్ ముల్క్ మీర్ ఉస్మాన్ అలీ
ఖాన్ బహదూర్ నిజాము.

H. H. Maharaja Sir Krishnaraj Yachendra Wodayar.
Maharaja of Mysore.



మైసూరు మహారాజా. మహారాజా సర్ కృష్ణరాజ
యాచేంద్ర వొడయార్.

H. H. Maharaja Sir Sayaji Rao Gaikwar Bahadur.
Maharaja of Baroda.



బరోడా మహారాజా.
మహారాజా సర్ సయాజిరావు గాయకవాడు బహదూర్.

H. H. Mahraja Sir Pratap Sing
Maharaja of Jammu & Kashmir.



కాశ్మీర మహారాజా, సర్ ప్రతాప సింహ బహదూర్.

H. H. Maharajadhiraj Rajeswar Maharaja Sir Fateh Sing
Bahadur, Maharana of Udaipur.



ఉదయపురము మహారాజా, మహారాణా సర్ ఫతెసింగు
బహదూరు.

ష్ఠుఁడైననేమి? వాఁడు పరమేశ్వరేచ్ఛానువర్తియై లోకంబునకు మేలుఁగూర్పదొరకొను. వాఁడె గర్తవ్యంబు నెఱింగినవాఁడు. తక్కటివారు మిక్కుటంబగు నజ్ఞానాంధకారమున మునింగి భేదబుద్ధితో స్వార్థపరులై వర్తింతురు. మఱియు ధర్మమిది యనియు నధర్మమిట్టిదనియు నిజానిజంబు లివ్వియనియు నెఱుంగనగు. పరోపకార ధర్మస్వరూపము చక్కఁగఁ దెలిసికొనవలయును. దేహంబులకంటెఁ దావేఱని యెఱింగి వానికిఁ లోఁబడక వర్తింపవలయు. వానిమెచ్చవచ్చినటుల వానింబోనివ్వరాదు. ధర్మంబు నడపఁగోరినపుడు దేహములు వశవర్తినులుగాక విమార్గములఁ ద్రొక్కించు. మనకు దేహములు మూడుగలవుగదా. వానిలో స్థూలదేహము కాసంతవనిసోకిన నువ్వాని చలికిలంబడు. చెప్పినమాటవిననొల్లదు. తిండికిరాళ్ళబండి. పనికి మాయదృష్టముసుమా. అది తనకింపగునటుల సోమరితనంబునఁ బొద్దుపుచ్చఁజూచు. ఈదేహమును నరుఁడు స్నానపానాదులచేఁ బరిశుద్ధముగనుంచుకొని మట్టుమీఱకుండఁజూచుకొనవలయు. ఆపశ్శరీరము కామక్రోధముల కుఁ బుట్టినిల్లు. అదిచూచినవానినెల్లఁగోరుచు నవి దొరకకున్న లోలోన నుడుకుచు చెప్పరానిసంకటములు దెచ్చిపెట్టు. పలుతెఱంగులగు పేరాసలు దొమ్మిచేయఁ గర్తవ్యంబు నెఱుంగుట దుర్లభము. తేజశ్శరీర మహంకారమున కునికిపట్టు. సమాధియందును దానిభేదబుద్ధి యది మానదు. అదియెల్లపుడు స్వార్థమునే యభిలషించు. పుణ్యాపాపములయందు న్యూనాధిక్యంబులులేవు. ఒక్క కార్యమునకంటె వేఱొకకార్యము పుణ్యమున నధికమను తలంపు ప్రమాదముసుమ్ము. పున్నెముఁగోరినవాఁడు లోకమ్ములు కలగుండుపడినను వెనుదీయక ధర్మమాచరింపవలయు. తప్పులలోఁ బెద్దవనియుఁ జిన్నవనియులేవు. స్వల్పకార్యములందును ధర్మము తప్పకనడపవలయు. లోకోపకారములగు కార్యములను జాగరూకతతో విమర్శించి మఱిచేయవలయు. జ్ఞానము సంపాదించునెడఁ దృప్తిజెందరాదు. ఎన్నిపాట్లైనఁబడి జ్ఞానమును సంపాదింపవలయు. ధర్మమర్మము నెఱింగి త్రికరణశుద్ధిగ యథార్థముగ్గ నేనడపవలయు. "యాపశ్యతి నసాబ్రూతే యాబ్రూతే సానపశ్యతి" యనుపురాణవచనంబును బుద్ధినిలిపి తెలిసి తెలియక పరులమీద నిందమోపరాదు. మాటలాడునప్పుడు లేనిపోనివి కలిపిచెప్పుటసరికాదు. పరులదోషంబులెన్నుట సజ్జనునకుఁగాని వావి. సర్వభూతంబులయందీశ్వరుఁడున్నవాఁడనిభావించి వానికి నెవ్విధంబునను గీడు వాటిల్లకుండ వర్తించుటయె శ్లాఘనీయము. సత్పురుషుఁడు తనశక్తికొలఁది యితరులకు మేలుఁగూర్చు.

రెండవసాధనము నిష్కామత్వము. అనేకులకుఁ గోరికలదిగనాడుటయన్న గుండెఘుబ్బుమను. అవిలేకున్నవారు భూమిమీఁద నిల్వనేరరు. ఇట్టివారు పామరులసుమా. వివేకియగువానికి నిహలోకపదార్థములు గంధర్వనగరంబులు. వానికిఁ గామమనన్నెక్కడిది? లోకంబునఁ గొందఱు స్వర్గలోకసుఖంబులఁ గోరి యిహలోకసౌఖ్యముల విడనాడుదురు. అవియును గామమేగదా. లోకహితార్థమైచరించుట వెలిగ నన్నియు బంధహేతువులగు. అట్లగుటంజేసి కోరికలెవ్వియుం గొనఁగావు. ఇంతియెగాదు. ఉపకారమొకనికింజేసి దానిఫలముంజూడఁగోరుటయుఁ దగదు. స్వధర్మమాచరించుటయే ప్రయోజనంబుగఁ గార్యముల నడపవలయు. అణిమాదిసిద్ధులఁగోరుటయుఁ దగదు. పరులు తన్నుఁబొగడిననేమి? నిందించిననేమి? ఈనిందాస్తుతుల నభిలషించి వర్తింపరాదు. కొందఱు సహాయాసమయంబు తెఱుంగక వదరుచుందురు. అదికానిపనిసుమ్ము. పలుకకుండుటయే మేలు. పలుకవలసినచో సత్యమును హితమును బలుకవలయు. వీధితిన్నెపైఁ గూర్చుండి "లోకాభిరామ" మని యిరుగుపొరుగువారిదోషంబుల గణించుటకంటె దుర్గుణము వేఱులేదు. ఆమాటలు లోకఘాతుకం

క. విను లోభము నజ్ఞానం, బును సదృశ ఫలప్రదములు * పుట్టును లోభం
బున నజ్ఞానము గావున, జననాయక లోభముడుగు * సౌఖ్యములొందున్.

బులగుఁ గాని యభిరామంబులుగావు. సజ్జనుఁడట్టిమాటలఁ జెవియొగ్గివినఁడు. మౌనమే పరలోకమునకు నిచ్చెన. దాని సాధించుటకు భగీరథప్రయత్నమువలయు. కొందఱు తమకార్యంబుల నట్టేటవిడిచి పరులను దిద్దఁబూనుదురు. మాటసాగినచో మెల్లమెల్లన హితవాక్యముల నితరులకు సన్మార్గముఁజూపవలయుఁగాని యకాండతాండవము సల్పుట నీతికాదు. ఇవియెల్ల సత్పథంబునఁ జరించువానికి సంకెళ్లసుమ్ము.

మూఁడవసాధనము సద్వర్తనము. దీనికి మొదల మనోనిగ్రహమువలయు. మనస్సు సార్వకాలమును నిశ్చలముగ నుండకపోయెనేని నేకార్యమును సాధింపనలవికాదు. కోపంబు దేహంబునకుఁ దాపంబుఁదెచ్చు. కోపమడఁగి మనసు నిశ్చలముగనున్న ధైర్యముగలుగు. దానిచేఁ గష్టములెల్ల దాటవచ్చు. సంపదల రాకపోకలకును బంధుజనుల సంయోగ వియోగంబులకును గదలకుండుటయే మనోనిగ్రహము. ఇవియన్నియుఁ బూర్వకర్మవశంబులని సంతసంబుననుండుటయే వివేకము. గడచినదానికి వగచిననేమి ఫలంబు? స్వధర్మంబును నేర్పునఁ జడుపుము. కష్టములుసుట్టికొనినచో మిన్నుపైఁబడ్డరీతిఁ గ్రుంగుట సరికాదు. దిగులంది దిగుచెమటలు గార్చిన దుఃఖమంతకంతకు హెచ్చుఁగాని తగ్గదు. నలుగడలకు మనంబుఁ బరుపిడక యుండ స్వవశంబుచేసికొనవలయు. ఎప్పుడుఁగాని దాని నిరావ్యాపారంబుగ విడువరాదు. సద్విషయంబుల నిరంతరము ధ్యానించుటమేలు. పఱువాత మేల్కాంచి లోకమెల్లసుఖంబుననుండఁ గావుతమనితలంపవలయు. గర్వించితిరుగరాదు. తెలివిలేమియే సుమ్మ గర్వమునకుఁగన్న తల్లి. తనతలఁదన్నువారెందఱు మున్నుండిరి. ఇపుడును న్నవారు. ఈశ్వరుండొక్కరుండె గొప్పవాఁడు. తాఁజేసిన శ్వంబులెల్ల వానిపనులని తలంపవలయు.

సమస్తకార్యముల మిగులజతనంబున నడపుటయే యార్యజనసమ్మతము. అన్నిపనులకుఁ దామున్నుగఁబోవలయు. స్వధర్మంబునడపుట యందిట్లు వర్తింపవలయు గాని యితరులపనులకుఁ బిలువని పేరంటమేగరాదు. తన పనిఁదాఁజక్కఁగఁ దీర్చినఁజాలదే? అనేకుల కితరులపనులలోఁ దాముఁ్రవేలుపెట్టకున్న నిద్రపట్టదు. సత్పథంబున నడచువానికివి తగవు. అన్నిపనులును చిన్నవనక పెద్దవనక తూచాతప్పకయుండ నీశ్వరార్పణబుద్ధితో జరుపుట సజ్జనునకు లక్షణము. ఇతరులదోషముల న హిం ప వ ల యు. ఇ త ర మ త స్థు లఁ దూలనాడరాదు. ప్రపంచమందలి యన్నిమతంబులును బరమేశ్వరుం జేర్చుమార్గములు. తమమతంబును దమయాచారంబులును శ్రేష్ఠములని భావింపరాదు. సర్వమతంబుల సమబుద్ధితోఁజూడవలయు. మామతింబేమేలనియు మాయాచారములె సదాచారములనియు, మే మెగదా యాభిజాత్యులమనియు దురభిమానమున విఱ్ఱవీగువారు వెఱ్ఱివారు. విద్వాంసుఁడు కష్టముల సంతోషముతో నోర్చు. అవికర్మవశంబులని భావించు. దైవమొసఁగిచూపిన నది తనకుఁ బ్రసాదమని నగుమొగంబుతోఁ గైకొను. తనకు మిగులఁగూర్చుచుట్టంబులు పోయినను వగవఁడు. విహ్వలింపఁడు. సార్వకాలంబును సంతసముతో వర్తించు. వాఁడు స్వార్థపరత్వముమాని లోకహితంబె కూర్పనమకట్టు. తనదేహబలంబును బుద్ధిబలంబును దాఁచికొనక శ్రద్ధతో నొక్కొక్కకార్యమును నిర్వహించు. ఇహలోక తుచ్ఛసుఖంబులెవ్వియు వానికి రుచింపవు. ఎట్టికష్టములువచ్చినను వాఁడు పట్టువదలక సన్మార్గమున నడచు. ఈయసిధారావ్రతము నెవ్విధంబుననైన సాధించును.

---

*:—వాణిజ్యము, వ్యాపారము, పరిశ్రమలు, రాజ్యాంగ విషయములను గూర్చి సంక్షేపముగ వ్రాయఁబడిన వ్యాసము
వారము గలిగియుండును. చందా సం॥ 1-కి ౨-౮-౦. పత్రిక. సంవత్సరాదిసంచికకు రు. ౨-౦-౦.

ఇంతకు నేర్చువానికిఁ దనయందును గురునియందు ను విశ్వాసంబు తనంతనజనించు. మనమీకార్యారంభము లగుటంజేసి మనకెద్దియులోకమున నసాధ్యముగాదు. ఇట్టి నమ్మిక పొడముదనుక మనకెవ్వరుతోడ్పడినను ఫలంబు లేదు. గొప్పకార్యముల సాధించినవారలెల్ల మనవలె మనుష్యులుగారె. వారిచేనైనది మనమేల సాధింపఁజాలము. ఇట్టియుత్సాహంబులేని పిఱికికండవారు లోకమున నేమి చేయఁగలరు.

సర్వభూతదయ నాల్గవసాధనము. ఇదిసాధనములన్నింటిలో ముఖ్యమైనది. దయలేనివాని చదువులేల? శీలంబులేల? "దయయు సత్యంబులోను గాఁదలపఁడేని కలుగనేటికిఁ దల్లులకడుపుచేటు." ఈసాధనమును ముముక్షుత్వమని మనవారందురు. ముముక్షుత్వమనఁ దాను మాత్రము సంసార బంధమునుండి వెలువడుటగాదు. అదిమేలుగాదు. దయాస్వరూపుండగు నీశ్వరునివలె లోకహితార్థముగఁ జరించుటయే మోక్షము. ప్రాణులకు నెవ్విధంబునను గీడుసేయకుండుటయు సహాయ మబ్బినపుడెల్ల వానికి సహాయముచేయుటయు దయనాఁబడు. పరులకోపములెన్నుట, క్రౌర్యము, తామసశ్రద్ధ యనునవి పాతకంబులలో నెల్లఁ గడుపెద్దవి. ఇతరులదోషంబుల గణింపరాదు. ఒక్కొకపదార్థమునందును సుగుణంబులును దుర్గుణంబులునుగలవు. దుర్గుణమ్ములఁ దలంచుట పాపమునకు సంచకరమిచ్చుట. దానిచే దుష్టభావబింబములు లోకమెల్లఁజుట్టుకొను. మనమెవ్వరియందు దుర్గుణమారోపింతుమో వానికి నాగుణంబెపుట్టు. ఇంతియేగాదు. లోకముం దావార్త నంటుగురికోట నాని నానాటఁబలిసి తీగెలుసాగు. దీనికంటె దుర్గుణమొక్కటిగలదే? కాన సత్పురుషుఁడు పరులదోషముల నొక్కరుచెప్పినను వినరాదు. వినినను మఱలవానిం దలంపరాదు. క్రౌర్యమన్ని తెఱంగులఁ గీడు తెచ్చు. తెలిసి జీవులయెడఁగ్రౌర్యముఁజూపువారు రక్కసులుసుమ్మి. జంతుహింసకు సజ్జనుఁడు చొరఁడు. పోలేరమ్మకని పోతులరాజుసకని మేఁకల దున్నల బలిపెట్టుటదోషము. ఉబుసుపోకకై వేటాడి జంతువులఁజంపుదురు. పిల్లికిఁ జెలగాటమయ్యె నెలుకకుఁ బ్రాణసంకటము. నిష్ఠురపలుకులచేఁ బరులహింసించుటయుఁ దగదు. తెలిసి తెలియకయు నట్టిమాటలు నోరజారకుండఁజూచుకొనవలయు. పైరులకుఁ బాలిసేయకున్నఁ బండదనుట మూఢత్వము. శ్రోత్రియుండ్లకుఁ గోళ్ళనుజంపుటలోనగు దురాచారము లనేకములు మనదేశముననున్నవి.

ఇవి యెల్లదయాగుణంబునకుఁ బ్రత్యక్షశత్రువులు. సత్పురుషుఁడు వీనినెల్లఁ దూరముగఁ ద్రోయవలయు. పుణ్యదేశంబగు నీభారతదేశమునఁ గూటిబీదలై విద్యాగంధములేకపశుప్రాయులగువారెందఱులేరు. వారుసెప్పరానివారఁట. ఆర్యులార ఇంకనైన మీరు వారింగడకంటఁజూడరాదె. మాటలుమాయన్న చేయిసవతన్నగాక వారికిఁ జేయిచ్చి వారింగాపాడుట కర్తవ్యము. అట్లుగాదేని మనవారి "నీటగువల్లె మాటు సభసల్పెదు తీవియుఁ బ్రాణమాటలన్ । బాటవమొప్పఁ జెప్పఁబలు పాండితి నుండ్ వృథగాదెమిత్రమా."



చ. పలుకక యుండుకంటెఁ దగఁ * బల్కుట మేలు వినుండు సత్యముం । బలుకుట ధర్మమార్గమునఁ బల్కుట సర్వజనప్రియంబుగాఁ
బొ. సెక్కడగు * భంగులు వీని నెఱింగి యొందుమైఁ । బలుకక నాల్గుచందములఁ * బల్కఁగమెత్తురు వానిదేవతల్.



# ఆంధ్రరాష్ట్రము.

ఆంగ్లేయపరిపాలనము రామరాజ్యమువలెను ధర్మజుపాలనము కరణిని జగజ్జనానురంజకముగనొప్పుచున్నది. ఆంగ్లేయుల ధర్మానురక్తి, కార్యనిర్వాహణ దక్షత్వము, సాహసధైర్యములు, శాంతస్వభావము, వ్యవసాయ పరాయణత్వము మొదలగు సద్గుణములు వారిపాలనా ప్రశస్తికిఁ గారణములు. ఏమహాదరణ్య మధ్యమునందైనను నేపర్వత ప్రాంతమునందైనను నేయెడారి నడుమనైనను నాంగ్లేయ పౌరాంకితము నిర్భయత్వము నుపపానించుచున్నది. బ్రిటిషుపౌరనామము గౌరవమునకు భాజనము. బ్రిటిషు సామ్రాజ్యవాసులైన హైందవులును గాలక్రమమున నీసంపూర్ణగౌరవమునుఁ బొందఁగలమని యుత్సాహాపూరితులైయున్నారు. ఆంగ్లేయులపాలనము ధర్మపరిపాలనమనుట నిర్వివాదాంశము. పాలనము కాలానుగుణ్యముగ సంస్కరింపఁబడుచున్నది. జనులేక కంఠ్యముగఁ దమసాధక బాధకములనుఁ బాలకులకు నివేదించినపుడు వంగవిభజనవంటి స్థిరీకృతవ్యవస్థ నయితము పరిహరింపఁబడినది. ఆంగ్లేయపరిపాలనము ధర్మాయత్తమైనను హిందూదేశ రాష్ట్రనిర్మాణ ముచితరీతినిఁ జేయబడినదనుటకు వీలులేదు. సంధివలననో విజయమువలననో దేశము లభించినపుడు వీలునుఁబట్టిదేశ మేదోయొకప్రాంతమునకుఁ జేర్పఁబడినది. ఈచేర్పులో జాతిభేదముగాని భాషావిశేషముగాని భూభాగసంబంధముగాని పాటింపబడలేదు. మగధదేశమును నుత్కలదేశమును వంగదేశములోఁ జేర్చుట దీనికి ముఖ్యనిదర్శనము. దూరస్థమైన వంగదేశ విషయమునువదిలి సమీపస్థమైన చెన్నపురిరాష్ట్ర నిర్మాణము విచారయోగ్యముగా నున్నది.

చెన్నపురిరాష్ట్రములో నాలుగైదుభాషలు వ్యవ
...బడుచున్నవి. ఉత్తరమున గంజాము మండలము
...ధభాషలు వ్యవహరింపఁబడుచున్నవి.
...యభాషలును వృద్ధినిఁబొందక
న్నవి. ద్వైధీభావమువలన నుభయభాషా పోషకులును నరుదుగనున్నారు. కన్నడభాష మూఁడురాష్ట్రములలో ముప్పతిప్పలు పడుచున్నది. బొంబయి కన్నడము మహారాష్ట్ర గోవాని భాషామిళితముగానున్నది. మైసూరు కన్నడము శుద్ధకన్నడముగా నెంచఁబడుచున్నది. చెన్నపురిరాష్ట్రములోని కన్నడ ముభయరాష్ట్ర కన్నడముల ననుగమించుచున్నది. కన్నడులును నాంధ్రులవలె వెనుకఁబడియున్నారు. కాని మైసూరు రాజ్యములో రాజపోషణమువలనఁ గన్నడభాష యభివృద్ధినిఁ బొందుచున్నది. మలయాళులు నయితము రాజపోషణమువలనను స్వయంసహాయమువలనను నభివృద్ధిఁ బొందుచున్నారు. మిగిలిన ద్రవిడాంధ్రజాతులలో ద్రావిడులప్రభ హెచ్చుగనున్నది. ద్రవిడదేశమునందె కాక నాంధ్రదేశమునందును వారియధికారము వ్యాపించుచున్నది. ఉన్నతోద్యోగములన్నియును ద్రావిడుల హస్తగతములుగ నున్నవి. రాజకీయవ్యవహారములందు నయిత మధికతరప్రవేశము ద్రావిడులకుఁగలదు. ఇక నాంధ్రులస్థితి విచారణీయము.

వేదయుగములో నైతరేయ బ్రాహ్మణకాలమున ననగా నిప్పటికి మూఁడువేలేండ్లకుఁబూర్వ మాంధ్రులు వింధ్యాద్రికి దక్షిణమునసుండెడి యనాగరకజాతివారుగఁ జెప్పఁబడిరి. అంధ్రులు మృగయాజీవులుగ మనువుచేనిరూపింపఁబడిరి. 2200 సంవత్సరములకుఁ బూర్వము గ్రీసు దేశ చరిత్రకారుడగు మెగస్తనీసుచే నాంధ్రసామ్రాజ్యము ప్రబలసామ్రాజ్యముగ నిర్దేశింపఁబడినది. చంద్రగుప్త మౌర్యునికాలములో నాంధ్రులు శ్రీకాకుళమును రాజధానిగఁగలిగి కృష్ణా గోదావరీనదులకు నడుమనున్న దేశమున కేలికలుగనుండిరి. అశోకవర్ధనుని కాలములో బౌద్ధధర్మ మాంధ్రదేశమునందు నయితము వ్యాపింపఁజేసినటులు వానిశాసనములు దెలుపుచున్నవి. పిమ్మట నాంధ్రరాజులు స్వతంత్రులై క్రీ. త. 236వర కాంధ్రదేశము నవిచ్ఛిన్నముగ నేలిరి. ఈరాజులలో నేడవవాడగు

హాలునికాలమునందు బృహత్కథపైశాచిభాషలో రచింపఁబడినది. ఆంధ్రసామ్రాజ్యము 456 వత్సరములువర్ధిల్లి 236తో నంతరించినది. నాలుగైదుశతాబ్దములలో నాంధ్రదేశము పల్లవులచేఁ బాలింపఁబడుచు వెంగిపురము ముఖ్యపట్టణముగనుండెను. అపుడాంధ్రదేశము దక్షిణమునఁ గాంచీనగరమువరకు వ్యాప్తినిఁగాంచెను. చాళుక్యులు పిమ్మట నయిదుశతాబ్దములవర కాంధ్రదేశమునకుఁ బాలకులై రాజమహేంద్రవరమును రాజధానిగఁ జేసిరి. శూరాగ్రేసరుఁడగు హర్షవర్ధనుఁడు దనజయభేరిని నుత్తరహిందూస్థానము నందంతటను మ్రోగింపఁజేసెను గాని 620లో నాంధ్రదేశపరిపాలకుఁడగు రెండవ పులకేశినుని జయింపలేక మరలిపోయెను. పండ్రెండవ శతాబ్దాంతమునఁ జాళుక్యరాజ్యము వినాశమునొందెను. పదమూఁడు పదునాలుగు శతాబ్దములలోఁ దిలింగదేశస్థమైన నోరుగల్లు కాకతీయ రాజులకు రాజధానిగనుండుటంజేసి యాంధ్రుల విజృంభణమునకుఁ గొంతయవకాశ మేర్పడినది. 1565లో విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నముగా నంతవర కాంధ్రులు గొంతపోషణమునుఁ గలిగియుండిరి. ఆంధ్రదేశములో మహమ్మదీయ రాజ్యస్థాపనతో నాంధ్రదేశరాజుల బలమంతరించినది. ప్రాగ్వాణిజ్య వర్తకసంఘమువారు పూర్వతీరస్థ వర్తకశాలలను మొదట నాంధ్రదేశములో మచిలీపట్నము నిజాముపట్నములలో స్థాపించిరి. ఇప్పటికి నూటయేబది యేండ్లనుండియు నాంధ్రదేశమును నితర భరతఖండ భాగములవలె నంతరాయములులేక నభివృద్ధినిఁ జెందుచున్నది. "చరిత్రలేనిదేశము శుభప్రదము" అనియొక చరిత్రకారుఁడు నుడివియున్నాడు. ఆంధ్రదేశములో సంపూర్ణశాంతి స్థాపింపఁబడినది. దేశవిప్లవకరములగు దురాక్రమణముల కెడములేక దేశము బ్రిటిషుపరిపాలకులచేఁ రక్షింపఁబడుచున్నది. బ్రిటిషు పరిపాలకులచే గల్పింపఁబడిన నీటికాలువలు మూలమూలలవ్యాపించి సస్యములు బాగుగ ఫలించుచున్నవి. దేశము ధనధాన్యసమృద్ధినిఁ గలిగియున్నది. ప్రజలు సుఖములఁ బడయుచున్నారు. సకలవిధముల నాంధ్రదేశము బ్రిటిషుపరిపాలనముక్రింద నభివృద్ధినిఁ జెందుచున్నది.

కాని తెలుగుదేశము చెన్నపురిరాష్ట్రములోని మిగిలినభాగములవలె నభివృద్ధినిఁ జెందుచున్నటులు తోచదు. దీనికి ముఖ్యకారణమాంధ్రదేశ మధ్యస్థమగు ముఖ్యపట్టణము లేకుండుటయైయున్నది. చెన్నపురిరాష్ట్రమునకు మద్రాసు రాజధానిగనున్నది. ఇదిఆంధ్రదేశమునకు దక్షిణసరిహద్దుగ నున్నది. తూర్పుతీరపు రైలుమార్గ మేర్పడకపూర్వ మాంధ్రులకీనగరము దుర్గమముగ నుండెను. ద్రవిడులకిది సమీపస్థముగనుండెను. మొదటినుండియును రాజధానిలో ద్రావిడులప్రాముఖ్యత హెచ్చుగను నాంధ్రుల ప్రాముఖ్యత తక్కువగను నుండెను. ఉన్నతోద్యోగములన్నియును ద్రవిడులకు లభించుచుండెను. రివిన్యూబోర్డులలోను నున్నతన్యాయసభలోను నరవవారికె పెద్దపనులీయఁబడుచుండెను. పెద్దపనులందేకాక చిన్నపనులందు నయితము తెలుగువా రరవవారిపోటికిఁ దాళజాలకున్నారు. చెన్నపురిలోఁ బ్రచురింపఁబడు వార్తాపత్రికలాంధ్రేతరులచేఁ బ్రచురింపఁబడుచున్నవి. ఆపత్రికా సంపాదకులు వారివారి స్వత్వములను రక్షించుటకై ప్రయత్నించుట సహజము. వాణిజ్యవ్యాప్తికైనను నాంధ్రదేశములో ననువగు నావాశ్రయమేర్పడియుండలేదు. విద్యావ్యాపనము చెన్నపురిరాష్ట్రములోనిదక్షిణ భాగమందున్నటులుత్తరభాగమునందు లేదు. ఆంధ్రభాషయందలి పఠనార్హగ్రంథములను నిర్ణయించుటలో నయితమాంధ్రభాష నెరుగని ద్రావిడులు ప్రామాణికులుగనున్నారు.

ఈస్థితికి మూలకారణ మాంధ్రదేశములో ముఖ్యపట్టణమొకటి లేకుండుటయును రాష్ట్రీయపట్టణ మాంధ్రదేశమునకు దూరస్థముగ నుండుటయునుగాఁ దోచుచున్నది. 1901 సంవత్సరపు జనాభాలెక్కలప్రకార మాంధ్రులజనసంఖ్య యీక్రింద వివరింపబడినది.

| | |
|---|---|
| చెన్నపురిరాష్ట్రము | 1,42,76,509 |
| నిజాము రాష్ట్రము | 51,48,302 |
| మైసూరు రాష్ట్రము | 8,35,046 |
| మధ్యపరగణాలు | 1,29,287 |
| మిగిలిన స్థలములు | 3,07,728 |
| | 2,06,96,872 |

1911వ సంవత్సర గణనప్రకార మాంధ్రులసంఖ్య రమారమి 2,50,00,000 అయియుండును. కాలక్రమమున వారిసంఖ్యయింకను నభివృద్ధినిఁజెందుట కవకాశము గలదు. 1903-04 సంవత్సరములలో చెన్నపురి రాష్ట్రములో రూ. 6,06,00,000 భూమిసిస్తువసూలైనది. ఆమొత్తములో నాంధ్రమండలములనుండి రూ॥ 3,50,00,000 లు వసూలైనది. ఈమొత్తము సగముకన్న నధికముగనున్నది. చెన్నపురిరాష్ట్ర విస్తీర్ణము 1,41,705 చతురపుమైళ్ళు. దానిలో తెలుగుమండలములవిస్తీర్ణము91,516. తెలుగునాడు రమారమి రెండువంతుల విస్తీర్ణము గలిగియున్నది. ప్రజాబాహుళ్యమైనకొలఁది రాష్ట్రములు విభజింపఁబడుటయును నవీనరాష్ట్రములు నిర్మింపఁబడుటయును సహజము. తరుణమాసన్నమైనపుడు చెన్నపురి రాష్ట్రములోని యాంధ్రమండలంబులు ప్రత్యేకరాష్ట్రముగ నేర్పాటుచేయుట ముఖ్యమని తోచుచున్నది. ఈ రాష్ట్రనిర్మాణమువలన నాంధ్రదేశములో నొకముఖ్య పట్టణ మేర్పడఁగలదు. అదిభాషాభివృద్ధికిని దేశాభివృద్ధికిని వాణిజ్యాభివృద్ధికిని నిలయము గాఁగలదు. తీక్ష్ణస్పర్థ వలన నింతవరకాంధ్రులు వెనుకఁబడుటకు గల కారణ మంతరించగలదు. ప్రస్తుతము ప్రత్యేకరాష్ట్రనిర్మాణ మసంభవముగా నెంచఁబడిన వంగరాష్ట్రములోని ఢక్కానగరమునందువలె సంవత్సరమునకు మూడునాలుగుమాసములు చెన్నపురి రాష్ట్రపాలకు లాంధ్రదేశములో నివసించుటయైన నుచితముగనుండును. సంవత్సరము నందంతటను సమశీతోష్ణముగల వాల్తేరిందుకుఁ దగియున్నది. విశాఖపట్టణము దగ్గర ననేకసంవత్సరములుగ నాలోచనలోనున్న నావాశ్రయము నిర్మించుట కవకాశమేర్పడి వాణిజ్యాభివృద్ధియునుఁ గాఁగలదు.

జాతీయైకత్వమును నభిలషించు నీకాలములో ప్రత్యేక జాతీయరాష్ట్రనిర్మాణము హానికరమని కొందరనవచ్చును. కాని యీయూహలో సత్యములేదు. ఒకరాష్ట్రవాసుల యభివృద్ధి వేరొకరాష్ట్రవాసులకు హానికరము గానేరదు. సకలరాష్ట్రవాసుల సౌష్ఠవము సామ్రాజ్యబలమునకు హేతువు. బలవంతులతో బలహీనులచేరిక హానికరము. లయావృత్తములో బలహీనులు బలవంతులకు గ్రాసముగనేర్పడుచున్నారు. ధనవంతుల ధనసంచయమునకు ధనరహితులు దోడ్పడుచున్నారు. ఆత్మరక్షణము ప్రాణికోటికి నుత్తమధర్మము. వ్యక్తికిని, కుటుంబమునకును, కులమునకును, జాతికిని నీధర్మమలంఘనీయము. స్వకీయస్వత్వములను గుణగణంబులను రక్షించుకొనుటకై యాంధ్రులును స్వతంత్రమును గలిగియున్నారు.

ఇంతవరకాంధ్రులకు బలవంతులతోటి సాహచర్యము వలన హానిగలిగినది. ఈయుపద్రవమునుఁ దొలగించి యాంధ్రుల యాత్మగౌరవమునుఁ బెంపొందించుట పాలకులవిధి. ఆంధ్రులును విధిచోదితంబైన గమ్యస్థానమునుఁ జేరుటకై తమయావచ్ఛక్తిని వినియోగించవలసియుందురు. ప్రయత్నములేకఁ గార్యముసిద్ధింపనేరదు. యత్నించినపుడు సిద్ధిగలుగకున్నను దోషములేదు. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమువలన నాంధ్రదేశమున కనువగు రాజధాని యేర్పడఁగలదు. దేశవిస్తీర్ణమును, దేశాదాయమును, ప్రజాబాహుళ్యమును నీనిర్మాణమున కనుకూలముగనున్నవి. ఈనిర్మాణమువలన భాషాభివృద్ధియును, వాణిజ్యాభివృద్ధియును, సహజైశ్వర్యాభివృద్ధియునుఁ గాఁగలదు. భిన్నరాష్ట్రములలో నివసించునాంధ్రులు దృఢపాశబద్ధులై దేశాభ్యుదయమునకుఁ దోడ్పడఁగలరు. మండలాధిపతులు దేశభాషను సులభముగ నభ్యసించఁ గలరు. ఈ మహద్విషయ మాంధ్రమహాజనులకును నాంధ్రదేశీయ నాయకులకును, బాలకులకును విచారార్హమగుచున్నది.



# ఆంధ్రస్త్రీల స్థితి.

శ్రీమతి కళ్లేపల్లె వెంకటరమణమ్మగారిచే వ్రాయఁబడినది.

ఆంధ్రస్త్రీలనగా నాంధ్రదేశపుస్త్రీలనిగాని లేక నాంధ్రభాషను మాతృభాషగాఁగల స్త్రీలనిగాని యర్థము. కాబట్టి వారిస్థితిని తెలిసికొనుటకుముం దాంధ్రదేశమన నెద్దియో, భాషయెట్టిదో, పూర్వచరిత్ర మెటులనుండెనో తెలిసికొనుట యావశ్యకము. ఆవిషయములన్నియు మ॥ రా॥ శ్రీ, చిలుకూరివీరభద్రరావుగారిచే రచింపబడి శ్రీవిజ్ఞానచంద్రికామండలివారిచే ప్రచురింపఁబడిన యాంధ్రులచరిత్రమున విరళముగా చర్చింపఁబడియున్నను దానినిచదివియుండనివారికి సులభముగాఁ దెలియుకొరకు క్లుప్తముగా వ్రాయుచున్నదానను.

ఆంధ్రదేశమనునది దండకారణ్యములో నొకభాగమని చరిత్రలవలననేగాక శ్రౌతస్మార్తకర్మారంభముల కేర్పరచబడిన సంకల్పవిధానమువలన నాంధ్రులందరకు తెలిసియేయున్నది. ఆదేశ మాంధ్రవిష్ణువను రాజుచే స్థాపింపబడినదగుట నాంధ్రదేశమనఁబడెనని కొందరూహింపుచున్నారు. మనుష్యులు నివసించుటకు సాధ్యముకాక నంధకారబంధురముగానుండు నరణ్యమంధ్రమనఁ బడునని యు, తమ తెగవారొకరు తమతోఁ పోరాడి యీయరణ్యపుదేశమున ననార్యజన మధ్యమున నుండుటచే నార్యులు వారి నాంధ్రులనియు, వారిదేశము నాంధ్రదేశమనియు వాడిరని కొందరభిప్రాయపడుచున్నారు. విశ్వామిత్రుని పుత్రులలో నేబదుండ్రార్యాశ్రమములనుండి వెడలగొట్టఁబడిరనియు వారిలో నాంధ్రులనువారు నివసించిన దేశమాంధ్రదేశమనియు వారిసంతతివా రాంధ్రులనియు ననబడుచున్నారని కొందరు తలంచుచున్నారు.

ఏచరిత్రము లెటులనున్నను మనమిప్పుడు నివసించియున్న దేశము వేదకాలమున నాంధ్రదేశమనఁబడి తరువాత కళింగ, త్రికళింగ, త్రిలింగ నామములచే వ్యవహరింపఁబడుచూవచ్చి వర్తమానకాలమ్మున తెలుగుదేశమనఁబడుచున్నది. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము నను మూడుక్షేత్రములయందలి లింగములచే నలరారుట, త్రిలింగదేశమనియు దాని తద్భవమగుఁ దెలుగుదేశమనియు ననఁబడెనని యప్పకవీయమువలన తెలియుచున్నది.

ఈదేశ ముత్తర పశ్చిమ దక్షిణములు క్రమముగా నుత్కల, గోండి, మహారాష్ట్ర, కర్ణాట, ద్రావిడదేశములచేఁ జుట్టబడి తూర్పుసముద్రతీరమున లక్షావదునేడువేలమైళ్ళవైశాల్యమును, రెండుకోట్ల పదిలక్షల మహాజనులను, కలిగియున్నది. ఇపుడిది గంజాము, విశాఖపట్నం, గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, అనంతపురం, కడప, కర్నూలు, మండలములను, చిత్తూరు, చెంగల్పట్టు, బళ్ళారి, హైదరాబాదు, నాగపూరు, గోండ్వానాలలోని భాగములను కలుపుకొనుచున్నది.

మనదేశము దండకారణ్య మధ్యప్రదేశమనుటచే నాదిమ నివాసు లనాగరికారణ్య జాతులవారిలోనివారై యుండురని పొడకట్టుచున్నది. గాని వారలార్యులీదేశమును ప్రవేశించునరికే, నాగరికులై యార్యులనెదిరించి హోరాహోరిగాపోట్లాడి, కొన్నిచోట్లజయమును, మరి కొన్నిచోట్ల నపజయమునుపొంది, తుదకు బలవంతులగు నార్యులతో ముఖాముఖిని పోరాడజాలక, బహుకాలమరణ్యముల, బర్వతగుహలదాగి పగదీర్చుకొనుచు, నార్యులచే తరుముగొట్టబడుచు, క్రమక్రమముగ, వింధ్యమునకు దక్షిణమున స్థిరపడిరి. అక్కడ నాగులు యక్షులు దానవులు మున్నగువారితోఁగలసి నార్యులచే దస్యులనబడుచు వృక్షముల, పాముల, పక్షుల, పిశాచముల నారాధింపుచు, పిశాచభాషను మాటలాడుచూ నుండిరి. కొంతకాలమున కుత్తరమునుండి యార్యులు కొందరువచ్చి వీరితోఁ కలిసి యార్యాంధ్రులైరి. వారి యసాంస్కృతమును వీరి పైశాచీభాషయుగలసి యాంధ్రభాషయయ్యెను. ఆర్యాంధ్రులయొక్కయు దస్యులయొక్కయు రక్తసమ్మేళ

సమ్మున నాంధ్రులైరి. పిమ్మటకొందరు ద్రావిడులు దక్షిణదేశమునుండి పశ్చిమోత్తరమునకు క్రమముగా వ్యాపించి మార్గమధ్యమునగల మలయపర్వతపు లోయలలోనుండు మనుష్యుల స్వభాషయగు కన్నడముతో తమభాషనుచేర్చి కొంతకాలము మాటలాడుచు నుత్తరమునుండివచ్చిన యార్యులతోఁగలసి వారిసంస్కృతమును వీరికర్ణాట ద్రావిడములను కలిపి రూపభేదములతో వ్యవహరించుకొనుచు క్రమక్రమముగా కొందరాంధ్రదేశమునకు వచ్చి వారిలోకలిసిపోయిరి. ఇటుల సంస్కృత, ప్రాకృత, పైశాచీ, ద్రావిడ, కర్ణాటాది భాషాసాంకర్యమువలన నేర్పడిన భాషయందు మహమ్మదీయాంగ్లేయాది విదేశభాషాసమ్మేళనముకలిగి వర్తమానకాలపు తెలుగుభాషయైనది. ఇది హిందూదేశభాషలలో మూడవదియైననూ, "దేశభాషలందు తెలుగులెస్స" యని భరతఖండపు పండితులవలనను "ఇటాలియనుభాషనుఁబోలి యున్నద"ని ఖండాంతర పండితులవలనను కొనియాడఁబడుచున్నది. ఇది యేయాంధ్రభాష. దీనిని మాతృభాషగాఁగలవా రాంధ్రులు. వారిదేశమాంధ్రదేశము. ఆదేశపుస్త్రీలేయాంధ్రస్త్రీలు.

ఆదికాలమున నాంధ్రదేశమున వర్ణాశ్రమభేదములులేకుండెను. ఆర్యులయందుండెనుగాని దక్షిణాపథమున వారిసంఖ్య మిక్కిలి తక్కువగానుండుటచే బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులగుటకు మార్గములేర్పరచఁబడి వారిని వివాహము చేసికొనుచుండిరి. శూద్రులుచేసిన వంటకములను భుజింపుచుండిరి. గాని బౌద్ధులయొక్కయు జైనులయొక్కయు "అహింసాపరమోధర్మ" యను బోధవలన క్రమక్రమముగా దాక్షిణాత్యులగు పంచద్రావిడ బ్రాహ్మణులు మాంసభోజనమును వర్జించిరి. ఔత్తరాహులగు పంచగౌడ బ్రాహ్మణులుమాత్రమింకను పూర్వాచారము నవలంబించియేయున్నారు.

ఆదినుండియు నాంధ్రస్త్రీలలంకార ప్రియులుగానే యుండిరి. ముఖమున పచ్చనిబొట్టును, చెవుల పోగులు, చేతుల కంకణములు, కాళ్ళనందెలు కడియములు, మొలనొడ్డాణము, మెడను సరములను ధరింపుచుండిరి. కటిప్రదేశమునకు పైభాగము నలంకారములచే గప్పుటయేగాని రవిక, పయ్యెద, బనియను మొదలగువాని నెరుగకుండిరి. ఆంధ్రరాణులు సహితము రాజసభలలో తమ భర్తల ప్రక్కను గూరుచుండుచు వచ్చిరిగాని రాణివాసమెరుగరు. పురుషులచే మిక్కిలి మర్యాదగ జూడబడుచుండిరి. మతకార్యములయందును స్త్రీలే ప్రాముఖ్యరాండ్రుగ నుండుచూవచ్చిరి. యేమత మవలంబించినను స్త్రీలేమార్గదర్శినులుగానుండిరి. పురుషులకన్న స్త్రీలకే మతాభివేశ మధికముగానుండెను. సర్వసామాన్యముగా పురుషులే స్త్రీలకు వశులైయుండిరి. స్త్రీలు విశేషవిద్యావతులైయుండిరి. శాతవాహనుడు తొలుత విద్యావిహీనుడైయుండి, విద్యావతియగు పట్టమహిషిచే నధిక్షేపింపబడి సిగ్గుపడి విద్యావంతుడగుటకు ప్రయత్నించి గుణాఢ్యశర్మవర్మలకృపచేత పండితుండై విద్యావతియగు పట్టమహిషిపట్ల కృతజ్ఞతను చూపించెనను బృహత్కథయందలి గాథ ఆకాలపు స్త్రీవిద్యయొక్క ప్రభావమును, గౌరవమును వేనోళ్ళచాటుచున్నది. మరియు మగధదేశాధీశ్వరుండగు సుధన్వానునిరాణి "కింకరోమిక్వగచ్ఛామి కోవేదానుద్ధరిష్యతి" అను శ్లోకమువలన కుమారిల భట్టాచార్యుల కుద్రేకమును కలుగచేసి వైదికధర్మ పరిపాలన మొనరించెనను గాథవలన నప్పటిస్త్రీలెట్టి మతావేశపరవశులై తమ పట్టిన పట్టును సాధించుకొనుచుండిరో తేటపడుచున్నది. మండనమిశ్రుని భార్యయగు భారతీచరిత్రమువలన నప్పటి స్త్రీలు భర్తలకెటుల తోడుపడుచుండెడువారో స్పష్టమగుచున్నది. కాఁబట్టి స్త్రీలు సంఘమునకు కేవలము భూషణప్రాయులుకాక సంఘస్థితికి పునాదువంటివారనియు గృహముయొక్కయు, సమాజముయొక్కయు, జాతియొక్కయు, తుదకు మానవకోటియొక్కయు యభ్యుదయము స్త్రీలస్థితిమీదనే యాధారపడియుండుననియు, వారి సహాయములేనిచో పురుషులేమియు చేయజాలరనియు, నాకాలపువారి నిశ్చయాభిప్రాయమై యుండెనని తెలుపకయే తెలియుచున్నది. అట్టిస్త్రీలిపుడేస్థితి యందున్నారో విచారింతము. ప్రస్తుతము స్త్రీలవిషయమున విధియింపబడియున్న కట్టుబాట్లయొక్క యోగ్యాయోగ్యతలను,

H. H. Maharaja Sir Madho Sindhia Bahadur.
Maharaja of Gwalior.



సర్ మాధోరావు సింధియా బహదూర్.
గ్వాలియర్ మహారాజు.

H. H. Maharaja Sir Shahu Chatrapati Maharaja.
Maharaja of Kolhapur.



మహారాజ సర్ షాహు ఛత్రపతి మహారాజు.
కోల్హాపూరు మహారాజు.

H. H. Maharajadhiraj Sir Sawai Madho Sinha Bahadur.
Maharaja of Jaipur.



మహారాజాధిరాజ సవాయి మాధవ సింహ బహద్దూరు
జయపుర మహారాజు.

H. H. Maharaja Sir Bala Rama Varma Bahadur.
Maharaja of Travancore.



మహారాజ రాజ శ్రీ సర్ బలరామ వర్మ బహద్దూరు.
తిరువాన్కూరు మహారాజు.

లాభాలాభములను, గూర్చిన తర్కవాదము నటుంచి, పురుషుల విషయమున నాచరణములోనున్న కట్టుబాట్లతో సరిజూచి, విమర్శించినచో స్త్రీలు కేవలము హీనముగాఁ జూడబడుచున్నారని, నిష్పక్షపాతబుద్ధిగలవారి కొప్పుకొనకతప్పదు. పురుషులవలె స్త్రీలు బ్రహ్మచారిణులుగా నుండి జీవయాత్రగడుపరాదు. జ్ఞానోత్పత్తియగుపరకైన నవివాహితలుగా నుండకూడదు. భర్త దుర్మార్గుడై హింసించినను, పరస్త్రీలోలుడై యవమానించినను, పాషండుడై తనకు ప్రతికూలుడైనను, విడనాడరాదు. భర్తషండుడైనను తుదకు మరణించినను పునర్వివాహములేదు. జారత్వము జాతిభ్రష్టత్వము. స్త్రీలకుస్వేచ్ఛాప్రవృత్తి లంజెరికము. వైధవ్యమామరణాంత మనుభవించవలయును. స్త్రీలకిదియే బ్రహ్మచర్యము. ఇంటనుండు సన్యాసము. స్వాతంత్ర్య మావంతయులేదు. దాయభాగ మంతకన్నలేదు. గౌరవము మొదలేలేదు. దాసీప్రాయులుగా చూడబడుచున్నారు. ఆడువారిబుద్ధి యసురబుద్ధియనియు, వారియాలోచనలు ప్రళయాంతకములనియు, రహస్యమును కాపాడజాలరనియు, వారితో రాచకార్యములను చెప్పగూడదనియు, అనృతవాదులనియు, వారిని నమ్మకూడదనియు, చంచల స్వభావులనియు మొదలగు దుర్గుణములెన్నియో వారియందాపాదింపబడినవి.

ఇందుకుకారణము, లేకపోలేదు. మనసంఘమున దేశకాలముల కనుకూలములగు మార్పులు జరిగినవి. అప్పుడు బాలికావివాహములు ప్రారంభింపబడినవి. ఆ యాచారముల నాచరణలోనికి తెచ్చుకొరకప్పుడు పురుషసంపర్కములేని స్త్రీలకు చెల్లుచుండిన కన్యాశబ్దము సాధింపబడినది. అందుకనుగుణములగు స్మృతులుకల్పింపబడినవి. తుదకది నాటుకొని ప్రస్తుతము కన్యయనుపదము పరిణయమైన పసికూనకు సహితముచెల్లుకున్న యది. అది కారణంబున స్త్రీవిద్య గగనారవిందమైనది. జ్ఞానచక్షువు లేక స్త్రీ లజ్ఞానాంధకారమునఁబడిమూర్ఖురాండ్రనిపించుకొనిరి. వారిగర్భమునబుట్టి, వారిశిక్షను బెంచబడిన యాంధ్రులందరును నట్టివారేయైరి. అట్టివారివలన త్రిమూర్తులు ముప్పదిమూడుకోట్ల దేవతలు, లెక్కకుమిక్కిలియగు వ్రతములు, తీర్థములు, క్షేత్రములు బయలుదేరినవి. చరాచర జంతుజాలములు విగ్రహములు నారాధింపబడినవి. ఆచారములన్నియు నపార్థములుచేయబడినవి. పసికూనల వివాహములకుతోడు, రజస్వలాపూర్వ నిషేకములేర్పడినవి. వానివలన ననుకూలదాంపత్యము కరువైనది. పెట్టుమందులు పుట్టినవి. వశీకరణౌషధములు వన్నెకెక్కినవి. పదురెండేండ్లకే పట్టితల్లులై యబలలను నామము సార్థకమైనది. వారిసంతాన మంతకన్న బలహీనమై దేశమును పరదేశీయుల పాలొనరించినది. ఆంధ్రస్త్రీల కాచారమధికము. స్వప్నములయందు, శకునములయందు, ముహూర్తములయందు, పూర్వజన్మ పునర్జన్మములయందు, విగ్రహారాధనమందు నమ్మకము మెండు. పిశాచములన్న భయము. పూర్వాచారములయందు పట్టుదల మిక్కుటము. ఈమొదలగునవి యన్నియు నైజగుణములుగా బరిణమించియున్నవి.

స్త్రీలెంత నీచముగా చూడబడుచున్నను వారి గృహరాణిత్వము వారినెడబాయలేదు. వారియందు స్థాపింపబడిన మోహినీయంత్రము శిథిలముకాలేదు. వారికి నన్నిహితమైన వశీకరణ మంత్రశక్తితగ్గలేదు. కాబట్టి మహావక్తలు, సంస్కరణవాదులు, నగుపురుషులు సభావేదికలయందు స్త్రీవిద్యను గూర్చియు, బాల్యవివాహములనుగూర్చియు, వితంతూద్వాహములను గూర్చియు గంభీరోపన్యాసము లొనరించియు నిల్లు చేరుటతోడనే తమస్త్రీల గృహోపన్యాసముల నెదుర్కొనజాలక తమ యుద్యమములకు వెనుకంజవేయుచున్నారు. దానింగని పెట్టిన బుద్ధిమంతులగు విద్యాధికులు, జాతియొక్క మాతయు, ప్రబోధకురాలును, సంఘముయొక్క సృష్టిస్థితిలయములకు కారకురాలును స్త్రీయనియు, జ్ఞానజ్యోతిచే నామెకరము, కరమలంకరింపబడనిచో తాము మార్గదర్శకులు కానేరరనియు నిశ్చయించి స్త్రీ విద్యాభివృద్ధికై పాటుబడుచున్నారు. ఇపుడిపు డాంగ్లేయప్రభుత్వలాభము వలన కొలదిమందిస్త్రీలు విదుషీమణులై తమవిధాయక కృత్యములను యథావిధిగా నెరవేర్చుకొనుటకు తగినసామర్థ్యము నార్జింపుచున్నారు. స్త్రీ సమాజములస్థాపించి

తమసోదరీ తిలకముల నుద్ధరింపవలయునని ప్రయత్నము లొనరించుచున్నారు. కాని కొందరుపురుషులు సంస్కారప్రియులమని చెప్పుకొనుచు, పరిపూర్ణ విద్యావతులగు స్త్రీలను సహితము దూషించుటకు సాహసింపుచున్నారు. అందుకతోడు సంతానసత్స్వజాతి స్త్రీయనగా బిడ్డలు గల స్వజాతిభార్య కర్థమిచ్చు "కులాంగనా" శబ్దమున కపార్థములను కల్పింపుచున్నారు. తుదకు కన్యాశబ్దము వలె నీకులాంగనాశబ్దమును మనలనెట్టి పాట్లు బెట్టునో దెలియకున్నది.

స్త్రీలు విద్యావతులగుచున్ననూ, చిరకాలానుభవమువలన నభ్యాసపడిన మతావేశపరవశత్వమున పూర్వాచార పరాయణులైకొందరును, ప్రాపంచిక జ్ఞానమువలన నవనాగరికత నలవరచుకొను నుద్దేశముతో కొందరును భిన్నాభిప్రాయులై యొకటిగానుండిన సమాజములతో వేరుపడి ప్రతిసమాజములను స్థాపించుకొని వివాదపడుచుండగా వారిరువురకును సఖ్యమొనరించుటకుబదులు పురుషులొకరిపక్ష మవలంబించి రెండవవారిని తూలనాడుట శోచనీయము. అందువలన నిపుడాంధ్రస్త్రీలస్థితి తామరపాకుపై నీటివలె తహతహలాడుచున్నది. వీరు "నాతికి మానంబె తొడవునయముగసుమతీ" యను నీతి నాధారము చేసికొని మానమునకై ప్రాణమునుసహితము గోలుపోయెదరు. ఈసరికి పరిపూర్ణవిద్యావతులు పలువురు కానరారు. ముగ్ధలమూర్ఖత్వము మూలబడలేదు. సాహసము సన్నగిలలేదు. పాశ్చాత్యనాగరికత ప్రాముఖ్యత వహింపలేదు. పట్టుదల ప్రాబల్యముపలచబడలేదు. అలంకార ప్రియత్వమడుగంటలేదు. పూర్వాచారపరాయణత్వము పూజ్యముకాలేదు. ఇట్టిసమయమున నట్టి వ్రాతలు పురిటిలో నెన్నమ్మకొట్టి నట్లుండునని విన్నవించుకొనుచు నీవ్యాసమును విరమించుచున్నదానను.



# హిందూదేశమున ప్రస్తుత మాంగ్లేయ వైద్యశాస్త్రానుసారము పని చేయు మంత్రసానులు.

శ్రీమతి మొసలిగంటి రామాబాయమ్మగారిచే వ్రాయబడినది.

అల్పజ్ఞురాలగు నబలయొకతె యిట్టిమహద్విషయమును చర్చించుట పరిహాసాస్పదమని యెరుగుదును. గాని మహనీయులు పలువురు పఠించు నీపత్రికారాజమున కలంకారప్రదముగా రచియింపఁబడిన వివిధ విషయములుగల వ్యాసముల కడపట నాదేశీయసోదరీమణులకడగండ్ల నించుక విన్నవించుట నావిధిగానెంచి క్లుప్తముగా కొన్ని నష్టములుమాత్రమే వివరింపబూనితిని. పత్రికాపాఠక మహాశయులీయాపదను వారింప దగునుపాయమును యోచింతురుగాక! భరతఖండవాసులు నానాటికి శరీరబలముతోపాటు మనోబలముగూడ గోల్పోవుటను మనయమూల్యమగు నాయుర్వేదము నామమాత్రావశిష్టమై రణచికిత్సాది యుత్తమభాగమేమంగలి వెంకనిచేతనొ జడియుండ యికమంత్రసాని తనమునకు గుడ్డికుమ్మరి గురివిచెవిటి చాకలిచెల్లి యమరుట యేమివింత. ప్రస్తుతకాలముకన్న ముప్పది నలుబది సంవత్సరములక్రిందట స్త్రీలకింత నాగరికత ముదురలేదు గాన వారిప్పటివారివలె కడుదుర్బలులుగా నుండరైరి. ఐనను యపుడపుడు మూర్ఖమంత్రసానులవాతబడుచుండిరి. అట్టిలోపమును వారింప దొ

రతనమువారు వైద్యశాలలుగల ప్రతియూర యాంగ్లేయ వైద్యశాస్త్రానుసారము మంత్రసానితనము చేయుటకొఱ స్త్రీనేర్పరచుచువచ్చిరి. అట్టిమంత్రసానులు బోధనావైద్యశాలలో పనినేర్చునపుడు శాస్త్రసమ్మతముగా మంత్రసానితనము చేయుచున్నను వారివారి నియమితగ్రామముల యందు ప్రవేశించినవెనుక నూటికి సగముమంది తమయిష్టప్రకారముగానో లేక ప్రసవస్త్రీల యింటిదురాచారముల నవలంబించియో మంత్రసానితనమొనర్చి పెక్కుకష్టములు నష్టములుగలిగించుట నాసోదరీమణులకెల్లరకు అనుభవైకవేద్యము. కొందరు మంత్రసానుల యవివేకఫలము వెంటనే ఫలింపకున్నను ప్రసవిణులు నూటికి మూఁడువంతులు మూత్రాశయలోపములు గర్భాశయలోపము లేగాక తీరని కుసుమవ్యాధులకు గురియై సంతానార్హతకు చెడిపోవుటయు కొన్నివేళల సరియగు హస్తప్రక్షాళనము చేయకపోవుటచే యదివరకు జరుపబడిన ప్రసవిణులకుగల యంటురోగములుగూడ యారోగ్య శరీరయగు వేఱొక ప్రసవిణికంటుటగలదు. ఇన్నిబాధలు లేకపోయినను పెద్దడోలువలె పొత్తికడుపుదిగబడి వికారరూపము లభించుట కడువిచారకరము. పైదోషములు కొన్ని ప్రసవస్త్రీల యవివేకమువలనగూడ బుట్టవచ్చును గాని ప్రసవకాంతయొక్కబాధ్యత మంత్రసాని యధికముగా వహింపవలసినది విధాయకము.

బుద్ధిమంతురాలగు మంత్రసాని ప్రసవావస్థయందుండు గర్భిణిని చూడవచ్చిన వెంటనే తనహస్తములను శుభ్రపరచికొని ప్రసవిణిని పరీక్షింపవలయును. కార్యావసరమునగాని యవివేకమునగాని మంత్రసానిమరచినను హస్తప్రక్షాళనము చేయించుటకు యింటివారేమరగూడదు. గర్భకోశావస్థలను పరీక్షింపబోవునపుడు కొంచమాముదముచే చేయితడుపుటమాత్రము మనమెల్లరమనుదినము చూచుచుందుము. గాని పరిశుభ్రముగా హస్తక్షాళనము చేయుటయేగాక గోళ్ళయందెట్టి మాలిన్యములేకుండచూచికొని గాఢమగు కార్బాలికు లోషనులోగాని మరియేయితర ఔషధిజలంబులగాని స్పర్మాణువులు నశించువరకు అనగా అధమము పదినిముసములైన చేతిని నాననిచ్చి వెనుక తైలమలది శిశూదయము తెలిసికొనుట యావశ్యకమనియు ప్రక్షాళనము క్రమముగా గమనింపక పైపయినీటిలో తొలచిన చేతితోముట్టుటచే అదివరకు జరిపిన కాన్పునందలి స్త్రీకొకవేళ నెట్టివ్యాధులయిన గలవేని పాపమారోగ్య శరీరయగు వేఱొకప్రసవిణికంటి "అయ్యవారిచేయబోయిన కోతియయ్యె" ననుసామెతసంభవించునని స్త్రీవైద్యశాస్త్రపారంగతురాండ్రవలన వినుచుంటిని. ఇదిగాక ప్రసవమును జరుపునపుడు గర్భిణియింటివారి నిర్బంధనచేతను త్వరగా ప్రసవముజరిగిన సుఖముగా నిల్లుచేరవచ్చుననెడు నాతురతను కూరుచుండపెట్టి కాన్పుజరుపుట పెద్దదురాచారముగా నున్నది. యీపాడలవాటుచేత గర్భాశయము స్థానభ్రంశమొందుటయు పలుచని చర్మముచే నిర్మింపబడిన మూత్రకోశము అనగా (బ్లాడరు) రంధ్రములుబడుటయు పేగుజారుటయు మొదలుగాగల శాశ్వతలోపములు సంభవించుచున్నవి. దీనినిమించిన క్రూరకృత్య మింకొకటి కాన్పున జరుపుచున్నారు. ఏమనగా ప్రసవించినవెంటనే బట్టకట్టుటకనియు పడకమార్చుటకనియు నవసూతికను లేవనెత్తినిలువబెట్టుట. యిందువలన ప్రసవాయాసముచే బడలియున్న సుకుమారశరీరలగు కాంతలు బలముచాలక వెంటనేమూర్ఛిల్లిపడుటయు వైద్యులకొఱకు పరుగులెత్తుటయు నేననుదినము చూచుచున్నాను. మూర్ఛతోమాత్ర మీయాపదముగియునా. పూర్తిగా సంకోచమొందని గర్భాశయమీకదలిక కోర్వజాలకపోవుటచే భయంకరముగా రక్తస్రావము ప్రారంభించి కొన్నిఘంటలలో ప్రసవిణులు మృత్యుదేవత కెరయగుటయుగలదు. లేదా, చావుతప్పి కన్నులొట్టపోయెనను సామెతవలె రుతుశూల శ్వేతరక్త కుసుమములు మొదలగు వ్యాధులపాలయి జీవిత సుఖమును గోల్పోయి బాధనొందువారి ననేకులచూచుచున్నాము. సూక్ష్మబుద్ధిగల మంత్రసాని శిశూదయభాగమును గర్భముకంటెమె గ్రహింపజాలును. లేదా, గర్భాశయవిరళమును శిశువుదయించురీతియు మృదుపరీక్షచే తెలిసికొనుట శాస్త్రీయసమ్మతమైనను పలుమారసహ్యకరముగా ప్రసవిణిని బాధించుటయెగాక ప్రకృతికి విరోధముగా ప్రే

సూతివాయువువలన జరుపబడుకార్యములు హస్తచాకచక్యమున జరుపజూచుట చాలప్రమాదకరము. ప్రసవముగుస్త్రీకిగాని చుట్టుమూగి వినోదముచూచు నమ్మలక్కలకుగాని శాస్త్రవిషయములగమ్యగోచరముగుటచే మంత్రసాని చిరకాలాభ్యాసమగు హస్తలాఘవము నుపయోగింది "గుడ్డెద్దుచేనబడినట్లు" వైద్యవట్టముగూడ నిర్వహించి మరింతయనర్థము దెచ్చిపెట్టుచున్నారు. నూటికి పదుగురు మేథావినులగు మంత్రసానులుండకపోలేదు. వైద్యులలభింపని యాపత్కాలమున యట్టివారు సాహసించి తెలిపితేటలుపయోగించి వైద్యులు చేయదగుపనులు చేయుచున్నారని ప్రతిమంత్రసానియు తనబుద్ధి మాంద్యము నుపయోగించి పనిచేయబూనుట శోచనీయము. మంత్రసానిగన్న ప్రసవముగుస్త్రీకి ప్రాణములు కుదుటబడి రక్షకురాలిగంటినని ధైర్యముచే బలముగలదై సుఖప్రసవమొందుటకుమారుగా మంత్రసాని నొకక్రూర రాక్షసిగా చూచి దిగులొందుటచే ప్రసవమంతకంతకు విలంబమగుట యొక్కొకపుడు తటస్థించుటగలదు. ఇట్లే యీగండములన్నియు గడచి ప్రసవించినను మావి అనగా బిడ్డకు తల్లికింటియుండు సంబంధమగు బొడ్డుతీగను వెలువరుచునపుడు కొంతయవివేకము జరిగి ప్రసవిణికి తీవ్రజ్వరము సన్నిపాతముగూడ జాలచోట్ల సంభవించుచున్నది. ప్రసవకార్యములు ముగిసినవెనుక నడుముబిగించుటయని "ఇంటిపై గొట్టిన మూతిపండ్లు రాలె"నన్నట్లు పైపొట్ట రెండుతుండెములుగా తునియునట్లు కట్టుబట్ట కొంగుతో మనవారు కట్టుకట్టులే యాంగ్లేయవైద్యశాస్త్రానుసారము పనిచేయు మంత్రసానులుగూడయవలంబించుటచాలవింతగానున్నది. పాపము!! వారిననేల యింటివారు వెంటనే వలయు సామగ్రినీయక జాలముచేయుటకుతోడు యూరికొక్కరిత మాత్రము నియమింపబడి దివారాత్రములు నిద్రాహారముల కెడములేక దినమున కొకటిరెండు యంతకన్న నధికముగా కాన్పులు జరుపవలసివచ్చిన యెటులో యీతుట్ట బయటబడిన పారిపోదమనుచింతయెగాని శాస్త్రనిషేధములు సమ్మతములు గమనించుటకెడముండునా? అట్టి తరుణమున నెచటనో యొకచోట కట్టివేసి తనపనియైనదనిపించుకొని పోజూచుట తప్పుకాదు. ప్రసవానంతరము బంతివలె నిటునటుచలించుగర్భకోశము స్థానము తప్పకుండ స్వస్థానమునచేర్చి మెత్తని దూదివైచి కొంచెముదళముగానుండు మూరెడువెడల్పును మూడునాలుగు మూరలపొడవునుగల వస్త్రఖండముచే తగినంత బిగువుగాపొత్తి కడుపుపై బిగించికట్టిన కట్టువలన యనేకలాభములును యటులగాక నడ్డదిడ్డముగా నేగుడ్డచేతనో ముడివైచిన రక్తనాళములు క్రమముగా ప్రవహింపజాలక అజీర్ణము శూలపుట్టి బాధపడుదురని స్త్రీ వైద్యశాస్త్రజ్ఞురాండ్రనేకులవలన వింటిని. ప్రసవపట్టికలను పరీక్షించు వైద్యాధికారులయిన ప్రసవిణుల క్షేమమార్గములను మంత్రసానులకు పదేపదే యుపదేశించుమ పాతగిల్లిన బోధనా వైద్యశాలానియమముల నాచరించుచుండిరో పాలుమాలిరో యను విమర్శనచేయుచుండిరా? లేదు మాసమునకు జరుపవలసిన ప్రసవములులోపించిన మంత్రసానుల భయపెట్టుటయు వేతనములు తగ్గించుటయేగాని ప్రసూతికల యాపదలను వారించు నియమము లేర్పరుపరైరి. ఆంగ్లేయదేశమునందలి స్త్రీలందరు విద్యాధికురాండ్రగుటచే మంత్రసానితనము చేయుకాంత చాలవరకు వైద్యశాస్త్ర పరిచయురాలైయుండునని వినికి. మనవారికంతభాగ్య మింతలో నమకూడదు గాన ప్రస్తుతము నేర్పు మంత్రసాని పనులకన్న మరికొన్నియధిక విషయములు నేర్పుట యావశ్యకమేమో బుద్ధిమంతులేయోచింప నర్హులు. పోనిండు. మేలులేకున్న మానెను కీడుచేయకుండ కఠినముగా తగునియమము లేర్పరచిన కొంతనయము. నాస్వదేశ సోదర సోదరీమణులారా! మనకిట్టికష్టములు గల్గుటకు కారణమెద్దియో గ్రహించితిరా? మనయుదాసీనత్వమెనుడీ. మంత్రసానిపని నీచమనియెంచుటయేనుడీ. విద్యాగంధమెరిగిన ప్రతినారీమణియు జీవనోపాధిలేక లోకోపకార చింతజోలిపోకున్నను తన్నుదా రక్షించుకొనుటకైన యీవిషయమావశ్యకమని యొప్పుకొందురా! పోనిండు గృహవ్యాపకభారమున దూగాడు సోదరీమణులమాట యటుండనిచ్చి సంసార దూరులై కడుదురవస్థల పాల్పరుపబడి వంటయిళ్ళనుడుకు

లెక్కకు మిక్కిలిగాగల యనాథయువతుల నిట్టిమహద్విషయముల ప్రవేశపెట్టి స్వలాభమేలపొందరాదు. పొట్టపోసికొనుట మాత్రమే ప్రధాన కర్తవ్యముగానెంచి వైద్యశాలలవనిచేయు మంత్రసానులు బీదసాదలనక పీడించి రహస్యముగాను కొన్నిచోట్ల బహిరంగముగాను దొరతనమువారిచే నిషేధింపబడినను కట్నము లధికముగా గొనుచు నట్లీయనివారిటి కాన్పుసమయములో మొగము చిట్లించుకొని ధుమధుమలాడుచుమాటలాడి పల్కరించిన వారిపై మండిపడుచు తప్పని సరిగాన తద్దినమువలె కార్యము ముగించునామె ప్రసవిణికి మృత్యుదూతికవలె గాన్పించి వెరపుగొలువుచేయు నాశ్చర్యము. యొకరిమాట యేల మనమొరులకు విధిగా నుపచరింపవలసియున్న నెంత చీదరించుకొందుము. "బాధ్యతలేని బావగారిపై దూలముపడ్డా దుఃఖమురాదు" యన్నటుల కూలికిగొలువున్న వారి కభిమానమెటులవచ్చును. మన స్వకుటుంబములోని కాంతలు మంత్రసానులుగా పనిచేయుచున్న నెంతసెమ్మది, యెంతధైర్యమో మీరే యోచించుకొనుడు. ప్రతి కుటుంబమునందునను యొకస్త్రీ ప్రసవవిధుల నెరిగియున్న యూరందరి నుద్ధరించుట లేకున్నను తనవారికుపయోగించి పెక్కునష్టముల నాపబడునని నానమ్మకము. మనవారి దురభిమానమేమియో గాని తమకుపయోగించువిద్యలు తమవారభ్యసించుట పరువులోపము. తిరుగా నేయమ్మయైనను సహాయముచేసిన యానందించి యక్కరతీరిన వెనుక నాక్షేపించుటకు అందరు పండితులేయగుదురు. మనవారిపై నిపుడధికారము చెల్లించునదియెవ్వరో తెలియునా? మనము తెలిసికొనజాలకున్నను తననిరంకుశాధికారము చెల్లించురాణి స్వార్థదేవతయెసుడీ? ప్రతి నారీమణియు తనకారోగ్యము, తనకాయుష్యము, తనకు ధనముకోరుటయెగాక యితరుల యౌన్నత్యమున కోర్వజాలక కలహములె విదుషీమణుల కలంకారములని భావించుచు స్వార్థదేవిశాసనముల పాలించుచునేయున్నది. జ్ఞానాధికులగు సోదర సోదరీమణులారా! స్వప్రయత్నములచే లభ్యమగు విషయములకుగూడ యొరులపైనే భారముంచి చేతులుముడుచుకొని కూరుచుండుట సిగ్గుకాదా? మంత్రసానితనముచేయు స్త్రీ కొంకింత లోకోపకారచింతయైన యుండవలెను; లేదా స్వకుటుంబమునందలి బాధ్యతగలదైయైన యుండవలెను.

గావున పరోపకార పారీణులగు సోదరీమణులు కొంద రీవిద్య నీచమైనదిగానెంచక యభ్యసింప వేడదను. మనపురాణ కాలమందలి కాంతలు మంత్రసానితనము ఘనకార్యముగా నెంచినట్లు నిదర్శనములు గలవు. పాండవుల జననియగు కుంతీదేవి వ్రతనియతయై యంత్యజుల గాలిసోకుట గూడ యపవిత్రమని మతగురువులచే నాదేశింపబడి స్నానార్థము కొలనికేగుసెడ యొకతరుమూలమున నసహాయయై ప్రసవవేదననొందు పంచమజాతిస్త్రీనిజూచి భూతదయచే వ్రతముమాట మరచి వెంటనే మంత్రసాని కృత్యములు నెరవేర్చి వెనుకస్నానమొనర్చి వ్రతవిఘాతమయ్యెనేయని వగచుచు నిల్లుచేర శ్రీకృష్ణులచటి కరుదెంచి సంగతినంతయు కుంతివలన విని వ్రతఫలముకన్నను వేయిరెట్లధిక ఫలము అకస్మాత్తుగాలభించగా వగవనేలయని యూరార్చెనట. యీవిషయము భవిష్యత్పురాణము నందలి కుంతీ కృష్ణసంవాదరూపమగు దశఫలవ్రతమున చెప్పబడియున్నది. అల్పజ్ఞానముగల మనకన్నియు నాక్షేపణలేగాని సర్వజ్ఞులగు పురాణకాంతలు సమస్తకళల నెఱింగియే యుండిరి. వారలు పరార్థమునకే పాటుబడుచు స్తుత్యచరిత్రలయినను మనవారుస్వార్థమునకైన నేల ప్రయత్నింపరాదు?



చ. నతులగుచుఙ్ మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణోన్నతిఁ బ్రకటించుచుం బరజనక్రియకౌర్యసమర్థతఙ్ వమం
చితనిజకార్యసంగ్రహముఁ జేయుచు నిష్ఠురవాదులఙ్ క్షమా ధృతి నిరసించుచుం బరఁగు ధీరులు పుణ్యులుగారె యేరికిన్. భ. నీ.

# ప్రపంచము.

మ.రా.శ్రీ, మ. వెంకటరత్నము బి. ఏ. గారిచే వ్రాయబడినది.

---

మనమెంత విచిత్రమయిన ప్రపంచములోనున్నాము! మనము పుట్టినివసించుచున్నట్టి యీభూలోకము మిట్టపల్లములు కొండలు లోయలు కలదయియున్నను మొత్తమున నొకపెద్ద మయిదానమువలె కనబడుచున్నది. అదికదలక యొక్కచోటనే స్థిరముగా నిలుచున్నట్టును దానిచుట్టు సూర్యుడును చంద్రుడును నక్షత్రములును గ్రహములును తిరుగుచున్నట్టును మనకండ్లకగుపడుచున్నది. మనపయిని ఆకాశము భూలోకముమీద బోర్లించిన ఒకగిన్నెవలె నగుపడి భూమిని అంటుకొనినట్లుగా కనబడుచున్నది. ఇవేవియును నిజములుకావని మనము శ్రద్ధతో పరీక్షించినయెడల స్పష్టముగా తెలియును.

మనభూలోకము ఒకగుండ్రని బల్లవలె లేదనియును బంతివలెను వెలగపండు నారింజపండు మొదలగు పండ్లవలెను గోళాకారము కలిగియున్నదనియును మనము సులభముగా రుజువుచేయవచ్చును. సముద్రతీరమున మనమునిలుచుండి చూచుచుంటిమేని, దూరమునుండి రేవునకు వచ్చుచున్న ఓడలయొక్క శిఖరములును తెరచాపలును మాత్రమేమనకు మొట్టమొదట కనబడును. ఆఓడలు దగ్గిరకు రానురాను వాటిఅడుగుభాగములు కూడను కనబడును. ఆలాగుననే రేవువద్దనుండి సముద్రముమీద దూరముగాపోవునట్టి ఓడలయొక్క అడుగుభాగములుమాత్రము అవిపోయినకొలది మొట్టమొదట అదృశ్యమగును. కడపట వాటిశిఖరములును కనబడకపోవును. ఇందులకు కారణము భూమ్యుపరిభాగము గుండ్రముగానుండుటయే.

మరియునుభూలోకములోని సమస్తప్రదేశములకును ఓడలు సముద్రముమీద పోయి రాగలుగుచున్నవి. సమమయిన గుండ్రనిబల్లయొక్క అంచువంటి అంచుభూలోకమునకున్నట్లు వాటికెక్కడను కనబడదు. ఇందువల్ల కూడను ఈభూలోకము గోళాకారము కలదయి యున్నదని రుజువగుచున్నది.

ఆకాశము మనచుట్టును భూమినంటుకొని యున్నట్లుకనబడుచున్నదిగదా. ఆలాగున నదిఅంటుకొని యున్నట్లుకనబడు ప్రదేశము ఎల్లప్పుడును వలయమువలెగుండ్రముగా నుండును. దానికిక్షితిజ (horizon) అనిపేరు. భూలోకములో నెచ్చటమనమున్నను, అదిఅట్లేవలయమువలె అగుపడుచుండును. ఇదిగోళాకారముగల వస్తువులకుండెడి లక్షణముగాని యితరముల కుండదు. కాబట్టి యీభూలోకము గోళాకారముకలిగి యున్నదని చెప్పుటకిది మరొకదృష్టాంత మయియున్నది.

సముద్రముమీద వచ్చుచును పోవుచునుండు ఓడలనుచూచి యేగాక భూమియొక్కపయిభాగమును పరీక్షించికూడను ఈభూలోకము గోళాకారము కలిగియున్నదని మనము నిరూపింపవచ్చును. రెండుమూడు మైళ్ళ వైశాల్యముగల యొకమయిదానములో ఒక్కొక్కమయిలుదూరమునందు సరిపొడుగుగల మూడుగడలను సమమయిన లోతునకు పాతిపెట్టి, మొదటిగడ కొనపయినుండి రెండవగడ కొనమీదుగా మూడవగడకొనను ఒకఓకు (telescope) తో చూచినపక్షమున ఆగడలయొక్క మూడుకొనలును సరిసమాన మయిన యెత్తుననున్నట్లు కనబడక, నడుమనుండు గడయొక్కకొన 8 అంగుళముల యెక్కువ యెత్తుకలిగియున్నట్లు కనబడును. దీనికికారణము భూలోకముయొక్క వర్తులాకారమేగాని వేరొకటి కానేరదు.

చంద్రగ్రహణములు పట్టినపుడు చంద్రునిమీదపడు భూచ్ఛాయ యెల్లప్పుడును గుండ్రముగానుండుటవల్లను సూర్యచంద్ర నక్షత్రాదులన్నియును గుండ్రముగానుండుటవల్లనుకూడను భూలోకము గోళాకారము కలదయి యున్నదనుటకు మరికొన్ని సాదృశ్యములు సహితముకలవు.

ఇకనుభూలోక మెంతపెద్దదో విచారింతము:— చెన్నపట్టణమునుండి బెజవాడ సూటిగా ఉత్తరముననున్నది. ఆరెండుపట్టణములకు కొంచెమెచ్చు తక్కువగా 210 మైళ్ళ దూరమున్నదనవచ్చును. చెన్నపట్టణమునుండి ఉత్తరముగా పోయినకొద్దీ ధ్రువనక్షత్రము ఆకాశమందెక్కువ పైగానున్నట్లు కనబడును. అదిచెన్నపట్టణమందు క్షితిజనుండి 13 అంశల( degrees)దూరముననున్నది, బెజవాడవద్ద అది క్షితిజనుండి 16 అంశల దూరముననున్నట్లు కనబడును. గనుకసుమారు 210 మైళ్ళదూరమునకును ధ్రువనక్షత్రము ఆకాశముమీద 3అంశల దూరముఎత్తుగా లేచియుండునట్లు అయినది. అనగా 70 మైళ్ళ దూరమునకు ఒక్కొక్క అంశయెత్తు వారవచ్చును. ఒకవృత్తము (circle) అంతయును 360 అంశలుగా విభజింపబడుచున్నది. గనుక భూగోళముపయిన ధ్రువనక్షత్రమునకు దిగువనుపోయెడివృత్తములోని ఒక్కొకఅంశ 70 మైళ్ళపొడుగు గలదైనపక్షమున ఆవృత్తమంతయును $70\times 360$ లేక 25200 మైళ్ళ పొడుగు గలదయియుండవలెను. అనగా భూలోకముయొక్క చుట్టుకొలతసుమారు 25000 మైళ్లుండును. ప్రతిచక్రములోను దానిపరిధిఅనగా చుట్టుకొలత(circumference)దానియొక్క వ్యాసము(diameter) కంటె అనగాదానిఅడ్డకొలత కంటె 3 అంతలు పెద్దదిగానుండును. దీనినిబట్టి భూలోకముయొక్క నాభి(center) నుండి పైభాగము (surface) అనగా దానివిష్కంభము, (radius) $25000\times\frac{7}{22}\times\frac{1}{2}$ లేక 4000 మైళ్ళపొడుగు కలదయియున్నట్లు ఋజువగుచున్నది. ఈభూలోకమెంత పెద్ద గోళమై యున్నదోచూడుడు. దానివిష్కంభము 4000 మైళ్ళును వ్యాసము 8000 మైళ్ళును, పరిధి లేకచుట్టుకొలత 25000 మైళ్ళును పొడుగుకలిగియున్నవి. ఇదితెలియగనే, గోళముయొక్క సాధారణ ధర్మములనుబట్టి, భూలోకము యెంతపెద్ద గోళమయి యుండవలెనో ఎంత బరువుకలదయి యుండవలెనో మనము సులభముగాజెప్పవచ్చును. కాబట్టిభూలోకములోనిమిడియున్న జలమృత్పాషాణాది పదార్థములన్నియును $\frac{4000}{3}\times 2\times\frac{4000}{1}\times\frac{25000}{1}$ లేక 27,000,00,00,000 మైళ్ళ ఘనమానము కలవై యున్నవి. ఈభూలోక మెంత పెద్దగోళమై యుండునో మీరే యూహింపుడు.

ఈభూగోళము కదలకుండనే ఉన్నట్లును దానిచుట్టును సూర్యనక్షత్రాది గోళములన్నియును తిరుగుచున్నట్లును మనకండ్లకు కనబడుచున్న వేగాని వాస్తవమున మనభూలోకమే సూర్యుని చుట్టుతిరుగుచున్నది. మనము పొగబండిలో ప్రయాణము చేయుచున్నప్పుడు మన బండి మిక్కిలి వేగముతో పరుగెత్తుచున్నను మనముదానివంకచూడక మనచుట్టును దూరముననున్న వృక్షాదులను చూచుచుంటిమేని అవేఅన్నియును మనకెదురుముఖముగా పరుగెత్తుచున్నట్లు కనబడును. అట్లేమనభూలోకము నిజముగా సూర్యునిచుట్టును తిరుగుచున్నను మనము కదలకుండ నున్నట్లుండి మనచుట్టును సూర్యుడును నక్షత్రములును తిరుగుచున్నట్లు కనబడుచున్నవి. మనకు రాత్రింబగళ్ళు అనేకాలవిశేషములు కలుగుచుండుటకు అదితనఅక్షము (ఇరుసు) చుట్టును సూర్యునియెదుట తిరుగుచుండుటయే కారణము. మనకు వసంతము గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము అనెడిఋతువులు ఆరును క్రమముతప్పక యేటేటను యుగాదినుండి వచ్చుచుండుటకు మనభూలోకము తనచుట్టును తిరుగుకొనుచుండుటయేకాక సూర్యునిచుట్టును కూడా 365 దినములకొక్కసారి ప్రదక్షిణము చేయుచుండుటయే మూలమయియున్నది. భూలోకము సూర్యునినుండి 9,20,00,000 మయిళ్ళదూరమందున్నది. ఇదెట్లు కనుగొనిరనగా, సూర్యుడు నక్షత్రములమధ్యనుండు స్థానమును జ్యోతిష్కులు ఒకనాడు కనిపెట్టి ఆరునెలలయిన పిదప మరలపరీక్షించి చూచినపుడు కొంచెము స్థాన

---

శ్లో. భూరంభాంస్యనలో నిలోంబర మహర్నాథో హిమాంశుః పుమా నిత్యాభాతిచరాచరాత్మక మిదం యస్యైవమూర్త్యష్టకమ్।
నాన్యత్కించనవిద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో స్తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

భేదము కలుగుచున్నది. దానికే సూర్యలంబన (solar parallax) అనిపేరు.

లంబనయనగా నేమోసూక్ష్మముగా తెలిపెదను. మనము కదలక స్థిరముగానుండు ఒకవృక్షము వంటియే వస్తువువంకనయినను ఒకచోటనుండి చూచితిమేని, అదిమ నకు ఈశాన్యమూలగా నున్నట్లు కనబడుననుకొనుడు. తరువాతమనము సూటిగా తూర్పుదిక్కునకు కొంతదూ రమునడిచితిమేని మునుపుమనము చూచియుండిన వస్తువుఇప్పుడు మనకు వాయవ్యమూలగా నున్నట్లు కనబడును. ఇట్లుఆవస్తువు ఉండినట్లుండిన స్థానమునకు మార్పు కలుగుటయే లంబన (parallax) యనబడును. మనమెంత దూరము నడచినామో, అవస్తువు రెండుచోట్ల లందును మనకంటితో చేయుకోణము లెంతెంతవో కొలిచితిమేని ఆవస్తువు మనవద్దనుండి యెంతదూరమున నున్నదో మన ము త్రికోణశాస్త్ర(Trigonometry)ప్రకారము కనుగొన వచ్చును.

ఇట్టిసూర్యలంబననుపట్టి గణితమువేసి చూడగా సూర్యుడు భూలోకము నుండి పయిన చెప్పినంత దూర ముననున్నట్లు తేలుచున్నది. సూర్యుడు భూలోకమునుం డియింతదూరమున నున్నాడని కనుగొనగానే అతడుఎం తగొప్ప గోళమయియుండవలెనో లెక్కవేయుట సుల భము. సూర్యగోళము భూగోళముకంటె 1,300,000 అం తలుపెద్ద. ఇంతపెద్దదయిన సూర్యగోళము చుట్టును మనభూగోళము 9,20,00,000 మయిళ్ళ దూరమున తిరు గుచున్నది. గనుక భూలోకము సూర్యునిచుట్టును తిరిగె డిమార్గము ఒకవృత్తమువలె నుండును. అదియే భూమి యొక్క కక్ష్యఅనబడును. ఆకక్ష్యయొక్క విష్కంభము 9,20,00,000 మయిళ్ళుఅని పయినచెప్పితిని. గనుకదాని వ్యాసము $2\times 92000000$ లేక 18,40,00,000 మయిళ్ళు. దానిపరిధి $\frac{22}{7}\times 18,40,00,000$ లేకసుమారు 57,80,00,000 మయిళ్ళు.

సూర్యునిచుట్టును భూగోళమునకు అవతల తిరుగు చుండెడి గ్రహములు కొన్నిగలవు. అవి అంగారకుడు, బృహస్పతి, శని, యూరేనసు, నెప్ట్యూను అనునవి. వాటి లోనెప్ట్యూను అనునది సూర్యునినుండి 280,00,00,000 మయిళ్ళదూర మందున్నది. గనుక దానియొక్క కక్ష్య యెంతపెద్దదయి యుండవలెనో మీరేలెక్కవేసి కను గొనుడి. అది 17,60,00,00,000 మయిళ్ళుపొడుగు గల దయి యున్నదని మీకుతెలియును.

సూర్యుని కుటుంబములోచేరిన గ్రహములన్నియు ను, అనగా, బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు, బృహస్పతి, శని, యూరేనసు, నెప్ట్యూనుఅనునట్టి పెద్దగ్ర హములును, ఇవిగాక యింకను మూడువందలకు పయిగా నున్న చిన్నచిన్న గ్రహములును ఇంతదూరములోగా సూ ర్యునిచుట్టునుతిరుగుచున్నవి. ఇదియెంత గొప్పదూరమో విచారింపుడు. సూర్యుడునుఅతనికుటుంబమును ఒకద్వీపస ముదాయము(archipelago )వలె ప్రపంచములోనున్నవి. వాటికిని తక్కిననక్షత్రములకును నడుమను ఒకగొప్ప మేరను మిక్కిలిపెద్దకాళీస్థలము ఒకటి కలదు. సూర్యు డు నక్షత్రములలో నొక్కటియయి యుండి మనకు మిక్కిలి దగ్గరగానున్నాడు. ఆకాశమందు మనకగుపడు చున్న నక్షత్రము లన్నియును మనము వర్ణింప లేనంత గొప్పదూరమున నున్నవి. అవియును మనభూలోకము వలెగాక మనసూర్యుని వలెనే స్వయంప్రకాశము కల వయి, సూర్యునికంటె మిక్కిలిపెద్దవయియుండి, తమతమ చుట్టునుతిరుగుచున్న గ్రహములనెడి కుటుంబములు వే ర్వేరుగా గలవయియున్నవి. త్రిశంకునక్షత్ర సముదాయ ములో ప్రధాననక్షత్రము (Centaur i) సుమారు ఒకవిక ల(one second)లంబన కలదయియున్నందున మన భూ లోకమునుండి 20,000,00,00,00,000 మయిళ్ళదూరము న నుండవలెను. సూర్యుని తరువాత ఇదేమనకు మిక్కి లిదగ్గరగానున్న నక్షత్రమయినట్లు కనబడుచున్నది. త

క్కిన నక్షత్రములన్నియును మరెంతంత యెక్కువ దూరములందుండవలయునో ఊహింపుడు. మనప్రపంచముయొక్క విస్తీర్ణమును కనుగొనినవా రెవరును లేరు. మనుష్యులెంతెంత పెద్ద ఓకులను వేసిచూచినను దానిఆద్యంతములను తెలిసికొనుట కెవరికిని సాధ్యము కాలేదు.

మనకు ఆకాశములో తెల్లనిపాలయేటివలె కనబడెడి ఆకాశగంగ (Milky Way) యనునది మిక్కిలి గొప్ప ఓకులతో చూచినపుడు అదియంతయును నక్షత్రములప్రోగయియున్నట్లు తెలియవచ్చుచున్నది. పిండిలోని రేణువులు కలసియున్నట్లును మహాసముద్రములోని నీటిబిందువులు చేరియున్నట్లును ఆకాశగంగలో నక్షత్రములు మనవద్దనుండి మిక్కిలి మిక్కిలి దూరముగానున్నను ఒండొంటితో కలిసియున్నట్లు కనబడుచున్నవి. అయినను అవి ఒండొంటినుండి అనేకకోట్లతరబడి మయిళ్ళదూరముననున్నట్లు ఊహించుటకు మనకుఆస్పదము కలుగుచున్నది.

కొన్నితోకచుక్కలు ఒక్కొకప్పుడు మనకగుపడి ఆకాశములో మిక్కిలి వేగగతితో పోవుచున్నను మళ్ళీ మనయొద్దకు రాకయున్నవి. ఇందువల్ల వాటికక్ష్యలెంత పెద్దవయియున్నవో ఈప్రపంచమెంత పెద్దదయియుండవలెనో కూడను విశదమగుచున్నది.

మనకగుపడు నక్షత్రములలో మిక్కిలివిచిత్రములయిన వనేకములున్నవి. ఒకానొకనక్షత్రము కంటికిఒక్కటిగా గనపడుచున్నను వాస్తవమున రెండు, మూడు, నాలుగు నక్షత్రములుకలిసి యుండును. అవి మిక్కిలిపెద్ద గోళములయియున్నను ఎంతోదూరమున నున్నందునఒక్కనక్షత్రమే అయియున్నట్లు మనకంటి కగుపడుచుండును. మరియును మనకండ్లకగుపడని నల్లని అనగా కాంతివిహీనమయిన నక్షత్రములుకొన్ని కాంతిగలనక్షత్రములు మరికొన్నిటి చుట్టును తిరుగుచున్నవి. అవిమిక్కిలి పెద్ద మర్భిణులతో నల్లనిచుక్కలవలె కనబడును.

ఆకాశములనగా స్థలమనునది అంతటను సూర్యాదినక్షత్రములతోను భూమ్యాది గ్రహములతోను చంద్రాది ఉపగ్రహములతోను తోకచుక్కలు ఉల్కలు మొదలగు విచిత్రగోళములతోను వ్యాప్తమయి యున్నది. భూలోకములోనున్న యిసుక రేణువుల నయినను ఎవరికయినను లెక్కపెట్ట దరమగునేమోగాని ప్రపంచముయొక్క విస్తీర్ణతనుగ్రహించుటగాని ప్రపంచములోనున్న నక్షత్రాదుల సంఖ్యను లెక్కపెట్టుట ఎవరితరమును కాదు.

మనభూలోక మేయే వాయువుల (gases) తోడను ఏయేశిలలు లోహములుమొదలగు వాటితోడను చేయబడియున్నదో అట్టివాయువులతోడను అట్టిశిలలు లోహములు మొదలగువాటితోడను చంద్రుడుమొదలగునట్టి ఉపగ్రహములును బుధుడు, శుక్రుడు, అంగారకుడు మొదలగు గ్రహములన్నియు తోకచుక్కలు ఉల్కలు మొదలగునవియును సూర్యుడును సహాచేయబడియున్నట్లు వాటివాటివెలుగును శోధించి పరీక్షచేయు స్పెక్ట్రొస్కోపుఅను నొకసాధనమువల్ల రుజువగుచున్నది. నక్షత్రములలోని పదార్థములును అటువంటి వాటితోనే చేయబడియున్నట్లుకూడా పయినచెప్పిన సాధనముమూలముననే విశదమగుచున్నది. ఇందువల్ల ఈమహాప్రపంచమంతయును ఒక్కవిధమయిన పదార్థములవల్లనే చేయబడినట్లు స్పష్టమగుచున్నది.

మనభూలోకము తనకక్ష్యను లేశమయినను తప్పిపోవక నియమితకాలములో ఏఁటేటను సూర్యునిచుట్టుతిరిగివచ్చుచుండుట ఆశ్చర్యముకాదా! ఆలాగుననే తక్కిన గ్రహములును, ఉపగ్రహములును, తోకచుక్కలుమొదలగునవియును వాటికి విధాయకమయియున్న గతులలో పొరపా టేమియునులేక తిరుగుచుండుటకూడను మిక్కిలి ఆశ్చర్యకరమయి యున్నది. మరియును ప్రపంచములోనున్న నక్షత్రములన్నియును వాటివాటి గ్రహములను

క. రోషము శోకము రాగ, ద్వేషము లభిమానదర్పవేగాలస్యా
శ్లేషము లజ్ఞానమనిమ, నీషిజనము సెప్పె మానసీయచరిత్రా.
భా. శాం.

లెక్కలేని వయ్యును వాటివాటి గతులలో సరిగాతిరుగు చుండుట యెంతఅద్భుత మయియున్నది!

ఈలెక్కలేని గోళములన్నియును తమకక్ష్యలలో నింతక్రమముగాను హద్దుమీరకను తిరుగుచుండుటకు వాటికి పరస్పరముగల ఆకర్షణశక్తియే కారణమని మనమెరుంగవలెను. చంద్రుడు మనభూలోకము చుట్టునుతిరుగక పారిపోవకుండగను, మనభూలోకమును తక్కిన గ్రహములును సూర్యునిచుట్టును తిరుగక పారిపోవకుండగను చేయునట్టి ఆకర్షణశక్తి యేదో ఆశక్తియే మనవద్దనుండి మినుమిక్కిలి దూరములందున్న నక్షత్రములనే మహాగోళములును ఒండొంటిని ఆకర్షించుకొని ప్రపంచములో నేమియును గందరగోళము చేయకుండునట్లు పనిజరుపుచున్నది.

మనభూలోకములోనున్న జీవరాశి యెంతవిస్తారమయియున్నది! పిపీలికాది బ్రహ్మపర్యంతమని మనము సాధారణముగా మాటాడు చుందుముకదా. చీమలకంటె సహాచిన్నవయిన జంతువులెన్నియున్నవి! మనకండ్లకగుపడనట్టి జంతువులెన్నియో సహితము ఉన్నవని సూక్ష్మదర్శిని(microscope) మనకు తెలియజేయుచున్నది. దాని మేరకు కూడను అందని మిక్కిలి చిన్నజంతువులింక నెన్నియున్నవో యెవరుచెప్పగలరు? ఈభూలోకమువలెనే యితరఖగోళములును లోకములయి యున్నవనుటకును, దీనిగోవలెనే వాటిలోకూడను లెక్కలేని ప్రాణులుండవచ్చు ననుటకును కొంతఆస్పదముకలదు. మనభూలోకములో మాత్రమే ప్రాణులున్నవని చెప్పుట ఎంతమాత్రమును విశ్వసనీయమయి యుండనేరదు.

తుద తెలుసుకొనరాని యీమహాప్రపంచమెట్లువచ్చినది? అదితనంతట తానేపుట్టినదా? లేదా, దానినిసృజించినవాడెవడయిన నున్నాడా? అదితనంతట తానేపుట్టియున్నదనిచెప్పే నిరీశ్వరవాదులయొక్క ఊహయెంతమాత్రమును సరియయినది కాదనుటకు సందేహము లేదు. లోకములోనిసమస్తమతములును అనగామనుష్యులందరును ఈప్రపంచమునకు కారకుడయిన సర్వేశ్వరుడొకడుండి యుండవలెనని చెప్పుచున్నారు. ప్రాచీనశాస్త్రములును నవీనశాస్త్రములునుకూడా ఈజగత్తునకు కారణమయిన మహాశక్తియొకటి యుండి యుండవలెనని ఉద్ఘోషించుచున్నవి. ఆమహాశక్తియే దైవమయియున్నది. దేవుడులెక్కలేని యిన్నిలోకములను సృజించివాటిని పరిపాలించుచున్నాడు. ఆయనసంకల్పమేదో గ్రహించుటమనుష్యమాత్రులకు సాధ్యముకాకుండనున్నది. అదేదియయియున్నను మనము మనసృష్టికర్తయొక్క ఆజ్ఞలకు లోబడియుండుట మనవిధియయియున్నది.

ఇట్టిమహాప్రపంచములో మనసూర్యుడెంతపాటివాడు? మనభూలోక మెంతపాటిది? మనమెంతపాటివారము? మనముదానిలో నలుసులవంటివారముకాదా? గనుకమనము వినయవిధేయతలు గలవారమయియుండి మనుష్యులందరియెడలను సమస్తప్రాణులయెడలను సహాఅత్యంతానురాగము కలవారమయియుండి ఒండొరులకు సహాయము చేసికొనుచుండవలెను. అప్పుడుగాని మనజన్మమునకు సార్థకము కానేరదు.







# కవిత.

కాళ్ళపల్లి - అనంతకృష్ణశర్మచే వ్రాయఁబడినది.

లోకమున మనుజులందఱకును ముఖ్యముగ నానందమిచ్చునవి రెండు. ధనమును, విద్యయును. అందు ధనమస్థిరమగుటచే నందువలనఁ గలుగు నానందము చిరకాలమొకతీరున నుండదు. ఇఁక విద్యాధనమన్ననో యేనాటికిని దఱుఁగక సంపాదించువానికిఁ జిరకాలమింతంతనరాని సంతసముం గూర్చునది. అందుఁగూడ నితరశిల్పవిద్యలకన్న శాస్త్రములకన్న సుబోధమై మనోరంజకమై యభ్యసించున వెల్లర మున్ముందు కౌతుకము నొసఁగునది పరమమగు సాహితి. అట్టి సాహితి నేర్చినందులకేమిఫలము? కవిత!

ఏలాటి కఠినాత్ములైన వశీకృతుంజేయునదియు, నొంటరియల్పకవికిని మునుముందుగ నింకను రచియింపవలయునను నాసఁబుట్టించునదియుఁ, గర్తకును భర్తకును మనిసంతకాలము బ్రహ్మానందమును గూర్చునదియుఁ, జిరకాలము యశస్సుఁబోషించునదియు నగు కవిత ప్రభావముఁ బొగడ నెవరితరము? కాళిదాసుఁడు, భవభూతి, నన్నయ, తిక్కన మొదలగు కవిమణులును, భోజుఁడు, కృష్ణదేవరాయలు మొదలగు రాజపుంగవులును యశఃకాయులై చాలకాలమైనను నేఁటికిని మన కన్నులఁగట్టినట్లగపడుచుండుట యీ కవితామతల్లి మాహాత్మ్యమే కదా? అంతయేల? ఎక్కడనో దిక్కుమాలిన యొక గొల్లపువాఁడగు సాహిణి మారని పేరుగూడ మహారాజపుంగవుల నామముబలె నిప్పటికిని మనయాంధ్రులనోటఁ గీర్తింపఁబడుచుండుట వేములవాడ భీమకవి కవితశక్తిచేతనే కదా? ఇట్టి కవితనుగూర్చి మన యాంధ్రసోదరులతోడ నిపుడించుక యాలోచింతము.

సాధారణముగ నెట్టివారికిని గవితఁ జెప్పవలయునని యాశయుండును. పల్లెటూళ్ళలోనుండు కాఁపువాండ్రు సైతము దాముమోటఁగొట్టునపుడును దున్నునపుడును పాడుటకేలపదములల్లవలయునని ప్రయత్నపడుచుందురు. ఇఁక నొకటిరెండక్షరములు వచ్చినవారిఁ జెప్పవలయునా? అట్టి మోటువారు రచించునదియుఁ బండితులు రచించునదియుఁ కవితయేనా? కాదన్నఁ గవితయన నెట్టిది.?

వశ్యవాక్కగువాఁడు తనమనమున నుదయించు భావముల నితరుల మనమునకెక్క సరసముగ వాగ్రూపమున వెలయించుట కవితయనఁబడును. "అతఁడువచ్చె నితఁడువోయె"నని వ్రాయుట కవిత్వముగాదు. మనమాడుకొను మాటలనే విలక్షణమగురీతిఁ బద్యరూపమునఁగాని వచనరూపమునఁగాని చెప్పుట కవిత. ఇట్టికవితకుఁ బ్రతిభ ప్రధానమగు బీజము. ప్రతిభయనఁగాఁ జెప్పదగు పల్కులను రసము లొలుకునట్లు క్రొత్తక్రొత్తత్రోవల ముద్దుముద్దుగఁబల్కుటకు సాధనమగు ప్రజ్ఞ. ఇది మనుజునకుఁ బుట్టుకతో రావలయుఁగాని యొక్కరు బోధించుటచేఁగాని వ్యర్థముగ "ఘటపట"యని శాస్త్రముల వల్లించుటచేఁగాని రానేరదు. మనుష్యుఁడు కవియై పుట్టవలయుఁగాని, పుట్టి కవిగానేరఁడు. స్వతస్సిద్ధమగు ప్రతిభగలవాఁడు చిన్ననాఁటినుండి యేదైననొకటి యల్లఁజూచుఁగాని మిన్నకుండఁడు. అట్టివాఁడొక పద్దెమును జెప్పినను వగవముగఁ జెప్పును. సంపూర్ణముగ శాస్త్రపాండిత్యము సంపాదించినవాఁడైనను ప్రతిభలేకున్న నెంతప్రయత్నపడినను పద్దెమును వ్రాయుటకష్టము. ఒకవేళ నెట్లైన సాధింపవలయునని పట్టుపట్టి రచియింపఁ బూనినా యాకవిత నీరసమై చెఱుకు పిప్పివలె నుండును. ఇందుల కుదాహరణము కృష్ణదేవరాయలు. రాయలు రచించిన యాముక్తమాల్యదను జూచినవారికి సంస్కృతంబునను, ఆంధ్రంబునను అతనికిఁ గల్గిన యసమానపాండిత్యము తేటతెల్లమగును. ఇఁక నాగ్రంథములోని పద్దెములంజదువ నొరకొంటిమా వానినర్థము చేసికొనుటకుఁ బది నిఘంటువులు దగ్గరనుంచుకొనవలసి యుండును. కవితాశైలిని జూచినచోఁ బాటిపోవుదానిని బలవంతముగ వశపఱచుకొన్నట్లు స్పష్టముగఁ దెలియఁగలదు. అట్లే వేమనపద్యములను విమర్శింపుఁడు! అతనికిఁ బాండిత్యమత్యల్పమని యాతని పద్దెముల నొకమాఱుచూచిన బాలునకును దెలియకపోదు. ఇతఁడు జెప్పినట్లు చిన్నచిన్నపద్యములో నంతభావమునునించి యందఱకును దేటతెల్లమగునట్లు కష్టములేక చెప్పుట తలక్రిందు తపసుజేసినను ఏకృష్ణదేవరాయలకును సాధ్యముగాదు. ఈకాలమునఁగూడ నట్లు కేవల పాండిత్యముచేతనె కవితను వశపఱచుకొనఁజూచు మహామహోపాధ్యాయు లచటచటఁగలరు. అయ్యో! వారికవితాశక్తిచే నీకాలమున నాంధ్రసరస్వతి యెంతప్రౌఢత్వము వహించినదో చెప్పనలవికాకున్నది.

ప్రతిభగల్గి సరసముగఁ గవిత్వముజెప్పఁగలవాఁడు దాని నభివృద్ధిఁ జేయకుండుటయుఁ బాండిత్యముగల్గి ప్రతిభలేనివాఁడు బలవంతముగ దానిని స్వాధీనముజేసికొనఁ బూనుటయు ననుచితములు. మున్ముందు వృద్ధినొందక యాకవిత చెడును. పద్యము మఱిచినఁ జాలునని చెప్పుటచే నిదియును జెడును. కావున మనుజుఁడు తనకుఁగల కవితాశక్తిని సన్మార్గమున వినియోగించి యభివృద్ధి నొందింపవలయును. అట్లభివృద్ధి నొందించుటకు సాధనము లనేకములుగలవు. అందు మొదటిది.

### ౧. చక్కనిసాహితి.

సాహితియనఁగా నేభాషలోఁ గవితఁ జెప్పఁబూనునో యాభాషయందు నిర్దుష్టమగు జ్ఞానము. ఏపదమున కేయర్థమున శక్తి కలదో యేమాట నెట్టిచోటనుపయోగించిన నేయర్థము మారునో చక్కఁగ నెఱిఁగినఁగాని కవిత్వముఁ జెప్పఁబూనరాదు. ఇట్టిశబ్దజ్ఞానము వ్యా

కరణమును బాగుగ నభ్యసించినఁగాని కలుగదు. అందుగూడ మన హిందూదేశములో నేభాషలోఁ గవిత్వము జెప్పవలయునన్నను అన్నిటికిని మాతయగు సంస్కృతభాషను సలక్షణముగ నెఱిఁగియుండవలయును. సంస్కృత సహాయములేనిది దేశభాషలోఁ గవితనుడువుట సులభసాధ్యముగాదు. ప్రకృతము మన యాంధ్రభాషలో నచ్చతెనుఁగు శబ్దములెక్కువగలేవు. ఒకటిరెండున్నను వానినాదరించువారలరుదు. సాధారణముగ నిదివఱకును గావ్యములను వ్రాసినవారు నిప్పుడు వ్రాయుచుండువారును తెనుఁగుతో సమానముగ సంస్కృతమును వాడియున్నారు. కొన్నియెడల సంస్కృతపదము ప్రయోగించుటచే వచ్చురసము తెనుఁగుపదములచే రాదు. ఎంతమితముగ వాడినను పద్యమున నొకటిరెండుమారులైన సంస్కృతపదములు ప్రయోగింపకతప్పదు. శ్రీకృష్ణదేవరాయలవారు సభలో నడిగిన

"సంస్కృత సాహితీపటిమ చాలని వాని కవిత్వమేటికిన్?"

అనుప్రశ్నకుఁ దెనాలిరామకృష్ణకవి:—

"సంస్కృత సాహితీపటిమ చాలని వాని కవిత్వమేటికిన్", (అనఁగా ఏటఁబోవుననుట) అని యాప్రశ్నకె యుత్తరముగఁ జెప్పెనని యొకకథగలదు. ఇందలి సత్యాసత్యత లెట్లున్నను దేశభాషాకవితకు గీర్వాణభాషావ్యుత్పత్తి యత్యావశ్యకమనుట నీకథ స్పష్టముగఁ దెలియఁజేయుచున్నది. ఇతరకవుల ప్రయోగములవలననే యాజ్ఞానము సంపాదించుట యసాధ్యముగుసగి. ఏలయన నీకాలమునఁ గొందఱు పాణినియపరావతారులగు మహానుభావులవతరించి నూతనమార్గమున నవలలు, నాటకములు, దేశచరిత్రలు, మున్నగునవి రచియించుచు దేశాభివృద్ధితోఁబాటు భాషాభివృద్ధిఁగూడఁ జేయుటకై తెనుఁగున నేగాక సంస్కృతమునఁగూడ వ్యాకరణవిషయమునఁ గ్రొత్తత్రోవలు చూపిరి. వీరి పదప్రయోగములకును ప్రాతకాలపువాణిని మాత్రములకును నేసంబంధమునుండదు. అట్టివారి పదప్రయోగములఁ గొన్నిటి నిట వివరించుట యధికప్రసంగముగ నుండదని యెన్నెద.

"సునాయాసము, "అయిష్టము, "శ్రమావంతుఁడు, "అయోకరణము, "ప్రాముఖ్యత, "సమస్తదేశ విద్వాంసశిరోవేష్టనాగ్రభాగ, "ఛందోసూత్రము, "ఛందోత్పత్తి, "జాతీయతాభావము, "సౌభ్రాతృత్వము, "వికర్తనిబలె, "అంగజద్విషసమ్మన్యుఁడు, "అధికయశత, "లోకసామెతలు, ఇత్యాది......

అయ్యో! సంస్కృతాక్షరముల నొండురెండు నేర్చినవానికిఁ గూడ నీప్రయోగములఁగాంచినఁ దలచిటచిటమనకుండునా? సామాన్యముగ సాధునిఘలగు కొందఱి గ్రంథములలో నివి లెక్కకుమిఱి యున్నవి. ఇట్టితప్పుల కుప్పలగు గ్రంథాభాసములనమ్మి కవితఁజేయఁబూనువాఁడెంత వెఱ్ఱివాఁడు? తాఁజెడినక్రోతి వనమంతయుఁ జెఱిచె, నన్నట్లు ఈగ్రంథములు దాముజెడినదేగాక యిక ముందు కవితరచియించువారిఁగూడ నిదేత్రోవకులాగుచున్నవి. ఇందులకు నే నేప్రథమోదాహరణము. సంస్కృతమున నించుకంత పరిచయము సంపాదించియుంటఁజేసి యాంధ్రమునఁ బ్రజ్ఞయత్యల్పమైనను కవిత్వము జెప్పవలయునను పిచ్చిచే నేనురచియించిన "తారాదేవి, ఆంధ్రసుభాషిత కౌస్తుభము" అను చిన్నపద్యకావ్యములలో

"ఓరాజాత్మజ పల్కులేలనిక వేయుఁక్,

"అంతకుమున్నెయా మారసింగు తనతండ్రి లక్ష్మణసింగును,

"నినుగణియింపకన్ జడుఁడు,

అని యసంబద్ధముగఁ బ్రయోగించితి. ఇట్టిపెక్కుపొరబాటులకు ఆంధ్రవ్యాకరణమున జ్ఞానమల్పముగుటయు నాధునికప్రయోగముల నమ్మియుండుటయునె కారణములని చదువరులకు వేరుగఁ జెప్పవలయునా? కావున నికముందు కవితఁ జెప్పఁదలచువారు ప్రయోగకరణులగుటమాని సంస్కృతాంధ్ర వ్యాకరణములలో మంచిప్రజ్ఞ సంపాదింపవలయును. ఇఁక రెండవది.

## ౨. ఛందశ్శాస్త్రమున జ్ఞానము.

పద్యకవితకిది ముఖ్యము. వచనము వ్రాయువారికీ భాగముతోఁబనిలేదు. దీనినెఱుఁగకున్న నెట్టివాఁడును పద్యములను రచించుటకనువుపడదు. మనయాంధ్రకవితకు నితరభాషాకవిత్వమునకు బోలె నొకప్రాస నియమమేకాక యతినియమమును దప్పకుండవలయును. ఛందశ్శాస్త్రమునఁ బ్రవేశములేకున్న నేవృత్తమునకేమిలక్షణమో యెన్నిట యతియో ప్రాసనియమమెట్లో తెలియజాలము. నిర్యతిప్రాసములుగఁ బద్యములను వ్రాయరాదా? యని కొందఱందురేమో యదివట్టిభ్రమ. అటు వ్రాయుటచే నేమిలాభము? కవికిఁగష్టము తక్కువయయి యింకను రసపుష్టి గలుగఁజేయుట కనువగుననియా? కల్ల. రసపోషణమునకు యతిప్రాసములెట్లు నిరోధకములో యట్లే ఈచోట గురువేయుండవలయు, నీయెడలఘువేయుండవలయునని నియమముగల పద్యములు మాత్రమర్గళములేలకాదు? అట్లుతలఁచువారు సుఖముగ వచనము వ్రాయఁబూనవలయునేకాని పద్యములలో యతిప్రాసములు మాత్రము వలదని వాదించిన నేమిప్రయోజనమో తెలియరాకున్నది. ఒకవేళ నిన్ని నియమములను నిరాకరించియు వీరు ఒకనియమమును దప్పకుండ వ్రాసిన నన్నయ తిక్కనాదులవలె నొకపద్యమైన సరసముగఁ జెప్పఁగలరా? అట్లురచింప సమర్థులగు మహానుభావులెవరైననున్న వారికి నిర్యతిప్రాసపద్యము లనుకూలములగునుండుఁగాక! మనకీపిచ్చిభ్రమలతోఁబనిలేదు. మనవంటివారెన్ని జన్మముల, బ్రయత్నించినను నన్నయాదులలో నొకదశ సహస్రాంశమైనఁ దులఁదూఁగము. కావున మనయోగ్యతకుఁ దగినట్లు ప్రాచీననియమితమార్గము ననుసరించియే సరసముగఁ గవితఁ జెప్పుటకుఁ బ్రయత్నపడవలసినది కర్తవ్యము. ఇఁక మూఁడవది.

## 3. ఔచిత్యము.

తాను వర్ణించుకాలమునకును పాత్రములకును అవిరోధముగ వర్ణించి చెప్పుటయే ఔచిత్యమనఁబడును. ఏకాలమును

వర్ణించుసమయమున నేవిధముగఁ జెప్పఁదగునో యేయేపాత్రములకెట్టి గుణదోషములు వక్కాణింపవచ్చునో యెఱిఁగినగాని కవితఁ జెప్పఁబూనరాదు. శ్రీరామచంద్రుఁడు వధమువచ్చుకాలమున గడియారమున గంటలుజూచివచ్చెనని చెప్పుట యెంతహాస్యాస్పదముగ నుండునో కదా? మహాకవియగు క్షేమేంద్రుఁడు సంస్కృతమున 'ఔచిత్యవిచారచర్చ' యను గ్రంథము రచించి యందీవిషయమును జక్కఁగఁ జర్చించియున్నాఁడు. పాపము! మనవారికట్టి గ్రంథములు మనసునకే వచ్చుటలేదు. కవిత్వమువచ్చుటకు వాత్స్యాయన కామసూత్రములను బాగుగనభ్యసింప వలయునఁట! అత్యుక్తులు నతిశయోక్తులు మొదలగునలంకారాభ్యాసములచేఁ జదువువారికి దిక్కుతల కెక్కఁ గనఁబడిన స్త్రీనివర్ణించుచుండినఁ జాలును. సంస్కృతకవులు జూపినత్రోవనె మనయాంధ్రకవులును ద్రొక్కి దానినిమఱింత పెంచిరి. అదియేమి యోగదృష్టియో కాని వారి కెవనిత కంటఁబడినను దక్కినస్వప్నావయవములన్నియు నటుండ దొలుదొలుత జఘనకుచములే స్పష్టముగఁదోచును. ప్రాచీనులొక్కరైన నిట్టిమార్గము నవలంబించియుండిరా? వారిలోనౌచిత్యవిచారము సంపూర్ణముగ నుండెననుటకు వారిగ్రంథముల యౌన్నత్యమే ప్రబలాధారము. చూడుఁడు! నన్నయతిక్కనాదుల కవిత యంతగఁ బ్రశంసింపఁ బడుటకేమికారణము? అత్యుక్తులు నతిశయోక్తులును వారునేర్చియుండలేదు. చెవులకింపుగదోఁచు యమకాదులన్నచో వెదకినను గానరావు ఇఁక శ్లేషకల్పనలనునువారికిని బద్ధద్వేషము. ఉన్నదియున్నట్లులోకానుభవసిద్ధములగుమాటల నెవరినోటవచ్చునవి యట్లట్లే పద్యములనిమిడ్చి రసపుంజముగ జెప్పుటయేకదా వారికవిత యున్నతికిఁ గారణము? ఇంతకన్నఁ గావ్యమున కేమికావలయు? వారిమార్గమునే తరువాత నూతన మొదలగువారాశ్రయించిరిగాని రాఁగరాఁగ నాయౌచిత్యజ్ఞానము బుడమట్టు నశించి మందునకైనఁ గానరాకపోయినది. ఈకాలమునఁ గొందరభిమానులుప్రయత్నించి మఱలదాని నుజ్జీవింపఁ జేయుచున్నారని తెలుపుటకెంతయు సంతసమయ్యెడి.

ఇట్టియౌచిత్యజ్ఞానము జక్కఁగఁ నలవడవలయునన్న లోకానుభవము బాగుగనుండవలయు కావునఁ గవియగువాఁడు ప్రాపంచికమగు ప్రతివిషయమును జక్కఁగఁ బరిశోధించుచుండవలయును. తత్త్వమును విచారింపక తేఁటిపద్మంపెఁగనంటదనియు, కమలము సూర్యోదయమున వికసించుననియు, కువలయము ముకుళించుననియు, నొకరు చెప్పిన పిచ్చిమాటలనే విశ్వసించి మాటలుమార్చివ్రాయుటతగదు. ఎక్కువచమత్కారముగఁ జెప్పలేకుండినను స్వభావానుసారముగ నౌచిత్యమును మీఱక చప్పిడిమాటలతోఁ జెప్పినను బాగుగనుండును. ఇఁక నాలవది.

## ౪. సారళ్యము.

చక్కనిసాహిత్యజ్ఞానము గలిగి ఛందస్సెఱిఁగి యౌచిత్యజ్ఞానములవడియున్నను గవితలో సారళ్యములేకున్న నేకిని రుచింపదు. సారళ్యమనఁగా నన్వయకాఠిన్యములేకుండుట సరళముగనున్న సుమతిశతకమునందఱు నాదరించుదురుగాని చమత్కారమెక్కుడుగనున్నను సారళ్యములేమి నాముక్తమాల్యద నెవరును సరకుగొనరు. సారళ్యమున నపూర్వపదములనే ప్రయోగింపరాదని యర్థముగాదు. ఇక్కడనుండఁదగు పదమక్కడనుంచి యక్కడనుండఁదగు పదము వేరొకచోటనుంచి దీర్ఘసమాసములతోఁ బద్యము జెక్కనరించుట కఠినముగునుగాని యుక్తమగుచోట నెట్టికఠినపదము నుపయోగించినను సందర్భవశమున నర్థముగాకపోదు. అందరికిని దెలియునట్లురచింపవలయుననుపిచ్చి కవిమనమున నుదయింపరాదు. అట్లు ఏజన్మమునఁగాని రచించుటయసాధ్యము. ఏలయనఁ దెనుఁగునఁ బ్రవేశము తక్కువగఁగలవాఁడు సుమతిశతకమును వేమనపద్యములను సైతము కఠినములని నిరసించును. ఎంతటికఠినపదమైనఁ దఱుచు ప్రయోగించుటచే సులభముగఁదోఁచును. అట్లని గ్రంథమంతయు నిఘంటుసహాయముచేఁగాని యన్వయింపరాని పదములచే నించరాదు. సరళములగుపదములను తఱుచుగనుపయోగించుచు నడుమనడుమఁ గఠినపదములను గ్రమముగఁ బ్రయోగింపఁబూనవలయును. అనుపయుక్తములగు యమకాద్రిప్రాసములను రచియింపవలయునను పిచ్చియుండరాదు. ఏలయన యమకములను సరసార్థపదములచేఁ గూర్చుట సులభసాధ్యముగాదు. పద్యమున కలంకారముగ మనవారేర్పఱచిన నియతప్రాసమేచాలును. వలయునన్న సమయోచితముగ నర్థసందర్భము చెడకుండ వృత్త్యనుప్రాసము నచటచటఁ జొనుపవచ్చును. కఠినములగు సంధులను తెనుఁగునఁగాని సంస్కృతమునఁగాని ప్రయోగింపరాదు. అట్లుప్రయోగించిన సారళ్యమునకు భంగముగలుగుటయేకాక శైలియు వికటముగ కటుతరముగనుండును. ముఖ్యముగ నర్థగాంభీర్యమునకుఁ దోడు శబ్దసారళ్యము గూర్పనభిలషింపవలయునేకాని పదములలో గాంభీర్యము నపేక్షించుట కవితాలతకు మూలోచ్ఛేదమొనరింపఁ జూచుటయే.

ఇంకను జర్చింపవలసిన విషయము లనేకములున్నను చోటు చాలమిచే నింతట విరమింపనెంచితి. ముఖ్యముగఁ గవితాభివృద్ధికి "సాహితి, ఛందస్సు, ఔచిత్యము, సారళ్యము" అను నాల్గుసాధనములు ప్రధానములనుట యీయుపన్యాసమున ముఖ్యాంశము.

ఈవిషయములన్నియు నాంధ్రపండితులకుఁ గ్రొత్తవికావుగాన వారికినిది విన్నవింపలేదు. నావలె నల్పప్రజ్ఞచేఁ ద్వరపడి కవితఁ జెప్ప నుత్సహించు నాంధ్రమిత్రులెవరైననున్న నట్టివారికీవిషయము సౌహార్దమునఁ దెలుపవలయుననియే నాయుద్దేశము.

ఈవ్యాసమునఁగల కొన్నిమాటలచేఁ గొందఱికించుక వైమనస్యము గలుగవచ్చును. బాల్యచాపలమున సందర్భానుసారముగ వ్రాయవలసివచ్చినందులకు వారిసందఱిని దయయుంచి నన్ను క్షమింపవేఁడుకొనువాఁడ.

తే॥ గీ॥ అతులహర్షమునిడు మనినన్ని నాళ్ళు
తుదనెదటులేని సత్కీర్తినొదవఁజేయుఁ
జదువువారెల్ల మెచ్చఁగ చవులుగొల్పు
సరసకవితకుసాటి యీధరణిఁగలదె?॥

# ఆ రో గ్య శ శి క ళ.

మ.రా.శ్రీ, క్రొవ్విడి శేష వెంకట కాశీపతిగారిచే వ్రాయబడినది.

ఆరోగ్యమనఁగా రోగరాహిత్యము శశికళయనగా 16 పద్యములుగలది. ఆరోగ్యమును గురించిన పదియారుపద్యములు గలది గావున దీనికి ఆరోగ్యశశికళయని పేరువచ్చినది.

దేహారోగ్యంబె మొదలఁ * దెలియఁగవలయున్.

---

సీ. దేహధారులకెల్ల * దివ్యధనంబెన్న నారోగ్యమేసుఁడీ * యయ్యలార । కూలివారినిఁజేసి * కుడుచుపేదలభాగ్య, మారోగ్యమేసుఁడీ * యయ్యలార । కలినిఁదారిద్రునకైన * బలమునొసంగెడి, దారోగ్యమేసుఁడీ * యయ్యలార । చీకులేకుండఁగా * జీవింపఁజేసెడి, దారోగ్యమేసుఁడీ * యయ్యలార

తే. ముక్కుటయును మూల్గుటయులేక * నొక్కరీతి ।
నుక్కడీలవలెనుండి * చెక్కుఁజెదర ।
కుండ, రాళ్లనుఁదన్నెదర్ * పిండిగాఁగ ।
జూర, యారోగ్యమెంతటి * దయ్యలార॥ ౧.

సీ॥ స్థిరమైనబుద్ధిచే * దీపింపవలెనన్న, యారోగ్యమేఁగదా * యవసరంబు । తేటమాతెల్వియే * తిరపడవలెనన్న, యారోగ్యమేఁగదా * యవసరంబు । నిశ్చలజ్ఞానమే * నెగడఁగావలెనన్న, యారోగ్యమేఁగదా * యవసరంబు । జ్ఞాపకశక్తినే * సాధింపవలెనన్న, యారోగ్యమేఁగదా * యవసరంబు,

తే గీ దీనిఁబొందకఁగతియేది * దేనికైన ।
నన్నిటికిఁగూడ నిజమూల * మౌనుగాన ।
ప్రతిదినంబునుదీనిగా * పాడుకొనుచు ।
బ్రతుకఁగావలెరాజులున్ * ప్రజలుగూడ. ౨.

సీ. పుత్రఫలంబులం * బొందఁగావలెనన్న, నారోగ్యమేసుఁడీ * యవసరంబు । పుణ్యభూములఁజూడఁ * బోవఁగావలెనన్న, నారోగ్యమేసుఁడీ * యవసరంబు । గొప్పవిద్యలయందు మెప్పొందవలెనన్న, నారోగ్యమేసుఁడీ * యవసరంబు । సభలలో వక్తృ*వ, శక్తినివెలయింప * నారోగ్యమేసుఁడీ (యవసరంబు

తే॥గీ. సాముగరిడీలు నేర్వంగ * జాలుటకును ।
యీఁదులాటకు గుఱ్ఱము * నెక్కుటకును ।
కాలినడకనుఁ జిత్రముల్ * గాంచుటకును ।
అరయ నారోగ్యమేసుఁడీ * యవసరంబు॥ 3.

సీ॥ జపతపంబులకునై * స్నానమ్ము నొనరింప, నారోగ్యమునులేమి * ననువుపడదు । భక్తిగీతాధ్యాయ * పారాయణముఁజేయ నారోగ్యమునులేమి * ననువుపడదు । ప్రవిమలహృదయుఁడై * పార్థివంబొనరింప, నారోగ్యమునులేమి * ననువుపడదు । ఆజ్యంబు వమకూర్చి * యగ్నిహోత్రముఁజేయ నారోగ్యమునులేమి * (ననువుపడదు

తే.గీ॥ నిత్యనైమిత్తికంబుల * నిర్వహించి ।
పరముఁగాంచుటకునుని దే * వలసెతుదకు
దీనికిదెసాటి భువిలోనఁ * దెలిసికొనఁగ,
గాన దీనిని సమకూర్పఁ * బూనరయ్య॥ ౪.

సీ॥ ఘోరాటవులనుద * కుంజరంబులనైన * నారోగ్యకలిమిచే * నణఁచవచ్చు । క్రూరదృష్టినిఁగాంచు * క్రోల్పులినైనను, నారోగ్యకలిమిచే * నణఁచవచ్చు । కడుమోటుదైనయా * ఖడ్గమృగమునైన నారోగ్యకలిమిచే * నదమవచ్చు । మదగజంబును బట్టు * మకరేంద్రమునునైన * నారోగ్యకలిమిచే * నదమవచ్చు,

తే॥ తుదకు మృగరాజమైనను * తొలఁగుచుండు ।
ప్రవిమలారోగ్యశాలియా * భాగ్యశాలి ।
కన్నియుఁగరస్థమైయుండు * నవనియందు ।
గాన దీనిని సమకూర్ప * బూనరయ్య॥ ౫.

సీ॥ పాయసాన్నముగల్గి * భక్షింపలేరుగా, నారోగ్యమునులేని యట్టివారు । తీపుమిఠాయిలం * దినవల్లగాదుగా, ఆరోగ్యమునులేని * యట్టివారు । ఫలరసంబునుగ్రోలి * భరియింపలేరుగా, ఆరోగ్యమునులేని * యట్టివారు ; ఇక్షురసంబైన * యిష్టమౌమధువైన, ఆరోగ్యమునులేని * యట్టివారు

తే॥ ఊటలూరంగఁ గనుఁగొన * నొప్పుగాని ।
నోటఁబెట్టంగఁదగదుగా * కోటియున్న
ఫలముగల్గదు ఆరోగ్య * పదవిలేక ।
గాన దీనిని సమకూర్ప * బూనరయ్య॥ ౬.

సీ॥ శ్రీరామచంద్రుఁడా * ఘోరాటవులఁ దిగ, నారోగ్యమేఁగదా యాదరించె । పాండవులజ్ఞాత * వాసంబులనుగుంద * నారోగ్యమేఁగదా * యాదరించె । ఆలహరిశ్చంద్రుండు * పలుబాములనుబొంద నారోగ్యమేఁగదా యాదరించె । అలనలచక్రవర్తి దీశుఁ * డన్నిపాట్లనుబొంద నారోగ్యమేఁగదా * యాదరించె

తే.గీ॥ వాతశీతాతపంబుల * వలనిబాధ
నీళ్లపళ్లడితలనొప్పి * కాళ్లతీత
మొదలుగాఁగలవానినిఁ * బొందనీక
గాన దీనిని సమకూర్పఁ బూనరయ్య॥

సీ. అధికమౌలక్ష్మియా * యాంగిలేయులఁబొంద నారోగ్యతామ
హి * మాతిశయమె। అధికశౌర్యౌదార్య * మాజపానులఁ
బొంద। నారోగ్యతామహిమాతిశయమె। అధికధీచాతుర్య*
మాజర్మనులవొంద నారోగ్యతామహి * మాతిశయమె। పరి
షియా వారంత ప్రాబల్యమునుఁబొంద, నారోగ్యతామహి *
తే.గీ, కారణమునుండి భరతమ*మారుబూర (మాతిశయమె
మనముదానిని పూర్తిగా * మరచినాము।
తినుతుమన్నాము ఆరోగ్య * ధనములేక।
గాన దీనిని సమకూర్ప * బూనరయ్య॥　　౮.

సీ. మనవంటి మనుజుఁడే * యినుపగోలునుబట్టి లీలతోఁద్రెంచె
పు * టాలుమనఁగ। మనవంటిమనుజుడే ఘనశిలాఫలకమ్ము
గుండెపైగొట్టించు * కొనియునాగె। మనవంటిమనుజుఁడే *
మంచిపూలొబండిఁ నొడలనీడ్వండని * ఝుశియుకుండె। మన
వంటిమనుజుడే చనిబోనులోనికి పులినోటచెయిదూర్చి నిలచె
తే. మనమువానికిభేదమే * మనఁగవచ్చు (నహా
వానికారోగ్యజనితమా * బలముగలదు।
లేదు మనకదివెదకిన * లేశమైన
గాన దీనినిసమకూర్ప * బూనరయ్య.　　౯.

సీ. సేవకావృత్తిచే * జీవనమ్మునుఁజేయ నారోగ్యమునులేక నను
వుపడదు। వాణిజ్యమునమటుం * బమునీడ్చుటకునైన నారోగ్య
మునులేక * ననువుపడదు। చేతిపనులనేర్చి * భూతిఁగడపుట
కు నారోగ్యమునులేక* ననువుపడదు। భూమినిఁబెకలించి ప్రొ
ద్దుపుచ్చుటకైన నారోగ్యమునులేక * ననువుపడదు।
తే.గీ॥ వంటఁజేసెడి శక్తియు * వదలిపోవు।
తిరిపెమెత్తంగనైనను * దిరుగలేదు।
అన్నిటినఁగూడముఖ్యమై * నట్టిదిదియ।
గాన దీనిని సమకూర్పఁ బూనరయ్య॥　　౧౦.

సీ॥ ఆరోగ్యహీనుడై.* నట్టివానినిఁజూచి, తొలఁగిపోదురు ప్రజ
ల్ * దూరమునకు। ఆరోగ్యహీనుఁడై * నట్టివానినిఁజూచి, బం
ధుమిత్రులుగూడ * పరిహసింత్రు। ఆరోగ్యహీనుఁడైనట్టివానిని
జూచి, పెండ్లియాడినదైన విసుగుఁజెందు। ఆరోగ్యహీనుఁడై*
నట్టివానినిఁజూచి తల్లిదండ్రులు సహ * గొల్లుమందు
తే॥గీ॥ రకట ఆరోగ్యహీనమై * నట్టిబ్రతుకు।
బ్రతుకుకంటెను చచ్చుటే * పరమసుఖము।
యిన్నిటికిఁజూడఁగారణం * బిదియగాన।
దీనిసమకూర్చుకొనవేగ * బూనరయ్య॥　　౧౧.

సీ. కృతయుగం బుల్లవారు, వెతలేమియెఱుఁగక, నస్థిగతప్రా
ణు * లౌచుజనిరి। త్రేతాయుగంబున * నీతిపత్కీర్తుల,
మాంసమున్నప్రాణ్లు * మనెడివారు। ద్వాపరమ్మునచర్మ *
లోపమ్ములేనన్ని, రోజులుబ్రతికిరి * తేజమలర। కలియు
గంబందున * గలయట్టిమనకెల్ల, అన్నమయప్రాణు * లనఁ
తే॥గీ. యున్నవారలమీరీతి * వన్నెఁదొలఁగి। (గనొప్పి
కలకాలంబైనఁ దినుటకు * బలములేదు
కారణంబేమియారోగ్య * లిమిలేదు।
గాన దీనిని సమకూర్పఁ * బూనరయ్య॥　　౧౨.

. కటకటా! యేవాడఁ * గన్నెత్తిచూచిన, అగ్నిమాంద్యము
చేత * నడలువార। కటకటా యేసీమ * గాంచినప్పటికిని,
శుక్లనష్టములచే * సోలువార। కటకటా యేపల్లెకడకేగిచూ
చిన, శ్వాసకాసలబాధ * వడయువార। కటకటాయేదెసఁ
గనుఁగొనుచానున్న * సుఖరోగబద్ధులై సొక్కువారె,
తే.గీ. పక్షవాతములుబ్బులు * పాండువులును।
గుండెజబ్బులు రణములు * నిండియుండె।
· దివ్యతరమైనదేశమీ * స్థితికివచ్చె।
గాన నారోగ్యమును గూర్ప * బూనరయ్య॥　　౧౩.

సీ. ఆరోగ్యమందన * నాసక్తియున్నచో, దేహపరిశ్రమం * దీ
సికొనుఁడు। ఆరోగ్యమందున * నాస్త్రయున్నచో, మలిన
ములేనిండ్ల * మసలుకొనుఁడు। ఆరోగ్యమందున * నాసక్తి
యున్నచో, చిత్తసంశుద్ధినిఁ * జేసికొనుఁడు। ఆరోగ్యమం
దన. నాసక్తియున్న గో * నాహారమునమితి * నరసికొనుఁడు
తే॥గీ, మలినవస్త్రంబులనువీడి * మంచివలువ।
లనుధరింపుఁడు మేల్ సువా * గనలఁగొనుఁడు।
వ్యర్థవాగ్వ్రియవాదముల్ * వదలుకొనుఁడు।
కలుగు నారోగ్యమనుగొప్ప * ఫలముమీకు॥　　౧౪.

సీ. ఆరోగ్యమందున * నాసక్తిఁగలవారు, పైత్యరోగులచెల్మి *
బడయుఁదగదు। ఆరోగ్యమందున * నాసక్తిఁగలవారు, అం
టురోగులపాలి * కరుగఁదగదు। ఆరోగ్యమందన నాసక్తి
గలవారు బాలసూర్యునియొండ * బడుటతగదు। ఆరోగ్యమం
దున * నాస్త గలవారు ప్రేతధూమముసోక * వీలుపడదు
తే. రేయి ధధ్యన్నభుక్తినిఁ * జేయరాదు।
మత్తువస్తువులనుదిన * మరగరాదు।
· తనకుమించినఁ బెండ్లాము * దలఁపరాదు।
కలుగునిట్లున్న యారోగ్య * ఘనఫలంబు　　౧౫.

సీ. ఆరోగ్యమందున * నాసక్తియున్నచో, నియమింపఁబడినట్టు
నిద్రఁబొందు। ఆరోగ్యమందన * నాసక్తియున్నచో లఘు
వైనహారము * లందినుండు। ఆరోగ్యమందున * నాసక్తి
యున్నచో, నధికమామిధునేచ్ఛ * వదలుకొనుఁడు। ఆరోగ్య
మందన నాసక్తియున్నచో స్నానపానంబుల * శ్రద్ధగొనుఁడు
తే. త్రాగుఁబోతులదొంగలఁ * దాప్పకొండ్ర।
కఠినచిత్తులలోభులఁ గలయఁబోక।
మంచిగాలినిసుజనుల * మరువకున్న।
గలుగునారోగ్యమనుగొప్ప * ఫలముమీకు.　　౧౬.

(ప్రమాదములు మన్నన్నీయములు)

# భారతసంఘ పారిశుద్ధ్యత.

అమూల్యమ్మ చౌదరిచేత వ్రాయబడెను.

---

ఈయంశము గంభీరతయందు మహాసముద్రమునుబోలి, చొచ్చుకొలది లోతును, తఱచినకొలది తలంపులేజనించుచు, దరినినిలచి చూచువారికి విస్మయమును, అజాగ్రతపరులకు ప్రమాదమును పనిచేయువారికి కష్టతరమును, మెట్టెక్కినవారి కత్యానందమును గలుగజేయజాలినదిగానున్నది. అయిననుదీనియందు, కనుగొనినమార్గముల ననుసరించినవారు పనిచేయుచును దారితప్పినవారు తీరనికష్టములనొందుచు జ్ఞానవంతులు నూతనోపాయములను కనిపెట్టుచులోకజీవనమును గడపుచున్నారు. ఈవిషయమందనేకులు విశేషపరిశ్రమచేసి, పెక్కుగ్రంథములనువ్రాసి దురాచారపిశాచమును పారదోలుటకై పెక్కు ఇడుములనొంది యక్రమజనసంఘ మహారణ్యమధ్యమున సురక్షితమగు దారినిజూపు సానవాలరాళ్లవలె నిలచియున్నారు. కొనమార్గమును గనుట మందధికశ్రమపడవలసిన యవసరముకొనము. పైమార్గము నవలంబించి యందరునడువబూనినక్రమముగా, కాలిబాటలు, రాచమార్గములేర్పడి, మానవసంఘమునకు సౌఖ్యముకలుగును. నీటియావిరిబలమును కనిపెట్టిన జేమ్సువాట్ అనెడి యాంగ్లేయబాలుని యూహల ననుసరించియేకదా పొగబండ్లు పొగయోడల సౌఖ్యములను ప్రజలుచూచుచున్నారు!

ఇపుడు మనమునీవిషయమున జేయదగినది ఘనులగు మనపూర్వికుల ననుసరించుటయుగాక వేరేమున్నది? ఇపుడుగౌరవార్హులగు మనపూర్వికులమార్గము లేవియోజూచి పూర్వము, జనసంఘమనేమి? అదియిట్లపరిశుద్ధ మగుటకు కారణములేవియో యోచింతము.

సంఘమనుమాట చిన్నదయినను, అదిబహుజనుల నడవడులను, ఆచారములను తెలియపరచుచున్నది. ఏదేశమందలి యెట్టిసంఘమయినను, ఆయాదేశస్థుల జీవితముల సమూహముగదా! మనుజులలో నొక్కొక్కరియందు స్పష్టపడనిగుణములు సంఘమునందుస్పష్టముగా గనపడును. జనులప్రవర్తనలు సాధారణముగా యుక్తమయినవియై, వారు వృద్ధిదశలోనున్న సంఘము వృద్ధినొందుచున్నదనియు లేనియెడ ఆజనసంఘము చెడినదనియు చెప్పుదురు.

సంఘములను క్రమపరచి వానియందలి యపరిశుద్ధతను దొలగించుసాధనములు మనయందేనిలచియున్నవి. శత్రుసంహారమునకై వినియోగింపవలసిన ఆయుధములను బంధువులు, స్నేహితులపై వినియోగించెడి బుద్ధిహీనునివలెను కేవలము వినియోగింపకున్నందున త్రుప్పుపట్టి ఆయుధములు చెడిపోవగా, శత్రువు నెదిరింపలేక వారికిలొంగిపోవు యుక్తిహీనునివలె యుక్తాయుక్త ప్రవర్తనెరుగని యనేకులు చెడిపోవుచు, తమసంఘములకు చేటును, సిగ్గును కల్గించుచున్నారు. మానవుడు చేయవలసిన దంతయు వానియందలి మనోశక్తులను వృద్ధినొందించుట క్రమముగ వినియోగించుటయే. మానవునకు సృష్టియంతటికంటె యమూల్యమయిన ఆత్మశక్తులును మృగములవంటి శరీరమునను గ్రహింపబడియున్నందున, విషయసుఖములు నరునికి మృగసామాన్యములుగనున్నవి. కాన మనుజునిలో నున్నయీరెండు గుణములకు పోరాటమున్నది. ఆత్మశక్తులు, శరీరాశలతో బోరుచునేయుండును. వీనిలో నేదేనియొకదానికి బలముతగ్గువరకు నీపోరాటముడుగకుండును. వెలుగునుకప్పుటకు చీకటియు, ఆరోగ్యమును చెరచుటకు రోగాంకురములు, పంటలనుపాడుచేయు శలభములను బోలి సృష్టియంతటియందును శుభప్రదములయినవానిని చెరచుఅంకురములు సహజముగ జనించుచున్నవి. నరునిజ్ఞానశక్తులతో బోరాడు అజ్ఞానాదులును, వానిసౌఖ్యమునకై నిర్మింపబడిన ఇంద్రియము లుద్రేకించుటలోనే జనించుచున్నవి. అవియేమనుష్యుని తప్పుదారికీడ్వబూనుచుండును. అదియేనరుని యుద్ధకాలము. దానినివాడలక్ష్యపెట్టెనేని ఆత్మశక్తులు తక్కువయి మాంసేచ్ఛలుప్రబలి నయనియుక్తాయుక్త వివేచనను నశింపజేసి అపరిశుద్ధతను కలిగించును. ఇట్టియపజయమె మానవసంఘముల క్షుద్రప్రవర్తనలను రూపుమాపివారిని, త్రాగుబోతులలెక్కకును, వేశ్యాప్రియులనుగను, జూదరుల పొత్తునకును జేరిచి, వారిమర్యాద, పేరు, ప్రతిష్ఠలు యుక్తప్రవర్తనలను కొల్లగొనును. అంతటినుండి నరుడు తానేలవలసిన మాంసాపేక్షలకులోనయి పరతంత్రుడగుచున్నాడు. "రాజ్యము నేలువానికంటె తన్నుదానేలుకొనువాడు (ఇంద్రియ నిగ్రహపరుడు) శ్రేష్ఠు"డనిజ్ఞానియయిన సాలోమోను చెప్పుచున్నాడు.

కష్టములకు బుట్టినిల్లయి మానవగౌరవమును బూర్తిగబాడుచేయు అపరిశుద్ధతకు మనుజులెట్లు లొంగిపోవుచున్నారో యొక్కింతయాలోచింతము. ఎరనుజూపి మీనముననుబట్టెడి గాలమువలెనే, మానవుని కుపద్రవకరమగు లోకవాంఛలు అమృతప్రాయములుగ దోచి వానిఇంద్రియములను లోబరచుకొనుచున్నవి. మధురాహారములయందు యిష్టమును, చేదుపదార్థములయందు వెగటును బొలునవకలిగించునది వానిరసనేంద్రియమేగదా! మృదుమధుర స్వరసములు సంభాషణయందు ప్రీతిని గొల్పునది శ్రోత్రేంద్రియమేగదా! వింతరంగులు వింపొనర్చునది నేత్రేంద్రియమునకుగాదా! నరుని కీసంతసౌఖ్యముల నొసగుచున్న యీయింద్రియములే, లోకవాంఛలను గాలములదగిలికొని నరునకుపెక్కుకష్టముల గల్గించుచున్నవి. కంటికింపగునవి అనుభవింపవలెనని యెందరో దులాబి ఖర్చులనుచేసి, అనవసరములగు భోగములయందువారిడబ్బునువినియోగించిబీదలగుచున్నారు. అనీతివాక్కులను, కథలనువినిన బాలురదుష్ప్రవర్తనయు, మోసగాండ్లపలుకులువిని పొందుచున్నకష్టములు, మతమును దైవజ్ఞానమునుగూడ నాశనముచేయగ అసాధులవాదనలు, వినుటవలననేగదా సంభవించుచున్నవి. బుద్ధి

H. H. Saltanah Jahan Begum.
Begum of Bhopal.



సుల్తానా జహాన్ బేగం. భోపాలు బేగం.

The Casket Presented by the Bombay
Municipality to H. I. M. George V.



బొంబాయినగర పారిశుద్ధ్య సంఘముచే
శ్రీజార్జిసార్వభౌమునకొసంగఁబడిన వెండి కరండము.

H. H. Maharaja i-Rajagan Bhupendra Singh Mahendra Bahadur. Maharaja of Patiala.



మహారాజ-ఇ-రాజగా౯ భూపేంద్రసిం హ మహేంద్ర బహాదూర్. పాటియాలా మహారాజా.

H. H. Maharaja Tukoji Rao Balasaheb Holkar. Maharaja of Indore.



మహారాజ తుకోజిరావు బాలాసాహెబ్ హోల్కారు. ఇందూరు మహారాజా.

H. H. Maharao Raja Sir Raghubir Singh Bahadur.
Maharaja of Bundi.



మహారావు రాజా సర్ రఘువీర సింహ బహాదూరు.
బుంది మహారాజు.

H. H. Maharaja Sir Bhunwar Pal Deo Bahadur.
Maharaja of Karauli.



మహారాజ సర్ భానువరపాల దేవ బహాదూర్.
కరౌలీ మహారాజా.

H. H. Jam Shri Ranjit Singhji.
Jam of Jamnagar.



జామ్ శ్రీ రంజిత్ సింహజీ. జామ్నగరు జామ్.

H. H. Maharaja Sir Venkataramana Singh Bahadur.
**Maharaja of Reeva.**



మహారాజ వెంకటరమణసింహ బహదూర్.
రీవా మహారాజు.

శ్రీమతి అమూల్యమ్మ చౌదరిగారిచే వ్రాయబడినది.

మంతుడగువాడు ప్రతివిషయమును సమబుద్ధితో విమర్శించునని పెద్దలుచెప్పుచుండగాను, కీడెంచిమేలెంచినయెడల, చెడుగుకంటెలాభములే యధికములైయున్నవి. నరునినీతివర్తనమునకు, మనస్సంతోషమునకు, సౌఖ్యములకు నివియెప్రధానములని గానిపించుచున్నవి. సుఖముల కొఱకయినను దుఃఖములకును మార్గమని అవయవముల నాశనముచేయవచ్చునా? వెలుగువేడిమినిచ్చి చలినిదీర్చి భోజనాదుల పచనచేయుచున్న నిప్పు ప్రమాదమువలన దేహగేహములకంటె నష్టము కల్గించునని యగ్నినినాశనముచేయు బుద్ధిహీనుడుండునా? తలగుడ్డచుట్టలేక తలనరికయున్నట్లు, సామర్థ్యములేక ఇంద్రియములపై నేరమారోపించుట యేమిజ్ఞానము? ఇట్టిస్థితియందు నరుడుచేయదగిన కర్తవ్యమేమియని యోచింప- అక్రమమునువిడచి క్రమమును గైకొనవలెనని కనబడుచున్నది. అదియె మానవుని శ్రేషతయును వానివిధియునైయున్నది.

మానవుని విధియిదియనియు వాడునడువవలసిన మార్గమిదియనియు, నొకరుచెప్పకుండనే గ్రహించుటకు జ్ఞానసముద్రుడగు అనంతదేవుడు, మానవునకు అంతరాత్మనిచ్చియున్నాడు. అబోధయే యెల్లమానవులయందు లిఖింపబడియుండుటచే విద్యానాగరికతలులేని మోటుప్రజలుగూడ జారచోరాది కార్యములు తప్పనియెరుగుదురు. అబోధకనుకూలముగా నడచువాడు, తన్నుతాను వృద్ధిచేసుకొనువాడును తోడివారికి మేలుచేయువాడునై యుండి ఈశ్వరప్రీతిని పొందును. అట్టివాడె దైవమానవులతోడి సంబంధముగలవాడు. దేవునకు పుత్రుడును తోడివారలకు సోదరుడైయుండి ఆబంధుత్వమును కాపాడువాడు. ఇదియె దైవమానవసమ్మతమును సర్వమతములు నంగీకరించు ముక్తిమార్గము. ఈరెండువిధులే ముక్తిమార్గరహస్యసూత్రమని యేసుక్రీస్తు సెలవిచ్చుచున్నాడు.

దీనివలన మనుజుడు యుక్తప్రవర్తనుడయి బ్రదుకుట దైవమానవసమ్మతమని తెలియుచున్నదికావున, నరుడుఆత్మశక్తులను జ్ఞానమును నీతిని ఒక్కదానికొకటి సహకారులగునటుల వృద్ధినొందింపవలెను. విద్యాహీనునికంటె విద్యావంతుడు గౌరవింపబడుటయు, నీతిమాలినరాజుకంటె సత్ప్రవర్తనుడగు పేదవాడు ఆదరింపబడుటయుచూడగా, శరీరమానసలాభకరములగు మనోశక్తులను నీతినివృద్ధిపొందించు ఆత్మశక్తులను నరుడు వృద్ధిపొందింపవలసియున్నది. నరునిజ్ఞానశక్తుల వృద్ధిక్షయములకు ప్రపంచమునందుకొన్ని సహాయములున్నవి. అవి వాని యనుదినజీవనమునకు సంబంధించియుండును. వానిలో కొన్నిటి నిచట పేర్కొనెదను.

1. బాల్యమునందు ఇంటిలో బాలకునిబ్రతుకు- 2. స్నేహము- 3. పుస్తకములు- 4. కూటములు- 5. ఆచారములు. ఇవియె మానవుని మానవసంఘమును అపరిశుద్ధపరచుటకును క్రమపరచుటకును సాధనములైయున్నవి.



1. బాల్యావస్థ;—మానవసంఘము రాబోవుతరమునయెటువంటిదిగనుండునో యీతరపుపిల్లలనుజూచి చెప్పవచ్చును. వారు పెరిగిలోకమునకుపచరించుటకో లేక తమదేశము, సంఘమునకు సిగ్గులచేటయి నిలచుటకో బాల్యమునసిద్ధపడుచున్నారు. "బాలునికి వాడునడువవలసిన త్రోవలనభ్యసింపజేయుము. వాడు ముసలివాడయినను దానినుండి మరలడు" అనిసొలొమోను జ్ఞానిచెప్పుచున్నాడు. "ఏదేశీయుల గుణాగుణములయినను వారిబిడ్డలస్థితిగతులనుబట్టి పోల్పవచ్చును" అనిలారను పండితుడు చెప్పుచున్నాడు. "ఆశ, ప్రేమ, సౌమ్మతియును వానినిగురించి బోధించుటకై దైవము బిడ్డలనొసగియున్నాడని" మరియొక పండితుడువ్రాయుచున్నాడు. "చిన్నబిడ్డలను నిషేధింపక రానీయుడి వారుగదాస్వర్గలోకమునకు స్వతంత్రులు" అనియేసుప్రభువు సెలవిచ్చుచున్నాడు.

బుద్ధిమంతులగు తలిదండ్రులు తమబిడ్డలనిమిత్తమై తాముత్తరవాదులనితలచి, తమబిడ్డలయందు గ్రహణశక్తులు కల్గుటకారంభించినదిమొదలు వారినిదిద్ది వృద్ధిపరచి లోకోపకారులనుగ జేయుచున్నారు. వారికిపసితనమునుండి వేళకు భోజనపానముల నిచ్చుటకు, నిద్రపుచ్చుటకు, ఆడనిచ్చుటకు అలవాటుచేసి వారికిక్రమమును నేర్పుదురు. వారుఅన్నివిషయములందును మర్యాద శుభ్రము మొదలగునవిపట్టుబడునటుల జేయవలెను. న్యాయము నమ్రతసత్యము మృదుత్వమును అలవడజేయవలెను. వారితో సంభాషించునప్పుడు మంచిసంగతులనుచెప్పుటకు, వారుమంచిపనులను జేయుటకును వారినిప్రోత్సాహపెట్టవలెను. మనదేశమందు పసితనముననే బిడ్డలకుబూతుమాటలనునేర్పి, వారామాటలుపలుకుచుండగా వినిసంతసించు అవివేకపు తల్లిదండ్రు లెందరుగలరు? ఉగుపాలతోనేర్చిన యీదుర్మార్గపుమాటలనిన భయము సిగ్గులేక, వీధులవెంబడి, మాటలాడుకొనుట వినగానెంతటివారికైనను హృదయము కంపమొందునుగదా!

వారికి మితవ్యయముమున్నగునవిపిన్నవయస్సునుండిఅలవడజేసినయెడల, వారుపెద్దవారయినవెనుక క్రమప్రవర్తకులగుదురనుటకు సందేహమా? మనదేశములో 7, 8 యేండ్లయీడువచ్చువరకు బిడ్డలను దిసమొలలతో నుంచుటయు, బిడ్డలయెదుటనే పెద్దలుచేయు అపవిత్ర సంభాషణలును పిల్లలమనసుల నెంతపాడుచేయును! ఈవిషయములందు బాలురను క్రమపరచుట దేశమునకు గొప్పలాభకారియగును. అటుగాక పిల్లల యిచ్చవచ్చినట్లెల్ల బోనిచ్చుచు వారిని అదుపు ఆజ్ఞలేక పెంచినయెడల, అగడమునేరిచి అవిధేయులు, సోమరులు, మంకువారునై వీధులవెంబడి అల్లరిచేయుచున్న బాలసమాజము నిత్యము మనకన్నుల బడుచునేయున్నది. వారుపెరిగి యెట్టివారగుదురో సులువుగనిశ్చయింపవచ్చునుగదా! కృషిశాస్త్రము నేర్చినవారు పెరిగినచెట్లయందుగాక మొలకలయందును గింజలయందును జేయుచున్నపనివలన, వ్యవసాయము ఫలములవృద్ధినొందుచున్నవిగదా! యటులనే చిన్నబిడ్డలయందు క్రమముగ పనినారంభించిన సులువుగను నిరాటంకముగను

జరుగునుగదా! అట్టివారికై బాలసమాజముల నేర్పరచి మనవారేల పనిజేయరాదు? మనదేశమునందు ప్రఖ్యాతిజెందియున్న దాదాభాయి నౌరోజీగారు, తనఖ్యాతియంతయు దల్లికే జెల్లునని, తన్ను సన్మార్గమున నడిపిన తల్లినిగూర్చి చెప్పుచున్నారు. అటులనే అనేకులు ఘనులు తమవృద్ధికి తమతల్లులే కారణమని చెప్పుచున్నారు. నిశ్చయముగా తండ్రితోగాని తదితరబంధువులతోగాని లేనిసంబంధము తల్లితో బిడ్డకున్నది. అదివారి జన్మతోడిదె, వారుగర్భమున నుండునపుడు తల్లియూహాపోహ లెట్లుండునో వారు పెరిగినవెనుకను ఆగుణములే వారియందు కానవచ్చునని చెప్పుచున్న పండితులవాదనలు సహేతుకములేగదా!

ఈసత్యమును ఆయాచరిత్రలనుబట్టి తెలుసుకొనవచ్చును. కాన తల్లిలక్షణములు బిడ్డలకలవడుననుటలో నాశ్చర్యములేదు. పిల్లజన్మించినదిమొదలు హెచ్చుగ తల్లియొద్దనేకదా బ్రతుకుచుండును? బిడ్డల కనుకరణశక్తివిస్తారముగుటచే వారుతల్లిప్రవర్తన ననుకరింపుచుందురు. ఆవయస్సులో తల్లియే వారికొక విద్యాగురువుగానున్నది. ఇట్లుమానవుల నడవడులకును వారివృద్ధికిని ఆధారమగు స్త్రీ మూఢదశలోనుండే బిడ్డలెటౌన్నత్యదశనొందగలరు? విద్యాహీనురాలయిన తల్లిబిడ్డ నెటుల క్రమశిక్షలోబెంచును? బాల్యవివాహ దురాచారమువలన, పసితనపుబుద్ధులె యింకప్పగవిడువని 14 గేండ్లవయస్సుగల బాలికలు తల్లులైయుండుట తటస్థించినవారు తమబిడ్డల నెటులదిద్దగలరు? కానదేశాభివృద్ధికి స్త్రీయభివృద్ధి నెయ్యపు జెలియైయున్నది. స్త్రీకివిద్యయు, స్వాతంత్ర్యము నిచ్చినగాని దేశముబాగుపడదు. తాము తమబిడ్డలును ఔన్నత్యదశకు రాగోరుచున్న హిందూపురుషులు, తమతోడివారును తమవృద్ధికి సౌఖ్యములకు అధారులునగు స్త్రీల నుప్రబలనీయకుండుటజూడగా, చెట్లవేరును నాశనముచేయుచు వృక్షఫలముల కెదురుచూచినట్లేయుండును. ఆంగ్లేయజపానుదేశముల వృద్ధికేదికారణమో యొక్కింతకన్నులెత్తిచూడుడు. వారలస్త్రీలు పురుషులకెట్టుచేయూతయైనిలచి వారికి మంచివిషయమునందు సహాయులుగను, బిడ్డలపురోవృద్ధికి కారకులైయున్నారో చూచి యీదేశపుస్త్రీలకు సహాయముచేయుడు.

2. స్నేహము:— ఇంటిలో వృద్ధినొందిన బాలుడు ఇకప్రపంచములో పెరుగవలసియున్నాడు. తలిదండ్రులను ఇంటిని విడువగానే వానితో చెలిమిచేయు స్నేహితులతో వానిజీవనముండును. నీస్నేహితులెట్టివారో జెప్పిన నీవెట్టివాడవగుదువో చెప్పగలనని యొకపండితోత్తముడు చెప్పుచున్నాడు. బాలునివృద్ధిచేయునదియు స్నేహమె. వానినాశమార్గమునకు దించునదియును స్నేహమె. కావున బుద్ధిమంతులగు తలిదండ్రులు తమబిడ్డలెట్టివారితో స్నేహము చేయుచున్నారో జాగ్రతగాకనిపెట్టి, దుర్మార్గులనుండిదూరపరచవలయును. చెడుస్నేహములు బిడ్డలనడవడులనుచెరచి, యింటియొద్ద తల్లిదండ్రులకష్టములను నష్టపరచి, వారిని సురాపానము, జూదము దుర్మార్గవర్తనము మున్నగు దురాచారములపాలు చేయుచున్నవి.

3. పుస్తకములు:— పిమ్మటబాలుడు విద్యనేర్చుకొనబడికిపోవుచుండుటలో తోడిబాలురతోడి స్నేహమందు జాగ్రతపడుచుండవలెను. బాలురు కథలుచదువుచుండుట కెక్కువ యిచ్ఛయింతురు. వారెట్టిపుస్తకములు చదువుచున్నారో జాగ్రతపడవలెను. నీతిమాలినవియు బాలకులను దుర్మార్గమునకు ద్రిప్పగల చెడుకథలున్నపుస్తకములు వారికిదొరకనీయరాదు. దొరతనమువా రట్టిపుస్తకములరూపుమాపిన దేశమునకు గొప్పమేలుకలుగును.

కూటములు:— ఇవిబాలురవృద్ధికి సహాయములైయున్నవి. సమాజములు, నీతికిమానవుల ప్రోత్సాహపెట్టునుగాని నాటకశాలలు, భోగపుమేళములు మొదలగువానికడకు బాలురనుబోనీయరాదు. వానియందలి అపవిత్రపు పాటలు ఆటలు వారిమనస్సులను చెరచును.

ఆచారములు:— ఒకదేశమునకు మేలుచేసిన ఆచారములు మరియొకదేశమునకు నష్టమునుకలిగించునవియు, ఒకకాలమునకు సరిపడినవి మరియొకకాలమునకను కూలింపకుండుటయు చూడగా, యుక్తాయుక్త వివేచనగలనరుడు, తనప్రవర్తనకు నీతిబ్రతుకునకు ఆధారములును, స్థితిగతుల ననుసరించువానినే అవలంబించుచుండవలెను. మనవారు అప్పటిస్థితిగతులకనుకూలముగా నేమిచేసిరో దానినే మనవారును, అనుకూలములు ఫలితములు కనిపెట్టకచేయుచున్నారు. ఒకరుచేసినది మరలమరల చేయుటయె అనుకరణము. ఇటులఅనుకరించుచున్నదియె ఆచారమగును. మనవారు మహమ్మదీయప్రభుత్వ మహిమచే, స్త్రీలను పైకిరానీయకుండవలసియుండెను. అందుచేత బాలికలకు విద్యనేర్ప వీలుగాకుండెను. బాల్యముననే వివాహములుచేయుటయు ఆవసరముగా అప్పటి స్థితిగతులకుదోచెను. విధవాపునర్వివాహమున కంగీకరింపని కొందరు పతివ్రతాతిలకములగు నారీమణుల ననుకరించుచు, బాల్యవివాహములుచేసి, లోకమునెరుగని పసిబిడ్డలు విధవలుకాగా వారినిపైనిబంధనలకు లోబడజేసి, నీచవృత్తులప్రవేశపెట్టి యెన్నియో కడగండ్లపాలు చేయుచున్నారు. వారికిమరల వివాహముచేసినకలుగుఆచారభంగమునకోర్చుకొనక, యెన్నిశిశుహత్యలనైనను భరించుచున్నారు. ఈవిషయమున దేశమున కుపకారముచేయ బద్ధకంకణముగట్టుకొనిన, వీరేశలింగము పంతులుగారి ప్రయత్నములుకష్టములు స్త్రీలపాలిట కొంతసహాయమును చేయగలిగినను దేశమునకింక బూర్తిగ సహాయము కలుగనీయక ప్రతికక్షులవారింక మానకప్రయత్నములను చేయుచున్నారు. ప్రస్తుతము విద్యాధురీణులగువారు ఇట్టిదు

రాచారములను మాన్పుటకు ముందంజవేయుటకు, మాలనున్న మన లమ్మలభయమున సాహసింపకుండిన దేశమెట్లు బాగుపడును? ఇక మనదేశమున ఉపకారులు కావలసియున్న పడుచువారిని వేశ్యలను నాశనపుగోతికీడ్చు వేశ్యలయందలి గౌరవమునుతగ్గించి అట్టివారలవృత్తితగ్గించినగాని దేశమువృద్ధిలోనికిరాదు. మనదేశస్థులు తమస్త్రీలను స్వాతంత్ర్యము, విద్య, సంగీతములయం దభివృద్ధినొందనీయక మనస్సంతోషములనిచ్చు నీవిద్యలను దుర్మార్గవర్తనులగు భోగమువారి పాలుచేసి, వారలను పెండ్లిండ్లాది శుభకార్యములందును భక్తిరసములుగ నుండవలసిన మతసంభ్రమములందును వారలగారవించి, వారి నృత్యగీతాది యభినయములచే నాకర్షింపబడిన పడుచువారు తమకుటుంబములను, మర్యాదనుమరచి వారికివశ్యులై యింటిని భార్యల యొంటిని గుల్లజేసి, సంసారసుఖములు బిడ్డలసంతోషములు నాపాడు స్త్రీలపాలిటబెట్టి, పాడగుచున్నారు. తుదకువారి యవస్థలను అంగడివీధులు, వేశ్యలయరుగులు, ఔషధశాలలు, వారుబిచ్చమునకై తిరుగుచున్న యిండ్లలోనున్నవారును యెరుగుదురు.

ఇంకను మనదేశములో నిట్టిసంఘదురాచారము లెన్నియోగలవు మర్యాదక్రమము నెరుగనివారిని బూతులన్నతప్పను యభిప్రాయమే నశించియున్నవారిని, అన్యాయములకుజంకక పరధనాపేక్షులగువారల నెందరినో చూచుచున్నాము. కొన్నియాత్రలయందును మూఢమతాచారములందును మూఢసంభ్రమములందలి దుర్మార్గవర్తనము చెప్పుటకైనను, తలచుటకైనను సహింపగూడని హేయముగానున్నది. అట్టిదురాచారము లెందరి మానవతులనో పాడుచేయుచున్నవి. దేశాభివృద్ధినిగోరు ప్రతివారును పైదురాచారపిశాచముల నన్నిటినివెనకి నిర్మూలపరచిననేగాని సంఘముపవిత్రము గానేరదు. కాబట్టి మానవజన్మమెత్తినవా రందరును సమవిధిని నెరవేర్చుచులోకముయొక్క సుఖదుఃఖములు తమవిగానేభావించి సంఘాభివృద్ధికై పాటుపడవలెను ఏదేశస్థుడయినను ఆజనసంఘము వృద్ధిలోనికివచ్చిన వాడును వృద్ధినొందును. సంఘముపరిశుద్ధతగలదయిన వాడునట్టి స్థితినేయనుభవించును. తోడిమానవులతోడిదే తనసుఖాభివృద్ధి యనియు తనతోడివారి క్షేమార్థము తానుజేయవలసిన కార్యములనే కనులున్నవని బుద్ధిమంతుడు గ్రహించును. లోకములో తృణము మొదలు మహామేరువువరకునున్న సృష్టియంతయు స్వలాభమునకుగాక పరోపకారార్థము జేయబడెనని సృష్టియావత్తు ఘోషించుచున్నది. సృష్టిలోనాధిక్యుడగు నరుడిక నెంతలోకోపకారుడై బ్రతుకవలసియున్నదో యోచింపుడి! నరునియందు పరోపకారము (స్వార్థపరత్వమును విడచుట) విధిక్రమమునెరిగి వర్తించుటతోనే యారంభమగును. దీనియందె ఆత్మగౌరవము, నీతి, ప్రవర్తన మున్నగునవి యిమిడియున్నవి. దేశాభిమానులుగా నుండగోరినవారు తమయుద్యోగవ్యవహారముల మానుకొని యుండనక్కరలేదు. ఉద్యోగవ్యవహారములలోను అనుదినప్రవర్తనయందు నీకార్యము నెరవేర్చవచ్చును. అనగా స్వప్రయోజనముగోరక కాలమునుగడుపవచ్చును. న్యాయముగా డబ్బునార్జించుచు, ద్రోహములుచేయక అన్యాయము జరిగించక లంచములుగైకొనక యుద్యోగములు చేయుటలో నెంతయో లోకోపకారికావచ్చును.

ఇకతనవిధియనియెరిగి లోకములోబ్రతుకువానికి మిగులకష్టములువచ్చును. దురాచారములు మాన్పప్రయత్నించువానికి ప్రతికక్షులబాధలు, బంధువులనిందలు, స్నేహితుల దూషణలు, పెరవారల పరిహాసములు,ఎదురాడుటలు, లేచునపుడు ధైర్యమువిడువరాదు. పూర్వాచారముల నుల్లంఘించుచున్నారని నిందించుచున్నను, జరుగుచున్నమార్పులవలన ఎవ్వరికేహానియు కలుగకుండుటయేగాక యందరికి మేలును కలుగును. క్రొత్తమార్గములయందు ప్రజలకున్న అనిష్టము నశించి దురాచారములు రూపుమాయుటకు చాలకాలముపట్టును. కావున నేకమార్లిట్టిపని నిరుత్సాహముకలిగించును. మనముచేయునది క్రమమనితోచునపుడు మనకొకవిధమగు నుత్సాహముకలుగును. అది యే మనలను ముందుకునడుపును. గాయములకువెరువక రణరంగమందు శూరుని నిలువబెట్టునది యీయుత్సాహమేగదా! ఈపనులనునిర్వహించుటకు ఓర్పు ప్రేమఅగత్యము. ప్రేమతోగూడిన చిన్నపనులవలన గొప్పపనినిజేయవచ్చును. ఈపనిలో అన్యోన్యము, ఐకమత్యముగొప్ప లాభమొనగూర్చును. అయిననేనొక్కడనులేచిన సంఘముబాగుపడునా? నాయొక్కనివలన.నింతపనిసాగునా? యనిసంశయింపకుడు. ఒక్కడుతనప్రవర్తనను దిద్దుకొనిన దుష్ప్రవర్తకుల సంఖ్యయొకటితగ్గదా? ఇటులప్రతివాడు తనబుద్ధిని తానువినియోగించి యుక్తమార్గము ననుసరించిన లోకము శీఘ్రకాలముననే బాగుపడును. గాన విద్యావంతులగు పడుచువారలారా! హిందూదేశీయులారా! దేశమునకు సంఘమునకు నష్టమునుకలిగించు దురాచారముల దొలగించి తోడివారికి సహాయమునుజేయ త్వరపడుడి! దేశమందలి అనర్థములెల్ల మిమ్ముదేశక్షేమార్థమై పాటుపడపిలుచుచున్నవి. మీపిలుపు నలక్ష్యపెట్టకుడి! స్థిరచిత్తతతో బోరాడయత్నించుడి! దురాచారశత్రువుచే సంఘముయొక్క పరిశుద్ధతయు నశించును! మీరులోకవిఖ్యాతి గాంచెదరు మానవుల యాదరణమును భగవంతుని సహాయమును మెప్పునుమీకు గలుగును. భగవంతుడు మనకు సహాయముచేయుగాక!

---

# నేత పరిశ్రమ.

మ.రా.శ్రీ, హోసూరు సుబ్బారావుగారిచే వ్రాయఁబడినది.

అయ్యా!

నేయుట కావిరియంత్రము లుపయోగములా ?

చేతిమగ్గము లుపయోగములా ?

తామాంధ్రపత్రిక మూడవ సంచికకు పరిశ్రమలనుగురించి యొకవ్యాసమును వ్రాయుగలరాయని అడుగుచున్నారు. ఈనాలుగైదు సంవత్సరములనుండి నాకుండు యల్పానుభవముచే, దగినశక్తిచాలకున్నను, నాచేఁజేయబడవలసిన కృతకృత్యమనితోఁచి వ్రాయబూనితిని.

ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచికయందు పరిశ్రామిక వృత్తులనుగుఱించి మ.రా.శ్రీ, వంగల వెంకటనారాయణ బి. ఏ. గారిచే దివ్యమైనవ్యాసము వ్రాయబడినది. రెండవ సంచికయందు మ.రా.శ్రీ, నాదిరాజు చలపతిరావుగారు తద్విషయమై వ్యాసమును వ్రాసి ఆంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులైరి. గత రెండుసంచికల వ్యాసములును, పరిశ్రామికోన్నతికి పాశ్చాత్యుల పద్ధతుల నవలంబింపవలెననియు, ప్రతి పరిశ్రామిక వృత్తికిని యంత్రసహాయముండిన, వస్తువుల నతిత్వరితముగను, అతిసులభమైన వెలలో సంపాదించుటఁజేసి, పాశ్చాత్యుల వాణిజ్యముతో తులతూగునటుల జేయవచ్చునని దెల్పుచున్నది. ఈయభిప్రాయము పైవారిదేకాక, బరోడా మహారాజుగారుమొదలగు గొప్పగొప్ప విద్వాంసుల యభిప్రాయమైయున్నది. అయితే కొన్నికారణములనుబట్టి యోచించిన నాకు జూడనిటులఁదోఁచదు. పాశ్చాత్య పరిశ్రామిక పద్ధతుల ననుసరింపవలెనను వారిప్రశ్నల కుత్తరములు కనుగొనిన నిజస్థితిఁ దెలియును.

1. హిందూదేశీయుల జనసంఖ్యయెంత ? 2. పరిశ్రామికవృత్తుల నవలంబించువారి సంఖ్యయెంత ? 3. హిందూదేశీయుల కుపయుక్తములగు వస్తువులెవ్వి ? 4. ఈయుపయుక్తములగు వస్తువులను పరిశ్రామికులు సమకూర్చుటకుఁ జాలియున్నారా ? పైయంశముల కుత్తరములు కనుగొనిన పిదప దీనిని యోచింపుడు. 5. పాశ్చాత్యులకు గావలసిన వస్తువులెవ్వి ? 6. వారల కుపయోగుపడు వస్తువులను మనము సమకూర్చగలమా ? 7. పాశ్చాత్యులు పరిశ్రామిక వృత్తుల కేపద్ధతుల నవలంబించెదరు ? 8. ఆపద్ధతులయందు గుణదోషములెవ్వి ?

పైఁజెప్పిన ప్రశ్నల కుత్తరములు వ్రాయబూనినచో సంవత్సరాది సంచిక కంతయు నొక్కటేవ్యాసముండును. గనుక రెండుమాటలతో ముఖ్యాంశములఁ జూపి, మనపరిశ్రమలకు యంత్రసహాయ్యమువల్ల కీడేగాని మంచికలుగదని తీర్మానించెద.

హిందూదేశములో కడచిన జనసంఖ్య లెక్కలప్రకారము 3,15,132,537 జనులున్నారని స్పష్టమైనది. అందులో దాదాపు 5 కోట్లజనము పరిశ్రామికవృత్తులయందు ప్రవర్తించుచున్నారు. ఈ 5 కోట్లలో సుమారు ఒకకోటి యిరువదిలక్షల జనము నేతపరిశ్రమతో జీవించుచున్నారని తెలియవచ్చుచున్నది. ఈనేత పరిశ్రమవల్ల కలిగిన బట్టలు హిందూదేశీయులకు ముఖ్యావశ్యకము. నేతతో ఘనతజెందినటువంటిన్ని నేర్పఱులైన యీకోటి యిరువదిలక్షల జనము సుమారు ముప్పదికోట్ల జనులకు కావలసిన బట్టలను తయారుచేయజాలక ప్రోత్సాహముగాని, ధనముగాని లేక పరితపించుచు క్షీణించుచుండ, నేతపరిశ్రమలోనుండు జనులలో, సహస్రాంశమైన లేనటువంటి అప్పజ్ఞలు మిల్లులు ఫ్యాక్టరీలుపెట్టి పాశ్చాత్యుల కుపయోగపడు కేవల సుఖాస్పదములైన, మైనపొత్తులు, సబ్బులు, బట్టీలు, స్టాకింగులు, బూట్సులుచేసి వీటిపరిశ్రమలో నిపుణులైన పాశ్చాత్యులతో తులతూగుట సాధ్యమా ? అటులసాధ్యము కాకున్న వేలకొలది ధనవ్యయముచేసి యంత్రశాల లేర్పఱచుటెందుకు ?

ఈవిషయములలో గొప్పయాంగ్లేయవిద్వాంసులు కూడ యంత్రశాలలవల్ల మనదేశమునకు కీడుగాని మేలు కాదనియే చెప్పుచున్నారు. జె. యస్. ఉల్లరిఅను ఆంగ్లేయ విద్వాంసుడీప్రకారముచెప్పుచున్నాడు. "విదేశవాణిజ్యము స్థాపింపకముందు, స్వదేశవువాణిజ్యమును సరిపఱచుకొనుడు." ఇకను, ఇంగ్లాండు, ఫ్రాన్సు,స్విట్జరులండ్, ఇటలి మొదలగు దేశములలో నేయు యావిరియంత్రములకెంత ప్రోత్సాహము చేయుచున్నారో చూతము. ఇంగ్లాండులోననేక యావిరియంత్రములున్నను, చేతిమగ్గములే యధికముగానున్నవని, కలకత్తా చిత్రకళాశాల యధికారిగానున్న ఇ. బి. హావల్ దొరగారొక గ్రంథంబున నిటులు వ్రాయుచున్నారు. "విద్యుచ్ఛక్తి,యావిరి వీటి బలీయముతోనడుచు యంత్రములున్ను సూక్ష్మబుద్ధిగల పరిశ్రామికులున్ను, చేతితోనేయువారు అత్యల్పముగనున్న గల ఇంగ్లాండునందుకూడ చేతితోనేయు యంత్రములు (మగ్గములు) యావిరియంత్రములతో సమానమగుచుండ, తెగలగానేర్పడి తరతరములగ నేతపరిశ్రమయందు కుశలులై దినమునకు 3 అణాలనుండి 8అణాలకూలితో తృప్తినొందు నేతగాండ్లనేకులుండు హిందూదేశమందు, నేతపరిశ్రమయొక్క యభివృద్ధి కెంత శుభసూచనలున్నవో చూడుడు"అని వ్రాసియున్నారు. స్కాండినేవియాలో ప్రతిగ్రామమందును, చేతిమగ్గములే యుపయోగించుచున్నారట. పట్టువ్యాపారములకు ఘనతజెందిన, ఫ్రాన్సు, స్విట్జర్ లండ్, ఇటలి యీమూడు దేశములయందును పట్టునేయుటకు చేతిమగ్గములేయుపయోగించు చున్నారు. మిస్ క్లెయిన్ బేలీ అను నొకయాంగ్లేయ నారీమణి లండనులోనుండు చిత్రకళాసంఘములో నీప్రకారముపన్యసించెను. "పట్టు వ్యాపారాభి వృద్ధివలన నేతగాండ్రు జనసమ్మర్దముగల నగరములనుండి పరిశుభ్ర వాయువును సులభతర జీవనోపాధియునుఁ గల సఫకు ఎస్సెక్సులకుఁ బోయిరి. ఇప్ సివిచ్, బ్రెయింట్రీ, డడ్బరియును వాటి చుట్టుపట్ల గ్రామములును విశేషవ్యవసాయమునకు స్థానములైనవి. చేతి మగ్గపు నేతగాండ్రు లభించుటయు కష్టతరముగ నున్నది." చేతిమగ్గముల పరముగ నాంగ్లేయవిద్వాంసుల యభిప్రాయము లనేకములుగలవు. కనుక పశ్చిమదేశీయులుకూడ చేతిపరిశ్రమలనే యనుసరించుచుండ, మనదేశీయు లావిరియంత్రముల నుపయోగింపవలయుననుట కేవలమూఢత్వము. ఆవిరియంత్రములను పరిశ్రమల కుపయోగించుటచే కలుగుకీడు లెవ్వియనః—

1. పట్టణములలో జనస్తోమము నిండగుట. అందుచేనవి రోతబట్టుట. 2. పల్లెటూరులన్నియు జనులు విడుచుటచే పాడగుట. 3. చేతిపరిశ్రమలయందు కావలసిన బుద్ధికుశలత, యంత్రములద్రిప్పు వాడుకచే మాద్యమగుట. 4. యంత్రశాలలందు పొగ, ఉష్ణము,దుమ్ము మొదలగువాటిచే నందలిపనివాండ్రు రోగపీడితులగుట. 5. యంత్రశాల లధికారులకును కూలివాండ్రకును బత్తెముల విషయమై తగవులు జరగుట. 6. యంత్రశాలలందు స్త్రీ పురుష సాన్నిధ్యముచే ధర్మవిరుద్ధమైన కార్యములు జరగుట.

పైన జెప్పబడిన కీడులన్నియు తప్పక జరుగు ననుటకు పశ్చిమ దేశములే యుదాహరణములు. కావయంత్ర సహాయ్యముతో జేయు పరిశ్రమలకన్న చేతితో జేయు పరిశ్రమలు సర్వోత్తమములు. మనదేశములో నేతపరిశ్రమ లభివృద్ధి జేయుటకు యంత్రముల నావశ్యకములు. గుంతమగ్గములకే కొన్నిమార్పులు జేసిన, పశ్చిమదేశముల వాణిజ్య మెదుర్కొనుటయే కాక దేశీయ వ్యాపారము నభివృద్ధి జేసిదేశౌన్నత్యమునకుఁ దోడ్పడగలము. ఆ మార్పు లెవ్వియనః— ముఖ్యమైనది లాళీలను చేతితో విసరక మగ్గముయొక్క చలనమువలనే రెండు లాళీలను పారునటులజేయుట. ఇందువల్ల ఆయాసము తగ్గుటయే కాక, పనులు శీఘ్రముగా జరుగును. ఇప్పుడు గుంతమగ్గములో పనిచేయువారు నిమిషమునకు 10 మార్లు లేక 15 మార్లు లాళీలను విసరగలరు. పశ్చిమ దేశములతో సరిసమానముగ బట్టలను తయారుచేయుటకు ఒకనిమిషమునకు 50 లేక 60 మార్లు విసరునటుల చేసి యిప్పుడుండు మగ్గములతోనే 247½ కోట్ల గజముల బట్టలను నేయవచ్చును. ఇప్పుడు సుమారు 165 కోట్ల గజములు నేయుచున్నారని తెలియవచ్చు

చున్నది. వంగదేశమందు నొకభాగమగు సిరాంపూర్ అను గ్రామమందు నూతనముగా కనిపెట్ట బడిన లాళీ పారు మగ్గములు బహుకాలమునుండి అనగా 1773 సంవత్సరము నుండి ఉపయోగించు చున్నారని, క్లోలిన్ దొరగారు 1890 సంవత్సరములో వ్రాసియున్నారు. ఆ ప్రాంత్యములో సుమారు 10,000 నేతగాండ్రుండు నటుల సూచింపఁబడినది.

గుంత మగ్గములనే కొన్ని మార్పులచేత నిమిష మునకు 60 నుండి 75 మార్లు లాళీలను పారునటుల చేసి నెలకు 4, 5 రూప్యములు సంపాదించువారు 7 నుండి 10 రూప్యము లిప్పుడు కూలి సంపాదించు చున్నారట. ఇప్పుడు మనలో 40,00,000 నేతగాండ్రు సంపాదించునదంత యు నెలకు 1,20,00,000 నుండి 1,60,00,000 రూప్యము లగుచున్నవి. నూతనపద్ధతినవలంబించినచో 14,40,00,000 నుండి 19,20,00,000 రూప్యము లగును. అనగా పశ్చిమ దేశమునుండి దిగుమతి యగు బట్టల వెలలో మూటిలో రెండవభాగము సంపాదింప గలరని హావెల్ దొరగారభి ప్రాయపడుచున్నారు. కనుక చేతి మగ్గములలోనే మార్పులు చేయుట కెత్నించ వలయును.

ప్రస్తుత మీక్రింద వివరించిన నూతన లాళీపారు మగ్గములు కనిపెట్ట బడినవి.

| మగ్గములు. | ఎన్ని మార్లు లాళీపారును. |
|---|---|
| 1. సాధారణమైన లాళీపారు మగ్గము | నిమిషమునకు 33 మార్లు. |
| 2. కాలితో త్రొక్కుటవలన లాళీపారు ఆటోమాటికు మగ్గము | ,, 34 ,, |
| 3. సయాజి ఫాక్టరి మగ్గము | ,, 31 ,, |
| 4. ,, ,, గుంతమగ్గము | ,, 20 ,, |
| 5. సాల్‌వేషన్ ఆర్మి ఫాక్టరి మగ్గము | ,, 37 ,, |
| 6. ఇంగ్లీషు మగ్గము | ,, 31 ,, |
| 7. ఆటోమాటిక్ జపాను మగ్గము | ,, 41 ,, |
| 8. హాట్టర్‌స్లి ఇంటిమగ్గము | ,, 92 ,, |

యింకా అనేకములు కలవు. పైవాటి కంతెయు 40 నం 50 నం॥నూ లుపయోగింపవచ్చును కాని, అక్కడక్కడ పోగులు తెగిపోవును.



# తెలుఁగుదేశములోని నేతపరిశ్రమ.

మ. రా. శ్రీ, జీ. గోకర్ణముగారిచే వ్రాయఁబడినది.

ఈభరతఖండమునఁ బ్రసిద్ధిగాంచిన చతుష్షష్టి కళల లో నొక్కటి నేతపరిశ్రమ. యీపరిశ్రమయే పూర్వపు టార్యుల ముఖ్యవృత్తులలో నొక్కటియైనట్టు దేశచరిత్రల వలనఁ దెలియవచ్చుచున్నది. ఇప్పటికి నీపరిశ్రమ పెక్కు దేశములయం దభివృద్ధిజెందినట్లు నానావిధములైన యావిరియంత్రములవలనఁ దయారై మనదేశమునకువచ్చు వస్త్రములే చాటుచున్నవి. అయినను మనతెలుఁగుదేశములో యంత్రసహాయములు లేమిచే నీపరిశ్రమ మభివృద్ధికాదయ్యెను. యీదేశములో బూర్వకాలమునుండి వాడుచున్న చేతిమగ్గములును, నూతనముగా (అనఁగా) పదిసంవత్సరములనుండి వాడుచున్న ఫ్లైషటిల్ మగ్గములును సుప్రసిద్ధింజెందినవి. ఈమగ్గములవలనఁ దయారగుచున్న వస్త్రములు యంత్రములవలనఁ దయారైన వస్త్రముల కంటె చాలాకాలము మనఁగలవియు ననేకములగు వన్నెవన్నెలుగలవియును పెక్కువిధములైన పేటులగలవియును సొంపగు చుక్కలచే విలసిల్లునవియునై గానఁబడుచున్నవి.

ఇప్పటికిని నీవరిశ్రమచేయువారిలోఁ గొందఱు విద్యాధికులున్నను, మిక్కుటముగా విద్యాగంధమెఱుంగని వారలగుటచే లోకవ్యవహారికంబులఁ గుత్తెఱుంగమింజేసి, యితరులచేతులలోఁ జిక్కుకొనియుండిరనుటకు సందేహము లేదు. తెలుఁగుదేశములో వాడుచున్న వయినఁ బేఱ్కొనంబడిన రెండుమగ్గములలోచేతి మగ్గమునవేసినవస్త్రము మిక్కిలి సొంపుగానుండును. మొత్తముమీద యిఱువది వేలకుమించిన సంఖ్యగల మగ్గములు తెలుఁగుదేశములో గలవు. యీమగ్గములవలనఁ దయారగుచున్న వస్త్రంబులేయే దేశంబులకు నేయేనామంబుతో నేయేకాలములందు పోవుచున్నవో కొంచెము వివరముగా వ్రాయుతలంచితిని. ప్రస్తుతము తెలుఁగుజిల్లాలలో నాయకమణులవలె ప్రకాశించుచున్న గంజాం, విశాఖపట్నం జిల్లాలయందు తయారగుచున్న నాణ్యములేని సన్నపు వస్త్రము లాయా జిల్లాలయందు నిరంతరము ఖర్చువడుచున్నవి. ఇందు వెండినరిగె పనులుగల్గి తయారైన వస్త్రములున్న నవి సేలం పుల్లంపేట మొదలగుచోట్లఁ దయారైనంతటి మేలైనవి కావు. గోదావరిమండలములోని కాకినాడ,పిఠాపురము, తుని, పెద్దాపురము, కొత్తపల్లె, ఉప్పాడ, తమ్మారము, నరసాపురము, పాలకొల్లు, రాజమండ్రి మొదలగు ప్రదేశములందు పలువిధములైన వస్త్రములు, (అనగా) రుమాళ్లు, కండువాలు, చీరెలు, చావులు, తలపాగాలు తయారై నిరంతరము కలకత్తా, నాగపూర్, రంగూన్, నెల్లూరు, చెన్నపట్టణం, గుంటూరు, బెజవాడ, హైద్రాబాదుల కంపఁబడుచున్నవి. కొన్ని నాణ్యముగల వస్త్రములు తయారగు ప్రదేశముల నివసించువారలు వాడుకొనుచున్నారు. ఇచ్చట రెండువందల నెంబఱు నూలుసహితము మూడుమూరల వెడల్పుఁ బెట్టి నేయంగలవనివాండ్రున్నారు. యిచ్చట నేతపరిశ్రమ చేయువారలకు మిక్కిలి తక్కువ కూలిలభించుటఁగలదు. కాని, మాఱుబేరమునకు నేయువారిదగ్గర కొని యమ్ముకొనువారలకు మిక్కిలి లాభముఁగలదు. కొనువారలకు నిచ్చటివస్త్రములు చాలాతక్కువ వెలకువచ్చినను, వాడుకొనువారలకు మధ్యభాగము వెలితిగా నుండుటచేత బహుత్వరలో చినిగిపోవును. కృష్ణామండలములో చేరిన యేలూరు, పెడన, రాయవరము, పోలవరము, మచిలీపట్టణముల యందు పల్లెటూళ్ళ జనులకు వాయిదాల కమ్మఁబడునట్టి ముతకనూలు వస్త్రములు లండన్, అమెరికాఖండముల కంపఁబడుచున్న దిగుబడి కైలి, శైలాస్ (అను) మిక్కిలి తళుకుగల్గి చూచుటకు దెమ్మెపదియాఱుపౌనుల కాగితము వలెనుండునట్టి విలువగల సన్ననూలు వస్త్రములును తయారగుచున్నవి. ఇవివెడల్పు మిక్కిలితక్కువవెడల్పుగా నున్నను చూచుటకు నింపుగానుండును. గుంటూరుమండలములోచేరిన మంగళగిరి, తెనాలి, అయిలవరం, అద్దిపలె కనగాల, భట్టిప్రోలు మొదలగుచోట్ల వాయిదాల కమ్మఁబడునట్టి నాణ్యము వెల్లచావులు, చీరెలు, మహమ్మదీయుల యుపయోగార్థము హైద్రాబాదు కెగుమతిచేయఁబడుచున్న మోతీ, లంగీ, బడీ, రంగుపక్కాగానుండు అచ్చుతఱుచు రుమాళ్లు తయారై నైజాంరాజ్యములోనుండు ప్రజలు వాడుకొనుచున్నారు. తన్మండలములో చేరిన చీరాల, పేరాల, వీపూరిపాలెం, జాండ్రపేట, వేటపాలెం, వందెళ్ళపల్లి (అనునీ) యాఱుగ్రామములయందు నివసించు నేతపరిశ్రమ చేయువారివలన మావిచిగుళ్ళను గేరు కాంతిగలపెద్ద చ్ఛాయ రుమాళ్లు, డబ్లీరుమాళ్లు, రంగురుమాళ్లు, తోపురుమాళ్ళు, బజారు రుమాళ్ళు, వెల్లచక్కిరుమాళ్ళు,బొడ్డబ్బాచీ చుక్కరకములలో హంస,పఠానీ, గవాఝీ, లాయరు,చౌకీ,సిల్లడుగు,బటాబత్, అమీరుఖానీ, సన్నకొత్తైనిమిది, మూలతొమ్మిది,చంద్రకాళీ,గులాబీ అనుపేరులచే బలువిధములైన పడగున పేకయందు చుక్కలుగల తానులును తయారై యంతరమందు ఇంగ్లీషు, అఱ్వము, తెలుఁగు,కన్నడి,మరాటి,హిందీభాషలలో కోరిన పేరుపచ్చునట్టు నేయఁగల పనివాండ్రుగలరు. మఱియు నిందు వెండిసరిగెతో పుష్పములు కుట్టబడిమహమ్మదీయుల రంజాన్, మొహరంపండుగలకు హైద్రాబాద్, ఔరంగబాద్, ఎల్లోరాకును, బొంబాయి రాజధానిలోచేరిన పెక్కువట్టణముల కెగుమతి చేయఁబడుచున్నవి. అచ్చటయీ బొడబ్బాచతానులను అషియామాల్ అనియును వెల్లచక్కితానులను సోప్యానిమాల్ అనియు వాడఁబడుచు

న్నవి. బజారు సైజురుమాళ్ళు వేలకొలది తానులు తయారై చెన్నపట్నం, కడప, బెంగుళూరు, కాలికట్, మంగుళూరు, గోవా, రత్నగిరి, సూరత్, బొంబాయి, సోమనాథ్, కరాచి, ధార్వాడా, ఉబ్లి, వేదగిరి మొదలగు పట్టణములకును గుజరాతీదేశమందలి యన్నిచోట్లకు నెగుమతి చేయఁబడుచున్నవి. మఱియు కాలికట్ బనారుసుచెక్కుల కంటె నాణ్యముగల చెక్కులున్ను నూఱునెంబఱు పశ్చాఛాయి వేటపాలెం, రుమాళ్ళు, కైలి, శైలాస్, దిగుబడి, కోళంబురాస్తా, అమానీా, బడీ, మోతీ, పునహాపట్టుచీరెలకుఁ బ్రతిగానుండునట్టి నూలువుతానీ దట్టి నీలిఅంచుల చీరెలున్ను మిక్కుటముగా తయారుచేయఁబడి నిరంతరము నానాదేశములకంపఁబడుచున్నవి. నందిగామతాలూకాలో చేరిన జగ్గయ్యపేటయందు మంచిపట్టునేయుచున్న పనివాండ్రు గలరు. లత, పుష్పము, కోరకము, గుచ్ఛము, కాయ, పిందెలాదిగాగల నానావిధ పేటలువచ్చు రవికెల తానులు, మడిపంచెలు, తాప్తాలు తయారై మధ్యదేశము నందు ఖర్చుపడుచున్నవి. కొండవీడుకు సమీపమునఁగల రాజాపేట, చిలకలూరుపేట, నర్సారావుపేట, ఇనకొండ, వలపర్ల మొదలగుచోట్ల పదియుఁడుకుల ఛాయగల పైపంచిరుమాళ్ళు మోతీ, చూచీ, పంచవన్నెలు సార్లుగల రవికెలతానులు తయారై గుంటూరు బెజవాడ ఇనకొండ వగైరా గ్రామములలో ఖర్చుపడుచున్నవి. కర్నూలు జిల్లాలో చేరినపెక్కు గ్రామములయందు జమఖానా, కావునూలు, దుప్పట్లు, ముదుగువెల్లచాపులు నేయుపనివాండ్రు గలరు. నైజాంరాజ్యములో చేరిన ఒరంగల్లు, మట్టివాడ, అనుముకొండలయందు ముదుగులోదింపుడు రుమాళ్ళు పల్లెటూళ్ళజనులు మిక్కిలిగా నుపయోగించుకొను రాయలు, కోనలమ్మ, గంగాసాగరము, కడ్డి, నాగులు, కాశ్రేడు, బద్దెలు అనునట్టిచీరెలలో బేధములుగలమూర్తులు నేసవేలు తయారై నైజాంసర్కారీలో చేరిన కొన్ని గ్రామాదులందును, పల్నాడుసీమయందును, భద్రాచలాది ఆరణ్యక ప్రదేశములందు నివసించు చెంచు, కోయ, ఖాండీ, కురవ జాతులకమ్మబడుచున్నవి. నెల్లూరుపురమందు తన్మండల సామీప్యక ఇనమడుగు, వావిళ్ళ, దంపూరు, వేంకటగిరి, కాళహస్త్రి, తిరుపతి మొదలగు గ్రామములందు నిరంతరము పెద్దపెద్దంచులుగల నీలిచీరెలు అన్యదేశీయుల కుపయోగపడనట్టి రుద్రాక్షపేటు, బనార్సుపేటు, గువ్వకన్నుపేటు, మొగ్గపేటు, గుచ్ఛకపేటు, లక్ష్మీవిలాసకపేటు ఇట్లి పెక్కువిధములకు పేట్లుగల పలువిధములై వన్నెలుఁగల చీరెలు, నానాదేశీయులు వాడుకొనుచున్న పెద్దపట్టంచులు గల దక్షిణాది రవికెలతానులు, లక్కపట్టుతో తయారుచేయఁబడినమడిపంచెలు, తాప్తాలు, చాపులు, తుండుగుడ్డలు, కాంచీపురిలో తయారగునంతటి మేలైనవియు బరహాంపురములో తయారగుచున్న పట్టుచీరెలు చాపులుకంటె శ్రేష్ఠమైనవి. నిరంతరము సంఘటింపఁబడి బొంబాయి, చెన్నపురి రాజధానులయందుండు బ్రాహ్మణాదు లుపయోగించుకొనుచున్నారు. కడపజిల్లాలో చేరిన మాధవరము, పుల్లంపేట, అచ్చంపేట మొదలగుచోట్ల మిక్కిలి సన్నసూలులో వెండిసరిగెను పైనివ్రాసిన పేటులేగాక గుఱ్ఱముల బార్లు, ఏనుఁగులబార్లు, అంచునవచ్చునట్టుగాను కమ్మివద్ద బనార్సుబుతా, హంసలాది నానావిహంగములును వికసితలతాగుల్మవృక్షములు వచ్చునట్టు నేయఁగల పనివాండ్రచే పొడవు వెడల్పు సమానముగానుండునట్టి అయిదు మూరల తలపాగాలు, మూడుమూరలు వెడల్పుగల కండువాలు, చీరెలు, చాపులు పెక్కురంగులుగలవి తయారయి మధ్యదేశమందు నిరంతరము సర్వజనులచే వాడఁబడచున్నవి. పైనబేర్కొనఁబడిన ప్రదేశములందుగాక తెలుఁగుదేశములో మూలమూలలనున్న యనేకగ్రామములందు నీపరిశ్రమచేయువారలుకలరు. మొత్తముమీద క్రీ.శ. 7 వ శతాబ్దమున హూయేన్‌స్యాంగను బౌద్ధకుఁడాంధ్రదేశము 600 మైళ్ళని వ్రాసియుండుటఁజేసి పండితులందఱిప్పటికి తద్విధంబుననే దలంచుచుండిరి కావున మిక్కిలి వైశాల్యమైన

యీఆంధ్రదేశములో నీపరిశ్రమాభివృద్ధిఁ బొందనికారణములనేకములుగలవు. ఇందు స్థలసంకోచమువలనఁ గొన్నింటినిమాత్రమే వ్రాయదలంచితిని. విద్యావిహీనత్వము, పనిచేయనిసోమరితనము, ముందుగా కూలిడబ్బు లభించుటచేత గల్గినగర్వము, తాగుబోతుతనము, తానుగ్రహించిన నూతనమార్గము యితరులకుఁ జెప్పకుండుట ఇట్టిలోభములవలన యీపరిశ్రమ మభివృద్ధిఁ జెందదయ్యె. దీనిని యభివృద్ధిఁ జేయవలయునని దేశాభిమానియగు మ.రా.శ్రీ, పింగళ లక్ష్మీనారాయణగారి ప్రోత్సాహమువలన శ్రీ మునగాలరాజాగారు బెజవాడపురమందు బరోడా మగ్గములను దెప్పించి 1907 సం॥న పనివాండ్రను కుదిర్చి పనులు ప్రారంభించిరికాని రెండుసంవత్సరములు పనిసాగి అందు తయారైన చెక్కులు మొదలుగాగలవి ఖర్చుపడకుండుట పనివాండ్లు కొంతసొమ్మపహరించుటవలన చాలనష్టముగల్గి కంపెనీ తీసివేయవలసి వచ్చెను. గుంటూరిబోర్డువారు బాపట్లతాలూకాలో చేరిన వేటపాలెపురమందు దేశాభివృద్ధికి ఫ్లై షటిల్ మగ్గములనుబెట్టి పనివాండ్రనుకుదిర్చిజీతముతేర్పఱచిపనిసాగించిరికాని సరియైన యేర్పాటులు కుదరక నష్టమువచ్చినందున వెంటనే పనిముట్లువేలాంవేయించిరి. రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్నం, తెనాలి, బాపట్ల మొదలుగాగల కొన్నిగ్రామములయందలి దేశాభిమానులు కొందఱీపరిశ్రమాభివృద్ధికిఁ బాటుపడిరికానిసోమరితనముగల పనివాండ్లవలనఁ గొనసాగవయ్యెను. పనివాండ్ర సోమరితనమనివ్రాయుటేలయందురేమో. ఈలోకంబునఁగల సమస్త శాఖోద్యోగియులకు నెలమొదటితారీఖునుండి ఆఖరుతారీఖువఱకు పనిసక్రమముగాఁ జేసియుండిన జీతముల పైయధికారులు యిచ్చెదరుగాని, నేతనేయు పనివాండ్లకువలె ముందుజీతములిచ్చుట గాన్పడదు. ఇదియే నీపరిశ్రామికోన్నత తరువునకుఁ వేఱుపురుగుగాఁదోచుచున్నది. 1. ఇట్టి దురభ్యాసముగా జీతము ముందునిచ్చుట మాన్పుట 2. ఏయేదేశములందుగల పండితులచే నీపరిశ్రామికాభివృద్ధికిఁ గావలసిన యావిరియంత్రములు కనిపెట్టఁబడినవో అట్టి విశ్వవిఖ్యాతిఁజెందిన యంత్రములను వర్తకసంఘమువారు తెప్పించి, తెలుగుదేశములో నూరూరఁబెట్టించి, పనివాండ్రకు పనులనుగల్పించుట. 3. తెలుఁగుదేశములోగల మహారాజులు, రాజులు, జమీందారులు, దివానులు, విద్వాంసులు, విద్యాధికులుచేరి ప్రకృతశాస్త్రాభివృద్ధిని జేయదలంచిన విజ్ఞానచంద్రికా మండలివారివలె నన్యభాషలోగల గ్రంథములను భాషాంతరీకరణముఁ జేయించి లోకోపకారపరాయణులై సర్వవిధముల నీపరిశ్రమాభివృద్ధికి గ్రంథములు వ్రాయించుట 4. తెలుఁగువార్తాపత్రికలలో నప్పుడప్పుడు నేతపరిశ్రమనుగుఱించిన యుపన్యాసములు వ్రాయించుట. 5. ప్రతిసంవత్సరము సంఘసంస్కర్తలు చేయుచున్న మండలికసభలోని పరిశ్రమాభివృద్ధినిగూర్చి చర్చించి ప్రజలకుఁబోధింపఁజేయుటచేత నేతపరిశ్రమ మభివృద్ధిజెంది ఇతరదేశములవలె మనదేశము భాగ్యవంతమై బీదఃనులు బాగుపడెదరని నాయభిప్రాయము. దైవముసర్వదా జనులను రక్షించుగాక. గుణగ్రహణపారీణులిందు దోషములను మన్నింపఁ బ్రార్థితులు.



చ. అతనికి వార్ధికుల్యయగు ♦ నగ్నిజలంబగు మేరుశైల మం
చిత శిలలీలనుండు మద ♦ సింహము జింకతెరంగుఁ దాల్చుఁ గో
పితఫణి పూలదండ యగు ♦ భీష్మవిషంబు సుధారసం బగుఁ
క్షితి జనసమ్మతంబగు సు ♦ శీల మదెవ్వనియందు శోభిలుఁ.

భ. హై.

# దేశాభిమానము.

మ.రా.శ్రీ, పా- నరసింహంగారిచే వ్రాయబడినది.

[జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ]

సమస్తసత్కార్య సమాచరణమునందును సజ్జనాళికి సంతతానందోత్సాహములఁ బ్రసాదించి ప్రపంచమునం దధికమైన ప్రస్తుతినిఁగాంచిన గుణరాజము, దేశాభిమానము. తమజన్మభూమినిఁ బ్రేమింపని మానవులు లోకమందుండజాలరని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. సకలకళావిశారదులగు పండితులేగాక జ్ఞానలవశూన్యులగు పామరులు సయితము తమదేశమునందు నిర్వ్యాజానురాగమును గనఁబఱచుచున్నారు. కాకిపిల్ల కాకికిముద్దనినటు గుణాగుణ వివక్షతలేకయే ప్రతిమనుజుఁడును తనమాతృదేశమును గీర్తించుచున్నాఁడు. ప్రచండమార్తాండుని కిరణజాలముచే ననవరతము మలమలమాడుచుండెడు మధ్యాఫ్రికాదేశ వాసుఁడును సూర్యరశ్మి యినుమంతయిన మెఱుఁగక దీర్ఘరాత్రులననుభవించుచు దుర్భర శీతబాధచే గజగజ వణకుచుండెడి ధ్రువసమీపవాసుఁడును తమ వాసభూములతోఁ బోల్పఁదగిన యితర పుణ్యభూములీ భూవలయమునందులేవని మురియుచున్నారు. ఇఁక సుఖప్రదమైన శీతోష్ణస్థితినికలిగి సకలవిధ సంపత్సమృద్ధమైన మనభారతదేశమువంటి ప్రదేశములలో నివసించు మనుష్యులు తమదేశములయం దనురక్తినిగల్గియుండుట యొక యాశ్చర్యముగాదుగదా!

ఆహా! దేశాభిమానమునం దెంతటి మహత్తరమైన యమోఘశక్తిగలదు. దేశచరిత్రలుద్ఘోషించుచున్న విప్లవములును, పరివర్తనములును, యుద్ధములును దేశాభిమాన దేవతయొక్క విలాసములేగదా! ప్రజాసంక్షోభకరములగు నీకార్యములేగాక దేశక్షేమకరములగు మహాసభలును, సత్ప్రతిషాపనలును నావేలుపుయొక్క మహిమాఫలితములే యని నుడువుట కేమిసందియము? దేశజననియొక్క యావేశశక్తిచే యోధవరులు రణభూమియందు నిర్వక్రపరాక్రమముతోఁ బోరాడి తమప్రాణములఁ దృణప్రాయముగాఁ బరిత్యజించి కీర్తిపాత్రులైరి. దేశమాతయొక్క ప్రోత్సాహప్రాబల్యముచే బలహీనలగునబలలు సయితము సమరరంగములయందు శౌర్యధైర్యములంజూపి వినుతికెక్కిరి. దేశభక్తియొక్క మహాత్మ్యముచే సుందర మందిరములయందు మహాభోగము లనుభవించెడు లక్ష్మీసంపన్నులు తమయైశ్వర్యముల నవలీలవిడనాడి సామాన్యస్థితినిఁ జేపట్టిరి. దేశానురాగముయొక్క ప్రభావముచే భీరువులు ధీరులైరి; లుబ్ధులుదారులైరి; దుర్బలులు బలాఢ్యులైరి. వేయేల! దేశాభిమానముయొక్క సమ్మోహనశక్తిచే మనుష్యులు నూతనచైతన్యవికాసమును గాంచిరి.

సరళమార్గమునఁ బ్రసరించినపుడిట్టి యనంతలాభముల నొడఁగూర్చెడు దేశాభిమానప్రవాహము పెడత్రోవలఁ బాఱఁదొడంగెనేని మిక్కిలి యనర్థదాయకమగును. అజ్ఞానవతులగు మాతలు తమబిడ్డలయందలి విపరీతప్రేమాతిశయముచేఁ బరశిశువుల యారోగ్యసౌందర్యములఁ జూచి యసహిష్ణులయి సుఖభంగమునుగోరునట్లు దూరాలోచనపరులుగాని మనుజులు దేశాభిమానభ్రమచే పరదేశీయులయెడల నసూయఁజూని వారినాశనమునకే ప్రతీక్షించుచుండుట కొన్నివేళల సంభవించుచుండును. ఈదురభిమానగ్రస్తు లమానుషములైన ఘాతుకకార్యముల సయితముగావించి దేశపురోవృద్ధికి భంగము గావింపవచ్చును. చోరహస్తగతమైన ఖడ్గరాజమువలెనే దేశాభిమానమును సుజ్ఞానశూన్యులైన మానవుల హృదయసీమలయందుఁ బ్రవేశించి దేశోపద్రవ హేతువుకావచ్చును. కనుక స్వదేశాభ్యుదయము నభిలషించెడు మహానుభావులందఱు శ్రేష్ఠతమమైన దేశభక్తి దేశమందంతటను వ్యాపించునట్లు కృషిసలుపవలయును.

సర్వోత్కృష్టమై, సకలశుభదాయకమైన దేశాభిమానము మూడు ప్రధానలక్షణములతో నొప్పుచున్నది.

అందు మొట్టమొదటిది నిర్వ్యాజమై నిష్కళంకమైన ప్రేమ. మాతృప్రేమయుంబలె మాతృదేశప్రేమయు స్వచ్ఛమైనదియై యుండవలెను. దేశవీరులని సుప్రసిద్ధినిగాంచిన మహాభాగులందఱు తమవాసభూములయందు నిర్హేతుక జాయమానానురాగమును జూపియుండిరి. దేశభక్తి తత్పరుఁడగు ప్రతిహైందవుఁడును తనదేశమునందలి ప్రతి భాషాలురయందును, ప్రశస్తవస్తుచయమునందును దృఢానురక్తిని గల్గియుండవలయును. శ్రుతిస్మృతేతిహాసముల రచియించి సుజ్ఞానతేజమును సర్వదెసలఁ బ్రసరింపజేసిన మహర్షీశ్వరులఁ దలంచినపుడును, శిల్పవాణిజ్యాదుల వృద్ధినొందించిన విజ్ఞానవిశారదుల మనంబున నెంచినపుడును, సంఘమత సంస్కారములఁగావించి సన్నుతిఁగాంచిన శంకర, రామానుజ, రామమోహనాది సంస్కర్తలఁ బేర్కొనినపుడును, ప్రతిభారతీయుని హృదయమును దేశభక్తితో నుప్పొంగవలయును. మనదేశము నలంకరించు హిమవన్నగాది మహాపర్వతపంక్తులను, గంగా సింధు బ్రహ్మపుత్రాది నదీనదంబులను, ప్రపంచమునందలి యద్భుతసప్తకములోఁ జేరిన తాజ్‌మహల్, కోహినూరువజ్రము, మయూరసింహాసనము మున్నగు నమూల్యపదార్థములను స్మరించినపుడు ప్రతిభారతపుత్రునకు దేశమునందనురాగము జనింపవలెను.

పరదేశస్థులుగూడఁ గనఁబఱచఁగలిగిన యీయభిమానమును గల్గియుండుటయేగాక ప్రతిభారతీయుఁడును హిందూసంఘమునకుఁ గళంకసదృశములుగానున్న దురాచారముల నిమిత్తమును దుష్టసంఘముల నిమిత్తమును ప్రేమాపూర్వకమైన కన్నీరుకాల్వలుగట్టఁ గార్చవలెను. దుర్భరదారిద్ర్య నిపీడితులై విద్యాశూన్యులై యజ్ఞానవాహినియందుఁ దోఁగుచున్న ప్రజానీకముకొఱకు దేశభక్తులందఱు దుఃఖింపవలయును.

దేశాభిమానమునందు ముఖ్యలక్షణమైన యీయనురాగము ధర్మవిరుద్ధముగా నుండఁదగదు. కాన సత్యప్రియత్వము ప్రవిమలంబైన దేశభక్తియందు రెండవలక్షణమై తనరుచున్నది. దేశమునందలి లోపముల నయితము గుణములుగా స్తోత్రపాఠముసేయుట యెన్నటికి దేశాభిమానముగానేరదు. "అసత్యమైనది దేశభక్తిగాదు. ప్రతి దురభ్యాసమును, ప్రతిదురాచారమును నభివృద్ధికి బ్రతిబంధకము. వానిని నిలువఁబెట్టుట దేశభక్తి విరుద్ధము." అని గణించిన శ్రీ సర్. టి. మాధవరావుగారు నుడివియుండిరి. "జపానుదేశ సంబంధమైనదంతయు మంచిదని మేము చెప్పము. కాని మంచిదెల్ల జపానుకుఁజెందినదై యుండవలెను." అని యుదార హృదయుఁడగు నొకజపానీయుఁడు నుగ్గడించియుండెను. భారతదేశ స్థితిగతులఁ జక్కగా బరిశీలించి, యందలిలోపములసవరించి, యితరదేశచరిత్రలశోధించి, వానినుండి సద్విషయముల గ్రహించి స్వదేశమునందుఁ బ్రవేశపెట్టుట ప్రతిదేశాభిమానసీయుని ధర్మమైయున్నది. సత్యసమన్వితమైన దేశాభిమానమునకుఁ దార్కాణముగా నొకచరిత్రాంశము నిట నుడువుట సమయోచితముగా నుండకమానదు. పూర్వకాలమునందు ఏథేన్సు పట్టణవాసులలో థెమిస్టాకుల్సు అనునొక సేనానాయకుఁడుండెను. దేశభక్తి పరాయణుఁడేమైనను నితఁడు ధర్మబుద్ధిగలవాఁడు గాఁడయ్యెను. ఈదండనాథుఁడు ఏథెన్సురాష్ట్రమును మిగిలినవానికంటె మిన్నగఁజేయనెంచి తత్పరిపాలక సభ్యులకొక యాలోచన నివేదింపనెంచెను. ఈయుపాయము నాతఁడు రహస్యముగా నొక్కనికి మాత్రమే చెప్పెదనని నుడువుటచే నాసభాసదులు దానినివిని దానిపై తనయభిప్రాయమును దెలుపుమని విశ్వాసార్హుఁడును బుద్ధిమంతుఁడునైన అరిస్టైడ్సు అనువానిని నియోగించిరి. సమీపపు రేవుపట్టణమునందుఁ గుమిగూడియున్న పరరాష్ట్రనౌకా సంఘమును నాకస్మికముగా నగ్నిపాలుచేయవలయునని యాసేనానియుపదేశించిన యుపాయము నాలకించి, అరిస్టయిడ్సు నభ్యులతో "ఆలోచన లాభకారియేగాని ధర్మసమ్మతమైనది" కాదని చెప్పెను. అంతనా సభాసదులు మాఱుమాటాడక యాయాలోచనను వెంటనే నిరాకరించిరి. సత్యప్రతికూల మార్గములచే స్వదేశౌన్నత్యమును సాధింపనెంచని యాసభాస్తారుల దేశభక్తి సంస్తవనీయముగదా!

ఇఁక దేశాభిమానమునందు మూఁడవలక్షణము స్వార్థత్యాగము. స్వసుఖపరిత్యాగమే గాఢానురాగము

యొక్క ఫలితము. ప్రేమాపాశబద్ధుఁడైన మానవుఁడు తన ప్రియవస్తువునిమిత్తమై యెంతటియమూల్యపదార్థములనైన విడనాడుటకును, నెన్నియిడుములనైన యనుభవించుటకును సంసిద్ధుఁడైయుండును. తమ మనోహారిణుల మనోరథసిద్ధికొఱకు తమ సర్వస్వమును ధారవోసిన మనోనాయకుల మనమెందఱ నెఱిఁగియున్నాముగాము! నిజజనకుని యభిమతము నీడేర్చునిమిత్తము యావజ్జీవ బ్రహ్మచర్యదీక్ష నవలంబించి యపూర్వ స్వార్థత్యాగముఁ జూపిన భీష్ముని వృత్తాంతము నెఱుఁగని వారెవరు! అట్లే దేశాభిమాన ప్రపూర్ణహృదయులగు మహాపురుషులు తమదేశహితార్థమై యెట్టి స్వార్థత్యాగమునైనను గావించుటకు నడుముకట్టుకొనియుందురు. జపాను దేశమునందలి సామంతరాజులందరు తమదేశక్షేమముకొఱకు రాజ్యాధికారమును బుద్ధిపూర్వకముగా చక్రవర్తికినర్పించి ఖ్యాతిగాంచిరి. కడచిన రుష్యాజపాను యుద్ధములో జాపానీయులనేకుఁ లొకరితరువాత నొకరుగాఁ దమప్రాణ విరామము గావించి విజయలక్ష్మిని తమదేశమునకు సంపాదించిరి. భారతదేశాభ్యుదయము నభిలషించెడు దేశభక్తులందరు తమదేశాభిమానమును వాక్చాతుర్యము మూలముననేగాక కార్యరూపమునఁ గనఁబఱచవలెను. నిమ్నజాత్యుద్ధరణమునందును, వితంతుదుర్దశా నివారణమునందును, జాతిభేద నిర్మూలమునందును, పటుతరంబైన పట్టుదలతోఁబనిచేసి స్వార్థత్యాగ బుద్ధిని జూపవలెను. భోగభాగ్యముల నించుకైన యాసింపక పరార్థపరాయణులై తమకాలమును ధనమును ప్రాణమును దేశసేవకై సమర్పించిన వీరపురుషుల జీవితముల మూలముననే సర్వదేశములు నుద్ధరింపఁ బడినవి. ఇట్టి సల్లక్షణ సమన్వితంబైన దేశాభిమానమును యుక్తరీతులఁ బెంపొందించుట దేశక్షేమాభిలాషుల ధర్మమై యున్నది. ఇంగ్లాండు అమెరికా జపాను మున్నగు నాగరికాగ్రగణ్యములైన దేశములందలి విద్యాలయములలో దేశభక్తియు ధారాళముగా విద్యార్థులకు బోధింపఁబడుచున్నది. మనదేశపాఠశాలలలో నట్టియుపదేశములఁ జేయుటకుఁ బ్రత్యేకకాల నిర్ణయము లేకపోయినను దేశభక్తి పూరితుఁడగు నుపాధ్యాయుఁడు తన శిష్యబృందముయొక్క మానస క్షేత్రమునందు దేశాభిమాన బీజముల సమయానుసారముగా నాటవచ్చును. దేశభక్తిని వృద్ధి పొందించుటకు ముఖ్యసాధనములలో నొకటి దేశ చరిత్రాపఠనము. సకల కార్యముల కాకరంబై యితరదేశములకుఁ గన్నెఱ్ఱఁ గావించినట్టియు, ప్రస్తుతకాలమునందు నయితము ప్రపంచమునందంతట యసమాన గౌరవమును గాంచుచున్నట్టియు, భావికాలమునందుఁగూడ పురోభివృద్ధి నొందఁగల సూచన లనేకములు గనఁబఱచుచున్నట్టియు, మన హిందూదేశముయొక్క వృత్తాంతమును సమగ్రముగాఁ బరిశీలించిన యేభారతపుత్రుఁడు నిర్మలమై, గాఢమైన దేశాభిమానమును గల్గియుండక యూరకుండఁ గలండు ?

దేశచరిత్రా పరిజ్ఞానమునకన్న దేశాభ్యుదయహేతువులగు సత్కార్యములందుఁ గృషిసలుపుటయే దేశాభిమానమును బోషించుటకుఁ బ్రబల సాధనము. దేశభక్తిలేశముగల యెల్ల జనులును యథాశక్తితో దేశసంసేవనము సలుపవలయును. కార్యసమాచరణ మొనర్పరని వాగాడంబరమువలన దేశాభిమానము నీరెత్తని వృక్షమువలెనతికాలములో నంతమొందును. కవీశ్వరులును, సంగీత విశారదులును, చిత్రప్రబంధ రచనా కుశలులును, నాటకప్రదర్శకులును తమ ప్రజ్ఞాకౌశలముచే నీదేశాభిమానాగ్ని చల్లారక నిరంతరము జనసామాన్యము యొక్క హృదయ వీధియందు ధగధగ వెల్గుచుండునట్లు ప్రయత్నించ వలయును. మహాపురుషుల సంవత్సరోత్సవమును దేశాభిమానాభివృద్ధికి ననుకూలములుగాఁ జేయవచ్చును. ఆంధ్ర ధాత్రియందిప్పుడిప్పుడ దేశాభిమాన భానూదయమైనది. ఆంధ్రమహాజనులు గొంచెము మేల్కాంచి తమదేశ స్థితిగతుల బరిశీలించి యుచిత కార్యసాధనము కొరకై గడంగుచున్నారు. సారస్వతము వృద్ధిఁ గాంచ నారంభించినది. విద్యాలయములందందు బయలు దేరుచున్నవి. నూతనోత్సాహముతో నాంధ్రప్రపంచము ప్రకాశించుచున్నది. భక్తాభీష్ట ప్రదాయకుఁడైన భగవంతుఁ డుత్కృష్టదేశాభిమానము నాంధ్రజనుల కందఱకుఁ బ్రసాదించునుగాక !

శా॥ శ్రీకళ్యాణగుణాకరుండు ఖలసం*శిక్షాచణుండార్తర
క్షైకారంభుఁడనంతుఁ డద్వయుఁడఖం*డానంద కందంబు ప్ర
జ్ఞాకల్పద్రుమమీశ్వరుండు దయతోఁ*గళ్యాణ మున్నిచ్చు లం
జేకూరన్నెలకొల్పుఁగాత మనమం దేశాభి*మానంబె దక్ష.

# ఆంధ్రచిత్రభాషలు; ఉపయోగించుపద్ధతులు.

మ.రా.శ్రీ, రాయప్యూర రామచంద్రప్రసాదరావుగారిచే వ్రాయబడినది.

ఆంధ్రదేశమునందు ప్రతి ఆంధ్రుడును ఆంధ్రభాషమాట్లాడగలడు. తల్లిభాషయగుటచే చదువుకొనని వాడు నయితము సహజముగా మాట్లాడనేర్చియున్నాడు. దీనినే తెలుగనియు తెనుగనియు పిలుచుచున్నాము. అయితె పదిమంది ఆంధ్రులొక్కచోటగూడినప్పుడు అందు యేయిద్దరైనను అచటనున్న తక్కినవారికి తెలియకుండునట్లు మాట్లాడదలచినచో తమ స్వభాషలో కొంత మార్పునుగలిగినభాష ఆవశ్యకము. అటులనె యెవరైనను తమరహస్యములు తమ బంధుమిత్రులకేరికైనా తెలుపవలెనని యభిలషించెనేని వారివారికి కొన్నిసంజ్ఞలు తమభాషలో నుండుటకూడా అత్యావశ్యకము. కావుననే కొందరు బుద్ధిశాలురు కొన్ని వాగ్రూపకములును కొన్ని లిఖితరూపకములును నగు భాషలు వాడుకలోనికి దెచ్చియున్నారు. అందుకొన్నిటి నీక్రింద పొందుపరచెదను.

శ్లో॥ రామ। చ్చాయా। అజా। నాగ। టకం। తప। దశా। మాణ।
షడ। బాల। సకా। వశో॥ యిత్యేతె రామ భద్రికం॥

దీనిని రామచ్చాయ భాషయనియు రామభద్రికమనియు పిలచెదరు. యీభాష మాట్లాడుటకును వ్రాయుటకును యిరుదెరంగుల నుపయోగమయినది. గాన ముందు కంఠవపాఠము చేయవలెను.

దీనిని నుపయోగించు పద్ధతియెట్లనగా:—

గీట్లమధ్యనున్న ప్రతిరెండు అక్షరములలో మొదటి అక్షరముకుమారు రెండవ అక్షరమును, రెండవఅక్షరముకు మారు మొదటిఅక్షరము నుపయోగించి మాట్లాడుచుండవలెను. అనగా, రాకుమ, మకురా, చ్చామయ, యకుచ, అకుజ, జకుఅ ఇటులనె తక్కిన అక్షరములునుకూడా మార్చుకొనుచు స్వభాషలోని యుచ్చారణలను ప్రయోగించి మాట్లాడవలెనని తెలిసికొనవలెను.

“నీకు యీభాష తెలుసునా” అని మాట్లాడవలసివచ్చినయెడల నకుగ, కనుచ గనుక “గీసు” అనిన నీకు అని అర్థమగును “యీభాష” అనుటకు “చీలాడ” అనియు “తెలుసునా?” అనుటకు “పెబుకుగా?” అనియు వాడినయెడల “గీసుచీలాడపెబుకుగా?” అని అగును అపుడు యితరులకు దీనియర్థము తెలిసికొనుట దుస్తరముగానుండును. తానుద్దేశించి మాట్లాడినవారికి మాత్రము “నీకుయీభాష తెలుసునా?” అని అర్థమగును.

2. మాట్లాడుటకు వీలులేక వ్రాయుటకుమాత్రముపయోగించుభాషలు అందు.

(1)

| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|---|
| । | అ | క | గ | జ | చ | ట | డ | మ |
| ч | ఞ | ణ | త | ద | ప | బ | ళ | న |
| щ | య | ర | ల | వ | శ | ష | స | హ |

దీనిని వ్రాయుపద్ధతి తెలిపెదను. ప్రక్కన గీయబడిన “। ч щ” యీసంజ్ఞలయొక్క అర్థము ఒకటవ పంక్తి, రెండవపంక్తి, మూడవపంక్తి అని తెలుపుట అయియున్నది. వాటిని „। ॥ ।॥” యీమాదిరిగా గీచినను గీయవచ్చును. పైనకనబడుచున్న ౧ లగాయతు ౮ వరకు గల అంకెలు ప్రతిపంక్తిలోను అక్షరస్థానము తెలుపుటకు వేయబడినవి, గావున ౧పంక్తిలోని యొకటవ అక్షరము అ అనియు రెండవ అక్షరము క అనియు యెనిమిదవ అక్షరము మ అనియు తెలుపుచున్నది. ఇటులనె రెండవ పంక్తిలోని మూడవ అక్షరము త అనియు నాలవ అక్షరము ద అనియు యేడవ అక్షరము ళ అనియు తెలియజేయబడుచున్నది. మరియు మూడవపంక్తిలోని మొదటి అక్షరము య అనియు ఆరవ అక్షరము ష యనియు యెనిమిదవ అక్షరము హా అనియు సులభముగా యెరుంగునది. పైనవ్రాయబడిన తప్సీలు పూర్ణముగా తెలిసికొనిన తరువాత ళ యెక్కడనున్నదనిన (4) రెండవపంక్తిలో (౭) యేడవ అక్షరముగా నున్నదని సులభముగా వెంటనే జవాబుచెప్పవచ్చును. ఇటులనె తక్కినవియు తెలిసికొనగ

లము. కాబట్టి „శ్రీరాములు” అనివ్రాయుటకు(౹౹ర్గి-ఈ ౫-౨ఆ...) యిటుల వ్రాసిన అగుచున్నది. విశ్వేశ్వ నుడు అని వ్రాయుటకు రెండు మార్గములుగలవు. (1) ౹౹ర౩౹౹౯౹-౨ప్స౹౹ర ఉ౹౭ఉ .................... ఇటుల రెండు విధములుగా వ్రాయవచ్చును. ఇందు మొదటి వ్రాతలో వ వత్తు నవత్తు (౯౨) యిటుల యివ్వబడినది. రెండవదానిలో క్రిందివత్తులకుకూడా అంకెలను వేసి వ్రాయబడినది. దీనిని అంకెలభాషయనియు సంఖ్యాలిఖితమనియు వాడుకపేర్లుగలవు. ఈభాషను తరుచుగా చాలామంది వాడుచున్నారు.

3. ఈఅంకెలభాషలో వేరొకమాదిరిభాష కలదు దానిని యీక్రింద కనుపర్చెదను.

(2)

| | । | ౹ | ౹౹ | |
|---|---|---|---|---|
| ౧ | అ | తా | ల | ఏకం |
| ౨ | క | ద | ప | ద్వితీయం |
| ౩ | గా | జా | శ | తృతీయం |
| ౪ | చ | ప | మం | చతుర్థం |
| ౫ | జా | బా | వ | పంచమం |
| ౬ | ట | మ | హాం | షష్టమం |
| ౭ | డ | యా | శ | సప్తమం |
| ౮ | తు | జా | ర | అష్టమం |

దీనికి మొనిమిది పంక్తులు ప్రక్కన వేయబడిన అంకెలవలన తెలిసికొనవచ్చును. పంక్తికి మూడు అక్షరములు అని పైనవేయబడిన సంజ్ఞలవలన తెలియనగును. దీనిని నుపయోగించు పద్ధతి పైన వ్రాయబడిన అంకెలభాషయట్లేగాన తిరిగి వ్రాయుట అనవసరము. అయినను మాదిరికొరకు ఉదాహరణము చూపెదను. శ్రీరాములు ౩౹౹ఈ౮౹ఆ౬ఉ౧౹౹ఉ) వ్రాసినయిట్లుండును. ఇటులనే యెన్నికాగితములనైనను వ్రాయవచ్చును. అయితే యిది తరుచుగా ప్రతివానికిని అంతగా తెలియదు.

4 గర భాషయని మరియొకటి కలదు. ప్రతిరెండు అక్షరములమధ్యను యీ గర శబ్దముపయోగించి మాట్లాడుట్లే దీనిని నుపయోగించుపద్ధతి. „నీవు యేమిపనిచేయుచున్నావు ?” అనుటకు „నీగిరీవు, యేగెరేమి పగరని, చేగెరేయు, చుగురున్నాగరావు.” అని యనవలెను. ఈవిధముగా యెంతవడిగానైనను మాట్లాడదలచిన మాట్లాడవచ్చును. ఈభాష బొత్తుగా చదువురానివారునహితము మాట్లాడుచున్నారు. అట్టివారితో నేను స్వయముగా మాట్లాడికూడాయున్నాను. మనము వేరొకసంగతి కనిపెట్టవలసియున్నాము. అదియేమనగా నీవు అని మాట్లాడునప్పుడు “నీగిరీవు” అనుచున్నాము. అప్పుడు యీ గరకు యేమిమార్పు కలిగినది. మొదటి అక్షరము, న+ఈ—నీగాన మనముపయోగించు గరకు గకు ఇకారమును రకు ఈకారమునువచ్చును. ఇటులనె ఉకారము ఎకారము మొదలగునవియు వచ్చుచున్నట్లు పైన వ్రాయబడిన వాక్యమువలన నిదానముగా పరీక్షించిన దానిమార్పు స్పష్టముగా తెలియుచున్నది. మొదటి గమీద హ్రస్వాచ్చును రమీదదీర్ఘాచ్చును వచ్చుచుండును.

(5) వర్తకులు మాట్లాడుభాష వేరొకటి గలదు. ధాన్యములకు సంఖ్యలకును, నాణెములకును వారు మారుపేర్లు కల్పించి స్వభాషలో నాయాపదము లుపయోగించి యితరులకు తెలియకుండు నట్లు మాట్లాడుచున్నారు. వర్తకులు బేరముచే కుబేరు లగుచుందురు గాన వారు మాట్లాడుకొనెడి యీభాషకు ‘ధనకోటివాణి’ యని పేరిడిరి.

ధాన్యములకు వారుపెట్టిన నూతన నామములు.

వడ్లు—ముక్కులు, పసుపు—కొమ్ములు, ఆముదాలు—జోరీగలు, నువ్వులు—చీమలు, వులవలు—జలపాలు, కందులు—పగడాలు, పెసలు—పూసలు, మిర్చి—తొడిమెలు, జొన్నలు—బొంతులు, ఈవిధముగా నానావిధ ధాన్యములకు ఆకారములనుబట్టి వేరుపేర్లు వాడుకొనుచున్నారు.

సంఖ్యలకు పెట్టబడిన పేర్లు.

1—ఏకురు, 2—అవ్వారు, 3 ఉద్దను, 4—పోగు 5—పాల, 6—చల, 7—సాతురు (లేక) పోతురు, 8—టుల, 9—నౌడు, 10—అంగళ్ళు, 11—అంగళ్ళేకురు, 12—అంగళ్ళవ్వారు, 20—అవ్వారంగళ్ళు, 30—ఉద్దనంగళ్ళు, 50—పాలంగళ్ళు, 100—సతుకు, 200—అవ్వారు సతుకులు, 200—పోగుసతు

కులు700—సాతురునతుకులు లేక పోతురు నతుకులు,1000 డకారు,5000-పాలడకార్లు,1624-డకారుచల సతుకుల అవ్వారంగళ్ళపోగు, 3598ఉద్దనుడకార్లు పాలనతుకుల నౌరంగళ్ళటల, యీవిధముగా వాడుకొనుచున్నారు. 7,17,70, 700యీయేడుతో గురించిన అంకెలన్నియు ద్వివిధముగా నుచ్చరించబడు చుండును.

నాణెములకు పెట్టబడినపేర్లు.

దమ్మిడి—బటువు, కాని—తాపిక, అణా—రికారు, పావులా—గరి, రూపాయి—రుకారు, అర్ధ—సార్థ (సగము అని అర్థము) నాసి—తక్కువ. ఈ విధముగా నుపయోగించుచున్నారు. సంఖ్యలనుగల మారుపేర్లను నాణెములకుగల మారుపేర్లను వచ్చిన తరువాత నివి రెండును కలిపి మాట్లాడుదురు. అవుడు యాగాని అనవలసివచ్చిన యెడల అవ్వారు బటువులు అనియు అర్థణా అనవలసినయెడల అవ్వారు తాపికలు లేక సార్థ రికార్లు అనియు అర్థరూపాయి అనవలసి వచ్చిన యెడల అవ్వారు గరులు లేక సార్థరుకార్లు అనియు బేడకు అవ్వారు రికార్లు అనియు నుపయోగించు చుందురు. ముక్కాని—ఉద్దను తాపికలు; అణాకాని—రికారు తాపికలు; అణా—ముక్కాని—రికారు ఉద్దనుతాపికలు లేక తాపికనాసి అవ్వారు రికార్లు రు 0-2-3- అవ్వారు రికార్లు తాపికలు అనియు 0-2-6 సార్థ అవ్వారు రికార్లు అనియు ఉపయోగించుచుందురు. రూపాయిఅణా—రుకారు రికార్లు; రూపాయిమూడుఅణాలు—రుకారుఉద్దను రికార్లు; రూపాయి పావులా—రుకారుగరులు లేక రుకారుసో రికార్లు అనియు అనుచుందురు, రూపాయి ముప్పావుల అనుటకు గరి నాసి అవ్వారు రుకార్లు లేక రుకారంగళ్ళావ్వారు రికార్లు అనియు అనవచ్చును. 3-6-6 అనుటకు ఉద్దనురుకార్లుచలరికార్లసార్థరికార్లు అనెదరు. కవిమీర్ష వర్తకులు వద్ద నీవు యెలా తీసికొంటివని ఒకవర్తకుడు వేరొక వర్తకుని అడుగును. అచటనున్న రయితులకు తెలియకుండునట్లు ముక్కాలు బస్తా 1 కి పాలరుకార్లగరులు అని అనును. అనగా రు 5-4-0 అని తెలియగలదు. పైను తానుl కి ఖరీదెంతయని వారిలోవా రడుగుకొనినపుడు సోగురుకార్లసాతురు (లేకపోతుర( రికార్లబటువు అని చెప్పును అపుడు రు 4-7-1 అని అర్థము కాగలదు.

(6) ఈవైవు తరచుగా మేము పయోగించుకొనుచున్నభాష మరియొకటికలదు. దానికి త్రిప్పి మరుగు భాషయని వాడుచున్నాము. ఎట్లనగా "నీవు తెలుగుపత్రికలు తప్పక చదువవలెను" ఈవాక్యమునందునీవు అను శబ్దములో మొదటిఅక్షరముమీాదనున్న ఈకారము అచటనేయుంచి రెండవఅక్షరముమీాదనున్న ఉకారము రెండవస్థానమునందె యుంచి వ మొదటికిని న రెండవస్థానమునకును చేర్చవలెను. అప్పుడు నీవుఅనుశబ్దమునకు వీను అనిఅగుచున్నది. ఇటులనే తెలుగు అనుటకు లెతుగుఅనవలెను. ఇందుమూడవఅక్షరమును మనము కదిలించవలసిన అవుసరములేకపోయినది. పత్రికలు అనుటకు తపి్రలకు అనవలెను. ఇవుడు మొదటవా్రయబడిన వీనుమాదిరిగా జంటలమార్పుకలగినది."తప్పక" పత్తక, "చదువవలెను" దచువలవెను. అగుచున్నది, పైవాక్యమంతయు 'వీనులెతుగు తపి్రలకు పత్తకదచువలవెను' అగుచున్నది. అచ్చు అక్షరములు వచ్చినపక్షమునకు యీక్రిందిమాదిరిగా వాడవలెను. "ఇదియేమివింత" దిఇ మేయి తింవ అనవలెను. ఎప్పుడు అనుటకు పెయ్యుడు అనవలెను.

(7) కభాష ఇది ప్రతి అక్షరముకు ముందు కబెట్టి మాట్లాడుట ఎట్లన "ఇదిక్రొత్తభాష" అనుటకు కఇకదికక్రొకత్తకభాకష అనిన అగుచున్నది. సామాన్యముగా ప్రతి పిల్లవాడును యీభాష మాట్లాడగలిగియున్నాడు. క అక్షరము తరువాత వుంచి మాట్లాడుట యుకలదు. ఇది రెండవవిధము. ఇదియెట్లనగా "ఇకదికక్రొకత్తకభాకషక" అనగా ఇదిక్రొత్తభాష అని స్పష్టమగుచున్నది. యీరెండవపద్ధతి మొదటిదానికంటె కఠినము. చిన్నపిల్లకాయలు యీక కు బదులు మరియే అక్షరమునైనను పెట్టిమాట్లాడుచుందురు. గపెట్టిమాట్లాడిన గభాషయనియు తపెట్టిమాడిన తభాషయనియు చెప్పుచుందురు.

# అ ర టి తో ట.

మ-రా-శ్రీ, గోపరాజు పేరరాజుపంతులుగారు దివ్యజ్ఞానానందంగారిచే వ్రాయబడినది.

" ఎవడు 360 అరటిచెట్లను నాటి వృద్ధిపరచునో వాడు సుఖించును." అని బంగాళీభాషలో నొకసామెతగలదు. ఇదిస్వానుభవమున నిజమనితెలుచున్నది. 360చెట్లవలనరూ360లు అనగాదినమునకు ఒకరూపాయ చొప్పున వచ్చును. ఈ రాబడి ఒక సామాన్య కుటుంబమునకు సుఖ జీవనమునకు జాలి యుండును.

హిందూదేశమున గల సమస్త ఫలవృక్షములలో అరటి చెట్టువలె నంత త్వరలో ఫలితమునకు వచ్చునది మరియొకటిలేదు. వేదములకాలము నుండి యీ ఫలమున్నదని యనుటకు అనేక నిదర్శనములు గలవు. ఈ రాజధానిలో దీనికిగల గౌరవము ప్రజలు వాడుకొను సామెతల వలననే తెలియగలదు. " అరటికాపు బీదవాని పంట" "ఫాల్గుణమున నాటిన అరటి బహుఫలమిచ్చు" ..."ఆషాఢ శ్రావణముల నాటిన అరటి అణగారిపోవును" " అరటికి క్రొత్తమన్ను అతిలాభము" "అరటికి ఆరు కొత్తెనలు నూరు నీరు" " అరటితోటలో కుండెడు ధనమున్నది. " " అరటిచెట్టునందు దైవత్వమున్నది. " " అరటి జ్ఞానుల ఆహారము" "అరటిచెట్టు కుటుంబ భవిష్యత్తును దెలుపును."... ఇత్యాది యర్థమిచ్చు సామెతలెన్నియో గలవు. అరటిచెట్టు ఉత్తరముగా గెలవేసిన తోట చక్కగా ఫలించుననియు, తూర్పునకు వేసిన రైతు ధనవంతు డగుననియు, పడమరకు వేసిన చెట్టుచచ్చుననియు, దక్షిణమునకు వేసిన రైతు చచ్చుననియు యిప్పటికిని వాడుక గలిగియున్నది. ఈ సందర్భమందు గెలలు మనయిష్టము వచ్చువైపునకు వేయుటకు నూతనశోధనవలన దేరిన చిత్ర మీక్రింద భాం దు ప ర చె ద. చెట్టు యేవైపునకు గె ల వే య వ లె న ని మనము కోరుదుమో పిలకలను పాతునపుడే మొదటివేరును ఆ వైపునకు త్రిప్పిన మనకోరికనెరవేరును.

అరటిపండ్లు మంచి యారోగ్యకరమగు యాహారమని శాస్త్రజ్ఞులచే సిద్ధాంత పఱచబడి యుండుటయే గాక దీనిపిండి బంగాళా దుంపలకన్న 48 రెట్లును గోధుమ రొట్టెకన్న 28 రెట్లును సులభముగా జీర్ణమగుననియు గొడ్డు మాంసముల కన్నను 4 గింతలు బలమైనదనియు ధృవపరచిరి. పలు పనుల కుపయోగించుటచే కలియుగ కల్పవృక్షమనినను జెల్లును. మరియుఒక ఎకరములో పండు అరటి పంటకు 20 ఎకరముల భూమిలో పండు గోధుమ పంట సరి తూగుటయు, ఆరోగ్యకరమగుటయు, త్వరలో ఫలితమునకు వచ్చునదగుటచేతను, నార అనేక పనుల కుపయోగించుచు, యిప్పుడు మిగుల ధరకలిగి యుండుటచేతను, చిరకాల కరువులతో కూడినదియు, బహు కుటుంబాభి వృద్ధియు నగుచుండు మనదేశమున అనువగు భూమిగల ప్రతిరైతు నీపంట నభివృద్ధి నొందించవలసినదే గాని రైతులకు కృషిశాస్త్ర విద్యాభివృద్ధి లేమిం జేసియో, తమ పూర్వుల పద్ధతులు అనేకములు తాము తప్పించుచున్నను " అరటికి మాత్ర మచ్చుబా టుండవలెను" అను పిచ్చి వాడుక చేతనో, మరే కారణము చేతనో గాని యీసేద్య మంత విరివిగా వ్యాపింప జేయుచుండుటలేదు. మంచిమంచి జాతుల అరటి పిలకలు యేయే స్థలములందు దొరుకునది తెలిసిన వానిని దెప్పించివేసి వృద్ధిపరచువా రిప్పుడిపుడుబయలుదేరుచుండిరి గాని అట్టివి దొరుకుచోట్లు దెలియకున్నవి. నాకు దెలిసినంతవరకు తోటవేసి పెంచురీతి యీక్రింద దెలుపుచున్నాను.

భూమి సిద్ధముచేయు రీతి :— అరటితోటకు ఎఱ్ఱనేలలు మిక్కిలి మంచివి కాని మిశ్రమరేవడి నేలలలో గూడ వేయవచ్చును. తోటవేయుటకు యేర్పరచుకొన్న భూమిలో ఒక సంవత్సరమునకు పూర్వమే సస్యమును వేయక చుట్టుకంచె మాత్రము వేసి భూమిని అధమము 8 సార్లు అయినను దున్ని యుంచి 3 అడుగుల లోతును,

H. H. Nawab Sir Mahammad Ibrahim Ali Khan Bahadur.
Nawab of Tonk.



నవాబ్ సర్ మహమ్మదు ఇబ్రాహీం అలీఖాన్ బహదూరు.
టోంకు నవాబు.

H. H. Nawab Sadiq Mahomed Khan.
Nawab of Bhawalpur.



నవాబ్ సాదిక్ మహమ్మదు ఖాన్.
భావల్పూరు నవాబు.

H. H. Raja Sir Rama Varma
Raja of Cochin.



రాజా సర్ రామవర్మ. కొచ్చిన్ రాజా.

Maharao Sawai Sir Khengarji Bahadur.
Rao of Cutch.



మహారావు సవయి సర్ ఖెంగర్జి బహాదూర్.
కచ్చి మహారావు.

H. H. Maharao Sir Umed Singh Bahadur,
Maharaja of Kotah.



మహారావు సర్ ఉమేద సింహా బహాదూర్.
కోట మహారాజు.

H. H. Maharaja Sawai Kishan Singh Bahadur,
*Maharaja of Bharatpur.*



మహారాజ సవయి కృష్ణ సింహా బహాదూర్.
భరతపూరు మహారాజు.



H. H. Maharaja Sir Ranbir Singh Bahadur.
Maharaja of Jind.

మహారాజా సర్ రణబీర సింహ బహదూర్.
జిందు మహారాజు.

The Trainbearess of their Majisties.
Indian Princes,



రాజదంపతుల వస్త్రాంతభాగముఁ బట్టుకొనిన హైందవ రాజకుమారులు.

అంతేకైవారమును గల గోతులను 10 జేసి అడుగుల కొకటి చొప్పున త్రవ్వియుంచి (ఎఱ్ఱనేలలైన చెదలు చచ్చుటకు యెండు ఆకలముల నందులో వేసి తగలబెట్టి) బూడిదతో పొడిమట్టిని జేర్చి 3 వంతులా గోతుల నింపవలయును.

జాతులువిత్తనములు:— అరటులలో వందలకొలది జాతులున్నవి. అందిచట వృద్ధిగానుండు జాతులనేరి 2 అడుగుల మొదలు 4 అడుగుల యెత్తుకు లోవుగల మంచి బొద్దుగల పిలకల నేరితెచ్చి ఒకవారము నీడనారబెట్టి (ఇట్లు చేయకున్న పిలకలు పిమ్మట సన్నగిలి గలకలో నీరుదిగి కుళ్ళును) ఆగోతులలో వేసి సందులేకుండ గట్టనచేసి పూడ్చి నీరుపెట్ట వలెను. వేరూనిన పిదప చివరల కత్తిరించిన చెట్టు బలముగ బెరుగును.

వేయుకాలము :— ఫాల్గుణ చైత్రమాసములందీ తోటల నాటుట బహుమంచిది. ఆషాఢ శ్రావణముల నాటిన లోవల పురుగుపట్టి తోటలు వృద్ధికావు.

నీరు :— వారమునకు 2 సార్లు నీరు పెట్టుటయు 2 నెలల కొకసారి మొదళ్ళమట్టి కుళ్ళగించి తీసి, క్రొత్త మట్టి వేళ్ళపై కప్పుచుండుటయు శ్రేష్ఠము.

పెంట :— బూడిదయు, పచ్చి (ఆవు) పేడయు దీనికి శ్రేష్ఠమగు యెరువులు. మనుజుల మలమూత్రములును మంచి యెరువే. చెన్నపురి ప్యారీఅండ్ కంపెనీ వారి ప్రత్యేక యెరువైన మేలే.

కలుపుతీత దున్నుట :— సాలు 1 కి అధమము 3 సార్లు కలుపు తీయుచు 3 సార్లు దున్నుచు 6 సార్లు మొదళ్ళ మట్టికుళ్ళగించి క్రొత్తమట్టి చేయుచు ఆకులను కోయకున్న మంచి గెలలు విడుచును. క్రొత్తశోధన ప్రకారము యేచెట్టుఆకు దానికే బలముగాన వర్షాకాలమందలి యెండాకులను చెట్టు నరికిన ఆరటి దుంపలను మొదళ్ళ వద్దనే కుళ్ళ నియ్యవలయును.

ఫలితము, ఉపయోగములు:— వేసినసంవత్సరము లోపుగనే ఫలితమునకు వచ్చును. దీనిఅన్నిభాగములుఉపయోగ కరములే కాయలు ముదిరిన పిమ్మట పైచెక్కుతీసి గుండ్రని ముక్కలుగ తరిగి ఎండబెట్టి దంచి, పిండిచేసిన, కాయకంటె మూడు రెట్లెక్కువ లాభము వచ్చును. అరటిపండ్లు, సర్వకాలము దొరుకున వగుటచే, జ్ఞానులు, ప్రత్యేక మిదే యాహారముగా నుపయోగించుచున్నారు. అరటిపండ్లనుండి, మనోహరమగు వెలిగారము చేయుదురు. అరటి కాడల రసము, నల్లరంగు వేయుట కుపయోగించును. రంగుపోదు. డిప్పలవలన చెట్టు 1 కి ¼ పౌను నార కనీసము వచ్చును. అరటి నారచే సిరివిగా వస్త్రములును, పలువలువిధములగు తాళ్ళును, చాపలును, తివాసులును, మొదలగునవి చేయుచుండుటచే నారకెక్కువ గిరాకి కలిగి టన్ను 1కిరూ375 లు మొదలు రూ 525 లు వరకు ధరగలిగియున్నది. ఎక్కడికిని పంపలేనివారు, తాళ్ళుగా పేనినను లాభము వచ్చును. నార సులభముగా దీయుటకు రూ 8 మొదలు 5 వరకు ధరగల యంత్రము లనేకములు సిద్ధము చేయబడి యున్నవి. నారకు ప్రత్యేకము "మూసాటెక్సు టైలిస్" జాతి అరటి బహుమంచిదని నిర్ధారణ చేయబడినది. యకరము 1 కి సుమారు వేయి బోదెలు పట్టును. బోదె 1 కి కనీసము 1రూ.చొప్పునవచ్చినను, శాస్త్రపద్ధతిగా వృద్ధిపరచిన తోటకు యకరము 1 కి సంవత్సరమునకు వేయి రూపాయలు ఫలితము రాగలదు.

ఔషధోపయోగము :— ఆయుర్వేదము నందు అరటిదుంప రసమును, పట్టలలోని నీరును, కొన్ని వ్యాధులకు అనుపానముగను, లేత మొవ్వువంటి అరటాకులను (పొక్కు పాలాస్త్రి పుండు) గాయములకు, పుండ్లకు,రణములకు కట్టెదరు. ఎండను ఆటంక పరచుటలో దీనికెక్కువ శక్తి కలదు గాన, కన్నుకలక, మొదలగు కంటి రోగములవారికి దీని పండుటాకు లుపయోగింతురు. బలహీనులకు దీనిపండ్లచే చేసిన షర్బతులు మంచి బలము చేయును. వాడుకలోని ఉపయోగము లందరునెరిగినవే అరటిచెట్లవరసల మధ్యమధ్య కందదుంపల నాటిన లాభము వచ్చును. కృషి విషయమై యేసందేహములున్నను కృషిపత్రికలు నివారించును. బుద్ధిమంతులందరు యీకృషి విస్తరింప జేసి మార్గదర్శులై దేశమాతకు సుపుత్రు లనిపించు కొనవేడెద.

# సంగీతము.

మ.రా.శ్రీ, దుప్పూరి జగన్నాథశర్మగారిచే వ్రాయబడినది.

మన దేశమును బూర్వపు రాజులు పాలించుచుండినపుడు సంగీతవిద్యకు ఆదరమును దగు గౌరవమునుండెడివి. ఇప్పుడట్టి యాదరమును గౌరవమును వారితోనే పోయియుంట నీవిద్య ఎక్కడనో నూటికొక్కరియందు మాత్రమే కాన్పించుచున్నయది. ఇదిగాక దేశమందుగల గొప్ప యనర్థదాయకమైన వృత్తిగల వేశ్యలయందీ విద్య వ్యాపించియుండుట నీవిద్యకు నానాటికి గౌరవముతగ్గి తుదకొక నీచవిద్యగానైతము బరిగణింపఁ దటస్థించినది. ఏదియైనను బూజ్యులయవలంబనమున నభివృద్ధియు నీచావలంబనమున క్షీణదశయు నొందుట సహజమేకదా! ఈ విద్యామహిమ నెఱిఁగిన ప్రాజ్ఞులచేనియ్యది పూజ్యవిద్యగా నెన్నఁబడుచుండినను జనసామాన్యమునకు మాత్రమట్లు బొడగట్టక ఏసభలవిందమన్నను నీతిపథ వ్యతిరిక్తములైన శృంగారభాషణములతో నీవిద్య వేశ్యలచేఁ బ్రదర్శింపబడుచుండుటవలన గౌరవముగా నెన్నకుండుటయు నద్దానిని భ్యసింపకుండుటయుఁ దటస్థమగుచున్నది. ఇట్టిస్థితిలో విమర్శనాశీలురైన బుద్ధిశాలురుపెక్కండ్రు దేశమున దైవానుగ్రహమువలన బయలుదేఱినవారై ప్రతిదానియందు గుణమెంతకలదో యవగుణమెంతకలదో తెలిసికొనుచుండుటవలన నింతకుఁబూర్వ మిఱువదియేండ్లక్రిందటికంటె నిప్పుడీవిద్యయభివృద్ధిలోనున్నదనిచెప్పవీలగుచున్నది. ఇట్లీవిద్యయేగాక జనులదుర్భ్రమవలన నణఁగఁగొట్టఁబడినట్టి వివిధవిద్యలుకూడ నిప్పుడభివృద్ధినొందఁ బ్రారంభించినవి. నిక్కమారయుచో నీవిద్దకంటె నుత్తమమైనవిద్య మఱియొండులేదనియే చెప్పనగును.

త్రివర్గ ఫలదాస్సర్వే దానయజ్ఞ జపాదయః
ఏకంసంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదమ్।
హరీశాదిస్తుతో ధర్మార్థద కామాన్ప్రసాదితః
నిష్కామస్తు దనుష్ఠానా న్మోక్షమాప్నోత్యసంశయమ్॥

ధర్మార్థకామములనెడి మూడుఫలములుమాత్రమే దానయజ్ఞ జపాదులవలనఁగలుగును. సంగీతవిజ్ఞానమువలన నన్ననో ధర్మార్థ కామమోక్షములనెడి వర్గచతుష్టయమును నిస్సంశయముగాఁగలుగునని యిందలి ముఖ్యాభిప్రాయము. ఇదిగాక

వీణావాదన తత్త్వజ్ఞో శ్రుతిజాతి విశారదః
తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి॥
గాయంశ్చా త్రాణిరథాంగపాణే। నిత్యన్నిరస్తాఖిల కర్మబాధః
నిరంకుశస్స్వప్న సమోవిరాగీ। కైవల్య మభ్యేతి ముకుందభక్తః॥

యను మొదలగు స్మృతివచనములనారసినను మోక్షముండుటకు వేదాంతమార్గమును సంగీతాభ్యాసముఁదక్క వేఱుమార్గములు లేవనియు వేదాంతాభ్యాసమున హానినొందుటతప్పిన మోక్షమిచ్చునదేయనియు సంగీతమో నిరపాయముగా బరమొసఁగునదియై యున్నదనియు సర్వవస్తునములై హరిపాదసేవాపరాయణులై సంగీతాధారమున మోక్షమునిరంకుశముగా నరులుబొందగలరని తెల్పుచున్నవి. మఱియు నాదమే మోక్షకారణమని యనుభవజ్ఞులైన మహర్షులు వక్కాణించియున్నారు. అందు

ఆహతో నాహతశ్చేతి ద్వేధా నాదో నిగద్యతే
తత్రచానాహతం నాద మేకాగ్రన్యస్త మానసాః॥
గురూపదిష్టమార్గేణ మహాంతః పర్యుపాసతే
దశరక్తి విహీనత్వా న్నమనోరంజకో నృణాం
తస్మాదాహతనాదస్య శ్రుత్యాది ద్వారతోఖిలామ్
జేయం విశవ్యతే లోకరంజనమ్ భవభంజనమ్॥

అను శ్లోకమువలన ఆహతానాహతములను ద్వివిధనాదములలోను నిశ్చలమనస్కులకేలభించు అనాహతనాదము గురూపదేశమార్గమున ఋషులు పాసించుచున్నారనియు నది రక్తివిహీనమగుటచే జనులకు సంతోషకారణముకాదు గనుక సంగీతములోని యాహతనాదము శ్రుత్యాదిముఖమునఁ దెలిసికొన్నచో జనులకానందమును బాపనాశనమును సంపూర్ణముగాఁగలుగుననియుఁ దెలియుచున్నది. ఇట్టి యీవిద్యనభ్యసించి దీనిమహిమము ననుభవముచేఁ దెలిసికొన్నవారు జయదేవాదులును, నారాయణతీర్థులును నారదాదులును, దత్తిలకోహళా

వలసివచ్చినది. అందుచేత వారికి జలము నొసగిన విద్యలను మనముకూడ సంపాదింపవలెను. ఈసంగతి నందఱు కనిపెట్టియే యున్నారు.

పరదేశములకు భారతీయులు విద్యాసంపాదనార్థము పోయినప్పుడు కలుగు నితరలాభము లెయ్యవి? హిందూదేశజులకు జాత్యైక్యత యసాధ్యమనియు, హిందూదేశజులనేకజాతులవారనియు, ఒక జాతివారు గుణములలో, జీవనావిధానము (Mode of life) లో మఱియొక జాతివారినుండి చాలభేదము కలవారనియుఁ జెప్పఁగొందఱకు సంతోషమగును. ఇట్లు నమ్ముటకన్న నెక్కువతప్పులేదు. ఆంధ్రులు, మహారాష్ట్రులు, వంగదేశస్థులు భాషాభేదము గలిగియున్నను వారిజీవనావిధానములో నేమియు భేదములేదు. వంగదేశస్థులైనరోమేశచంద్రదత్తుగారి కాలములో వంగదేశ జీవనావిధానము నుదహరించుచు వ్రాసిన నొక కథను జదివియుంటిని. అందులో వంగదేశనామముల నాంధ్రనామములుగా మార్చినయెడల నాకథ యాంధ్రదేశస్థుల జీవనావిధానముగనే కొంచెమైన భేదములేకుండ కనఁబడెను. ఈసంగతి— అనగా హిందూదేశ జనులందఱి జీవనావిధానము ఒక్కటియెయగుట—పరదేశములో భారతీయులు కలసినప్పుడు మిక్కిలి స్పష్టమగును. లండను, కేంబ్రిజి, ఆక్సుఫర్డు మొదలగు పట్టణములలోని భారతీయులసభలలో భారతవర్షముయొక్క అన్నిభాగములనుండి విద్యార్థులు కలసి మెలంగుచుందురు. మహారాష్ట్రులు, వంగదేశస్థులు, పాంచాళదేశీయులు, మద్రాసువారు, లంకాద్వీపమువారు, కాశ్మైఘువారు—అందఱు నిక్కడ కలసికొని తమలో భాషాభేదముతప్ప నితరభేదమేమియు లేదని కనిపెట్టుదురువారియున్న తావర్తనములు, వారి జీవితాశయములు వారిజీవనావిధానము కొంచెమైన భేదములేక సమానముగనున్నట్లు తెలియుచున్నది.

మనదేశ మింగ్లాండుదేశముచేఁ బరిపాలింపఁబడుచున్నది. హిందూదేశముయొక్క ప్రస్తుతస్థితి కాంగ్లేయ పరిపాలన మవసరము. కాని యీపరిపాలనమున్ని విధములను మేలుగలుగఁ గొన్నికీడులను గలిగియున్నది. ఇందులో ముఖ్యమైనది హిందువులు దమ పౌరుషముఁ గోలుపోవుట. పరదేశస్థులచేఁ బరిపాలింపఁబడు నప్పుడు వారుచేయునవన్నియు మేలేయనిపొగడుచు, వారు తిట్టినను గొట్టినను నోరాడక యూరకొనుచు తమ్ములను తామే నిందించుకొనుచు మనుజుల [illegible]కులు ప్రవర్తింతురు. ఇంగ్లీషుజనులు హిందూదేశస్థులయెడ [illegible] ప్రవర్తించినను మనవారు దేవరచిత్తమని [illegible] మెలగుదురు. ఈచెడుగుణము పోవుటకు ఐక్యమార్గము స్వాతంత్ర్యమును కలిగియున్న ఇతర దేశములకు బోయి యక్కడఁ గొంతకాలము నివసించుటయే.

ఆంగ్లేయులు మెలఁగు విధములు వేఱు; మనవిధములు వేఱు. హిందూదేశమునం దధికారపదవులను కలిగియున్న ఆంగ్లేయులవిధములను జూచి తప్పకుండ మనమార్గములకన్న [illegible]తరములని ప్రజలు తలఁచెదరు. కాని యింగ్లాండుదేశమునకు బోయినపుడు వారిమార్గములను మనమార్గములను మనము సరిగఁబోల్చఁగలుగుదుము. ఇంగ్లాండులో నున్నప్పుడు వీరిజీవనావిధానములోని చెడుగులను మనజీవనవిధానములోని మేలును హిందూదేశములోఁ గనిపెట్టని విధమున నిక్కడఁ గనిపెట్టఁజాలుదుము. భారతీయులమని మనమ్ములను మేము గౌరవించుకొని మాదేశముపై నత్యంతాదరమును గర్వమునుఁ బొంది యుండుదుము. లోకోపకారమునకై మనదేశమెంతేని చేసినదనియుఁ జేయఁగలదనియుఁ దలఁతుము. మనదేశాభ్యుదయమునకై మనమెంతే పాటుఁబడుటవలననే మనజీవనము ఫలమగుననియుఁ దలఁతుము.



# ఆంధ్రభాషాభిమానము.

మ. రా. శ్రీ, సి॥ శివయ్య శాస్త్రిగారిచే వ్రాయఁబడినది.

క॥ మనమున ననయము దలఁచెద
మునిజననుత పాదజలజు ముదవైరిహరిన్
మనసిజ జనకుని వినతా
వనితానుతయాను దీన జనతాపహరున్ ॥

ఏదేని యొకదానియం దేరికైన నభిమానముం జనియించఁ బూనిన నద్దాని ప్రాశస్త్యముం గూర్చి వెల్లుగ నుడివిన నాయభిమానాంకురము వారి మనంబున వేరూనుంగాని లాఁతి వితంబునం గానేరదు. కాన నే నిట వ్రాయఁబూనిన "యాంధ్రభాషాభిమానంబ" ను వ్యాసంబునఁ దొలుత నాంధ్రభాషా ప్రాశస్త్యముం గూర్చి వ్రాయుట యత్యంతావశ్యకం బని సహృదయుల హృదయంబులకెల్లఁ గరతల గతామలకంబు కైవడిఁ దేట తెల్లంబ.

పరమ పావనంబగు నీభరతఖండంబునఁ గల శ్రుతిసుభగంబులగు దేశభాషలలోనెల్ల మిన్నయని స్వదేశ వాస్తవ్యులవలనను, బరదేశ వాస్తవ్యులవలనను, బేరెన్నికంగన్న దీ తెలుంగు బాసయొకండ. దేశంబునంగలబాసల కన్నిటికన్న నీబాస కర్ణపేశలత్వంబున నిరవధిక యశంబు సముపార్జించుటకుఁ గల కతంబు మృదుపద సదనం బనఁదగుగీర్వాణంబు తోడునీడంబలె దీనినెడఁ బాయకుండుటయ యని తలంతు. ఈ యమూల్య గీర్వాణ భాషాలంకారము మనబాసం గైసేసిన పగిది వేఱొండు బాసం గైసేయదయ్యె. కొండఱీయది తక్కుంగల ద్రవిడాది భాషలరీతిఁ బ్రాచీనంబు గాదనియుఁ, గతిపయహాయనంబులకు మున్ను నన్నయభట్టారకుండను కవిపుంగవునిచే సృజియింపఁ బడినదనియుఁ, గవిమండల మండనుండన నొప్పు రామరాజ భూషణ ప్రణీత వసుచరిత్రము నందలి

"మ॥ మహిమున్వాగనుశాసనుండు సృజియిం*పంగుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీ*నాథుండు ప్రోవన్మహా
మహులైసోముడు భాస్కరుండు వెలయిం*పన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ ద*త్ప్రాగల్భ్యమూహించెదన్॥"

అనువద్యము నాధారంబుగఁ గైకొని నుడువుచుండువారు, ఆయదియ విచారిత రమణీయతం దెల్పెడిని. అమ్మొయి నీతెనుంగు నన్నయభట్టారక కల్పితంబయయినచో, శిశుసమమగు నీబాసను సరస మృదుమధుర శైలిని నాంధ్రమహాభారతాదిమ పర్వత్రయం బొనర్పఁగల్గు నెట్లు? ఆకవి తిలకుని కవితను సారమతిం బరికించిన నాయది శైశవంబుననుండు భాషా బాలికా పలుకులం బోలెఁ గన్పట్టవు. పై పద్యంబున రామరాజభూషణునకు నన్నయభట్టు లక్షణవతియై యొప్పని యాంధ్రభాషా యోషను సలక్షణఁగ నొనర్చిన వాఁడని యాశయంబుగాని యన్యంబు గానేరదు. నన్నయ భట్టారక విషయికం బయిన "శబ్దశాసన" బిరుదమును నీయర్థంబునే వేనోళ్ళ సాటుచున్నయది. నవీనంబుగ మ.రా.రా. శ్రీ, మానవల్లి రామకృష్ణకవి ప్రకటిత కుమారసంభవ ప్రణీతయగు టెంకణాదిత్యుండు నన్నయకుం బూర్వకాలీనుండని నుడువుచున్నవారుగాని యాయంశంబు విబుధ వివాద గ్రస్తంబయి యిదివఱకును ననిర్ధారితంబగుటంజేసి దానినే నిట నిప్డు గైకొననైతి. లక్షణవతియగు మన తెనుఁగు భాషకు జనకుండు నన్నయ భట్టారకుండనియే యిప్పటి నాయాశయంబు.

ఎదియెవ్వగిది నొప్పినను రాజమహేంద్రపురమును ముఖ్యపట్టణముగ నుంచుకొని వేగిదేశమును నేఁగలంబొరయ నీయక పాలనం బొనరించిన రాజరాజనరేంద్రుని యాస్థాన విద్వత్కవియగు నన్నయ భట్టారకునిచే నీసలక్షణాంధ్రభాష యుత్పన్నంబై శంభుదాసాది కవితల్లజుల చేఁ బోషితయయి, భాగవతుల నెల్లరఁ దనభాగవతసుధాపయోధిం దోప్పదోఁగంజేసిన బమ్మెర పోతనాదులచే నలంకృతయయి, పిదపఁ దనపూర్వపుణ్య పరిపాకవశంబున నోయన దక్షిణదేశంబును నేకాతపత్రంబుగఁ బాలనంబు

సేసిన శ్రీకృష్ణదేవరాయల ప్రాపుఁజెంది యౌవన సౌఖ్యంబులనెల్లనోలి ననుభవించి యెంతయు నివ్వటిల్లె.

శ్రీకృష్ణదేవరాయల మాతృభాష కర్ణాటకంబయ్యు నీతెనుంగుపై నింతటి యనుంగు సూపుటకు దీని సౌకుమార్య మాధుర్యాది సుగుణగణంబుల ప్రథమగణనీయంబులగు కతంబులై విలసిల్లు. ఈ యిలాపాలకుని కాలంబుననె మనభాషాలలన వింతవింత తొడవులచే నలంకరింపఁబడియె. తొల్లింటి నన్నయాదు లక్కాలంబున మనుజులు పురాణశ్రవణ పరాయణు లగుటంజేసి యాకయిత సేతరులు సంస్కృతంబు నందలి పురాణంబులనె తెల్గింపఁ గల్గిరి. పదంపడి సకల కవికుల సనాథులగు శ్రీనాథాదులు సంస్కృత కావ్యంబులను గొన్నింటిని నాంధ్రీకరించిరి. ఆయవి శైలిని గాంభీర్యతను వహించి భాషా ప్రౌఢిమం దెల్పునవి యైనను, సంస్కృతపద జటిలంబులగుటం జేసి యన్వయకాఠిన్యతను వహించి బాలకు వన్నెవెట్టవాయె. పురాణంబులనుండి జనుల వీనుల కింపుఁగొల్పు చిత్రకథ నొకదానిం గైకొని స్వకపోలకల్పితంబులగు వర్ణనలఁ గావ్యంబులీ తేనికాలంబుననే రచియింపఁబడియె. ఇట్టి కావ్యంబులు రచియించిన కవిపుంగవులలోఁ బ్రథమగణనీయుం డల్లసానిపెద్దన. ఈతండు మనుచరిత్రంబను మహాకావ్యంబును రచియించి రాయలవారి కంకిత మొనర్చె. ఈ మహామహుండు తన రాజ్యంబు స్థిరపఱచుకొనుట పొంటె, బలువాఱు యవనోర్వీపతులపై దాడివెడలవలసి యుండినను, మన తెనుఁగుభాషయందు వారికిఁగల గౌరవంబుచే "భువనవిజయంబను" సభను నష్ట దిగ్గజంబులని పేరువడసిన యల్లసాని పెద్దనాది కవులను నెలకొల్పి, తానును సంస్కృతాంధ్రంబులఁ జక్కని పాండిత్యమును గడించిన వాఁడగుట గ్రంథంబుల రచియించియు, వారిచే రచియింపించి సన్మానించియుఁ, బలు తెఱంగుల భాషం బోషించె. ఈమన్నెతేఁడు కళింగదేశ విజిగీషామనీషం దండెత్తి వెడలి విజయవాటికను వాసరంబులఁ గొన్నింటిని గడపి, యనంతర మాంధ్రధరాపురందరులముఖ్యపట్టణమై యొసలారు శ్రీకాకుళంబుంజేరి హరివాసరం బుపవాసంబు సల్పి యందలి యాంధ్రమధుమథనుని యాలయంబున జాగరణంబు సల్పుతఱి నక్కమలాపతి పొడసూపి,

"గీ॥ తెలుఁగదేల నన్న దేశంబు దెలుఁగేను
తెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులుగొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స ॥"

యని చెప్పినట్లు తనవిష్ణుచిత్తీయ గ్రంథంబునందు వ్రాసికొని యుండువాఁడు. ఇది యొండు సాలదే? మన తెనుఁగుభాషా శ్రేష్ఠ్యంబును దానిపై రాయలవారికిఁ గల యనురాగంబును సూచించుటకు? ఈతనికిఁ గడుంగూర్చు నెచ్చెలియుఁ గవియునగు నల్లసానిపెద్దన రాయలు యశఃకాయుండైన పిదపఁ దనసానుభూతి నీక్రింద వడువునం దెల్పియుండువాఁడు.

"సీ॥ ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె । మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ బల్లకి దనకేలఁ బట్టియెత్తె । బిరుదైన కవిగండపెండేరమునకీవె తగుదని తానె పాదమునఁ దొడిఁగెఁ । గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు లడిగిన సీమలయందునిచ్చె ।

గీ॥ నాంధ్రకవితాపితామహ యల్లసాని ।
పెద్దనకవీంద్ర యనినన్నుఁ బిలుచునట్టి,
కృష్ణరాయలతో దివికేఁగలేక ।
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబుఁబోలె. "

అఖిలసామంత వసుమతీకాంత సంసేవిత చరణసరసీజుండగు శ్రీకృష్ణదేవరాయండేడ? పురమేఁగఁ బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తుటేడ? ఇక్కార్యకరణంబునకు రాయలవారిం బురికొల్పినది మన తెనుఁగు బాసపైని వారికిఁగల యనురాగంబకాదే? ఎట్టి యనన్య సామాన్య సౌకుమార్యంబు మనభాషయందు లేనిదే యట్టి యన్యభాషను మాతృభాషగాఁగలవారి మనీషుల నాకర్షింపనేర్చు? ఆనాఁడట్టి వారి మనీషల నయిత మాకర్షించిన మనభాష యదియె మాతృభాషఁగాఁగల మనమనీషల నిపుడాకర్షింప లేమికి నెంతయు నచ్చెరు వొందవలసి యున్నయది. రాయల పెను మన్ననలం బడసిన వారిలో ముక్కుతిమ్మనయనఁబడు నంది తిమ్మన ద్వితీయుండు. ఈకవి ప్రకాండుం డల్లసాని పెద్దనవలెనే తేనెలొలుకు ముద్దుపలుకులఁ

పారిజాతాపహరణంబను కావ్యంబును రచియించి రాయలకె కృతియిచ్చె. ఈతని పలుకు లతికోమలములు. కాననె "ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకని" లోకమునందు వాడుకలో నున్నది. ఈకవి తల్లజుఁడు కృష్ణదేవరాయల భాషాపోషకత్వమ్ము నిమ్మాగ నీపద్యమ్మున నుడివి యుండువాఁడు.

> "క. ప్రతివర్షవసంతోత్సవ। కృతు కాగతసుగత సుకవినికర గుంభితకావ్య। స్మృతిరోమాంచితశంకిత। చతురాంతః ప్రసాధన చతురా."

ఇంతయేల! ఈనరవరుని పేరారయని బాలురును గోపాలురును నీతెలుఁగునాటనుండరనినఁ జదువరులీతని భాషాభిమాన పోషకత్వంబులరయుదురు కాబోలు.

వెండియుఁ గర్ణపేశలంబును, శిశువులను, బశువులను నయితము ప్రమాన్పడంజేయు గానంబునకుఁ దద్దయు ననువగు మన తెనుఁగుపై జెప్పిన చొప్పుననొక స్వదేశ నరపతుల యుల్లంబులుమాత్రమే కాదు. పరదేశీయులగు నాంగ్లేయుల యుల్లంబులు నయితము పల్లవింపించిమించె. నూతన కవీతన కుసుమసముంబగు తనను సౌకుమార్యంబున (Italian of the East) అనివారివలన బిరుదందె. మనకుఁ బ్రభువులయి యేవేళను మనల గీడులఁ బోరయనీయక కనుఁగల్గి కాపాడు నాంగ్లేయుల డెందంబులకు నిందుఁగొల్పి బిరుదందిన గౌరవంబు దీనికొక్కండునకు దక్క మఱియే దేశభాషకును నలవడదయ్యె. కొండొక యాంగ్లవిద్వద్వతంసుఁడు రాజ్యకార్యంబు నెఱప నీసీమ కేగుదెంచి తనదు రాజ్యకార్యంబునకు వలసినంతమాత్రము తెనుంగుం దెలుసుకొన నమకట్టి చదువఁ జదువ నందలి రుచి నవనవోన్మేషం బగుడు సొంతంబుగ దానిం బఠించి చక్కని సాహిత్య మలవరుచుకొని భాషాభివృద్ధికై మిక్కుటంబగు సాయం బొనర్చె. ఆతని చరిత మిందుఁ గొంతవివరించినఁ జదువరుల డెందంబుల కమందంబగు నానందంబుం బొందుపడం జేయునను తలంపున దానికై దొరంకొనియెద.

కతిపయాబ్దంబులకు మున్ను సి. పి. బ్రౌన్ అను నాంగ్ల విద్వద్వతంసుఁడు కొండొక రాజకీయకార్య నిమిత్తుండై యీసీమ కరుదెంచె. ఆతండు ప్రప్రథమంబునఁ దెనుఁగు బాసను దనదు రాజకీయ కార్యంబుల కనుకూలపడు నంతమట్టునకు నేర్చుకొనవలయునను తలంపున బండితున కొకనికి వేతనం బొసంగి తనకడ నిడుకొని చదువఁ దొడంగె. చదువఁ జదువ నందలి రుచి వాచామగోచరంబగు డుదతోభ్యధికంబులగు నుద్గ్రంథంబుల నెల్లం దుదముట్ట బఠించి చక్కనిసాహిత్య మలవఱుచుకొనియె. ఈతఁడు విరచించిన నిఘంటు ద్వయంబును, వ్యాకరణంబును, ఛందంబును, నీవిషయంబున సాక్షులై యొప్పెడిని. మఱియు విద్వాంసులకు వెక్కసంబగు రొక్కం బొసంగి వసుచరిత్రము, విజయవిలాసము, మున్నగు కఠిన తమంబులగు గ్రంథంబులకు వ్యాఖ్యానంబుల లిఖియింపించె. అక్కాలంబున ముద్రాయంత్రంబులు పంచబంగాళం బగుటం జేసి యమూల్యంబులగు గ్రంథంబు లనేకంబులు నామమాత్రావశిష్టంబులగుచుండె. ప్రయత్నప్రయాసలకోర్చి దేశదేశంబులనుండి వానియన్నింటిం దెప్పించి క్రమ్మఱ లిఖియింపించి యొక్కొక్క పాత్రంబుపైనను, నాణి ముత్తియంబులనెత్తి పోడుచు తన సొంత యక్కరంబులచే నాంగ్లభాష నొక్కొక్క గ్రంథంబునకు నుపోద్ఘాతంబు వ్రాసి దొరతనము వారికొసఁగిరి. వారు వానినిపుడు చెన్ననగరస్థిత ప్రాచీన పుస్తక భాండాగారంబునం బదిలంబుగ నుంచియున్నవారు. ఇమ్మహాశయుం డొత్తరి నిందుక యొప్పరికించినచో నుత్తమమ్ములగు శబ్దములనేకమ్ములు వమ్ములయి యుండనోపు. మనకును మనభాషకును నిట్టి మహోపకృతి యొనర్చిన యీ నరదాతయగు నీదొర యశువుం దీర్చికొన మన తెనుఁగు దేశ వాసులందఱును వారియెడఁ గృతజ్ఞతా కలితమతులై యుంటకన్న వేఱొండు వెఱవుఁ గానము.

ఇక్కరణిని మన తెనుఁగు తనదేశము పరదేశమను భేదము లేశమైనను లేక వెంటనుగుంటుపడని కీర్తి మోసె. దీనికంతటికిని కారణంబు మన తెనుఁగు బాసయొక్క యపూర్వ సౌకుమార్యంబని మీకె విదితచరంబయి యుండ మఱియొకమాఱు నే వ్రాయుట చర్వితచర్వణంబ కాదె?

ఇమ్మెయి దినంబు లనేకంబులు ననుడుఁగన్నతండ్రులం బోలెఁ గడువ్రేమ నిడుకొని కాచి కాపాడుచుండిన శ్రీకృష్ణదేవ రాయాది మానవనాథు లీధరకుదూరులైరి. మనయాంధ్రభాషావధూటికిని గష్టదినంబు లాసన్నంబు లయ్యె. ఉపకారం బొనర్చువా రసత్తైనను నపకారం బొనర్చు మహాత్ములు మెండయిరి. ఇమ్మధ్యకాలంబున మన తెలుఁగుబాల యను మెలనాఁగకు సంభవించిన దుస్థితిని నిరవశేషంబుగ వర్ణింప నీభాష చాలదు గాన మీరలె యూహించుట యుచితతమంబని తలంతు. ఇట్లుండఁ "గష్టంబు లెన్నంటికిని గాఁపురంబులు సేయవ"ను లోకోక్తిచందంబున మన తెనుఁగుబాల తొల్లింటివంతను సయితము మఱపింపఁ గల్గినంతటి యాంగ్లసామ్రాజ్యమే తెంచె. వీరి రాజ్యపరిపాలనంబువలన జనులు బొందుచుండు లాభంబు లనేకంబులు, అయిన ప్రత్యుపకృతిక మేయంబులు, వాని యన్నింటను మేలిమిదైనది యందందు విద్యాశాలల స్థాపించి జనులను విద్యావంతులుగ నొనర్చుట. వారు కళాశాలలం జదువఁ గడంగిన ప్రతివిద్యార్థియు నాంగ్లభాషతోడ నేదేనియొక దేశభాషను సయిత మవశ్య పఠనీయంబుగ నియమించిరి. దీన నెంతయు మఱి మనయాంధ్రంబు జేకొత్తం దొడంగి యందందుఁ గల భాషాభిమానుల స్వాంతంబులకు సంతసంబుం గదురఁ జేసె. కాని నవీనంబుగ నియమింపఁబడిన విద్యాశాఖయందలి దేశభాషా విషయకంబులగు నియమంబులం బరికింపం గ్రమ్మఱ మున్నటికన్న నెక్కుడుగ నొరలునోయని వంతపడవలసి యున్నది. దొరతనము వారికిట్లు మనబాసపై దయతప్పుట కిదిజేసిన దోసమేదియో తెలియరాకున్నది. ఈదేశభాషా విషయిక నిబంధన మన భాషాభిమానం బరీక్షింప నియమించినట్లు తోఁచెడిని. ఇంతయేల! "మునుపసిఁడి పసిమిఁ గలదైన గంసాలిసనదో సమను" నట్లు భాషాభిమానంబు మనకడనుండిన వారి యుత్తరువులకై నిరీక్షింపనేల. మాతృభాషాభిమానంబు లేనివాని మనుగడయే మనగడయన నొప్పునే? మాతయు నన్ను మాతృభాషయున్నను నొక్కటియకాదే? భేదంబు గలదే? "మాతృదేవోభవ పితృదేవోభవ" యను నుపనిషదర్థానురోధంబుగఁ దల్లింగన్న పగిదిఁ దత్తుల్యయగు మాతృభాషను సయితము గనవలయునుగాదె? చూడుఁడీ క్రిందిపద్యము స్వదేశాభిమానంబును, దదనుసారియగు స్వభాషాభిమానంబును నెట్లు నొక్కి వక్కాణించుచున్నదో "ఉండునె భూమియం దొకరుఁడీయది నాదగుజన్మభూమి నేనుండెడిచోటు నాదియనియుబ్బక ప్రాణము గల్గు వీనుఁగై" స్వదేశ స్వభాషాభిమాన విరహితుండు ప్రాణంబుతోడి పీనుంగఁట. ఈమాట యొకటి చాలదె మనదు హృదయాలవాలంబున దేశభాషాభిమాన బీజంబును నాట? కాన నికనైన మనమున జ్ఞానమూని మనయాంధ్రభాషా పూర్వపుఔన్నత్యముం దలంచుఁడు. ఆయాదేశంబులవారు స్వదేశభాషాభిమాన భూషిత మనీషులై వారిమాతృ భాషాభివృద్ధి పొంటెనొనరించు జతనంబులంగనుఁడు. మనభాషయగు తెనుగు భాష యందభిమానముంగలిగి దానింజదివి యభివృద్ధిఁ జేయఁగడంగుఁడు.

ఆంధ్రభాషాభిమానులగు చదువరులారా! నేనీ వ్యాసము నింతటితో విరమించితిని. ఈవ్యాసంబునుసారమతులు వ్రాసినఁ బలువిషయంబులు వ్రాసియుందు రోటుకుంభంబు సంద్రంబునమునింగియుఁ దనకొలందికిందగిన జలంబునె పొందులాగున విషయంబనల్పంబైనను బుద్ధియల్పంబగుటంజేసి వ్రాయవలసినదంతయు వ్రాయకయుండవచ్చు. వ్రాసినయల్పంబునను దప్పులు కుప్పలైయుండవచ్చును. "ప్రమాదో ధీమతామపి" యనునార్యవచనానుసారముగ ధీమంతులకేతప్పులుండుట సహజంబగుడు నాబోంటి మందమతికిఁ దప్పులవచ్చుట యొకయరిదికాదు. వానినన్నింటిని నొప్పులుగనె పరిగణించి యానందింపఁ జదువరులకు మీరెంతయు నీదీనునచేఁ బ్రార్థితులు.

క॥ వరకరుణా గోపు.మురహర
సరసీజదళనయన సత్యాబాధా
కరవిధృతపృథులశైలా;
పరమకృపాకలితహృదయ భవబంధహరా.

# సముద్రయానము.

మ. రా. రా. శ్రీ, మేడేపల్లి వెంకటరమణాచార్యులువారిచే వ్రాయఁబడినది.

---

నసాహసమనారుహ్య నరో భద్రాణి పశ్యతి.

అయ్యలారా? పూర్వకాలమం దెల్లప్పుడు సకలవిషయము లయందు మహాప్రసిద్ధి గాంచిన మనబ్రాహ్మణజాతి కాలక్రమమున నీభరత ఖండము పైకి దండెత్తివచ్చిన తురుష్క పారశీకాది దేశాధిపతుల యభియోగములచే దేశస్థితి మారుటవలన నియమముతో దమ తమ వైదికాచారములను వైదిక విద్యలను నిలుపుకొనలేక కొంతవఱకు వర్ణాశ్రమాచార వినేతలగు మంచి పరిపాలకులు లేక కొంతవఱకు స్వవర్ణోచిత వైదిక కర్మాచరణమందు వైదికవిద్యా సంపాదనమందును శిథిలాదరులైరి. పరమ వైదిక సంపత్తిగల ప్రాచీన మహర్షుల గోత్రోత్పన్నులేనా వీరని శంకను బొడమింపునవస్థకు లోనయిరి. వీరికి దగిన రాజావలంబనము లేకపోవుటచే వీరి యుదర పోషణకు వీరే పనిచేయవలసి వచ్చుట వలన పూర్వపు వైదికనిష్ఠ కవకాశము చిక్కదయ్యెను. లేమి సర్వానర్థ మూలముగదా? దారిద్ర్యోపహతులైన యీజాతివారిట్లు నానాటికి వృత్త్యంతరముల నాశ్రయించి జీవనము చేయుచు వచ్చిరి. ఇంతలో నీభారత వర్షీయుల ప్రాక్తన పుణ్యవశమున నాంగ్లేయ ప్రభువు లీదేశమును స్వాధీనము చేసికొని పరిపాలన మారంభించిన తరువాత వీరిప్రాచీన గ్రంథసామగ్రిని, వీరిబుద్ధి కుశలతను, నాగరికతను బాగుగ విమర్శించి తెలిసికొని వీరి వర్ణాశ్రమాచారములను గూడ చక్కగ బరిపాలింపుము వానికి క్షతిరాకుండ నభయమిచ్చి వీరిస్థితిని బాగుజేయ సమకట్టి దేశమందంతట బాఠశాలలను స్థాపించి లౌకికప్రజ్ఞాజనకముగు నాంగ్లేయవిద్యనే కాక వీరి వేదశాస్త్రాది విద్యలను గూడ వీరు మునుపటివలె నభ్యసించుట కవకాశము గలుగునట్లు జేసిరి. వీరిపై దొరతనమువారి కృపారసాయన మహార్ణవ ముత్తుక్కలపై పార్లిపార నుజ్జీవించి తమతొల్లిటి జీర్ణస్థితిని విడిచి ప్రతివిషయమందును వాసిన్నెమ్మును గాంచుచున్నారు. ఇపుడు వీరు దొరతనము వారిచే నత్యున్నత పదములందు నియోగింపబడు చున్నవారయి యించుమించుగా రాజ్యధురము నంతయును వీరే నిర్వహించు చున్నారని చెప్పవచ్చును. ఈ యుద్యోగములచే వీరు సకల పురుషార్థ సంపాదకములగు నమితైశ్వర్యము నార్జించుచున్నారు. ధన మూలము గదా జగత్తు. ఇట్టి గొప్ప పదవుల యందుండి దొరతనమువారిచే సన్మానింపఁబడుచున్న వారిని జూచి ప్రలోభితులై వీరిలో మరి కొందరు ధనవత్పుత్రులు కుశాగ్రీయ బుద్ధులునైన పిన్నవయసు వాండ్రీ యిండియాలో నేర్పబడు విద్యలచే దృప్తినొందక యధికముగా నీదేశ విద్యాభ్యాసమునం దభిలాష గలవారయి వ్యయప్రయాసముల కోర్చి, కొంతకాలము స్వదేశ స్వజన స్వగృహ పరిత్యాగ దుఃఖమును సహించి యింగ్లాండు జర్మనీ జపాను మొదలగు దూరస్థిత పరదేశములకు నోడలనెక్కి సముద్రముగుండా బోవు చున్నారు. అచ్చట నిజప్రయోజన పరిసమాప్తి పర్యంతము నివసించి వివిధ విద్యాపారంగతులయి స్వదేశమునకు తిరిగి జనుదెంచు చున్నారు. కాని సూర్యాలోకమును జూచి సహించనేరని దివాంధములవలె పరోచ్ఛ్రాయా సహిష్ణువులయిన మనవారిలో గొందరు సముద్రయానము (1) శ్రుతిస్మృతులచే నిషేధింపబడిన దనియు (2) శిష్టాచార గర్హితమనియు (3) చండాలాన్నమును భక్షించుటచేతను విహిత కర్మాననుష్ఠానము చేతను పతితులయి జాతిభ్రంశము నొందుచున్నారనియు వీరితో సహవాసము చేసినవారు గూడ పంక్తిబాహ్యులనియును, (4) బుద్ధిపూర్వకముగా జేసినదానికి ప్రాయశ్చిత్తమే లేదనియు, నొకవేళ ప్రాయశ్చిత్తము జేసికొనినను వీరితో మునుపటివలె స్వశాఖవారు గలియగూడదనియు గొన్ని యాక్షేపణలం బన్నుచున్నారు. ఇట్లు దూషించు నీమహాజనులు కేవలము దురాగ్రహగ్రస్తులుగాని శ్రుతిస్మృతి సూత్రమర్మములను ప్రాచీన చరిత్రములను లేశము నెరింగిన వారుగారు. ఈ యభినివిష్ట బుద్ధులు తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నట్లు వైతండికులయి తమ పక్షమును సమర్థించుకొనుటకు లేనిపోని యుక్తులు బలుకుదురు.

ఇందులో శ్రుతి సముద్రయానము నెంతవఱకు నిషేధించినదో మొదట విచారింతము. భగవదారాధన రూపములగు యజ్ఞాదికర్మను విధించు వేదమెచ్చటను సముద్రయానమును నిషేధించినట్లు ప్రమాణమును గానము. ఋగ్వేదములో నొకటిరెండు స్థలములలో సముద్రయానకథ పేర్కొనబడినది. ఎట్లన "తుగ్రోహ భుజ్యుమశ్వినోదమేఘే రయిం నకశ్చిన్మమృవాఅవాః। తమూహథుర్నౌభిరాత్మన్వతీభిరంతరిక్ష ప్రుద్భిరపోదకాభిః॥ తిస్రః క్షపస్త్రిరహాతివ్రజద్భిర్నాసత్యాభుజ్యుమూహథుః పతంగైః। సముద్రస్యధన్వన్నార్ద్రస్య పారే త్రిభీరథైః శతపద్భిః షళశ్వైః॥ అనారంభణే తదవీరయేథామనాస్థానే అగ్రభణే సముద్రే। యదశ్వినావూహథుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాతస్థివాంసం" (ఋగ్వేదము ప్రథమమండలము 116 సూక్తము. 3-4-5 ఋక్కులు) దీనియర్థము పూర్వ మశ్వినీదేవతల యం దత్యంతభక్తిగల తుగ్రుడను నొకరాజర్షి గలడు. దవిష్ఠద్వీపగతులగు శత్రువులచే నాతడు గడుబీడింపబడినవాడై వారినిజయించుటకు భుజ్యుడను తనపుత్రుని సైన్యములనిచ్చి నావలతో సముద్రములోనికిబంపెను. చాలదూరము సముద్రములో బ్రయాణముజేసినతరువాత మధ్యసముద్రమందు దైవవశమున నొక పెద్దగాలివానచే నోడలు బ్రద్దలయి యందులోనుండువారికి జీవితసంశయము గలిగెను. అప్పుడు భు

జ్యుడను వాడాపదనుండి తొలగించుమని యశ్వినీదేవతలను స్తుతించగా వారు కరుణించి వీనిని సురక్షితముగా తమ నావలచేత మూడుదినములలో వానిగృహమునకు దిగబెట్టిరి. ఇందువల్ల నశ్వినీదేవతలయొక్క మాహాత్మ్యము భక్తవాత్సల్యము వెల్లడిచేయబడుచున్నవి. సముద్రయానముయొక్క మంచిచెడ్డలనుగూర్చి యేమియు చెప్పలేదు. కాని సముద్రయానము ప్రత్యవాయ బహుళమగున కర్మయగుటచే నట్టి నిషిద్ధకర్మనాచరించినవారిని దేవుడు కుపితుడై శిక్షించినాడనియు వీరు చేసినస్తోత్రములచే తిరిగిప్రసన్నుడై రక్షించినాడనియును దీనితాత్పర్యమని కొందరు కల్పింతురు. బాగున్నది. అట్లయితే భారతములో రాజసూయయాగమునకుముందు సహదేవుడు దక్షిణదిగ్విజయయాత్రయందు నావతో ప్రయాణముచేసి సముద్రమధ్యమందున్న ద్వీపవాసులను జయించి నిరపాయముగా నిజస్థానమును జేరినట్లు సభాపర్వాం

దిగ్విజయపర్వము ముప్పదియొకటవ యధ్యాయములోని యిరువదియెనిమిది డెబ్బదియవశ్లోకముల చే గానవచ్చుచున్నది. (సాగరద్వీపవాసాంశ్చ నృపతీన్మ్లేచ్ఛయోనిజాన్ । నిషాదాన్పురుషాదాంశ్చ కర్ణప్రావరణానపి । ద్వీపంతామ్రాహ్వయం చైవపర్వతంరామకం తథా । తిమింగిలంచ సనృపంవశే కృత్వామహామతిః) ఇందుకు పూర్వోక్త భిన్నతాత్పర్యకల్పకులేమి సమాధానమిత్తురు? మనము దీనిని మరియొకవిధమున సమర్థించవచ్చును. సముద్రయానము పాపకర్మయయినచో భగ్ననౌకాస్థితజనప్రార్థనల నీశ్వరుడు మన్నించి వీరిని రక్షించగూడదు. అట్లుగాక వీరందరు దైవకృపచే సురక్షితముగా నొడ్డునజేరిరి. కాబట్టి యిందువలన శ్రుతి సముద్రయానము నెంతమాత్రము నిషేధించినటు కానరాదు. సముద్రయానము విదేశమునకు బోయి యచటనివసించువారిని భగవత్ప్రార్థనకు భగవద్దయాసంపాదనమునకనర్హులనుగా నెంతమాత్రము జేయనేరదు.

"యోమాంపశ్యతి సర్వత్రసర్వంచ మయిపశ్యతి ।
తస్యాహం నప్రణశ్యామి సచమేనప్రణశ్యతి॥"

(ఎవడన్నిటియందు నన్నునాయందన్నిటిని చూచుచున్నాడో నేనతనికినశింపను. నాకతడునశింపడు) వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః (జగమంతయు వాసుదేవస్వరూపముగా నెరుంగుమహాత్ముడరుదు) సర్వత్రసమదర్శినామ్ (సమదృష్టిగలవారికన్నిచోట్ల నీశ్వరస్వరూపము గానవచ్చును) సర్వంఖల్విదంబ్రహ్మ (ఇదియంతయు బ్రహ్మమే) నేహనానాస్తికించన (ఇచటపలుతెఱగులగాలేవు. అనగా నబ్రహ్మాత్మకవస్తువేదియులేదనుట) మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా (ఈజగమంతయు నప్రకాశరూపుడనైన నాచేత వ్యాపింపబడియున్నది) ఇత్యాదివాక్య ప్రామాణ్యముచే నీవిశ్వమంతయు బ్రహ్మాత్మకమనియు నిచట నబ్రహ్మాత్మకమయినది లేదనియు సర్వభూతసంఘాతమీశ్వరాత్మకమనియు భూతారాధనమే యీశ్వరారాధనమనియు బోధించబడుచున్న అద్వైతైకత్వవిజ్ఞానమే సకలవేదోపనిషత్తుల నంతస్తాత్పర్యము. ఇదియేపరమార్థమైన వైదికమతధర్మము. నౌకాయాత్రచే విదేశమునకుజని యచ్చటనివసించువాడిట్టి పరమవైదికధర్మమున కనధికారి గానేరడు. ఏతాదృశానుసంధానరూపధర్మానుష్ఠానమునకు దేశకాలనియమ మక్కరలేదు.

ఇకను సముద్రయానమును స్మృతిశాస్త్ర మెట్లునిషేధించుచున్నదో విచారించుటప్రాప్తావసరము. మనుస్మృతిలో నపాంక్తేయులనుగా గొందరిని జెప్పివారితో దుల్యముగా "అగారదాహీగరదః కుండాశీ సోమవిక్రయీ సముద్రయాయీవందీచ తైలికః కూటకారకః। ఏతాన్విగర్హితాచారా నపాంక్తేయాన్ ద్విజాధమాన్। ద్విజాతిప్రవరో విద్వానుభయత్రవివర్జయేత్॥" (గృహములను దహించువాడు, విషము బెట్టిచంపువాడు, భర్త బ్రతికియుండగా జారస్త్రీగర్భమందు బుట్టినవానియన్నమునుదిని జీవించువాడు, సోమలత నమ్ముకొనువాడు, సముద్రయానము చేయువాడు, స్తుతిపాఠకుడు, తైలముకొరకు నువ్వులబిండువాడు, కూటసాక్ష్యము నిచ్చువాడు, నిందితాచారులు నపాంక్తేయులు నధమబ్రాహ్మణులు నైనవీరిని బ్రాహ్మణశ్రేష్ఠుడు దైవపితృకర్మలయందు విడువవలయును) అని నిందించియున్నాడు. ఇట్టివాడు దైవపితృకర్మలయందు విడువబడుచున్నాడు. అయితేయిచట సముద్రయాయి" శబ్దముపైనున్న 'ణిని', అనగా తాచ్ఛీల్యప్రత్యయముచే వాణిజ్యవృత్తినవలంబించి కలకాలము నోడలతో సముద్రయానము చేసి జీవించువాడనియర్థము. స్మృతియిట్టివాని నిషేధించుచున్నదని తాత్పర్యముగాని కేవలముగాదు ఏలనగా బ్రాహ్మణునికి ప్రాతస్స్నానసంధ్యావందనాది నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు, పంచమహాయజ్ఞములు మొదలగు బహుకర్మల నవశ్యకర్తవ్యములుగా స్మృతిశాస్త్రము విధించుచున్నది. మాటిమాటికి సముద్రయానముచే దీర్ఘకాలప్రవాసముచు విదేశమందు చిరకాలావస్థానము నవలంబించువాని కీకర్మచక్రావర్తనము మిక్కిలి దుష్కరముగదా. కావునచిరకాలము స్మృతివిహితకర్మాచరణము నుల్లంఘించుట కలవాటుపడినవాని విషయములో నీస్మృతినిషేధము పట్టునని చెప్పుటన్యాయ్యము.

ఈవిషయములో శ్రుతిస్మృతులు భిన్నాభిప్రాయము కలవియగుచున్నవి. ఎట్లన- పూర్వోదాహృతశ్రుతి స్వల్పకాలముగాని చిరకాలముగాని సముద్రయానము చేయుట తప్పనియని చెప్పినటు కానరాదు. స్మృతియో నిషేధించుచున్నది. శ్రుతిస్మృతులకు పరస్పరవిరోధము సంభవించునపుడు, "శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవగరీయసీ। అవిరోధే సదాకార్యం స్మార్తం వైదికవత్సదా॥" (శ్రుతిస్మృతులకు పరస్పరవిరోధమున్నపుడు శ్రుతిబలీయము. విరోధములేనపుడు వైదికకర్మనువలె స్మృత్యుక్తకర్మను సతతము జేయవలయును) విరోధేత్వనపేక్షంస్యాదసతిహ్యనుమానమ్। జైమిని పూర్వమీమాంసాసూత్రము. 1 అధ్యాయము, 3 పాదము, 3 సూత్రము. (దీని యర్థము. శ్రుతితో విరోధించు స్మృతి యప్రమాణమున నాదరణీయమగుచున్నది. ఎట్లన- మేడికఱ్ఱతో జేసినయూపమును స్పృశించి ఉద్గానము చేయవలయునని విధించు శ్రుతితో నాయూపమును నూతనవస్త్రముతో నాచ్ఛాదింపవలయునని చెప్పు స్మృతివిరోధించుచున్నది. గాన దీనికప్రామాణ్యాపత్తి కలుగుచున్నది) ఇత్యాదిప్రమాణవచనములచే

శ్రుతిబలవత్తరమయినదని స్పష్టమగుచున్నది. ఇతియుగాక మరియొక విశేషముగలదు. బ్రాహ్మణములు, సూత్రములు, స్మృతులు మొదలగువానిచే విధింపబడిన కర్మలు మనఃపారిశుద్ధ్యము నుత్పాదించి తత్త్వజ్ఞాననిష్ఠకు దోడ్పడును. తొలినుండి శరీరేంద్రియనిగ్రహపరుడై జీవపరమాత్మల యథార్థస్వరూపమును సంబంధమును విద్యాబలముచే నెరింగి తత్త్వానుసంధానపరుని కకించిత్కరములు. ఇట్టినిష్ఠకుదరని వారికవి యుపయోగకరములు. కాబట్టి పూర్వోక్తాత్మైకత్వ విజ్ఞానవిశుద్ధమన కీనిషేధము లేశముదగులదు ఇతరులవిషయమందైనను సముద్రయానము చేయుటవు ములో నివశించు సమయమందు నీ స్మృత్యుక్తాచారములను నిర్వర్తింప నవకాశము లభించదని స్మృతినిషేధించుచున్నదిగాని వాడెక్కడనున్నను యథావిధిగా నాకర్మల నాచరింప శక్తుడయ్యెనేని వానివిషయములో నిట్టి నిషేధముపట్టదు. సముద్రయానము పట్టుండదనిందు మరియొక యంశమును మనవిచేయుచున్నాను. పూర్వమొకప్పుడు "సింధుసౌవీర సౌరాష్ట్రాం స్తథాప్రత్యంతవాసినః। అంగవంగ కళింగాంశ్చ గత్వా సంస్కారమర్హతి। సౌరాష్ట్రసింధు సౌవీరా నవంతీదక్షిణాపథమ్। ఏతాని బ్రాహ్మణో గత్వా పునస్సంస్కారమర్హతి।) అనువచనానుసారముగా నార్యావర్తమును విడిచి బ్రాహ్మణుడు సింధు సౌవీర సౌరాష్ట్రాంగవంగకళింగాది దేశములకుజనినచో జాతిచెడునుగావున పునరుపనయనాదిసంస్కారములను జేసుకొనవలయునను విధియిపుడేమాయెనో విచారింపుడు. ఇపుడీదేశములన్నియు నుత్తమజాతిబ్రాహ్మణులచే సమాక్రాంతములయి నివశించబడుచున్నవి. ఎవరెచ్చటికేగిన నట్టియాక్షేపణ నిపుడు జేయ శక్యముగాదే! వెయ్యేల నిపుడు మనవారుకొందరు బర్మా జపానులోనగు దేశములకు సముద్రయానము చేసి పోవుచున్నారు. వారి విషయమయి శిష్టాచార పరాయణు లూరకొనుచున్నారా లేదా. ఇట్లనే ఐరోపా ప్రస్థానముగూడ మరికొన్నిరోజులకు పరిపాటిగాగా సర్వశిష్టాభ్యుపేతమగును. బ్రాహ్మణుల తొల్లింటి వైదికనిష్ఠయనగా గర్భాష్టమియందుపనయనము పిదపను పాకరణము తరువాతగురుకులమందుండి స్వాధ్యాయము చదువుట, అగ్నిహోత్రపరిచర్య, భిక్షాటనము, మొదలయిన కర్మలనాచరించి యథాశాస్త్రముగా బ్రహ్మచర్యవ్రతమును ముగించి పిమ్మట గృహస్థాశ్రమమును స్వీకరించి స్వాధ్యాయ ప్రవచనము పంచమహాయజ్ఞముల నొనరించుట, శిలోంఛవృత్తులచే జీవించుట మొదలగు విధులనాచరించుట ప్రకృతమే బ్రాహ్మణశాఖయందును గానము. స్వస్థలమందున్న వారాచరించుచున్నారు గనుక విదేశమునకుబోయినవా రాచరించలేదందురా? అందరు సమానస్థితిలోనేయున్నారని దృఢముగా జెప్పవచ్చును. ప్రాచీనులయిన పరమర్షులీ కర్మకలాపమునే యభిప్రాయములో నే ప్రయోజనమునకు గల్పించిరో యట్టియభిప్రాయము నట్టిప్రయోజనమును నానాటికి దెలుసుకొనజాలక జనులేదో విధముగా కర్మలనాచరించుటయే ప్రధానమనితలంచుచున్నారు. ఇదికేవలభ్రాంతిమూలము.

విదేశమునకుబోయినవారు చండాలాన్న భక్షణచే జాతిభ్రంశము నొందుచున్నారను విషయమును విచారింతము. ఐరోపాజాతివారిలో మనభరతఖండమందువలె వీరుబ్రాహ్మణులు వీరుబ్రాహ్మణేతరులు వీరుచండాలురను వర్ణవివేకము లేదనియును చండాలులనగా నెట్టివారో వారిలక్షణమును మనఛాందస విప్రసత్తములకు బాగుగ దెలిసినచో నిట్టియాక్షేపణలకు నోరెత్తుదురా? ఐరోపాజాతివారును మనమును చరిత్రసమయప్రారంభమునకు ముందొక కాలమందుత్తరధ్రువమం దేకమతాచారావలంబులై యేకభాషావ్యవహారులయి చిరకాలమత్యంతైకమత్యములో జీవించిన యార్యజనుల సంతతివారము. కాలక్రమమున నాయార్యులు సంఘజీవనమును మాని నలుగురు నలుదిక్కులకు జెదిరిరి. వారిలోపడమటిదిక్కునకు జనుదెంచినవారి సంతతివారైరోపావారు. నాటినుండి నేటివరకు వారొకజాతివారుగా నేర్పడియుండిరి. భరతఖండమునకు వచ్చినవారిలో మాత్రము కొన్ని కారణములచే నవాంతరజాతులేర్పడినవి. దేశపు శీతోష్ణస్థితిచే వేషభాషావ్యత్యాసమేగాని పడమటియార్యసంతతిలో జాతివ్యవస్థలేదు. గావునవారిలో పంచములెట్లుందురు? చండాలలక్షణములను మనుస్మృతి యిట్లుచెప్పుచున్నది. "శూద్రాదాయోగవః క్షత్తా చండాలశ్చాధమో నృణామ్। (శూద్రునిచే బ్రాహ్మణస్త్రీయందు బుట్టించబడినవాడు చండాలుడు) వీరొనర్చువ్యాపారములెవ్వియన, మనుస్మృతి 10 అధ్యాయము 51, 52, 55, 56శ్లోకములు) చండాలశ్వపచానాంతు బహిర్గ్రామాత్ప్రతిశ్రయః। అపపాత్రాశ్చకర్తవ్యా ధనమేషాంశ్వగర్దభమ్। వాసాంసి మృతచేలాని భిన్నభాండేషు భోజనమ్। కార్ష్ణాయసమలంకారః పరివ్రజ్యా చనిత్యశః। దివాచరేయుః కార్యార్థం చిహ్నితా రాజశాసనైః। అబాంధవంశవంచైవ నిర్హరేయురితిస్థితిః। వధ్యాంశ్చహన్యుస్సతతం యథాశాస్త్రంనృపాజ్ఞయా। వధ్యవాసాంసి గృహ్ణీయుశ్శయ్యాశ్చాభరణానిచ। దీనియర్థము- చండాలులు శ్వపాకులు గ్రామమునకుపైగా నివసింతురు. మృతులయినవారి వస్త్రములు వీరుకట్టుకొందురు. వీరుభోజన పాత్రములు లేనివారైయుండవలయును. కుక్కలు గాడిదెలు వీరిసొత్తు. ఖండపెంకులయందు భోజనము. వీరినగలు ఇనుముతో చేయబడినవి. సర్వకాలము భ్రమణశీలురైయుందురు. రాజశాసనములచే చిహ్నితులైపనులమీద పగటివేళ తిరుగవలయును. బంధువులులేని శవమును పైకితీసుకొనిపోవుదురు. అపరాధముచేసినవారిని రాజాజ్ఞచేవధించి వారివస్త్రములను శయ్యను నగలను తీసికొందురు.

కావునవీరిని చండాలులనదగదు. వీరుమరియెవ్వరనగా హూణమ్లేచ్ఛాది శబ్దములచే వ్యవహరించబడు నొకజాతివారు. తారానాథతర్కవాచస్పతి తనబృహన్నిఘంటువులో నీవిధముగా నాశబ్దములను నిర్వచించియున్నాడు. "శ్వపాకస్తు తురుష్కశ్చ హూణోయవనఇత్యపి। లోకబాహ్యస్తుయోవాజి గవాశ్యాచారవర్జితః। మ్లేచ్ఛఃకిరాతశబరపుళిందాద్యాశ్చతద్భిదాః గోమాంసఖాదకోయస్తు విరుద్ధంబహుభాషతే। సర్వాచారవిహీనశ్చ మ్లేచ్ఛయిత్యభిధీయతే। (అచా

రవిహీనుడును, గోమాంసభక్షణచేయువాడు విరుద్ధభాషణమును జేయువాడు హూణుడు మ్లేచ్ఛుడని పిలువబడుచున్నాడనియు కిరాతశబరపుళిందాదులు వీరిలోభేదములనియు నీశ్లోకములకర్థము) గోమాంసభక్షణము, విరుద్ధభాషావ్యవహారము, ఆచారహీనతయును నీమూడును గదా మ్లేచ్ఛశబ్దాభిలాప్యులుగాజేసి వీరిని విహీనులనుగా స్మృతికర్తలైన మనయిటీవలఋషులు దలంచునట్లుజేసినవి. పూర్వకాలమందు మనయార్యజనులుగూడ గోమాంసభక్షణము నమితముగాజేయుట కలవాటుపడియుండిరని జెప్పుటకు గృహ్యసూత్రములు, పురాణములు, పాణినినిరుక్త గోఘ్నాదిశబ్దములు, మనకుముఖ్యమైన నిదర్శనములు. కాలక్రమమున మతాచార వ్యత్యాసముచే వీరుమానివేసినారు. వారిప్పటికి విడువలేదు. ఇకవిరుద్ధభాషావ్యవహార విషయమునందయితే, పూర్వమొకప్పుడు గొప్పరాజ్యమేలిన గ్రీకుజాతివారు తమభాషను మాట్లాడువారుతప్ప తక్కినజాతులవారందరు నక్కిరాత (Barbarians) ప్రాయులన్నట్లు భరతఖండమందలి యార్యులు సంస్కృతభాషావ్యవహారములోనున్న కాలమందితర భాషలను మాట్లాడువారిని మ్లేచ్ఛులని (అపశబ్దములు మాట్లాడువారు) వ్యవహరించెడివారన్నందుకు "మ్లేచ్ఛోహవా ఏషయదపశబ్దః తస్మాద్బ్రాహ్మణేన మ్లేచ్ఛితవై నాపభాషితవై-తేఽసురాహేలయోహేలయ ఇతిమర్వన్తః పరాబభూవుః" ఇత్యాదిశ్రుతియే ప్రమాణముగాదీసికొనవచ్చును. ఇకవారి యాచారములంటేనా భరతఖండమునందునివసించు నీహిందువులలోనే నానావిధభేద భిన్నములైనమతములు ఆచారములుండుటచే పరస్పరవిరోధములు కలిగియైకమత్యము చెడియున్నవారైనపుడు వీరికివిదేశస్థుల మతాచారములు కొంచెమైనను రుచించునా? శ్లాఘనీయములగునా? కాబట్టి దేశకాల విప్రకర్షకృతాజ్ఞానముచే యిరోపావారు కేవలవిజాతీయులు నసమజాతివారు నస్పృశ్యులని భ్రమజెందు పామరజనులుతప్ప తదితరులయిన ప్రపంచచరిత్రరహస్యాభిజ్ఞులు వారునుమనయార్యుల సంబంధులేయనిదెలిసికొనుచున్నారు. ఇట్లువారియన్నమును భక్షించినమాత్రముచే దృష్టముగాసంభవించు లౌకికహానియేమి? "సర్వాన్నానుమతిశ్చప్రాణాత్యయే తద్దర్శనాత్" బ్రహ్మసూత్రములు 3 అధ్యాయము. 4 పాదము 26 సూత్రము (ప్రాణమునకాపదవాటిల్లు నపుడెవ్వరిచ్చినయన్నమైననుదినవచ్చును) అట్లుపూర్వాచారము గనపడుటవలన పూర్వకాలమందు ఉషస్తిచాక్రాయణుడను నొకఋషి దేశమునుపేదవడి దేశాంతరమునకుబోవుచు మార్గమధ్యమందు క్షుద్బాధచే గంతగతప్రాణుడైనీచజాతివాడైన మావటివానియొద్దనుండి కొంచమాహారమును స్వీకరించి ప్రాణమును నిలువరించుకొనెనని యుపనిషద్గాథ. ఇదిగాక మనుస్మృతి పదియవ యధ్యాయములోని 102,103,104,105,106 107,108. శ్లోకములు చూడుడు. "సర్వతః ప్రతిగృహ్ణీయాద్బ్రాహ్మణ స్త్వనయంగతః। పవిత్రందుష్యతీత్యేతద్ధర్మతో నోపపద్యతే నాధ్యాపనాద్యాజనాద్వా గర్హితాద్వా ప్రతిగ్రహాత్। దోషో భవతి విప్రాణాంజ్వలనాంబు సమాహితే। జీవితాత్యయమాపన్నో యోన్నమత్తియుతస్తతః। ఆకాశమివపంకేన నసపాపేన లిప్యతే। అజీగర్తస్సుతంహంతు ముపాసర్పద్బుభుక్షితః। నచాలిప్యతపాపేన క్షుత్ప్రతీకారమాచరన్। శ్వమాంసమిచ్ఛన్నార్తోత్తుంధర్మాధర్మవిచక్షణః। ప్రాణానాం పరిరక్షార్థం వామదేవో నలిప్తవాన్। భరద్వాజః క్షుధార్తస్తు సపుత్రోవిజనేవనే బహ్వీర్గాఃప్రతిజగ్రాహ వృధోస్తక్ష్ణోమహాతపాః। క్షుధార్తశ్చాత్తుమభ్యాగా ద్విశ్వామిత్రశ్శ్వజాఘనీమ్। చండాలహస్తాదాదాయధర్మాధర్మవిచక్షణః ॥ క్రమముగా వీటియర్థము. ఆపదనొందినబ్రాహ్మణుడు నీచునివల్లనుండినయితము దానమును పరిగ్రహించవచ్చును. అతనికిపాపములేదు. ఎట్లనగా పవిత్రమయిన గంగోదకము వీధికాలువనీళ్లచే దూషించబడదని శాస్త్రమర్యాద. నిందితుడైనవానికి వేదముచెప్పినను యజ్ఞముచేయించినను, వానివలన దానము పట్టినను ఆపదలోనున్న బ్రాహ్మణునికి దోషములగులదు. ఏలననగా బ్రాహ్మణులుఅగ్నితోను ఉదకముతోను సమానులు. ప్రాణాపదనొందినబ్రాహ్మణుడెట్టివానియన్నముతిన్నను ఆకాశమునకు బురదఅంటనట్లు వానికి పాపమంటదు. అజీగర్తుడను ఋషి తనఆకలి బోగొట్టుకొనుటకు శునశ్శేపుడను తనకుమారుని చంపదగిన యజ్ఞపశువునిగా నమ్మివేసి సొమ్ముపుచ్చుకొనెను. అయినను వానికి పాపమంటలేదు. పుణ్యపాపముల బాగుగనెరింగినవాడు దేవుడను ఋషిప్రాణరక్షణార్థమై కుక్కమాంసమును భక్షించినను కిల్బిషముగలవాడు కాలేదు. తపశ్శాలియైన భరద్వాజుడు పుత్రులతో నరణ్యమందు నివసించుచు క్షుధార్తుడై వృధువను చెక్కడపుపనివానివల్లనుండి యనేకగోవులను పరిగ్రహించెను. ధర్మాధర్మ విచక్షణుడైన విశ్వామిత్రుడు చండాలహస్తమునుండి దీసికొని కుక్క చట్టను దినుటకుద్యమించెను.) ఈప్రమాణములచే నాపదలోనున్న బ్రాహ్మణుడేమిజేసినను దోషిగాడని విశదమగుచున్నది. ఇప్పటికాలపు బ్రాహ్మణులుకూడ దేశకాలస్థితి మారుటచేత తమపూర్వపు వైదికనిష్ఠను బోత్తిగావిడిచి యేదోయొకవృత్తినవలంబించి యుదరపోషణమును జేసికొనవలసినవారగుటచే నాపద్ధర్మస్థులని నిశ్చయముగా జెప్పవచ్చును. కావున విద్యాసంపాదనార్థమయి విదేశమునకుబోయి యచట స్వయముగా పాకమొనరించికొనుట కశక్తులయి యలభ్యావకాశులయి యేమియు నెచటను గానక యన్నాతురులై వగచూరు మనభూసురకుమారవిద్యార్థుల నచటివారిచ్చు నన్నమును క్రయపూర్తముజేసి యవశముగా యథారుచిగాదినుట దప్ప నింకేమిజేయగలరు. అయినను విదేశీయాన్న భక్షణజేసినవారగుటచేత వీరు ప్రాయశ్చిత్తముల కర్హులనియు ప్రాయశ్చిత్తానంతరమందు స్వశాఖలో గలియవచ్చుననియు ప్రాచీనఋషులు స్మృతులలో వ్రాసియున్నారు. అట్లువ్రాసినవారిలో మన్వాదులతో దుల్యమయిన ప్రామాణ్యము నాప్తతమత్వము గలవాడు కల్పసూత్రకారుడు వేదార్థరహస్య పారావార పారదృశ్వయునగు బోధాయనఋషి యిట్లువ్రాయుచున్నాడు. "అథపతనీయాని. 1. సముద్రసంయానమ్. 2. బ్రహ్మస్వాపహరణమ్. 3.

భూమ్యనృతమ్. 4. సర్వపణ్యైర్వ్యవహరణమ్ 5. శూద్రసేవనమ్. 6. శూద్రాఽభిజననమ్. 7. తదపత్యంచ, ఏషామన్యతమం కృత్వా—చతుర్థకాలామిత భోజినస్స్యురపోఽభ్యవేయుస్సవనానుకల్పం । స్థానాసనాభ్యాం విహరంతఏతే త్రిభిర్వర్షైస్తదపఘ్నంతి పాపమితి॥ దీనియర్థము. ఇక జాతిని చెడగొట్టు పాపములెవ్వియనగా 1. సముద్రముమీద ప్రయాణము జేయుట. 2. బ్రాహ్మణుడు దాచిపెట్టిన సొమ్మును హరించుట. 3 భూమినిగురించి యనృతమాడుట 4. నిషిద్ధానిషిద్ధవిచక్షణలేకుండ సర్వద్రవ్యములతో వర్తకముచేయుట. 5. శూద్రునికొలుచుట. 6 శూద్రజాతిస్త్రీయందు పుత్రునిబుట్టించుట. 7. తానుశూద్రునికిబుట్టుట. ఈపాతకములలో దేనినైన జేసినవాడు చతుర్థకాలమందు (నాలుగుమార్లుతినుటకలవాటుపడినవాడు మొదటియూడుభోజనములను మాని నాల్గవభోజనకాలమందు) మితాహారమును దినుచు మూడుకాలములయందు స్నానముచేయుచు కొంతసేపుకూర్చున్నవాడై మరికొంతసేపునిలువబడినవాడై కాలముగడుపుచు నిట్లు మూడుసంవత్సరములుచేసినయెడల నాపాపమునశించును. ఇట్లుచేయనేరని పక్షమందీదిగువ వ్రాయబడిన పదునొకండు కృచ్ఛ్రములనైన జేయవలయునని పూర్వోక్తప్రాయశ్చిత్తమునకు ప్రతినిధిగా విధించబడినది.

"1. పద్మోదుంబరబిల్వాశ్చ కుశాశ్వత్థపలాశయోః ।
ఏతేషా ముదకంపీత్వా పర్ణకృచ్ఛ్రంత దుచ్యతే॥

2. పంచగవ్యంచగోక్షీర దధిమూత్రశకృద్ఘృతం ।
జగ్ధ్వాపరేహ్న్యుపవసే దేవసాంతపనోవిధిః ॥

3. పృథక్సాంతపనైర్ద్రవ్యైః షడహస్సోపవాసకః ।
సప్తాహేనతు కృచ్ఛ్రోఽయం మహాసాంతపనం స్మృతః॥

4 త్ర్యహంసాయంత్ర్యహంప్రాతస్త్ర్యహంభుంక్తేత్వయాచితం
త్ర్యహంపరంచనాశ్నీయాత్ప్రాజాపత్యో విధిస్స్మృతః॥

5. సాయంతుద్వాదశగ్రాసాః ప్రాతః పంచదశస్మృతాః ।
అయాచితే చతుర్వింశః పరేహ్న్యనశనంస్మృతం॥

6. కుక్కుటాండప్రమాణంస్యాద్యావద్యస్య ముఖంవిశేత్ ।
ఏతద్గ్రాసం విజానీయాచ్ఛుద్ధ్యర్థం కాయశోధనం ।

7. త్ర్యహముష్ణం పిబేదాపస్త్ర్యహముష్ణం పిబేత్పయః
త్ర్యహముష్ణం ఘృతంపీత్వావాయుభక్షో దినత్రయం.

8. షట్పలాని పిబేదాపస్త్రిపలంతు పిబేత్పయః ।
పలమేకంతువైసర్పి స్తప్తకృచ్ఛ్రం విధీయతే ॥

9. దధ్నాచత్రిదినం భుంక్తే త్ర్యహంభుంక్తేచసర్పిషా ।
క్షీరేణత్రిదినం భుంక్తే వాయుభక్షేదినత్రయమ్.

10. త్రిపలం దధిక్షీరేణ పలమేకంతుసర్పిషా ।
ఏతదేవవ్రతంపుణ్యం వైదికం కృచ్ఛ్రముచ్యతే॥

11. ఏకభుక్తేన నక్తేన తథైవాయాచితేనచ ।
ఉపవాసేన చైకేనపాదకృచ్ఛ్రః ప్రకీర్తితః॥"

ఈరీతిగా నొకసంవత్సరమునకు ముప్పదిప్రాజాపత్యములు మూడుచాంద్రాయణములు చొప్పున మూడుసంవత్సరములకు తొంబది ప్రాజాపత్యములు తొమ్మిది చాంద్రాయణములు ప్రాయశ్చిత్తముగా విధించబడినవి. కాని పరమకారుణికుడైన యాబోధాయన మునిపుంగవుడు దేహపాటవహీనులు సన్నగతప్రాణులునైన యీకాలపు మనుజులు విధించబడిన యీకర్మలలో నొక్కటియైనను యథాశాస్త్రముగా నిర్వహించజాలనపుడు వీటినన్నిటి నెట్లొనర్చ శక్తులని యూహించి యీప్రాయశ్చిత్తముల కనుకల్పముగా గోదానమును విధించియున్నాడు. ఎట్లన "ప్రాజాపత్యక్రియాశక్తౌ ధేనుం దద్యాత్ప్రయత్నవాన్ । ధేనోరభావేదాతవ్యం తుల్యంమూల్యం నసంశయః । ధేనుః పంచభిరాఢ్యానాం మధ్యానాంత్రిపురాణికా । కార్షాపణైకమూల్యాహి దరిద్రాణాం ప్రకీర్తితా" దీనియర్థము (పూర్వోక్తములయిన ప్రాజాపత్య చాంద్రాయణాదివ్రతముల నాచరింప నశక్తుడైనవాడు పాలనిచ్చుగోవు నొకదానినిదానమివ్వవలయును. అంతకు నశక్తుడైనవాడు ధేనుమూల్యముతో తుల్యమయిన ద్రవ్యమునైన నివ్వవలయును. ధనవంతులు ధేనుమూల్యముగా నైదునాణెముల నిచ్చుకొనవలయును. మధ్యమజీవనులు మూడుపురాణములను (పురాణమనగా కొనబడిగవ్వల విలువగలనాణెము) దరిద్రులొక కార్షాపణము నివ్వవలయును. (కార్షాపణమానము. ముప్పదిరెండు గురివెందగింజల యెత్తుగల స్వర్ణము పణము పదియారుపణములొక కార్షాపణము) "అనాదిష్టేషు పాపేషు శుద్ధిశ్చాంద్రాయణేనతు" అనియాజ్ఞవల్క్యవద్యను శాసనమువలన నన్నిటికంటెచాంద్రాయణవ్రతము విశేషముగా పాపనాశకము గావున పూర్వోక్తప్రకారమున నొకయేటికి మూడుచాంద్రాయణములచొప్పున మూడేండ్లకు తొమ్మిది చాంద్రాయణములనైన జేయవలయును. దానియందుగూడ నసమర్థుడు ప్రతిచాంద్రాయణమునకు యేడున్నర గోదానముచొప్పున తొమ్మిది చాంద్రాయణవ్రతములకు ప్రత్యామ్నాయభూతములయిన అరువదియేడున్నర గోదానములజేయవలయును. దానియందు నసమర్థుడైనవాడు యెనబదినాలుగు రూపాయిలారణాలను నిష్క్రయముగా నివ్వవలయునని విధి. ఇదియే ప్రాయశ్చిత్తానుష్ఠానాశక్తులయినవారి కందరికి సుకరమయిన ప్రాయశ్చిత్తము. ఇదిగాక మరియొకవిశేషము. "దోషారణ్యప్రదాహాయ ప్రాణాయామస్తనూనపాత్ । ప్రాణాయామసహస్రంతు పాతకానాం విశోధకః" అనియాజ్ఞవల్క్యుడు."

"సర్వేషామేవపాపానాం సంకరే సముపస్థితే ॥ దశసాహస్రమభ్యస్తా గాయత్రీశోధనీపరా ॥ అని అత్రి। రోగవాన్పాపవాంశ్చైవ రుద్రంజప్త్వాజితేంద్రియః । రోగాత్పాపాద్వినిర్ముక్తో హ్యతులం సుఖమశ్నుతే అనిశాతాతపుడు । రహస్యకృతానాం మహాపాతకానామపి శతరుద్రీయం ప్రాయశ్చిత్తమితిశంఖః । ఇత్యాదివచనశతప్రామాణ్యముచే 'దీర్ఘకాలక్లేశాది సాధ్యములయిన పూర్వోక్తప్రాజాపత్యాది ప్రాయశ్చిత్తకర్మలజేయజాలనివాడు మీదనుపన్యసింపబడిన ప్రాణాయామగాయత్రీ మంత్రజపశతరుద్రీయావర్తన పుణ్యతీర్థ నిషేవణాదులచే సర్వపాపములను తొలగించుకొనగలడని సర్వఋషిసమ్మతము.

బుద్ధిపూర్వకముగా జేసినపాపమునకు ప్రాయశ్చిత్తమే లేదని మతఛాందసులు జేయునాక్షేపణమునకు సమాధానము.

"అకామతః కృతేపాపే ప్రాయశ్చిత్తం విదుర్బుధాః॥ కామకారం కృతేప్యాహురేకే శ్రుతినిదర్శనాత్ । అకామతః కృతం పాపం వేదాభ్యాసేన శుద్ధ్యతి । కామతస్తు కృతంపాపం ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః" మను॥ అధ్యా ॥ 45-46 శ్లోకములు (అనిచ్ఛతో జేసినపాపము ప్రాయశ్చిత్తముచే శుద్ధినొందును. బుద్ధిపూర్వకముగా నొనర్చిన పాపములకుగూడ గొందరాచార్యులట్టి మూలశ్రుతి కానవచ్చుటవలన ప్రాయశ్చిత్తమును విధించియున్నారు. అజ్ఞానకృతపాపమునకు విధింపబడిన ప్రాయశ్చిత్తముకంటె జ్ఞానకృతమయిన పాపమునకు ప్రాయశ్చిత్తమెక్కువ కఠినముగా నుండునని మనుస్మృతివ్యాఖ్యాతయగు కుల్లూకభట్టుని వివరణము. ఇందుకు మూలశ్రుతియేమనగా ఇంద్రోయతీన్సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్ । తమశ్లీలావాగభ్యవదత్ - స ప్రజాపతి ముపాధావత్ తస్మా ఏతముపహవ్యం ప్రాయచ్ఛత్ ఇంద్రుడు తొల్లి బుద్ధిపూర్వకముగా గొందరిఋషులను కుక్కలచే గఱపించి చంపగా తనకుగలిగిన పాపమును నివారించుకొనుటకు బ్రహ్మకడకేగియాత డుపదేశించిన యుపహవమను ప్రాయశ్చిత్తకర్మను జేసికొని పాపవిముక్తిగాంచెనని తాత్పర్యము.

దీనిచే బుద్ధిపూర్వకముగా నొనర్చిన పాతకముగూడ ప్రాయశ్చిత్తముచే నివారింపబడుచున్నదని తేలినది.

సముద్రయానము పాతిత్యము నాపాదించు కర్మలలో నొకటిగా బరిగణితము గావున నిట్టివారితో పంక్తిభోజనము జేసినవారికి దోషమున్నదా లేదాయను సంగతి యిక మనకు విచారణీయము.

ఇందుకు ధర్మసింధువు. తృతీయపరిచ్ఛేదము. పూర్వభాగము. "కలియుగే బ్రహ్మహంత్రాదేః సహాసంవ్యవహార్యత్వరూపం పాతిత్యం। తత్సంసర్గిణస్తు నరకహేతు దోషసత్త్వేపి పాతిత్యంనాస్తి సంసర్గదోషః పాపేష్వితి కలివర్జ్యేషు వచనాత్ కృతేసంభాషణే పతతి త్రేతాయాం స్పర్శనేనతు । ద్వాపరేత్వన్నమాదాయ కలౌ పతతి కర్మణా । బ్రహ్మహననాది కర్మణైవ పాతిత్యం నసంసర్గమాత్రేణేతి తదర్థాత్-

మనుస్మృతి 11 అధ్యాయము 180 శ్లోకము, సంవత్సరేణ పతతి పతితేన సహాచరన్ । యాజనాధ్యాపనాద్యౌనాన్నతు యానాసనాశనాత్.

స్మృతికౌముదీనుండి-సంసర్గదోషో నైవస్యాన్మహాపాతకినః కలౌ॥ ఇత్యాద్యనేక ధర్మశాస్త్రవచనములచే కలియుగమందు పతితులతో భోజనాదికము సల్పినవారికెంతమాత్రము దోషములేదనియు వీరు పంక్తిబాహ్యులు గారనియు స్పష్టమగుచున్నది.

కావున విద్యాసంపాదనార్థమయి విదేశమున కరిగిన బ్రాహ్మణకుమారులవిషయమయి మతఛాందసభూసురోత్తములు కరుణించి పూర్వోక్తమయిన ప్రాయశ్చిత్తములను లఘుప్రకారముగా గావించి వారివారిశాఖలలో గలుపుకొనుటకు సమ్మతింతురని నమ్ముచున్నాను. భావ్యభ్యుదయపాత్రులును భావి యశోభాజనులు నగు వీరి కిట్లు నిరుత్సాహపర్చినచో వారేమి లాభముగాంతురు. దేశస్థుల విద్యాధిక్యముచేత నేగదా దేశౌన్నత్యము సిద్ధించును.



# సత్కళత్రము.

శ్రీమతి, మేడేపల్లి - శ్రీనివాసమ్మగారిచే వ్రాయబడినది.

---

నగృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే.

సకలజంతువులు ప్రాణవాయువు నాశ్రయించి యెట్లు బ్రతుకుచున్నవో అట్లనే నాలుగాశ్రమములు గృహస్థాశ్రమము నాశ్రయించి జీవించుచున్నవి. ఏకారణముచే మూడాశ్రమములు ప్రతిదినము జ్ఞానదానముచేత నన్నదానముచేతను గృహస్థునిచే జీవింపజేయబడుచున్నవో అందువలన గృహస్థాశ్రమము గొప్పది. గృహశబ్దమునకు భార్యయర్థము. "త్రయంపుర్ణ్యాత్రితం యశస్త్యాగః" (త్రయుపుర్కారముగాన పుత్రమే త్రయుపు, కీర్తికారణము గావున త్యాగమే యశస్సు) అని కార్యకారణముల కభేదోపచారముచేసినట్లు యిల్లు భార్యామూలము గావున యింటికిగూడ గృహశబ్దవ్యవహారము గలుగుచున్నది. గృహస్థాశ్రమము కళత్రప్రధానమయినది. హిందూధర్మశాస్త్రప్రకారము మనజాతివారిలోనుండు వివాహవిధినియమము భర్తృభార్యాసంబంధము మొదలయిన కట్టుబాటులు మఱే యితరజాతియందునున్నట్లు దలంచను. మనుస్మృతి ప్రథమాధ్యాయములో ముప్పదిరెండవశ్లోకము. ద్విధాకృత్వాత్మనో దేహ మర్ధేన పురుషోఽభవత్। అర్ధేన నారీతస్యాంస విరాజ మసృజత్ప్రభుః. తొల్లిభూతసర్గోన్ముఖుడగు బ్రహ్మతనశరీరమును రెండుభాగములుగాజేసి యొకభాగముచే బురుషుని యొకభాగముచే స్త్రీనిసృజించెను. ఆస్త్రీయందు విరాట్సంజ్ఞగల పురుషుని సృజించెను. భాగవత తృతీయస్కంధము ద్వాదశాధ్యాయములో నేబదిరెండవశ్లోకము. "కస్యరూపమభూద్ద్వేధా యత్కాయమభిచక్షతే । తాభ్యాం రూపవిభాగాభ్యాం మిథునంసమపద్యత," బ్రహ్మయొక్కరూపము రెండుప్రకారములాయెను. ఆరెం

డింటిచే మిథునమనగా స్త్రీపురుషులయిరి. "యత్ర ప్రాహుస్తథాచైతద్యోభర్తా సాస్మృతాంగనా" భర్తయే భార్యయని పండితులు వచించుచున్నారు. ఈప్రమాణములచే స్త్రీపురుషులకు సకలవిషయములందు తుల్యాధికారము సామ్యమును సిద్ధించుచున్నవి. రెండుభాగములుగా విభక్తమయిన యొకవస్తువుయొక్క భాగద్వయము గుణము ధర్మము యోగ్యత మొదలగువానియందు తుల్యముగా నుండక తీరదుగదా.

"అనాశ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చోత్పాదయితవ్యాః," "ధర్మార్థకామేషు నాతిచరితవ్యా" మనమిరువురము కర్మలనొనర్చవలయును, సంతానమును బడయవలయును, ధర్మార్థకామములయందు భార్యభర్తచే నుల్లంఘించబడదగినదికాదు." ఇందువలన పురుషుడు తానికముందొనర్చగల శ్రౌతస్మార్తకర్మలయందు సకలపురుషార్థసాధనమందును భార్యముఖ్యమయిన సహాయభూతురాలనియు కర్మఫలభాక్కనియు స్పష్టమగుచున్నది. మనపూర్వ లిఖితవిషయమందు లేకపోయినను కర్మలయందు స్త్రీకిచ్చిన స్వాతంత్ర్యము ఎనికొనదగునని యిప్పటికి ననువర్తించుచున్నవి. అందువలననే భార్యకు "పత్ని" యనిపేరు. ఈశబ్దము పురుషుడు దానొనర్చు యజ్ఞములఫలము ననుభవించుటకు తగియని యర్థమును గూఢము. పురుషునితో నీమెకూడ ధర్మము నాచరింపవలెను గావున సహధర్మచారిణియని పిలువబడుచున్నది. విదేశీయజాతులలో సాంఘికనియమములుగాని యిట్టి యుత్తవ్యవస్థతో జేరిన నియమములుగాని లేకుండుటచేసి వివాహబంధమంత దృఢముగా నుండజాలదని తలంచెదను. అట్లుగాక మనహిందువులలోను ముఖ్యముగా ద్విజాతిలో వివాహసంబంధము నవిభాజ్యము. పూర్వోదాహృతయుక్తులవలన స్త్రీలకు పురుషులవలెనే కర్మలయందు విద్యయందు మరియు నితరములగువానియందును తుల్యమయిన యధికారమున్నట్లు స్పష్టమగుచున్నది ఇంకనుమనప్రాచీనగ్రంథములే సాక్ష్యము. ఇట్లుకుటుంబమునకు స్త్రీ ముఖ్యురాలని యేర్పడినది.

పురుషునికిభారము తగులకుండ దాను జేయదగిన గృహకృత్యములను జక్కగ నిర్వర్తించుచు భర్తృచిత్తానువర్తినియై యత్తమామలయందు మగనిసంబంధులయందును యథోచితమయిన పూజ్యభావము నెరపుచు సుశీలైకనిరతయై తనకుగలదానితో తృప్తినొంది కాలముగడపునది సామాన్యముగా సత్కళత్ర మనిపించికొనును. భర్తదైవమని యెన్నికొనుచు నెల్లప్పుడు నాతని హితాచరణమునందాసక్తురాలయి యుండవలయును. గృహమును గృహోపకరణములను నిర్మలముగా నుంచుట, గురువులు, భృత్యవర్గము, నాడుబిడ్డలు వారియత్తలు మొదలగువారియందు యథోచితగౌరవమును జూపుట, దుష్టవర్తనులగు నాడువాండ్రతో గలియకుండుట, అతివ్యయముగాని యపవ్యయముగాని చేయుచున్నప్పుడు భర్తను వలదని రహస్యమందు బోధించుట, బంధుగృహములయందు దేవాలయములందు జరుగునుత్సవాదులకు తనియాజ్ఞబడసియేగుట, భర్తనిద్రించిన పిదపబండుకొని వరువాతలేచుట, వంటయింటిని పరిశుభ్రముగాను దర్శనీయముగా నుంచుట, వల్లభుడొకవేళ కుపితుడై తననునొవ్వ నాడినను దానిని మనస్సునందుంచుకొనకుండుట మొదలగునవి స్త్రీని సత్కళత్ర వ్యవహారమునకు పాత్రురాలనుగా నొనర్చు విశేషలక్షణములు. మగని యనుమతిపయి వ్రతానులనేల్పవలయును. కాంతుని ప్రియాప్రియములు తనప్రియాప్రియములుగా నెంచవలయును. ఆయనకు తెలియజేయక యెవ్వరికేమియు నివ్వగూడదు. రోగార్తుడైనపుడు పరదేశమునకేగినపుడు తైలాభ్యంగనము కేశసంస్కారమును వర్జించవలయును. ఇట్టి సద్వృత్తముగల సాధ్వీమణులుండు గృహము సకలసంపన్నిలయము సర్వమంగళావాసమని నమ్మెదను.

ఈరీతిగా సత్కళత్రమునకుండవలసిన సామాన్య విశేషలక్షణముల జెప్పి యిక యీమె గృహమందుండి నిర్వహించవలసిన పనులను జెప్పుచున్నాను. గృహస్వామినియై చేయవలసినపనులు పురుషుడు దనశక్తికొలది సంపాదించు విత్తము నీమెచేతిలో నిడినపుడు రాబడికితగిన వ్యయము జేయ బ్రయత్నించుటయేగాక యందులో బ్రతిమాసమును గొంచమయినను మిగుల్చుటకు శ్రద్ధబూనవలయును. సంవత్సరమునకుపడవున తాముపయోగించుతిండి సామానులను కొలముఖమున దొక్కమారుగా సంగ్రహించవలయును. ప్రతిమాసమునకు గొనదగినవాటిని మాసాదియందే స్వీకరించవలయును. ఇంటిలోనుండు ధాన్యము మొదలగు నిలువవస్తువులు రద్దుగాకుండ జాగ్రత్తతో గాపాడవలయును. ఇంతియగాక మగడింటికిదెచ్చు నితరపదార్థములను గూడ దక్షతతో గాపాడి నియతకాలమునకు చాలునట్లు మితముగా వ్యయపరచవలయును. విశేషధనవతియయినచో భృత్యులచే బనిపాటులు జేయించునపుడు వారపహరించకుండ వద్దనుండి జాగరూకతతో గనిపెట్టవలయును పేదరాలు స్వయముగాజేసికొనును. అంతియగాని యలసకజూపిన యెడల కార్యములు చెడును. సంసారమునకు మోసమువాటిల్లును. దాసీలకు దాసులకు దాసవ్వవలసిన జీతములు మాసప్రారంభమునందె తప్పక యివ్వవలయును. లేనియెడల వారు పనులయందు విరాగమును జూపుదురు.

ఇకయీమె తల్లియయి చేయవలసిన పనులువిచారింపగా నీమాతృత్వము గృహస్వామినీత్వముకంటె నెక్కువబాధ్యతగల పదవిగాగానవచ్చుచున్నది. స్త్రీ తానంతర్వత్ని యయినదిమొదలు గర్భస్థశిశువుకు తనకును రోగమునుబుట్టించు నాహారమును బొత్తిగామాని యారోగ్యకరము పుష్టివర్ధకమునైన యాహారము దినవలయును. తాను నీరుమోచికొనియున్నదని తనవారందరు గారాబముతో జూచి యింటిలో పనులనేమియు ముట్టుకొననివ్వక సుఖముగా నొకచోట నుండుమందురు. ఇదిచాలతప్పు. వారిమాటలపాటించక తనశరీరమున కుచితమయిన వ్యాయామము గలుగునట్లు యింటిపనులు సాగించవలయును. ఇది సుఖప్రసూతికి గారణము తరువాత పుట్టినపిల్లలను పెంచి పెద్దవాండ్రనుచేయుటలో నధికప్రయాసమునప్రమత్తతను సహిష్ణుతను గలిగియుండవలయును. పిల్లలకువచ్చు చిన్నజబ్బులకుతగిన చికిత్సలను నేర్చియుండవలయును. తరుచుగా శిశువులు తండ్రితోకంటె తల్లితో నధికతరమయిన యనుబంధము గలవారయి యెక్కువ

కాలము తల్లితోనే గడుపుదురు. గావున వారుతిట్లాడుట కొట్లాడుట మాటిమాటికి నిర్నిమిత్తముగా గినియుట మొదలగు పరుసదనపు చేష్టల కలవాటుపడకుండ చిన్ననాటనుండి మంచిత్రోవలో నడచుట కభ్యాసమగునట్లు బుజ్జగరపుచు శిక్షించుచుండవలయును. తిర్యగ్జంతువులు తండ్రియొక్క గుణమును మనుష్యులు తల్లియొక్క గుణము నెక్కువగా గలిగియుందురు గావున తల్లి యెట్టి సుగుణసంపద గలదియగునో పిల్లలు నట్టిగుణము గలవారగుదురు. బడికిబోవు కుర్రవాండ్రను తల్లితాను స్వయముగా పాఠములజదివించుచు వారివిద్యాభివృద్ధికి వశమయినంతశ్రద్ధను దీసికొనవలయును. పైనుపన్యసించిన ప్రకారము సర్వవిధములచే గుణవతియనిపించుకొను భార్యయే భార్య. ఇట్టిగుణవిశిష్టమయిన కలత్రమును గలిగియుండు పురుషుని భాగ్యమనిర్వచనీయము. స్నిగ్ధం భవత్యమృతకల్ప మహో కలత్రం హాలాహలం విషమివాపగుణం తదేవ (భర్తయందు స్నేహముగలభార్య అమృతముతో సమానము. గుణహీనురాలయ్యెనేని కాలకూటవిషముతో దుల్యము) అనిగదా శాస్త్రము. "సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ । యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్." (ఏ కులమందైతే భార్యచే భర్తయు, భర్తచే భార్యయు పరస్పరము సంతోషము నొందుచు జీవింతురో ఆకులమందు తప్పక సర్వశుభములు ప్రాప్తించును) అని మనువుగూడ జెప్పియున్నాడు. ఇట్టిదాంపత్యసుఖజనకమయిన సత్కలత్రమును గురించి మహాకవియగు భవభూతి "అద్వైతం సుఖదుఃఖయోరనుగుణం సర్వాస్వవస్థాసు యద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః । కాలేనావరణాత్యయాత్పరిణతే యత్స్నేహసారే స్థితం భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే" అని నుడివియున్నాడు.

సద్భార్యయనునది పురుషునికి సర్వవిధ బంధుప్రతినిధి. లంకాప్రవాససమయములో రామవిరహముచే కృశించుచున్న సీత వాయుపుత్రునితో జెప్పినమాటను విచారించుడెట్లున్నదో "న చాస్య మాతా న పితా న చాన్యః స్నేహాద్విశిష్టోస్తి మయా సమో వా" (రామునియందు నాకున్న స్నేహముతో సమానమగు స్నేహముగలవారుగాని అంతకంటె నధికస్నేహము గలవారుగాని యతని తలిదండ్రులైనగారు. ఇక మరి వ్వరుగారు) దశరథుడు కౌసల్యవిషయములో నిట్లుచెప్పియున్నాడు. "యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ । భార్యావద్భగినీవచ్చ మాతృవచ్చోపతిష్ఠతి," (పరిచర్యచేయునెడ దాసీవలె, ద్యూతక్రీడాదులయందు సఖివలె, ధర్మాచరణమందు భార్యవలె, ఇంకొకభార్యను పెండ్లియాడునపుడు సోదరివలె శరీరపోషణాదిసమయమందు తల్లివలె నన్ను సేవించుచున్నది.) ఈ వాక్యములచే దలిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, మిగిలినబంధువులు మొదలైన వారికంటె సాధ్వియగు భార్య పురుషునియందెక్కువస్నేహము, ప్రీతివిశ్రంభము గలిగియుండునని స్పష్టమగుచున్నది. గృహమేధికి లోకములోదనభార్యయొక్క సద్గుణసంపదకంటె నెక్కువప్రీతికరమైన దింకొకటిలేదు. ఇందునుదాహరణముగా దండివిరచితమైన దశకుమారచరితమునుండి యొకచిన్న కథ నిచటనుదాహరించుచున్నాను. ఆగ్రంథమందొకడు "కింగృహిణః ప్రియహితాయ" (గృహస్థునకు ప్రియముకొరకు హితముకొరకు నేదియగుచున్నది) అనియడుగగా మరియొకడు "దారగుణాః" (భార్యయొక్కగుణములు) అని యుత్తరమిచ్చినాడు. అకథయెట్లనిన, ద్రవిడదేశమందు కాంచియనుపట్టణము కలదు. అందుగనవంతుడగు శక్తికుమారుడనునొక శెట్టి గలడు. వాడు సుమారు యిరువదివత్సరముల ప్రాయముగలవాడైనపుడిట్లు చింతించెను. భార్యలేనివానికివలె సద్భార్యలేనివానికిని సౌఖ్యములేదు. సత్కలత్రము నెట్లు సంపాదించనగునని తలంచి కుంచెడుధాన్యము మూటగట్టికొని జ్యోతిష్కుని వేషముతో దేశాటనము జేయనారంభించెను. కనపడిన ప్రతికన్యక నీకుంచెడు ధాన్యముతో సాదుసంపన్నమయిన భోజనము సమర్పగలవాయని యడుగగా నామె నాచేతగాదని ప్రత్యుత్తరమిచ్చుచుండెను. ఇట్లుకొంతకాలము దేశములవెంబడి తిరిగితిరిగి తుదకు కావేరీతీరమునకువచ్చి యచటనొక గ్రామమందున్న వైశ్యకన్యక నట్లనే ప్రశ్నించెను.

అందుకామె వల్లెయని యాధాన్యము బుచ్చుకొని యాతని గొంతవడి విశ్రమించుమని చెప్పెను. ఇంతలో నీమె యాకడ్లనెండలో నిడి దంపితీసినయుముకనమ్మి పాకభాండములను వంటచెరకును దెప్పించెను. వంటకొరకుగా సార్పనవొగ్గుల నగసాలివాండ్రకు విక్రయించి నెయ్యి, పెరుగు, కూరమొదలగు వ్యంజనముల సంపాదించి వాటితో నతనికి షడ్రసోపేతమయిన భోజనము సమర్పించెను. అందుపైనతడామెచాతుర్యమునకు బుద్ధికుశలతకు నచ్చెరువంది సంతుష్టుడై యామెను పెండ్లాడి తరువాత స్త్రీని తనకుటుంబజనము నామెయధీనము జేసి సుఖముగానుండె. కావునగృహస్థునకు స్వకళత్రముయొక్క గుణసంపదకంటె నధికమయిన హృదయోల్లాసకారణము మరేదియు లేదు. రథగమన మేకచక్రముతో సిద్ధింపనట్లొక పురుషునిచేగాని యొక స్త్రీచేగాని గృహపరిపాలనము నిర్వహించబడదు. అను దానిచేత నర్థము నగు వానిచేత బిడ్డలు నభివృద్ధినిగాంచరను లోకోక్తియున్నను తెలివిగలయాడుది ద్రవ్యముగాపాడ గలిగినట్లు మగవాండెంతవిహాయసంపన్నుడైనను మాతృహీనశిశువుల దల్లిలేదను లోపము తట్టకుండ బోషింపనేరడను సంశయము మనమందరమెరింగినదే. "పితుర్దశగుణం మాతా" (తల్లి, దండ్రికంటె పదింతలు హెచ్చు) అనిగదా శాస్త్రము.

వస్తుస్థితియిట్లుండ కలసియుండగా విద్యాహీనతచేతనో సహజమగు బుద్ధిమాంద్యముచేతనో మనలో గొందరమ్మలు పైనుపన్యసించబడిన కలత్రలక్షణముల కనభ్యంతరులై యున్నట్టు గన్పట్టుచున్నారు. ఇందుకు పురుషులే పూచీదారులని నిశ్చయించుడు. "యాతి యంతుః ప్రమాదేన గజో వ్యాళత్వ వాచ్యతామ్," (మావటీని ప్రమాదముచే గజము దుష్టమయిన దనిపించుకొనుచున్నది) అన్నట్లు నడిపించుపురుషుడు వివేకి, ఋజుమార్గవర్తి దక్షుడునుగానిచో నిట్టిస్థితియబలలకు దటస్థించుట నిశ్చయము. "స్త్రీణాంహి సాహచర్యాద్భవంతి చేతాంసి భర్తృసదృశాని । మధురాపి హి మూర్ఛయతే విషవిటపిసమాశ్రితా వల్లీ" (మంచితీగలయినను విషవృక్షమును జుట్టికొని పెడినట్లు సహ.

Shri Rao Sri Venkata Swetachalapati Ranga Rao Bahadur.
Maharaja of Bobbili.



శ్రీరావు సర్ వెంకట శ్వేతచలపతి రంగారావు బహదూర్.
బొబ్బిలి మహారాజు.

Shri Rao Venkata Kumara Mahipati Surya Rao Bahadur.
Raja of Pithapuram.



శ్రీరాజా రావు వెంకట మహీపతి సూర్యారావు బహదూర్.
పిఠాపురం రాజు.

Shri Maharaja Sir Velugoti Shri Rajagopala Krishna Yachendra Bahadur. Maharaja of Venkatagiri.



శ్రీ వెంకటగిరి మహారాజా.



Maharaja of Vizianagaram. విజయనగరం మహారాజా.



H. H. Sir Madan Singh Bahadur.
Maharaja of Kishengarh.

సర్ మదనసింగ్ బహదూరు. కిషను గఢ మహారాజా.



H. H. Maharaja of Datia. దతియా మహారాజు.



Rajah of Sawantwadi. సావంతవాడి రాజా.



Nawab Bahadur of Murshidabad. ముర్షిదాబాదునవాబు.



Rajah of Jamkhandi. జంఖండి రాజా.



Nawab of Janjira. జంజీర నవాబు



Rajah of Mudhol. ముధోలు రాజు.



Rajah of Akkalkot. అక్కలకోటు రాజు,



Senior Branch of Mirja. మీరజ్ జ్యేష్ఠశాఖ.



Miraj Junior Branch. మీరజ్ కనిష్ఠశాఖ.

వారము స్త్రీలమనస్సుగూడ భర్తమనస్సుతో సమానధర్మములకలది యగును.) అనువచనానుసారముగా నవినాభావ సంబంధముచే గొన్నాళ్లకు పురుషచిత్త సాదృశము స్త్రీచిత్తమునకబ్బుట వింతగాదు. సోదరీమణులారా పూర్వకాలపు స్త్రీలస్థితిని యిప్పటివారిస్థితిని త్రైపారువేసిచూడగా నెంతవ్యత్యాసమున్నదో యాలోచింపుడు. వేదములందు పురాణములందు చెప్పఁబడినవారయి పాతివ్రత్యము, భర్తృభక్తి, భగవద్భక్తి, విరాగము, వేదశాస్త్రవిజ్ఞానము, తత్త్వజ్ఞానసంపద మొదలగు దివ్యగుణముల కావాసభూములయిన గార్గి, మైత్రేయి, సులభ, కలావతి, యశోవతి, చూడాల, దేవహూతి, వేదవతి, అనసూయ, అరుంధతి, సీత, దమయంతి, ద్రౌపది యాదిగాగల స్త్రీరత్నశతములకు మనభరతఖండమే గదా ఆకరమయ్యెను. ఇట్టిజగద్విశ్రాంత ప్రభావముగల వీరుమనయార్యనారీలలామములేగదా, వీరినిట్టి గొప్పస్థితికి దెచ్చినవి విద్య, బుద్ధి, సద్వృత్తమును. ఇవిలేకపోవుటచే నీకాలపుమనము హీనస్థితిలోనున్నారము. ప్రాచీనార్యస్త్రీలు బ్రహ్మవాదినులనియు సద్యోవధువులనియు రెండుతెగలుగా నుండేవారు. వారిలో బ్రహ్మవాదినులకు వారికి పురుషులకువలె నుపనయనము వేదాధ్యయనము స్వగృహమందు భిక్షాచరణముండెననియు, సద్యోవధువులకు వారికివివాహము సమీపించగా నొకరీతిగా నుపనయనమొనర్చి వివాహకర్మ విధించబడెననియు స్మృతిశాస్త్రమువలన గానవచ్చుచున్నది. ఈమధ్యకాలములో మనవారు స్త్రీలనిట్టి యధికారములనుండి తొలగించి మౌఢ్యతిమిరములోద్రోసి తమయుపచారమందే వీరికాలమంతయు పర్యవసించునట్లుచేసిరి. తమస్త్రీలు విద్యావిహీనులయియుండుటవలన నష్టము తమదిగాదా? ఐరోపాజాతివారి యంగనామణులను జూడుడు. వారును పురుషులవలెవిద్యనేర్చి తెలివిగలవారగుటచేగదా సంఘములో మగవారితో సమానముగా గౌరవించబడుచున్నారు. కొన్నాళ్లక్రిందటివరకు స్త్రీలకువిద్యగరపుట యొకపెద్దతప్పని మనవారిలో గొందరియభిప్రాయము. మనభాగ్యవశమున నాంగ్లేయప్రభుత్వ మభివృద్ధినొంది దేశమందంతట బాలికలకు పాఠశాలలను స్థాపించి విద్యనభ్యసింప జేయుచుండుటచే చాలమట్టుకు ప్రజలకాయభిప్రాయములు మారినవి. బంగాళా రాజధానినుండియు బొంబాయి రాజధానినుండియు కొందరుమనసోదరీమణులు పురుషులవలెవిదేశములకరిగి యచట పలువిధములయిన విద్యలలో నుత్తీర్ణులగుచున్నారు. సంఘసంస్కరణకర్తలు తమయాయువును ధనమును స్త్రీవిద్యవిషయమయి వినియోగపర్చి పాటుపడుచున్నారు. ఈకాలమందుప్రతిపట్టణమందునొక స్త్రీసమాజమేర్పడియున్నది. అందులోనచటనుండు స్త్రీలందరు వారమునకొకసారి సమావేశమునొంది యుపన్యాసములను వార్తాపత్రికలను జదువుచునొకరివల్ల నింకొకరు తెలియనియంశముల తెలిసికొనుచున్నారు. ఇదియంతయు నాంగ్లేయప్రభువులవలన మనకుగలుగుచున్న గొప్పలాభములలో నొకటియని తలంచుచు వారిచిరాభ్యుదయమునకు నీశ్వరుని బ్రార్థించుచున్నాను.



# నన్నయభట్టారక పంచరత్నములు.

మ.రా.శ్రీ, శంభర సూర్యనారాయణశాస్త్రిగారిచే వ్రాయబడినది.



ఉ॥ రాజమహేంద్రపట్టణ వరమ్మును నేలిన యట్టిరాజభూ
రాజమహేంద్రుకొల్వును గరంబనమాన కవిత్వధారలన్
రాజిలఁజేసి వ్యాకరణరాజముఁగూర్చి కవీంద్రకోటిచేఁ
బూజలఁబొందు నాసుకవిపుంగవు నన్నయ నెన్నశక్యమే.

గీ॥ వేదములలోనఁ బంచమవేదమగుచు
నఖిలఘన పురాణములయందగ్రమగుచుఁ
బరగువ్యాసరచితమైన భారతమ్ము
తేనెలొల్కంగఁ గొంతయాంధ్రీకరించె॥

గీ॥ పరగఁబాండిత్యమునెసఁ గవ్యంబు ముట్టు
బుద్ధిలతఁబుట్టి యిక్కవిపుంగవుఁడు
తనదమానసపాథోధిఁ దరిచి తరిచి
యాఁబుట్టించె నాంధ్రభాషామృతమ్ము॥

క॥ సకలంకక్షితి భుజినిఁ దపఁ గవిచంద్రులకు మున్న నన్నయ భట్టా
రకుఁడిచ్చెనుగవిశేఖర! నికరమ్ములనాంధ్రధారణిన్ శేయుఁ జన్॥

ఉ॥ పాయకనన్నపార్యునదిభక్తిమెయింగొనియాడి పద్యముల్
జేయుచునుండువాఁడగుటఁజేసి కరంబనురాగమొప్పఁగా
నీయెడఁబంచరత్నముల నెంతయుఁగూర్చెను శంభ్రిసూర్యనా
రాయణశాస్త్రి కౌనఁ గవిరాజశిఖామణులార దేఁప్రుఁడీ॥

# దేశాభిమానము.

మ. రా. రా. శ్రీ, చక్రవధానుల మాణిక్యశర్మగారిచే వ్రాయఁబడినది.

ఆ॥ స్వర్గపదవికంటె జనని గౌరవనీయ।
జననికంటె గొప్ప జన్మభూమి।
జన్మభూమికంటెఁ జగతిలో మఱి లేదు।
పూజనీయ మనకుఁ బురుషులార॥ 1.

ఉ॥ అమ్మలనయ్యలం గనిన యమ్మ చరాచరజంతుకోటిఁ జీ।
వమ్ములనిల్ప నన్నమును పానము ప్రదమౌర మాత్మ దే।
హమ్మనగన్న యమ్మ కలుషమ్ముహరించి జగంబునెల్ల పూ।
తమ్మొనరించునమ్మ భరతమ్మను మించినయమ్మ యున్నదే! ॥ 2.

సీ॥ "ఆత్మవద్భూతాని" యను సూక్తి నెఱపంగఁ
దేశాభిమానమే తెన్ను మనకు।
"సత్యంవద"యటన్న సద్బుద్ధి నలుపంగఁ
దేశాభిమానమే తెన్ను మనకు।
"ధర్మంచర"యటన్న కర్మఁజేయఁగనున్నఁ
దేశాభిమానమే తెన్ను మనకు।
పరహితాచరణ సుస్వరమార్గ మొనరింపఁ
దేశాభిమానమే తెన్ను మనకు।
గీ॥ జనులుతరియింప మోక్షసాధనము వెతుకఁ।
దేశభక్తియె మేలైన తెన్ను మనకు।
గాన దేశాభిమాన వీక్షణము లేని।
జన్మజన్మయె! చట్రాతిజన్మ కాక॥ 3.

సీ॥ మానవుల్ తొమ్మిదిమాత్రమె కడుపున।
నతికష్టమున మోయు నాత్మమాత।
జన్మాంతమును నురస్థలమున మోసి, భ
క్తివలిర్ప్రరక్షించు దేశమాత।
ఎడపిల్లనిమలంబుఁ దుడుచుటకును నస
హ్యముఁజెందుచుండెడుఁ నాత్మమాత।
ఎవనిమలినమైన నెపుడుసహ్యముతోడ।
స్థిరముగభరియించుఁ దేశమాత।
గీ॥ అల్పకాలమె పోషించు నాత్మమాత।
తిరముగను బ్రోచునవనూవె దేశమాత।
అఖిలజనులాత్మమాతను నధిగమించి।
నట్టి శ్రీదేశమాతఁ జేపట్టవలయు॥

సీ॥ దేశాభిమాన ప్రదీపంబులేకున్న।
నజ్ఞానతిమిర సంహారమెట్లు।
దేశభక్తికళా ప్రకాశ కల్గకయున్న।
నైకమత్యఫలంబు నందుటెట్లు।
దేశాభిమాన ప్రతిష్ఠఁబొందకయున్న।
స్వేచ్ఛాసుఖంబు ప్రాప్తించుటెట్లు।
దేశాభిమాన కీర్తినివహింపకయున్న।
నభిమానవైభవం బందుటెట్లు।
గీ. దేశమఖిలేశ్వరుని స్వప్రకాశమగుట।
దేశభక్తియె యలజగదీశుభక్తి।
గాన దేశాభిమానంపు కలిమిలేని।
మానవుడు మానవుడె యెందు మ్రానుకాక. 5.

చంపకమాలిక.

అరయఁగఁ దేశభక్తియన నాటలఁబాటలనానటంచు మీ।
దరయక తల్పరాదు పరమార్థముల న్దొలిజన్మమందు నీ।
శ్వరపదభక్తి రంజిలఁగ నిల్పిమహత్తరపుణ్యవైభవ।
స్ఫురణఁదలిర్తు రెట్టినరపుంగవు లట్టిమహానుభావులే।
పరమగుదేశభక్తియను భామినిపాణిఁ గ్రహింప నర్హులౌ।
గురుసుఁడి మాయమాటల కృతుల్ ప్రచరించెడువార లర్హులే?
చిరతరమైన సద్గుణవిశేషము, నెల్లరఁ జూచియాత్మ సో।
దరులుగ నెంచి వారియనుతాపముఁ గాంచి సహింపలేక లోఁ।
బుఱఁబుఱఁబొక్కి యాకొలఁదివోవఁగఁ బ్రాణసమర్పణంబునున్।
జరుపఁగ సిద్ధమైనపురుషత్వమునుం, బెరవారి సంపదో।
త్కరమునుజూచి యోరిచిమదంబునుబొందుట లోకమందు నం।
దఱినొకరీతిఁ జూచుటయె ధర్మమటంచు దలంపుగొంట, యీ।
వరుసగుణంబులం గలిగి వర్ధిలువారలె భక్తులౌదు రెం।
దరొ మఱి దేశభక్తులము తప్పక మేమని సత్సభాళులం!
దరమరలేక లెక్చరుల హాయిగనిచ్చుచు, దేశభక్తియే।
సిరులకు సాధనంబనుచుఁ జెప్పివిదేశపువస్త్రముల్ బహి।
ష్కరణము సేయుఁడందు రభసంబుగ నార్చుచు నింటభార్యకో
దరమును గ్లాస్గోమల్లు నొకతానునొసంగెడువారు భక్తులా!।
స్థిరముగ యంత్రశాలల స్వదేశమున న్నెలకొల్పుడంచు లె।
క్చరులనొసంగి యుక్తగుణవిశేషు డొకఁడొక యంత్రశాల దు।
ర్భరమున నిల్ప నందునొకభాగముగైకొని సొమ్మునీయ రెం।
దరొ మఱిసాగదంచును పృథక్స్థలి హాణులెకాకయుట్టిదు।
స్తరతరకార్యసాధకులె! దబ్బరహిందువులేడ యంత్రముల్।
వరలఁగఁజేయఁబేడయని పక్కనవ్వుచు గేలిసేయు పా।
మరులౌర! దేశభక్తులు ప్రమాణముగా వచియించినంత యా।
చరణము బెట్టినట్టి పురుషప్రవరుల్ కద దేశభక్తులన్।
వరకరుణాప్రపూర్ణులను పండితవర్యులు, గాననీధరన్।
నరులకు దేశభక్తియె ఘనంబగు మోక్షఫలం బొసంగెడున్. 6.

చం. ఘనతరదేశభక్తి యనుకల్మిఁ జెలంగినవారిఁ జూచ్చి, భూ।
జనులిత డెల్లవారలను సజ్జనుఁడంచుఁ బరోపకారి యం।
చును దలపోసి కూర్మిఁ గనుచుంటరయో కొకొకయొగ్గునచ్చెరన్।
గొనకొని దానికై యసులఁ గూడ నొసంగుదు రద్భుతంబుగన్.
చం. ఒకయెడఁ బ్రాణదానము పరాక్ర్ముడఁ మానమురక్షణసేయువే।
ఱొకతఱిఁ వీశిపోయిన మహోన్నతసంపద లందఁజేయు నిం
చొకయెడఁ గీర్తిఁ బుచ్చుఁ బురుషోత్తము డంచును, గాన, దేశభ।
క్తికి సమమైనధర్మము క్షితిన్ గనజాలము మిత్రలోకమా.
చం. బకుడల యేకచక్రపురిఁ బౌరులఁ ఘోరతఁ ద్రిమింగుచుండ నం।
దొకడును తత్పురిన్ విడువనొల్లడు మేనులనైనమానవాం।
తకునకొసంగ సమ్మతిని దాల్చిరి కావునఁ బ్రాణికంటె శ్రే।
మకు మనజన్మభూమి ప్రథమంబుగ సేవ్యమటంచు నెంచుడీ.



# ఆంధ్రబ్రాహ్మణులు వారి భవిష్యత్తు.

మ. రా. శ్రీ, వెలగలేటి - రంగయ్యగారిచే వ్రాయబడినది.

ఆర్యావర్తమునందలి సంఘమునందలి చాతుర్భాగములలో ననాదినుంచియు బ్రాహ్మణులు ముఖ్యులుగా భావింపబడుటకు హేతువులు పలువురచే భిన్నముగా చెప్పబడుచున్నవి. ఆర్యులీదేశమును ఆక్రమించుచుండినపుడు తామారాధించు దైవములపూజకొరకు నియమింపబడినవారలయుధి కౌరమువృద్ధి జెంది బ్రాహ్మణులేర్పడిరని కొందరందురు. వేదములపఠించి వానినిగాపాడుటబట్టి బ్రహ్మముఖమునుంచి పుట్టినవారు బ్రాహ్మణులనికొందరును, సత్యయుగమునందందరును బ్రాహ్మణులైయుండ, కాలక్రమమున క్షీణతనొందినవారితరవర్ణములుగ నేర్పడిరని కొందరును యనుచున్నారు. జీవాత్మ తనస్థితిననుసరించి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర కళేబరములలో నొకదానియందు జనన మొందునని బిసెంటుగారు సెలవిచ్చినారు. వీరివిద్య, వైరాగ్య దారిద్ర్యములంబట్టి ప్రపంచమందలి నే యితరతెగవారును యనుభవింపనట్టి యఖండగౌరవ సన్మానముల ననుభవించినారు, ననుభవించుచున్నారు.

కాలక్రమమున నీనాలుగుశాఖలవారికి సంబంధ బాంధవ్యములును, భోజనాదివ్యవహారములును నంత మొందుటచే వైరమేర్పడినది. బౌద్ధమతవ్యాపకముచే బ్రాహ్మణులయాధిక్యత ఛేదించబడినను, శంకరాచార్యులు, కుమారిలభట్టు మొదలగు విద్వచ్ఛిఖరులు బౌద్ధమతశృంగమును ఛేదించి వేదమతమును పునరుద్ధారణచేసిరిగాని మహమ్మదీయుల దండయాత్రలు, దేశము పరాధీనమగుట, అరాజకము, కల్లోలము, యూరోపియనుల యాగమనము, క్రైస్తవ మతవ్యాపకములచే వేదమతమున కాధారభూతులగు బ్రాహ్మణులు పురాతనయాధిక్యతను బొందలేకున్నారు.

కొన్నివందల సంవత్సరములనుంచియు బ్రాహ్మణులకు కొన్ని తె శుష్కతగులుటచే దినదినక్షీణతను గాంచుచున్నారు. ప్రథమమున బ్రా

హ్మణులయందు భేదములేకపోయినను కాలక్రమమున నియోగి, వైదికి వైష్ణవులను శాఖలుగలిగి, నొక్కొకటితిరిగి పల్లులుచేసి నొకటితో నొకటి సంబంధమునాశనముచేసుకొని, సంబంధ బాంధవ్యములుమాని వైషమ్యముల వృద్ధిచేసికొని, సదాపోరాటములలో తమశక్తిని వృథజేయుచున్నారు. ఈవిభజనమునకు కారణము స్పష్టముగా గానరాకున్నది. లౌకికవ్యవహారముల వర్తిలుచుండినవారు నియోగులుగను, మతకార్యముల వర్తించువారు వైదికులుగను నేర్పడిరి. నియోగులు వేదముచదువుట పూర్తిగవిడిచివేయ, వైదికులు వీరికంటె నాధిక్యము నారోపించుకొని, దేవళములలోను, సన్మానసభలలోను నగ్రత్వమును లాగికొని, నియోగులలో వృద్ధులకైన నమస్కరించుటమాని, యాశీర్వదింపదొడగిరి. తమపౌరుషము కొంచెమయిన లోపముగలిగిన సహింపనేరని నియోగులు, తములో లింగధారులు, యార్వేలవారు, ప్రథమశాఖవారు, గోల్కొండవారను భేదములుద్భవిల్లుటచేతనోగాని లేక లౌకికవ్యవహార కొందరలచేతనోగాని నీయవమానమునకు తలయొగ్గిరి. కానికొలది వత్సరముల క్రిందట ధీక్షితులవారు తమశక్తికొలదిని నియోగివైదికుల సమానత్వమును స్థాపించుటకు నియోగులకు వేదాభ్యాసముచేయించి పద్ధతినెలకొల్పినారుకాని దీనినుంచి కొన్నకరస్సలు, నియోగిఫండులను లాభములేర్పడినను వైషమ్యము అభివృద్ధిగాంచినవి. వైదికులలోను వెల్నాటులు మొదలగు తెగలేర్పడి నొండొరులతో వివాహములు మానినారు.

మూర్తిత్రయములో నొకడగు విష్ణువునే నారాధించుచు రామానుజాచార్యుల సంప్రదాయము నవలంబించినవారు వైష్ణవులైరి. వీరికిని నితరబ్రాహ్మణులకును దృష్టిదోషముగూడ నవలంబించినారు. వీరుముఖ్యముగా విష్ణ్వాలయములలో పూజారులుగనుండి, వైద్యవృత్తి నవలంబించుచున్నారు.

బ్రాహ్మణులిట్లు తెగలుగ నేర్పడి వివాహబాంధవ్యములు మాని వైషమ్యముల వృద్ధి జేసుకొని, చెడిపోవుచున్నారు. ఇంతియగాక యతి బాల్యవివాహములు వీరివిద్యాబుద్ధి బలముల నాశముచేయుటచే నకాలమృత్యువుపాలయి, బాలవితంతువుల ఘోషలు వీరినియనునిమిషమును శపించుచున్నవి.

బ్రాహ్మణులలో ననేకులు విద్యనభ్యసింపక, దిరిపెమువృత్తిగా నేర్పఱచికొని, బాధ్యతలనేమియు వహింపక, దేశసంచారములచేయుచు, నితరులకేమియు లాభము కలిగింపక వారిచే పోషింపఁబడుటచే బ్రాహ్మణ్యమునకంతకు నపకీర్తిని కలుఁగజేయుచున్నారు.

ఇక నితరవర్ణములవారు వీరినెట్లెన్నించుచున్నారో చూతము. ఇతరవర్ణములవారందరు బ్రాహ్మణుల యాధిక్యతను బ్రశ్నించుచున్నారు. వైశ్యులును ద్విజులగుటచే మరచిపోయిన వేదాభ్యాసమును తిరిగి చేయుట ప్రారంభించినను ధనలాభము లేమిచే విశేష శ్రద్ధ చేయకున్నారు. తమక్రిందివారగు శూద్రులు తమ యాధిక్యతను బ్రశ్నింతురను భయముచే బ్రాహ్మణుల యౌన్నత్యమును గూర్చి నోరుమూసుకొనియున్నారు. అంతియగాక నితరులకున్న ధైర్యసాహసములు వీరలకు లేవనుసంగతి జగత్ప్రసిద్ధమగు సామెతయే వెల్లడించుచున్నది.

వీరికన్న శూద్రులు ధైర్యముగలవారు. తమమనస్సులోని విషయమును బహిరంగముగా జెప్పగలవారు. వీరియందు నాంగ్లేయవిద్య వృద్ధియగుటచేతను ధనముగూడుటచేతను నొకవిధమగు శక్తియుద్భవిల్లినది. ఈశక్తిముందుగావించిన కార్యము. నామములలో మార్పు, రెండవది యాభరణములలో మార్పు, మూడవది వస్త్రములలోను, నాలవది వేషభాషలలోను గలిగినవి. వీరిపుడు నాంధ్రమునభ్యసించి, భారతాదిగ్రంథముల చదివి, సారముగ్రహించుటచే సంధ్యావందనమొనరించుటకు తమకును హక్కుగలదని యెంచుచున్నారు. ఇంతకుమునుపు యేమండి యని బ్రాహ్మణుల పిలుచుచుండ నిపుడు వీరిలో ధనికులు "ఏమయ్యా" యనిపిలుచుచు, మునుపు బ్రాహ్మణులు కనుపడినతోడనే నమస్కరించువారిప్పుడు క్రమముగ మానివేయుచున్నారు. వీరువిశేషకార్యముల నెరవేర్ప శక్తిగలవారయ్యును నైకమత్యత లేమిచేతను, యంతర్విభాగముల వలనను, నాచారహీనులు, నిష్కాములగు నాయకులు లేమిచేతను, ధనమును కోర్టులలోను కయ్యములలోను వ్యయముచేయుటచేతను తగునభివృద్ధిగాంచలేకున్నారు.

హిందూసంఘములో నంత్యజాతులను పేరుగల వారనేకులున్నారు. వీరుబహునీచముగా జూడబడుచు, వ్యవసాయపు పనులవలనను కూలినాలివలనను బహుకష్టముమీద జీవయాత్ర సల్పుచున్నారు. వీరుదగ్గరకు వచ్చిన స్నానమాడవలెనట! వీరినితాకగూడదట! వీరికి విద్యనేర్పగూడదట! అహా! హిందూదేశముయొక్క దుస్థితికి వీరియెడల మనముజూపు నిర్దాక్షిణ్యమే కారణము! వీరిదుఃఖమే వ్యాధిరూపమున పీడించుచున్నది! వీరినోరులేనిశాపమే స్వతంత్రమును నాశనముచేసినది! వీరు త్రాగుబోతులు, కనుక తిండికిగతిలేక యెల్లప్పుడును యప్పులపాలైయున్నారు. వీరిగృహములు బహుయనారోగ్యకరములు. వీరుద్విపాదపశువులనవచ్చును. దీనిలోపము బ్రాహ్మణులదే.

అయినను హిందూసంఘము బ్రాహ్మణులపై కొక్కసారిలేవలేకపోవుట కీక్రిందిహేతువులు గానవచ్చుచున్నవి

1. బ్రాహ్మణులు మతాధికారులగుటచే, వివాహాదికార్యముల జరుపుటకు వీరియత్యవసరము. 2. యూరూరను బ్రాహ్మణులేకరణములుగానుండి, నితరవర్ణస్థులవ్యవహారములనన్నియు నమ్మికగా చక్కగా నెరవేర్చుచుండుట. 3 బ్రాహ్మణులు గొప్పయుద్యోగములనుండుట. ఈవిషయ మింతవరకాపి యితరులెట్లు వీరినిచూచుచున్నారో యాలోచింతము. మహమ్మదీయులలో పల్లెటూరులలో నివసించువారలు బ్రాహ్మణులన్న గురుభావముతో జూతురు. పట్టణములలోనుండువారికిని, బ్రాహ్మణులకును నంతమైత్రత లేదు. ఇదిఉత్తరహిందూస్థానమునందెక్కువగా గానవగును. మతవిషయములగు హేతువులంబట్టియు, రాజకీయసంబంధములగు కారణములనుబట్టియు నీవైషమ్యము హెచ్చగునటులనే గాన్పించుచున్నది. వీరిపట్టుదల ప్రఖ్యాతమైనది వీరిశూరత్వము మెక్కువైనది. బ్రాహ్మణులందరు నార్యమతమును వదలిన యెడల దేశమంతయు సులభముగా తమమతమునవలంబింతురనియెంచి పావిరీలుతగుయాకర్షణల గలుగజేయుచున్నారు. నూర్గురితరవర్ణముల వారిని తమమతములోనికిమార్చుటకన్న నొకబ్రాహ్మణుని మార్చుట యెక్కువగతలచుచున్నారు. క్రైస్తవులను పురికొల్పి, తమసహజహక్కులను బ్రాహ్మణులవద్దనుంచి లాగికొనునట్లుచేయుచు, వీరికివిద్యగరపియుద్యోగముల సంపాదించుటలో బ్రాహ్మణులకుపోటీవారులుగ జేయుచునిమ్నజాతులవారిని సమయముగనిపెట్టి తమలోనికిదీసుకొని క్రైస్తవులుగ మార్చివేయుచున్నారు. హిందూమతశృంగము అన్నిటిని విరుగగొట్టదలచియున్నారు.

దొరతనమువారు నిష్పక్షపాతమును జూపుటరాజనీతి. ఇతరవర్ణస్థులలో రాజ్యభారము నిర్వహింపగలవారు తగునంతమంది లేకపోవుటచే బ్రాహ్మణులనే యుద్యోగస్థులుగ నేర్పరచుచున్నారు. కాని కొలదికాలమునుండియు బ్రాహ్మణేతరులకు నపరిమితముగు ప్రోత్సాహమునిచ్చుచు బ్రాహ్మణులను నిరుత్సాహపరచుచున్నారు. రాజ్యపరిపాలనమను శకటమునకు ముఖ్యభాగములగు తెల్లవారితో భోజనాదులనుగ్రహించక నిరాకరించుచు, సాంఘికవిషయములలో వీరికంటెను తామేయధికులమని బ్రాహ్మణులు స్వగౌరవమును పోగొట్టుకొనకుండుటచే కాబోలు నిపుడు బ్రాహ్మణులకన్న శూద్రులకు ప్రోత్సాహమియ్యవలెనని గుప్తశాసనములను శాసించియున్నారు.

అంతియగాక దేశమందు బయలిశిన దేశసుప్రోత్సాహము, జాతీయవిద్య, జాతీయభావప్రచారము మొదలగు నవశక్తులకన్నిటికిని పుట్టినిల్లు బ్రాహ్మణులేయనియు, నిష్కామకర్మ స్వార్థపరిత్యాగము నకును వీరేపెన్నిధియనియు దొరతనమువారు గ్రహించిరి.

వీరిస్థితియిట్టులుండ దేశస్థితియైనను సౌఖ్యదాయకముగా నున్నట్టుగాన్పించదు. ఒకమూల మహమ్మారి, నొకవైపు కలరా, నొకదిక్కు జ్వరములు, మరియొక్కదిక్కు యితరవ్యాధులును జనులనాశము జేయుచున్నవి. జనులబలమూ నానాటికి క్షీణించుచున్నది. ధనమూ,

జనసామాన్యములో నానాటికిబీదతనము హెచ్చుచున్నది. విద్యయా, యైదుయూరుల కొక్కటియైన పాఠశాలలేదు. చేతిపనులా, కృష్ణపక్షచంద్రునివలెనున్నవి. జనులయందు నైకమత్యమూ, విశేషము గానరాదు.

ఇట్టిస్థితిలోనున్న దేశమునకును, దేశములోని బ్రాహ్మణులకును రాబోవుస్థితియెట్టిదనియొక్క శంక మనమునయొడమును. సముద్రములోపోటునకు పూర్వమాటుయుండునట్లును, ధర హెచ్చుటకుపూర్వము తగ్గునట్లును, వర్షముకురియుటకు పూర్వము యుక్కవేయునట్లును తేజోవంతమగు భవిష్యత్సూచకముగా నీప్రస్తుతస్థితి ప్రాపించినదని యెంచెదను.

ఇదియెట్లుచేకూరును? స్వార్థపరిత్యాగముచేతను, దేశభక్తివలనను ఎట్లు? ఒకరిదుఃఖమును నివారింపవలెననిన దానినిమనమనుభవింపవలయును. ఒకానొకరు కుమారుడుపోయి దుఃఖములోనుండిన వానినోదార్చవలెననిన మనమువారియొద్దకుచని, వారితోపాటు కొంతవరకు దుఃఖించి మంచిమాటలు చెప్పవలెనుగదా! ఇందువలననే యేసు ప్రపంచమందలి పాపమును పరిహరించుటకు తనశరీరమును శిలువకర్పించెను. పావురమును రక్షించుటకు శిబి తనదేహమునందలి మాంసమిచ్చివేసెను. దీనినే స్వార్థపరిత్యాగము, పరులయందలిప్రేమ, మానవసేవ, ఈశ్వరారాధనయందురు. కానదేశదుఃఖమును నివారించవలెనన్న స్వార్థత్యాగులుండవలయును.

ఈసిద్ధాంతమును ధృఢపరచుటకు చరిత్రనుండి సాక్ష్యముల నిచ్చెదను. ఐరోపాఖండమంతయు యజ్ఞానాంధకార మయమైయుండినపుడు క్రైస్తవభిక్షుకులు ఈశ్వరునియందలి భక్తిచేతను, మానవులయందలి ప్రేమచేతను సర్వస్వమ్మునుత్యజించి, యరణ్యములగొట్టి, తోటలేర్పరచి, వ్యవసాయమును వృద్ధిచేయుటచేతను, పాఠశాలలస్థాపించి విద్యనువ్యాపింపజేయుటచేతను, యౌషధశాలలు స్థాపించిరోగములకారణములారసి వానినిర్మూలము గావించుటచేతను, నడవడిచేతను బోధనలచేతను మానవుల దుర్మార్గమునుండిమరల్పి సన్మార్గప్రవృత్తిని నవలంబించునట్లు చేయుటచేతను నాగరికతనెలకొలిపి ప్రస్తుతకాలమందలి ఐరోపాకుపునాదులువేసి కారకులయిరి. ఐరోపావరకును చననవసరములేదు. ఆసియాలోదుష్టత్వము అనాగరికత ప్రబలినపుడేగదా బౌద్ధభిక్షుకులు నానాదేశములకుజని, మతమునువ్యాపింపజేసి, నాగరికతకు పునస్స్థాపనమునుజేసిరి. పంజాబునందు వేదబాహ్యమగు మతము ప్రబలినపుడు దయానందసరస్వతియును వారిశిష్యులును స్వార్థమునుత్యజించి వేదమతమునుతిరిగి జనులకుబోధించిరి. రారాజగు శ్రీకృష్ణుడు ప్రపంచోద్ధారణకేగదా సారథియాయెను.

## ఇట్టిస్వార్థత్యాగమే బ్రాహ్మణులిపుడుచేయవలసియున్నది.

వీరేయెందుకు చేయవలయును? ఉపనయనమందే తండ్రివీరికి "భవతిభిక్షాందేహి" యనిబోధించుటచేతను, శాకభక్షకులగుటచే శరీరమును యింద్రియములను సులభముగా వశపరచుకొనగలుగుటచేతను, వీరేసంస్కృతవిద్యకు పెన్నిధియైమతోద్ధారకులగుటచేతను, యితరులు వీరినిప్పటికిని గురువులుగా భావించుటచేతను, మేధావియు, కార్యసాధనాశక్తియు వీరేగలిగియుండుటచేతనునీకార్యభారము వీరిమీద నేయున్నది. వీరీకార్యము నిర్వహింపకపోయినచో యేమిసంభవించును?

మీదనితరవర్ణములలో యసంతుష్టి యెటులపెరుగుచున్నదో వివరించితిని. ఆయసంతుష్టి విశేషముగాపెరిగిగాని నొక్కసారి ప్రళయసామ్యమగు శబ్దమునుకరింపజేయుచు బయలుపడదు. అప్పుడు బ్రాహ్మణధ్వంసముగాని లేక బ్రాహ్మణులకు నీచమగు, దుఃఖకరమగుపాటునుసంభవించును. బ్రాహ్మణులు నశించిన యార్యమతమును దానితో వేదాంతమును, దానివెంట ప్రపంచముయొక్క శాంతియు నశించును. కనుక బ్రాహ్మణేతరులు వీరినాశమొందింప యత్నింపరాదు. ఇతరదేశములందలి మతగురువులు వేనవేలు జీవితములనుభవించుచుండ మనమతగురువులు కమండలువును దండమునుమాత్రము కలిగియున్నారు ఇతరమతబోధకులు నైశ్వర్యమనుభవించుచుండ వీరు సోలెడుబియ్యమునకు విఘ్నేశ్వరపూజ చేయించుచు, పంటచేలలో యిచ్చు ధాన్యపుకవులను గ్రహించి ద్రవ్యమార్జించుటకు యత్నించక బీదవారైయుండుచున్నారు. అంతియగాక వీరార్యసంఘమునకు శిరస్సగుటచే, సేనకుయధిపతియంటివారలు. నాయకుడులేని సేనయేమిచేయగలదు?

## ఓయాంధ్రబ్రాహ్మణులారా?

మీసంఘమందలి యితరులును, యితరమతస్థులునుమీమీద నెట్టితలంపులతోనుండిరో తెలిసికొనినట్టుగానరాదు. స్వగౌరవమునునిలుపుటకుసంఘీభావమవసరము సంఘీభావము యనురాగమువలనను, యనురాగము బాంధవ్యమువలనను, బాంధవ్యము వివాహములవలనను గలుగుచుండ, మీలోస్మార్తవులు, వైష్ణవులను పెద్దతెగలును, తిరిగివైదికనియోగులనుతెగలును, తిరిగి వీరిలో పిల్లతెగలును యుండి, వివాహములును, పంక్తిభోజనములునులేకయుండ సంఘీభావమును గౌరవమును నెట్లుండును?

ఆచారములకు యూహాబంధములుదప్ప మీలోవివాహములు చేసికొనుటకును, యతిబాల్యవివాహములు వర్జించుటకును నేయభ్యంతరములున్నవి? శాస్త్రములలో బ్రాహ్మణులనియున్నదిగాని వైదికులనియు, నియోగులనియు, వీరువివాహము లాడగూడదనియు, యున్నదా? విద్యానాశనము, యారోగ్యభంగము, బలహీనత, యాయుక్షీణమేగదా, యతిబాల్యవివాహముల ఫలితములు?

అదియట్లుండ, వైశ్యులుమొదలగు నితరులును, వీరిపూర్వులును మిమ్ములగురువులుగా భావించి యిహపరములలో మిమ్ములనమ్మియున్నారు. బ్రాహ్మణులకు దానమిచ్చిన పుణ్యమనిగదా నీరుభావించుట, యట్టిస్థితిలో వీరిని దేశమును యభివృద్ధికి దేవలసినభారము మీదియేగనుకను, ధనమార్జించినను, సుఖమనుభవించినను కాలునిచే బడి దండనయనుభవింపక దప్పకపోవుటచేతను, స్వర్గమును జన్మరాహిత్యమును కోరియైనను యార్యావర్తమును మున్నతస్థితికిదే నడుకట్టుడు. స్వర్గమక్కరలేనిచో కీర్తికొరకైన నట్లుచేయుడు. కీర్తియక్క—

రశేనిచో మీహృదయములయందలి దయను వెలువరించిన నదిశివునితల నుంచిప్రవహించిన జాహ్నవీబిందువువలె, జాతి, ప్రవహించి, వెల్లువ

నవజాతికి సుఖమును సంపదను సమకూర్పగలదు.

ఔషధశాలలుస్థాపించి, రోగముల కారణములారశి, జనక్షయము నాపుడు, శిల్పములను, కళలను, నెలకొల్పి, వ్యవసాయము వృద్ధిచేసి జనులకన్నదానము చేయుడు. అన్నదానమహిమ యిట్లువర్ణింపబడినది.

"ధర్మరాజునూయయాగమును నెరవేర్చినతదుపరి సగము సువర్ణమగు నొకమూషికము శేషములగు పదార్థములలో పొరలుచుండ చూచినవారు కారణమేమని ప్రశ్నించిరి. దానికామూషిక మిట్లుచెప్పదొడగెను. "అమరావతియనుపట్టణమున నొకద్రాహ్మణుడొకడు, భార్య, పుత్రులతో భిక్షమెత్తుకొని జీవించుచుండ నాపురియందొకక్షామముకలుగ యారుదినములకరకు నేమియు దొరకకుండె, మరుసటి దినమున నొక సేరుపిండిదొరుకగ నాలుగుభాగములుచేసి భోజనము చేయ యత్నించుచుండ నొక యతిథివచ్చి పుత్తెంచెను. అతిథిక్షుధనుతీర్చుటకు తనయాహారమునర్పించి, యారాత్రియే నలుగురును పరంపదించిరి. అతిథివిస్తరిక్రింది పిండిలోనేనుపొర్లాడ సగము శరీరము సువర్ణమాయెను. తక్కిన శరీరమును సువర్ణముగుటకు నెంతయో దేశములు తిరిగి విసికివేసారితిని గాని ఫలములేదయ్యె. ధర్మరాజా రాజసూయాధ్వరమునుగూర్చి వినివచ్చితిగాని నాశరీరము సువర్ణముగాలేదు. ఆబ్రాహ్మణునిదేధర్మమని చెప్పెను"

## అన్నదానముకంటెను విద్యాదానముత్తమము.

"విద్యయొసగును వినయంబువినయము, నను
బడయుపాత్రత పాత్రతవలనధనము,
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబులందునరుడు."

ఇట్టివిద్యను ప్రతికొనమును లాగికొనివెళ్ళి, యుంధకారమును బారద్రోలి జనులలో నైకమత్యము, దేశభక్తి, స్వగౌరవమును నెలకొల్పను. బ్రహ్మచారులైనవారు భీష్మునివలెను, గృహస్థులు వశిష్ఠ, ద్రోణాచార్యుల వలెను, సన్యాసులైనవారు వ్యాస, శుక, దయానంద వివేకానందులవలెను దేశసేవజేయుడి.

కలకత్తాలోనియాంధ్రవిద్యార్థులను కృష్ణకుమార్ మిత్రగారు "ప్రపంచమంతయు తపించుచున్నది. మీహృదయములలో ప్రేమయున్నయెడల నార్పుడు లేనియెడల వృద్ధిచేయుడు" యనిబోధించెను.

వివేకనందస్వామిట్లు సెలవిచ్చినారు:—

"మేలుకొనుడు. గమ్యస్థానమును చేరువరకు నాగకుడి. సన్యాసములేనిది గొప్పకార్యములు నెరవేర్పజాలము. ఇతరులకు సహాయముచేయవలెననిన స్వలాభము వదలవలయును. ధనపిశాచమును ఈశ్వరుని సేవించుట దుర్లభము. మనపూర్వులు గొప్పకార్యములఁజేయుటకు ప్రపంచమును త్యజించిరి. మోక్షముకొరకు సన్యసించువారనేకులున్నారు. మోక్షమునుగూడవదలి యితరులకు సహాయముచేయుము. నీవు నేను మనబోటియనేకులు నశించిననేమి, జాతియే శాశ్వతముగా నుండవలయును. జాతిక్షీణించుచున్నది. లెక్కలేని ప్రజలశాపములు మనమీదయున్నవి. దప్పిచేవీరు మొరలిడ, మురికినీరిచ్చినాము కాని జీవననదిప్రక్కనే ప్రవహించుచుండెను. వస్తుసమృద్ధియున్నను యుపవాసముంచినాము. వీరికద్వైతము బోధించుదుముగాని దయజూపము. లోకాచారముల యూతగొని వీరిని నీచులుగా జూచుచున్నాము. అందఱు ఈశ్వరస్వరూపులని చెప్పుదుముగాని యాచరణయందు బెట్టము. మనస్సులో ధ్యానించవలెను మాత్రమా! మేలుకొనుడి, ఈ శరీరము నశించిననేమి? యోగియు పాపియు, ధనికుడు దారిద్రుడు, మృత్యువువాత బడకతప్పదు. ఈశరీరము శాశ్వతముగాదు. మేలుకొని యధార్థతవహింపుడు. మనలో యధార్థత్వము బహులోపముగాయున్నది. భయంకరమగు మరణచ్ఛాయ శరీరమువెంట నంటునట్లు కార్యమువెంట నంటగల పట్టుదల యవుసరము."

ఇంతకంటె ఘనకార్యమొకటియున్నది. ప్రపంచమందంతను వేదాంతమతము వ్యాపించవలసియున్నది. వేదాంతము వ్యాపించిన గాని నిశ్చలమగుసౌఖ్యము ప్రపంచమునకేర్పడదు. ఈకార్యభారము యార్యావర్తముమీదనేయున్నది. ఈభారమువహించుటకు పూర్వము గృహమును చక్కబెట్టుకొనవలసియున్నది. గృహమును చక్కచేసికొనినగాని మనశ్శాంతియుండదు. ఈమహత్కార్యము నెరవేర్చుటను వముకట్టుడు. శాశ్వతకీర్తిని సంపాదింపుడు. మీ పూర్వులగు ఋషులను జ్ఞప్తియుంచుకొని కార్యసాధనముచేయువరకు వెనుకకు మరలకుడు. ప్రపంచమందధర్మము వృద్ధియైనపుడెల్లను యవతరించి ధర్మమును పునరుద్ధారణచేయు శ్రీకృష్ణుడు మీకు సహాయమొసగుగాక.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః
సన్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః



# స్వేచ్ఛానిర్బంధ శిక్షలకుగల భేదము.

మ.రా.శ్రీ, మూసెరాజు వెంకటేశ్వరరావు, వేముగంటి రామకృష్ణారావులగార్లవలన వ్రాయఁబడినది.

విద్యాతత్త్వమునుగూర్చియు, తదావశ్యకతనుగూర్చియు, నొకకాలమునఁజర్చించుట, యత్యావశ్యకమైనను నిప్పుడిచ్చట చర్చింపఁబడుటమాత్ర మనావశ్యకమని తోఁచెడిని. కాలగమనము పూర్తిగా గాకపోయినను, విశేషభాగములందుమాత్రము, మానవజీవితమునందలి విశేషములైన ముఖ్యావశ్యకములును, మఱియు, ప్రతిదేశముయొక్కయు, ప్రతిజాతియొక్కయు దేశీయ, జాతీయాభ్యుదయములెల్లను విద్యపైననే యాధారపడియుండునను విషయమును, లోకమునకు వ్యక్తీకరించుచుండుటెల్లఱకును దెల్లంబయ్యె.

ఒకకాలమిలాగునఁగూడ, ననఁగా నెల్లదేశములయొక్కయు, నెల్లజాతులయొక్కయు, నభివృద్ధియంతయు ఖడ్గధారపైననే యాధారపడియుండెను. ఏజాతి, మఱియు, నేదేశము, ఖడ్గధారణయందును, యుద్ధమునందును, బలహీనముగనుండెనో, యాజాతి యాదేశ మితరజాతులకెల్లను లొంగియుండవలసియుండెను. మఱియు వారియెల్ల యభ్యుదయములును, ఎల్లకోరికలును, ఎల్లవాడుకలును, ఎల్లశక్తులును, పతితములైయుండెను. భిన్నజాతులయొక్క చరిత్రలను విలోకించుటచే నీవిషయము మనకుఁజక్కఁగ ద్యోతకము కాఁగలదు.

అనేకకాలములయందు, జాతులయొక్కయు, దేశములయొక్కయు నభివృద్ధి, కల్లోలములవలనను, యుద్ధములవలనను, ఖడ్గోపయోగమువలనను, గలుగుచుండెను. మతములుగూడ దేశజాతులపై తమనిరంకుశాధికారమును, స్థాపించినవి. ఆయన నవియుగూడ, గొన్నిసమయములయందు సంక్షోభములను, రణములను, విఘ్నములను నాలోనుగావలసియేవచ్చెను. రోము, గ్రీకు, దేశముల పురాతనచారిత్రలీవిషయమున కనేక ప్రబలాహగ్యములుగనున్నవి. పరదేశములు ఖడ్గమునెడు వాగ్రూపమున వెలువఁబడుచుండెను. జాతీయోత్సాహమునందును, జాత్యావేశమునందును, ఖడ్గము సంపూర్ణముగ పాలుగొనియెను. అప్పుడు ప్రాపంచకమునందీకత్తులును, ఖడ్గములును, ఈనాళికాయంత్రములును, శతఘ్నులును లేవు. ఆకాలములయందలి జాతీయౌన్నత్యము జాతీయగౌరవపరమావధియై యుండెను. కత్తులు, కటార్లు, యుద్ధములు, మొదలైన వెల్లను, నానాటికి, వృద్ధి కావొడంగెను.

ప్రపంచమునందలి యెల్లవిషయము లొకతాత్వికాధారముపైననే నడుచుచుండి యభివృద్ధిగాంచుచుండును. ఇక్కాలమునందన్నిటికంటెను, జాతీయోద్ధరణమునకును, దేశాభ్యుదయమునకును, ఔన్నత్యపరమావధికిని, మూలకారణము, లేఖినియనియే చెప్పనొప్పును. తరువాత రెండవది, ఖడ్గము. ఈసమయమున, లేక యీకాలమునందేదేశము, మఱియు నేజాతి, తనయభివృద్ధికిని తనయౌన్నత్యమునకును, శారీరకభుజశక్తులపైనను, కేవలఖడ్గధారపైనను, ఆధారపడియుండునో, ఆజాతి, యాదేశము, మార్గవిహారమై పెడత్రోవఁబట్టి, కడపట నిరర్థకమౌనటమాత్రము నిశ్చయము.

ప్రతియుగము నొకవేషమును ధరించియుండును. ప్రతివేషము నొకయభిప్రాయమును వ్యక్తీకరించుచుండును. ప్రతివ్యక్తియు, గాలానువరణముగు, నొకయాకర్షణాపరిపూరితమైయుండును. కాలానువరణమైన నాయాకర్షణమును సరియైనమార్గమునఁబెట్టిన దానిచే ననేకమహాకార్యములును, వ్యవహారములును వేయేల, మానవావశ్యకములెల్లను కడునిపుణతతో, నవలీలగ, సాధింపనగును. కాని దానినమునందానిని సుపయోగింపకున్న కాలము మించిపోవును. సమయము మించిపోవును. తరువాతం జింతించియు విశ్వప్రయత్నములంజేసియు నిష్ప్రయోజనమౌను.

కాలముయొక్క మార్పులను, గనుగొనుట యొకమహావిషయము. మానవజీవితపరమావధియంతయు, దానిపైననే యాధారపడియుండును. వెలుఁగుండినప్పుడే వెతుకుకొనవలయు నన్నట్లు, జీవితమహాసముద్రముయొక్క సమయానుకూలమైన యొకతరంగము, మనయజాగ్రతచే, దృష్టినుండి మఱుఁగుపడినచో, మరల నట్టిసమయము మనజీవితాంతమువరకును, చేజిక్కకపోవును. మనమెల్లప్పుడు, ప్రతిపదార్థమును, ప్రతికార్యమును, మనజీవితసాఫల్యమునకే చేయుచుందుము. ఆహారాది శారీరకలాభమైనను, లేక యాధ్యాత్మికమైనను నైయుండును. ఈరెండులాభములలో నేదేనియొకదానిని బొందని మనప్రతికార్యమును నిరర్థకమును నిష్ప్రయోజనమునగును. [illegible] మిన్నునంటుటయు, నొకటిగనే పరిగణించును. శరీరమున [illegible] జేయఁజాలని యాహారము, [illegible] విధములగు [illegible]గల్పించి శ్రమనొందఁజేయును. నష్టమునుగలిగించు నాహారము నారోగ్యమును జెఱచివేయును. లాభనష్టములరెంటిని గలుగఁజేయఁజాలని యాహారముమాత్ర [illegible] లక్కొక నిష్ప్రయోజనమైనపనిని గల్పించినదౌను.

మనము జీవితలాభముల భారము నొకత్రాసునం దూయుటలేదు. రెండువిధములైన త్రాసులం దూయుచున్నాము. మనలాభములన్నియు, నిత్యములనియు, నైమిత్తికములనియు, ద్వివిధము. మనల మన జీవితవిధానపరమావధికి నిరంతరాయముగను, నిరభ్యంతరముగను, జేర్చఁజాలినవి నిత్యములు. నైమిత్తికములన, మనయావశ్యకము లౌకికవిధమైన నిబంధనలతోను, నిర్బంధములతోను, గూడియుండు యా నిర్బంధములును, నిబంధనలును, భేదింపఁజాలనిచో తదర్థమై మనము ప్రాణమానవిత్తములనైతము సరకుసేయక గావించిన యెల్లప్రయత్నములును, నెల్లపరిశ్రమలును నిరర్థకములును నిష్ప్రయోజనములును నగుటయే. అట్టిమహాప్రయత్నములు, మంటగలియుటచే మనమొక

ఘోరమైన యశాంతి దేవతకాహుతి సేయబడి, జీవితాంతమువరకును, తీరని, మహానష్టదాయకమైన మనోవ్యాధిచే పీడితులమై మనోవేదనాభరమును వహింపజాలకల్లాడుచుందుము.

ఎల్లశాఖలును, ఎల్లప్రయత్నములును, ఎల్లయభిప్రాయములును నిట్టిపద్ధతిచేతనే యావృతములైయున్నవి. శిక్షాక్రమమంతయు దీనికేలోబడియున్నది. జనులందరును సాధారణముగ రెండువిధములైన యభిప్రాయములతో, శిక్షబొందుచుందురు. అందొకటి నియమిత లాభముల బొందునది. రెండవది, అనియమితలాభములను బొందునది. నియమిత లాభముల బొందవలయునన్నెడి కోరికతో బొందుశిక్షయే నిర్బంధశిక్ష. ఉదాహరణార్థము; ఒకడు పాఠశాలనుండి బయలువెడలినతోడనే యొకపెద్దయుద్యోగమునం బ్రవేశించి బలమైనవేతనమును బొందవలయునన్నెడి కోరికతో నాస్తుకశాలయందు బ్రవేశించును. తాను న్యాయవాదిత్వ పరీక్షయందు బట్టభద్రుడైనతోడనే న్యాయస్థానమునకేగి తనకార్యములం జక్కబెట్టుచు, చేవవడసి, తత్ప్రతిఫలమును గడింపవలయునను నభిప్రాయముతో నాపరీక్షకై బాటుపడుచుండును. ఈలాగుననే బి.ఎ., ఎం.ఎ., ఎల్, ఎల్, డి, మొదలుగాగల పరీక్షలకెల్ల శ్రమపడువారందరును, తామేమొందు వరుసగ నుద్యోగభాగ్యము లందగలుగుదుమనెడి యాశచేతనే ప్రయత్నముల సలుపుచుందురు. ఇట్టివారు బొందుశిక్షయంతయు నిర్బంధశిక్షయే. ఒకవేళ దురదృష్టవశమున నీనిర్బంధమును జయింపలేకపోయినచో దానికి లోబడుటయేగాక తీరని యొకపెద్దదుఃఖమునకు బాల్పడవలసివచ్చును. నిర్బంధమును జయింపలేమికి శిక్షితుడొకవైపు చింతించుచుండ నాతనికి విద్యనేర్పించినవారును, లేక తలిదండ్రులును మఱియొకవైపు ఆశాభంగులై విచారమును సూచించుచుందురు. ఒకానొక సమర్థుడైన ఎం. ఎ, విద్యార్థి తానుతనపరీక్షయందు కృతార్థత నొందజాలనప్పుడాతని మనస్సెట్లుండునో యదియాతనికే గోచరమగును. తదితరులకు దురవగాహము.

తామొకవ్యాపారము మొదలిడి, యందుకై నిరంతరకృషి, దేహాచ్ఛాపరిశ్రమ, మున్నగువానిజేసి గూఢఛిట్టి చివరకు దుర్దశాపిశాచంబు, తమ్మావరింప, నెల్లవిధముల గోలుపడి, తిరిగి కోలుకొనలేనంతటి దుస్థితికి బాల్పడినవారును మరియు బ్రతిఫలము లభియించుట, దుస్తరముగ గన్పట్ట చింతాక్రాంతులై యల్లాడువారును నెంతయు శోచనీయులుగదా.

నిర్బంధకర్మముయొక్క పర్యవసానమెల్లప్పుడిట్టులనేయుండును. ఎప్పుడైతే నిర్బంధము జయింపబడదో యప్పుడే నిర్బంధింపబడినకార్యముకూడ కార్యకారికాకుండును. వాగ్దానమెల్లప్పుడొక నిర్బంధమునకును నొప్పుదలకును లోబడియుండును. మరియు దాని యభిప్రాయముగూడ నిదియే.

ఒకవేళ నేనొకపనిని, యదిముగిసిన తదుపరి, నాయజమానునివలన నొకపానుమాలి దీనికొను నొప్పుదలపై జేసినచో నాకార్యబాధ్యతయంతయు నామీదనేయుండును. లేక నేనట్లు వాగ్దానప్రకారము పనిజేయజాలకున్నచో నిరుత్సాహుడ నాదును. మఱియు నానిరుత్సాహత నాధైర్యమను మహావృక్షమునకు చెదపురుగై నష్టకారియవును. మఱియు నిజకార్య పరిపూర్తివిషయమై పెద్దకాలము యోచింపవలసియుండును. మఱియు నాపరిశ్రమ నాకుసంతోషకరము కాక దుఃఖదాయకమౌను. ఒకవేళ నదృష్టవశమున నాచే జేయబడిన కార్యమునకు మంచిప్రతిఫలము లభియించినచో "సంతోషపుగాలి చాలబనిచేయు"నను నార్యోక్తిననుసరించి నాధైర్యోత్సాహము లతిశయించును.

నిర్బంధశిక్షయందు లభియించిన నిరుపమానందమే లభియించును. లేకున్న దుఃఖము. మనోస్థిమితమిందు మందునకును గానరాదు. ఒకవేళ్లనున్నను హృదయమునకు నిజమైన సంతోషము నొసంగునది గాక యాగంతుకసౌఖ్యమున కాకరమై నాటకపాత్రవలె సుఖవేషధారియై చూపట్టును. స్వాతంత్ర్య శిక్షయన కేవల మొకేయుద్దేశముచే నిర్బంధింపబడక "దానినే పొందింపవలయును. ఏలయన నదిపొందుటకు దగినది" అనియెంచి వర్తించుటయే. దీనిపేరే విద్యాప్రియత్వము. ఇదియే విద్యాపూజత. ఇట్టిశిక్షవలననే నిజమైనసంతోషము నిజమైన విజయము చేకూరును. ఈశిక్షయే సత్యవిద్యాపరిగ్రహణ ప్రథమోపకరణము ఈశిక్షయే వివిధనిర్బంధములనుండి విడదీసి మానవుని స్వేచ్ఛాపురస్థునిగ జేయును. ఈశిక్షవలననే మానవునిహృదయ ఫలకము తేజోమయమై మేధాదర్పణమతిశయకాంతిమంతమై యభిప్రాయ పరంపర ప్రబుద్ధమార్గమునే యవలంబించి మానవుని నిజమైన స్వాతంత్ర్యోత్సాహపూరితునిగ జేయును.

ఈశిక్షయే బీదతనమునకును కష్టసముదాయమునకును దుఃఖమునకును నిరుత్సాహమునకును శాంతిస్థైర్యముల సుఖసంతోషముల నుపదేశించు గురువు. ఈశిక్షయే ప్రతిసమయమునను నొకేవిధమైన యాకర్షణమును గలిగియుండు నయస్కాంతము. ఈశిక్షయే యొకబీదవానికిని రాజునకును గల తారతమ్యమును బోధించువక్త! ఈశిక్షయే స్వాతంత్ర్య శిక్షాదత్తుడైన యొకభిక్షుకుని నిర్బంధశిక్షాపముక్తుడైన యొకక్షమాకాంతునికన్న లక్షరెట్లధికునిగను, గౌరవనీయునిగను సిద్ధాంతీకరించు తార్కికుడు. ఈశిక్షయే యొకపతితజాతినిగాని దేశమునుగాని, నౌన్నత్యసౌధము నారోహింపజేయ నద్వితీయసహాయకారి. దీనిమూలముననే జాతీయపతితసంతతి యభివృద్ధిమార్గము ననుసరించును. ఈ శిక్షావిధానమే జాతీయశక్తి సామర్థ్యాదులందు తేజోమారుతము నింపివేయు ప్రథమోపకరణము. ఏశిక్ష యవతారపురుషులతత్వవేత్తల శాబ్దికుల ప్రపంచమునందలి, బలవత్సంపన్నులైన జనులకన్నులకు మహామేరుసదృశులుగ జేయునో, ఏశిక్ష తన్నాశ్రయించువారికి, జీవితాంతమువరకు, సాయకారిగనుండునో, ఏశిక్ష తన్నెన్నిదినములు సంపాదించినను తరగక యింకను గలుగుటకు దగినవిషయములచే నిండియుండునో, అట్టికల్పవృక్షము అట్టియద్వితీయ ధనరాశి అట్టిజ్ఞాన మారుత మీస్వాతంత్ర్య శిక్షయే!!!

మానవుడు తాను నిర్బంధశిక్షను బొందిన తదుపరి మనోస్థిమితముగలుగుననియు తనకోరుల హృదయాబ్జములు మరింత ప్రఫుల్లములై తేజోమయములౌననియు, నిజమైన సంతోషము చేకూరుననియు, స్వాతంత్ర్యను రక్తి ప్రబలుననియు నువ్విళ్లూరుచుండును.

కానియీ యంశములొక్క నిర్బంధశిక్ష వలన నెట్లు లభించును? ఒక ఐ. సి. ఎస్. విద్యార్థిగాని, లేక యొక డాక్టరుగాని, లేక నిర్బంధానిర్బంధోద్యోగిగాని, యిట్టియమూల్యరత్నముల సంపాదించునా? అంతవరకుపలోనేల, అతని సంకుచిత మేధయందీ యభిప్రాయములకైన, తావుకలుగునా? కల్ల! నిర్బంధశిక్ష నలువైపుల, దట్టమైన గోడలుగల యొక యాతుఖానవంటిది. నీరు హెచ్చినను, తగ్గినను, తననియమమును దాటిన చెను. నిండిపోయినచో, నీరుపైకి జిమ్మును. నిండనిచో నిండవలయునని గోరుచుండును. ఏదేశముగాని, ఏసైన్యముగాని యౌన్నత్యశిఖరము నారోహింపనడుముకట్టునో, యందు నిర్బంధ శిక్షాభిలాషులెందరు గలరో, స్వాతంత్ర్యశిక్షాభిలాషులెందరుగలరో, యొక్క కల్పితపట్టిక, నెరుటనుంచుకొని యవలోకించిన నీయంశము తెల్లమగును. ఏజాతియందుగాని ఏదేశమునందుగాని, నిర్బంధశిక్షావహాయుల సంఖ్య హెచ్చుగా నుండునో, యాజాతి యాదేశము, స్వేచ్ఛావిహీనమై వెలదనము కాకరమై సంతోషవిక్రేతయై యొప్పుచుండును. ఇట్టిజాతియందు, స్వాతంత్ర్యశిక్షాప్రకాశ మావంతయైన గలుగబోదు. నిర్బంధవిద్యాప్రవీణులయందు, ద్రవ్యమా న్యాయముగరాదు. అభివృద్ధియా సున్న. సంతోషమా అసలేలేదు. స్వేచ్ఛయా అనకూడదు. సత్యమార్గమా అంతకుమున్నే. మనస్థిమితమా తలవకూడదు. ఏదినమిట్టివారి నిర్బంధితావశ్యకము పూర్తిగాదో, యాదినమే వారికి, విద్యాశిక్ష పోర్తిగావ్యర్థముగను. వేరుగనుగాన్పించును. ఒక డాక్టరుగాని, యొక న్యాయవాదిగాని, తమతమ పనులు క్రమముగ, సాగకుండినచో, డాక్టరుగారు తమ వైద్యగ్రంథములను, వకీలుగారు, స్మృతుల శాసనగ్రంథములను, దూరన జెక్కి యావృత్తుల నిందింపజొచ్చుదురు. ఏలయన తమయుద్దేశము పూర్తిగాక వ్యతిరేకప్రతిఫలము లభియించుచున్నదిగదా.

నిర్బంధశిక్షవలన, నెప్పటికిని ధైర్యోత్సాహ సుఖసంతోషాదులు గలుగవు సరిగదా, విద్యాగౌరవముకూడ, నశించిపోయి, మేలుకీడులకు, రెంటికిని, కారణభూతమగుచు నిర్బంధశిక్ష యితరులదయాపై నాధారపడిన కూలిపనివంటిది. అతనికి మనసువచ్చిన కూలినిచ్చును. లేకున్న లేదు. దినమంతయు కష్టపడి, కూలిపనిచేసియు యజమానుని యనుగ్రహముపైన నేయాధారపడియున్న యొక కూలివాని స్థితిగనుగొనుడు. తానుదినకూలి దీసికొనిగూడ, రాబోవునెలకై విచారించువాడెంతటి యదృష్టహీనుడు. తానుపరీక్షయందు కృతార్థుడైన తదుపరి యెట్టిస్థితి వచ్చునో యెవ్వరిని యాచింపవలయునో యనుసంశయముల నే తన విద్యార్థిజీవితమునందాలోచించుకొనునట్టి విద్యార్థికట్టి విద్యవలన నేమిలాభము పొసగునన? కొన్నిసమయములందు, విద్యార్థుల జీవితము, నిరుత్సాహపూరితముగను, ధైర్యస్థైర్యరహితముగను, గన్పట్టుచుండుటకు, కారణమేమి యనుసంశయము గలుగుచుండును. ఇట్లుత్సాహభంగము గలుగుటకు, కారణము సాధారణముగా విద్యాశిక్ష నిర్బంధముగనుండుటయె. చుండు ఎవ్వనితోనైన, నీపరిశ్రమయొక్క ప్రతిఫలమితరుల, యనుగ్రహముపైయాధారపడునదిగ నుండునన వాతనిమనోవీథులయందు, సంతోషోత్సాహము లెక్కడినుండి వచ్చును? ఏపనినైన నిర్బంధముగ జేసినచో, నంకొకవిధమైన యాటంకము గలుగును. ఉత్సాహమునకు భంగము తటస్థించును. ఒక స్వాతంత్ర్యవిద్యాశిక్షితుడు, తానొక బిక్షకస్థితియందున్నను, సంతోషముతో నేయుండును. ఏలనన, నాతడేయుద్దేశముతో, విద్యగఱచెనో, యదియిట్టిస్థితియందును, దనకు లభించియే యుండును. మఱియు దాను సంపాదించిన మూల్యమునకు, హక్కుదారుడౌను. స్వాతంత్ర్యశిక్షితుడు, నిర్బంధశిక్షితునివలెగాక, వెంటవెంటనే, ప్రతిఫలము గ్రహించుచుండును. ఇక నీతడన్నో యొక విద్యార్థి రోఁడ్లకొలది పరిశ్రమజేసి చేసి, తనపరీక్షాపర్యవసాన మితరులయనుగ్రహముపై నాధారపెట్టుకొని, యుండునట్లు ముందుముందు గష్టపడి, ప్రతిఫలాపేక్షకై యితరుల యాచించుచుండును. స్వాతంత్ర్యశిక్షయన ప్రాపంచిక వ్యవహారములనుండి, స్వేచ్ఛగా నుండుటయని, మాయభిప్రాయముగాదు. విద్యాసంపాదన మొక నిర్బంధమానవులో బడి, తన్నిర్బంధానుసారముగ, బ్రతిఫలము లభింపకున్న, నావిద్యవిద్యాగౌరవ సౌధమునుండి, పతితమానదిగాకుండ, నుండవలయును. మనమొక శిల్పవిద్యను, విద్యాపక్షమున నభ్యసించిన నత్యధిక జీవితాధారము గలిగినచో శ్రేష్ఠమే. అట్లుకాకున్నను, విద్యాసంపాదనము వలనగలుగు, నిజమైన లాభము మాత్రమెక్కడికిని బోదుగదా. వివిధావశ్యకాపరిపూర్తికై విద్యయె యాధారమైనను, నిర్బంధితావస్థలో నుండి, పట్టుదివరకు దమగౌరవమె, జెఱుచుకొను, లాభములనభిలషించునదిగా నదియుండగూడదు.

సత్యవిద్య నెట్టమొదట స్వాతంత్ర్యదర్శకములైన యావశ్యకముల, బూర్తిజేసి, విశాలమార్గముల బ్రవేశపెట్టును నిజమైనసంతోషములు గలుగుట కడ్డులై నిలువబడు, వివిధాటంకముల దరిమివేయును. ఏజాతియందుగాని, యెంతవరకు స్వాతంత్ర్యవిద్యాప్రకాశము ప్రసరింపదో, యంతకాలము పండితజనమందు గలుగబోదు. నిర్బంధవిద్యాశిక్షితులు, విద్యావశ్యకముల నెంతవఱకని పూర్తిజేతురు? విద్యాపరిపూర్ణములైన దేశచారిత్రముల, నవలోకించినచో విద్యానయప్రాపంచికములందలి, శ్లోకోవిరాజితములైన సూర్య, చంద్ర, నక్షత్రములీస్వాతంత్ర్య విద్యాశిక్షితులేయని చెప్పనొప్పును.

ఏజాతియభ్యుదయము నొందదలచునో, యది మొట్టమొదలు, తనజాతీయ సంతతియందు, విద్యావిజయములకై, ప్రాణములనైన దెగించి, ముందడుగువేసి పోరాడువారిని, తమకాలమునంతను దానిపరిశ్రమలోనె వినియోగించువారిని సిద్ధపరుపవలయును జాతియంతయు నిట్టికార్యము నేయవలంబించుట దుస్తరమైనను, నెవ్వరెవ్వరికిం దిచ్ఛగలదో, వారైనను, నీసౌధోపరిభాగము నధిష్ఠింపప్రయత్నించుట యుక్తము ఏవిధమున సేవకావృత్తి వర్తకమునకు దీటురాదో మఱియు నుద్యోగస్థులవలన, నింతవరకే దేశ మౌన్నత్యపదవి నందలేదో, యట్లే నిర్బంధశిక్షావిధానమునగూడ, స్వాతంత్ర్యశిక్షావడుపాయములు సిద్ధింపనేరవు. ఆత్మీయసంతోషము, వంశికసంతోషము, స్థానికసంతోషము అని సంతోషము ముత్త్రివిధము. నిర్బంధశిక్షవలన, మొదటిరెండును, జేకూరవచ్చునుగాని, జాతీయ, దేశీయాభ్యుదయములకు, మూలకారణమైన, జాతీయసంతోషము మాత్రమిందుగలుగనేరదు.

# ఆంధ్రసంఘస్థితి.

మ.రా.శ్రీ, కే. వి సుబ్బారావుగారిచే వ్రాయబడినది.

మనమాతృభూమియగు భరతఖండ మొకప్పుడు ప్రపంచంబునంగల నాగరికౌన్నత్యదేశంబులయందు ప్రథమగణ్యంబుగానుండెను. ఇప్పుడు మనముండుకాలముగూడ సంఘస్థితియందు మార్పుగలుగుచుండుటచేత మిక్కిలి ముఖ్యమైయున్నది. భరతఖండంబునజనించి, భరతఖండవాసులమై, మనమాతృభూమికి జరుగుచున్న మార్పులకు మనము కారణభూతుల మగుచున్నాము. అసామాన్యములగు మార్పులు దేశమందంతటను జరుగుచున్నది. ప్రతిసంఘమును క్రొత్తక్రొత్తనాగరికతను జెందుచున్నది. భావములును, ప్రతిఫలములును మార్పుజెందుచున్నవి. వర్ణాశ్రమాచారములును ధర్మములును మార్పుజెందుచున్నవి. అనాగరికములకు ప్రాతసంఘస్థితులకు క్రొత్తమార్పులు జనించుచున్నవి. అంతియేగాక మనము జీవించెడి రీతులయందుగూడ మార్పులు గలుగుచున్నవి. పాశ్చాత్య నాగరికతయనెడు క్రొత్తతేజము హిందూసంఘంబున ప్రబలి, కొన్నిచోట్ల రహస్యముగాను, మరికొన్నిచోట్ల రహస్యములేకుండగను, మార్పుజెందించుచు, సిద్ధాంతీకరించుచు, తుదకు ప్రతిఫలంబులను, సారాంశములను దేటపరచుచు, సంఘసంస్థితిని వృద్ధిజేయుచున్నది. ఆతేజము హిందూసంఘంబున పాతుకొని, దానియందు నాగరికతను, అజ్ఞానాంధకారమును, విచ్ఛిన్నంబుగావించి అట్టిసత్ఫలంబుల వ్రేళ్ళ చివరకు కొరకివేసినదనవచ్చును. దానంజేసి ప్రతివర్తకసంఘమును, ప్రతిమతసంఘమును, గొప్పయుల్లకల్లోలమును జెందుచున్నది. అట్టి రంగంబునం దేమియు సంబంధము లేనివానివలె నీవూరకుండగలవా? నీమాతృభూమికి రాబోవుకీడును పూర్తియైనమనస్సుతో నాలోచించినయెడల, నీహృదయంబు కొట్టుకొనుచుండదా? నీకు విచారముగలుగదా? ప్రాతసంఘములకును, క్రొత్తసంఘములకును, స్వదేశమునకును, పరదేశమునకును, జరుగుచున్న వివాదములయందు జోక్యముకలుగజేసికొనుట, నీదగు గొప్పపనులయం దొక్కటికదా! అల్లకల్లోలధ్వనులతో యుద్ధంబుజరుగుచుండ, అట్టి యుద్ధరంగంబునం దేమనుజుడు సుఖంబుగ నిద్రించును? హిమాలయము మొదలు కన్యాకుమారియగ్రమువరకు నొకపెద్ద యుద్ధరంగంబైయుండ, అందు ప్రాతసంఘస్థితులును, నవీన సంఘస్థితులును, అనెడు రెండు సైన్యంబు లతిఘోరంబుగ యుద్ధముచేయుచుండ, నీవూరక జూచియుండగలవా? ఆయుద్ధంబునందు నీయోపినంతవరకు సాయంబుచేయక తప్పునుగదా? నీశక్తియంతయు ధారవోసినపిదప, సారాంశంబేమియగు, నందలి ఫలాఫలంబులు నీవే యనుభవింతువుగాక? దుష్టసంఘంబులును, వాటిస్థితులును, అన్నివంకలను ప్రబలి, మినుమీదికి వచ్చుచుండ, అట్టివాని నెదుర్కొనుటకై తగినంత యుద్ధసామగ్రిని బలపరచుకొనుడు. లేనిచో గొప్పయనర్థము సంభవించును. యుద్ధరంగంబంతయు నెలుగెత్తి మనను గలియుటకై మొరలిడుచున్నది! సిద్ధముగానుండుడు! ఎవ్వరట్టి ప్రయత్నంబునగల ఫలంబునెరింగియు, మన్నుమోసిన సర్పంబుపగిది నొదిగికూర్చుండి, ఏమియు చేయలేనివానివలె నుండెనో యట్టివాండ్ర, తానుచెడిపోవుటయును, దుఃఖాంబుధి మునుంగుటయేగాక, ఆదుఃఖమును తనపుత్రపౌత్రపారంపర్యమును వెదజల్లి వానిని [illegible] జేసి, వారిచేత [illegible]. మనదేశము నెవ్వడు తనసంఘసంస్కరణంబున, అశ్రద్ధ వహించి, నవనాగరికమంత్రమునకు పాశ్చాత్యుల, సైఆచారములననుసరించి, వారింబోలి దుస్తులధరించి, వారింబోలి శిరస్సులనుంచి, వారింబోలిభుజించుటట్టి వాడించుకనాలోచించి, వారింబోలి సంఘసంస్కరణము చేసికొనవలయును. మరియునెట్టి సంఘసంస్కారుడు తనమాతృభూమి యవస్థ నెరింగి, తనసంఘాంతర్గత దురాచారంబుల బింకమ్మున విదిర్చి, అట్టివాటిని నిర్మూలముచేయునో, అట్టి పుత్రరత్నము, తనమాతృభూమిచే నాశీర్వాదింపబడి, తాను స్వేచ్ఛయును, సంతోషమును తప్పకపొందును.

నీమాతృభూమియొక్క భవిష్యత్తంతయు నీచేతనున్నది. మరియు నీవే, యామెకురాబోవు సుఖదుఃఖములకు కారణుండవు. ఆమెకర్మమనెడు పెట్టెయొక్క బీగము నీచేతనున్నది. మరియు దేవునియెదుట, నీవునీమాతృభూమియెడ జేసిన సుకృత దుష్కృతములకు సాక్ష్య మీయవలసివచ్చును. నీకండ్లతో నీమాతృభూమియొక్క, దేహదౌర్బల్యమును, మనోదౌర్బల్యమును జూచుము? ఆమెయొక్కరోదనములవిని, జాలినొందితివేని, త్వరలో నామెనహాయమునకు బరువెత్తుము!

చూడుడు! మీవంకజూచుకొనుడు!! ఆచారంబులనెడు త్రాళ్ళచేగట్టబడి, స్వేచ్ఛాభ్రష్టులై, మతంబనెడిమూర్ఖంబుచే బాలింపబడుచు, మీయొక్క స్వచ్ఛమైన బుద్ధులును, జ్ఞానమును, ఆచారంబనెడు బండరాతిక్రింద నణుగద్రొక్కబడినవి! మరియు మీగృహంబులవంక జూచుకొనుడు! అచ్చట, అవర్ణనీయంబులైన దురాచారంబులనెడు తెరలుప్రబలి, మీయొక్క భార్యాపుత్రికలును, సోదరీజనులును తమంబునంబడి బాహ్యప్రపంచంబన నేమియు దెలియక కొట్టుకొనుచున్నారు! గాన వారిని విడుదల జేయుడు! ఈ సంఘసంస్కరణంబనెడుత్రోవ ముండ్లతో నింపబడియున్నది. గాన నట్టిత్రోవనడచు నిచ్ఛజనించిన వారు ముందు ముండ్లకై సిద్ధముగనుండుడు.

ఇంతమన సంఘస్థితికి రోగములనుదెచ్చు కీటకంబులెవ్వియో యాలోచింతము.

హిందూసంఘమునకు నీస్థితినాపాదింపజేసిన దయ్యము „విగ్రహారాధన" యను నిర్వివాదాంశమైయున్నది. విగ్రహారాధన హిందూస్థానమున నొక శాపమువలె ప్రవేశించి, హిందూసంఘమును బూర్తిగ బాడుచేసెను. నీవు విద్యాపరిపూర్ణుండవై, ఇంకను విగ్రహారాధనమందు విశ్వాసముంచితివేని నీచదువుకు పరువుతక్కువగును. నీపితృప్రపితామహాదులనుండివచ్చుచున్న విగ్రహారాధన నేటితో పరిసమాప్తినొందింప నీకొకవేళ కష్టముగానుండును గాబోలు! అట్లయిన, నీపితృప్రపితామహాదులనుండి వారందరొక్కకరె, ఎద్దియోనొకదినంబున నూతిలోబడి బలవన్మరణంబునొందుదురు. పాపము? నీవు నేడట్లు నీపితృప్రపితామహులనుండి వచ్చుచున్న యాచారము నేలపోగొట్టవలెనని నీవుకూడ నూతిలోబడుదువు గాబోలు! కాదు కాదు! గాన నీవావిగ్రహారాధన మొగము జూడకుము. దాననది తనంతట క్షీణించిపోవును. నీయొక్క ఆత్మసంరక్షణార్థమై, నీయొక్కలక్షలకొలది సోదరుల యాత్మసంరక్షణార్థమై, ఆపెనుభూతంబును జంపివేయుము.

విగ్రహారాధనకు బిమ్మట దానికి ప్రాణస్నేహితుండై చిరకాల సహవాసియైన 'వర్ణము' (Caste) యనెడు దుష్టుడొకడున్నాడు. ఆవర్ణము హిందూసంఘమున నొక చెంపపెట్టుగానున్నది. ఆవర్ణ మైకమత్యమును లేకుండగజేసెను. అది మనభరతఖండముయొక్క సంతర్బహిర్భాగముల వర్తకవ్యాపారమును జెడగొట్టెను. అది సంఘముయొక్క దేహదౌర్బల్యమునకును, మనోదౌర్బల్యమునకు ముఖ్యకారణంబైయున్నది. అది సంఘముయొక్క స్వేచ్ఛను నిర్మూలముజేసెను. ఆవర్ణమనెడు దయ్యము, బాల్యవివాహములు మొదలగు దురాచారములకు సహాయమొనర్చెను. ఆవర్ణమే మన పవిత్రమైన మాతృభూమిని పాశ్చాత్యులచేత బెట్టినది.

వేదంబునం దెచ్చటనైనను వర్ణభేదంబును గురించి వ్రాయనేలేదు. వేదంబునందెచ్చటనైనను, సంఘమును, కలసిభుజించుటకుగాని, కలసి తిరుగుటకుగాని, అడ్డుపెట్టు నంశంబులు కానరావు. వేదంబునం దెచ్చటను వివిధ వర్ణంబుల యాంతర్వివాహముల నడ్డుపెట్టునంశంబులు గానరావు. హిందువులకు వేదమే ప్రమాణమనియెదరు. గాని వారుచేయుపనులన్నియు వేదాతిక్రమణంబులేయని నప్పుచున్నారు. ఆవర్ణంబొకరికంటె నొకరినెక్కువగాజేసి, అట్టివారికి సర్వాధికారమిచ్చినది. గాన వర్ణము దేవునియొక్క సర్వసమాదరణత్వమునకు ప్రతివచ్చినదిగాన నదినింద్యమైయున్నది. గాన, నట్టివర్ణంబునెదిరించి పనిజేయుడు. మనసంఘము వృద్ధిబొందగలదు.

మరియు మనవివాహకార్యంబులు దేశంబునకు గొప్ప ముప్పును దెచ్చుచున్నవి. ఈదురాచారములనెడి

బండ్ల పంక్తిని "బహుభార్యాత్వము" నేడు, ఆవిరియంత్ర మీఁదెక్కొనిపోవుచున్నది. ఆదురాచారము ఎనుబది సంవత్సరముల వయసువానికి, ఎనిమిదేండ్ల కూననిచ్చి వివాహము జేయించుచున్నది. అంతనట్టికూనలను అజ్ఞానుల ను బాలవితంతువులుగా నొనర్చుచున్నది. గాన దయామయులగు నోసోదరసోదరీమణులారా! పైనపేర్కొనబడిన దయ్యంబుల నాశనంబుగావించి, కుటుంబములన్నియు నైక్యంబు జేసికొనుడు. అంత గ్రామంబులును, నగరంబులును నైక్యంబునొందును. అంతయావన జంగాళమును యావనపంజాబును, యావన బొంబాయియును, యావన చెన్నపురియును నైక్యంబునొంది గలసి పనిచేయుగాక! అంత హిందూమాత సుఖంబుగ నుండుగాక!



# కృషి ప్రశంస.

మ.రా.శ్రీ, దువ్వూరి బాలకృష్ణమూర్తిగారిచే వ్రాయఁబడినది.



మనపూర్వులు హిమవత్పర్వతమున కుత్తరభాగమున మధ్య ఆసియాలోనున్న ఆక్సుసునదీ ప్రాంతముల నుండివచ్చి మొదట సింధునది పశ్చిమతీరమున నివసించు సరికే వారికి వ్యవసాయమం దనుభవము కలదని వేదములు వక్కాణించుచున్నవి. వారానదీ తీరమందు వసించు కాలములో వరదలు తీసిపోయిన తరువాత బురదగానుండు ఒండు మంటిమీఁదను కొన్నివి తననుజ్జులు చల్లుట వల్ల దుక్కి అక్కరలేకనే ధాన్యములు పండుచువచ్చినవి. అందువల్ల వారికి వ్యవసాయపు పనిముట్లతో నవసరము లేక పోయినది. కాలక్రమమున జనాభివృద్ధి అగుటవల్లనున్ను, తిరిగి మరికొందరు జన్మస్థానమునుండివచ్చి వారితో కలుసుటవల్లను చోటుచాలక, వారు సింధునదిదాటి హిందూదేశములో ప్రవేశించవలసి వచ్చినవి. ఆనదిని దాటిన తరువాతను పూర్వమువలె బాడిగానుండు యొండుమట్టిలో యెల్లప్పుడు విత్తనములు విత్తుటకు వీలు లేకపోవుటచేత నేలనుత్రవ్వి గుల్లపరచి విత్తనము వేయుట అవసరమైనవి. ఇట్టిస్థితిలో కొన్నాళ్లు చేతితో నేలనుగోకి విత్తనములను చల్లుతూవచ్చినారు. కొంతకాలము వాడిగల కర్ర గసికలతో నేలనుత్రవ్వుచు వచ్చిరి. ఈప్రకారము విస్తారము నేలత్రవ్వుటకు కష్టమౌటవల్లనున్ను, జనాభివృద్ధి అయినకొలది యీలాగున పండించు ధాన్యములు చాలక విరివిగా వ్యవసాయము చేయుటకు అవసరము కలుగుటవల్లనున్ను బుద్ధికుశలత వృద్ధిఅయి దున్నుటకు పశువుల నుపయోగించువిధము కనిపెట్టిరి. అప్పుడే నాగలిని యేర్పాటుచేసి పశువులనుకట్టి దున్నుటకారంభించినారు. ఆకాలమునందు యేర్పాటుచేయబడిన నాగలే యీరోజునకుకూడ యేవిధమైన మార్పులు లేకనే ఉపయోగించబడుచున్నది. కాని మన పూర్వులతోబాటు కొంతమంది పశ్చిమమార్గముగా యిరోపాఖండము లోనికి వెళ్ళినవారు యీనాగలికి బహుమార్పులుచేసి మంచిపని ముట్టుగా తయారుచేసినారు. కర్రనాగలి శీఘ్రకాలములో అరిగిపోవుటవల్ల పాశ్చాత్యులు నాగళ్ళను పూర్తిగా యినుముతోగాని ఉక్కుతోగాని తయారుచేయుచున్నారు. మనదేశములో మననాగలిన్ని దానితోబాటు మన వ్యవసాయమున్ను అభివృద్ధి కాకుండుటకు మన శాస్త్రములే కారణము.

శ్లో. రామాద్యాచయమేదినీం ధనపతేర్బీజం బలాల్లాంగలం
ప్రేతేశాన్మహిషం తవాస్తి వృషభః ఫాలం త్రిశూలం తథా
శక్తాహం తవచాన్నదాన కరణే గోరక్షణే షణ్ముఖః
ఖిన్నాహం హర భిక్షయా త్విత కృషింగౌరీవచః పాతుకః।

సప్తసముద్ర ముద్రితమైన భూమిని పరశురాములు బ్రాహ్మణులకు దానముచేయు సమయమందు కొంతభూమిని యాచించవలసిన దనిన్ని తనకు మిత్రుడైన కుబేరునివద్దనుండి విత్తనములు సంపాదించవలసిన దనిన్ని బలరాముని దగ్గిరనుండి నాగలినిన్ని యమధర్మరాజువద్దనుండి దున్నపోతునున్ను తెచ్చి తనవద్దనున్న ఆంబోతుతో జతచేసి త్రిశూలమును నాగేటికఱ్ఱుగా నుపయోగించి దున్నినయెడల తాను పొలములోనికి అన్నపుముంతలను మోయగలననిన్ని కుమారస్వామి పశువులను కాచుననిన్ని భిక్షాటనముచేసి జీవించుటవల్ల నలుగురిలోను తనకుచాలా చిన్నదనముగా నున్నదనిన్ని పార్వతీదేవి సాంబమూర్తితో చెప్పినట్టు చిత్రవర్ణనవల్లను వ్యవసాయ వృత్తియొక్క ప్రాముఖ్యత తేటబడుచున్నది.

"కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకం"

"కరువుమానుప పంట మిడతలుమానుప మంట"

మొదలైన అనేకవిధములైన ఆర్యోక్తులవల్ల ప్రాచీనమునుండిన్ని వ్యవసాయోత్కర్ష స్పష్టమగుచున్నది.

ప. అడిగినజీతంబివ్వని మిడిమేలపుదొరనుగొల్చి మిడుగుటకంటే
వడిగల యెద్దులగట్టుక మడిదున్నుక బ్రతుకవచ్చు సుమీ లోకమునందున్ సుమతీ.

సేవకావృత్తికన్న వ్యవసాయముచేసి జీవించడమే మంచిదని చెప్పబడియున్నది. కాని ఆచరణలో మాత్రమీనీతి విశేషముగా కనుపించదు. నాలుగుముక్కలు చదువుకున్నవారందరికి సేవకావృత్తియందే అభిరుచికాని వ్యవసాయము చేయుటకుతలంపే ఉండదు. ఇందుకుదాహరణములను మనశాస్త్రములనుండే కనుపరచవచ్చును. ఉత్తమజాతులు వ్యవసాయము చేయకూడదనిన్ని అందువల్ల పాపము సంభవించుననిన్ని పరాశరస్మృతి ఘోషించుచున్నది.

శ్లో. సంవత్సరేణ యత్పాపం మత్స్యఘాతీ సమాప్నుయాత్
అయోముఖే న కాష్ఠేన తదేకాహేన లాంగలీ.

పల్లెవాడు సంవత్సరమంతను చేపలను పట్టుటవల్ల సంపాదించు పాపమంతను యినుపకర్రు కోలవేసిన నాగలితో దున్నువాడు ఒకేదినమందు సంపాదించును.

శ్లో. పాశకో మత్స్యఘాతీచ వ్యాధశ్శాకునిక స్తథా
అదాతా కర్షకశ్చైవ సర్వేతే సమభాగినః.

పాములవాడు, పల్లెవాడు, వేటకాడు, యెరుకలవాడు, దానముచెయ్యనివాడు, వ్యవసాయము చేయువాడు సమానపాపులట.

బ్రహ్మ క్షత్రియులు నాగలిని ముట్టకూడదనిన్ని వైశ్యులు శూద్రులుమాత్రమే నేలను దున్నవచ్చుననిన్ని మనుస్మృతి చెప్పుచున్నది. కాని పరాశరస్మృతిలో బ్రాహ్మణులు ఒకపూట అనగా ఉదయమందుమాత్రము దున్ని మధ్యాహ్నము జాతీయకృత్యములను చేసుకొనవచ్చునని చెప్పబడియున్నది.

శ్లో. స్థిరాంగం నీరుజం తృప్తం సునర్దం షండవర్జితం
వాహయేద్దివసస్యార్థం పశ్చాత్స్నానం సమాచరేత్.
జప్యం దేవార్చనం హోమం స్వాధ్యాయం చైవమభ్యసేత్
ఏకద్విత్రిచతుర్విప్రాన్ భోజయేత్స్నాతకాన్ ద్విజః.

బ్రాహ్మణుడు బలిష్ఠమైన యెడ్లనుకట్టి ఒకపూట దున్నిన తరువాతను స్నానముచేసి నిత్యకృత్యములను అనగా జపము, దేవతార్చన, హోమము, స్వాధ్యాయము, బ్రాహ్మణ భోజనములను చేయవలయును. శ్రీమహాభాగవతమును తెనిగించిన బమ్మెరపోతనామాత్యుడు వ్యవసాయము చేయుచుండెనని ప్రఖ్యాతికలిగే ఉన్నది. వ్యవసాయము చేయుటవల్ల ఎట్లుపాపముకలుగునో అందుకువిముక్తి యెట్లో యీక్రింద చెప్పబడియున్నది.

శ్లో. వృక్షాన్ ఛిత్వా మహీం భిత్వా హత్వాతు కృమికీటకాన్
కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే.

చెట్లను నరుకుటవల్లను, నేలను దున్నుటవల్లను, పురుగులు చీమలు మొదలైన వాటిని చంపుటవల్లను కలుగుపాపములన్నియు కళ్ళములో కాపువాడు దానముచేయుటవల్ల పోవును.

# మామిడిచెట్లు, వాటిని పెంచువిధము.

మ.రా.శ్రీ, ఉప్పల వెంకటసుబ్బారావుగారిచే వ్రాయబడినది.

మనహిందూదేశములో మామిడిచెట్టు చూడనివాడుగాని మామిడిపండుపేరు విననివారుగాని యుండరు. ఇచ్చట స్వతహాపుట్టిన వానిలోనేమి, ఇతరదేశములనుండి యిచటకు తెచ్చిన వానిలోనేమి జగత్ప్రఖ్యాతి నొందిన రకరకములైన మామిడిచెట్లు మనదేశమునందుకలవు. మనదేశమందున్న మామిడిజాతులు సుమారు 300 వందలదాక నున్నవి. అందు 150 జాతులకు పైగా ప్రసిద్ధి నిజెందిన రకములుగలవు. ఆరకములలో వాటిని కొన్ని యీక్రింద బొందుపరచెదను. 1. బంగినపల్లి 2. గుండ్రిబంగినపల్లి 3. సువర్ణరేఖ 4. పెద్దసువర్ణరేఖ 5. జామిమామిడి 6. సారమామిడి 7. జంపులమామిడి 8. నల్లమామిడి 9. హయిదరాబాదునల్లమామిడి 10. వేరుపనస 11. తేనెపనస 12. యఱ్ఱగోవా 13. నల్లగోవా 14. మల్గోవా 15. బంగారుతీగె మామిడి 16. చుక్కరసం 17. పెద్దరసం 18. గుండ్రిరసం 19. నల్లరసం 20. దిల్పసందు 21. ఆమీనుపసందు 22. గుండ్రపసందు 23. అమానుగోవా 24. నవాబుమామిడి 25. ఉవ్వా 26. అనలుఉవ్వా 27. యేనుగుశెలకాయల మామిడి 28. నన్నాకులమామిడి 29. నగరం మయిలాపురి 30. భూలోకసుందరి 31. చెన్నపట్నం పెద్దాకులు 32. నీలిమామిడి 33. రోమాన్సు 34. బెంగుళూరా 35. ఖాదర్పసందు 36. గవరమ్రాడాసు 37. కోలంగోవా 38. చిన్నరసం 39. యేనుగుదత్తం 40. కలెక్టరుమామిడి 41. నవనీతం 42. జున్నుగున్న 43. కవున్సిల్పసందు 44. పెంటగన్నేరు 45. రాజుగన్నేరు 46. యాపెంటు 47. హనుమంతమామిడి 48. అరండల్ 49. మైలాపురి 50. రసపురి 51. గుత్తులయిరసాలా 52. పెద్దమామిడి 53. బొబ్బిలిమామిడి 54. కస్తూరి 55. సెట్టివారి మామిడి 56. కొత్తపల్లి కొబ్బరమామిడి 57. ఆర్యపటం యిరసాలా 58. తెల్లగులాబి 59. ఆకిరెపల్లి తెల్లకాయలమామిడి 60. తియ్యమామిడి 61. తగరంపూడి తియ్యమామిడి 62. బందరు బండలు 63. గుల్కందు 64. లాడ్వ 65. ఫ్యాండ్రాసు 66. పండెం మామిడి 67. యావివారి పెద్దమామిడి 68. పంచదారగున్న 69. రాజుమాను 70. చిలకలమాను 71. నల్లకాయల ఫ్యాండ్రిసు 72. గొల్లపల్లి తియ్యమామిడి 73. కద్దేమాంక్ 74. జెర్రిపోతులమామిడి 75. పీతరపసందు 76. పూరకాయల మామిడి 77. ఆల్ఫాన్సో 78. లాంగ్డా 79. నల్డా 80. హైదరీ మొదలగునవి. సకలదేశములందును ఫలవృక్షములలో ప్రసిద్ధిజెందినవి మామిడిచెట్లే అయియున్నవి. ఏవృక్షమైనను ఒక్కొక్క స్వభావముగల భూమియందు ఒక్కొక్కవిశేషమును పొందుచుండును. ఒకేచెట్టుయొక్క విత్తనములను తీసుకొనివెళ్ళి ఒకటిరాతినేలలోను మరియొకటి రేగటిభూమియందును వేరొకటి యిసుకనేలయందును పాతిపెట్టినయెడల రుచియందును ఆకారమునందును, వర్ణమునందును, గుణమునందును, వానివాని ఫలములమాత్రమేగాక యెదుగుటలోను రోగములచే పీడింపబడుటలోను ఎరువుమొదలగు ఉపపత్తులను కోరుటలోను వృక్షములకుకూడా అపరిమితమైన భేదముకలదై వేరువేరు విత్తనములనుండి పుట్టినట్లు కనుపించును. అనగా ఆమార్పుచేయుశక్తి ఆయాభూములయొక్క స్వభావమునందుండును. ఎంతమధురమైన పంచదారలోనైనా ఎంతతీయని తేనెలోనైనను ఉప్పు, పులుసు, కారము మొదలగు దానినేదయినను కలిపినయెడల మొట్టమొదటి మాధుర్యము నిలుచునా! నిలువకపోవుటయేగాక ఉప్పుకలసినది పంచదారకలసినదానితోను పంచదారకలసినది కారముకలసినదానితోను రుచియందు మాత్రమేగాక రంగులోకూడ భేదము కలిగియుండునని అందరును యెఱుగుదురు. అట్లే సురేకారమును, ఉప్పును, ఎక్కువగల భూమియందు ఫలించుపండ్లకన్న అవిలేని భూమియందు ఫలించుపండ్లు ఎక్కువ మాధుర్యముగా

శ్లో॥ రాజ్ఞేదత్వాతు షడ్భాగం దేవానాం చైకవింశకం।
త్రింశద్భాగం బ్రాహ్మణానాం కృషింకుర్వన్నదోషభాక్.

పండినపంటలో ఆఱోవంతు రాజుకున్ను ఇరువై ఒకటోవంతు దేవస్థానములకున్ను ముప్పదియవవంతు బ్రాహ్మణులకున్ను ఇచ్చినయెడల కాపువానికి వ్యవసాయము చేయుటవల్ల పాపములేదట. ఈరీతి దానములవల్లను రాజాశ్రయములలో నుద్యోగములను సంపాదించిన్ని ధర్మస్థానములలో భోజనాదులుచేసిన్ని వ్యవసాయము చేసినయెడల పాపము లభించుననిన్ని చదువుకొన్న వారందరు వ్యవసాయము నంటకనే దూరదూరముగానుండుచువచ్చినారు. క్షత్రియులుకూడ పైరీతినే సేద్యమును విడిచిపెట్టిరి. మనుస్మృతి రీత్యానుచితవృత్తి అయినను వైశ్యులు కూడ వ్యవసాయముచేయుట గౌరవముకాదని "కృషిర్న్యూనప్రవృత్త్యై" అనున్యాయరీత్యా వదలివేసి వాణిజ్యమునే అవలంబించినారు. ఈరీతిగా క్రమక్రమేణ వ్యవసాయము ఉత్తమజాతులనుండి నాల్గవజాతివారికిన్ని పంచమజాతివారికిన్ని అధీనమైనది. ఇందువల్ల "జనశ్యం పితురాచారం" అను న్యాయముననుసరించి నేమార్పులున్ను లేక ఒకేరీతి హిందూదేశములో వ్యవసాయముజరుగుచున్నది. "బాపనసేద్యం బసుగులనష్టం కాపుల చదువు కాసులనష్టం" అని చెప్పియుండుటవల్ల బ్రాహ్మణులకు వ్యవసాయము చేతకాదనిన్ని కాపువానికి చదువురాదనిన్ని తెలియుచున్నది. ఈవిధముగానే అనేక సామెతలనుబట్టి ప్రాచీనమునుండిన్ని మనదేశములోని వ్యవసాయము చదువు లేని కాపులచేతిలో నుండుటవల్ల వృద్ధిలోనికిరాలేదు. పశ్చిమదేశములలోనో బాగాచదువుకొనినవారు శాస్త్రప్రకారములో కడతేరినవారు వ్యవసాయముచేసి యెన్నో అభివృద్ధులు చేసినారు. అన్నిటికన్నను ముఖ్యహేతువ రయితుల బీదస్థితి.

"సంసారిబీద భూమిబీద"

"వన్ను గొడ్లు ఉన్నవాడిదే వ్యవసాయము"

"చేతిలోలేనిది చేలోకి ఏలాగువస్తుంది"

అనిచెప్పినట్లు పెట్టుబడిపెట్టి వ్యవసాయము చేయలేని కాపులచేతిలో సేద్యము విడిచిపెట్టుటవల్లను విశేషముగా కాపువాళ్లు విద్యావిహీనులగుటవల్లను మనదేశపు వ్యవసాయము చాల హీనస్థితిలో నుండుటకు కారణమైనది. దీనికితోడు విడవకుండా కరువులు పట్టుకుని ఉన్న మట్టుకైనా తినకుండా కాపువానిని పీడించుచున్నవి.

"పాలు అంబారంబు పరగభూ... పాలు। దుక్కిటి పశువులు ధూళిపాలు" అనుసామెత... నిజమవుచున్నది.

ఇంతేకాక "వ్యవసాయ... వెర్రివానిచేతి రాయి సమానము"నిన్ని తెలివితేటలేమిన్ని అక్కరలేకనే అదును వర్షముకురిస్తే ప్రతివాడు సేద్యము చేయగలడనిన్ని ఒకపిచ్చి దుర్భ్రమ మనలను బాధించుచున్నది. యూరోపాఖండములోను, అమెరికాలోను జరుగుచుండిన అభివృద్ధులవలన మనదేశములోకూడ వ్యవసాయము బహువిశేషముగా వృద్ధిని పొందించవచ్చునని దృఢముగా చెప్పనగును. మనదేశములో సేద్యార్హమైన భూమి చాలాభాగమిదివరకే సాగుబడిలోనున్నది. కాని జనాభివృద్ధిమాత్ర మెక్కువ యగుచున్నది. ఇందుకు తగినట్లుగా క్రొత్తభూమిదొరుకుట కష్టసాధ్యము. మంచిభూములు యావత్తు నిదివరకే సాగుబడిలోనుండుటవల్ల మనకిప్పుడధికముగా వ్యవసాయమునకు గానలసిన భూములు హీనతరమైనవిగను మామూలుగా వాడబడు కృషిపద్ధతులీభూములయందు వినియోగించవుగాన యుపాయాంతరములను గనుగొని వ్యవసాయపు పనులయందత్యంతనైపుణ్యముచేతను మంచి యెరువులనుచేర్చి భూములను బలపరచి మునుపటికంటె రెట్టింపు ఫలించునట్లుగా చేయుట విద్యావంతులకు ప్రధానకృత్యమైయున్నది. ఈలాగున పశ్చిమదేశములయందువలె జేసినయెడల మనదేశపు వ్యవసాయముకూడ శీఘ్రకాలములో వృద్ధిలోనికి వచ్చుట కెంతమాత్రము సందియము లేదు.

---

నుండుటకు సందేహమేమియులేదు. మంచినీళ్లు పడుచోట్ల పెరుగునట్లు ఉప్పునీళ్ళుపడు స్థలములయందు యేవృక్షములు పెరగవని మనయందరికి తెలిసినయంశమేను. ఉప్పునీరుపడుచోట ఏచెట్టయినను వేసినయెడల దానిని పెంచుటకు ఎక్కడేనుండియో కష్టపడి మంచినీరుపోయుదురుకాని ఆభూమిలోనే మంచినీరుపడునట్లు చేయుటయెట్లు అను విషయమునుగూర్చి రవంతయు విచారింపరు. అందుకే వ్యవసాయమునకుకూడను మంచివిద్య ముఖ్యసాధనమనియు వ్యవసాయముకూడ పెద్దశాస్త్రమనియు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

మరియొక్క స్థలమునందుండు మంచిమంచి ఫలములను తమపొలములలో మార్పులేకుండ పండించుటకు మనవారిప్పుడు అవలంబించుచున్న పద్ధతి అంట్లుకట్టుట. మనవారు యిదివరకు వాడుకచేయుచున్న పద్ధతి కొమ్మలనుండి మాత్రమే అంటుకట్టుట. యీఅంటుకట్టుటను ఇంగ్లీషులో (గ్రాఫ్టింగు) అని అందురు. యిదిగాక చిగుళ్ళతో అంటుకట్టుపద్ధతికూడ మరియొకటి కలదు. దానినే యింగ్లీషుభాషలో (బడ్డింగు) యని అందురు. అంట్లు కట్టుటనుగూర్చి యీదిగువ నుదహరించుచున్నాడను. యిపుడు మనదేశమునందు వాడుకలోనున్న పద్ధతినిగూర్చి వ్రాయుదును. మామిడిటెంకలనుదెచ్చి యొకస్థలమునందు నారుగాపోసి అవి మొలచినమొక్కలు సుమారు 1½అడుగు పొడుగుగాపెరిగిన తరువాతను ఆమొక్కలను గోలెములలోనికెత్తి యొకస్థలమునందు కుదుటవేయవలెను. ఆలాగు కుదుటవేసిన పదిహేనుదినములు పోయినపిమ్మట అంట్లు కట్టవలసిన చెట్లవద్దకు తీసుకొనివెళ్ళివుంచి చెట్టుకొమ్మను మొక్కనుగూడ ఒకప్రక్కను వాడిగల చాకుతో పైపొర ఊడునట్లు ఒకఅంగుళము పొడుగున కొంచెముగీచి ఆగీచినభాగములు రెండును ఒకదానినొకటి అంటియుండునట్లుచేర్చి ఆపైన మైనపుగుడ్డచుట్టి దానిపైని సన్ననిపురిదారముతో దగ్గరదగ్గరగా చుట్టి ఆఅంగుళము పొడుగునను బిగించికట్టవలెను. యీదారముకట్టినకట్టు సరిగా బిగియునియెడల అంటు సరిగా కలియక చెడిపోవును. ఆలాగుకట్టినది క్రమక్రమముగా చెట్టుకొమ్మయున్ను మొక్కయు ఒకద్దానితోనొకటి అంటుకొనుటకారంభించి సుమారు 4మాసము లగునప్పటికి పూర్తిగా అంటుకొనును. అప్పుడు క్రమక్రమముగా మొక్కయొక్క తలయున్ను చెట్టుకొమ్మమొదలును అనగా మొక్కఅంటుకట్టిన స్థలమునకుపైనను కొమ్మ ఆస్థలమునకు క్రిందను కోసివేయుటకు ప్రారంభించుదురు. అట్లు పూర్తిగా కోయునప్పటికి మొక్కమొదలును కొమ్మతలయునుగలిగి అంటుప్రత్యేకమును వేరుగా గన్పట్టును. యీలాగు తయారుకాబడ్డ అంట్లును యొకస్థలమందు తిరిగి కుదటవేసి 10, 15 దినములుంచి ఆవెనుకతీసి, వేయవలసిన స్థలము వద్దకె తీసుకువెళ్లి అచటను యీ అంటుయొక్క మొదటినుండు మట్టిదిమ్మను కదలకుండా పైగోలెము పగులగొట్టి ఆమట్టుదిమ్మతో భూమిలో పాతవలెను. యీమట్టిదిమ్మ విడిపోయిన యడల అంటుకు ప్రాణభయము కలుగును. గాన అంట్లు పాతునపుడు బహుజాగరూకతతో పాతవలెను. ఇక రెండవ మోస్తరు అంట్లు కట్టుటను గూర్చి వ్రాయుదును. దీనిని పైనిచెప్పిన అంట్లు కట్టుటకు పోసినట్లే నారుపోసి గోలెములకుయెత్తి పై ప్రకారముగానే చేసి తరువాత అంటు కట్టవలసిన చెట్టువద్దకు తీసుకువెళ్ళి ఆమొక్కను వకప్రక్కను ఒక అంగుళము పొడుగుగా సన్నని చాకుతో రెండవప్రక్కకు రాకుండునట్లును మూడువంతులు తెగునట్లును చీల్చవలెను. చెట్టునందు, నవనవలాడుచున్న చిగురుకొమ్మను చూచి ఒక అంగుళము పొడుగు వుండునట్లు ఆచిగురునకు క్రింద నఱికి ఆనరికినచోట గోరుగిల మొనవలె ఏటవాలుగా అనగా ఆచిన్న చిగురుకొమ్మ ఒకవైపు అంగుళము పొడుగునను రెండవవయిపు అరఅంగుళము పొడుగును ఉండునట్లుగా చాకుతో నేర్పుగా కోయవలెను. ఆ పిమ్మట ఆచిగురు కొమ్మను ఆ కోసిన అంచు మొక్కయొక్క చీల్చిన సందులోనికి పోవునట్లు అతికి వెంటనే మైనపు గుడ్డచుట్టి దారముతో బిగించి కట్టవలెను. ఈ పని చేయుటయంతయు మిక్కిలి చురుకుగల వారు తీవ్రములయిన సాధనములతో ఒక నిమిషములో ముగించవలెను. అనగా మొక్కకాని చిగురుకొమ్మగానికోసినతర్వా



H. H. Maharaja of Hill Tippera హిల్‌టిప్పర మహారాజు.



Raja of Kapurthala. కపూరతల రాజు.

Bundlekhand Maharaja.



బుందేలఖండు మహారాజు.



Maharaja of Sikkim. సిక్కిము మహారాజు



Nawab of Rampur. రాంపూరు నవాబు.



Maharajah of Panna. పన్నా మహారాజు.

Raja of Anigundi.



అనిగుండీ రాజా.

Zamiudar of Gurza.



గురజ జమీందారు.



Alla Uddin's Gatawayf at Delhi.

అలాఉద్దీను కోటద్వారము, ఢిల్లి.



Cashmir Gate, Delhi.

కాశ్మీరద్వారము, ఢిల్లికోట.

Juma Masjid, Eastern Side, Delhi.



జూమా మసీదు, తూర్పుదిశ, ఢిల్లీ.

Juma Masjid, Southern Side, Delhi.



జూమా మసీదు, దక్షిణదిశ, ఢిల్లీ.



Old Fort, Delhi. పురాణదుర్గము, ఢిల్లి.



Hindu Mantap, Delhi. హిందూమంటపము, ఢిల్లి.



Iron Pillar, Delhi. లోహ స్తంభము, ఢిల్లి.



Asoka Pillar, Delhi. అశోక స్తంభము, ఢిల్లి.



Kutub Minar, Delhi. కుతుబు మినారు, ఢిల్లీ.



Mausoleum of Sufter Jung, Delhi. సఫ్దరు జంగ్, ఢిల్లీ.



Mausoleum of Humayun, Delhi.

హుమాయూను గోరి, ఢిల్లీ.



Tomb of Altumash, Delhi.

అలతుమష్గోరి, ఢిల్లీ.

త నీరు కమ్మగూడదు. అతుకు నప్పుడు చిగురుకొమ్మ అంచు మణగ గూడదు. దీనినే ఇంగ్లీషులో (బడ్డింగు) అని అందురు. మనవారు దీనిని చిగురంటు అని చెప్పవచ్చును. ఇవి కట్టుటయందు నైపుణ్యత వచ్చిన తరువాత దినమున కెన్ని యంట్లయినను కట్టవచ్చును.

పైని వివరించిన రెండుజాతులు అంట్లుకూడా యిసుక భూములయందు 15 గజముల దూరమునకు ఒకమొక్క చొప్పునను తదితర గిట్టభూములయందు 10 గజముల దూరమునను పాతవలెను. ఇసుక భూములయందు చెట్లు పెద్దదిగా పెరుగుట చేతను తదితర భూములకన్న యెక్కువ దూరమున పాతుటకు కారణము. ఈ మామిడిచెట్లు పెరిగిన తరువాతను కూడ చెట్టును చెట్టు తగులకుండా యుండవలెను. సమీపముగా పాతినయెడల ఒక చెట్టు కొమ్మలు వేరొక చెట్టు కొమ్మలు మీదుగానుండుటచేతను వాటికి తగిన గాలి యెండ వగైరాలు తగలక పోవుటచేత కాపు కాయక యుండును. విశాలముగా యున్న యెడల గాలి యెండ తగులుచెట్లు అనుకూలముగా కాయును. ఈ యంట్లువేసిన తరువాతను ప్రతిదినమును ఉదయ సాయంత్రములయందు దినమునకు రెండు పూటలును నీరొక సంవత్సరము వరకు పోయుచుండవలెను. అప్పటినుండి దినమున కొకపూట నీరుపోసిన చాలును. యీప్రకారముగా మూడు సంవత్సరముల వరకు నీరు పోయుచుండవలెను. అంతటనుండి నీరుపోయకపోయినను యిబ్బంది యుండదు. మొక్కలకు తరుచు గొప్పుత్రవ్వుచూ యుండవలెను. సంవత్సరమునకు రెండుసారులు వెంపలిని వర్షకాలములందు మొక్కల మొదట వేసి కప్పవలెను. యీవెంపలి యెండకాలములో నెంతమాత్రము వేయకూడదు. అట్లు వేసినచో వేడిమి లావు అయి మొక్కలు క్షీణదశను జెందును. చిన్న అంట్లుగా యుండునప్పుడు మొక్కలు మొదటచెద పట్టుచూ యుండును. గాన తరుచు మొక్కలను పరీక్షించుతూ చెదలు దులుపుతూ యుండవలెను. అటుల దులపనిచో మొక్కకు కొమ్మకు కలిపి కట్టిన జాయంటు స్థలమున నుండు కండను తినివేసిన యెడల ఆ రెండు విడి అంటు నాశనమునకు కారణమగును. మొక్కలకు చీడ అనెడు పురుగు ఆకులయందు ప్రవేశించి ఆకులను నాశనము చేయుచుండును. అట్టి తరుణములయందు ప్రాతఃకాలమున ఆకులపైని పడుమంచు ఆరకుండుగాన కుమ్మర బుగ్గిని చెట్ల ఆకులపైని జల్లవలెను. అట్లు చల్లగా నిదివర కుండుపురుగు నాశనమై అంతటినుండి పురుగు బట్టకుండును. యీప్రకారముగా అతి జాగరూకతతో అంట్లుపాతిన మూడు సంవత్సరములవరకు కనిపెట్టి చూచిన యెడల నంతటినుండి వృద్ధిని జెంది అనుకూలమైన చెట్లు అయి ప్రతివత్సరంబును బాగుగా కాయుచుండును.

# మానవజన్మ ఫలము.

మ. రా. రా. శ్రీ, శ॥ వేంకటరంగశాస్త్రి గారిచే వ్రాయఁబడినది

సర్వేశ్వరుఁడు ప్రపంచమునందు నానావిధ ప్రాణులను సృజించి యింద్రియబలమును విశేషించి మనోబుద్ధిబలమును గల్పించి మనుష్యులను సృజించెను. ప్రాణిజాలములో మనుష్యుల కధికముగా నట్టిశక్తిని గల్పించిన జగదీశ్వరుని యుద్దేశము మనుష్యులు ప్రపంచమున కధికమయిన ప్రయోజనమును గలిగింపవలయు ననుటయే యని మన మూహింపవలయు. కానిచో నఖిలప్రాణులకును దమకుఁ దమకుఁ గావలసిన నిద్రాహార గ్రామ్యసుఖముల మీఁది యాసక్తిమాత్రమే మనుష్యులకు నుండుట సర్వేశ్వరుని యుద్దేశమై యుండవలయును. తావన్మాత్రమునకు మనోబుద్ధ్యాది బలమును గల్పించుట యనావశ్యకము గదా! కావున నంతయు నాలోచింపఁగా మనుష్యునకు వివేకము ప్రధాన మని నిశ్చయింపఁదగును. వివేక మనగాఁ బరిశీలనము. యుక్తాయుక్తములను గార్యాకార్యములను బరిశీలించి యేర్పఱచి యయుక్తముల నకార్యములను బరిహరించి యుక్తములను గార్యములను గ్రహించి యనుష్ఠించుట మనుష్యునకు విధియై యుండెడు. లోకమునకు ద్రోహమును భయమును గలిగింపక మేలుగావించు పనులు దన కించుక కష్టములు గలిగించునవి యయ్యును యుక్తము లనఁబడును. వీనికి విరుద్ధము లయుక్తము లనఁబడును. అట్టి యుక్తధర్మమును విమర్శించి చేయఁబడునవి కార్యము లనఁబడును. వీనికి వ్యతిరిక్తము లకార్యము లనఁబడును. యుక్తధర్మానుష్ఠానమునకు సత్యము, శౌచము, శాంతి, జ్ఞానము, దయ, ధైర్య, ముత్సాహము, ధర్మనిష్ఠ, యార్జవము, సమత్వము, సంతోషము, సాధుసంగ, మాస్తికత్వము మున్నగు గుణము లావశ్యకములు. సర్వకాలముల యందును మాఱకుండునది సత్యము. సర్వధర్మములలో నిది ప్రధానము. ,,సత్యాన్నాస్తి పరోధర్మః'' యనుట విందుము కదా "సత్యంవద" యని యుపనిషత్తులలోనాచార్యుఁడు శిష్యుని జదివించి యతనికి హితోపదేశము జేయు సందర్భమున నిరూపింపఁ బడినది. అశ్వమేధసహస్ర మొక్క వైపునను సత్యము నొక్కదాని నొక్క వైపున నుంచి తూఁచఁగా సత్యమువలననే భారము నిలిచెనని మహాభారతములోని యీక్రింది పద్యమువలన స్పష్టమయ్యెడు.

క॥ వెలయంగ నశ్వమేధం । బులు వేయును నొక్కసత్యమును నిరుగ
గడలం । దుల నిడి తూఁపఁగ సత్యము । వలననములు సూపు గౌ
రవంబున పేర్మిక ॥

మఱియు సత్యమఖిల ధర్మములకంటె నుత్తమమని యీక్రింది మహాభారత పద్యము సిద్ధాంతీకరించెడు.

తే॥ గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియగావు ।
ఎఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మనులు ॥

సత్యనిష్ఠవలననే హరిశ్చంద్రాదులు సద్గతి సాధించి రనుట యెల్లవారికిని దెలిసిన విషయము. సామాన్యముగా సత్యము సులభమని యందఱకును దోఁపవచ్చును గాని యనుష్ఠించుట దుష్కరము. ఇట్టి సత్యమును భూతద్రోహ కారణ మగునేని యపుడు గ్రాహ్యముకాదు. సత్యము వలన నితరులకుఁగాని దనకుఁగాని ప్రాణహాని మొదలగు కీడులు కలిగెనేని యప్పు డసత్యమైనను గ్రాహ్యంబు. శౌచమనఁగా శుద్ధి. ఇది వాక్ఛౌచము, క్రియాశౌచము; మనశ్శౌచము ననఁగ త్రివిధము. పరుషము లయోగ్యము లసంబద్ధము లనృతప్రాయము లు నింద్యములు నగుపలుకులు పలుకకుండుట వాక్ఛౌచము. అన్యాయములు భూతద్రోహకరములు నగుపనులు విడిచి న్యాయానుసారమున సర్వభూతములకు నాత్మకును సుఖము కలుగు విధమునఁ గార్యము లొనర్చుట క్రియాశౌచము. స్నానక్షాళనాదులు క్రియాశౌచ మని గణించుటయుఁ గలదు. అద్రోహచింత, పరుల కుపకారము చేయు

నిష్ఠయు ధర్మేతరములకుఁ దొలఁగఁ బూనికియు మనశ్శౌచము. ఇందు మూఁడవది యత్యుత్తమము. ఇతరులు దన్నుఁ దన్నవచ్చిన నోర్చియుండుట శాంతి. ఇట్టి యోర్పు గలిగినచో నితరులపైఁ గ్రోధము దనంతన నిలిచిపోవును. అరిషడ్వర్గములో రెండవదియైన క్రోధమునకిది మంచిమందు. కావుననే "శ్లో॥ శాంతిఖడ్గః కరే యస్య క్రోధః కిం తం కరిష్యతి॥" అట్టి శాంతినిఁ బూనక క్రోధమునకు వశ్యుఁడయ్యెనా మానవుఁ డేయకృత్యమైనం జేయును. కావుననే

శ్లో॥ క్రుద్ధః పాపం న కుర్యాత్కః క్రుద్ధో హన్యాద్గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా నర సాధూనధిక్షిపేత్ ।
వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్
నాకార్య మస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్ ॥

అని రామాయణమునందుఁ జెప్పఁబడినది. ఆత్మహత్యాదులకుఁ గారణమైన క్రోధమును నిగ్రహించుటయే శాంతి తెలివి జ్ఞానము. ఇది యనేక జన్మవాసనావశమునను విద్యవలనను విద్వత్సహవాసమునను ప్రపంచానుభవమునను గలుగును. ఇదియే మనుష్యులకు నితర ప్రాణులకును భేదమును స్పష్టముగాఁ జూపించు గుణము. పూర్వజన్మవాసనా వశమునఁ దనంతన కొంత యలవడినచో విద్యవలనను విద్వత్సహవాసము వలనను దానికభివృద్ధిఁ గావించుకొని గ్రంథములందు నేర్చుకొన్నదానికంటె వేయింత లెక్కువగా లోకానుభవమువలన జ్ఞానమునకు వృద్ధిఁ గావించుకొనవలయును. అట్టి జ్ఞానమే మఱపు నొందక కలకాలము నిలిచి లోకోపకారము మొదలగు నితర గుణములకు సహకారి యగును. ఇట్టి జ్ఞానము నార్జించుట మనుష్యులలోఁ బురుషులకెట్లట్టులే స్త్రీలకు నావశ్యకము. అట్లు లేనిచో స్త్రీలమానవ జన్మమున కేయుపయోగము గలుగదు. కలకాలము పురుషులకుఁ బరిచర్యాదులనే చేయుచు దాసవృత్తిఁ బూని యస్వతంత్రలై స్త్రీలు వర్తింప వలయు నని తలఁచువారును లెస్సగఁ బర్యాలోచించినచో స్త్రీలకు విద్యాభ్యాస మావశ్యకమనియు విద్యలేక కేవల మూఢత్వమున వర్తించు స్త్రీలు సంసార కార్యములందు సైతము వారికిఁ జేయవలసిన సహాయము చేయఁజాలరి కారణమున గృహ వ్యాపారములందు వారెన్నిపాట్లు పడుటయు నాత్మానుభవమున నిశ్చయింపఁ గలరు. మన భారతవర్షము విద్య మొదలగు గుణములచేతనే లోకోత్తర ప్రశస్తిఁ గన్న పూర్వకాలమందు విద్యావతులైన నారీమణులచే నన్నెకెక్కిన దని పురాణేతిహాసములను బరిశీలించినవారికి విశదమే కదా. లౌకిక విద్యలయందే కాక పరమార్థ సాధకమైన వేదాంత విద్యయందును స్త్రీలు సామర్థ్యము సంపాదించి యుండిరని జనక సులభాసంవాదము నారద పంచచూడా సంవాదము మున్నగు మహాభారత కథలవలన స్పష్టపడియెడు. ఇంతేల ? వేదాంత విద్యకుఁ బ్రధాన ప్రమాణముగా శ్రీశంకరాచార్యులు మొదలగు మహాచార్యు లంగీకరించిన బృహదారణ్యకోపనిషత్తుఁ బరిశీలించినచో నయ్యుపనిషత్తు యాజ్ఞవల్క్యముని తనభార్యకు బోధించిన యధ్యాత్మ విద్యయే యనుట విద్వాంసులకుఁ దెల్లము. అట్టి మహావిద్య సాధింపవలయునన్న స్త్రీ లెంతటి విద్యావతులై యుండవలయునో యిందుఁ బ్రత్యేకముగా నెత్తిచూప నక్కఱలేదుగదా! అట్టి స్త్రీవిద్య మధ్యకాలమం దుత్పన్నమై యిప్పుడు మనదేశమునకు మంచికలుగు నిమిత్తము కాఁబోలుఁ గ్రమ్మఱఁ దల సూపినది. క్రమక్రమముగా నుత్తరోత్తరాభివృద్ధి నొందఁ గల దని యూహింప నవకాశము గలిగెడు. ఆంగ్లేయులు స్త్రీపురుషు లందఱును విద్యను గడించుటవలనం గదా వారి బిడ్డలు తల్లిదండ్రుల వివేకవంతమైన రక్తముచే నుత్పన్నులై యత్యంత మేధాశాలులై యత్యద్భుతములైన విద్యుచ్ఛక్త్యాది కార్యములను బుద్ధితో నూహించి సృజించి లోకోపకారముఁ జేయఁజాలిరి. మన దేశమునందు స్త్రీ పురుషులలో విద్య కాలక్రమమున నశించుటకు మంచి పరిపాలనము మధ్యకాలమందు లేక పోవుట మొదటి కారణము. ముఖ్యముగా మధ్యకాల పరిపాలనమునందు స్త్రీల పాతివ్రత్యరక్షణమే ప్రధాన కార్యమైనట్లు తెలియవచ్చుటంగాబోలు. స్త్రీలు పురుషులట్లు చదివి నలుగురిలోఁ దిరుగుట యాపఁబడవలసివచ్చిన దాసం దబాదిగా స్త్రీ విద్య యడుగంటి యుండవచ్చును. లెస్స యాలోచించినచో నెవ్వఁడుగాని నె

మ్మదితోఁ దన దారాధనాదులను రక్షించుకొనుట యా కాలమందుఁ గష్టసాధ్యమై యుండినదానంజేసి కాఁబోలు స్త్రీలఁ జదివించుట సాకల్యముగా విడుచుటయుఁ బురుషులు సైతము దగిన నెమ్మదియు సౌకర్యమును లేని కారణమున విద్యాభివృద్ధిఁ జేసికొన నవకాశము గలుగమిం జేసి చేయవలసిన వివిధ విద్యలయందుఁ బరిశ్రమము మానుటయు నేర్పడియెను. ఇటీవలనే మనభాగ్యాతిశయమున నాంగ్లేయ పరిపాలనమునంజేసి పూర్వపు సంకటము లన్నియుఁ బూర్తిగాఁ దొలఁగి పోయి స్వాతంత్ర్యవృత్తితో సుఖముగా వర్తింప నవకాశము గలిగిన దానను వివిధ కళాశాలలును బాలికా పాఠశాలలును దేశమందు మిక్కిలి నియమించి విద్యకుఁ బ్రోత్సాహముఁ గలిగించిన దానను మనకు నానావిధ విద్యలు నేర్చికొన నవకాశము గలిగెను. ఇట్టి యుపకార మొనర్చినమన యాంగ్లేయ ప్రభువులయెడఁ గృతజ్ఞతతోఁ వర్తింప వలయుట మనకు విధి. మఱియు నాంగ్లేయులలో స్త్రీలును బురుషులును విద్యలందు నేర్పరులై యుండుటవలనవారిఁ జూచి యిట్టిస్థితి మనుష్య జన్మఫలమని మనవారికిని దోఁచుటఁ జేసి స్త్రీవిద్యయుఁ దలసూపి నానాఁట నాటుకొనియె. మన విద్యాభివృద్ధి కాంగ్లేయ పాలనము ప్రధాన కారణమని యెవ్వరికిఁ గాని యొప్పుకొనక తప్పదు. విద్యవలన గర్వము గలుగు ననునది యొక కళంకము ప్రాచీనముగా నేర్పడి యుండెడు. కావున దానిం ద్యజించి విద్యవలన గలుగు నాగరికత వివేకము సత్కార్యనిష్ఠ సద్గుణావలంబనము సన్మార్గ ప్రవర్తనము మొదలగు వానిం గ్రహించుట సజ్జనులకు ధర్మము. కావుననే,

క॥ ధనమును విద్యయు వంశం ।
బును దుర్మదులకు మదంబు బొనరించును స
జ్జనులైనవారి కడఁకువ ।
యును వినయము నివియు తెచ్చు నుర్వీనాథా ॥

యని మహాభారతమునందుఁ జెప్పఁబడినది. విద్య యించించుక నేర్చినవారికే మదము కలుగుఁ గాని విద్యాపరిపూర్ణులకు గర్వ మొకవేళ యారంభదశలోఁ గలిగియుండినను బరిణామదశలో మూలముట్ట నశించి వినయము మొదలగు సద్గుణములనే గలిగించుననియును సర్వవిధసుగుణములకు నిదానమైన విద్యవలన సర్వ సుగుణములును గలుగుఁగాని యేదుర్గుణమును గలుగదనియు నిశ్చయింపఁ దగియుండెడు. కావున విద్యకు గర్వమను కళంకముఁ గల్పింపఁ రాదు. ఇతరుల కష్టములను నివారింపఁ దలంపు, దయ ఇయ్యవి యలవడునేని యక్రోధ, మద్రోహ, మనసూయయుఁ దనంతటఁ గలుగు. నిర్భయ వృత్తియే ధైర్యము. ఇది మనుష్యునకు సంపాదనీయము లైన యాఱు సుఖములలో నొక్కటి. మహాభారతమునం దుద్యోగపర్వమున ధృతరాష్ట్రునకు విదురుఁడు నీతి బోధించు ప్రకరణమునందు నిర్భయవృత్తి యొక సుఖమని యీ క్రింది శ్లోకమున నిరూపించెను.

శ్లో. ఆరోగ్య మానృణ్య మవిప్రవాస స్సద్భిర్మనుష్యై స్సహ సంప్ర
యోగః । స్వప్రత్యయా వృత్తి రభీతవాస ష్షడ్జీవలోకస్య సు
ఖాని రాజన్.

మనము సత్ప్రవర్తనలో నున్నంతదాఁక నేభయమును గలుగదు. ప్రతిమానవునకును దనవలనఁ దప్పు కలిగినచో నితరులకుఁ దనచేసిన తప్పు తెలియకుండినను నెవ్వరేమనకొందురో యను భయము దన మనస్సునఁ దనంతనే కలుగుచుండెడు. "పులికంటె గిలిగొప్పదను" సామెత విందుములకదా. సత్ప్రవర్తనము జ్ఞానము సత్యాదినిష్ఠయుఁ గలుగునేని నిర్భయవృత్తి యనంబడు ధైర్యము దనంతన కలుగును. అట్టి ధీరుఁడు తన చేయఁబూను సత్కార్యమును ధారాళముగాఁ జేసి యందు జయముఁ బొందఁగలఁడు. పనుల యెడ కానుదీయక యాసక్తితోడను బట్టుదలతోడను బ్రవర్తించుట యుత్సాహము. ఇది ధీరుని సొమ్ము. ఉత్సాహము లేనివాఁడు చేయఁబూనిన కార్యములను నెఱవేర్పను దత్ఫలము ననుభవింపను జాలఁడు. ఉత్సాహమునకు మిగిలిన బలము పురుషునకు లేదు. ఉత్సాహవంతులు కార్యముల పట్టునఁ జెడరు.

శ్లో॥ ఉత్సాహో బలవా నార్య నా స్త్యుత్సాహాత్పరం బలం
ఉత్సాహవంతః పురుషా నావసీదంతి కర్మసు ॥

అని రామాయణము. ఉత్సాహమింత బలవంతమగుటం బట్టియే రాజ నీతిశాస్త్రములం దుత్సాహ మొకశక్తియని గణించిరి. ఇట్టియుత్సాహ మున్నను దాని

ని సత్కార్యములందే వినియోగింప వలయుఁ గాని యసత్కార్యములయం దుపయోగింపరాదు. దానికి ధర్మనిష్ఠ యావశ్యకము. ఇయ్యది యితనికిఁ గర్తవ్య మని శాస్త్రములయందుఁ జెప్ప బడినదియుఁ బెద్దలు బోధించినదియుఁ బెద్ద లాచరించునదియుఁ దనబుద్ధిచే విమర్శించి యుత్తములగు విద్వాంసుల యంగీకారముఁ బొందినదియు ధర్మము. దానియం దాసక్తి ధర్మనిష్ఠ. ఇది యలవడునేని చెడ్డపనులపై బుద్ధి ప్రవర్తింపదు. దానం దనకునుఁ బరులకును సుఖము సర్వవిధములఁ గలుగు. లోకమును ధరించునది ధర్మమని ధర్మశబ్దమున కవయవార్థముఁ బెద్దలు సెప్పుదురు. దీని కార్జవము మూలము. కుటిలముగను గపట యుక్తముగను బ్రవర్తించుట మాని ఋజుభావమునం బ్రవర్తించుట యార్జవము. ఆర్జవవంతునకు ధర్మవిరుద్ధ కార్యములదెసఁ బోవ నావశ్యకత కలుగదు. అతఁడు దనకుఁ దానే ధర్మమందుఁ జొచ్చును. దీనికి సమత మూలము. ఈశ్వరుఁడు సృజించిన ప్రపంచమందలి జీవులందఱు నీశ్వరాంశ రూపమున నొక్కరూప యని భావించుట సమత. ఇట్టి సమున కెవ్వరిమీఁద నేనియుఁ గుటిలముగను సకపటముగను వర్తింపవలసిన కారణము లేదు. దీని వలన మదము మాత్సర్యము క్రోధము భూతద్రోహము మొదలగు దుర్గుణము లెల్ల నిర్మూలముగ నశించును. భూతదయా సత్య శౌచ శాంతి ప్రభృతులగు గుణములెల్ల నొకటి వెంబడి మఱియొకటిగా నభివృద్ధి నొంది నరునకు యోగ్యతను దన్మూలముగా నానరునకు నితరులకును సర్వసుఖములను శాశ్వతముగాఁ గలిగించును. సర్వశాస్త్రములయందును మనుష్యులు సాధించుకొనవలయునని చెప్పఁబడు నుత్తమగుణమిదియే. దీనికి సంతోష మావశ్యకము. ఏది లభించినను దృప్తి గలుగ కుండినం దనమనుస్సునందు సర్వకాలములందును దనకంటెఁ గొంద అధికు లనుదుఃఖ పడుచుండినచో సమతా బుద్ధి కలుగదు. జ్ఞాన గుణాదుల నార్జించునెడఁ దక్క గృహ వ్యాపార సుఖాదులయెడఁ దనకు లభించిన వానితో సంతోషింప కుండినచో సుఖము గలుగదు. ఇట్టివి గలుగవలయు నన్న సాధుసంగము ముఖ్యము. శక్తికొలది విద్యాధన సూనృతవచనాదులచే లోకమున కుపకారము సేయువారు సధర్మనివృత్తులును సాధువులు. వారితోడి చేరిక సాధుసంగము. యోగ్యజనుల సహవాసము వలన యోగ్యగుణములును దుర్జన సహవాసమువలన దుర్గుణములును గలుగును. "సంసర్గజా దోషగుణా భవంతి" యను నభియుక్తోక్తి లోకప్రసిద్ధము కదా. "శ్లో॥ గుణవద్వస్తు సంసర్గా ద్యాతి స్వల్పోపి గౌరవం। పుష్పమాలానుషంగేణ సూత్రం శిరసి ధార్యతే॥" యనుటయు విద్వాంసులకు విదితము. వీని కన్నిటికిని దేవుఁడు గలఁ డను ప్రమాణబుద్ధి ప్రధాన కారణము. ఇయ్యదియే యాస్తికత్వ మనఁబడును. దీనిం గూర్చి చర్చింపవలయు నన్న నెంతయోఁ జెప్పవలసియుండెను. సర్వశాస్త్రములు నిందే వర్తించినవి. ఇట్టి గుణముల నన్నింటిని బరిగణించి నిరూపింప వలయునన్న గ్రంథవిస్తర మగును. కావున నిఁక వీని విమర్శనము నింతటితోఁ జాలించెద. గుణములెల్ల బరస్పరానుబంధమున సత్పురుషున కభ్యాసమున లభ్యములు. ఇన్ని గుణములు గలిగియు మనుజుఁడు లోకోపకారమును శక్తికొలఁదిఁ జేయవలయు ననుటయే మనుష్య జన్మమునకుఁ బరమఫలము కానిచోఁ దనపనులు మాత్రము నెఱవేర్చుకొను పశుపక్ష్యాదులకును మనుష్యులకును భేద మేర్పడదు. అట్టి యుపకారము చేయఁజాలనిచోఁ జేయవలయునని మనఃపూర్వకమైన తలంపేనియు నుత్తమము. అట్టితలంపు గలుగునేని కొంచెమేనియు నతనివలన లోకమున కుపకృతి గలుగక పోదు. ఉపకారమనఁగ ధనమిచ్చుటయే కాదు. లోకహితమునకు మనుష్యు డాచరించు నానావిధ ప్రయత్నములు నందుఁజేర్పఁదగు. అట్టి యుపకారబుద్ధి యుండినం దప్ప మఱొక్క రీతిని సర్వేశ్వరుఁడు మానవులకు బుద్ధ్యాదిబలము నిచ్చినదానికి ఫలము గన్పట్టదు.

చ. మనుజులఁ బ్రాణిజాలమున మహోన్నతమై సకలేంద్రియాదిశ
క్తిని సృజియించె, దానిఁ బరికించి నరుల్ భువనోపకారచిం
తన మెయి వర్తిలం దగు, నుదారపథం బిది, మానవత్వ మొం
దినఘనపుణ్య వృత్తికిని నిత్యఫలం బని కొందె చూడఁగన్.

# గ్రామపంచాయతీసభలలాభములు.

మ. రా. శ్రీ, ధూళిపాళ సుబ్బయ్యగారిచే వ్రాయబడినది.

వర్తమానమున మన దేశమందు ప్రతిగ్రామమునందును జనులు సాధారణముగా నెంతచిన్న కలహమునకైనను న్యాయసభలకుఁబోయి న్యాయవాదులకును, లేఖకులకును కుక్షింభరిత్వమునకై యెన్నిబూటకములనైన నాడుటకు వెనుదీయని సాక్షులకును మితిలేనిధనము వ్యయముచేసి లంచములనిచ్చి యచిరకాలములోనే లక్షాధికారులుభిక్షాధికారులగుట జనసామాన్యమునకు విశదమైనసంగతియేకదా! అట్టిదురవస్థ జనులకుకలుగకుండఁజేయుటకు ప్రయత్నముచేయుట దేశౌన్నత్యమునుగోరుప్రతిమానవునియొక్క ముఖ్యకర్తవ్యమని నేను వేరెవక్కాణింపనక్కరలేదు. ఇట్టి దురవస్థనుబాపుటకు ముఖ్యముగా నెరవేర్పవలసినపని యేదియన ప్రతిగ్రామమునందును పంచాయతీసభలనేర్పరచి గ్రామస్థులందరును పట్టుదలతోను, సంఘీభావముతోను శ్రమపడిపనిచేసి యచిరకాలములోనే నవియంతరించకుండ తగినయేర్పాటులన్నియుచేసి వానిని వృద్ధిలోనికి తీసికొనివచ్చుట.

పూర్వము మహారాజులు పరిపాలించినదినములలో పంచాయతీకోర్టులే న్యాయాన్యాయములను బరిశీలించి జనులను బాగుగ పరిపాలించుటయందును, వారిదురవస్థలను బాపుటయందును పాలకులకు మిక్కిలి సహాయకారులుగనుండెడివి. పూర్వకాలమననేల? క్రీస్తుశకము పదియారవశతాబ్దాంతమువరకును మహారాష్ట్రదేశమునందు ప్రజలకు న్యాయమునిచ్చిన దీపంచాయతీసభలేగదా! ఇటులనే హిందూదేశమునందన్నిరాష్ట్రములయందును యీయాంగ్లేయ ప్రభుత్వమునకుఁబూర్వము పంచాయతీసభలున్నట్లు మనకు చరిత్రలవలన విశదమగుచున్నది. ఆంగ్లేయప్రభుత్వము దేశమునందు తలయెత్తినది మొదలు వారి న్యాయస్థానములును, వాటియందు వాదించుటకు న్యాయవాదులును బయలుదేరిరేకాని యంతకుపూర్వము మనదేశమందు న్యాయవాదులున్నటుల యాధారములేవియుఁ గానరావు. మనహైందవులిదియేమియో కానిఁ దూరపుకొండలు నునుపన్నట్లు యీనవీన న్యాయస్థానములకు బాగుగ నలవాటుపడి న్యాయదూరులై ప్రాచీనసభలను బొత్తుగామఱచి సంచరించుచు నిప్పటిసభలకెక్కువ ప్రోత్సాహముఁ గలిగించుచున్నారు.

పూర్వము ప్రతిగ్రామమునందును ఒకపంచాయతీసభయుండినట్లు తెలియవచ్చుచున్నది. ఆగ్రామమునందు కలహములేవైన యున్నయెడల యీసభలోనికి న్యాయవిచారణకై రావలసినదే కాని యిప్పటివలె నెంతదూరమున్నను తాలూకాయూళ్ళకు వెళ్ళెడివారుకారు. ఈ పంచాయతీసభయందు ఆగ్రామస్థులే సభికులుగనుండి కలహములను బాగుగ విచారించెదరు. ఒకగ్రామములోని కలహమును ఆగ్రామస్థులే విచారించుటవలన నెంతలాభమున్నదో యిప్పటివారలకుఁ గొంచెమైనను దెలియదు గాని యదిప్రాచీనులకు బాగుగ తెలియును. ఇప్పుడు సాక్షులమని పేరుపెట్టుకొని వెళ్ళువారలందఱును సాధారణముగ నిజస్థితిని యణువులో నూఱవవంతైనను యెరుగనివారై ధనమునకాసపడియో లేక యీర్ష్యచేతనో వెళ్ళువారైయున్నారు. ఒకగ్రామములోని కలహమాగ్రామములోనే విచారింపఁబడుటవలన నిట్టివారి సాక్ష్యములన్నియు గడ్డిపరకకన్న తేలికనై న్యాయమనెడి మహావాయుప్రవాహములోఁ గొట్టుకొని బోవునుగదా! ఈదినములలో యన్యాయముల కొడిగట్టి, పరులకొంపలు తీయుటకుగాను యిట్టిసాక్షులను దీసుకొని వెళ్ళువారలును వారి వాదన లన్యాయములైనను కడకుకృతార్థులై కార్యసిద్ధిఁ బొందుచున్నారు. ఇక పంచాయతీసభలయందన్నరో న్యాయమైన వాదనలున్నవారికేగాని యన్యాయస్థులకెన్నఁడును కార్యసిద్ధిగానేరదు. ఏలనన నొకగ్రామములోజరుగు ప్రతికలహమును గ్రామస్థులైనవారికి పూర్తిగా కాకపోయినను గొంతవైన దెలియకమానదు. అదియునుగాక

గ్రామస్థులందరి యభిప్రాయమువల్లను ఆవిషయముయొక్క న్యాయాన్యాయములను గ్రహించుటకు పంచాయతీసభవారికున్నంత యవకాశము యీరోజులలోని కోర్టులకుండదు. కావున జనులు నీతివంతులును న్యాయమూర్తులునై యన్యాయాసత్యములన్న నెట్టివియో యెరుంగకుందురు. అందువలననే సంఘమునందు కట్టుబొట్లును సంఘీభావమును బాగుగనుండును. కనుక యిట్టిపంచాయతీసభలుండుస్థలములు ధనధాన్యములతో తులతూగుచు సత్యమున కాలవాలములై యొప్పును.

ఈకాలములోఁ గోర్టులకుఁ బోవువారల కొకవిధమైన ప్రోత్సాహమును పట్టుదలయు మనమునందుఁ బ్రవేశించి జయకాంక్షకలవారై కోర్టునందు కార్యము సిద్ధించనియెడల మఱియొకకోర్టునకుఁబోవుచు యీవిధముగ నంతఃకలహములను పెంపొందించుచుందురు. కాని యీ పంచాయతీసభలయందు ప్రజలకునిట్టి యుత్సాహము గలుగదు. ఇట్టిపట్టుదలయు నుండదు. కావున నంతఃకలహములు వృద్ధిపొందనేరవు. ఇటు అంతఃకలహములను నిరుత్సాహపరచు నీపంచాయతీసభలులేక యాంగ్లేయప్రభుత్వమువారి న్యాయసభలు న్యాయమును వింతగఁ బరిశీలించుచున్న యీకాలమందు విద్యాధికులెవ్వరైనను పల్లెటిగ్రామములకుఁబోయి యందలిజనులు యెట్టిస్థితియందున్నవారో చూచినయెడల పూర్వకాలమునందువలె వారు పరస్పరము సహాయమొనరించుకొనుటయు, ఐకమత్యభావమును, నూటికి నూరుభాగములైనను గనుపింపదు. కాని పూర్వములేని యైశ్వర్యమొక్కటిమాత్రము వారలకబ్బినటుల స్పష్టముగా కనుపించకమానదు. అదియేమియన పరస్పరవైరమును, లేశమాత్రమునకై కలహములును, ఆకలహములలో గ్రామస్థులందఱు నేదియో యొకవైపున తమంతనె తాముచేరి కలహమును గాలివానగఁజేసి న్యాయసభలకెక్కించి, యైశ్వర్యములతోఁదుల తూగుచున్న వారిని నష్టట్లోముంచుటయును. పంచాయతీసభలుండుటవలన నిట్టివేవియు సంభవింపనేరవుకదా! ఒకవేళసంభవించినను మిక్కిలి సంపన్నులనతికాలములోనే భిక్షాటనమునకై బయలుదేరవలసినంత దుర్గతిపాలై నీచస్థితిలోనికివచ్చుటకు నవకాశములేదు. ఏలయన నీపంచాయతీసభలందు న్యాయవాదులు మొదలైనవారుండరు. అందువలన ధనముకొరకు పీడించువారును తక్కువగనేయుందురు. అదియునుగాక సాక్షులకొఱకై మితిమీరినధనము వెచ్చింపవలసిన యవసరముండదు.

వర్తమానమునందు జనులు న్యాయసభలకు బోవలెనన్న నొకసమయాన యేబదిమైళ్ళును మఱియొకసమయము నూఱుమైళ్ళును ప్రయాణముచేయవలసియుండును. ఇంతదూరము రాకపోకలకు సాక్షులుమొదలైన వారలకందరకును ఖర్చులు వీరలేభరింపవలసియుండును. ఇక న్యాయసభలలోనో కేసువిచారణ, ఒకదినములో నెన్నడునుకాదు. అందువలన వాయిదాలువేయబడును. అట్టి వాయిదాలు పదియైనయెడల నిరుకక్షులవారును యెంత ధనమును ప్రయాణములక్రింద వ్యయపరపవలసిన వారగుదురో చదువరులకే విశదము. ఇక పంచాయతీసభలున్న పక్షమునవో దూరపుప్రయాణములతోఁ బనియేలేదు. ఆకారణమున ధనవ్యయము మూఁడువంతులు తగ్గును. ఇదేవిధముగ నికనెన్నియో లాభములు పంచాయతీసభలవలన ప్రజలకుఁగలును.

కాబట్టి యపరిమితలాభమును జనులకొనగూర్చు యీ పంచాయితీసభలను ప్రతివారు మహానందముతో యాహ్వానముచేసి మిక్కిలి కృతజ్ఞతను, యవిచేయు మేలునకుగాను, వానియందు చూపుదురని నాయభిప్రాయము. కాని 'లోకోభిన్నరుచి' యనినటులనే యనేకమంది యనేక యభిప్రాయములీపంచాయతీసభలయందు గలవారై యుండవచ్చును. ఏకారణముచేతనో మనచెన్నపురిరాజధానియందు గవర్నమెంటువారు బొంబాయి రాజధానియందలి ప్రజలకు నీపంచాయతీసభలనిచ్చెదమని వెల్లడిచేసియు, పంచాయతీల నేర్పరచుటకు తమకిష్టములేదని వెల్లడిచేసియున్నారు. ఇదియంతయు మనదురదృష్టమేకాని వేరుకాదు. కావునయిది ముఖ్యముగా మనదేశస్థులందరిచేతను కోరదగినది.

---

# ఆంధ్రుల శిల్పకళాదక్షత్వము.

మ. రా. రా. శ్రీ, జీ. ఎ. రామమూర్తిగారిచే వ్రాయబడినది.

ఆంధ్రుల శిల్పకళాదక్షత్వమును గూర్చి వ్రాయునపుడు పూర్వమాంధ్రదేశ మెచ్చటిదియో దానిపూర్వచారిత్ర మెద్దియో నాట బరిపాలకులగు రాజు లెవ్వరో యప్పటి నాగరికత యెట్టిదియో వారొనర్చిన శిల్పకళాదక్షత్వ మెట్టిదియో కొంచెము తెలుపవలసి యున్నది.

చెన్నపురి రాజధానియందలి నార్తర్న్ సర్కార్సు అని పిలువబడు భాగమే ఆంధ్రదేశమై యున్నది. సకల సంపత్కరంబై బాహుబలంబున బుద్ధివైభవంబున సాటిలేని కీర్తులతో విలసిల్లు మహాజనంబులకు బుట్టినిల్లయి నిరుపమవైభవములతో భాసిల్లుచున్న యీయాంధ్రభూమియే మక్కల్లిక పూర్వ మొకప్పుడు క్రూరమృగశరణ్యంబగు నరణ్యంబుగ నుండెడి దనియు నందు వసియించెడి జనులు బట్టకట్టుటయైన నెరుంగని యనాగరికులై యుండెడి వారనియు దేశచారిత్రల వలన దెలియుచున్నది. అప్పు డార్యు లీదేశమునకు వచ్చి యిచ్చటి కిరాతులలో గలసి పోయిరి. ఈ యుభయజాతి సంతతి వారలె యాంధ్రులుగా నెన్నబడుచుండిరి. ఆర్యరక్తము వీరిలో బ్రవహించుటచే క్రమముగ బుద్ధికుశలులగుచు వచ్చిరనియు సంతకుబూర్వమె కాకులమును బట్టణమును రాజధానిగ జేసుకొని సుచంద్రుడను రాజు తత్ప్రదేశమును బరిపాలింప మొదలిడెననియు బలశాలియగు నాతని కొమరుం డాంధ్రదేవుండను వాడు నిర్జిత సకలశాత్రవుండయి కీర్తిగాంచి శ్రీశైల, కాళేశ్వర, భీమేశ్వరములకు నడుమ బ్రాకారంబులను దుర్గంబును నిర్మించి దేశోపకారుండయి జనుల సుఖపెట్టె ననియు పురాణములనుండి యొక గాధ బయలు వెడలుచున్నది. అట్లయిన నిరాధారమైన యాంధ్రదేశమున కీతనిచే నిర్మింపబడిన మహాదుర్గంబె మొదటిదై యుండవచ్చును. ఈతని దేశోపకారబుద్ధికిని సత్పరిపాలనమునకును నాటి జను లీతనికి మిక్కిలి కృతజ్ఞులై యుండి యీతని దైవసమునిగ నెంచి యతని జీవితానంతరము దేవాలయము నొకటి గట్టించి యాతనిపేరున బూజింపుచు వచ్చిరనియు శ్రీకాకుళాంధ్రదేవు డీయాంధ్రదేవుడే యనియు దేట బడుచున్నది.

ఆంధ్రు లీస్థితికి వచ్చువరకును శిల్పకళయందు దప్రవేశులుగనె యుండిరి. శిల్పకళయందె గాదు. సర్వవిధముల వారు మృగప్రాయులుగ నుండిరి. చెట్లనీడలయందు నివసింపుచు నాకలంబుల దిని జీవించు తమ జీవితముం గడువ జొచ్చిరి. ఆర్యుల సంపర్కముచే వీరలకించుకించుక నాగరికతా జ్ఞానము యభివృద్ధిగా దొడంగెను. అంధకార తుల్యమగు యజ్ఞానమునుండి తేజోవంతమగు నాగరికతా జ్ఞానమునకు వచ్చునవు డాంధ్రుల కలవడిన శిల్పవిద్యా నైపుణ్యమును మూడుభాగములుగా నేర్పఱచి చెప్పవచ్చును.

అందు మొదటిది గృహనిర్మాణమై యున్నది. ఎండల కెండుచు వర్షములకు దడియుచు ఋతుభేదములం దునికిపట్టుల మార్చుకొనుచు వారు చిరకాలమట్లు కాపురములు సేయజాలక పోయిరి. మొదట జిన్నచిన్న కుటీరముల నేర్పరచి కొనియు పిమ్మట మంటిగోడలపైన మరికొంత విశాలములగు నిండ్లు గట్టుకొనియు దర్వాత దలుపులనియు, ద్వారబంధము లనియు, రాతిగోడలనియు, రాతికట్టడములనియు నిర్మింపుచు క్రమముగ దివ్యములగు భవనములును సౌధములుకూడ నిర్మింప గలిగిరి. భూమియందు గప్పవడిపోయిన నాటు కట్టడము లనేకములిప్పుడు మనవలన గనిపెట్ట బడుచున్నవి.

అప్పు డాంధ్రులకు గొంత మనస్థిమితము గలిగినది. నూతన నాగరికులగు నయ్యాంధ్రులకు కేవల, శారీరక సౌఖ్యములందే గాక నధ్యాత్మిక జ్ఞానమునందు నైతము ప్రవేశము గలిగెను. దేశాభిమానమును, దైవభక్తియును, విగ్రహారాధనమును, నానాట నభివృద్ధిజెందెను.

అప్పుడు వారొనర్చిన రెండవకార్యము దేవాలయ నిర్మాణమై యున్నది. అంతకు ముందు వారు సూర్యునారాధించియు, పంచభూతముల సేవించియు దర్వాత జిన్నచిన్న మంటి విగ్రహముల నేర్పరచికొని బూజించియు తమదైవభక్తిని జూపుచు వచ్చిరి. క్రమముగ భక్తియభివృద్ధిగా దొడంగెను. అప్పటిచేతలయం దందముగ జేయబడిన విగ్రహములయందలి యనురాగము పెంపుచే వాటిని పూజనీయములగు దేవతా విగ్రహములుగ నేర్పఱుచుకొని వాటి నారాధించుచు వచ్చిరి. ఏచెట్ల క్రిందనో నిర్మింపఁబడిన యావిగ్రహముల భద్రపరచుట కేదైన గృహవంటిది కావలసి వచ్చెను. మున్నుగ జిన్న పందెరలనియు బర్ణశాలలనియు మంటికట్టులనియు ఱాతికట్టడములనియు క్రమముగ వారభివృద్ధి జేయసాగిరి. అప్పటికి శిల్పకారి తనమున వారించుక ప్రజ్ఞానిధులైరి. ఇంకయు నభివృద్ధి జేయ వారికి గుతూహల ముదయింపుచు వచ్చెను. భవనము లెట్లు నిర్మింపవలయునో విగ్రహము లెట్లు జెక్కఁగలయునో చిత్రపటము లెట్లు వ్రాయవలయునో దెలుపు బౌద్ధశాస్త్ర గ్రంథము లాంధ్రుల యీ యుద్యమమునకు మిక్కిలి దోడ్పడినవి. తమ దైవభక్తికి దోడుగ తమ పనితనముల నెల్లవారు దేవాలయములందె జూపుచు వచ్చిరి. విగ్రహముల చుట్టును నిర్మింపబడిన రాతి కట్టడములు బహుజన నివాసనానుకూలములగునటు లందముగ మలచబడిన శిలాస్థంభములపై విశాలములుగ నిర్మింపుచు వచ్చిరి. పిమ్మట వాటిపైని దర్శనీయములగు గోపురముల నిర్మింపఁ జొచ్చిరి. వింతవింతలగు లోహపు విగ్రహముల జేయ దొడగిరి. చిత్రచిత్రములగు నగిషీపనులు గోపుర భాగములపైని చిత్రింప మొదలు పెట్టిరి. భగవంతుని లీలావతార కథలెల్ల ప్రాకారములందు విగ్రహరూపకములుగ చిత్రింప దొడగిరి. వారి దైవభక్తికి దోడుగ నాగరికతయును పనితనమును యభివృద్ధి జెందుచు వచ్చెను. కన్నులపండు వొనర్చు వీరి యద్భుత శిల్పనిర్మాణములకు జనులెల్ల మెచ్చుటపడ జొచ్చిరి. ధనికులగు భూపతులు దక్క యొరులా మెచ్చుటల నెట్లు తీర్చుకొన గలిగెదరు ? శిల్పకులు తమశిల్పకళా నైపుణ్యము నభివృద్ధి జేసుకొనుట కప్పుడు రాజావలం బనంబును వారి యమిత ధనసహాయ్యంబును హెచ్చరికలును మంచియవకాశము నిచ్చెను. ఆకారణమున వారిచే నిర్మింపబడిన శాశ్వతములగు దేవాలయములను నేడు మనము దేవతా నిర్మితములని చెప్పుకొనుచుంటిమి.



విశాఖపట్టణ మండలంబున సింహాచలమనెడి గ్రామమందలి కొండపైన యత్యద్భుతమగు దేవాలయ మొకటి కలదు. అయ్యది మిక్కిలి పురాతనపు కోవెలయని యందలి యనేక శాసనములవలన స్పష్టపడు చున్నది. శిల్పవిద్యా నైపుణీ ధురంధరుండగు చిత్రకాయుం డొకడు దానినొక్క రాత్రియందు నిర్మించెననియు వాని కుమారుండు ముఖద్వారంబు పూర్వాభిముఖంబున నుంటజూచి యది తగదని యొక్కనిముసములో నాదేవళంబు నంతయు పశ్చిమ ముఖంబునకు ద్రిప్పివైచెననియు దానొక రాత్రియం దద్భుతముగ నిర్మించిన యమ్మహాదేవాలయము నవలీలగ ద్రిప్పివైచెనని కొమరునిపై గినిసి తత్క్షణమ వానిని జీరివైచి వాని ప్రేవుల మెడ దాల్చెననియు నొక విచిత్రమగు వాడుక గలదు. పై కథ కనుగుణ్యములగు రాతి విగ్రహము లాదేవళంపు గోపురమున నున్నవి. స్వభావ సిద్ధములై జీవకళ లుట్టివడు ననేకములగు రాతివిగ్రహములందు గలవు. మనోహరములగు లతలును, స్తంభములును, పీఠములును, మంటపములును, వృక్షములును, నగిషీ పనులును దానియందు జెక్కబడి యున్నవి. దాని ప్రాకారములు మిక్కిలి గొప్పవిగా నున్నవి. లెక్కకు మీరిన శాసనములందు గలవు. అత్యద్భుతములగు గొప్పగొప్ప పనితరము లనేకము లందుగలవు. ఒక్కసారి దానిని గనులార వీక్షించు నపుడే దేశభక్తుని హృదయము ఝల్లుమనకుండునా ? పూర్వపు శిల్పకారుల మహోన్నత్యమును దెలుపు యీ దేవళము తత్పర్వత శిలానిర్మితము గాదనియు నట్టిశిలలా కొండయం దెచ్చటను గానరావనియు గొందరభిప్రాయ పడుచుండిరి.

ఇట్టి శిల్పకళానైపుణ్యముతోడనే వెలుగొందు శ్రీకూర్మమును విశాఖపట్టణమండలి నొకగ్రామమున మరియొ

క గొప్పదేవాలయము కలదు. వివిధములగు స్తంభములు నూరురకములకు మించి యున్నవి. క్రొత్తక్రొత్తగ నగిషీ పనులను పెద్దపెద్ద పద్మములను విశాలములగు శిలాఫలకములపై జిత్రింపబడి యాదేవళముల నలంకరింపుచున్నవి. ఆదేవళము నైతము పూర్వుల శిల్పకళాదక్షత్వమును వేనోళ్ళ జాటుచున్నది.

ఈ విధముగ దినదినాభివృద్ధిని జెందుచున్న యాంధ్రుల కదివరకె లోకవ్యవహారము లధికము లయ్యెను. శత్రువులతో నిలచి పోరాడుటకును, దేశక్షేమము కొరకును, రాజ్యాంగపద్ధతుల బలపరుచుకొనుచు వచ్చిరి. ఎండవానలనుండి రక్షించుటకేర్పరచుకొనినవారి కుటీరనిర్మాణబుద్ధి కౌశల్యంబును, దైవభక్తి పెంపున జెక్కబడెడి విగ్రహనిర్మాణ నైపుణ్యంబును, వారికపుడు జాలదయ్యెను. శాత్రవజన దుర్భేద్యంబులగు మహాదుర్గముంబుల నప్పుడు వారు నిర్మింపవలసి వచ్చెను. బుద్ధికుశలులగు నయ్యాంధ్రుల కయ్యది యొక దుస్సాధ్యమైన పనిగాక పోయెను. సమర్థులగు రాజులట్టి కార్యములందు మిక్కిలి యామోదమును జూపుచు వచ్చుటచే నెంతెంతలు మహాకార్యములయినను వారు సులభములుగ నెరవేర్చుచు వచ్చిరి. అన్యదేశములతో వర్తక వ్యాపారములు జరుపుచు వచ్చిరి. అందువలన నన్యులకడనున్న యితర పనిముట్లు మున్నగునవనేకములు జూచి తామును వాటిని నిర్మించుచు వచ్చిరి. దేశమన్నివిధములగు కట్టుబాటులతో క్షేమకరముగా నుండెను. వారి మహాకార్యములను కూర్చి శిలాఫలకములందు శాసనరూపకములుగ జెక్కించుచు వచ్చిరి. కీర్తిశేషులగు మహాపురుషులు గౌరవార్థమనేకములగు స్తూపంబుల గట్టించుచు వచ్చిరి. తమచే జయింపబడిన దేశములనందందు జయస్తంభములను బాతించుచు వచ్చిరి. నిత్యోపయోగములగు గృహోపకరణముల నెన్నింటినో యభివృద్ధి జేసిరి.

భావిజనంబుల శిల్పవిద్యా నైపుణ్యంబులకు మార్గదర్శకులైరి. శిల్పకళా పరిశ్రమము వలన పూర్వులమహోన్నత్యమును గూర్చి దేశచరిత్రములు వందిమాగధులవలె బొగడుచున్నవి.

దేశచారిత్రము పూర్వజ్ఞానము వంటిది. అయ్యది దేశాభివృద్ధికి మహోపకార మొనర్చును. మనదేశమున పూర్వచారిత్రములను దెలుపు చరిత్రా గ్రంథములు లేకపోవుటచే పూర్వదేశ స్థితిగతులను గనిపెట్టుటకు నిరాధారులము గావలసివచ్చినది గాని యట్టిచారిత్రములను గనిపెట్టుటకు నిపుణులగు పూర్వుల శిల్పవిద్యా నైపుణ్యమొకటియె ప్రబలాధారముగ నున్నది. ఈశిల్పవిద్యయందు లోహపదార్థములందును దారు సముదాయములందును, పనితనమును జూపుటకన్న రాలపైన పని జేసిజూపుట యెక్కుడుకష్టము. బౌద్ధమతావలంబకులగు నాంధ్రుల కియ్యది యభిమానవిద్య. ఆకాలంబున నిర్మింపబడిన ముక్తికాంతకు గాపురంబులును, సుందరంబులగు మందిరంబులును, రమ్యంబులగు హర్మ్యంబులును, మనోహరంబులగు సరోవరంబులును చిరకాలము క్రితమే శిథిలములయ్యును నేటికిని జూపరహృదయము నాకర్షించుచున్నవి. వివిధంబులగువాటి నగిషీపనులను జూచిన నిప్పటికిని గనులకు మిరుమిట్లు గొలుపుచున్నవి. స్వభావసిద్ధంబులగు నాటి శిలావిగ్రహంబు లిప్పటికిని జీవకళ లుట్టిపడుచున్నట్లు గన్పట్టుచున్నవి. శాశ్వతంబులగు నాటిగోపురంబులు మున్నగు కట్టడము లిప్పటికిని జూపర సత్యోద్భుతాలోకన మానసులంజేయుచున్నది. పురాతనంబులగు నాటి పనితనముల నొండలి శిలాంతర్నిర్మితంబులను మాత్రమె మనము జూడగలుగుచుంటిమి. ఇంతకన్న సులభసాధ్యములగుటచే నింకయు మిగుల సొగసగు నగిషీపనులతోడను స్తుత్యతీతములగు పనితనములతోడను గనులపండు వొనరించెడు దారువులు మున్నగువాటిపై జేయబడిన చిత్రంపుబనులెన్నెన్ని నశియించిపోయినవో మనమిపుడు జెప్పజాలము.

ఆంగ్లేయ దొరతనమువారివలన నిట్టిపురాతనపు కట్టడముల గనిపెట్టుటకొక సంఘమేర్పరుప బడినది. ఆ సాంఘిక పరిశోధనలవలన భూమియందును కొండలయందును గప్పబడిపోయిన యనేకములగు పురాతనపు కట్టడములిప్పుడు కనిపెట్టబడినవి. విశాఖపట్టణ మండలమున నున్న విజయనగరమునకు దూర్పున, యేడెనిమిదిమైళ్ళ

దూరమున 'రామతీర్థము'లని బిలువబడు గ్రామమున నొకచిన్న కొండపై, రెండుమూడు వత్సరముల క్రితమొక గొప్ప బౌద్ధాలయము గనిపెట్టబడినది. అందరివలెగాక బౌద్ధులేకారణముచేతనో పూర్వము తమకట్టడముల సమప్రదేశముల నిర్మింపక తమ శిల్పకమింత యౌన్నత్యమున నున్నదని దెల్పుటకోయన మహోన్నతములగు పర్వతములందును - కొండగుహలయందును రాతిగుట్టలయందును నిర్మించుచువచ్చిరి. అనకాపల్లి యను విశాఖపట్టణమండలమునందలి మరియొక గ్రామసామీప్యమున నొక కొండపై నయిదారు వత్సరములక్రితమె మరియొక బౌద్ధాలయము గనిపెట్టబడినది. రామతీర్థములందువలె నిది కేవలము కొండకు శిఖరప్రదేశమునగాక గుహవలె నున్న ప్రదేశమునందున్నది. ఇట్టిపురాతన కట్టడములింకయు ననేకములుగలవు. దొరతనమువారిచే నింకయు శోధింపబడుచున్నవి.

ఏకార్యమైనను రాజావలంబనములేక నభివృద్ధి జెందనేరదు. పూర్వకాలమున జగజ్జేగీయమాన ప్రతాపవంతులగు కృష్ణదేవరాయాది మహారాజేంద్రుల లాలనముల దేలి నేడనాదవలె దీనవదనమై క్రుక్కియున్న యాంధ్రభాషాయోషయె నిందుకు ప్రబలమగు సాక్ష్యమునిచ్చుచున్నది. ఎందరు చిత్రకారులున్ననేమి; యెందరు బుద్ధికుశలు లున్ననేమి; యెందరు ప్రజ్ఞానిధులున్ననేమి; యెందరెందరు సమర్థులున్నను బూర్వ మహాకాదుల నాటివలె రాజావలంబనము లేనిదిని శిల్పకమింకయు దక్షత్వమునకు రానేరదు. ధనికులగు మహాపురుషులు పూర్వులార్జించిన యీవిద్యయం దభిమానముంచవలెను. అసామాన్యమై, మనోహరమై, శాశ్వతమై విలసిల్లుయీ శిల్పవిద్య నామోదించిన యెడల చిత్రకారులింకయు స్తవనీయములగు పనితనములజేసి చూపగలరనుటకు సందియములేదు. అప్పుడాతిదేరిన చిత్రకళానైపుణ్యములతో నీయాంధ్రదేశము సాటిదేశములయందు మహోన్నతపదవిని బొందును.



# వరిపంట.

మ.రా.శ్రీ, శ్రీరామ్ వీరబ్రహ్మముగారిచే వ్రాయఁబడినది.



ఈహిందూదేశమందు నాలుగైదువేల రకముల వరిజాతులు పండింపఁబడుచున్నవి. క్షేత్రకాలాదుల కనుగుణ్యముగఁ బ్రతియేటఁ బండింపఁబడు సహజమైన యీ వరి పలువిధములైన రకములను గలిగియుండుటచే నెట్టి నేలయందైన నేదియోయొక రకమును బండింప వీలగుచున్నదికాని మంచినీటి వసతులుగల రేగడనేలలీవరిపంటకు మిగుల ప్రశస్తంబులందురు. కృష్ణా కోయంబుత్తూరు జిల్లాలలోని రైతులు వరిపొలములకు మెరకదుక్కి దున్నినయెడల నేల గులకబారునని యందువలన నూడ్పుతరుణమునందే నీరుకట్టి దున్నవలెనందురు కాని యీపద్ధతి యెల్లతావులకు ననుకూలించదు. పొలమునందు శీతకాలపుపైరును గోసినవెంటనే తమ పొలములను జక్కఁగ దున్ని యెండకాలములో వానకురిసి భూమికి పదును గలిగినప్పుడెల్ల నొకటి రెండుసార్లు దున్ని గుంటకత్రోలించవలెను. ఇందువలన నేలలోగల కలుపును వృద్ధిచేయు వేళ్ళు దుంపలు మున్నగునవి సూర్యరశ్మిచే మాడిపోవును. ఇటుల నేలను గలియదున్నుటచే నావిరి దేలుచు యుక్కియున్న మన్నంతయు భూమిపైఁగల ప్రాణవాయువుచేతను సూర్యరశ్మికిని జక్కఁగఁ బడునుగలిగి సస్యాభివృద్ధి కనుకూలముగనుండును. నల్లరేగడనేలలందుసైతము మథమము వరి

నూడ్చుతరుణమున కై దాఱుసారులు దున్నియుంచుట శ్రేష్ఠతరము. ఇట్లుదున్నుట కుపకరించు యుపకరణమగు "నాగలి"యుఁ దదనుకూలముగ నుండినఁగాని పంటలు బాగుగఁబండ నేరవు. "నాటునాగలివలన నొకయకరములో 2084 పౌనుల వరియు 3720 పౌనుల గడ్డియు నదే నేలలో ప్రభుత్వమువారి నాగలివలన 2280 పౌనుల వరియు 4200 పౌనుల గడ్డియుఁ బండిన"దని "శివపూరు గవర్నమెంటు వ్యవసాయిక పరిశోధనా స్తానము" వారివలనఁ దెలియుచున్నది. కావున సౌరాష్ట్రదేశపు నాగలికంటె వంగదేశపుదేశవాళినాగలికంటె శివపూరులోనిగవర్నమెంటువారి నాగలియే సాఢమైనదని తోచుచున్నది. ఇట్టి యుక్తమైన నాగటిచే దున్నఁబడిన పొలమందు మొదటితడవ పశువుల యెరువును తదుపరి ఆముదపుపిండి, యెముకలపొడి మున్నగువాటిని వేయవలెను. ఎముకల పొడినివేసిన రైతులు పదునైదు దినములకు పిదప సూరేకారమును చల్లవలసివచ్చును. ఆకుమళ్ళను బోయుటకై యేయెరువుచేతనైనను (దొరకినచో నెముకలపొడి శ్రేష్ఠము) నేలను బదునుజేసి యందు పసరుటాకులను ద్రొక్కించి యొకవారము రోజులూరనిచ్చి పిదప విత్తనములఁ జల్లవలెను, ఏపుగాఁ బెఱిగిన బలిష్ఠములగు మొక్కల నుండి స్వీకరింపఁబడిన విత్తనములే నాణెములుగాని యే తాలుగింజలనో చేతికి వచ్చినవాటిని జల్లుటచే నెంతమంచినేలయైనను నెట్టిపాటు చేయఁబడుచుండినను నిరర్థకము కావున మంచి విత్తనములను జల్లవలెను.

ఒక సంచివిత్తనముల నాఱుయకరములకు నూడ్చుదురు. మఱికొందఱు తొమ్మిదియకరములకును వినియోగింతురు. రెండుమూఁడు మొక్కలను గలిపి దుబ్బులు దుబ్బులుగా నాటఁదలఁచువారు రెండు మూఁడు యకరములనేలకే యీబస్తా విత్తులను సరిపుచ్చుదురు. ఇది మిగుల నష్టదాయకము. ఒక్కొక్కతావున నొక్కొక్క మొక్కకంటె నధికముగా నాటరాదు. నేలనస్యోపయుక్తమగు సత్తువ పరిమితముగనుండును ఈసత్తువ యొక్కమొక్కకే లభించుటచే మిక్కిలి బలిష్ఠముగ నెదిగి పెద్దపెద్దకంకుల వేసి విశేషధాన్యమును బండించునుగాని పదిమొక్కలొక్కతావుననే నాటఁబడినయెడల నేమొక్కకును సరియైన సత్తువచిక్కక సన్నియును గుఱచ కంకులతోను తాలుగింజలుగల కంకులతోను జనించి నష్టమును గలిగించును గనుక పెక్కుమొక్కలనాటక నొక్కొక్క మొక్కనే నాటుచుండిన లాభకరమని తెలియనగును గాన యకరమునకు 20 పౌనాలు అనఁగా నేడువీసెలకంటె నధికముగా విత్తు లవుసరముండవు. ఆకుమళ్ళు శుభ్రముగాను గలుపులేకుండునటులను నుండవలెను. విత్తఁబడెడి విత్తులను బూర్వ్సయుగములందు పాలతోఁగడిగి విత్తెడివారఁట. కాని యిప్పుడు మైలతుత్తము మూఁడుపాళ్ళును నీళ్లు నూఱుపాళ్ళును గలిపిన నీటియందు శుద్ధిచేసి పిమ్మట 15 నిమిషములకు వెంటనే మంచినీటిచేఁ గడిగి మొలకలెత్తించి యాకుమళ్ళలో వేయుటమంచిది. అటుల నెత్తింపఁబడిన మొలకలు విఱుగునను భీతిచే ముందుగనే చల్లుదురుగాని నీటివసతి బాగుగలేని తావుల మొలకల నెత్తించిగాని చల్లకతప్పదు. ఆకుమళ్ళు బలిష్ఠముగ నెదుగుటకు "నైట్రొజన్" విస్తారముగల సూరేకారమును జల్లుటయుక్తము. కాని యెముకలపొడిని ముందుగ నాకుమళ్ళకువేసి యూడ్చినతరువాత సూరేకారమును వేయుదుమేని భూసారము శాశ్వతముగ నుండును. ఇట్టి యెరువు నుపయోగింపఁబడినయాకు నెలలోపుగనే యూడ్చుటకు సిద్ధమగును. జిల్లేడు, కసింద, వెంపలి మొదలగు పసరుగల యాకులను నేలలోవేసి కుళ్ళించుటయు దొరకిన యేయెరువు నయినను వేసి యవుసరమగునపుడెల్ల గుంటకత్రోలి చక్కఁగాఁ బదునుజఱచి పిదప వరినూడ్చుట లాభకరము. వరిని మొలకనెత్తించిగాని మొలక నెత్తించకగాని, చల్లుటచేతను, పెఱిగిన మొక్కలను ఊడ్చుటచేతను బండింపవచ్చును గాని మొలకలనెత్తించి చల్లుటచే విత్తనము కప్పఁబడుటకై దున్నఁబడినప్పుడు మొక్కలువిఱిగి నష్టముచేయును. మొలక నెత్తించకుండఁజల్లుటచే నొకచోట వత్తుగాను మఱియొకచోటఁ బలుచనగానునుండి కలుపుదీయుటకు వీలులేక అడ్డదిడ్డములుగా నుండును గనుక యూడ్చుటయే తగినదని యట్లొనర్చుచున్నారు. ఊడ్చుటకుపూర్వము ఆకుమళ్ళకు సూరేకార

ము, ఎముకలపొడిగాని, ఆముదపుపిండి, తెలకపిండి, వేప
పిండి మున్నగు నూనెతీయబడిన మఱియేపిండి పదార్థము
నైనగాని యెరువువేయవలెను. పిదప యేపుగ నెదిగిన మొ
క్కల నొక్కొక్కతావున నొక్కొక్క మొక్కచొప్పున
నాటవలెను. మూఁడునాలుగు మొక్కలను గలిపి నాటిన
యెక్కువలాభమను భ్రాంతియేగాని నాలుగు మొక్కల
ను నాటినప్పుడు 26 మళ్ళధాన్యము లభించినట్లును ఆసం
వత్సరమందట్టి ప్రదేశములో నొక్క మొక్క నాటుటచే
34 మళ్ళ 8 శేర్లు ధాన్యము పండినట్టును తెలియుచున్న
ది. కావున నొక్కొక్క మొక్కచొప్పున నాటుటుచితము.
ఈ మొక్కలను తొమ్మిదంగుళముల దూరము చొప్పున
నొక్క యంగుళములోతుగా నాటవలెను. అమెరికాలో
ని "మిస్సెస్సిపి" మొదలగు నదీతీరములందు "కెరొలీనా
వరి" అను దానిని బండింతురు. ఈ "కెరొలీనా" వరి మ
న ప్రాంతముల కుపయుక్తమగునో కాదోగాని "సెంట్రల్
ప్రావిన్సు"లనుండి "చెన్నపురి యగ్రికల్చరల్ డిపార్టు
మెంటు" వారిచేఁ దెప్పింపఁబడిన "బంకు"వరి యీప్రాం
తములందు సాగుచేయఁ బడుచున్నది. ఇది చవిటినేలలో
గాక బంకమట్టిగల తావులలో నీరునిలుకడగానుండని వా
లుగల తావులందు చక్కగాఁ బెఱుగును. దీనికి యెరువు
ముఖ్యావసరము. యకరమునకు రెండుమూఁడుబండ్ల ప
చ్చియాకెరువును 15-20 బండ్ల పశువులపెంట యెరువు
గా వేయవలెను. మొక్కలు పెఱుగుచుండునప్పుడు పదిదిన
ములకొకసారి 500 రతులకు తక్కువగాకుండ 800 రతుల
కెక్కువగాకుండ గానుగపిండిని రెండుమూఁడుసార్లెరువు
గ వేయవలెను. సెప్టెంబరున విత్తులను సిద్ధమైన మళ్ళలోఁ
జల్లి నెలదినములు బెఱుగనిచ్చి పిదపఁ బొలములో నాట
వలెను. పొలముయొక్క సత్తువ ననుసరించి నాలుగునెల
లకే నీపైరుఫలించును. ఆరు చెన్నపుకొప్పు నారొకయక
రమునకు సరిపోవును. 20 యకరములు భూమిగలవారి
కొకయకరపునారు మడికావలసివచ్చును. ఈ వరియాకు
వెడల్పుగను పొడుగాను నుండును, పెద్దగాలికి సైతమిదిచె
డిపోదు. దీనికి నీరంతగా యవుసరముండదు. నేల చెమ్మ
గనుండినఁజాలును. ఈధాన్యము సన్నముగను బొడవుగ
ను బియ్యము మిగుల ధావళ్యముగలిగి జిగురుగలపిండి ని
చ్చునదిగాను నుండును. దీనిగడ్డి పశువులకు మిక్కిలిరుచి
కరమగు మేఁతగానున్నది. "శివగిరి హోంఫారము" లో
నీపైరునకు "అడవినీలియాకు"ను బైరుచేసి దానిని పొ
లములోనికి దున్ని కల్పించి యెరువువేయుటచే సాటిపొ
లములకంటె నెక్కుడు లాభకారిగనుండినట్లు కృష్ణాజిల్లా
మునగాల యెస్టేటులోని ఫారం సూపరింటెండెంటు అగు
పింగళి వెంకయ్య యం. ఆర్. యే. యస్. (ఇంగ్లాండు)
గారు చెప్పుచున్నారు. కావున భూములకు యెరువు
ముఖ్యాధారము. పనిముట్లును శ్రేష్ఠమైనవిగా నుండవ
లెఁగావున నీ 1911 సంవత్సరమునందు జరిగిన "అలహా
బాదు వ్యవసాయ వస్తుప్రదర్శనమునకు గొనితేఁబడిన
నాగళ్ళలో 4½ అంగుళముల వెడల్పును 9 అంగుళముల
లోతును దున్నగల పాంచాలదేశమందలి "లాయల్‌పూ
ర్" పట్టణమందుగల వాల్‌కార్ట్సు అను కంపెనీవారిచేఁ
బ్రదర్శింపఁబడిన "రాజాచిల్డుప్లో" అను నాగలి వేసవికా
లమందు బీటారిన పొలమును దున్నుటకుపయుక్తమైనది.
దీనివెల షుమారు 30-0-0 లుండును. వర్షకాలమునకు
పూర్వము రెండుమూఁడుసార్లు దున్నియుంచి పిదపపైరు
చేయుటచే నెక్కుడు లాభకారి గనుక నీపైచెప్పఁబడిన
నాగలి యిందున కుపయోగించును. ఇట్టిదియే కలకత్తా
లోని "అక్టేవియస్ స్టీలు అండుకో" వారివల్ల రు. 25 ల
వెలగలదియుఁ బశ్చిమోత్తర పరగణాల ఎగ్రికల్చరల్
డిపార్టుమెంటువారిచే "మెస్టన్, వాట్సు" అనునవి రు.
5-0-0, 9-0-0 లు వెలగలవి ప్రదర్శింపఁబడినవి. ఇట్టి
నాగళ్ళచే నెండకాలమున పొలముదున్ని పిదప సాగుచే
యుటచేమిగులఫలించును. మఱియుఁ దూర్పోతపట్టుటకును
ధాన్యమునూర్చుటకునుమరలుగలవు. వాయుదేవునకై ని
రీక్షింప నక్కరలేకయే వలసినప్పుడు తూర్పోతపట్టుటకు
పైనఁజెప్పఁబడిన లాయల్‌పూర్‌లోని వాల్‌కార్ట్సుబ్రదర్సు
వారిచే నొకమర రూ.150 లకు విక్రయింపఁబడుచున్నది.
నూర్చుమరలకు ఆవిరిసాయము కావలసినవగుటచే వెల
లు హెచ్చుగనున్నవి. కాని యెడ్లచేనెక్కుడు శ్రమబడ
కుండునట్లుఁ బలువురుగలిసి గ్రామమున నొక్కమఱి

నైనను దెప్పించుకొననగును. ఇందునుగుఱించి కలకత్తా లోని బర్న్ అండు కో అనువారికి వ్రాసి తెలుసుకో నగును. ఈపైవిషయములను జక్కగవిమర్శించి శ్రద్ధగలిగి వ్యవసాయము చేయువారికి చక్కని ఫలసాయము లభించు ననుట నిర్వివాదాంశము. వరిజాతులలో పెద్దకుసుమ, పిన్నకుసుమ, ఢిల్లీభోగాలు, రాజనాలు, పాల్గాట్రగడ్డ, ఆట్రగడ్డ, మొలకొలకులు, కాకిరెక్కలు అను యెన్నియో జాతులుగలవు. వీటియన్నిటిలో ఆట్రగడ్డయని చెప్పఁబడు అక్కుళ్లు శ్రేష్ఠమందురు. పసిబిడ్డలకు గుజ్జనగూడుగా ఢిల్లీభోగాలను వాడుదురు. అపరధాన్యమును బండించు మెట్టపంటకును వరిపండింపఁబడు మాగాణిపంటకును లాభము విషయములోగల తేడాజనుల కనుభవవేద్యమయియే యున్నది. ప్రతి యైదేండ్లకును వర్తక శాఖాధిపతులవలన వ్యవసాయపు లెక్కలు ప్రకటింపఁబడుచున్నవిగదా! అందు చెన్నపురి రాజధానియందు,

| | | |
|---|---|---|
| వరి | 10359209 | యకరములలోను |
| గోధుమలు | 18740 | ... |
| బార్లి | 2921 | ... |
| జొన్నలు | 5054091 | ... |
| కంబు | 3769970 | ... |
| రాగులు | 2483654 | ... |
| మొక్కజొన్నలు | 125899 | ... |
| ఉలవలు | 132297 | ... |
| పప్పుదినుసులు | 6801117 | ... |
| ఆహారవస్తువులీ | 2,87,47,898 | యకరములలోఁ |

బండింపఁబడుచున్నవి.

| | | |
|---|---|---|
| నూనెగింజలు | 2528837 | యకరములలోను |
| సువాసనద్రవ్యాదులు | 556676 | ... |
| చెఱుకు | 182138 | ... |
| ప్రత్తి | 2023538 | ... |
| నీలిమందు | 94750 | ... |
| పొగాకు | 20093 | ... |
| దాచనచెక్క | 2705 | ... |
| గోగునార | 229 | ... |
| మేఁతపైరులు | 235406 | సాగగుచున్నవి. |

ఈ లెక్కలనుబట్టి చూడఁగా నన్ని పైరులలోను "వరి"యే యెక్కుడు భూమిపై సాగుచేయఁబడుచున్నట్లు తోఁచుచున్నది. కావున "వరిపంట"యే మిగత పంటలన్నిటికంటె సేవ్యానుకూలమును లాభకారియునగు పంటగాఁ బరిగణింపఁ బడుచున్నయది యని వేఱుగఁజెప్పవలయునా? మఱియు మెట్టపంటలన్నిటిలో "నువ్వులపంట" లాభకరమందురు. వరిపంటకును, నువ్వులపంటకును నగు ఖర్చులించుమించుగా సమానమేయై యుండవచ్చును. వరికి పుట్టి 1-కి రు. 50 చొప్పునను నువ్వులకు పుట్టి 1-కి రు. 130 చొప్పున వెల యుండవచ్చును. గాని యకరమునకు సాధారణముగా వడ్లు పుట్టెడు పండును, నువ్వులు అరపుట్టియే పండుచున్నవి. ఇందులో "నువ్వేఁకు నూఱు తెగుళ్లు" అను నటుల ధాన్యము తయారై యింటికివచ్చువఱకును సంశయాస్పదము. వరికట్టి సంశయము కలుఁగనేకలుగదు (అనఁగ వరిపంటకు నష్టమువచ్చుట బహుయరుదు) కావున నెన్నివిధములఁ జూచినను వరిపంట మిగుల లాభకరమనునదిగనే కన్పట్టుచున్నది. కాని యధిక వర్షములవలనఁగాని మురికినీరు పోవుటకు వసతిలేకపోవుటవల్లఁగాని యొకప్పుడు బాడవ పొలములకు నష్టమునంభవించుచున్నది. ఇట్టినేలలకు "సాంబవ" అనురకపు వరికెక్కుడునీరు కావలసివచ్చును గనుక యీరకపువరిని పైరుచేసికొనుచు గరువు భూములకు తదనుకూలమైన "పాల్గాట్రగడ్డ" మొదలగు రకములను బండించుకొనుచు గర్షకులెల్లరు నుచితరీతిఁ బాటుపడుచుఁ దత్ఫలంబుగ నైశ్వర్య సమన్వితులై కీలసిల్లు దయామయుండగు సర్వేశ్వరుండనుగ్రహించుగాక.



# నిమ్నజాతి సముద్ధరణము.

మ. రా. శ్రీ, మంగిపూడి - వేంకటశర్మగారిచే వ్రాయబడినది.

ఉ॥ భారతవర్షమందు ఘనపండితులై స్మృతికర్తలౌ మండలిన్
పేరువహించినట్టి మనువా ద్విజబాహుజ వైశ్యశూద్రులన్
నాలుగుజాతులే కలవు «నాస్తితుపంచమ» యంచుమున్నె ని
ర్ధారణచేసి చెప్పెను గదా! మరి దీనికిఁ కేల తర్కముల్ !

ఉ॥ గీతలు బోధచేయుచెడఁ గ్రీడికిఁ గృష్ణుఁడు చెప్పలేదె; నా
చేతనె నాల్గుజాతులు సృజింపఁబడెన్ గుణభేదయుక్తి నం
చేతని నిన్ బ్రమాణముగ హిందువులెంతురుగాదె గీతలన్
జాతిగఁ జెప్పరయ్య; యిఁక పంచమజాతి యదెట్లు వచ్చెనో ?

చ॥ మనుస్మృతులెల్ల సంకరసమాజములన్ శ్వపచాదులంచుఁ జె
ప్పెనుగద! వర్ణసంకరులు పూర్వమువోలె జనాదరంబునన్
మనుచుండరుగాదె! పంచమజనంబులకీగతి యెట్లువచ్చెనో
కనుఁగొని తీసివేయుటయె కర్జము దేశ పురోభివృద్ధికిన్.

చ॥ అరయఁగ వంగదేశమునయందు వసించెడు నామశూద్ర లీ
తరగతిలోనివారలె కదా మనసంఘమువారు వారి నా
దరణము సేయకుండిన కతంబున నేకద. కొనవేలుగా
దురకలజేరి హిందువుల మారుచునుండిరి మేరమీరుచున్.

ఉ॥ వంగధరిత్రియందు మనవారు తురుష్కులతోడ బోరు ప
ట్టంగడు నామశూద్రులు తటస్థులుగా దీనికి మహేతు వా
వంగదపుం జనంబు మనవారలొకింతయు గారవింపక
భంగి నిరాకరించుటని పల్కరిగాదె స్వదేశనాయకుల్.

కం॥ మలకలలో పలగొందఱు
గల్గసిరిహిందువులు మరియు క్రైస్తవులందున్
గలసిరిక గలయుచుండిరి
వెలివేయుచు మన మగౌరవించుటవలనన్.

ఉ॥ క్రైస్తవులెంతయేని తమకంబున నందఱి సాదరించుచున్
బ్రహ్మణిజేసియన్నమును వస్త్రము విద్యయు నిచ్చిప్రోచుటన్
విస్తరసంఖ్యమానవులు వేడుకగ్రైకొని రామతంబు వి
ధ్వస్తములయ్యె దక్షిణమతంబులు సర్వమనుష్య హీనతన్.

చ॥ అరయమతంబులోని పరమార్థము చెప్పని కారణంబునన్
దరుముగఁ బాములల్ పరమతంబులలోపల జేరుచుండి రీ
కరణిని గోట్లకొద్ది ప్రజ క్రన్నన సన్యుల జేరిపోయినన్
హారహర! గుప్పమౌచు హైందవసంఘము రూపుమాయదే.

తే॥ వంగదేశీయులిప్పుడీ భంగపాటు
గాంచిపంచములను గారవించుచున్న
వారు మరియు మహారాష్ట్రప్రజలుగూడ
యుక్తరీతిని బ్రేమించుచున్నవారు

ఉ॥ జ్ఞానవిహీనతన్ శ్వపచజాతుల కీదురవస్థకల్గె ను
జ్ఞానధనంబు విద్దియ యొసంగును గావున విద్యనేర్పినన్
మానవధర్మముల్ దెలిసి మానుగ వర్తిలి యీమతంగజుల్
మానవులై చరింతు రభిమానము మానము జ్ఞానమేర్పడన్॥

తే॥ గాయపాటంబు దలఁచి దేశీయులందు
సాధుభక్తులు సంఘ సంస్కార పరులు
మాలలకు జ్ఞాననేత్రంబు మమత నొసగ
జతనములు సేయుచున్నారు శక్తికొలది.

తే॥ పశ్చిమపుదేశపు మతాధిపతులలోన
జ్ఞానులగు వారలీ స్థితిగతుల జూచి
పంచములకెల్ల విద్యజెప్పించి గౌర
వించి దరిజేర్ప నంగీకరించినారు.

సీ॥ ఆర్యసామాజికులతిదయాదృష్టి నం
త్యజాల బ్రోవగ దీక్షదాల్చినారు
బ్రహ్మసామాజికుల్ ప్రబలానురాగులై
వారిపై దయమాడ్కి బరపినారు
సమతదివ్యజ్ఞాన సామాజికులుగూడ
వారిగాచెడుకోర్కి మీరినారు
రామకృష్ణ వివేక సామాజికులు సదా
వారియభ్యుదయంబె కోరినారు

తే॥ వరబరోడా మహారాజవరునివంటి
స్వీయసంస్థానప్రభుండు శ్రీపీఠికాపు
రాధిపతులగు సూర్యరాయాది విభులు
వారిరక్షించుదారినే చేరినారు.

తే॥ మనము మాటనుదక్కించుకొనకయున్న
గార్యమాగదు కాలమే గడపజేయు
దేవుడే సాయము సేయు దీనతతికి
జేరి తోడ్పడరయ్య దేశీయులార.

## పంచమ పరిదేవనము.

సీ॥ పరమదయా సత్య శౌచసంపదలొప్ప
వర్తించు భూసుర స్వాములార!
రహి నాత్మదేశోద్ధరణ శీలమున మించి
పరగెడు క్షత్రియప్రభువులార!
వరభాగ్యమున మించి పటుదానకర్ణులై
తనరారు వైశ్యరత్నమ్ములార!
కాయకష్టమున దేశీయవృద్ధికి ధన
ద్రవ్యముల్ గూర్చు శూద్రవరులార!

తే. దీనజనులము మేము మీదేశజనుల
మాదివారము మీకు మీసోదరులము
పతితులైనాము మాదుదుర్గతి వోలంచి
జ్ఞానధనమిచ్చి మమ్ము బ్రోవ బూనరయ్య.

సీ॥ వాత్సల్యమున నాత్మవత్సర్వభూతాని
యనుపల్కు మనమున నందరయరయ్య!
అర్థిఁ బరోపకారార్థం శరీరమఁ
బలుకు మీమదిలోన నిలుపరయ్య!
కరుణమై బాపాయ పరపీడనమ్మను
నీతి డెందమునఁ గణింపరయ్య!
సారిడి సర్వేజనా స్సుఖినో భవంతను
ధర్మంబు నెదలోన దలపరయ్య!
తే॥ మాపయిని సర్వసమతను జూపరయ్య!
కూర్మి మెయి మాకు మేలొనగూర్పరయ్య!
మమ్ము బాముల బెట్టక మనుపరయ్య!
మాకు సౌఖ్యంబు సమకూర్చి సాకరయ్య!

సీ॥ మా మడ్డితనము మా మాలిన్యమును జూచి
దయ రాదటయ్య సధర్ములార!
మా యవివేకంబు మా నీచతను జూడ
జాలి లేదాయె నా సరసులార!
మా యిండ్లు వాకిండ్లు మా దరిద్రత జూడ
హృదయంబు కరగదే సదయులార!
మా వాలకంబులు మా దుస్థితిని జూడ
గన్నీరు గారదే యన్నలార!
తే॥ మమ్ము మన్నించి యుద్ధరింపగను మీకు
బుద్ధి పుట్టక పోయెనే పుణ్యులార!
మేము మీ సోదరుల మన్న మేలిమాట
చిత్తమున దోచ లేదె దేశీయులార!

సీ॥ కుక్కలకంటె దక్కువవారమైతిమా
మమ్ము మీ వాడలఁ గుసలనీరు
కాకులకంటె జుల్కదనంబె యైతి మా
మమ్ము మీదవ్వులఁ గుసలనీరు
మార్జాలములకంటె మరిహీనమైతిమా
మమ్ము మీ యిండ్లలో మసలనీరు
అరయదున్నలకంటె నధముల మైతిమా
మమ్ము మీ వాకిండ్ల మసలనీరు
తే॥ శల్లకంటెను గొల్లపాట్లెల్లకంటె
మీకు గొరగాక పోతిమా తాకనీరు
సుగుణమణులార న్యాయంబు జూడరయ్య!
మేము మీ సోదరులము మమ్మ మురయ్య!

సీ. అభిమానపుత్రికలని మాకుల స్త్రీల
గాధిరాజసుతుండె గారవించె
తనసభాస్థానమందున బ్రవేశంబిచ్చి
యా హరిశ్చంద్రుడే యాదరించె
ఘనుడు మా రోపంతుడను మహాభక్తుడే
మా జాతికల్లుడై మైత్రి గూర్చె
పుడమి వేల్పులకంటె మును భోజనము వెట్టి
యల యేకనాథుడే యశము దెచ్చె
తే॥ వారు మీవంటి నేతుల్కులల్ గారటయ్య!
వారు మావంటి మాలలు గారటయ్య!
మమ్ము వెలివేసి తోసి యధర్మమ్మటయ్య!
చిన్న బుచ్చక మము జెంత జేర్పరయ్య!

సీ॥ మా యన్న దె మిమ్ము మోయు నట్టులు మమ్ము
భూమాత మును దీవి భూమిదేవి
మీకు వెన్నెలగాచి మాకు గాయుట లేదె
చలువల పరసీమ చందమామ
మీమీద నేగాని మామీద వీవడే
సరస సౌరభశాలి చల్లగాలి
వెల్గు వేడిమి యు మీకు గల్గించి మాకీడె
భవ్యసౌఖ్యకరుండు భాస్కరుండు
తే। కురిసి మీపైని మాపైని గురియకున్నె
సకలసస్యావనసుకీర్తి జలదమూర్తి
దైవసృష్టికి బక్షపాతంబు లేదు
సృష్టి నీక్షించి తెలియుడీ! శిష్టులార!

సీ॥ శుచి లేదనుచు మమ్ము జూడరాదందురా
పరిశుభ్రతను మాకు గరపరాదె!
పరమ మూర్ఖులు మీరు పనికి రాగందురా
తెలివి తేటలు మాకు దెలుపరాదె!
సద్గుణంబుల మీరు సాటి రారందురా
మహిత బుద్ధులు మాకు మప్పరాదె!
కడు వినీచులు మీరు కలయరాదందురా
నెరతనంబు కుమాకు నేర్పరాదె!
తే॥ అతిదరిద్రులగుట రోతుమందు రేని
సిరిగలుగు మార్గములు మాకు జెప్పరాదె!
భూతిదయయుంచి పటుసానుభూతి నించి
శ్రేయములు గూర్పరయ్య దేశీయులార!

సీ॥ రాజ్యాంగతంత్రజ్ఞ రాజి మెచ్చగ ధరా
రాజ్యమేలిన మహారాజులకును
జ్ఞానప్రదాయక గ్రంథకోటిని గూర్చి
సత్కీర్తి వడసిన సత్కవులకు
విజితేంద్రియతనొప్పి వీతరాగత మోక్ష
మార్గదర్శకులైన మానులకును
సకలజీవనసౌఖ్య సాధనంబులు జూపు
లోకజ్ఞులగునట్టి లౌకికులకు
తే॥ దావలంబైన మావంశమీవిధాన
కేవలంబైన దుస్థితి గీడ్వడంగ
నావిలంబయ్యె మామనుకేవపడక
క్రేవలం జేర్చి సత్కృపఁ బ్రోవరయ్య॥

శ్రీ రాజదంపతులకు బొంబయి యొసంగిన స్వాగతము.





Triumphal Arches erected in Bombay to receive Their Imperial Majesties.

1. The First Arch
2. Saracenic Arch.
3. The Cotton Arch.

శ్రీరాజదంపతులకు స్వాగతం బొసంగుటకై బొంబయిలోఁ గట్టఁబడిన వివిధ తోరణములు.

1. మొదటితోరణము.
2. పారసీక తోరణము.
3. ప్రత్తి తోరణము,

State Eutry into Delhi.



శ్రీ రాజదంపతులు ఢిల్లీనగర ప్రవేశము. జుమ్మామసీదు ప్రాంతము.



State Entry into Delhi.

శ్రీరాజదంపతులు ఢిల్లీనగరప్రవేశములోఁ బోవుట.



Laying th Foundation Stone to the Edward Memorial.

శ్రీపంచమజార్జిరాజేంద్రుడు శ్రీఎడ్వర్డు స్మరణచిహ్నమునకు శంకుస్థాపనము చేయుట.

Their Majesties going to the Pavillion.



శ్రీరాజ దంపతులు అపోలో బందరునుండి మంటపమునకు బోవుట.

# స్త్రీల గోణుకుడు నిలుపుము.

క్రొత్తరీతిని తయారుచేయబడినది.

## కామినియా ఆయిల్ (రిజిష్టరు)




ఏస్త్రీలకు తమ వెంట్రుకలు సుందరముగా నుండవలెనని, రాలిపోకుండనని కోరుదురో వారు బజారులో దొరికెడు పనికిమాలిన నూనెలను వాడకూడదు. ఎందుకనిన పనికిమాలిన నూనెలను వాడకూడదు. ఎవరికైన వెంట్రుకలు యేకారణముచేత రాలిపోవుచున్నవో తెలియనివారు ఆనూనెలను తయారుచేయుచున్నారు. ఈసంగతి స్త్రీలు ఆలోచించవలయును. ఈకామినియానూనె యూరోపాలో పెరిగెడు క్రొత్తమూలికలనుండి తయారుచేయబడినది. ఈనూనె వెంట్రుకలనురాల్చు పురుగులను నాశనముచేయుటవలన వెంట్రుకలు రాలక తిరిగి పెరుగుచున్నది.

ఈనూనె వెంట్రుకలను పట్టువలె నున్నగజేసి మెదడును చల్లగానుంచును. ఈనూనె విద్యార్థులకు ఒక వరరూపమై యున్నది.

కామినియానూనె సీసాతో "వెంట్రుకలు దాని ఆరోగ్యము" అనెడు పుస్తకము చుట్టియుండును.

వెల సీసా 1-కి రూ. 1-6-0. 3 సీసాలుకు రూ. 2-10-0. వి. పి. ఖర్చులు వేరు.

ధాతువికార రోగములకు అమోఘమైన మందు.

## ప్రొ. జేమ్సుయొక్క విద్యుచ్ఛక్తి వర్ధకమాత్రలు.




ఈమాత్రలు ధాతువికారసంబంధమైన రోగములకు అమోఘమైన ఔషధము. బాల్యసంభోగమువలన గలుగు ధాతువికారము, ఇంద్రియము పల్చబడుట, స్వప్నస్ఖలనము, మూత్రముతో ధాతుపడుట, తలతిరుగుట, కన్నులు చీకటికమ్ముట, కాళ్ళులాగుట వెన్నుపోటు, నీరసము మొదలగు ధాతువికార రోగములకిది రామబాణమువంటి మందు.

| | | | |
|---|---|---|---|
| 25 మాత్రల 1 సీసా వెల | రూ. 1-4-0 | 40 మాత్రల 1 సీసా వెల రూ. | 2-0-0 |
| 3 సీసాలు | 3-8-0 | 3 సీసాలు | 5-8-0 |

సోల్ ఏజంటు:— ధి ఆంగ్లో ఇండియన్ డ్రగ్ కెమికల్ కంపెని,

నం. 154 జుమ్మామసీదు, నం. 2 బొంబాయి.

అన్నిరకముల మందులు విక్రయింపబడును.

# ప్రాక్ప్రపంచప్రబోధము.

ప్రకృతి జాతములకు ప్రబోధప్రసుప్తులు సహజావస్థలు. చరాచర ప్రపంచమీ యవస్థాద్వయబద్ధము. జాగ్రన్నిద్రలు దివారాత్రులవలె నవిచ్ఛిన్నములు. ప్రజాగరము సుషుప్తికిని సుషుప్తి ప్రబోధమునకును గారణములు. కాలావచ్ఛిన్నములైన పదార్థములకివి సహజస్థితులు. పరమాణువులు మహాభూతము లీస్థితిగతములు. నశ్వరములైన దేహములీ దశాధీనములు. వికారిణ్యాది బ్రహ్మపర్యంతముగల జీవజాలమునకీ ప్రవృత్తి నివృత్తులు సహజ సిద్ధములు. సామాన్యభావనలో నీవృత్తిభేదమె వృద్ధిక్షయములు. ఈయవస్థాభేదమువలన వ్యక్తికి, కుటుంబమునకు, సంఘమునకు, జాతికి వృద్ధిక్షయములుసిద్ధావస్థలు. ఒకపురుషునిప్రభ కొంతకాలము హెచ్చును. ఒకసంఘపుబలము కొంతకాలము పెరుగును. ఒకజాతిప్రతాపపౌరుషములు కొంతకాలము వర్థిలును. కాలక్రమమున సకలమును మహాలయావృత్తములో మునుగుచున్నది. ఈనిర్గమమున కాగమనమునకువలె దేశభేదముగాని పాత్రభేదముగానిలేదు. హేతునిర్ధారణ మతిగహనము; కార్యకారణ నిరూపణ మతిదుస్తరము. నిర్గమము పునరాగమనముగఁ బరిణమించుచున్నది. ఇది సృష్టివైచిత్ర్యము, భగవత్సంకల్పము. ఈసంకల్పసిద్ధికై సకలవస్తుజాలము పరివర్తనాయత్తమగుచున్నది. పరివర్తనము లోకస్థితి. ఈస్థితి ప్రపంచ చరిత్రమువలన సుబోధ్యమగుచున్నది. ఒకయుగమున హింద్వార్యుల పరిజ్ఞానము లోకము నుద్ధరించినది. ఒకకాలము ననస్సిరియనుల శాస్త్రాభినివేశము లోకాభ్యుదయమునకుఁ దోడ్పడెను. ఒకసమయమున నైగుప్తుల శిల్పకళాదక్షత్వము ప్రపంచసౌఖ్యమున కనుకూలించినది. ఒకవేళను పారశీకుల ప్రజ్ఞాపౌరుషములు ప్రపంచ సౌభాగ్యమునకుసాధనములైనవి. ఒకప్పుడు చీనాదేశీయుల బుద్ధికుశలత ప్రపంచ కళ్యాణమునకుఁగారణమైనది. ఒకకాలమునయవనరోమకుల నాగరికత్వము లోకాభివృద్ధికి సాధనభూతమైనది. ప్రాచీనలీనసామ్రాజ్యములవిజ్ఞానము ప్రస్తుతకాల పరిజ్ఞాన నిర్మాణమునకు హేతుభూతమైనది. లయావృత్తములో ననుపయోగ నిర్మాణములు లీనము నొందును సుపయోగ రచనలు శేషించి యుండును. హిందార్యుల ప్రాచీనపరిజ్ఞాన మిన్నియవాంతరములలోను నశించక శేషించియుండుట కిదియె కారణముగనుండును. ప్రస్తుత ప్రాగ్దేశీయుల ప్రబోధమునకు ప్రత్యక్షకారణములు పాశ్చాత్యుల సంసర్గమును జపానుదేశీయుల దేశభక్త్యుత్సాహములును పరోక్షకారణము నూతనయుగ ధర్మమునునై యుండును. కారణము లెవ్వియైనను ప్రాచ్యుల గాఢనిద్రకు భంగముగలిగినదనియును ప్రబోధ మేర్పడినదనియును సర్వజనాంగీకారము నొందుచున్నది.

## సమీప ప్రాగ్దేశము.

దేశచరిత్రములకును నితర విషయములకునుఁ బ్రామాణికులైన పాశ్చాత్య చరిత్రకారులచేఁ బ్రాగ్దేశము మూఁడుభాగములుగ గ్రహింపఁబడుచున్నది. మొదటిది సమీప ప్రాగ్దేశము. తురుష్క-సామ్రాజ్యము తత్పరిసర దేశములీ భాగాంతస్థములు. ఈజిప్టుదేశమును నీ భాగమునకు జెందియున్నది. దుర్బలదేశముగఁ బరిగణింపఁబడిన తురుష్క-దేశములోఁ బ్రబోధమేర్పడి నిరంకుశాధికారియగు నబ్దుల్ హమీదు 1909 ఏప్రిలులో నిర్గమించి నిజమిత్రపాలనమున కెడమిచ్చెను. తురుష్క-దేశమిపుడు ప్రజాస్వామ్యత్వపాలనాయత్తమై రేషద్ ఎఫ్సెండిసుల్తానుచేఁ బాలింపఁబడుచున్నది. దేశభక్తుఁడు కేమల్ బె విరచితగ్రంథములు జనుల నుత్సాహపూరితులం జేసినవి. విద్యావంతులైన యవ్వన తురుష్కులీ యుత్సాహప్రోత్సాహితులై పరివర్తనమునకుఁ గారకులయిరి. వారిదేశాభిమానోత్సాహములవలనఁదురుష్క-సామ్రాజ్యములో నూతనశక మేర్పడినది. దేశములోఁగల జాతిమతమత్సరము లంతరించుచున్నవి. ఆరంభోచితవిద్య వ్యాప్తిఁగాంచుచున్నది. ప్రస్తుతసామ్రాజ్యము ల బలవైభవ

ముల కాధారభూతమైన యుద్ధనౌకాదళము నిర్మింపఁబడుచున్నది. స్త్రీలు ఘోషాపద్ధతిని నిరసించుచు స్వేచ్ఛాస్వాతంత్రముల నభిలషించుచున్నారు. ఈపరివర్తనము దేశసంక్షోభములేక తురుష్క యువ్వకులచే శాంతభావముతో నిర్వర్తింపఁబడినది. తురుష్కదేశము తురుష్కులకు స్వస్థలముగాదు. తురుష్కులు పదునాల్గవశతాబ్దాంతమునను పదియైదవ పదునారవ శతాబ్దములలోను యూరపుదేశములో దమసామ్రాజ్యమును స్థాపించిరి. ఒకప్పుడు పాశ్చాత్యదేశము లన్నియునుఁజేరి తురుష్కుల సంహారమునకై క్రైస్తవ మతాభిమానాస్త్రమునుఁ బ్రయోగించెను. ఈమతాభిమానావేశము యూరపుదేశములు తురుష్కప్రతాపాగ్ని కాహుతులుగాకుండఁ గాపాడినది. తురుష్కదేశములోఁ బ్రాచీప్రతీచులకు నన్నిహితసంయోగము గలిగినది. యూరపుదేశీయులు మహమ్మదీయ సామ్రాజ్యప్రజలుగ నున్నారు. ఈసామ్రాజ్యజనసంఖ్య 2,50,00000. తురుష్కరాజ్యాధిపతి మహమ్మదీయ మతాధ్యక్షుఁడుగఁ బరిగణింపఁబడుచున్నాడు. భూవలయములోఁగల 22,50,00,000 మహమ్మదీయులీ సామ్రాజ్యముపైఁ దమవీక్షణమునుఁ బ్రసరింపఁ జేయుచున్నారని యిటలీ తురుష్కదేశములకు నడుమను జరుగుచున్న ట్రిపోలియుద్ధములో మహమ్మదీయులు చూపుచున్న యధికానుకంపమువలన స్పష్టమగుచున్నది. మహమ్మదీయులలో జాతిభేదములేదు సానుభూత్యధికము. తురుష్కదేశ ప్రబోధము మహమ్మదీయప్రపంచ ప్రబోధమునకుఁ దోడ్పడుచున్నది. మహమ్మదీయ ప్రపంచమంతయును నొకప్రదేశమున నిమిడియున్నది. ఈప్రబోధము లోకాభ్యుదయమున కుపచరించునదిలేక తెమూరు దండయాత్రలవలెఁ బ్రతిఘటించునది యూహించుట కెవరికిసాధ్యము! ఈజిప్టుదేశము తురుష్క సామ్రాజ్యములోనిదైనను బ్రిటిషుపరిపాలనాధీనమైనది. ఆదేశప్రబోధమును భారతీయుల ప్రబోధమువలె బ్రిటిషు పరిపాలనాయత్తమగుటంజేసి హిందూదేశ ప్రస్తావనలోనది తెల్పంబడును.

రెండవభాగము మధ్యప్రాగ్దేశము. ఈభాగములో హిందూ పారసీక దేశములు చేరియున్నవి. మనకునంబంధించిన మధ్యభాగ విమర్శనమునకుఁ బూర్వము మూడవభాగస్థితి విచారార్హముగనుండును.

### దూరప్రాగ్దేశస్థ జపానుదేశము.

మూడవభాగము యూరపుఖండమునకు దూరస్థమగుటంజేసి దూరప్రాగ్దేశనామమును వహించినది. ఈభాగములో సంపూర్ణప్రబోధమునుఁ గాంచిన జపానుదేశమును బ్రబోధోదయావస్థలోనున్న చీనాసామ్రాజ్యమును నాప్రాంతపు దేశములునుఁ జేరియున్నవి. జపానుదేశీయుల ప్రబోధము ప్రాగ్దేశీయుల కాదరణీయాదర్శముగనున్నది. జపానుదేశీయుల దేశభక్తి సంస్తవనీయము, అభ్యుదయ మాశ్చర్యకరము. విక్రమపరాక్రమములతి విచిత్రములు. స్వాత్మప్రత్యయము సమ్మాననీయము. స్వార్థత్యాగము శ్లాఘాపాత్రము. విద్యావివేకములు విఖ్యాతములు. ఈసద్గుణపుంజము ప్రయత్నపూర్వకముగ వారికి లభించియుండలేదని దేశచరిత్ర పరిజ్ఞాతలకు సువిదితము. ఇతర ప్రాగ్దేశములు నిద్రావస్థలోనున్నపుడు జపానుమేల్కొనెను. పాశ్చాత్యుల నెదుర్కొనుటకు పాశ్చాత్యమార్గావలంబన మవసరమని గ్రహించెను. దేశభక్తులీ ఫలసిద్ధికై స్వార్థత్యాగదీక్షాపరాయణులైరి. జపానుదేశీయులకు గాఢమైన దేశభక్తియు రాజభక్తియు గలదు. వారు తమదేశము దేవదేశమనియును తమరాజు దైవస్వరూపుఁడనియును భావించుచున్నారు. ఇరువదియైదువందలేండ్లవిచ్ఛిన్నముగ దేశమునుఁ బాలించుచుండిన రాజవంశమును గౌరవించుట యొకవింతకాదు. 1868 లో నీక్రింది రాజాజ్ఞలు ప్రకటింపఁబడియె:—

1. దేశపరిపాలనము జనాభిప్రాయానుసరణిని నడుపుటకుఁ బ్రాత్యామ్నాయసభలు స్థాపింపఁబడును. 2. పాలనాక్రమమును నిర్వహించుటకు శ్రీమంతులు దీనులు సమానబాధ్యతను గలిగియున్నారు. 3. దేశమునందసంతుష్టిలేకుండుట కధికారులును సామాన్యజనులును వారి యిష్టార్థసిద్ధికై పాటుపడుట కభ్యంతరములు గల్పింపఁబడవు. 4. పూర్వదురాచారములు సంస్కరింపఁబడి యాచారవ్యవహారములు ధర్మానుకూలముగ స్థాపిం

పడును. 5. సామ్రాజ్య యోగక్షేమాభివృద్ధికై జ్ఞానసంచయము సకల దేశములనుండియు చేయఁదగును.

ఈశాసన ప్రతిష్ఠాపనకై చక్రవర్తి దన నిరంకుశాధికారమును బరిత్యజించెను ప్రభువులు దమస్వాతంత్ర్యమును విడనాడిరి, ఉత్తమజాతీయులు దమజాత్యభిమానమును దిగఁద్రోసిరి. సట్సూమా, చోషు, తోష, హైజెన్ దేశాధికారులు దమస్వాతంత్ర్యముల రాజార్పితముచేసిరి. సత్కులజాతులైన సమూరై దేశభక్తావతంసులు హిందూ బ్రాహ్మణులవలెఁ దమకులాభిమానముచేఁ బీడితులుగాక జాత్యభిమానమును నీటఁగల్పి దేశాభిమానదీక్షను వహించిరి. ఈపరివర్తనము మెయిజి శకారంభమనఁబడుచున్నది. వేనవేలు జపానీయ యువకులు పరదేశములకేగి విద్యనుపార్జించి స్వదేశాభివృద్ధికై యాశాస్త్రజ్ఞానమునుపయోగించిరి. ఈవిద్యావిభూషితులు హిందూదేశమునందువలె జాతిభ్రష్టులుగను పంక్తిబాహ్యులుగను నెంచబడక దేశోద్ధారకులుగ సత్కరింపఁబడుచుండిరి. స్త్రీలు విద్యావతులును స్వతంత్రసంపద్వతులునునై నృత్యగీత చిత్రలేఖనాదులచే దేశసౌభాగ్యమునకుఁ దోడ్పడిరి. దేశమునందు నూతనపరిశ్రమలు స్థాపింపఁబడినవి. కృషి వాణిజ్యము లభివృద్ధి సేయఁబడినవి. సామ్రాజ్యనిర్మాణమున కత్యవసరమైన సుబలయుద్ధ నౌకాదళము నిర్మింపఁబడినది. విశ్వవిద్యాలయములు స్థాపింపఁబడినవి. ఇతర భాషలలోని యుద్గ్రంథములు భాషాంతరీకరింపఁ బడినవి. నిర్బంధక ప్రారంభోచితవిద్య దేశమునందంతటను వ్యాప్తినిగాంచినది. వేయేల దేశాభ్యుదయమున కనుకూలములైన సదుపాయము లనేకములు గల్పింపఁబడినవి.

## ప్రాచ్యపాశ్చాత్య న్యూనాధిక్యత.

స్త్రీపురుషుల దేశారాధనదీక్ష రుష్యాజపానీయ సంగ్రామములో జగద్విఖ్యాతమైనది. ఆయుద్ధమువలన జపానీయుల సాహసధైర్యములు ప్రశస్తినిఁగాంచినవి. జపాను సామ్రాజ్యము లోకవిఖ్యాత సామ్రాజ్యములలో నొకటిగా బరిగణింపఁబడినది. ఒంటిగట్టుగనుండు బ్రిటిషుసామ్రాజ్యము జపాను సామ్రాజ్యముతో సంధినిఁజేసికొనెను. పరిహాసాస్పదమైన ప్రాగ్దేశనామము సంభావింపఁబడుట కారంభమయ్యెను. జపాను దేశీయుల విజయములు మూలమూలల మ్రోగి ప్రాచ్యులకు నూతనోత్సాహమును గలిగించెను. ప్రాచ్యప్రతీచ్యన్యూనాధిక్యత సిద్ధాంతము విధ్వంసము సేయఁబడెను. ప్రాచ్యపాశ్చాత్య భేదభావము స్వకపోల కల్పితముగాని స్వభావసిద్ధముగాదని విస్పష్టమయ్యె. నల్లవారికి, తెల్లవారికి, పచ్చవారికిం గల హెచ్చుతగ్గులు సాధనసంపత్తివలన గలిగినవిగాని పుట్టుకవలనఁగలిగినవి గావని గ్రహింపఁబడియె. బుద్ధిబలము విక్రమపరాక్రమములు సమాన మానవధర్మములుగాని యొక జాతిసొత్తుగాదని ప్రకటితమయ్యె. జపానువిజయము ప్రాక్ప్రపంచమునకేగాక సకలప్రపంచమునకును మహోపకృతిని జేసెను. దైన్యోపహతములైన ప్రాగ్దేశములందు స్వాత్మప్రత్యయాంకురములు మొలకలెత్తెను. ఈయంకురములు కాలక్రమమున ఫలప్రదములుగాఁగలవు. దుర్వినయ దురాక్రమణ పరాయణులైన పాశ్చాత్యులకు మానభంగము గలిగినది. జపాను దేశమున కాసియాఖండములో నద్వితీయస్థానము లభించినది. ఒక పాశ్చాత్యాల్పద్వీపమిపుడు జగద్వ్యాప్తానల్ప సామ్రాజ్యమున కేలికయైనది. ఈప్రాచ్యాల్పద్వీప భావిభాగ్యమునూహించుటకెట్లు సాధ్యము! ఈరెండుద్వీపముల యవిచ్ఛిన్నాభివృద్ధికిని వాటిద్వీపీయస్థితి గొంతకారణమైనది. ద్వీపీయస్థితి సుబలనావికాదళ నిర్మాణమునకును, నావికాదళ నిర్మాణము వాణిజ్యవ్యాప్తికిని, వాణిజ్యవ్యాప్తి వైభవసంపదలకును, వైభవసంపదలు లోకగౌరవమునకును, లోకగౌరవము స్వాత్మగౌరవమునకును గారణములైనవి. ప్రాక్ప్రపంచప్రబోధమునకుఁ దోడ్పడిన యుభయద్వీప సామ్రాజ్యముల సంయోగము లోకశాంతికనుకూలింపఁగలదు.

## చీనాప్రబోధము.

స్వర్గసామ్రాజ్యమనియభిమానభావముతో నెంచఁబడు చీనాసామ్రాజ్యము ప్రాచీనసామ్రాజ్యములలో నెన్నికగాంచినది. చీనాదేశవాసులుహిందువులవలెఁ బూర్వాచారప్రియులు, పితృదేవతా పూజాతత్పరులు, స్వల్పసంతుష్టులు, కర్మఫలప్రామాణికులు. పరాక్రమణ దౌర్జన్యములచేఁ జలింపఁబడని చీనావారు జపానువిజయముల వలనఁ గన్నులఁ దెరచిరి. చీనా జపాను దేశముల కనాదినుం

డియును సంబంధ మేర్పడియున్నది. మతాచార వ్యవహారములలో సామ్యత్వముగలదు. దేశములు దగ్గరగా నున్నవి. అయినను మేల్కొనుటకుఁ జిరకాలముపట్టినది. పాశ్చాత్యపద్ధతులలో శిక్షితులైన జపానీయులు తమ్ముఁ జయించుటయేకాకఁ బాశ్చాత్యదేశీయ ప్రముఖులైన రష్యనులనోడించుట చీనాదేశప్రబోధమునకు త్తేజమును గలిగించినది. చీనాసామ్రాజ్యాంతర్భాగమగు మంచూరియాకై రష్యా జపానుదేశములు పెనుగులాడుచుండ స్వామ్యత్వముగల చీనాదేశ మసమర్థతను వహించవలసి వచ్చెను. గతించిన నిరువదేండ్లనుండియును చీనాదేశము కల్లోలకలవరభరితమైయున్నది. పాశ్చాత్యపద్ధతులనుఁ గఱచుటకు వేనవేలు విద్యార్థులు పరదేశముల కేగుచున్నారు. దేశాభిమానభావము జనుల హృదయకమలంబులందు వికసింపనారంభించినది. దేశభక్తి యంతఃకలహములుగను విదేశీయ విద్వేషముగనుఁ బరిణమించినది.

## చీనాపరివర్తనము.

బాక్సరుల దుర్నయము పరదేశీయుల ప్రమేయమునకు హేతుభూతమైనది. మంచూవంశజుల నిర్దయనిరంకుశోపేతమైన పరిపాలనము రాజద్వేషముగఁ బరిణమించినది. ఆవంశజుల ప్రతిజ్ఞాభంగము పరివర్తనాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసినది. వారియసామర్థ్యము ప్రజాప్రభుత్వమును స్థాపించుట కనుకూలించుచున్నది. గతనిరంకుశరాజత్వమిపుడు ప్రజాస్వామ్యత్వముగఁ బరిణమించుచున్నది. ప్రజాప్రభుత్వము స్థిరత్వమునుఁ గాంచకమునుపు దేశమెట్టికష్టములపాల్పడనలసియున్నది దురవగాహము. 1773 లో ఫ్రాన్సుదేశమునందు రాజద్వేషమువలన నేర్పడిన పరివర్తనమువలన నాదేశమెట్టి విపత్పరంపరల పాలైనది దేశచరిత్రమునుఁ జదివినవారలకుఁ దెలిసియున్నది. దేశము రక్తమయము సేయబడెను. నిరపరాధులును వధ్యానర్హులునైన స్త్రీలును శిశువులును వధింపఁబడిరి. పాశ్చాత్యప్రపంచమునందలి ప్రజాప్రజాగరణ సకలవిప్లవము త్తేజమును గలిగించినది. కులీనులు సామాన్యులపట్లఁజూపు దుర్వినయదౌర్జన్యము లంతమునొందుట కారంభించినవి. యోధాగ్రగణ్యుఁడు నెపోలియన్ బొనపార్టీయుత్సాహమును యూరపుఖండరాజ్యముల విప్లవార్థమై వినియోగించెను. యూరపుదేశముల సంయోగమీ మహోపద్రవమునుండిఁ బాశ్చాత్యదేశములను గాపాడెను. గ్రేట్బ్రిటనీ సంగ్రామానంతరము యూరపుఖండమునం దద్వితీయగౌరవంబునకు భాజనంబయ్యె.

దుర్మార్గము సన్మార్గముగఁ బరిణమించుట లోకసామాన్యము. ఫ్రాన్సుదేశ విప్లవము యూరపుదేశ ప్రజాప్రబోధమున కస్తిభారము. ఈపునాదిమీద నీదేశములలోఁ బ్రజాస్వామ్యత్వ సౌధము నిర్మింపఁబడినది. లోకచారిత్రమునకుఁ దరుచుగఁ బునరావృత్తము గలుగుచున్నది. యుగములంతరించును. యుగధర్మములుమారును. భూమిజలమయమగును. జలప్రదేశము భూస్థలియగును. నిరంకుశాధికారము నశించును. ప్రజాస్వామ్యత్వము ప్రబలును. ప్రాచీనమతములుమారును. నూతనమతము లుత్పన్నమగును. ఈమహాపరివర్తనాచక్రములో మానవధర్మమొక్కటియె స్థిరతత్వము. తదితరమంతయు నస్థిరము. తత్వము మారుట లేదు. తత్వాశ్రయము మారుచుండును. పాశ్చాత్యదేశములు ప్రబోధోదయావస్థలో సంఘమతసంస్కరణములనవలంబించి కాలక్రమమున రాజ్యపరివర్తనమునకుఁ బూనుకొనెను. ఆసియాఖండములోను నీవిధమున నిపుడు మార్పులు జరుగుచున్నవి. ప్రబోధోదయము జపానీయులసంస్కరణముతో నారంభమైనది. చీనాదేశమునందలి పరివర్తనము రాజ్యాంగపరివర్తనమునకు హేతుభూతము గాఁగలదు. ఈపరివర్తనమువలనఁ బ్రాక్ప్రపంచమునందుఁ బుట్టిన నూతనశక్తి బాలచంద్రునివలె దినదినాభివృద్ధినిఁ జెందుట సహజము.

## చీనాసామ్రాజ్యము.

ఈసామ్రాజ్యము ప్రాచీనసామ్రాజ్యములలో నొకటి. దానిచరిత్ర మవిచ్ఛిన్నముగ నాలుగువేలేండ్లనుండి వచ్చుచున్నది. సామ్రాజ్యవిస్తీర్ణము 43,00,000 చతురపుమైళ్లు. దేశము పర్వతరాజంబులతో విరాజిల్లుచు సుజలపూరితంబులైన నదీనదంబులతో శోభిల్లుచు, ఖనిజసంపదలనుఁ గలిగి, తరులతాసమావృతంబై శోభాయ

మానంబై యొప్పుచున్నది. సామ్రాజ్యజనసంఖ్య 43,82,14,000, చీనాదేశపు జనసంఖ్య 40,72,53,000. చీనాదేశీయులకు హిందువులకువలెఁ బరదేశవాసము దుర్భరము గాదు. ఇతర దేశములందు 90,00,000 చీనావారుగలరు. జనులు స్వతస్సిద్ధముగ మంచిస్వభావముఁగలవారు. సూనృతప్రియులు. శాంతస్వభావులు. ఉత్సాహవంతులు కాని స్వల్పసంతుష్టులు. వ్యవసాయ పరాయణులుకాని పూర్వాచారపరాయణులు. పరాక్రమశీలురుకాని యుద్ధపరాఙ్ముఖులు. పాశ్చాత్యచిత్రలేఖకులు చీనాదేశీయులను దమచిత్రకథలలో దుర్మార్గశిఖామణులనుఁగఁ వర్ణించుట యథార్థవిరుద్ధము. పాశ్చాత్యులు ప్రాగ్దేశీయుల భావావస్థనుఁ గనుఁగొనలేక వ్రాయువ్రాతలు లోకమునకు మహోపకారమునుఁ జేయుచున్నవి. చీనాప్రబోధమువలన నిట్టిదురభిప్రాయములు మారఁగలవు. చీనాదేశీయుల పూనికకు పట్టుదలకు వారిచే నిర్మింపఁబడిన 1200 మైళ్ళపొడవైన కాలువయును 1500 మైళ్ళపొడవైన గోడయును నిదర్శనములు.

## మంచూవంశరాజులు.

చీనాదేశ మనాదినుండియును నిరంకుశాధికారాధీనముగనుండెను. రాజు దేవాంశసంభూతుడని ప్రజలు సంభావించుచుండిరి. కాని ప్రజాహితమె రాజధర్మముగ నెంచఁబడియె. దుష్టరాజులపట్లఁ బ్రజాప్రకోపము న్యాయ్యమని శాస్త్రములచే నంగీకరింపఁబడియె. ఈసిద్ధాంతానుసారముగ నింతవరకనేకతడవలు పరివర్తనములు జరిగినవి. రాజులు రాజ్యభ్రష్టులుచేయఁబడిరి. క్రొత్తరాజులేర్పాటుచేసుకొనఁబడిరి. చీనాతత్త్వవేత్తలు కన్ఫ్యూషియస్ మెన్షియస్ ఈధర్మమునుపదేశించిరి. దుర్మార్గులను శిక్షించుట దైవసమ్మతము. దుర్మార్గప్రభువులను పదభ్రష్టులనుఁజేయుటయును దైవసమ్మతము. ఇప్పుడీసిద్ధాంతమననుసరించియె మంచూరాజులు రాజ్యభ్రష్టులుగఁ జేయఁబడుచున్నారు. ప్రస్తుతపరివర్తనములో రాజదౌష్ట్యమునకు దేశభక్త్యుత్సాహములు దోడ్పడుటంజేసి రాజత్వమె యంతరించవచ్చును. చుట్టమైచూడవచ్చి దెయ్యమైపట్టెననునటులు మంచూవంశజులు 1644లో సహాయమునుఁజేయుటకువచ్చి స్థిరముగపాతుకొనిరి. అప్పటినుండియును సకలాధికారములును మంచూల యధీనములో నుండెను. స్వదేశవాసులైన చీనాదేశీయులు నిర్బంధములపాల్పడిరి. చీనాదేశీయుల కెలుకతోఁకవంటిజడ మంచూలనిర్బంధమువలన నేర్పడెను. చీనావారిశౌర్యపరాక్రమము లనుపయోగములుగఁ జేయబడియె. చీనావారు సకలవిధముల మంచూలకు లొంగియుండవలసి వచ్చెను. పదునెనిమిదవ శతాబ్దమునందుఁ బాశ్చాత్యులీదేశములో నివాసములనేర్పరచుటకుయత్నించిరి. 1840లో నింగ్లాండు చీనాదేశమునోడించి దేశధనములను స్వీకరించెను. 1860లోనుత్తరమున రష్యాదేశమామూరుప్రాంతమును 1881లో నిలిప్రాంతమును నాక్రమించుకొనెను. 1884లో ఫ్రాన్సుదేశము దక్షిణభాగముల నాక్రమించుకొనెను. 1895లో జపానుచేనోడింపఁబడి ఫార్మోసాద్వీపమును లియాంగుటంగు ద్వీపకల్పమును నలుబదియైదుకోట్ల రూప్యములను సమర్పించెను. పాశ్చాత్యదేశములన్నియు నేదోయొక మిషచేతను దేశమును ప్రత్యేకలాభమును బొందుచుండెను. చీనాదేశమును పరదేశీయులు కొల్లగొట్టుకొనుటకున్నటులు దోచుచుండెను. చీనాదేశీయులు బలవంతులయ్యును సంఘీభావములేక పసదలవలె నూరకుండవలసివచ్చెను. రాజ్యాధిష్ఠాతలును ప్రజలును నసహాయులై పరాక్రమణము నాపఁజాలకుండిరి. చక్రవర్తిక్వాంగును 1893లో రాజమాతబంధనములనుండిఁ దప్పించుకొని యనేక రాజ్యాంగసంస్కరణముల నామోదించెను. కాని రాజమాత చక్రవర్తినిఖైదులోఁబెట్టించి వానికార్యనిర్వాహకులం జంపించెను. పరదేశద్వేషరూపధారులైన బాక్సరులు 1890లో నిరపరాధులైన పరదేశీయులవధించి పరరాజసంయోగమునకును దేశోపద్రవమునకును గారకులైరి. మొదట బాక్సరులును పిమ్మట పరరాజసైనికులును పెకింగునగర వినాశనమునకు గారకులైరి. పరదేశరాజులకు చీనావారు 63,75,00,000 రూప్యములను సమర్పించి సంధిగాఁజేసికొనిరి. ఈదుర్నయములకుఁ గారకులు రాజమాతయుయామెకాలోచనలను జెప్పువారును. కానివారికేవిధమైన శిక్షయునుగలుగలేదు. 1903లో జపానునకును రష్యాకును మంచూరియావిషయమై యుద్ధముజరిగిన

పుడు చీనాయసమర్థతను వహించవలసివచ్చెను. 1906-07 లలో నియమితపాలనమును స్థాపించుటకు రాజ్యాధ్యక్షులంగీకరించిరికాని కార్యరూపమును వహించియుండలేదు.

### చీనాదేశసంస్కరణము.

ఈవిషమావస్థలో వివేకినైన యుఆన్‌షికాయి దనయాసచ్ఛక్తిని దేశాభ్యుదయమునకై వినియోగించుచు రాజపక్షము నవలంబించుచుండెను. యుఆన్‌షికాయి చాంగుచింగు టుంగుమొదలగు దేశభక్తులు సైన్యమును సంస్కరించిరి, నూతనవిద్యాలయముల స్థాపించిరి, రాజ్యాంగములసంస్కరించిరి, దేశాభ్యుదయమున కనువగు మార్గముల నవలంబించుచుండిరి. చక్రవర్తియును రాజమాతయును 1908లోఁ బరలోకవాసమునకేగిరి. 1909లో చింగుటుంగు మృతినొందెను. యుఆన్‌షికాయి పనినుండి దీసివేయఁబడెను. 1910లో స్థానికసభలు స్థాపింపబడెను. కాని సభికులు పాలకులచే నియమింపఁబడిన మంచూజాతీయులు. సభలకధికారము పూజ్యము. ఈస్థితిలో నెట్టి కుక్షింభరుఁడైనను విచారాక్రాంత హృదయుఁడుగాకుండునా? చీనాదేశభక్తులకు మూఁడు దేశోపద్రవకారణములు గోచరించుచుండెను. మొదటిది మంచూరాజుల దుర్వినయము, రెండవది యంతఃకలహములు, మూఁడవది పరదేశీయుల యాక్రమణము. వర్తమాన పరివర్తనమువలన మంచూరాజులు రాజ్యమును పరిత్యజించుటచే నొకయనిష్టము దొలగినది. దేశమునందు స్థిరపాలనమేర్పడి చీనామంచూజాతులకు సంయోగమేర్పడినగానిఁ రెండవయనిష్టముపోదు. ఈరెండు యనర్థములు దొలగినపుడు మూఁడవదానివలన బాధకములేదు. సన్‌యాట్‌సేనుక్రింద ప్రజాస్వామ్యత్వపాలనమో మంచూరాజులక్రింద నియమితపాలనమో స్థిరపడుటయును నిరంకుశాధికార మడుగంటుటయును సహజము. ఏదియెటులున్నను చీనాదేశీయులకీపరివర్తనమువలన గాఢప్రబోధ మేర్పడగలదు.

### పీతజాతుల ప్రబోధఫలము.

చీనాదేశపు గాఢప్రబోధ పరిణామము నూహించుట యసాధ్యము. శాంతస్వభావులైన నలువదికోట్ల మానవుల బలపరాక్రమములు లోకవ్యవహార నిర్ణయములందసామాన్యసంబధమును గలిగియుండుటకు సందియంబుండదు. చీనాజపానుదేశములకు సంయోగమేర్పడినా నీసంబంధమధికముగాగలదు. ఈసంయోగముతో నిపుడు శ్వేతజాతుల ప్రభవలె ముందు పింగళజాతుల ప్రభహెచ్చఁగలదు. బౌద్ధమతావలంబనులైన పింగళవర్ణస్థుల ప్రభ దౌర్జన్యపరాక్రమణములకుఁగాక శాంతిస్థాపనకుఁ దోడ్పడవచ్చును. పాశ్చాత్త్యులు జపానువిజయములలోఁ బీతవర్ణములవలన నుపద్రవము నాఘ్రాణించిరి. చీనాదేశపరివర్తనములో నీయుపద్రవము ననేకరెట్లధికముగఁజూడఁగలరు. లోకాభ్యుదయము భగవత్సంకల్పముగాన పీతవర్ణజాతుల ప్రబోధము తదితరముగ వర్తింపనేరదు. చీనాదేశీయులు దమప్రాచీన నాగరికత్వమును సాధుశాంత స్వభావమును శౌర్యపరాక్రమములను లోకశాంతిస్థాపనకయి వినియోగించి భగవన్నియోగముల నిర్వర్తించఁగలరు.

### మధ్యదేశభాగస్థ పారసీకము.

మధ్యప్రాగ్భాగస్థమైన పారసీకములో ప్రబోధమేర్పడినది. కాని యాదేశదురవస్థ వర్ణనాతీతముగనున్నది. పూర్వము యవన (గ్రీసు) దేశమువరకుఁ దమవిజయములను వ్యాపింపఁజేసినఁ బారసీకయోధుల సంతతివారిపుడు పౌరుషహీనులైరి. ఈయసమర్థత యంతఃకలహములకును బరాక్రమణమునకుఁ గారణమైనది. దేశములోఁ బ్రజాప్రాత్యామ్నాయసభ—మజ్లిస్—1906 లో స్థాపింపఁబడినది. నిరంకుశాధికారాభిమాని మహమ్మదాలి 1909 లో విదేశవాసమున కంపఁబడెను. కాని యుత్తరమున రుష్యాయొత్తిడి, దక్షిణమున నింగ్లాండుబలము, దేశమునందు చోరవిప్లవకారుల సంక్షోభము, వెలుపల మహమ్మదాలి దుర్నయము,రక్షణమునకుధనసైన్యాభావము ప్రభుత్వదుర్బలస్థితికి గారణము. ఇంగ్లాండు రష్యాదేశములకు 1907లో జరిగినసంధి పారసీకదేశస్వతంత్రమును గాపాడుట కేర్పడినను నది ప్రయోజనకారిగానుండలేదు. రుష్యాదేశము పారసీక దేశ వ్యవహారములందన్నిటిలోనుఁ బ్రమేయమును గల్పించుకొనుచున్నది. పారసీకులు బలములేని రాజ్యముతోను, ద్రవ్యములేని కోశముతోను, పాలనములేని ప్రభుత్వముతోను, ధర్మనిష్ఠ

లేని శత్రుబలముతోను నిర్జీర్ణులైయున్నారు. పారసీక దేశపు స్వతంత్రమునుఁ గాపాడుటకు బ్రిటిషుప్రభుత్వము పట్టుదలతోఁ బ్రవర్తింపకున్నఁ బారసీక ప్రబోధము సార్థకముగానేరదు. రుష్యాదురాక్రమణమునుండి బ్రిటిషుప్రభుత్వము తురుష్క సామ్రాజ్యమునుఁ గాపాడినటులు పారసీకరాజ్యమును రక్షించవలసివచ్చును. లేకున్న నీప్రాచీనదేశ స్వతంత్రము నామావశిష్టమై ప్రబోధము ప్రసుప్తిగాగలదు. ప్రబుద్ధపారసీకము దనప్రాచీనగాథా విజ్ఞానముచే లోకము నుద్ధరించుటకును బలముచే మహమ్మదీయ ప్రపంచరక్షణమునకును దోడ్పడవచ్చును.

### మధ్యదేశభాగస్థభరతఖండము.

భరతఖండమునందును నితరప్రాగ్దేశములందువలెఁ బ్రబోధమేర్పడినది. కాని ప్రబోధమేర్పడిన నితర ప్రాగ్దేశములస్థితికిని హిందూదేశస్థితికిన్ని వ్యత్యాసముగలదు. ఆ దేశములు స్వతంత్రదేశములు. హిందూదేశము బ్రిటిషుపరిపాలనాధీనము. హిందూదేశ ప్రబోధవిమర్శనములో నీభావగ్రహణ మవసరము. దీని యాధారముననె యీవిషయము యోచించవలసియున్నది. వస్తుతత్త్వావబోధమునకు భావజ్ఞానము సాధనము. కావ్యార్థమును గ్రహించుటకు కవిహృదయజ్ఞాన మవసరము. చిత్రపటపరిజ్ఞానమునకు చిత్రకారభావావస్థ గ్రహణమవశ్యము. భావావస్థనుఁ గనుగొనక వస్తుతత్త్వార్థమునుఁ దెలుసుకొనఁగోరుట ' గ్రుడ్డెద్దు చేనఁబడినటులు. భారతీయ ప్రబోధము నెరుగుటకు భారతీయార్య విజ్ఞానముమూలము. ఆర్యులు సింధునదీతీరములందు నివసించినకాలము మొదలీకాలమువరకీ దేశములో ననేకపరివర్తనములు జరిగినవి. ఆపరివర్తనములు ప్రతియుగమునను ధర్మసంస్థాపనకై యేర్పడుచుండినవి. ఒకకాలమున క్షాత్ర ధర్మము విజృంభించినపుడది పరశురాముని పరశునకు బలియయ్యెను. ఒకయుగమున బ్రాహ్మణధర్మమతి వ్యాప్తినిఁగాంచినపుడది బౌద్ధవిజ్ఞానముచే విచ్ఛిన్నము సేయఁబడియె.

### భారతీయుల విజ్ఞానము.

భారతీయుల విజ్ఞాన మాదికాలమునుండియు నధికముగ నధ్యాత్మిక సంబంధమునుఁగలిగియుండెను. భారతయుద్ధమునకుఁబూర్వము క్షత్రియవీరులు ప్రబలి దేశమునకు సంక్షోభమునుఁ జేయుచుండిరి. కురుక్షేత్రములో క్షత్రియవీరుల వినాశమువలనఁ గాలక్రమమున క్షాత్రధర్మము హీనస్థితికి దిగెను. బ్రాహ్మణధర్మము వర్ధిలుట కారంభించెను. బ్రహ్మవిద్య విద్యలకు విద్యగానెంచఁబడుచుండెను. సన్యాసము కామ్యసిద్ధికి మూలమని తలంచఁబడుచుండెను. ఇహలోకసుఖములు నిరసభావముతోఁ జూడఁబడుచుండెను. జ్ఞానసంపన్నులు బ్రహ్మవిచారముతోఁ గాలమునుఁ గడుపుచుండిరి. విద్యావంతులకు వృత్తులన్నియును నీచములుగనుండెను. ప్రాణమానధనములనుఁ గాపాడు క్షత్రియులు సయితము బ్రాహ్మణులకు లోఁబడవలసియుండిరి. ఈబ్రాహ్మణాభిమానమును భగ్నముచేయుటకు బౌద్ధమతము పుట్టినది. చంద్రగుప్తమౌర్యుని కాలములో నలెగ్జాండరు దండయాత్రవలన క్షాత్రభావము తిరిగి తలయెత్త నారంభించినది. కాని యశోకవర్ధనునికాలములో బౌద్ధమతవ్యాపనవలన నాధర్మాభివృద్ధికి భంగముకలిగినది. పిమ్మట హర్షవర్ధనుని కాలములో నీధర్మము వ్యాపించినను బ్రాహ్మణధర్మము బలవత్తరముగ నుండెను. మహమ్మదీయుల దండయాత్రల నాపుటకు పృథ్వీరాజు క్షాత్రప్రతాపాగ్నినిఁ బ్రజ్వరిల్లజేసెను. మహమ్మదీయ యోధుల దౌర్జన్యమునాపుటకు రాజపుత్రవీరులందరు ప్రాణముల నర్పించిరి. కాని క్షత్రియులలోఁ జాతిసంత క్షాత్రభావము లేనందున వారిప్రయత్నములు నిష్ఫలములయ్యెను. కాలాంతరమున మహారాష్ట్రుల క్షాత్రభావము గొంత విజృంభించినది. కాని యదియును వీర్యవంతము గాక స్వల్పకాలములో నశించినది. నానకుమత ధర్మమును క్షాత్రధర్మమును నన్యోన్యసంఘర్షణము లేకసమముగా నభివృద్ధిచేయుటకై యత్నించెనుకాని ఆయత్నము స్థిరముగ నిలువలేదు.

### సంఘదుఃస్థితి.

భారతీయ సంఘస్థితియును ధర్మభావనలును నీదురవస్థకుఁ గారణములు. శ్రీరామ శ్రీకృష్ణభీష్మ ద్రోణ కర్ణార్జున చంద్ర గుప్త హర్ష వర్ధన పృథ్వీరాజ కృష్ణదేవరాయాదియోధవీరులతో నీదేశములో నుత్తమక్షత్రియ ధర్మము నశించి శేషించినది దేశాభ్యుదయమునకుఁ గాక

దేశసంక్షోభమునకుఁ గారణమగుచుండెను. వ్యాసవశిష్ట జనకబుద్ధశంకర రామానుజ చైతన్య రామదాసాది తత్త్వవేత్తలతో నీపుణ్యభూమియందు బ్రహ్మజ్ఞానమడుగంటి శేషించినది పరమార్థలాభమునకుగాక కుత్సిత మతకులాచారాభివృద్ధికి సాయపడుచుండెను. ద్విజుల స్వార్థపరత్వమితర జాతుల హేయస్థితికిఁ గారణముగానుండెను. విద్యావిహీనులైన వారి బలపరాక్రమములు వారి పురోవృద్ధికిగాని సంఘాభివృద్ధికిగాని యనుపయోగములుగ నుండెను. వాణిజ్యము క్షీణించెను. పరిశ్రమలు పాడయ్యెను. కృషి సన్నగిలెను. జనులకు ధైర్య స్థైర్యములు లేకుండెను. ప్రాణమానధన రక్షణము దుర్భరముగనుండెను. పదునేడు పదునెనిమిది శతాబ్దములలో ధగ్గులు, పిండారులు, రోహిల్లాలు, మహారాష్ట్రులు దేశమునకు గావించిన సంక్షోభమును స్మరించిన మేను కంపమునొందును. హిందువులీ విపత్పరంపరల పాలయ్యును సహజ సంతోషమునుగాని శాంతస్వభావమునుగాని విడువకుండిరి. కర్మఫలానుభోగ సిద్ధాంతమునందు బద్ధప్రత్యయులై సమ్మోహావశులైరి. బ్రిటిషు పరిపాలనము వలననీసమ్మోహమునకుభంగముగలిగిప్రబోధమేర్పడినది.

## హిందూదేశ ప్రబోధము.

దేశమునందంతటను శాంతి స్థాపింపఁ బడియెను. విశాల దేశమంతయు నేకచ్ఛత్ర పాలనములోఁ జేరియున్నది. భిన్నజాతీయుల కేకజాతీయ భావమేర్పడుచున్నది. విద్యాలయములు జ్ఞాననేత్రమును వికసింపఁజేయనారంభించెను. పాశ్చాత్యుల సంసర్గమువలన నూతనభావన లంకురించెను. బ్రిటిషుపరిపాలనమువలన నూతనయుగ మేర్పడెను. ఈనూతనయుగధర్మము ప్రబోధకముగ నొప్పుచున్నది. ఈ ప్రబోధము సహజముగ మొట్టమొదట మతసంస్కరణకై యుపయోగపడినది. నౌరోజి బెనర్జి గోఖలేలకుముందు రామమోహనుడు దయానందుడు వెలసిరి. ఆధ్యాత్మికజ్ఞానము నవశక్తితోఁ దిరిగి తలయెత్తినది. ఉపనిషత్తులలో నిర్గుణ బ్రహ్మోపాసనము బోధింపఁబడినను సామాన్యముగ సగుణ బ్రహ్మోపాసనమె జనాదరణము నొందినది. సగుణోపాసనమునందును బౌద్ధ మహమ్మదీయ క్రైస్తవ మత సమావేశమువలన మార్పులుగలిగినవి దేవళంబులకు బదులు విహారమందిరము లేర్పడినవి. కర్మానుష్ఠానమునకు బదులుప్రార్థనలేర్పడినవి. భక్తియోగముతో కర్మయోగమునకు నూతనశక్తిగలిగినది. కర్మఫలత్యాగము కర్మయోగముగాని కర్మత్యాగముగాదను గీతోపదేశమును వివేకానందాది బ్రహ్మజ్ఞు లుపదేశించిరి. ఈయుపదేశములు పాశ్చాత్య దేశములందలి మతాభిమానులకును నాశ్చర్యజనకములైనవి. అమెరికా దేశీయులు గొందరు హిందూమత ధర్మముల నావలంబించుచు రామకృష్ణసంఘములోఁ జేరిరి. హిందూతత్వజ్ఞానమును శ్లాఘించు బ్రహ్మజ్ఞాన సమాజములోఁ బాశ్చాత్యులు సభ్యులుగనున్నారు. సర్ ఆలివర్ లాడ్జివంటి ప్రకృతిశాస్త్ర పరిజ్ఞాతలును సర్వాత్మత్వ సిద్ధాంతము నంగీకరించుచున్నారు. నివేదితా సోదరీమణి హిందూధర్మముల పట్లను, జాతిపైన, దేశమునందునుఁజూపిన నభిమానానురాగములను హిందువులు గలిగియున్న భారతమాతనోము ఫలించఁగలదు. భారతీయుల యధ్యాత్మవిద్యకు సాటియైన దివ్యజ్ఞానము ప్రాక్ప్రపంచమునందేకాక ప్రతీచ్య ప్రపంచమునందు సయితము దుర్లభమని తత్వవేత్తలమతము. ప్రబుద్ధప్రాగ్దేశములలో నెదానికిని నీగౌరవము లభించలేదు. జపానువిజయములు జపానునకుమాత్రము లాభకారులు. భారతీయుల విజ్ఞానము సకలదేశములకును లాభదాయకము. హిందువులు తత్త్వజ్ఞానసంపన్నులై దమదివ్యజ్ఞానమును వివేకానందాదులవలె లోకసంగ్రహార్థమై యుపయోగించుట ప్రబోధముయొక్క ముఖ్య ప్రయోజనము. ప్రాకృతిక విషయాసక్తమైన పాశ్చాత్య ప్రపంచ పరిణామమున కీవిజ్ఞాన మవసరము. మిథ్యావైరాగ్యోపహతులై నిర్వీర్యహృదయులైన భారతీయుల కాంగ్లేయ సంసర్గమువలన నేర్పడిన ప్రబోధ మన్నిదిశలను వ్యాపించినది.

## రాజసభావావశ్యకత.

భారతీయులలో రాజసభావము క్షీణించినది. జనులునిర్వ్యవసాయ పరాయణులైరి. ఉచితతృష్ణ లీనమైనది.

కర్మానక్తియభావమైనది. ఆంగ్లేయుల శ్రద్ధామయమైన రాజనభావమీభావమునకుపుష్టినిఁగలిగించినది. వారివ్యవసాయపరాయణత్వమువీరికుత్తేజమునుఁగలిగించినది. వారిభాగ్యభోగ్యములు వీరిలో నవీనాశనుఁ బుట్టించినవి. వారికర్మకౌశలము వీరినిఁ గర్మాభిముఖులనుఁజేయుచున్నది. ఆంగ్లేయుల ప్రజాప్రాత్యామ్నాయ పాలనాప్రియత్వము వలన వీరికిని దానియందు ప్రీతిజనించినది. ఆంగ్లేయచరిత్రపఠనమువలననీయాసక్తి హెచ్చినది.సకలదేశములనుఁ గలవరపఱచుచున్న ప్రజాస్వామ్యత్వ తరంగపరంపరలీ భావమునకుత్తేజమునుఁ గలిగించినవి. హైందవదేశీయ మహాసభయిరువదియైదేండ్లుగఁ బ్రజాభీష్టములనుఁ బాలకులకు నివేదించుచున్నది. రాజ్యాంగములు సంస్కరింపబడుచున్నవి. ప్రజాప్రాత్యామ్నాయపాలనము నీదేశమునఁ స్థాపించుటకు చిరకాలముపట్టవచ్చును. కానికాలక్రమమున నధినివేశ స్థలములందువలె నీదేశమునందును బ్రిటిషుసామ్రాజ్యములో స్వతంత్ర వ్యక్తిగల ప్రజాప్రాత్యామ్నాయ పాలనమేర్పడఁ గలదను నింకువిశ్వాసము భారతీయులకుఁగలదు. ఇతరప్రాగ్దేశములందుకంటె నీదేశమునం దీపాలనాక్రమము మిక్కిలి నెమ్మదిగ నేర్పడవచ్చును. కాని మందగతియె మంచిదని యితర దేశచరిత్రములవలనఁదెలియుచున్నది. దేశాభివృద్ధికి ప్రాత్యామ్నాయపాలనము లాభదాయకమైనను సుస్థిరసుబలపాలన మత్యవసరము. తురుష్కసామ్రాజ్యములోఁ బ్రాత్యామ్నాయ పాలనము స్థాపింపఁబడినను బలములేక దేశము పరదౌర్జన్యమునకు నంతఃకలహములకు లోనగుచున్నది. పారశీకదేశస్వాతంత్ర్యము నామావశిష్టముగనున్నది. చీనాదేశ పరివర్తనము సంతాపకరమగుచున్నది. రష్యాభల్లూకము దనదీర్ఘబాహువులను మంగోలియాపైఁ బ్రసరింపజేసినది. హిందూదేశమును నీదురవస్థనుండిఁ గాపాడుటకు భగవంతుడు బ్రిటిషుపరిపాలనమునుఁ బ్రసాదించెను. ఈపాలనాసహాయమున నీదేశోద్ధరణము గావలసియున్నది. దేశోద్ధరణమునకై ప్రజాపాలకుల పరస్పరవిశ్వాసప్రత్యయములు సాధనములు. ప్రజలుకృతజ్ఞతలనుఁ దెలుపుటతోను మనవినిఁజేయుటతోను రంధ్రాన్వేషణముతోనుఁ దనివొందక దేశక్షేమమునకై పాలకులతోఁగలిసి భేదభావములేక పాటుపడవలసియుందురు. దేశాభిమానులు దమసుఖమును, సంపదలను, ప్రాణములను బ్రిటిషుపరిపాలనమునకు విరుద్ధములేక దేశక్షేమమునకై సమర్పింప సన్నద్ధులైయుండవలయును. పాలకులు ధర్మపరిపాలనముతోను, శాసనసభల సంస్కరణముతోను, విద్యాలయముల సంస్థాపించుటతోను, నయోమార్గనిర్మాణముతోను, సైన్యవిన్యాస సంస్కరణములతోనుఁ దృప్తినొందక భరతవర్ష స్థిరరక్షణోపాయమును బ్రిటిషుసామ్రాజ్య పరిత్రాణోపాయమును నన్వేషించవలసియుందురు. బ్రిటిషుసామ్రాజ్యములో క్షాత్రభావస్థాపనమె సామ్రాజ్యరక్షణమునకుఁ దగినసదుపాయము. క్షాత్రభావము భగవద్గీతలోనిటుల వర్ణింపఁబడినది:—

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ గీ. 18 43.

ఈక్షాత్రధర్మ మాంగ్లేయులలో క్షీణించకబలవత్తరముగనున్నను దీనివ్యాపనకై బాలసైన్యము సృష్టింపబడినది, రాష్ట్రసైన్యమేర్పఱుపఁబడినది, స్వచ్ఛందసైన్యము గల్పింపఁబడినది. కాని ఈనిర్ణయములవలనదేశాభిమానులలోఁ గొందఱకు సంతృప్తిగలుగలేదు. వారు సామ్రాజ్యరక్షణమునకు యువ్వనులకు బలవంతసైనిక శిక్షణము శరణ్యమని మొరలిడుచున్నారు. ఇతర యూరపుదేశములందువలె నింగ్లాండునందును నీపద్ధతి కాలాంతరమున నవలంబింపఁబడుట సహజము. యుద్ధనౌకాసైన్య శిక్షణమునందును నీమార్గావలంబన మవసరమగును. బ్రిటిషుసామ్రాజ్య విస్తీర్ణము 1,20,00,000 చతురపుమైళ్లు. ఇది భూభాగములో నాల్గవవంతు. జనసంఖ్య నలుబదికోట్లు. ఆ సంఖ్యలో 30,00,00,000 హైందవులు; 5,30,00,000 తెల్లవారు; 4,70,00,000 ఇతరజాతీయులు. బ్రిటిషుసామ్రాజ్యరక్షణమునకై క్షాత్రధర్మ ముత్తమస్థితిలోనున్న గ్రేటుబ్రిటనులో నాధర్మాభివృద్ధికై యనేక సదుపాయములు గల్పింపఁబడుచున్నపుడు క్షాత్రధర్మము హీనస్థితిలోనున్న భరతవర్షములో నీధర్మాభివృద్ధినిఁజేయుట యవసరమని వేరు చెప్పనక్కరలేదు. బ్రిటిషుపరిపాలకులు

73,947 బ్రిటిషు సైన్యములోను 1,53,767 హైందవ సైన్యములోను సంవత్సరమునకు రూ. 26,43,75,000 వ్యయముచేసి దేశమును రక్షించుచున్నారు. ఈసైన్యముగాక స్వచ్ఛంద సైన్యము, సంవరణ సైన్యము, సామ్రాజ్య సైన్యము వేరుగఁగలదు. కేవలము భృతకాయుధీయులు దేశభక్తిగల యోధవీరుల చేరికలేక సామ్రాజ్యమును రక్షించిరనుటకు నిదర్శనములు లేవు. సంస్థానాధిపతులను దండనాయకులనుగ నియమించియును, సంస్థానములలో సామ్రాజ్యరక్షక సైన్యమును స్థాపించియును, సామ్రాజ్యసైన్యాధికార దళమును (Imperial Cadet Corps) స్థాపించియును స్వల్పముగ క్షాత్రధర్మమునుఁ బెంపుసేయుటకు బ్రిటిషుపరిపాలకులు ప్రయత్నించుచున్నారు. ఈ ప్రయత్నముల ఫలమతిస్వల్పము. ఈక్షాత్రధర్మమునువ్యవహరింపఁజేయుటకు బాధకము లనేకములు గలవని యొప్పుకొనవలసియున్నది. కాని బ్రిటిషు దండనీతిజ్ఞులు శ్రద్ధనువహించి పనిబూనిన భారతీయుల క్షాత్రభావము నభివృద్ధిఁజేయుటకును నది భరతవర్షమునకును బ్రిటిషుసామ్రాజ్యమునకును రక్షకముగా నుండుటకునుఁ దగిన సదుపాయంబుల నన్వేషింపఁగలరు. సరిహద్దునీములు సైన్యముచే రక్షితములైనను సముద్రతీరము బ్రిటిషు యుద్ధనావికాదళముచే రక్షింపఁబడవలసి యున్నది. హిందూదేశము నందును పధినివేశస్థలములందువలె స్వతంత్ర నౌకాదళ నిర్మాణమవసరము. హైందవులలోఁ దగినవారు నౌకాసైనికులుగను సైనికులుగను శిక్షింపఁబడినవా రాపత్సమయంబున స్వదేశసంరక్షణమునకేకాక బ్రిటిషుసామ్రాజ్యరక్షణమునకును నుపయోగపడఁగలరు. ముప్పదికోట్ల ప్రజలశక్తి సామర్థ్యములను సామ్రాజ్యబలమునకై యుపయోగపడునటులు చేయుటకు మించిన రాజ్యాంగపరిజ్ఞానము రాజనీతిజ్ఞులకుఁ గలుగబోదు.

భారతీయులకు మత రాజ్యాంగములందే కాకఁ గృషిపరిశ్రమ వాణిజ్య సంఘాభివృద్ధియందును ప్రబోధమేర్పడినది. హిందూదేశైశ్వర్యమునకు మూలాధారమైన సేద్యమభివృద్ధిఁజెందుచున్నది. పాలకులు దేశమునం దచ్చటచ్చటఁ గృషిక్షేత్రములను కృషికళాశాలలను స్థాపించి వ్యవసాయాభివృద్ధి కనుకూలములైన నూతనమార్గములనుఁ బ్రకటించుచున్నారు. కాని కృషీవలులు పాతత్రోవలనుఁ బరిత్యజించి నూతనపద్ధతుల నవలంబించినఁగాని పంటలధికమై దేశము సుఖప్రదముగానేరదు. పరిశ్రమాభివృద్ధి కనుకూలముగ 235 దూదియంత్రములు 40 నారయంత్రములును, సామాన్యపు గనుపయంత్రాలయములుగాక కాలమాటిలో నొకగొప్ప యినుపయంత్రాలయమును, నితరయంత్రాలయములును స్థాపింపఁబడినవి. పరదేశములకేగి ప్రత్యేకకళలలో శిక్షితులైన వారిసంఖ్యయత్యల్పముగ నుండుటంజేసి పరిశ్రమవ్యాప్తి కాటంకము గలుగుచున్నది. వాణిజ్యమునందు విద్యావంతుల కాదరణము గలుగుచున్నను విదేశగమన నిషేధమువలన నీయాదరణమునకుఁ బ్రత్యవాయ మేర్పడుచున్నది. సంఘసంస్కరణ మావసరమైనను వ్యక్తిస్వతంత్రా భావముచే వ్యాపించకున్నది. ఆంగ్లేయుల సంసర్గమువలన భారతీయుల సకలాదర్శములలోనుఁ బరివర్తనమేర్పడినది. ఈసంసర్గమువలన జాతీయౌన్నత్యమున కాధ్యాత్మికజ్ఞానమె గాక నాధిభౌతికజ్ఞానమును నవసరమని ప్రబోధ మేర్పడినది. భారతీయులును విద్యాలాభార్థమై విదేశగమనోన్ముఖులగుచున్నారు. బ్రాహ్మణశ్రేష్ఠులు నిమ్నజాతుల నుద్ధరించుటకుఁ బ్రయత్నములనుఁ జేయుచున్నారు. స్త్రీలు విద్యాస్వతంత్రములఁ బడయఁగోరుచున్నారు. ప్రజల హృదయంబుల స్వదేశాభిమాన ముదయించుచున్నది. జనులకు స్వాత్మప్రత్యయ మేర్పడుచున్నది. నిరసింపఁబడిన భారతీయాదర్శము లిపుడు గౌరవభావముతోఁ జూడఁబడుచున్నవి. దేశమునందన్ని వైపులకును ప్రబోధముదనయఖండప్రకాశమునుఁ బ్రసరింపఁజేయుచున్నది. ఈప్రబోధము సంపూర్ణముగా గార్యరూపమునుఁ దైకొనినపుడు ప్రబుద్ధభారతీయులును లోకకల్యాణమునకుఁ దోడ్పడి సత్కీర్తినిఁ బొందఁగలరు.

## బ్రిటిషుసామ్రాజ్య ప్రయోజనము.

బ్రిటిషుపరిపాలకుల యుదారసంకల్పములు లోకాభ్యుదయమునకుఁ దోడ్పడుచున్నవి. వారి సంసర్గము వలన ప్రాగ్దేశములందు సమ్మోహముగతించి నూతనచైతన్యముత్పన్నమైనది. వారిపరిజ్ఞానము వలన సంకులము

పోయి సుఖస్థితి స్థాపితమైనది. వారి సత్పరిపాలనమువలన విప్లవము నిర్గమించి విజ్ఞానము వర్ధిలినది. వారి సంసర్గమె ప్రాక్ప్రపంచ ప్రబోధమునకు ముఖ్యకారణమనవచ్చును. తురుష్కసామ్రాజ్యమును రష్యా దౌర్జన్యమునుండిఁ గాపాడినది బ్రిటిషుసామ్రాజ్య బాహుబలము. పారసీకమును రష్యాదురాక్రమణమునుండిఁ గాపాడుచున్నది బ్రిటిషుసామ్రాజ్యప్రతాపము. చీనాసామ్రాజ్యమును ననవసర పరదేశ ప్రవేశములనుండి రక్షింపయత్నించుచున్నది బ్రిటిషుసామ్రాజ్య సత్స్వభావము. ఈజిప్టుదేశమును హిందూసామ్రాజ్యమునుఁ బరరాజాక్రమణము నుండియును నంతఃకలహములనుండియునుఁ బాలించుచున్నది బ్రిటిషుసామ్రాజ్య విజ్ఞానము. ప్రాక్ప్రపంచ శాంతికేకాక లోకశాంతికిని బ్రిటిషుసామ్రాజ్యబల ముపయోగపడుచున్నది. ఈశాంతిస్థాపనమె ప్రబోధమునకుఁ గారణమైనది. కాని ప్రస్తుతయుగప్రబోధము ప్రజాస్వామ్యత్వ రూపమును సాంగ్రామిక భావమును ధరించుచున్నది. నిరంకుశాధికారాయత్తములైన దేశములలో నియమితపాలనము స్థాపింపఁబడుచున్నది. నియమిత పాలనాధీనములైన దేశములలోఁ బ్రజాస్వామ్యత్వభావము వ్యాపించుచున్నది. ప్రాచీనాదర్శములకును నవీనాశయములకును సంఘర్షణమేర్పడుచున్నది. సామాన్యజనులు ప్రత్యేకజాతికుల స్వత్వలాభములకుఁ బ్రతిఘటించి స్వకీయస్వత్వలాభములను స్వీకరించుచున్నారు. ఈవ్యాకులభావము పాశ్చాత్యదేశములందుఁ బరిశ్రామిక సంగ్రామముగనుఁ బ్రాచ్యదేశములందుఁ బ్రజాప్రాత్యామ్నాయ పాలన సంగ్రామముగనుఁ బరిణమించుచున్నది.

సాంగ్రామిక ప్రబోధమువలనఁ బాశ్చాత్యులు శస్త్రపాణులై యుద్ధమునకుఁ గాలుద్రవ్వుచున్నారు. ప్రజలు కులీనానుభోగములకు విముఖభావమును వహించుచున్నారు. సమీప ప్రాగ్దేశప్రబోధమువలన మహమ్మదీయ ప్రబోధమేర్పడి నలువదికోట్ల మహమ్మదీయు లాయుధపాణులగుచున్నారు. వారు పాశ్చాత్యులతో డీకొనుటకు జంకకున్నారు. దూరప్రాగ్దేశమునందు జపానుదేశీయు లాయుధపాణులై యున్నారు. నలువదికోట్ల చీనాదేశీయు లాయుధధరులు గాఁబోవుచున్నారు. ప్రజాప్రాత్యామ్నాయపాలనము స్థాపింపఁబడుచున్నది. రాజవంశజులు కనివిననిరీతినిఁ దమరాజ్యమునుఁ బ్రజాధీనమునుఁ జేసిరి. భారతీయుల ప్రబోధము సాత్వికస్వభావజన్యమైనను వారికిని యుగధర్మమైన రాజసభావ ప్రభావము సోకకమానదు. ఈరాజసభావాభివృద్ధి బ్రిటిషుపరిపాలనాధీనమై యున్నది. రాజసభావభరితమైన దేశములనడుమ నునికియును యుగధర్మమును క్షాత్రభావభరితమైన దేశములతో ననవరత సంసర్గమును భరతఖండమునందును నీభావోత్పత్తికిఁ గారణములు. ఈవిశాల ఖండమును దీర్ఘసముద్రతీరమునుఁ గాపాడుటకే భావసంరక్షణ మవసరము. బ్రిటిషు యుద్ధనౌకాదళమును సేనాసమూహమును భరతఖండరక్షణమునకు సాధనములనుట యథార్థము. ఈసంరక్షణమునకు భారతీయులు బ్రిటిషుపరిపాలనముపట్ల భక్తిభరితులైయున్నారు. హిందూసామ్రాజ్యము బ్రిటిషుసామ్రాజ్యమునకు శిరోభూషణమని రాజనీతిజ్ఞులచే శ్లాఘింపఁబడుచున్నది. శ్రీపంచమజార్జి రాజేంద్రునియొక్కయు శ్రీమతి మేరిమహారాజ్ఞియొక్కయు ఢిల్లీదర్బారీభావమును స్థిరపరచుచున్నది. హైందవుల క్షాత్రభావమువరిలి వారు నౌకాసైనికులుగను యోధవీరులుగను స్వదేశసంరక్షణార్థమును బ్రిటిషుసామ్రాజ్య పరిత్రాణార్థమును భేదభావములేక శిక్షితులైనపుడు భరతఖండము బ్రిటిషుసామ్రాజ్యమున కమూల్యాభరణము యథార్థముగఁ గాగలదు. ముప్పదికోట్లప్రజల బలపరాక్రమములు సామ్రాజ్యసంరక్షణమున కుపయోగపడఁగలవు. ప్రాచీప్రతీచీసమావేశమును సత్వరజోభావ సంయోగమును నుచితరీతిని నీదేశములో నేర్పడి భరతవర్షాభ్యుదయమును, బ్రిటిషుసామ్రాజ్య ఖ్యాతియును, లోకకల్యాణమును వర్ధిలి భగవత్సంకల్పము ఫలప్రదముగాఁగలదు.

---

# సత్ప్రవర్తన ఫలము.

### ఒక కల్పిత కథ.



నారాయణరావుగారు చెన్నపురిలో నికోల్సను కంపెనీవారి వద్ద ముఖ్యఇంజనీరుగాను, మ్యానేజరుగాను యున్నారు. ఈయన రెండువందల రూపాయలు జీతము సంపాదించుచున్నాడని పేరేగాని పట్టుమని పదివరహాలసొమ్మయినను భార్యమెడలో లేదు. నలుగురు బిడ్డలలో నొకరిచేతికైనను ఒకబంగారపు మురుగున్నట్లు కానుపించదు. అయితే 200 రూపాయల జీతమేమగుచున్నదని, చదువరీ, నీవడుగవచ్చును. పట్టణములో సంసారపోషణమునకై సొమ్ముపోగా మిగిలినదంతయు నొకనూతనయంత్రమును జేయుటకై గడచిన ఆరుసంవత్సరములనుండియు వ్రయము చేయుచుండెను. పైగా అప్పుగాగొంత సొమ్మును మార్వాడీలవద్దనుండి పుచ్చుకొనుచుండెను. ఈవడ్డీలను తీర్చుట కూడ కష్టతరముగానుండెను. ఈయనభార్య కాపురమునకు వచ్చినది మొదలు యీరోజువరకును ఒకకాసెత్తుసొమ్ము చేయించిపెట్టుమని పెనిమిటిని పల్లెత్తియడిగి యెఱుగదు. ఇంట్లో సొమ్మున్నను లేకున్నను నెమ్మదిగా సంసారమునడిపించు భర్తకు నిజమైనసహధర్మచారిణియై మెలంగుచుండెను. గృహము సంపదలతో దులతూగకున్నను శాంతి కాటపట్టయి యుండుటచేతనే యెట్టిబాధయును లేక గడచిన ఆరుసంవత్సరములనుండియు నారాయణరావు నెమ్మదిగా దమయంత్రమును నిర్మించుటకు శక్తికలిగియుండినది. ఈయంత్రమేదియన నాలుగురంగులను ఒక్కకాగితముపై నొకేపర్యాయము ముద్రించునటు చేయుట. ఈకథజరిగిన నాటిరాత్రి తననూతన నిర్మాణముయొక్క ప్లానులను దాను వేలకొలదిరూపాయలను వ్రయముచేసి నిర్మించుచున్న యంత్రమున్న గదిలోబెట్టుకొని "యీరెండులోపము లేల రావలయును చెపుమా. ఆరుసంవత్సరములు నానాశ్రమలుపడి యింతవరకు దీనిని దెచ్చితిని. ఈరెండులోపములను నివారించితినేని నేనులక్షాధికారినే. ఈపాడు దారిద్ర్యమువదలిపోవును. ఏమో, జయమును నా కండ్లతో జూచెదనో లేనో!! నాప్రాణము యీయంత్రమువద్దనే పోవలసియున్నదని మూడుపంక్తులతో ముఖముమీద బ్రహ్మవ్రాసియుండగా నీరెండులోపముల నెట్లునివారింపగలను. ఆరుమాసములనుండియు నాప్రాణములను దీసివేయుచున్నదే" యని మనసులో ననుకొనుచు నిట్టిపనికై దిగినందునకు దన్నుదాను నిందించుకొనుచు, నొక్కొకప్పుడు ఆశలుపుట్టుచుండగా జయింపలేకపోదునాయని ధైర్యమును దెచ్చుకొనుచు నారాయణరావు ప్లానులవంకజూచుచుండిరి.

ఇంతలో బయటివాకిలితలుపు నెవరోతట్టగా, "జానకీ, ఎవరో తలుపును తట్టుచున్నారు. తీయుము" అని నారాయణరావుగారనిరి. జానకమ్మగారు తలుపును దెరువగానే వెంకయ్యరుగారు లోనికి వచ్చి నారాయణరావుగారున్న గదిలోనికి వెళ్ళిరి.

"అయ్యా, నారాయణరావుగారు, వేళగానివేళ వచ్చినందునకును, మీపనికి భంగమును గలిగించినందునకును మన్నింపవలయు" నని వెంకయ్యరుగారు ముందుగా క్షమాపణమును వేడుకొనిరి.

"అయ్యో, అలా అనకండి. మంచివేళనువచ్చినారు. పనిభంగము కాలేదు. తమరేపనిమీదవచ్చినారో దయచేసిచెప్పవలెను" యని నారాయణరావుగారనిరి.

"నాకొకచిన్నపని మీవలన కావలసియున్నది.

"ఏమిటది".

"అ- ఏమిలేదండి. మీరుదయయుంచినారంటే అయిపోతుంది.

"అదేమిటో చెప్పండి, అయ్యగారూ."

"ఇప్పుడు మీముద్రాక్షరశాలలో పనిఎక్కువగానున్నది. పుచ్చుకొన్న కంట్రాక్టులు చాలానిలిచియున్నవి. పైగా ఢిల్లీదర్బారు సంచికలను మూడులక్షలు అచ్చువేయుదురట. ఇప్పుడు నాలుగుమాసములక్రిందట మీకు గవర్నమెంటువారు జనాభాలెక్కలను ముద్రించుటకయి యిచ్చిన 1,50,000 రూపాయలపనిని మావెంకటాచలం శెట్టిగారి ముద్రణాయంత్రశాలలో నచ్చువేయించవలయునని మా విజ్ఞాపనము"

నారా:— అది నాచేతిలో నేమున్నది. నాయజమానుని వెళ్లి చూడండి."

వెంకయ్యర్;— అంతమాత్రము నాకు తెలియకనా మీతావునకువచ్చినది. ఉన్నసంగతేమో చెప్పెదను వినండి. మీతో ఆలోచించనిది మీయజమాని ఒక్కపనిఅయినను చేయడు. మీరుచెప్పిన మాటను ఆయనదాటిపోడు. గట్టిగా యీపనిని మాకిప్పించవలసినదని అడుగుటకై నేను పంపబడితిని. మనమందరము స్వగ్రామములనువదలి డబ్బుసంపాదించుటకయి వచ్చినట్టివారమే. ఈపని యుచితముగ మీరుచేయవచ్చు. ఇన్నేండ్లనుంచియు మీభార్య కుచేలుని భార్యవలె గనపడుచున్నది. కాని ఒకమంచినగయయినను చీరయయినను ఆమెకున్నట్లు కానుపించదు. పాపము, ఆమెనుచూచినప్పుడు జాలివేస్తుంది. ఎందుకు !! ఇంతకుముందామె తలుపుతీసినప్పుడు ఆమె ముఖమునుజూడగానే నాకు ఎంతోవ్యసనమయినది. ఇకమీపిల్లలకు నగలట్లుండగా మంచిగుడ్డలైనాయున్నట్లు కనుపించదు. మీరు గృహస్థులు. భార్యను బిడ్డలను హోదాకుదగినట్లుంచవలయుగాని యీస్థితిలోనుంచుట మంచిదికాదని నాతలంపు. మనమారుసంవత్సరములనుండి ఒకరిమొగమొకరమెల్లప్పుడుచూచుచున్నాము. కాబట్టియును, మీపొరుగున యుండబట్టియును ఇంతస్వతంత్రించి మాటలాడినాను. తప్పులున్నచో క్షమింపవలసినది."

"ఉపన్యాసము పూర్తియయినదండి వెంకయ్యరుగారు! ఇంకేమయినయున్నదా" యని పైమాటలను వినలేక వినుచున్న నారాయణరావుగారు ఆగ్రహముతోఁగూడిన అసహ్యముతో బలికిరి.

"ఇంక ఒక్కమాటమాత్రమేనండి. మీశ్రమవృథపోదు. ఈ పనిని మాకిప్పించినయెడల మీకుయిన అక్కయ్యగారినగలకు......"

నారా:— ఏమిటి! లంచమా!!

వెం:— ఎబ్బెబ్బే కాదండి. నేనామాట అన్నానా. ఇప్పుడు ఇంతకాలమునుండి మీయజమానివద్దపనిచేసి మంచి నమ్మకమును ఆయనవద్ద సంపాదించుటకై పడినశ్రమకు ఏదోయొక ఫలముండవలయునా లేదా. ఆ ఫలమును మావల్లపుచ్చుకొనమన్నానుకాని, అబ్బే లంచమన్నానటండి.

ఈమాటలను వినిన నారాయణరావుగారికి కోపముమింట తలకెక్కినది. "చెన్నపట్నములో జేరి చమత్కారముగా మాట్లాడటం నేర్చినావయ్యా. ఇంతకాలమునుండి నన్ను జూచియు నాస్వభావమును గనుగొనలేకపోతివిగదా" యని యనుచు తలుపులను దెఱచెను. వెంకయ్యరుగారికి సంభాషించుట మర్యాదగాదని యెఱిగి కుర్చీమీదనుండి లేచి "నారాయణరావుగారు మూడువేలరూపాయలు ఒక్కదినములో నెవరికిని దొరకవు సుమండీ" యనుచు తలుపువద్దకువెళ్ళి "రేపుసాయంకాలము తిరిగి తమదర్శనమును జేసుకొంటాను" అని చెప్పి వెళ్లిపోయెను.

వెంకయ్యరు కడపటననివెళ్లిన "మూడువేల రూపాయలు ఒక్కదినములో నెవరికిని దొరకవుసుమండీ" యను మాటలు నారాయణరావుగారి మనస్సులో జొరబడి యమితముగ బాధపెట్టుచుండెను. అయ్యరురాకముందు యంత్రమువద్ద విసుగుజెందుచు ననుకొనిన మాటలు ఆరాత్రి నారాయణరావుగారికెంత మనోవికారము కలిగినది చూపుచున్నవి. ఇప్పుడాయన తనమనస్సులో నిట్లు తలపోయుచుండెను. "ఈయంత్రమువలన నేనైశ్వర్యవంతుడనవుదునో కానో కాని నా భార్యాబిడ్డలనుమాత్రము చంపుచున్నాను. వారికి కట్టుకొనుటకయిన మంచిబిడ్డలను లేకుండజేయుట బహుపాపము. నాభార్య పతివ్రతాతిలకముగుటజేసి నాయాటలు సాగుచున్నవి. కోపస్వభావముగల స్త్రీయయియుండినయెడల నాకీయిల్లు నరకముగ నుండునట్టిది. చెఱుపుమంచిదని కళ్లతో నములజూచుట మంచిదికాదు. దానిస్వభావము మంచిదని ఇన్నికష్టముల పాలుచేయరాదు. ఎంతమందిలంచాలుతిని బాగుపడుటలేదు. నేనుతిననుండ నుండనిగదా! దేవుడేమయిన సహాయముచేసినాడందమా అదియులేదు. ఇదిగో నాప్రాణములను తినుచున్న పాడుయంత్రము దీనినిబాగుచేయుటకు దేవుడు బుద్ధినియ్యరాదా? ఒక్కనెలలో భాగ్యవంతుడను కాగలనే.... నానోటినుండి ఒక్కమాట మూడువేలరూపాయలు వచ్చిచేతిలో రాగలవు. అయ్యో! ఎంతపాపపుతలంపు తలంచుచుంటిని. రూపాయలు తీసుకొని యజమానితో సిఫారసు చేయుటకయి ఏమిసంగము పెట్టుకొని వెళ్ళగలను. సొమ్ముతినిన పాపిష్ఠిని నాడెంత 1 50,000ల రూపాయలపనిని పాడుచేసుకొనివచ్చినను బాగుగానున్నదని చెప్పవలసివచ్చునే. అటుపైన గవర్నమెంటులో నాయజమానికిమాటవచ్చినచో? ఛీ, ఈపాడుపనిని చేయరాదు. కాని... మూడువేలరూపాయలా? మార్వాడీలబాధను 1500 రూపాయలిచ్చి తీర్చుకొనవచ్చునుగదా? ......తక్కిన 1500 వందలతో పిల్లలకు తల్లికి వెయ్యిరూపాయీలకు నగలుచేయించవచ్చును. మిగిలిన అయిదువందలు యంత్రముమీద తిరిగి తగులబెట్టవచ్చును. వృథాగా ఎందుకు పోగొట్టుకొనవలె!! ఇంత సొమ్మును... ఛా, యీరోతసొమ్మునుఏలతినవలయును. అటువంటప్పుడు రాత్రికన్నపుదొంగకును నాకును ఏమిభేదముండును ఎటులనిష్కల్మష హృదయముతో నాబిడ్డలను నాపెండ్లామును ఇకముందుచూడగలను" ఇంకననేకవిధములుగా రావుగారూహించుకొనుచుండగా రాత్రి 1 గంటలు కావచ్చెను. అప్పుడు జానకమ్మగారు గదిలోనికి వచ్చి భర్తను భోజనమునకు బిలిచెను.

వంటయింటియందు నారాయణరావుగారు భుజించుచుండగా నెమ్మదిగా జానకమ్మ ఇట్లనెను. "ఎల్లుండి సంవత్సరాది పండుగ క్రొత్తచొక్కాలకును, లాగులకును, పరికిణీలకును బిడ్డలునన్ను వారము దినములనుండియు వేధించుచున్నారు. దీపావళిపండుగకని, సంక్రాంతికని ఆశలు పెట్టినాము. ఈసారివాళ్లు ఊరకయుండునట్లులేదు. ఇప్పుడు మీతో చెప్పిలాభములేదు. కానిఏలాగయిన కొద్దిగానప్పుపుచ్చుకొని గుడ్డలువాండ్రకు బెత్తురా"

"నీకుమాత్రము మున్నవే. నీకుకూడా మంచిచీరె లొకటిరెండు తీసుకొనిరావలసినదే" యని జాలిగుండెతో రావుగారనిరి.

"నాకులేకపోతే నేమిలెండి. ఉన్నవిచాలును లెండి. ఎందుకు వ్యర్థముగా సొమ్ముఖర్చు"

"నీకు అసలున్నవేమిటి. మంచిచీరలు లేనేలేవు"

"నాభర్త నాబిడ్డలు నాకుసొమ్ములు చీరెలువస్త్రములు. వారు హాయిగానుండినచో నాకన్నియుగలవు. వారుసుఖముగాలేకున్నచో నన్నియుండియు నాకులాభములేదు." అనిజానకమ్మగారనిరి.

నారా:— నిజముగా నీవునాపాలిట దేవతవే. నేనుపెట్టుచున్నకష్టములకు నీవుకాబట్టి యోర్చియున్నావు.

జాన:— అట్లుభరించుట నావిధి. నేనుఅర్ధాంగినికాదా. నాభర్త యొక్క యుత్తమకార్యమునకయి శ్రమపడుచున్నాడని గుర్తెఱిగినప్పుడాయన నన్నివిధముల ప్రోత్సహించుట నాపరమకర్తవ్యమని నా అంతరాత్మ ప్రబోధించినది.

నారా:— ఆకార్యములో జయమందలేకపోయినచో

జాన:— అదిమనచేతిలోలేదు. ఫలమునిచ్చుట పరమేశ్వరునిది. కష్టముమనది.

నారా:— బ్రతికినన్నినాళ్లు మనకుకష్టమయినచో నెట్లుభరించగలము?

జాన:— మనదికష్టమని నాకుతోచదు. సొమ్ములును, మేడలును, బండ్లును లేకపోవుట ఒకకష్టమయినచో, గంపెడుబిడ్డలులేకని

నిలుచుండుటకు నీడయు, దినుటకన్నము లేక పశువులవలె అవస్థపడుచుండు భార్యాభర్తలదుఃఖము ఎటువంటిదో చూడుము.

నారా:—ఒకవేళ ఈయంత్రము ముందరనేను చచ్చిపోయినచో నీవును అట్టిదుఃఖముల పాల్పడుదువేమో?" యనికండ్లను తడిపెట్టుకొనెను.

జాన:—రామరామ అలా అనకండి- మీయెదుటను బిడ్డలయెదుటను నిండుపసుపుకుంకములతో దాటిపోవలయునని దినదినము దేవుని బ్రార్థించుచున్నాను.

"డబ్బుకేమయిన బ్రార్థించుచున్నావా"

"ఏమిటి. ఈవేళ మీకు డబ్బుపిచ్చపట్టినది. ఇదియెప్పుడును లేదు. అదువాండ్రకుండవలసినది. మగవారిని పట్టుకున్నదేమి"

"జానకీ, నీతో నేను నిజమును దాచగలనా, నీవు యీదౌర్భాగ్యునికి మొట్టమొదటినుండియు భార్యవే కాకమంత్రివి"

అని వెంకయ్యయ్యరుతో జరిగిన సంభాషణమును, మార్వాడీవాండ్రుడబ్బుకై పెట్టుచున్న బాధలను వివిస్తరముగా జెప్పి "ఆయూకువేలు తీసుకొని ఒక్కసారి విముక్తినొందవలయునని పాపిష్టిమనోవికారము కలిగినది. నీయుద్దేశమేమికి" యని నారాయణరావుగారు భార్యనడిగిరి.

ఈమాటలను వినిజానకమ్మ కండ్లవెంబడి నీరుబొటబొట కారుచుండగా "నాకొంపలను, బిడ్డలకొంపలను, యీలంచము పుచ్చుకొననని వాగ్దానము చేయుడు" యనుచు భర్తయొక్క రెండుకాళ్లను పట్టుకొనెను.

ఈమాటలను వినిన నారాయణరావుగారు తానుగొప్ప పాపినని యూహించుకొని భార్యముఖమును జూచుటకిష్టములేక పాదములనుండి ఆమెను ఎత్తుటకును జేతులురాక నేడువ మొదలుపెట్టెను. ఇంతలో జానకమ్మగారు ధైర్యమును దెచ్చుకొని లేచి "ఈయుద్యోగము పోయినను, మార్వాడీల బాధలవలన మనకున్న చెంబుతప్పెలలు పోయినను, మనము నాలుగువీధులకు నలుగురుబిడ్డలనుబంపి ఎత్తుకొనితిందము కాని యీ పాపకార్యమునకు సాహసించనని చేతిలో చేయి వేయవలసినది" అని చేయిజాచెను. నారాయణరావుగారు అన్నదేవతసాక్షిగా నేనాపాపకృత్యమునకు కొడిగట్టనని ప్రమాణముచేసి ఎంగిలిచేతినే భార్యచేతిలో వేసిరి. నారాయణరావుగారు తమజీవితములో నొకగొప్ప దుష్కృత్యప్రేరేపణమును సతీతిలకమగు జానకమ్మగారి సహాయమువలన జయింపగలిగెను. భార్యలుభర్తలకు జేయవలసిన యుపకారమంతకంటె ఎక్కువయుండునా.

మరునాడుదయమున నిదురమేల్కొని లేవగనే నిత్యకృత్యముగు యంత్రనిర్మాణమునకు నారాయణరావుగారు గడంగిరి. మనసు నాందోళపఱచిన యొకపెద్దసంకటము తొలగిపోయినందున ఆయనయీయాదయమున పదిదినములు రాజుగారి రాకకయి సెలవు లొసంగబడినప్పుడుబడిపిల్లలెంతయానందముతో నాటలాడుచు గాలముపుచ్చుచుండెదరో రోసనంతయుల్లాసముతో యంత్రముతో నాటలాడుచుండెను. ఒకచక్రమును యంత్రముయొక్క అడుగుభాగమునుండితీసివేసిదానిస్థలములో మరియొకదానినిబెట్టిరి. మరియొకచోట నాలుగు బెజ్జములనుపొడిచి అందులో వేర్వేరయిన సామానులనుంచి యంత్రమును త్రిప్పగా నదితిరుగుట ప్రారంభించెను. ఈయంత్రమిట్లు తిరుగుటనుజూచి తననోము ఫలించినదని నారాయణరావుగారు ఆనందపరవశుడై "ఓజానకీ, జానకీ, ఓజానకీ, మనము భాగ్యవంతులమయినాము రమ్మురమ్మ" అనిగదిలో గంతులు వేయుచు అఱచుచుండెను. ఏయంత్రముపడి ఏఅపాయము వచ్చినదోయని కేకలను అట్లుతోముకొనుచున్న జానకమ్మగారువిని ఏడ్చుచు పరుగెత్తుకొనివచ్చి "ఏమండి. ఏమిసంభవించినది" అనియడిగెను.

"ఏమువచ్చెను- నాజననము సాఫల్యమునొందినది. యంత్రము నడచుచున్నది. ఈరెండును బహుతేలికయయినపనులు. అనుమానములనుండి నన్నెలక్ష్యముపెట్టినవో చెపుమా" యనిరావుగారనిరి.

దేవుడుమనలను బరీక్షించుటకయి యీకష్టములను గల్పించియుండవచ్చును. వెంకయ్యయ్యరును నిజముగా మనశక్తినిపరీక్షించుటకయి దైవముపంపినాడని నాదృఢవిశ్వాసము. ఆపరీక్షలో దేరితిమి. అందుకు మెచ్చి మనలను రక్షించినాడు. అహా, ఏమి!! అపరమేశ్వరునికటాక్షము యనుచు ఆనందాశ్రువులను జానకమ్మ రాల్చదొడంగెను.

ఇంతలో దలుపు నెవరోతట్టిరి. జానకమ్మగారు తలుపుతీయగా వెంకయ్యరుగారు ప్రవేశించెను. కనితొంగివచ్చినాడనుకొని "ఏమండోయి చేతిలోచేయి" అని రాత్రిప్రమాణమును పెనిమిటికి జానకమ్మ జ్ఞాపకమునకుదెచ్చెను.

వెంకయ్యరు "నారాయణరావుగారు ఏమాలోచించినారు. ఒక్కమాటమాత్రమేనండి. మీకులాభము. మేమును బాగుపడగలము. పనికాకపోయినను దిరిగి సొమ్ము మీరీయవద్దులెండి. నీబిడ్డలు, నీపెండ్లాముయొక్క స్థితియయినాజూచి సరిఅనవయ్యా, వెఱ్ఱిబ్రాహ్మడా"

"నాభార్యాబిడ్డల పేరెత్తినావు. కనుకనే వారికొఱకయినను నీసొమ్మును పుచ్చుకొనను. నీవుస్నేహపూర్వకముగా లంచముపేరెత్తకుండియున్నచో నాశక్తికొలది యత్నించియుందును. ఇప్పుడో నేచేయవలసినదేమియులేదు"

"అయ్యో, నామాటలు నాకేవిషమయినవే. లంచము పుచ్చుకొనవద్దులెండి" యని వెంకయ్యరనెను.

నారా:— ఆకాలమును మించిపోయినది. నీవు స్నేహితమునకును దగినవాడవని నాకుదోచదు.

వెంక:—అయితే నేనుదొంగపిల్లకొడుకును- నీవుసత్యసంధుడవు కాబోలును" అనికోపము నభినయించుచు నిటులనయిన రావుగారు మార్గమునకువత్తురేమోనని "ఎవడో ఎక్కువ సొమ్మిచ్చెదనని యనియుండవలయును. అందువలన నింతబిగింపుగానున్నది" అనిపరిహసించెను.

ఈమాటలు నారాయణరావుగారి క్రోధమును గలిగించినను బయటికి గనబఱచక నీచులస్వభావమే యిదియని ఎఱిగినవాడై "వెంకయ్యయ్యరుగారు నాచరిత్రమును కొంచెము చెప్పెదను వినండి అప్పుడు

యినను నాస్వభావము కొంతతనకు బోధపడకపోదు. అని రావుగారిట్లు చెప్పదొడంగిరి. "నేను యీరాజధానిలో నెల్లూరుజిల్లాలో నొక చిన్నగ్రామమందు జన్మించితిని. నాతండ్రి నిరోగియయినను మొట్టమొదటినుండియు వేదకర్మానుష్ఠానపరుడు. శుద్ధశ్రోత్రియుడు. కొంత భూజీవనముకలవాడు. నాతల్లివంటి సుస్వభావురాలు ఈప్రపంచమునందు పుట్టియుండగదనియను అనవచ్చును. ఆమెయే మంచిగుణములను చిన్నప్పటినుండియు నాకుపట్టుపడునటుచేసినది. నేను ఎఫ్ఏ ప్యాసయి ఇంజనీయరింగు పరీక్ష ప్యాసయినతరువాత విచిత్రముగా నాతండ్రి గవర్నమెంటుద్యోగములో బ్రవేశింపవలదనినిషేధించెను. నాతల్లియునందుకొప్పుకొనెను. కారణము మాగ్రామములోబుట్టిఫారెస్టుశాఖలోబనిచేసి లంచములుతినినాడని రంగారావును 5 సంవత్సరములు కఠినశిక్ష విధింపబడుట. సర్కారునౌకరిలో లంచములుతినుటకనేక అవకాశములుండునని వారిభయము. మృతినొందునప్పుడుకూడ, నాయనా! నారాయణా!! గవర్నమెంటుద్యోగము నీవు వలదని నాతల్లి చెప్పిపోయెను. వారియభిప్రాయములు మనకువిపరీతముగ దోచవచ్చును. వారుపూర్వకాలపు మనుష్యులేకాని శుద్ధప్రవర్తనమునందువారు మనకుదీసిపోరు" అనగా వెంకయ్యరు మొగము చిన్నజేసుకొనెను. "నాతండ్రిమూడుసంవత్సరముల క్రితము నేనొక పునర్వివాహము జేసుకొనిన దంపతులను నాయింట్లో విందుచేసితినని వినివెళ్లెను. ఆయనను నేనొక్కడనే కుమారుడనయినను యీదినమువరకు నాకుత్తరము వ్రాయలేదు. నేను కూడరకుంటిని. ఈరోజున నేనొక్కయుత్తరము వ్రాసితినేని నాడి చేయుగాను రెండువేలయినను బంపగలను. కాని నన్నొక్కసినప్పటికిని వ్రాయను. ఇక నాభార్యనుగురించి నేనుపొగడుట అవ్యక్తమయినను నాతల్లితండ్రులకంటె నాకు నాజానకి ఎక్కువయని నేనంటినేని అది వారిని అగౌరవపరచుట కాదు. నాకీభార్యలేనియెడల నాబ్రతుకేమయియుండునో? నాభార్యకు నగలులేవు. బిడ్డలకుమంచి బట్టలులేవు. ఇంటియందు మంచి మంచి పెట్టెలు, కుర్చీలు, తివాచులులేవని నీవు నిన్నయంటివి. నారెండువందల రూపాయలజీతములో నీవస్తువు లన్నియు నావద్దయుండును కాని ఒకయంత్రనిర్మాణముకొరకై సొమ్మువ్రయము వేలకువేలుచేసి ఆరుసంవత్సరములనుండియు శ్రమపడుచుంటిని. ఈయంత్రమును ఏలాగుననయితేనేమి నిర్మించితిని. [illegible] విధములగుచిత్రపటములను ముద్రించుటయందు నానిర్మాణము ప్రపంచమునందంతయు మార్పును కలుగజేయగలదని నేనుపిచ్చివాడనని తలంపకుము. ప్రతిముద్రాక్షరశాలయు నాయంత్రమును కొనితీరవలయును. ఇంతవరకొకరంగు చొప్పున ఎన్నిరంగులు ముద్రింపవలయునన్న అన్నిపర్యాయములు ముద్రింపవలయును. ఇప్పుడన్ననో నాలుగురంగులు ఒక్కపర్యాయము ముద్రింపవచ్చును. నాయంత్రములు లక్షలకు లక్షలు విక్రయమగును. నేనుకోటీశ్వరుడను కాగలను. ఈనిర్మాణము నాకుకలిగించిన మనోబాధ, నిద్రలేనిరాత్రులు, విశ్రాంతిలేనిపగళ్లు, ఇంటిలో దారిద్ర్యము, వీటినన్నింటిని ప్రస్తుతమువర్ణింపజాలను. నీవిచ్చెదనన్న 3000 రూపాయలు ఆశనుబుట్టించినవి. కాని నాభార్య నాపాలిట దేవతయయి నన్నంగీకరింపకుండ జేసినది. ఇది సంక్షేపముగా నాచరిత్రము. కాబట్టి ఎవడో యీకంట్రాక్టరుయి నాకెక్కువ లంచమిచ్చునని నేనిట్లుచేసినానని తలంపవద్దు"

ఈచరిత్రను వినిన వెంకయ్యరు కొకవిధమయిన చింతయును లజ్జయును గలిగినవి. అయ్యో, యిటువంటి సద్బ్రాహ్మణుని వ్రతమును చెడగొట్టుటకయి యత్నించిన దుర్మార్గుడ ననియనుకొని "చిన్నప్పటినుండియు నేనువర్తకములోని పురుషుడను. సజ్జనసాంగత్యము చేసినవాడనుగాను. మనచెన్నపట్టణములో నేదోయొక విధమున ధనమార్జించుచు సుఖముగానుండుము. వర్తకమునందది యున్నతాదర్శములకు స్థలముకాదు, అవియున్నవాడు వర్తకుడును కాజాలడని అనువారే కాని మీవంటివారులేరు. ఈరోజున మీపవిత్రచారిత్రమును విని ధన్యుడనయితిని. మీభార్యాగారిని గురించి మీరుచెప్పిన యామాటవలన ఆమె సీతాదేవివంటిదని నేను తెలుసుకొనినాను. ముందు మీయనుగ్రహమువలన నేనుపవిత్రవర్తనుడను కావలసియున్నదేమో. నాకొకటి కావలసియున్నది. అది నాకనుగ్రహించితిరేని నేనుకృతార్థుడను."

వెంకయ్యరు యొక్క మనస్సు యీవిధముగా దిరిగిపోవునని నారాయణరావుగారనుకొనక "ఏమిటది" అనిరి.

"మీయమూల్యమయిన స్నేహితము. దానికినేను పాత్రుడనని మీయెదుట నిన్నటిరాత్రి నాప్రవర్తనమువలన జెప్పుకొనలేను. కాని ముందుయోగ్యుడనని నిరూపింపగలుగుదు" నని అయ్యరుగారని నారాయణరావుగారితోపాటు ఆయనయంత్రమును పరీక్షించి దీనిని రిజిస్టరీ చేయించుటకును, యంత్రములను నిర్మించుటకును ఎంతపెట్టుబడి కావలయునని విచారించెను. నారాయణరావుగారు దక్కువలో తక్కువ యేబదివేలనిరి. "వెంకయ్యరను మీరునమ్మవలసినది. ఈధనమును తీసుకొనిరాకపోలేదు." అనిచెప్పి అయ్యరుగారు నారాయణరావుగారికి నమస్కరించి సెలవుపుచ్చుకొని వెళ్లెను.

రేపటిదినము సంవత్సరాదిపండుగ. బిడ్డలకవియివికొనుటకయి ఎక్కడనుండిసొమ్ముతెచ్చెదనాయని నారాయణరావుగారాలోచించుచుండగా నొకతంతివార్తవచ్చెను. తొందరతో రావుగారు దానినిదెఱచి చదివిరి "పండుగకు వచ్చుచున్నాను. రేపుయుదయమూడున్నర గంటలబండికి స్టేషనుకురావలసినది. నూరురూపాయలు టెలిగ్రాపుమనిఆర్డరుద్వారా పంపితిని—తండ్రి"

అనివ్రాయబడియెను. మూడుసంవత్సరములయినపిమ్మట దండ్రివచ్చుచున్నాడని రావుగారికిని, తాతయ్య వచ్చుచున్నాడని బిడ్డలకును, మామగారు వచ్చుచున్నారని జానకమ్మగారికిని కలిగినసంతోషమింతింతకాదు. పోస్టుమేన్ నూరురూపాయల మనీఆర్డరు పుచ్చుకొని యింతలోవచ్చెను. బిడ్డలకును, వారితల్లికిని కావలసిన బట్టలను ఇంటిసామగ్రిని నారాయణరావుగారుకొనిపండుగదినముదయమునరయిలుకువెళ్లి ప్రియజనకుని యింటికిదోడ్కొచ్చిరి. రామయ్యపంతులుగారు తనకుకూతుని మనుమలను, మనుమరాండ్రను, సుగుణరత్నమగు కోడలును జూడగలయుదను కోరికను చాలకాలమెం

క్కడియుత్తరమయినను గొడుకు వ్రాయలేదను కోపముతో నణచిపెట్టియుంచిరి గాని దానినిజంపలేకపోయిరి. రెండుదినములక్రితము రాత్రిపూట "ఎల్లుండి సంవత్సరాదిపండుగ" యనితలంచినవాడయి "అయ్యో, వాళ్లునాతావున నుండకపోయిరి. నేనువాళ్లతావుననయిననుండకపోతిని. ఇంతకువాడుచేసిన తప్పేమిపెద్దది" యని, తన్నుతాను రామయ్యపంతులు నిందించుకొని రూపాయలుపంపి బయలుదేరివచ్చెను.

ఈరోజు జానకమ్మయు, కొడుకును, బిడ్డలును, వారితల్లియు మృష్టాన్నభోజనము నారగించి సావడిలో దమలపాకులను వేసుకొనుచుండగా నొక టెలిగ్రాము ఒకయుత్తరమును వచ్చినవి.

"ఏబదివేలు గాదు. ఒకలక్షరూపాయలకు ఏర్పాటుచేసినాను రేపు చెన్నపట్నములో నన్నిసంగతులు మాటలాడుదును"

కోయంబుత్తూరు, వెంకయ్యర్.

అని టెలిగ్రాములోనున్నది. ఉత్తరములో మామిల్లునందు ఇంజనీయరుగానిని నెలకు 400 రూపాయల జీతముమీద నిచ్చితిమి. వారమునినములలో ప్రవేశింపవలసినది అనిబళ్లారిమిల్లు మేనేజరుగారు వ్రాసియుండిరి. ఈవర్తమానముల నంతయువిన్న రామయ్యపంతులుగారు మనమదృష్టవంతులమే. ఒకశుభముపయిన మరియొకశుభమువచ్చుచున్నదని యనిరి. అక్కడకూడియున్న నలుగురుబిడ్డలలో పెద్దదియగు త్రివేణిఅన్నిటికంటె పెద్దయదృష్టమిద్దియని తనతోబుట్టువులను ప్రశ్నించెను. వారుముగ్గురును తాతయ్య వచ్చుటయేయనిరి. కారణముండకపోలేదు. మనరామయ్యపంతులుగారు వీరికయిపదిలముగా మిఠాయిలనుదెచ్చి పెట్టుటచే బిడ్డలకుతాతగారియం దాదరణమునహెచ్చుచేసినది.

మరునాడుదయమున వెంకటఅయ్యరు వచ్చెను. అందరుచేరి బళ్లారికివెళ్లుదమా, వ్యాపారమారంభించెదమా యని విచారించిరి. జానకమ్మగారు వ్యాపారమనిరి. రామయ్యపంతులుగారు బళ్లారివెళ్లుట మంచిదనిరి. తుదకువ్యాపారముచేయుటకే నిశ్చయింపబడెను. లక్షరూపాయలపెట్టుబడితో ననేకయంత్రములుచేయబడియెను. పత్రికలలో ప్రకటనములు బాగుగా జేయబడియెను. మొదటిసంవత్సరమునందు 12 లక్షలరూపాయల యంత్రములమ్మబడియెను. పదిసంవత్సరములలో నారాయణరావుగారు లక్షలార్జించిరి. ఇంకను అర్జించుచున్నారు. వెంకయ్యరు నారాయణరావుగారికి ముఖ్యమేనేజరయి నెలకువెయ్యిరూపాయల జీతముపుచ్చుకొనుచు స్వామిభక్తిగలిగి, పరిశుద్ధప్రవర్తనముగలవాడయి యున్నాడు. నారాయణరావుగారికి ధనముతీసుకొనిరాగల సౌఖ్యములెట్టివయినను వాటికిప్పుడు కొఱతలేదు. జానకమ్మగారేమయిన మారిపోయినదా? ఎంతమాత్రమునుకాదు. ఆమెపూర్వపు పతిభక్తి, దైవభక్తిగల జానకమ్మగారే. ధనముపుష్కలముగానుండుటచేత మహాదాతయనిగూడ చెన్నపట్టణమంతటను పేరువ్యాపించినది. నిరంతరమీమెగృహము అన్నపూర్ణాదేవికి నిలయము. మరినలుగురు బిడ్డలనుగని అష్టయిశ్వర్యములతోను జానకమ్మగారు తులతూగుచున్నది. అనేకపర్యాయములు సాయంకాలపువేళ మేడమీదకూరుచుని తమపూర్వజీవితమునుగురించి భార్యాభర్తలు మాటలాడుకొనుచుండగా నన్నిసంపదలకును కారకురాలవు నీవేయని భర్త జానకిని యభినందించుచుండును. మీపరిశ్రమా ఫలితమిదియని భార్యయనుచుండును. నీవాపరిసంవత్సరములు పర్వకష్టములకు నోర్చుకొనియుండకపోయినయెడల నానిర్భాగ్యముగతి ఏమయియుండునోయని భర్తమారుపల్కును. భార్యకు పెనిమిటిని స్వర్గములోనికి దీసుకొనివెళ్లుటకయినను, లేక నరకములోనికి బడద్రోయుటకయినను మహాశక్తికలదని అనేకమంది స్నేహితులతో నారాయణరావుగారు చెల్లప్పుడనుచుందురు. తమవద్దకేయెవరును సలహానిమిత్తమయి వచ్చినను నిరంతరకృషి, భగవదనుగ్రహమునకు శాంతముతో గాచుకొనియుండుట యివిరెండును మీకుకావలసినవియని నారాయణరావుగారు పలుకుచుందురు.



Bombay's Welcome to their Imperial Majesties.



శ్రీరాజదంపతులకు బొంబాయిలో జరిగిన స్వాగతము.

The Circuit House where Their Majesties Stayed.



ఢిల్లీ నగరములో శ్రీ రాజదంపతులు నివసించినమందిరగుడారములు.

Camps at Delhi.



ఢిల్లీ నగరములోని శిబిరములు.

The Coronation Pavillion, Delhi.



శ్రీ రాజదంపతులు రాజ్యాభిషిక్తులైన మంటపము.

Indian Princes. The Imperial Cadet Corps.



హైందవ రాజకుమారుల పటాలము.

Laying the Foundation of the New Capital at Delhi.



ఢిల్లీయందు నూతననగర శంకుస్థాపనము.

The Nabha Camp, Delhi.



ఢిల్లీలో నాభామహారాజుగారి శిబిరము.

# ఆంగ్లేయ పరిపాలనా లాభములు.

మ.రా.శ్రీ, కొ్రివ్విడి శేషవెంకటకాశీపతి గారిచే వ్రాయబడినది.

శ్రీహరిసమానులగు వ్యాసవశిష్ఠాది మహామునులచేతను మన్మథాకారులగు రాకుమారులచేతను, సకల రాజకీయ వ్యవహారతంత్రజ్ఞులగు మంత్రులచేతను, అనల్ప శిల్పకలానైపుణిం దెల్పుకట్టడంబులనొప్పు పట్టణంబులచేతను, శత్రుకోటికభేద్యంబులగు కోటలచేతను, మానససరోవరోపమానంబులగు సరోవరములచేతను, వియద్గంగా ప్రవాహమును దిరస్కరించువాహినులచేతను, సకలఫలభరితములగు వనములచేతను, మరియును సకలవైభవ సమేతంబై, విస్తీర్ణము చేతను జనసంఖ్య చేతను వన్నెకెక్కిన యీభరతభూమికి, శాంతచిత్తులును నైకమత్యధనసంపన్నులు నగు నాంగ్లేయులు ఐరోపాఖండమునుంచి 1599 సం॥రం॥ డిశంబరు 31 తేదీనాటికి సూరత్ నగరమునకు వర్తకముఁజేసికొను నుద్దేశమునవారికిఁ బ్రభ్విణియగు నెలెజబెత్ రాణీవద్దనుంచి యిక్కడి ప్రభువగు నక్బరుచక్రవర్తిపేర శిఫార్సు పత్రమును గైకొని వర్తకసంఘముగా వచ్చినారు.

వారు పదియారవ శతాబ్దము మొదలుకొని అప్పటిప్రభువులసమ్మతిని యీ దేశమున వర్తకవ్యాపార వర్తనులై న్యాయముగా ధనమును సంపాదించుకొనుచుండిరి. అప్పటికి హిందూదేశముయొక్క స్థితి పరస్పరకలహములతోను జాతిమతద్వేషములతోను నిండిక్రమముగా యుద్ధములవరకు ముదిరినది.

వీరుక్రమముగా వర్తకాభివృద్ధిఁ జేసికొనుచు వారికి న్యాయపక్షమని తోఁచినయడ యుద్ధములలో సహాయముఁజేయుచు 1611 సంవత్సరమున సూరత్ కోటనుసంపాదించుటయేగాక, 1672 సంవత్సరము మొదలుకొని రాజ్యసంపాదనకు ప్రారంభులై 1858సంవత్సరమునాటికి హిందూదేశమున సంపూర్ణరాజ్యమును స్థాపించిరి. అంతట 1857 సంవత్సరము సిపాయి కలహము రాగా యీమహారాజ్యము కంపెనీవారినుండి శ్రీవిక్టోరియా మహారాణీగారి క్రిందనుండుట యేమంచిదని 1858 సంవత్సరం నవంబరునెలలో నామహారాజ్ఞిగారి వశము చేయబడినది. నాటినుంచి 1901సంవత్సరము వరకున్నూ శ్రీమహారాజ్ఞిగారిచేతనే సర్వవిధముల మనము చక్కగాఁ బరిపాలింపఁబడితిమి. తల్లిగారి యనంతరము శ్రీసప్తమ యెడ్వర్డు చక్రవర్తిగారు వంశానుక్రమముగా వచ్చురాజ్యభారమును 1901సంవత్సరము మొదలుకొని 1909 సంవత్సరమువరకును వహించి తమతల్లిగారిమార్గము ననుసరించి మనలఁజక్కగాఁ బరిపాలించి కీర్తిశేషులైరి.

పిమ్మట వర్తమానప్రభువులగు శ్రీ జార్జిచక్రవర్తిగారు వంశానుక్రమముగా వచ్చురాజ్యభారమునుఁగైకొని తండ్రిగారిస్థానము నలంకరించి జూన్ 22 తేదిని 1911 సంవత్సరమునయింగ్లండులో మహావైభవముతోఁ బట్టాభిషిక్తులై మున్నెన్నఁడు మనకులభించనట్టి మహావైభవమును జూపనెంచి యత్యుదార దయాస్వాంతులై మనహిందూదేశమందలి డెల్హీ నగరమున మకుటధారణ మహోత్సవము జరుపనిచ్ఛగించి దంపతీసమేతులై దయచేసియున్నవారు. జరుగనున్న వర్ణనాతీతమైన యామహావైభవమును గురించి యిపుడేమి వ్రాయఁగలుగుదును. ఈవిధముగా నేకఛత్రాధిపత్యముగా జరుగుచున్న యీమహారాజ్యాధిపత్యమును వహించిన ఆంగిలేయ పరిపాలనముక్రింద మనకులభించిన లాభములనుగూర్చి వ్రాయఁబూనినచో లెక్కకుఁ బెక్కులున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానిలోఁ గొన్నిముఖ్యాంశములను గూర్చిమాత్రము వ్రాయుచున్నాను. గనుక చదువరులిందలిలోపములను మన్నింతురుగాక.

## శాంతి.

"శాంతిలేకున్న జగములు * సమసిపోవు"

శాంతిసంస్థాపనము ప్రతిరాజ్యమునకు పునాది రాయివంటిది. శాంతిలేనిదే పరిపాలనాయంత్రము నడువనేరదు. ప్రతిదేశమునందును ప్రతిమతమునందును ప్రతిజాతి

యందును, మానవులందరు జ్ఞానసంపన్నులయి నీతివర్తనులయియుండుట యసంభవము. *కావునఁ బ్రతిదేశమునందునుఁ బ్రతిజాతియందునుఁ, బ్రతిమతమునందును, జారులు, చోరులు, దురహంకారులు, మధుపానాసక్తులు, దుర్మార్గవర్తులు తొంబదిపాళ్లును పరోపకారపారీణులును, దయాసత్య శౌచాది సద్గుణసంపన్నులును, నీతికోవిదులు నగు పుణ్యపురుషులు పదిపాళ్లునుఁ గలిగియుందురుగాని మంచిస్వభావముగలవా రెక్కుడుమంది యుండరు గనుక పైనఁబేర్కొనఁబడినవారిలో నొక్కొకరే శాసనానుబద్ధమైన శిక్షలే లేనియెడల పరనారీమణులఁ జెఱఁబట్టియుఁ బరధనముల నపహరించియు హింసలకుఁదెగించియు నొడలుఁదెలియక ననేకవిధములఁ బ్రలాపించియుఁ జేయఁదగినన్ని యకార్యములంజేసి తుదకు శాంతిని రూపుమాపి, మహాసంక్షోభము నుద్భవింపఁజేసి దేశము నంధకారబంధురముగాఁ జేసివేయుదురు. కావున, బ్రిటిషువారీవిషయమున సంపూర్ణ శ్రద్ధాసమేతులై దుర్మార్గుల శిక్షించుచు సన్మార్గుల గౌరవించుచు మాననీయంబును శతవిధంబుల నుతియింపఁదగినట్టిదియు నగు శాంతిని దేశమునందు నెలకొల్పిరి. దానిచేఁ బ్రజలు తమహక్కులకు భంగములేనివారలై స్త్రీలు మానమును గాపాడుకొనఁబడినవారలై హాయిగా సుఖించుచున్నారు.

### నీటిసదుపాయము.

“వారిఁద్రావనివారలు * లేరుభువిని.”

గంజిఁద్రావు భిక్షుకులు మొదలు అమృతపానముఁ జేయు చక్రవర్తులకు సైతము నీరమత్యవసరము. ఇంతేఁ గాక సృష్టిలోఁగల బహుపక్ష్యాదులు క్రిమికీటకాదులు తరుగుల్మలతాదులు సర్వసస్యములు నీరములేనిదే నిలువనేరవు. నీరములేనిదేఁ బెరుఁగనేరవు. శుద్ధజడములైన రైలు వేయంజిన్ మొదలగు యంత్రములు సైతము నీరులేనిదేఁ దమతమపనులను నిర్వహింపఁజాలవు. అందుచేతనే యిట్టి మహత్తరమైన నీరమును నారాయణస్వరూపమని మన [illegible]మహాజనులు వేనోళ్లఁ బొగడియుండిరి. ప్రాణప్రదమైన యీనీరమును నొసంగుటచేతనే మేఘునకు మహాదాతయని మనపూర్వులందరును గొప్పబిరుదము నొసంగి వానిని దైవసమానునిగాభావించిరి. నీరము నారాయణస్వరూపము గనుకనేఁ దదీయసంచారముగల భూములు సారవంతములై లక్ష్మీకళనొప్పుచున్నవి. మిగిలినవి బొగులుబొగులుమనుచుదిగులొందుచుఁ బెద్దమ్మకునికిపట్లగుచున్నవి. ఇట్టిలక్ష్మీప్రతిరూపమైన యీనీరమును సర్వత్ర ప్రవహింపఁజేయుటకై మనయాంగిలేయ ప్రభువులెంతధనమును వెచ్చించి యెంతప్రయాసమునకులోనై విడువని పూనికతోఁ బనిచేసిరో కృష్ణా గోదావరీ మొదలగు నదుల ఆనకట్టలును కాలువలునుఁ జెప్పఁగలవు. బెజవాడ కాకినాడ మదరాసు మొదలగుపట్టణములలో గొట్టముల వలన మేడలపైకి సైతము మంచినీటినిఁ బ్రవహింపఁజేయుట జూడఁగా నెట్టిమానవుఁడైనను యీప్రభుత్వమునఁ గలిగిన మహాద్భుతమైన నీటిసదుపాయమునకు సంతసింపకపోఁడు.

### అయోమార్గ సౌకర్యము.

“కాశివంటింటిపెరటిలోఁ * గానుపించె”

ప్రతిదేశమునందును దేశమునంగల ప్రజలెల్ల రొక్కచోనుండరు. పట్టణములఁగొందరుఁ బల్లెలఁగొందరు వనములఁగొందరు, కొండకనుమలంగొందరు నివసించియుందురు. ఇందుచే న్యాయస్థానములు బొజారులు పలుతావుల నుండియుండును. వ్యాపారజీవనులైన మానవులు తమకువలయు వస్తుసామగ్రిని సమకూర్చుకొనుటకుఁగాని న్యాయవిమర్శనమునకై న్యాయస్థానముల కేగుటకుగాని బంధుజన సందర్శనమునకుఁగాని పుణ్యక్షేత్ర పుణ్యనదీదర్శన స్నానాదులకుఁ బోవుటకుఁగాని ప్రయాణము లత్యవసరములు. ఆప్రయాణములకు బాటలవసరముగ. ఈవిషయమై యాంగిలేయపాలకులు వచ్చినపిమ్మట మనకిరుపార్శ్వములయందుఁ జల్లనినీడ నొసంగు వృక్షములను గలిగిన రాజబాటలు లభియింపఁబడుటయేగాక మున్నెన్నఁడును యేపరిపాలనమునందును లభియింపఁబడని వాయువేగ మనోవేగ సదృశవేగముగల అయోమార్గ సౌకర్యము యేర్పాటుఁజేయఁబడ్డది. దృశ్యమాత్ర శ్రమనివారణములగు పచ్చనిచెట్లచేతను, చంద్రసమానకాంతి నిడు దీపములచేతను, దుర్మార్గశిక్షకులగు రక్షకభటులచేతను, కా

లపరిమితిఁ దెల్పుగడియారములచేతను, ప్రకాశమానమై బాటసారుల కమిత సౌఖ్యకరంబులైన స్టేషనులు కట్టఁబడినవి. తొల్లి ప్రాణములఁ జేతఁబట్టుకొని యదరుబెదరు గుండెలతో నారుమాసములకేగు ప్రయాణము నిప్పుడు హాయిగా నే బెదరులేక నారుపూటలలో జేయఁగలుగుచున్నాము. ఇంతయేల నవమాస పూరితలగు నబలలు సైతఁ మొంటిఁ దమపుట్టింండ్లకేగుటంబట్టి రాకపోకలకీయరో మార్గ మెంతసౌకర్యమైనదియు నేను వేరుగ చెప్పనక్కరలేదు. యెంతటిద్రవ్యప్రయాసమున నీకార్యము సమర్థింపఁబడిననియు గోదావరీ కృష్ణావంతెనలు చెప్పగలవు.

సమాచారసౌఖ్యము, తంతి, తపాలు.

“వార్తవలనజగము * వర్థిల్లుచుండును.”

మనోవేగమునకంటె వేగమైనదేదియుఁ గానరాదు. తలఁచుకొనినంతనే నదులను సముద్రములను వనములనుఁగూడ దాటిపోయి మనచేఁ దలంపఁబడినదానిని మనకుఁ జూపంగలదు. అటువలెనే మహావేగమున నీహిందూదేశమునసేఁ గాక యితరదేశములకు సైతము జనుదెంచి యెవరికి వలసినవార్తలను వారికిఁదెలియఁజేయుచుఁ గష్టసుఖంబుల కాత్మబంధువై సాయఁపడుచు రాజకీయ వ్యవహారముల నూర్వురమంత్రులవలె నూరుచోట్ల నూర్వురితో సలహాలఁజేసిచచ్చుచు విధివిరామములులేక ననేకుల కనేకరీతుల సర్వమర్మముల నెఱుంగఁజేయుచున్న తీగెతపాలనెంత వర్ణించినఁ దనివి తీరదు. కడుపులో నీరు గదలకుండఁ బ్రయాణపరుల నెవరిగమ్యస్థానముల వారిని డిగ్గవిడచు ధూమశకటమునకు రక్షయై తాను ముందంజవైచి పిమ్మట గానిని నడపించుచుండుటంజూడ దీనియుపయోగమింతని చెప్ప శక్యముగాదని నానమ్మకము.

తపాలు.

ఆసేతు హిమాచలాంతమునంగల మనబంధుమిత్రుల క్షేమవార్తలను మనమొక కానితో మూడవనాటికేఁ దెలిసికొనఁగలుగుటకును మనక్షేమమును వారికెఱుఁగఁజేయుటకును, స్వల్పద్రవ్యమున మనవద్దనున్న ద్రవ్యమును వారికిఁబంపించుటకును వారివద్దనున్న ద్రవ్యమును మనము తెప్పించుకొనఁగలుగుటకును, యీతపాలుసాయపడుచున్నది. ఇంతేగాక జపాను మొదలగు అన్యఖండనివాసుల సేమవార్తలనుగూడ రమారమి మూడణాల డబ్బులతో మనము తెలిసికొనవచ్చును. కావున తపాలాఫీసులవల్ల పూర్ణమైనవార్తాసౌఖ్యమునుఁ బొందుచున్నామని చెప్పనొప్పును.

విద్యాభివృద్ధి.

“చెలగు విద్యాధనమ్ముకుఁ * జేటులేదు.”

నాగరికాగ్రగణ్యులగు పాశ్చాత్యులు మనదేశపరిపాలన మారంభించినవెంటనే మనవిద్యలను వారు గ్రహించి యూరకొనక వారిభాషను మనకు లభింపఁజేయ విశాలహృదయముతోఁ గొన్నికలాశాలలను స్థాపించియు వాటిపైఁ బెక్కండ్రఁ బరీక్షాధికారులను నియమించియుఁ బరీక్షలలోఁ గృతార్థులైనవారల కున్నతోద్యోగములనిచ్చియుఁ గొందరికి యుచితవిద్యార్థి వేతనములిచ్చియు ననేకవిధంబుల విద్యావ్యాపకమునకైఁ బ్రోత్సాహమొసంగుటయేగాక మనతోఁబుట్టువులనియు మనబిడ్డలనియుఁ దుదకు మనజన్మస్థానములనియుఁదలంపక స్త్రీవిద్య కూడదన్న మనవారి మూర్ఖశాసనమనువ తిమిరంబుఁబలెదిశాభాగంబులం దెల్లఁగప్పికొనుటం గాంచి, తమబిడ్డలుఁదమతోఁబుట్టువులుఁ దమతల్లులుంగాకపోయినను మనస్త్రీలయెడల దయఁగలిగి తమప్రజలు తమబిడ్డలే యనునంతటి యత్యుదారచిత్తమున స్త్రీవిద్య యత్యావశ్యకమనియు ను, స్త్రీలు బురుషులవంటి మనుజత్వముఁ గలవారేయనియునుఁ దెలియఁజేయుచు లక్షలకొలఁది ద్రవ్యమునువెచ్చించి పట్టణములందునుఁ బల్లెలందునుఁ బెక్కుపాఠశాలలుంచి వేతనములంగొనక స్త్రీవిద్యను సైతము మిక్కిలి యభివృద్ధినొందించియున్నారు. సకలధర్మబోధకములగు పత్రికలఁ జదువుకొనుటకును, యీప్సిత ఫలప్రదాయిని యగు దేశీయ మహాసభానంస్థాపనమునకును పురోవృద్ధి సోపానంబగు విదేశయాత్రకును యీవిద్యయేగారణము. ఏయేదేశవాసు లేయేరీతులనే యేస్వాతంత్రియములఁ గలిగి పరిపాలింపఁబడుచున్నారో ఆయావిషయమైకనుబోధకములగు చరిత్రలం జదివికొనుటకును, ఆయా స్వాతంత్రియముల నభిలషించుటకు యీవిద్యయేఁ బ్ర

ధానము. వేయేల దొరతనమువారి కట్టెదుట మేమిదివరకె సమర్థులమైతిమి. కాలోనీలవంటి స్వరాజ్యమును మాకిప్పింపుడు. మేము మాకార్యమును సమర్థించుకొనఁగలమను నంతటి దివ్యజ్ఞానము నొసంగుటకీవిద్యయే మూలము. కావున నీపరిపాలనమునఁ బురోవృద్ధికరమైన విద్యలభియింపబడినదనుటకు సందేహములేదు.

### సివిల్ క్రిమినల్ కోర్టులన్యాయదక్షత.

“శిక్ష లేకున్న లోకాలి * చేటుగాంచు”

ప్రజలయుపయోగమై తగినంత న్యాయవిమర్శనమున కీరెండుకోర్టులును యెక్కువ పనిపుచ్చుకొనుచున్నవని చెప్పనొప్పును. ఎట్టిబీదవాడైనను యెంతటి జమీందారుపైనైనను చర్యజఱపుకొని న్యాయముఁ బొందుటకును, యెట్టిదుర్బలుఁడైనను తానవమానింపఁ బడినప్పుడెట్టి మహాబలశాలిపైనైనను క్రిమినల్‌చర్య జఱపించి వానిని శిక్షింపజేయుటకును వీలునిచ్చుచున్నవి. ఒకకోర్టులో న్యాయముదొరకనప్పుడింకొకకోర్టునం దప్పీలుఁజేసికొనవచ్చును. అప్పుడును దప్పిపోయినయెడల యింకొకకోర్టునం దప్పీలుఁజేసికొనవచ్చును. అక్కడను అన్యాయయిన యెడల పునర్విమర్శనముఁ గోరుకొనుట కవకాశముగలదు. రూ. 5000-0-0 అయిదువేల యాదాయముగల కుటుంబయజమానులు చనిపోయినప్పుడు తరువాయి వారసు మైనరైనప్పుడా ఆస్తిని కోర్టువారు మేనేజిమెంటుచేసి వృద్ధిఁజేసి మేజరైనవెంటనే ఒప్పగింతపెట్టుదురు. మానవుని మృతకళేబర మొందేని గానవచ్చినవెంటనే దానివిషయమై తగినంతశ్రద్ధతోఁ బరిశీలింపఁబడి హంతకులుపట్టుకొనఁబడుచుందురు. అట్టివారు విచారింపఁబడి, నేరస్థాపకులైనయెడల ద్వీపాంతరవాసములకును, యురిశిక్షలకుఁ బాత్రులగుచుందురు. నష్టపూర్తి మొదలగు కొన్నివిషయములలో దొరతనమువారిపైనను దావాలుచేసి న్యాయముఁబొందుట కవకాశముగలదు. కావున కోర్టులు వానికర్తవ్యము నవి నెరవేర్చుచున్నవనుటకు సందియములేదు. హైకోర్టడములకైయెంతెంతధనము వ్రియపెట్టఁబడినదియు మదరాసు కలకత్తా మొదలగు హైకోర్టులఁ జూచినచో స్పష్టపడగలదు.

### వివిధవిషయ సాహాయ్యము.

తండ్రిమరణమునకు దుఃఖించుచుండఁగాఁ దల్లినిఁ గూడ లేకుండజేసెడు సహగమనమను దురాచారము రూపుమాపఁబడినది. కలకత్తాప్రాంతమున మిక్కుటముగా జఱుగు నరబలులు తొలగింపఁబడినవి. గాలపుసిడులు శిశుహత్యలు బందిపోటులు మొదలగు ఘోరకార్యములు నిర్మూలముచేయఁబడినవి. మశూచి మహామ్మారి మొదలగు సంటురోగములకు టీకాలువేయుట గనిపెట్టఁబడి అవి యుక్తులు జఱుఁగుటకు శాసనములేర్పరుపఁబడ్డవి. ఆరోగ్యాభివృద్ధికై యాసేతు హిమాచలాంత మనేకవైద్యశాలలు స్థాపింపఁబడినవి. మతవిషయమైన నిర్బంధమూలేదు. నీచజాతులవారు దయతోఁ జూడఁబడుచున్నారు. స్త్రీపునర్వివాహములు శాస్త్రీయములుగా నంగీకరింపఁబడినవి. దేవాదాయ ధర్మాదాయ సంరక్షణములకై శాసనములేర్పడి యువిజాగ్రతతోఁ గాపాడబడుచున్నవి. కంసాలులు తేలీలు మొదలగు కొన్నిజాతులును వివాహాదులయందునుఁ బల్లకీలెక్కనీయని మహానాటి కట్టురద్దుచేయఁబడ్డది. లంచగొండులైన యధికారులు వంచింపఁబడుచున్నారు. వ్యవసాయాభివృద్ధి కనేకప్రయత్నములు జరుగుచున్నవి. వర్తకాభివృద్ధి కనేకసౌకర్యము లేర్పరుపఁబడ్డవి. ధనమును దాచికొనుటకనేకధనాగారములు నెలకొల్పఁబడ్డవి. కాగితములు, ముద్రణాయంత్రములు కుట్టుమరలు, సైకిలులు, హార్మోనియములు, టైపురైటింగుమెషినులు, బయోగ్రాఫ్‌యంత్రములు, గ్రామఫోన్‌యంత్రములు మోటరుబండ్లు ఆకాశవిమానములు, మెఱుపుదీపములు మున్నగునవి యెన్నియో రాఁబడినవి. ప్రజలు జ్ఞానముచేతను సంఖ్యచేతను వృద్ధిఁజెంది తొల్లిటియౌన్నత్యముఁ బొందజూచుచున్నారు. కావున నీప్రభుత్వమున వృద్ధినొందుచున్నారని చెప్పుటకు సందియములేదు.

అఖండరాజ్యలక్ష్మీ సామ్రాజ్య వైభవోపేతులైన నీయాంగ్లేయ రాజదంపతులను వారికుటుంబమును సర్వేశ్వరుఁడు సర్వదా రక్షించుఁగాకయని కోరుచు నింతటితో విరమించుచున్నాఁడను.

భాషాభివృద్ధికెన్ని విధముల ప్రయత్నప్రయాసములకు లోనగుచున్న యీపత్రికను నిరంతరాయముగాఁ బోషించుభారము ఆంధ్రమహాజనులదైయున్నది. చందాను కొంచెము హెచ్చించిరని విముఖత నొందకుందురుగాక!

---

# వ్యవసాయాభివృద్ధి.

మ. రా. శ్రీ యస్. థామ్సన్ గారిచే వ్రాయఁబడినది.



ఎవరైనను యీ దేశమునకువచ్చి చూచినయెడల ఇండియా దేశపు వ్యవసాయాభివృద్ధికిన్ని యితర దేశములందుగల అభివృద్ధికిన్నిగల తారతమ్యమును తెలుసుకొనగలరు. వ్యవసాయపురైతులతో సంభాషణచేసినయెడల అట్టిభేదమును తెలుసుకొనగలరు. ఆభేదమెద్దియన ఇండియా దేశపురైతులు వారిగ్రామమునుగురించి వారికులమునుగురించిన్ని ముఖ్యముగా వారికుటుంబమును గురించిన్ని మాత్రమె మాట్లాడగలరు. ఇతర దేశపు రైతులు వారి దేశమును గురించి వారిరాజునుగురించిన్ని వారిజనులనుగురించిన్ని మాట్లాడగలరు. ఇందుకొక నిదర్శనము గలదు. సముద్రమునుండి దేశమునుచూచుటకై ఒక తాబేలువచ్చినది. అది యిటునటుచూచినప్పుడు ఒకభావిలో పడినది. ఆభావిలో ఒకకండ్లులేని తాబేలున్నది. ఆభావిలోకలిగిన చప్పుడును వినగానే ఆకండ్లులేని తాబేలు ఒరే నీవెచ్చటనుంచి వచ్చితివనియడిగెను. సముద్రమునుండి దేశమునుచూచుటకైవచ్చి అటు యిటు చూచి తటాలున యీభావిలోపడితినని ప్రత్యుత్తరమిచ్చెను. ఆకండ్లులేని తాబేలు ఆబావిలో కొద్ది వలయాకారముగా తిరిగి సముద్రమింత పరిమితిగలదేనా యని ప్రశ్నించెను. దీనికంటె చాలాపెద్దదియని రెండవది బదులుచెప్పెను. అప్పుడు ముందుదానికంటె మరికొంత హెచ్చు వలయాకారముగాతిరిగి సముద్రమింత పెద్దదిగానుండునా యని అడిగెను. యింతకంటె చాలాపెద్దదిగానుండునని బదులు చెప్పెను. అంతట ఆకండ్లులేని తాబేలు భావియంతయు చుట్టుతిరిగి సముద్రమింత పెద్దదిగానుండునాయని ప్రశ్నించెను. ఇంతకంటె మరీపెద్దదిగానుండునని బదులుచెప్పెను. వెంటనే ఆకండ్లులేనితాబేలు నీవెందుకు యీబావికంటె సముద్రము పెద్దదిగానుండునని నాతో అబద్ధమాడితివని విస్తారముగా కోపపడెను. ఆలాగుననే లోకములోనుండు ప్రతివారును తామేది గొప్పగానుండునని తలంచెదరో దానికంటె విస్తారమైన సంగతిని వినవచ్చినపుడు తాము తలంచినదెగొప్పదని భావించుకొరకై వారలపై కోపగించుకొందురు. ఈమాదిరిగానె మనదేశములో వ్యవసాయాభివృద్ధిని కలుగజేయవలెనంటె రైతులు ముందుగా తమకున్న స్వగర్వమును పోగొట్టుకొనవలెను. రైతులు తాము నివసించుచున్న గ్రామముకంటె పెద్దదియగు పట్టణమును చూడవలెననెడి అభిలాషకలిగి ఓడయాత్రగాని రైలుమీదనుగాని ప్రయాణముచేసి కొద్దిడబ్బును ఖర్చుచేసినమీదట తామున్న గ్రామమునకంటె పెద్దదియగు పట్టణమున్నదని చూచుచున్నారు. కండ్లులేనితాబేలు తానున్నభావికంటె విస్తారమైన దేదియు లేదుగదాయని యెంచియున్నతలంపు యేవిధముగా సముద్రములోనుండివచ్చిన తాబేలుచెప్పిన సంగతినిబట్టి గొప్పస్థలమున్నదని గ్రహించెనో ఆలాగుననె రైతులు తామున్న గ్రామమునువిడచి మరియొక గొప్పపట్టణమునకువెళ్ళి చూచినప్పుడుగదా దానిభేదమును కనిపెట్టగలరు. వ్యవసాయవృద్ధికి చదువు మరియొకమార్గము. కొంతమంది మనుష్యులు దేశదేశములుతిరిగి వ్యవసాయపుపద్ధతులను గ్రహించగలరు. చదువువచ్చినయెడల యితరులు వ్రాయువ్యవసాయపద్ధతులను స్వయముగ నేర్చుకొనగలరు. ఇట్టి కొరతను కనిపెట్టియె సర్వజనులు విద్యనభ్యసింపజేయవలెననెడి తలంపుతో డిల్లిదర్బారు మహోత్సవమందు మనచక్రవర్తిగారు విద్యకై 50లక్షుల రూపాయలు యిండియా దేశమువారి కివ్వబడునని వెల్లడిచేసియుండిరి. కాబట్టి రైతులందరు యీపట్టాభిషేక సమయమున చక్రవర్తిగారిచే నొసంగబడిన ద్రవ్యమును విద్యకై ఉపయోగించుకొనుటకు మంచితరుణమైయున్నది. రైతులు చదువులేకుండా నున్నంతవరకు వ్యవసాయము వృద్ధిలోనికిరానేరదు. అనేకవిషయములలో రైతులు నేర్చుకొనవలసినటువంటి ముఖ్యాంశము మరియొకటి యిచ్చట ము

చ్చటించెదను. గ్రామములకుగాని పట్టణములకుగాని వెళ్ళుడము తటస్థించినప్పుడు పశువుల మలమూత్రములు ఉపయోగములేకుండా నుంచుటనుచూచుటకు నాకుచాలా కష్టతరముగానుండెను. దానిని అచ్చటచ్చట పైవిధముగా పారవేసిన పశువుల మలమూత్రములను తొక్కుడుగడ్డిలో మలమునుమూత్రము పిడకలుచేసుకొని వాటినివంటచెరుకుగా నుపయోగపర్చుకుంటూ పైరులకు ముఖ్యముగా కావలసిన ఆహారమును వ్యర్థముచేయుచున్నారు. మరికొందరు పశువుల మలమూత్రాదుల వగైరాలయొక్క ఉపయోగమునుగానకనె వాటిని యెండకు యెండనిచ్చి దానిని ఉపయోగములేకుండా జేయుచున్నారు. చీనాజపాను దేశములలోని రైతులువ్యవసాయపుపద్ధతులను గ్రహించినట్లుగా యీదేశమువారున్ను గ్రహించి సార్థకపరచవలెనని నాతలంపు. పంటనుయిచ్చునది ముఖ్యముగా భూమిగాదు అదియెద్దియనః— యెరువుమాత్రమే. యెరువు పైరులకుముఖ్యమైన యాహారము. నేను బాపట్లకువచ్చినది లగాయితుచూడగా వాదభూములు జిరాయితిలేకనే ఖాళీగానుంచబడెను. వాదలో కొంతభాగమునుమాత్రము పట్టాలకుపొందిన రైతులు వాటినిచక్కగా పండించుకొనుపద్ధతి తెలియక ప్రతిసంవత్సరము మురుగువాయి నష్టపడడము మురుగులేని సంవత్సరమైనను పంటలుసరిగా పండక నష్టపడడముచూచితిని. యిట్లు జరుగుటయంతయు రైతులయొక్క అజ్ఞానమనియెంచి నేను స్వయముగా గవర్నమెంటువారివద్దనుండి అయిదు యెకరములభూమిని పట్టాకుపుచ్చుకొని ఆభూమిచుట్టు ముందుగ యెత్తయినకట్టనువేసి సాగుచేసితిని. ఆసంవత్సరము ఇతర రైతులు పెంపుచేసిన పైరుకంటె నేనుస్వయముగా వేయించిన పైరు యేవిధమైన నష్టములేకుండా విస్తారముగా ఫలించినది. అప్పుడు నేనుచేసినపద్ధతిని యితరరైతులు చూచి పొలమునకుచుట్టూను యెత్తుగానుండుకట్టను వేసుకొనక పోవుటవల్లగదా మనపైరులు నష్టపడినవని గ్రహించిరి. ఆమరుసంవత్సరము యెముకలపొడిని బస్తాలతో తెప్పించి పొలముపైచల్లించి నాటువేయగా మొదటిసంవత్సరము ఫలించినదానికంటె రెండురెట్లు యెక్కువగా ఫలించినది. దీనినిచూచి భూములకుయెత్తుగా కట్టనువేసుకొనుట మాత్రమేగాక మంచియెరువునుగూడా ప్రతిసంవత్సరము వేయుచుండవలెనని రైతులుగ్రహించిరి. నేను యీఅయిదు యెకరములమీదను చేసిన పనివలన వచ్చుపంటను చూచి యింకా యేబదియైదు యెకరములభూమిని గవర్నమెంటువారివలన పుచ్చుకొని చుట్టూను పూర్వమువలెనె కట్టవేయించి సాగుచేయుచుంటిమి. యావత్తు పరిమాణపుపొలమునకు యెముకలపొడిని తెప్పించే యెడల విస్తారముఖర్చు అవుతుందనియెంచి యీభూమిని పుచ్చుకొని జిరాయితి చేయించుచున్న బాపట్ల అన్యోన్య వ్యవసాయపుసంఘమువారు బజారులలో వూడ్చబడు తుక్కును యావత్తునుకొని ఒకగుంటలోపోయించి దానిపైన మట్టిపోసి నీళ్ళతో రెంటును కలుపుచూ మంచియెరువు మున్నుగాజేసిరి. అటువంటి మాగనిచ్చిన మట్టిని యీపొలమునకు యెరువుగా ఉపయోగపరచి సాగుచేసినందున గతసంవత్సరము మట్టివేయకనె పండించిన 10పుట్ల ధాన్యముకంటె యీసంవత్సరము నూతనముగా తయారుచేసిన యెరువును ఉపయోగించి సాగుచేయుటవల్ల సుమారు 30పుట్లుకాగల పంటగా గాన్పించుచున్నది. యిదేప్రకారము ప్రతిసంవత్సరమున్నూ అట్టియెరువును పొలములలోవేయుచూ సాగుచేసినయెడల పైసంఘమువారి కేర్పడియున్న 55యెకరముల భూమిలో 50పుట్లు ధాన్యముగూడా కావచ్చునని దృఢమైన నమ్మకముగానున్నది. గనుక ప్రతిరైతున్నూ తనపశువుల కొట్టమునకు సమీపముగా ఒకగుంటనుత్రవ్వి పశువులవద్దనుండు మలమూత్రములు త్రొక్కుడుగడ్డిని, పిడకలు వంటచెరుకుగా నుపయోగించినందువలన గలిగినబూడిదెయును ఆగుంటలో వుంచుచూ దానిపైన పాటిమన్నునుపోయుచూ యివిరెండును తడియునట్లు నీళ్ళుపోయుచూ యిదిసూర్యరశ్మికి యెండిపోకుండునటుల పైన ఒకపందిరిగా వేసినయెడల మంచిఫలవం

తమైన యెరువు యేర్పడును. ఇట్లుయేర్పడిన యెరువును పొలముల కుపయోగించి సాగుచేసినయెడల తనకలలో నైనను తలంచనట్టిపంటలు పండును. ప్రతిమనిషియు తా నున్న గ్రామమువదలి పలుగ్రామములుతిరిగి చూచుట వల్లను విద్యనేర్చుకొని యిట్టివ్యాసములను స్వయముగా చదువుకొనుటవల్లను వ్యవసాయాభివృద్ధికి తోడ్పడును. గాన దీనిని చదువువారు వినువారందరు దీనిప్రకారము యెరువును సిద్ధపరచి పొలములకు ఉపయోగపరచినయెడల మంచిపంటలు పండునని ప్రతిరైతును విద్యనేర్చుకొనుటకును పైపద్ధతులప్రకారము యెరువునుసిద్ధపరుచుటకున్ను ప్రోత్సాహము చేయవలయునని మిమ్ములను ప్రార్థించుచున్నాము. అప్పుడు ప్రతిరైతున్ను దారిద్ర్యమునకు లోనుగాక మంచిసంపదను జ్ఞానమును ఆరోగ్యమును పొందగలడు.



# స్వదేశసంస్థానముల చరిత్రము.

# చిత్రపటముల వివరణము.

## నేపాళరాజ్యము.

హిందూదేశ స్వదేశసంస్థానములలో మొదటిదైన నేపాలదేశపు పూర్వచారిత్ర మంధకార బంధురముగ నున్నది. పూర్వము గౌడులు, కంచిరాజులు, అహీరరాజులు, కిరాతులు పాలించినటులు పురాణగాథలు దెలుపుచున్నవి. కిరాతరాజులు భారతయుద్ధములోఁ బాండవుల పక్షమునఁ బోరాడినటులు ప్రతీతిగలదు. ఏడవశతాబ్ద మధ్యభాగమున చీనాయాత్రికుఁడు హియూన్ త్సాంగు హిందూదేశమునకు వచ్చినపుడు ప్రథమ శివదేవుఁడును నంశువర్మయును హర్షవర్ధనునికి లోఁబడి నేపాళదేశమునుఁ బాలించుచుండిరి. నేపాళదేశ శకము 879 లో రాఘవదేవుని కాలములో నారంభమైనది. నన్యదేవుడు మంగోలియాజాతీయులైన నేవాడుల నీదేశమునకు రప్పించెను. వారివలన నీదేశమునకు నేపాళనామము గలిగినది. నన్యదేవుడు దక్షిణ హిందూస్థానమునుండి నేపాళదేశమునకుఁబోయిన శూరుఁడు. 1496 నుండియు జయస్థితిమల్లు నిపౌత్రులు దేశమును భట్గాం, కట్మాండు, పాటన్ అని మూఁడుభాగములుగ విభజించి పాలించిరి. శూరాగ్రేసరుడు రతనుమల్లుడు తాకూరులను భూటియాలను జయించి దేశములో రాగినాణెములను వాడుకలోఁబెట్టెను. వాని కాలములో మహమ్మదీయులు నేపాళదేశముపై దండువెడలిరి గాని వారికిప్రాంతమున విజయమెప్పుడును గలుగలేదు. ఇపుడు దేశములో వాడుకలోనున్న వెండినాణెములవంటి నాణెములను వేయుటకొక రాజు డిల్లీపాదుషాల యనుమతినిఁ బొందినాడని ప్రతీతిగలదు.

పదియేడవ శతాబ్దారంభమున కట్మాండు రెండుభాగములుగ విభజింపఁబడినది. పద్దెనిమిదవ శతాబ్దములో నేపాళదేశ మంతః కలహముల కాలవాలముగ నుండెను. రంజితుమల్లుఁడు గురఖాలకు రాజైన పృథ్వీనారాయణుని సహాయ మపేక్షించెను. పృథ్వీనారాయణుఁడు రంజితమల్లుని శత్రువులనే కాక వానిని సయిత మోడించి 1769 లో నేపాళదేశమునకు రాజయ్యెను. చిత్తూరు దుర్గము పదునాల్గవ శతాబ్దములో నలాలుద్దీనుని వశమైనపుడు రాజపుత్ర వీరులు స్వస్థలములం బరిత్యజించి హిమాలయ ప్రాంతములందు నెలవుల నేర్పరచికొని రనియును వారలిపుడు గూరఖాలని పిలువఁబడుచున్నారనియును ప్రతీతిగలదు. పృథ్వీనారాయణుని నోడించుటకై కేప్టిను కినులోకు బ్రిటిషు పరిపాలకులచేఁ బంపఁబడెను. కాని బ్రిటిషుసైన్యము స్వల్పమగుటచేత గెలుపు గలుగలేదు. 1771 లో పృథ్వీనారాయణుని జ్యేష్ఠపుత్రుఁడగు ప్రతాపసింహుఁడు రాజ్యము నధిష్ఠించెను. 1775 లో ప్రతాపుని మరణానంతరము వాని రాణికిని వాని సోదరుఁడగు బహదూరుషాకును గలహ మేర్పడెను. వానికాలములో నేపాళదేశము భూటానునుండి కాశ్మీరము వరకును తిబ్బెట్టునుండి సంయుక్తరాష్ట్రములవఱకును వ్యాప్తినిఁ జెందెను. 1792లో గూరఖాలు చీనాదేశభాగములను నాక్రమించుకొనుట చేతను చీనాదేశము 70,000 సైనికుల నంపెను. అపుడు గూరఖాలు కార్నువాలిసు ప్రభువుకాలములో జోనతను డంకనుగారితో రాయభారము నడిపిరి. నేపాళదేశమునకును చీనాదేశమునకును మిత్రత్వమును గల్పించుటకు కర్నలు కర్కుపాట్రికు నియమింపఁబడెను. ఈ రాయభారి చేరక పూర్వమె నేపాళదేశస్థులు చీనా దేశస్థులతో సంధినిఁ జేసికొనిరి. గూరఖాలు బ్రిటిషు పరిపాలకులతోఁ జేసిన నియమములను బాటింపకుండిరి. 1795 లో రాజ్యపరివర్తన మేర్పడెను. ఆంగ్లేయులు 1800 లో నేపాళదేశములో రాణబహద్దూరు వలనఁ బ్రమేయము గలిగించుకొని కేప్టెను నాక్సును నే

పాళదేశమున కంపిరి. దీనివలనఁ బ్రయోజన మేర్పడలేదు. 1814 లో గూరఖాల దురాక్రమణము వలన బ్రిటిషు పాలనమునకును నేపాళరాజ్యమునకును యుద్ధమాసన్నమాయెను. మొదట నాంగ్లేయుల కపజయము కలిగెను గాని 1815 లో సర్ డేవిడు అక్టరులోని వలన నమరసిం గోడింపఁబడెను. 1816 లో గూరఖాలు తిరిగి పరాజయము నొందిరి. అపుడు కుమాయూను, ఆల్మోరా, డెహ్రాడూను, సిమ్లామండలములు బ్రిటిషు పరిపాలకులకిచ్చి సంధిచేసి కొనఁబడెను.

కొంతకాలము వరకు దేశము విప్లవాధీన మయ్యెను. 1845 లో జంగు బహద్దూరు దనమేనమామను రాణీని, 150 మంది గూరఖా సర్దారులను జంపి మంత్రిత్వమును వహించెను. దేశములో శాంతి స్థాపింపఁబడి సురేంద్ర విక్రమషా రాజుగాఁ జేయఁబడెను. 1850 లో జంగు బహద్దరింగ్లాండునకుఁ బోయి బ్రిటిషుసామ్రాజ్య వైభవమును స్వయముగ సందర్శించెను. 1857 లో సిపాయిల తిరుగుబాటు సమయమున 8000 గూరఖా సైన్యముతో నాంగ్లేయులకు సహాయ మొనరించెను. 1857 లో నీమంత్రివర్యుఁడు లోకాంతరవాసమున కేగెను. కాని మరణమునకుఁ బూర్వము మంత్రిత్వము తనవంశములో నుండుట కనువగు కట్టుదిట్టముల నేర్పాటు చేసెను. పిమ్మట రణదీపసింహుఁడు, వీరశంషేరు మంత్రులుగా నుండిరి. 1911 లో చంద్రశంషేరు మంత్రిత్వమును వహించెను. 1881 లో నారేండ్ల ప్రాయముగల మహారాజా పృథ్వీ వీరవిక్రమషా రాజుగఁ జేయఁబడెను. ఈయన 1911 డిశంబరు 11వ తేదిని లోకాంతరమున కేగెను. జంగుబహద్దరుకాలమునుండి నేపాళ దేశములో మంత్రులుసర్వాధికారమునుగలిగియున్నారు. మంత్రిరాజును నమాత్యసభను విచారించకనే ధనమును వ్యయము సేయఁ గలఁడు, పనుల నీయఁగలఁడు, న్యాయవిమర్శనమునుఁ జేయఁగలఁడు. బిరుదముల నొసంగఁగలఁడు.

నేపాళదేశపు విస్తీర్ణము 54,000 చతురపుమైళ్లు; జనసంఖ్య 40,00,000 ఆదాయము రూ. 2,00,00,000.



నేపాళదేశము 25,000 సైనికులను 2500 శతఘ్నిరాతులనుఁ గలిగి యున్నది. దేశములో తంత్రీకార్యాలయములుగాని రైలుమార్గములుగాని లేవు. పరదేశీయుల గమనాగమనములు నేపాలు దేశీయులకు బొత్తుగ సరిపడవు. స్వదేశవిషయములలో నీ దేశము సకల స్వతంత్రములను గలిగియున్నది. పరదేశములతో వ్యవహరించు స్వతంత్రమును గలిగి యుండలేదు. కాట్మాండులో బ్రిటిషు ప్రతినిధిగలఁడు. రాజగమనాగమన సమయములందు 21 ఫిరంగులు కాల్చఁబడును. దేశము ఖనిజసంపదలతో నిండియున్నది. హిమాలయ పర్వతమునందలియున్నత శిఖరములు నేపాళదేశమునందుఁ గలవు.

---

## నిజాము రాజ్యము.

నిజాము రాజ్యము స్వదేశ సంస్థానములలో నగ్రస్థానము నలంకరించు చున్నది. ఈ రాష్ట్రచరిత్ర మాంధ్రదేశ చరిత్రముతో సన్నిహిత సంబంధమునుఁ గలిగియున్నది. ఈదేశములో విశేషభాగము మొదటాంధ్రరాజులచేతను పిమ్మట పల్లవ చాళుక్యులచేతనుఁ బాలింపఁబడు చుండెను. పిమ్మట యాదవులు దేవగిరిలోఁ దమ రాజ్యమును స్థాపించిరి. 1294 లో నలాలుద్దీను ఖిల్జీ దక్షిణ దేశముపై దండువెడలి యాదవుల నోడించెను. 1309 లో మాలిక్ కాఫూరు కాకతీయ రాజు నోడించెను. 1325 లో మహమ్మదు బిన్ తుఘ్లకు డిల్లీనగరి పాలనమును వహించునపుడు త్రిలింగదేశ సహితమైన దక్షిణదేశము మహమ్మదీయుల పాలయ్యెను. తుఘ్లకు రాజధానిని దౌలతాబాదునకు మార్చెను. పిమ్మట దక్షిణదేశమునందలి ప్రతినిధులు తిరుగఁబడి స్వతంత్ర రాజ్యముల స్థాపించిరి. జాఫరుఖాను గుల్బర్గ విదర్భప్రాంతములను స్వాధీనము చేసికొని 1347 లో బాహ్మని వంశమును స్థాపించెను. బాహ్మని వంశజులు విజయనగరాధీశులతోను కాకతీయ వంశజులతోను నిరంతరము యుద్ధములనుఁ జేయుచు 160 సంవత్సరముల వరకీదేశము నేలిరి. 1527 లో నమీర్ బరిద్ రాజ్యభారమును వహించెను. 1609 లో కుటుబుల్ ములుకు స్వతంత్ర పాలన

మును వహించి కుతుబుషాహి వంశమును స్థాపించెను. ఈ వంశజులు 1687 వరకు నేలిరి.

ప్రస్తుతము నిజాము రాష్ట్రమునుఁ బాలించు వారివంశము అసఫ్ జహా వలన స్థాపింపఁబడినది. ఈయన తురుష్క దేశీయుఁడు. ఔరంగజేబు యొక్క సేనాధ్యక్షుఁడు. 1713లో దక్షిణ దేశమునకు రాజప్రతినిధిగ నిజాముల్ ములుకు అను బిరుదముతో నియమింపఁ బడెను. 1748లో నసఫుజా మృతి నొందినపుడు వాని యార్గురు తనయు లొండొరులతోఁ గలహించుచు నాంగ్లేయుల పరాసుల సహాయమునుఁ బొందుచుండిరి. ఆకాలములో నిజాము రాష్ట్రమునకే కాక మిగిలిన హిందూదేశ రాజ్యములకెల్ల మహారాష్ట్రులు వినాశమునుఁ గలిగించుచుండిరి. 1760లో నిజాము మహారాష్ట్రులచే నుద్గిరు దగ్గర నోడింపఁబడెను. 1766 లో నాంగ్లేయులకును నిజామునకును జరిగిన సంధివలన నాంగ్లేయులు నిజాము రాష్ట్రమునుఁ గాపాడుటకును నిజాము వారికిఁ గొంత దేశ మిచ్చుటకును నేర్పాటు జరిగెను. 1794 లో నిజాము మహారాష్ట్రులచే ఖరడా వద్ద నోడింపఁబడి మూడుకోట్ల రూప్యములు నష్టపూరణమునకును, ముప్పదియైదు లక్షల భూమ్యాదాయముగల దేశమును నీయవలసి వచ్చెను. 1799 లో టిప్పుసుల్తాను నోడించుటలోను 1817 లో మహారాష్ట్రుల నోడించుటలోను నిజామాంగ్లేయులకు సహాయమును జేయుటచే రాష్ట్రలాభము గలిగెను. 1800 లో నాంగ్లేయ సైన్యము సికందరాబాదులో స్థిరస్థాపనమునుఁ గాంచెను. నిజామలి 104 గేండ్లుజీవించి 1803లోఁ బరలోకమున కేగెను.

వాని ద్వితీయ పుత్రుఁడు సికందరుజహా రాజ్యభారమును వహించెను. వాని కాలములో దేశము విప్లవాయత్తమైయుండగ సుప్రసిద్ధుడైన దివాను చందూలాలు శక్తిసామర్థ్యముల వలన దేశము కుదుటఁబడెను. 1829లో సికందరు జహా మృతినొందగా నసీరుద్దౌలా రాజ్యమునధిష్ఠించెను. 1839 లో నిజాము సోదరుఁడు రాజద్రోహ పాతకంబునకు లో నకొల్యానుగాని యోడింపఁ బడెను. 1853 లో నాంగ్లేయులకును నిజామునకును నొకయొడంబడిక జరిగి సైన్యపోషణార్థము సంవత్సరమునకు రూ. 24,00,000 ల నిచ్చుటకును బీరారు రాష్ట్రములు రక్షకధనమునకై యాంగ్లేయుల స్వాధీనమునం దుండునటులును నేర్పాటైనది. ఈ యేర్పాటు 1902 వరకవిచ్ఛిన్నముగ జరుగుచు వచ్చినది. కర్జను ప్రభువు బీరారును నాంగ్లేయరాష్ట్రములోఁ జేరునటులును నిజాము సంవత్సరమునకు రూ. 25,00,000 లను గైకొనునటులును నేర్పాటునుఁ జేసెను. 1857 లో సిపాయిల తిరుగుఁబాటు సమయమున నిజామాంగ్లేయుల పక్షమున సాలారు జంగుని దూరదృష్టివలన నిలఁబడెను. 1853 నుండి 1883 వరకు మేధాసంపన్నుడైన సాలారుజంగు రాష్ట్రమునకు మంత్రిగనుండి రాజ్యాంగములను సంస్కరించి సంస్థానమునకు మహోపకారమునుఁ జేసెను. నసీరుద్దౌలా అఫజలుద్దౌలాల తరువాతను ప్రజానురాగమునుఁ బడసిన మీరు మహబూబు అలి రాజ్యభారమును వహించెను. ఈ సత్వాలకుఁడు ప్రజానురంజకముగ నిరువదేడేండ్లు దేశమునుఁ బాలించి 1911 ఆగస్టు 27 వ తేదిని స్వర్గస్థుఁడయ్యెను. వారి సుతుఁడు ఘనతవహించిన మీరు ఆస్మానల్లిఖాను బహద్దూరిపుడు పాలకులుగనున్నారు. ప్రస్తుత పాలకుని వినయ వివేక శౌర్యాది సద్గుణంబులు ప్రజాహితార్థమై వినియోగింపఁ బడునని ప్రజలు విశ్వాసభరితులై యున్నారు. నిజాము 21 ఫిరంగుల సన్మానమున కర్హులు.

ఈ రాష్ట్ర విస్తీర్ణము 82,698 చతురపు మైళ్ళు, ప్రజాసంఖ్య 1,25,00,000 ఆదాయము రూ. 4,70,00,000. ప్రజలలో సగమాంధ్రులు. దేశము ఖనిజ సంపదలతో నిండియున్నది. బొగ్గు, బంగారము, రాగి, వజ్రములు గనుల నుండి త్రవ్వఁబడుచున్నవి. రమణీయంబులగు గుహా విహారంబు లీరాష్ట్రములో ననేకములు గలవు. ఎల్లోరా, అజంటా, ఓరుగల్లు, హనుమకొండ, దౌలతాబాదు, ఔరంగాబాదు, గోలకొండ, హైదరాబాదు మొదలగు స్థలములు చూడ యోగ్యములు. సగము మందికి జీవనాధారము వ్యవసాయము. ఈ రాష్ట్రములో 370 చెరువులును, 1,015 గుంటలును 1,347 కాలువలును గలవు. పాకాల చెరువు సుప్రసిద్ధము. గోదావరి, కృష్ణ, పెన్న, మునేరు, మూసి మొదలగు నదులీరాష్ట్రముగుండఁ బ్రవ

హించుచున్నవి. దేశము గొంతభాగము సారవంతముగను గొంతభాగ మరణ్యమయముగను నున్నది. నిజాము రాష్ట్రమునకును నాంధ్రప్రజలకునుఁ బురాతన కాలము నుండియును సన్నిహిత సంబంధము గలదు. పూర్వ మీ దేశములోని భాగము లాంధ్రరాజులచేఁ బాలింపఁబడుచుండినవి. ఇపుడాంధ్రులలో నాల్గవవంతు రాష్ట్రములో నివసించు చున్నారు. ఆంధ్రభాషాభ్యుదయమున కుభయ రాజ్యములలోని యాంధ్రులకును సన్నిహిత సాహచర్య మవసరము.

---

## బరోడా సంస్థానము.

బరోడాదేశపు పూర్వచారిత్రము రాజపుత్రవీరుల చరిత్రముతోను, ఘూర్జరదేశ చరిత్రముతోను, మహమ్మదీయుల పాలనముతోను సంబంధమునుఁ గలిగియున్నది. రాజపుత్రయోధుఁడైన చందనరాజువలన నీనగర ప్రాంతము పూర్వము చందనవటినామముతో నొప్పుచుండినదని యొకప్రతీతిగలదు. వటవృక్షములనడుమ నుండుటంజేసి వటోదరనామము గలిగినదనియును వటోదరనామముయొక్క తద్భవము వడోదర, బరోడయనియునుఁ జెప్పుకొనఁబడుచున్నది. ఘూర్జర కవివర్యుఁడైన ప్రేమానందునిచే నీపట్టణము వీరక్షేత్రమని వాడఁబడినది. బరోడానగరమునకు సమీపమునందుండు వటవిటపములవలన నీనగరమున కీపేరుగలిగినదనుట సమంజసముగ నున్నది. ఈప్రాంతపు ప్రాచీనచరిత్ర మెట్లున్నను నూతన బరోడా సంస్థానచరిత్రము 1705 తో నారంభమగుచున్నది. మొగలుల సామ్రాజ్యమువలనఁ బ్రత్యేక మహమ్మదీయరాజ్యము లేర్పడినటులు మహారాష్ట్రసామ్రాజ్యము వలన భిన్నమహారాష్ట్రసంస్థానము లుత్పన్నములైనవి.

సతారా రాజగు సాహురాజునకు 1720లో ఖండేరావుదాభిడె సేనాధ్యక్షుడుగనుండెను. వానికి సహాయ సేనాధిపతిగనుండి దామాజి బాలాపూరురణరంగములోఁ దనస్థైర్యపరాక్రమములనుఁ జూపుటంజేసి వానికి షంసేరుబహద్దరను బిరుదొసంగఁబడెను. 1721లో సేనాధిపతు లిరువురును మరణమునొందిరి. ఖండేరావు పదవికి వానిపుత్రుఁడు త్రియంబకరావుదాభడెయును దామాజి స్థలమునకు వాని భ్రాత్రీయుఁడు పీలాజీరావుగాయకవాడును వచ్చిరి. పీష్వా మొదటి బాజీరావు 1729 లో సిర్ బులుందుఖానుతో సంధినిఁజేసికొని దాభడె పీలాజిలకు వ్యతిరిక్తుడగుటంజేసి 1731 లో నొకయుద్ధముజరిగెను. అపుడు వారిరువురు పీష్వాచేనోడింపఁబడిరి. కాని పిలాజిని పీష్వా ముతాలిక్ సేనాఖాస్ ఖేల్ బిరుదములతో సత్కరించెను. అపుడు పీష్వాసేనాధిపతు లన్యోన్యదేశాక్రమణమునుఁ జేసికొనకుండునటులును, సిస్తులో సగము భాగము పీష్వాకిచ్చునటులను, ఘూర్జరదేశ వ్యవహారము సేనాధిపతి చూచునటులును నిర్ణయమైనది. మొగలుచక్రవర్తి సిర్ బులుందుఖానునిసంధి నంగీకరించక 1732 లో జోధపురము రాజైన అభయసింగును రాజప్రతినిధిగ నియమించెను. వాని యనుచరులాయేటఁ బిలాజిగాయకవాడునుఁ జంపిరి. దామాజి తన తండ్రి రాజ్యమును 1732 లో నధిష్ఠించెను. సేనాధ్యక్షుని వంశజుఁడు యశ్వంతరావు దుర్మార్గుడగుటంజేసి సేనాధిపత్యము గాయక్వాడుల పాలయ్యెను. 1732 నుండియును బరోడా గాయక్వాడు సంస్థానాధీశుల స్వాధీనములోనుండెను. దామాజికాలములో ఘూర్జరదేశమంతయును మహారాష్ట్రులవశమైనది. దామాజి పీష్వాకు కప్పమును సరిగాఁజెల్లించనందున విరోధమేర్పడినను పానిపట్టు యుద్ధములో దామాజి శౌర్యముతోఁ బోరాడెను. 1768 లో దామాజి మృతినొందెను. రాష్ట్రములో నంతఃకలహము లేర్పడెను.

దామాజికి మువ్వురుభార్యలుండిరి. మొదటిభార్యకు గోవిందరావును, రెండవభార్యకు సయాజిరావు, ఫతేసింగులును, మూడవపెండ్లామునకు మానాజియునుఁ బుట్టిరి. ఫతేసింగు పీష్వాకుగొప్పనజరానానిచ్చిసయాజిరావును సింహాసనారూఢునిగఁజేసి 1780 లో బ్రిటిషుపరిపాలకులతో నొక సంధినిఁజేసికొనెను. బ్రిటిషుపరిపాలకులకును పీష్వాకును 1782 లో సంధిజరుగుటవలనఁ పైసంధినిలువలేదు. గోవిందరావుకాలములో 1800 లో పీష్వా తనసిస్తును గాయక్వాడునకు కవులునకిచ్చెను. ఆయేడే గోవిందరావు

మృతినొందగా వానిపెద్దకొడుకైన ఆనందరావును స్థిరముగ సింహాసనమునందు స్థాపించుటకు రావుజి అప్పాజి బ్రిటిషుపరిపాలకులతో నొక యొడంబడికను జేసెను. వాని సవతితమ్ముని కన్హోజిని ముల్హారిరావుసింహాసనాసీనుని జేయుటకు యత్నించెను. ఆంగ్లేయులు ముల్హారిరావు కన్హోజిలనోడించి యానందరావును స్థిరపరచిరి. 1815లో బరోడారాజు గంగాధరశాస్త్రిని లెక్కలను సరిచూచుటకై పీష్వాతావునకంపెను. కాని త్రింబక్జిదాంగ్లియావలన శాస్త్రిచంపఁబడెను. ఈఘాతుకకార్యమువలన గాయకవాడునకును పీష్వాకునుఁగల సంబంధము విడిపోయెను. 1817 లో జరిగినసంధివలన పీష్వాగాయకవాడు పైఁదనకుఁగల హక్కులను వదులుకొనునటులును సంవత్సరమునకు నాలుగులక్షల రూప్యములను పీష్వాకిచ్చునటులును నిర్ణయింపఁబడినది. పీష్వాయోడిపోయినపుడీ కప్పము నీయవలసిన యవసరమునుఁ బోయినది. 1817 లో నాంగ్లేయులకును గాయక్వాడునకును నొకసంధిజరిగినది. దానివలన సైనికరక్షకధనమునకై ఘూర్జరదేశము బ్రిటిషుపరిపాలకుల కొసంగఁబడినది. సమయమాసన్నమైనపుడు గాయకవాడు బ్రిటిషుపాలకుల పక్షమున యుద్ధము సేయవలయును. దేశముభయులకు వీలుగానుండునటులు మార్చుకొనఁబడినది. మూడువేల గుఱ్ఱపు రౌతుల నాంగ్లేయులకై గాయకవాడు సంరక్షణమునుఁ జేయవలయును. 1819 లో ఆనందరావు మృత్యువువాతఁబడుటవలన సయాజిరావు రాజ్యమునకు వచ్చెను. 1820లో నాంగ్లేయులకును సయాజిరావునకును జరిగిన సంధివలన కాఠియావాడు మాహికాంతాలకు సైన్యమునుఁ బంపకుండుటకును, సామంతరాజులనుండి కప్పమును బ్రిటిషుపరిపాలకులద్వారా పొందుటకును సయాజిరా వంగీకరించెను.

కాని సయాజిరావుప్రతిజ్ఞాభంగమువలనఁ గొన్నిమండలములు రక్షకద్రవ్యమునకై యాంగ్లేయుల స్వాధీనమునందుంచఁబడినవి. 1847 లో సయాజిరావును 1856 లో వానిజ్యేష్ఠపుత్రుఁడు గణపతిరావును మృతినొందగా వానిరెండవకొడుకు ఖండేరావు రాజయ్యెను. ఆపాలకుఁడు 1857 లో సిపాయిల తిరుగుఁబాటు సమయమున నాంగ్లేయుల కొనరించిన సహాయమునకై ప్రతియేటఁ జెల్లించవలసిన కప్పములో మూఁడులక్షలరూప్యములు తగ్గించఁబడినవి. 1870లో ఖండేరావు లోకాంతరమున కేగినపుడు వాని భార్యజమునాబాయి గర్భవతిగానుండెను. గాని దుర్వినీతుండైనముల్హారరావు రాజ్యభారమునువహించెను. జమునాబాయికి కూతురుపుట్టెనుగాన రాజ్యమునకు ముల్హారరావుకర్తయయ్యెను. ముల్హారరావు దుష్పరిపాలనమును 1874 లో బ్రిటిషుప్రతినిధికి విషప్రయోగమునుఁ జేయించుటకై చేసినయత్నమును వానిరాజ్యభ్రష్టునిఁజేసెను.

శ్రీమతి జమునాబాయి పిలాజివంశజుడైనసయాజిరావునునాంగ్లేయపాలకుల యనుమతినిదత్తతచేసికొనియె. ఈయనబాల్యావస్థలో సుప్రసిద్ధుడైన సర్.టి. మాధవరావు బరోడాసంస్థానమునకు మంత్రిత్వమునువహించెను. 1881 లో శ్రీగాయకవాడు సయాజిరావు మహారాజు రాజ్యభారమును వహించెను. అప్పటినుండియు రాజ్యపాలనము స్వయముగ మహారాజుచే నిర్వహింపఁబడుచున్నది. గాయకవాడనేకసారులు సకుటుంబసమేతముగఁ బరదేశములను సందర్శించెను. పాశ్చాత్యదేశములలో వ్యాప్తినిఁ గాంచిన విద్యాపద్ధతులను పరిశ్రమశిక్షణమును స్వకీయసంస్థానములో వ్యాపింపఁజేయుటకు మహారాజు పాటుపడుచున్నాఁడు. ఈసంస్థానములోని కొన్నిప్రాంతములలో నారంభవిద్య బలవంతముగను నుచితముగను గఱపఁబడుచున్నది. సంవత్సరమున కేడులక్షలరూప్యములు విద్యకై వ్యయముచేయఁబడుచున్నవి. దేశమునందంతటను ధర్మపుస్తకభాండాగారములు స్థాపింపఁబడుచున్నవి. గ్రామపంచాయతిసభలు స్థాపింపఁబడి స్థానీయపాలనము వ్యాపకమునుఁ గాంచుచున్నది.

ఈ సంస్థానపువిస్తీర్ణము 8590 చతురపుమైళ్ళు, జనసంఖ్య 20,00,000, ఆదాయము రూ. 1,50,00,000. సంస్థానపాలనమునకై 1904 లో నొకశాసననిర్మాణసభ నిర్మింపఁబడినది. వ్యవహారనిర్వహణమునకై కార్యనిర్వాహకసభయునుఁ గలదు. మంత్రి కార్యనిర్వాహకసభ కధ్యక్షుఁడుగనుండును. మహారాజుసర్వాధికారమునుఁ గలిగి నిరంకుశాధికారమును గలిగియున్నాఁ

డు. బరోడాసంస్థానాధీశుఁడైన శ్రీసయాజిరావు గాయకవాడు సంస్థానాధీశులలోఁ బ్రాజ్ఞుఁడుగఁ బరిగణింపఁబడుచున్నాఁడు. మహారాజునకు స్వతంత్రవ్యక్తిగలదు. సంఘసంస్కారప్రియుఁడు, విద్యాభిమాని, దేశాభిమాని,ప్రజాహిత తత్పరుడు. మహారాజు 21 ఫిరంగుల సత్కారమున కధికారి.

---

## మైసూరు సంస్థానము.

స్వదేశసంస్థానములలో నొక ముఖ్యసంస్థానమైన దీనికీపేరు మహిషాసురునివలనగలిగినది. కాళికి మహిషాసురమర్దనియను నామముగలదు. చాముండిమహిషాసురుని సంహరించిన పురాణగాథలోకప్రఖ్యాతము. రాజకుటుంబమునకిప్పటికిని చాముండియును చాముండీశ్వరుడును కులదేవతలు. అశోకవర్ధనుని కాలమునం దీప్రాంతము మహిషమండలముగా నొప్పుచుండెను.

ఈసంస్థానపు పూర్వచారిత్రము మిగిలినదేశచారిత్రమువలె దుర్భేద్యము. మౌర్యసామ్రాజ్యనిర్మాణకుఁడు చంద్రగుప్తుఁడు వానప్రస్థాశ్రమమును స్వీకరించి పండ్రెండేండ్లు మైసూరురాష్ట్రములోని శ్రావణబెళ్గొలలో నివసించినటులు జైనసాంప్రదాయమువలనను నిటీవలఁ గనుఁగొనబడిన శాసనమువలనను దెలియుచున్నది. మైసూరుదేశమున రైసుగారిచేఁ గనుఁగొనఁబడిన యశోకశాసనములీరాజ్యము మౌర్యసామ్రాజ్యములోఁ జేరినదని తెలుపుచున్నవి. ఆంధ్రరాజులీరాజ్యములో నుత్తరభాగమును క్రీ.త. 250వరకుఁ బాలించిరి. ఈరాజ్యములో వాడుకలోనున్న శాలివాహనశక మాంధ్రరాజైన శాతవాహనుని పేరిట నేర్పరుపఁబడినది. ఆంధ్రులయనంతరము కాదంబులు పల్లవులు ఉత్తరమున బాలించుచుండిరి. గంగులు దక్షిణమున పదియవ శతాబ్దాంతమువర కేలుచుండిరి. చాళుక్యులు కాదంబులను పల్లవులనోడించి పండ్రెండవశతాబ్ద మధ్యభాగమువరకు మైసూరురాజ్యములోఁ గొంతభాగము నేలుచుండిరి. 1076 మొదలు 1126వరకు విక్రమాదిత్యు డేలికయై బల్లిగవిలో దేవళంబులఁ గట్టించెను. మఠములనుస్థాపించెను. లింగాయత మతస్థాపకుడైన బిజ్జలుడు 1155-1183 వరకీదేశములోఁ గొంతభాగమునుఁ బాలించెను. దక్షిణభాగమునగంగులనోడించి హోయిశలవంశజులు పాలకులుగనుండిరి. ఈవంశజుడైనవీరబల్లాలుని కాలములో మైసూరురాజ్యము వ్యాప్తినిఁగాంచినది. మూడవబల్లాలుని1310లో మాలికాఫూరోడించిమితిలేనిధనమును గొల్లగొనిపోయెను. ఈదండయాత్రలోను 1326 లోను మహమ్మదీయులచే ద్వారసముద్రము పాడుసేయఁబడెను. 1343తో హోయిసలవంశము నశించినది. పిమ్మట విజయనగరాధీశులీరాజ్యములో విశేషభాగమునకుఁ బాలకులైరి. కృష్ణదేవరాయలు 1520 ప్రాంతమునగంగరాజునోడించి శివసముద్రమునుబట్టుకొనెను. 1565లో విజయనగరసామ్రాజ్యము విచ్ఛిన్నమైనపుడు పాలయకారులు క్రమక్రమముగ స్వతంత్రాధికారమునుబూన నారంభించిరి.

విజయనగర సామ్రాజ్యముక్రింద పాలయకారులుగ వొడయరులు మైసూరుసీమనుఁ బాలించుచుండిరి. ఈవంశమునకు 1399లో ద్వారకనుండి దక్షిణమునకువచ్చిన విజయకృష్ణులను యాదవరాజపుత్రులు మూలపురుషులని ప్రతీతిగలదు. హడినాడుప్రభువు మతిభ్రమణమువలన దేశపరారియగుటవిని హీనకులుడు కారుగహళ్లిప్రభువు హడినాడురాకుమారిని బలవంతముగ వివాహమునకొప్పించెను, రాజపుత్రులీసమాచారమును విని మారువేషములతో నంతఃపురములోఁ బ్రవేశించి భోజనసమయమునందు కారుగహళ్లిప్రభువును వానిపరివారమునుఁజంపి పిమ్మట వానిదేశము నాక్రమించుకొనిరి. రాజకన్య విజయుని వరించి పెండ్లియాడెను. విజయుఁడు లింగాయతమతమునుస్వీకరించి ఒడయరుబిరుదముతో హడినాడుకారుగహళ్లిసీమల కేలికయయ్యె. తాళికోట యుద్ధకాలమున నాల్గవచామరాజు పాలించుచుండెను. ఆరవచామరాజు 1630లో జగదేవరాయని దేశమునుఁ దనరాజ్యములోఁ జేర్చెను. నరసరాజకంఠీరవుఁడు 1638లో రాజ్యభారమును వహించెను. ఈరాజపుంగవుని కాలమునందు రాజ్యమన్నిదిక్కులను వ్యాపింపఁజేయఁబడెను. టంకశాల స్థాపింపఁబడెను. ఈనాణెములు మహమ్మదీయాక్రమణమువరకు వాడుకలోనుండెను. చిక్కదేవరాజుపాలనము ప్రసిద్ధి

కెక్కెను. ఆరాజుకాలములో జంగమగురువులు జైనమంత్రియాలోచనతోనా లేకనా వధింపఁబడిరి. తిరుమలరాయమంత్రి మైసూరుమంత్రులలో సత్కీర్తినిఁగడించెను. 1696లో మహారాష్ట్రదండువలన విప్లవ మేర్పడెనుగాని వారు మైసూరుసైన్యముచే నోడింపఁబడిరి. చిక్కదేవరాజునకు ఔరంగజేబు చక్రవర్తి 1700లో జగదేవరాజనుబిరుదమునిచ్చెను. డెబ్బదియారవయేటను 1704లో నీరాజపుంగవుడు నిండుకోశమును విస్తీర్ణమై సుఖప్రదమైన రాజ్యమునుస్థాపించి పరలోకమునకేగెను. ఈరాజుకాలములో పోస్టాఫీసులు మొదటిసారిగ స్థాపింపఁబడెను.

ఈరాజానంతరము రాజులయధికారము క్షీణించి మంత్రులప్రభ హెచ్చసాగెను. నంజరాజమంత్రికాలములో నొకయోధాగ్రేసరుడు దక్షిణహిందూస్థానములో బయలుదేరెను. ఈయోధుడు 1749లో దేవనహళ్ళికోట ముట్టడింపఁబడినపుడు తనయసామాన్య శౌర్యమునుఁజూపెను. మంత్రుల కలహములవలనను, రాజ్యాధిపతుల యసమర్థతవలనను, స్వకీయశక్తిసామర్థ్యములవలనను హైదరాలి మైసూరురాజ్యాధికారమంతయును తనస్వాధీనము చేసికొనెను. హైదరు 1763లో నాంగ్లేయులతో సంధిఁజేసికొనెను. 1771లో నాంగ్లేయులతోను, మహారాష్ట్రులతోను, నిజాముతోను పోట్లాడవలసినవాడయ్యెను. మహారాష్ట్రులచేఁ బూర్తిగ నోడింపఁబడెను. ఈవీరుడు 1782లో పరలోకమునకేగెను. వానికొడుకు టిప్పుసుల్తాను రాజ్యభారమును వహించెను. టిప్పువరాక్రమశాలియైనను తండ్రికిగల వివేకములేదు. మహమ్మదీయమత దురభిమానమధికము. ఈదురభిమానమె ఔరంగజీబు కష్టములకును టిప్పువినాశమునకును గారణమైనది. ఆంగ్లేయులనోడించుటకు ఫ్రాన్సుదేశసహాయమును టిప్పుసుల్తానపేక్షించుచుండెను. అఫ్గనుపారసీకదేశముల సహాయమునుఁగోరెను. ఆంగ్లేయులీసుల్తాను దుర్వినయమును సహించలేక నిజాము మహారాష్ట్రుల సహాయముతో మైసూరుపై దండువెడలిరి. 1799 మేయినాల్గవతేదిని శ్రీరంగపట్టణము పట్టువడియె. టిప్పుసుల్తానుని కళేబరము హతసైనికుల నడుమనుఁగనుగొనఁబడెను.

ఈకాలములో వొడయరువంశజులు దరిద్రస్థితిలో నొకమూల నొదిగియుండిరి. ఆంగ్లేయులు అయిదేండ్లప్రాయముగల కృష్ణరాజవొడయరునకుఁ గొంతదేశమునిచ్చి శేషించినదానిని సహాయకారులును తాముసుపంచుకొనిరి. సుప్రసిద్ధులైన పూర్ణయ్య మంత్రిక్రింద మైసూరురాష్ట్రముసుఖస్థితికివచ్చెను. 1812లో రాజదుర్వినయమువలనఁ బూర్ణయ్యమంత్రి పనినిమానుకొనెను. దుర్మార్గపరిపాలనమువలన నాంగ్లేయులు 1831లో రాజునుఁదొలగించి మైసూరురాజ్యమును స్వాధీనమునందుంచుకొనిరి. వానిమరణానంతరము 1868లో వానిదత్తపుత్రుని చామరాజేంద్రునిరాజుగ నాంగ్లేయులేర్పరచిరి. ఈరాజావతంసుడు దేశమును బాగుగనేలి దేశాభివృద్ధికనుకూలములైన సదుపాయముల ననేకములనుఁ గల్పించెను. బాల్యావస్థలో రంగాచార్యులును రాజ్యమునధిష్ఠించినపిమ్మట సర్ శేషాద్రయ్యరునుమంత్రులుగనుండి దేశాభివృద్ధిఁజేసిరి. రంగాచార్యులు ప్రాత్యామ్నాయ సంఘమును స్థాపించెను, యూరపియను అధికారులనుతగ్గించి హైందవాధికారులను హెచ్చించెను. శేషాద్రిఅయ్యరు కాలములో (1893 1901) దేశాదాయ మధికము చేయఁబడెను, రైలుమార్గములు వేయఁబడెను, నీటివసతులు గల్పింపబడెను, కావేరీవిద్యుచ్ఛక్తినిర్మాణ యంత్రాలయముస్థాపింపఁబడెను. దేశమన్నివిధముల సుఖస్థితిలోనుంచఁబడెను. చామరాజేంద్రుఁ డాకస్మికముగ 1894లో కలకత్తానగరములో కాలధర్మము నొందెను. రాజ్యము మహారాణిరక్షణముక్రిందను కృష్ణరాజవొడయరునకుఁ గట్టబడెను. 1902లో కర్జనుప్రభువు కృష్ణరాజేంద్ర వొడయరునకు స్వయముగ రాజ్యమునప్పగించెను. కృష్ణమూర్తిమాధవరావుగారులు మంత్రులుగనుండిరి. ఆనందరావుగారిపుడు మంత్రిగనున్నారు.

మహారాజు మంత్రియొక్కయు సభయొక్కయు సహాయమువలన దేశమునుఁ బాలించును. సభలో నిరువురు సభ్యులుగలరు. దసరాపండుగలలో మైసూరులో మహావైభవముతో వేడుకలు జరుపఁబడును. రాజుసింహాసనాసీనుడై ప్రజలకు దర్శనమిచ్చును. అతిథ్యభ్యాగతులు

సత్కరింపబడుదురు. మైసూరుప్రాంత్యామ్నాయసభగూడను. మంత్రి గతవత్సరకార్యక్రమమునునివేదించును. నానాదేశములనుండియు జనులీవేడుకలనుజూచుటకు వెళ్లుచుందురు.

మైసూరురాజ్యము హిందూదేశ సంస్థానములలో నొకపెద్దసంస్థానము. విస్తీర్ణము 29,430 చతురపుమైళ్లు. ప్రజాసంఖ్య 60,00,000 ఆదాయము రెండుకోట్లరూప్యములు. దేశము ఖనిజసంపదలతో నిండియున్నది. కోలారుబంగారు గనులవలన దేశాదాయము వర్ధిలుచున్నది. దేశములోకళాశాలలు విద్యాలయములుస్థాపింపఁబడినవి. స్త్రీలకొరకు ప్రత్యేకకళాశాల రాజధానిలో స్థాపింపబడినది. పరస్పరసహాయసంఘములు దేశమునందంతటను స్థాపింపఁబడినవి. రెండుకోట్ల రూప్యములను వ్యయముచేసి యొక విశాలతటాకమును నిర్మింపుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి. విశ్వేశరయ్యరుగారీ సంస్థానమునకిపుడు ప్రధానయంత్రశాస్త్రజ్ఞుఁడుగ నున్నారు. మైసూరురాజ్యపాలన మన్నివిధములఁ బ్రామాణిక పాలనముగ నెన్నఁదగియున్నది.

ప్రస్తుతపాలకులు మహారాజ కృష్ణరాజవొడయర్ బహదూర్ జి. సి. ఎస్. ఐ. శక్తిసామర్థ్యములతోఁ బ్రజాహితార్థముగ దేశము నేలుచున్నారు. ఇరువదియొక్క ఫిరంగులచే సంభావించుట కర్హులు.

---

## ఉదయపుర సంస్థానము.

హిందువుల క్షాత్రభావ విజృంభణమునకును, మానసంరక్షణమునకును, కులాభిమానమునకును రాజపుత్ర సంస్థానములచారిత్ర మున్నతాదర్శనముగనున్నది. జాతీయధర్మసంరక్షణశీలము వ్యక్తముగానికాలములో నీభావములు హిందూదేశమును మతధర్మమును మహమ్మదీయ మత దురభిమానమునకు బలిగాకుండఁగాపాడిన సంస్థానములకు ఉదయపురసంస్థానము నాయకసంస్థానముగనున్నది. మేవారు రాజులు క్షత్రియులకు నాయకులుగనుండి ప్రాణధనములను దేశసంరక్షణార్థమై ధారవోసిరి. రాజపుత్రవీరులు చిత్తూరుదుర్గ సంరక్షణార్థమై ప్రాణంబులం దృణంబులవలె విసర్జించిన యితిహాసంబులు బఠించినవారి హృదయంబులు విషాదాభిమాన భరితంబులును భక్త్యుత్సాహపూరితంబులును నగుటసహజము. ఆవీరసింహుల యపక్రమపరాక్రమమును నావీరాంగనల ధైర్యసాహసములునుభారతీయులకు సన్మానార్హములు. టాడుదొరగారీ యితిహాసంబులను సానుకంపభావముతోఁ బ్రకటించి భారతీయులకు మహోపకారమునుఁ జేసిరి.

మేవారు సంస్థానపు పూర్వచారిత్రమును నిర్ణయించుటకుఁదగిన యాధారములులేవు. రామాయణకథానాయకుడైన శ్రీరాముని వంశజులు దీనికి మూలపురుషులని యొకకథగలదు. అయోధ్యాధీశులు సూర్యవంశజులు. కుశవంశజుడైన సుమిత్రుడయోధ్యనుఁబాలించిన సూర్యవంశజులలోఁ గడపటిరాజు. సుమిత్రుఁడు కతియావాడులోవల్లభిరాజ్యమును స్థాపించెను. శిలాదిత్యుడీరాజులలోఁబరాక్రమశాలి. ఆరాజు పరరాజులచే నోడింపఁబడి యుద్ధములో విగతజీవుండయ్యెను. జనకునిమరణానంతరము జన్మించిన గోహాదిత్యుఁడు బ్రాహ్మణులచేఁ బెంచఁబడి మేవారురాజ్యమును స్థాపించి యిడారుపట్టణమును రాజధానినిగఁ జేసికొనెను. ఆమూలపురుషునివలన నీవంశపు రాజులు కొంతకాలము గెహాలోతులని పేరొందిరి. రెండవమహేంద్రు డీవంశములో నారవపురుషుడు. ఆప్రభువు నాగడాలో నేలుచుండెను. యవ్వనదశలో చిత్తూరురాజైన మానసింహుని కొలువులోఁజేరి మహమ్మదీయులను వారి మొదటిదండయాత్రలో నోడించి మానసింహుని కూతురునుఁ బెండ్లియాడి 734లో మానసింహుని సింహాసనము నాక్రమించుకొనెను. ఆరాజు దనజనానురాగముచే బప్పాయని పిలువబడుటచే వానివంశజులు బప్పారావులని ఖ్యాతినిఁగాంచిరి.

మరలఁ బండ్రెడవ శతాబ్దారంభమున రాహూపు రాజ్యకాలమునుండియును నీరాజ్యచరిత్రము ప్రశస్తిని గాంచినది. మొదటి కరణసింహునకు మాహూపు రాహూపులను నిరువురు సుతులుండిరి. రెండవపుత్రుడు రాహూపు విరోధియైన పరిహారరాణునిజయించుటచేతను మేవారునకు రాజయ్యెను. మొదటికొడుకు మాహూపు

డోంగరుపురములో నూతనరాజ్యమును స్థాపించుకొని రావలునామమును వహించెను. రాహూపుగెహాలోటు వంశనామమునువదలి శిశోదయనామమును వహించుచు రాణానై మేవారునుఁ బాలించుచుండెను. 1303లో చిత్తూరును లక్ష్మణసింహుఁడును డోంగరుపురమును రత్నసింహుఁడును నేలుచుండిరి. భీమసింహుఁడు మోహనాంగియైన పద్మినిపతి లక్ష్మణసింహుని పినతండ్రి.

చిత్తూరుకోట మొదటి రెండు ముట్టడులు.

ఈకాలమున నలాలుద్దీను ఖిల్జి డిల్లీనగరమున కేలికగానుండెను. ఈకామాంధుని దుర్ణయములు లెక్కకు మించియుండెను. ఈయవివేకి పెద్దతురకసైన్యముతోఁ బద్మినిని హరించుటకై చిత్తూరుకోటను ముట్టడించెను. ఈ తురుష్కుఁడు పద్మిని మాయోపాయమువలన వంచితుఁడై మొదటిసారి పరాభవింపఁబడి పలాయనమును రక్షణముగఁ గైకొనెను. కాని రెండవసారి యధికమైనసేనలతోఁ దిరిగి చిత్తూరుకోటను ముట్టడించెను. రసపుత్రవీరు లారుమాసములవర కత్యంత శౌర్యపరాక్రమములతోఁ గోటనుగాపాడిరి. తరుగకఁ బెరుగుచున్న తురుష్కసైన్యము నోడించుటకు వారి శౌర్యపరాక్రమము లనుపయోగము లయ్యెను. కోటసంరక్షణ మలవిగాకపోయినపుడు స్త్రీలు చితిసొచ్చి మానమునుఁ గాపాడుకొనుటయును, పురుషులు కొనయూపిరియున్నంతవరకుఁ బోరాడి వీరస్వర్గమున కేగుటయును మున్నగు వృత్తాంతము లోకవిఖ్యాతము. వేనవేలు స్త్రీపురుషులీరీతినిఁ దమమేనుల దేశసంరక్షణార్థమై యర్పించిరి. అలాఉద్దీను దనసైన్యముతో జనసూన్యమైన కోటలోఁ బ్రవేశించెను. తురకలు దమకోపావేశమున సుందరమందిరములను గుడిగోపురములను వినాశముజేసిరి. మార్వాడు దేశస్థుడైన మల్దేవుని దుర్గపాలకునిగ నియమించి అలాయుద్దీను తనసైన్యముతో మరలిపోయెను. లక్ష్మణసింహుని కొడుకులలో నొక యజేయసింహుఁడు మాత్రము బ్రతికియుండెను.

రాణాభువనసింగుకోట నొకసారి పట్టుకొనెనుగాని తిరిగి మహమ్మదు తుఘ్లకు వెంటనే స్వాధీనముచేసుకొనెను. లక్ష్మణసింహుని మనుమఁడు రాణాహమీరు మల్దేవుని కూతురునుఁ బెండ్లియాడి చిత్తూరుకోట నాక్రమించుకొనెను. ఈవీరాగ్రేసరుఁడు మహమ్మదు తుఘ్లకునోడించి వానినిఁ గారాగారమునందుంచి వానినుండి యేబదిలక్షల రూప్యములను, నూరుమాతంగములను, కొన్నిమండలము లనుగ్రహించి వానిని చెఱసాలనుండి వదలెను. హమీరు 64 యేండ్లు జీవించి దేశమును బాగుగనేలి 1364లోఁ గాలధర్మమునొందెను. పిమ్మట నూటయేబది యేండ్లవరకు మేవారురాజ్యము వర్ధిలెను. ఈదేశమునకు 1382-97 వరకు రాణాలక్షసింహు డేలికగనుండెను. వానికాలములో సీసముగనులు వెండిగనులు కనుఁగొనఁబడెను. ఈసొమ్ము గుడిగోపురముల గట్టుటకును, నీటివసతులనుఁ గల్పించుటకును, కోటను బాగుజేయుటకును వాడఁబడినది. సుప్రసిద్ధుడైన రాణాకుంభుఁడు 1433-68 వరకు మేవారునుఁ బాలించెను. ఈశౌర్యసంపన్నుఁడు మహమ్మదీయనాయకులైన మహమ్మదుఖిల్జి కుతుబుద్దీను మొదలగు తురుష్కనాయకులనోడించి చిత్తూరుదుర్గములో జయస్తంభమునుఁ గట్టించెను. ఈవిజయస్తంభము కుంభలగృహమునుఁ బేర నొప్పుచు మేవారు రాజ్యపుతొల్లింటి వైభవమునుఁ జాటుచున్నది. ఈకట్టడము నూటయిరువది రెండడుగులపొడవై తొమ్మిదంతస్థులను గలిగియున్నది. ప్రతియంతస్థును చిత్రప్రతిమలతోను సుందరవిగ్రహములతోను చిత్రితమై చూచుటకతి రమణీయముగ నొప్పుచున్నది. ఈ స్తంభము హిందూదేశములోనున్న కుతుబుమినారుకంటెను రోములోని ట్రాజాను స్తంభమునకంటెను బాగున్నదని ఫర్గూసనుగారి మతము. భాగవతశ్రేష్ఠురాలైన మీరాబాయి ఈమహావీరుని ధర్మపత్ని. ఈరాజదంపతులకు సంగీతకవిత్వములం దసామాన్య నైపుణిగలదు. వారు దమజీవితములోఁ గొంతకాలమును రాణాకుంభునిచేఁ గట్టింపఁబడిన శ్రీకృష్ణాలయమునందు భజనసంకీర్తనములతోఁ గాలమునుగడపిరి. కాని కాలవశమున మీరాబాయి స్వదేశమునువదలి బృందావనమునకేగి శ్రీకృష్ణసాన్నిధ్యమున భజనలతోఁ బ్రొద్దుబుచ్చుచుఁ బ్రజల భగవద్భక్తపరాయణులంజేయుచుఁ బరమపదమునకేగిన యితిహాసము సుప్రసిద్ధము. మహాశూరుడు

Coronation of Their Imperial Majesties at Delhi,



శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుని యొక్కయు మేరీ మహారాజ్ఞి యొక్కయు ఢిల్లీ సామ్రాజ్యాభిషేకము.

Coronation of Their Imperial Majesties at Delhi.



శ్రీపంచమజార్జి రాజరాజేంద్రునియొక్కయు మేరీ మహారాజ్ఞియొక్కయు ఢిల్లీ సామ్రాజ్యాభిషేకము.

Coronation of their Imperial Majesties at Delhi.



శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుని యొక్కయు మేరీ మహారాజ్ఞి యొక్కయు డిల్లీ సామ్రాజ్యాభిషేకమహోత్సవము.

Coronation of Thair Imperial Majesties at Delhi.



శ్రీపంచమజార్జి రాజ రాజేంద్రునియొక్కయు మేరీ మహారాజ్ఞియొక్కయు డిల్లీసామ్రాజ్యాభిషేకము.

రాణా రాయమల్లుడు 1473-1508 వరకు మేవారును బాలించుచు మహమ్మదీయులను ముప్పతిప్పలపాల్జేసెను.

సంగుడను నామాంతరమును వహించిన మొదటి రాణాసంగ్రామ సింహునికాలమునందు మేవారు రాజ్యము పరమోచ్చస్థితినందుండెను. ఆరాజన్యుని కాలమునం దీరాజ్యాదాయము పదికోట్లరూప్యములు. రాజ్యముక్రింద 80,000 గుఱ్ఱపురౌతులు, 500 గజములు, ఎనమండ్రుగురు రాజులు, తొమ్మండ్రుగురురావులు, నూటనలుగురు రావలులు రాజును రణరంగమున ననుగమించుచుండెను. రాజపుత్రస్థానమంతయును నీరాజ్యములో జేరియుండెను. పదునెనిమిది యుద్ధములలో నీరాణా విజయలక్ష్మిని జేపట్టెను. కోటల ననేకములనుం బట్టుకొనెను. ఒకసమయమున మాల్వారాజైన రెండవమహమ్మదునుం బట్టుకొని యుదారభావముతో వానిని సత్కరించి యనిపెను. మేవారు రాజ్య మీయుచ్ఛస్థితిలోనుండగా మొగలుసామ్రాజ్య నిర్మాణకుడు బేబరు రణరంగమునం బ్రవేశించెను. ఖన్వాహనమీపమున 1527లో నొకగొప్పయుద్ధము జరిగెను. రజపుత్రవీరు లెప్పటియట్ల సాహసధైర్యములతోం బోరాడిరి. కాని స్వపక్షదండనాయకుడైన శిలాదేవుని ద్రోహమువలనను బేబరుయొక్క వ్యూహనిర్మాణ నైపుణ్యమువలనను తురకలకు సంపూర్ణజయముగలిగినది. రాణాసంగుడు యుద్ధములో గాయపడి కొంతకాలమునకా వీరపురుషుడు వీరస్వర్గమున కేగెను.

సంగుని జ్యేష్ఠపుత్రుడు రెండవరత్నసింహుడు రాజ్యభారమును వహించెను. కాని సూర్యమల్లునిచే గలిగిన వాని యకాలమరణమువలన సవతితమ్ముడు విక్రమాదిత్యుడు రాజయ్యెను. విక్రమాదిత్యుని దుర్వినయమును రాజపుత్రుల యంతఃకలహములును ఘూర్జరదేశాధీశుడైన బహదూరు షా దండయాత్రకు గారణములైనవి. ఈ మహమ్మదీయ నాయకుడు 1534 లో మేవారు పైదాడి వెడలి చిత్తూరుకోటను ముట్టడించెను.

చిత్తూరు మూడవముట్టడి.

ఈ యాసన్నాపదనుండి చిత్తూరునుం గాపాడుటకు రాజపుత్రవీరులు దమమత్సరములను మరచి నలుదెసలనుండియువచ్చిచేరిరి. రావులు, రావలులు, రాజులు దమ యసూయా పిశాచమును దిగంద్రోసి చిత్తూరును గాపాడం గంకణమునుం గట్టుకొనిరి. కాలమాసన్నమైనపుడు మనుజప్రయత్నములు నిరుపయోగములై దైవము ప్రతికూలుడగును. బహదూరు షా చిత్తూరు కోటను పోర్చుగీసు సైనికులయొక్కయు వారి ఫిరంగులయొక్కయు సాహాయ్యబలిమిని ముట్టడించెను. కోటను నిప్పునం గ్రక్కుచు మృత్యురూపధారులై సకలమును వినాశనముసేసెడి యాఫిరంగులబారికిం బాళంగలశౌర్యమే శూరులకుండంగలదు? ఫిరంగుల తాకుడుకు కోటగోడలు నేలంగూల నారంభించెను. దుర్గరక్షణము దుర్భరమయ్యెను. రాణీజవాహిరుబాయి కవచధారిణియై శత్రుసైన్యముతోం బోరి వీరశయనమున శయనించెను. పిమ్మట కర్ణాదేవియును పదుమూడువేల రాజాంగనలును దమకోమల గాత్రముల నగ్నిహోత్రమున కర్పించి మానమునుం గాపాడుకొనిరి. విషముద్రాని కొందరు సుందరాంగులు ప్రాణములవిడిచిరి. మఱికొందఱు సతీమతల్లులు శస్త్రములచేం బ్రాణములందీసికొనిరి. రాజపుత్రవీరులు రక్తాంబరధారులై వివాహమహోత్సవమునకువలె సమితోత్సాహముతో యుద్ధభూమిలోం బ్రవేశించిరి. ఆవీరులుతురకసైన్యములతోం గొనయూపిరియున్నంతవరకుం బోరాడి స్వదేశసేవకై ప్రాణముల నర్పించి శాశ్వతకీర్తినిం గడించిరి. బహదూరుషా జనశూన్యమైనకోటలో దనసైన్యముతోం బ్రవేశించెను. రాణీకర్ణావతి జోహారుసేయుటకుముందుం దనసుతుని నుదయసింహుని రక్షణమును వేడుచు హుమాయూనుచక్రవర్తికొక గౌరవతోరణమునంపెను. హుమాయూనా గౌరవమువలన ముదితహృదయుడై చిత్తూరు దుర్గమును ముట్టడించి బహదూరు షా నోడించి విక్రమాదిత్యుని రాజునుగా నేర్పరచి మరలిపోయెను. దుర్వినయాన్వితుడైన విక్రమాదిత్యుడు 1535లో వనవీరునిచే జంపంబడెను. ఈయన సంగ్రామసింహుని సోదరునకనౌరసపుత్రుడు. వనవీరుడు రాజ్యలక్ష్మిం జేపట్టి శత్రుశేషమునుం జేయుటకై బాలుడైన యుదయసింహునిం జంపుటకై యత్నించెను కాని పన్నయను వానిదాయి తనయేకపుత్రుని ప్రాణము

ల నిశ్చింతగానర్పించి రాజపుత్రుని ప్రాణంబులంగాపాడిన యితిహాసము సుప్రసిద్ధము. ధీరసంపన్నురాలైన పన్న యొక్క యవ్యాజరాజభక్తియును ధైర్యసాహసములును సంస్తవనీయములు. ఉదయసింహుడు 1537 లో వనవీరుని రాజ్యభ్రష్టునిఁజేసి రాజ్యము నాక్రమించుకొనెను. ఈరాజశ్రేష్ఠుడు 1537-72 వరకు మేవారు రాజ్యమునేలెను. వానికాలములో నక్బరుపాదుషా చిత్తూరుదుర్గమును ముట్టడించెను.

చిత్తూరుకోట నాల్గవముట్టడి.

హిందూదేశములో మతద్వేషములను జాతిమత్సరములను నంతరింపఁజేసి సమభావముతోఁ బాలింపవలయునని యత్నముచేసిన చక్రవర్తులలో నగ్రగణ్యుడైన యక్బరుపాదుషా 1556 లో రాజ్యభారమును వహించెను. తన యభీష్టసిద్ధికై రాజపుత్రులతో సంబంధబాంధవ్యములంజేసి వారల సేనాధ్యక్షులనుగను మంత్రులనుగను రాజప్రతినిధులనుగను నియమించి సత్కరించుచుండెను. అంబరు సంస్థానాధీశుడుతనకూతురును నక్బరునకురాణినిగాఁజేసెను. ఇతర రాజస్థానాధీశులును సంబంధబాంధవ్యములవలనను కప్పములగట్టియును నక్బరుతో సంధినిఁ జేసికొని వానికి విధేయులైయుండిరి. మేవారురాణామట్టుకు లోఁబడకుండెను. కాని యారాణాకు వానితండ్రికిఁగల శౌర్యప్రతాపములుగాని యుత్సాహమునుగాని లేకుండెను. అక్బరు స్వయముగ 1567 లో దనసైన్యములనుఁ జిత్తూరుపై నడిపెను. ఉదయసింహుడు ముట్టడియారంభదశలోనె కోటనువిడిచి వానిచే 1559లో నారావల్లి పర్వత ప్రాంతమున నూతనముగ నారంభించిన యుదయపురమునకు సుఖముగఁజేరెను. శూరావతంసములైనజయమల్లుడు పట్టుడు మొదలగు వీరాగ్రేసరులు క్షాత్రధర్మమునుఁ గాపాడుటకై చిత్తూరుదుర్గ సంరక్షణార్థమై నిలచిరి. అక్బరుసైన్యమునకును, నుత్సాహమునకును, శతఘ్నులాదిగాఁగల యుద్ధసామగ్రికిని రాజపుత్రుల ప్రతాపము చాలియుండలేదు. పూర్వపు ముట్టడులందువలెనే స్త్రీలు దమ సుందరశరీరంబుల నగ్నిదేవున కర్పించి పూతచరితలైరి. పురుషులు దమప్రాణముల దేశరక్షణార్థమై యర్పించి క్షాత్రధర్మనిష్ఠాగరిష్ఠులై వీరస్వర్గమున నివాసములనుఁ గైకొనిరి. కోటయందుండిన 50,000 జనులలోను 40,000 నిహతులైనారనియును శేషించిన 10,000 జనులు చెఱఁగొనఁబడిరనియును చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఈ ముట్టడితో విజయలక్ష్మి చిత్తూరుదుర్గమునుఁ బూర్తిగఁ బరిత్యజించెను. మేవారు రాజ్యమున కుదయసింహునిర్మితమైన యుదయపుర మాకాలమునుండి నేటివరకును రాజధానిగనున్నది.

చిత్తూరుకోట నేలమట్టమునకు 500అడుగులయెత్తయిన యిరుకుకొండపైఁ గట్టబడి మూడుంబావుమైళ్ళ పొడవును నరమైలు వెడలుపునుఁగలిగి 690 యకరముల ప్రదేశము నావరించుకొనియున్నది. పాండవసుతుడైన భీమసేనునిచే నీకోటనిర్మింపఁబడినదని యొక పురాణగాథ గలదు. మొదటనిది చిత్రకోటయని పిలువఁబడుచుండెడిది. దీనికీ పేరు మోరిరాజపుత్రులకు రాజైన చిత్రాంగునివలనఁ గలిగియుండును. మహేంద్రుడు 734 లో దీనిని స్వాధీనమునుఁ జేసికొనినపిమ్మట మేవారురాజ్యములోఁ జేరెను, ఆకాలపుచరిత్ర మింతవరకు వ్రాయబడినది. ఈదుర్గమునందుండు కీర్తిస్తంభము, జయస్తంభము, కృష్ణాలయము. దుర్గాలయము దర్శనీయములు. వీరావేశమున కునికిపట్టును, యోధవీరుల కాటపట్టును, వీరవనితలకు నివాసమును, దేశభక్తుల కాకరమును, క్షాత్రధర్మమునకుఁ బుణ్యభూమియును, ధనసంపదల కాలవాలమునునై ప్రశస్తినిఁ గాంచి యసహాయశూరుల ధిక్కరించినయీపవిత్రస్థల మిపుడొక పల్లెటూరువలె 7,593 జనసంఖ్యనుగలిగియున్నది. ధర్మరక్షణము సదభిమానభరితమైన మేలును దురభిమానపూరితమైన కీడును గలుగుట యగ్గలము. దురభిమానాయత్తమై ధర్మము నిస్సారమై కులాభిమానముగ బరిణమించుట ప్రత్యక్షప్రమాణముగ నున్నది. క్షాత్రవీర్యము దురభిమానసంగతమై కురుక్షేత్రములో నస్తంగతమైనది. క్షాత్రప్రతాపము కులాభిమానరూపమునుఁ గైకొని రాజపుత్రుల వినాశనమునకుఁ గారణంబైనది. చిత్తూరుదుర్గసంబంధ సంగ్రామంబులలోఁ బ్రజాక్షయంబునకుఁగల కారణంబీదురభిమానమని తోచకమానదు. ఈ

దురభిమాన విధ్వంస మేకజాతీయత్వభావన కవసరము. బ్రాహ్మణకుల దురభిమాన వినాశనమును నీకాలములో నవసరమై యది రాజనబలమువలనఁగాక సాత్వికప్రభావముచేఁ బాశ్చాత్యసంయోగమువలనఁ నేర్పడుచున్నది. చరాచర రూపప్రపంచమంతయును భగవత్సంకల్పసిద్ధికై పరిణమించుచున్నది. ప్రజాక్షయమును నీపరిణామమునకై యుండునని యూహించవలసి యున్నది. ఇంద్రప్రస్థ పాటలీపురములకువలె నీచిత్తూరు దుర్గముకును భావిభాగ్యము కాలగర్భములోగలదో లేదో యెవరూహింపఁగలరు!

ఉదయసింహుఁడు దనమిగిలిన జీవితకాలమును నుదయపురములోగడిపి 1572 లోఁ గాలగతినొందెను. అప్పటినుండియు మేవారున కుదయపురనామముగలిగినది. ఆకాలమునుండియును మేవారు రాజులు చిత్తూరుదుర్గమును స్వాధీనపఱచుకొనిగాని గడ్డములనుఁ దీయించమని శపథముచేసి గడ్డములను బెంచఁ నారంభించిరి. ఉదయసింహునకుఁ బుత్రులనేకులుండిరి. వారిలో జగమలునకు రాజ్యమును గట్టుట కుదయసింహుని కోరికయై యుండెను. కాని రాజపుత్రయోధులు జ్యేష్ఠపుత్రుడైన ప్రతాపసింహునిఁ బట్టాభిషిక్తుంజేసిరి. ప్రతాపసింహుడు 1572-97వరకు మేవారురాజ్యమున కేలికగనుండెను. ఈపరాక్రమశాలి చరిత్రము స్కాట్లండుప్రభువగు బ్రూసుచరిత్రమునుఁ బోలియున్నది. ఈవీరసింహుడు వనాంతరమునందు సింహమువలె నివాసమునుఁ గైకొనెను. ఉదయపురమునుఁ బరిత్యజించి జల్మియరుకోటను నివాసమునుగజేసికొనెను. నిద్రాహారములు, భాగ్యభోగ్యములు, విశ్రాంతి విరామములులేక నిరువదియైదేండ్లు చక్రవర్తి సైన్యములతోఁ బోరాడెను. ద్రవ్యముసైన్యము యుద్ధసామగ్రియును లేకపోయినను వీరోత్సాహముతో మితిలేని సైన్యసంపదలను యుద్ధసామగ్రినిఁగల యక్బరుతో ననమానకక్షనువహించి పోరాడెను. వైరిపక్షమునఁ దురుష్కులేకాక రాజపుత్రులును స్వకీయసోదరులునుఁబోరాటమునుసలుపుచుండినను నిర్భయముగఁ జక్రవర్తిసైన్యముల నెదుర్కొనుచుండెను. ఏచాటునుండియో యేమూలనుండియో వచ్చి చక్రవర్తిసేనలపైఁ బిడుగువలెఁబడి వారికి వినాశమునుఁజేయుచుండెను. హాల్దిగట్టులో 1576లో నోడింపఁబడి సింధుదేశప్రాంతమున నూతనరాజ్యమును స్థాపించుటకు స్వదేశమును వదలిపోయెను. మంత్రిభీమసా మేవారును జయించుటకై వానిధనమంతయునుఁ బ్రతాపునకిచ్చెను. ప్రతాపుడాకస్మికముగ మేవారుదేశమునకు వచ్చి చక్రవర్తిసైన్యముల దేవైరుదగ్గరనోడించి దేశమును స్వాధీనమునుఁజేసికొని 1597వరకు సుఖముగనేలెను. ప్రతాపుని యనంతరము. 1597-1620వరకు మొదటియమరసింహుడు మేవారున కేలికగనుండెను. రాణా అమరసింహుడు 1614లో జహంగీరునకులోఁబడి తనపెద్దకొడుకు తనకుబదులు చక్రవర్తిసన్నిధికి వచ్చునఁజాలునను నేర్పాటుతో సంధినిఁజేసికొనెను. జహంగీరు కరణసింహుని సత్కరించెను. అమరసింహుని పుత్రుడు కరణసింహుడు 1620-8వరకును పౌత్రుడు జగత్సింహుడు 1628-52 వరకును మేవారును సుఖముగఁబాలించిరి. మొదటిరాణా రాజసింహుడు 1652-1680 వరకు మేవారున కధిపతిగనుండెను. వీనికాలములో మహమ్మదీయమత దురభిమాని ఔరంగజేబు హిందువులపై తలపన్నును (జాజియ) విధించెను. ఇదితిరిగి కలహములకుఁ గారణమై రాజపుత్రస్థానము తురకలదౌర్జన్యమునకుఁ బాలయ్యెను. ఈయుపద్రవమునకు 1662లో నొకమహాక్షామముదోడ్పడి దేశము కష్టములకులోనయ్యెను. కంక్రోలి సరోవరమీకాలమునఁ గట్టఁబడినది. జయసింహుడు 1680-1698 వరకు పాలించెను. ఈరాజుకాలములో నౌరంగజేబు తలపన్నునుఁ దీసివేయుటకొప్పుకొని మేవారుతో సంధినిఁజేసికొనెను. మేవారు దేశమునకు రెండవ యమరసింహుడు 1693-1710వరకు రాజుగనుండెను. తురకలబారినుండి నన్యోన్యులనురక్షించుకొనుటకై యుదయపురము,జయపురము, జోధపురము సంస్థానములకొక యొడంబడిక వీని కాలములో జరిగెను. ఈయొడంబడికవలన నుదయపుర రాజులకును నితరరాజులకును సంబంధబాంధవ్యములు జరుగవలయుననియును నుదయపురపురాజపుత్రికిఁబుట్టినవారు ముందుగ రాజ్యాధిష్ఠానమునకు దగినవారనియును నొప్పుకొనఁబడినది. ఈయొడంబడిక ముందు రాజపుత్రస్థానము యొక్క విపత్పరంపరలకు గారణమైనది.

మేవారునకు 1710-34 దనుక రెండవసంగ్రామసింహుఁడును, 1734-51దనుక రెండవ జగత్సింహుఁడును నేలికలుగనుండిరి. జగత్సింహుని కాలములో మహారాష్ట్రుల బలము విజృంభించినది. బాజీరావుపీష్వాకు సంవత్సరమునకు రూ. 1,60,000లు కప్పమును గట్టుటకు 1736లో రాణా యంగీకరించెను. జయపురము సంస్థానమునకు మొదటికొడుకైన యీశ్వరీసింహుని దప్పించి మేవారు రాజకాంతకుఁ బుట్టిన మాధవసింహుని రాజుగఁ జేయుటకు జగత్సింహుఁడు మల్హారురావుహోల్కారునకు రూ.80,00,000ల నిచ్చునటు లేర్పాటుచేసెను. ఈ యేర్పాటువలన రాంపుర ప్రదేశము మహారాష్ట్రుల వశమయ్యెను. రాజపుత్రవీరులు నిర్వీర్యులై చీటికిమాటికిఁ గలహించుచు మహారాష్ట్రుల సహాయము నపేక్షించుటంజేసి మేవారులో మహారాష్ట్రులు స్థిరముగ నిలిచిరి. మహారాష్ట్రులు దమ దుర్గ్రాహ దురాక్రమణములవలన మహమ్మదీయు దౌర్జన్యమును మఱపింపఁజేసి దేశసంక్షోభముసుఁ జేసిరి. రెండవ ప్రతాపసింహుఁడును, రాజసింహుఁడు, అరిసింహుఁడు, హమీరసింహుఁడు 1751-1778వరకు మేవారు నేలిరి. మేవారు దేశస్థులు సింధియాను నరిసింహుని రాజ్యభ్రష్టునిఁ జేయుమని కోరగా వానిని 1769లో నుజ్జయినిదగ్గర నోడించి సింధియా ముప్పదిరెండులక్షల రూప్యములను జావదు, జీరను, నీముచి మండలములను స్వీకరించెను. గోడవరు మండలము జోధపురము పాలయ్యెను. సింబహేర హోల్కారు వశమయ్యెను. మేవారు రాజులనుండి 1778వరకు మహారాష్ట్రులు 181లక్షల రూప్యములను సంవత్సరమునకు 23లక్షల యాదాయము రాగల దేశమును సంగ్రహించిరి. రెండవభీమసింహుఁడు 1778-1828 వరకు మేవారు నేలుచుండెను. వానికాలములో కృష్ణకుమారిని బెండ్లియాడుటకై జయపురము జోధపురము సంస్థానాధిపతులు పోరాడుచుండిరి. సంస్థానములోని ప్రభువులంతఃకలహములలో మునిగియుండిరి. మహారాష్ట్రులు, పిండారులు, మహమ్మదీయులు దోపుడుదొంగలై మేవారునకు సంక్షోభముసుఁ జేయుచుండిరి. భీమసింహుఁడీ దుస్థితిలో 1817లో బ్రిటిషుపరిపాలకులతో నొడంబడికనుఁ జేసికొని యాదాయములో నాలవవంతు రక్షణార్థమై వారికిచ్చుట కంగీకరించెను. ఈకప్పము 1826లో మూడు లక్షలకును 1846లో రెండులక్షలకును తగ్గింపఁబడినది. దేశముయొక్క దుస్థితివలన బ్రిటిషుపాలకుల ప్రతినిధి వ్యవహార నిర్వహణమునుఁ బూనుకొనెను. జవానసింహుఁడు సర్దారుసింహుఁడు 1828-42వరకీ దేశమునుఁ బాలించిరి. వారికాలములో రాజ్యవ్యవహారములు బ్రిటిషుపరిపాలకులక్రిందను బాగుగ స్థాపింపఁబడెను. సరూపసింహుఁడు 1842-61వరకును శంభుసింహుఁడు 1861-74వరకు మేవారు నేలిరి. సిపాయిల తిరుగుబాటుసమయమున సరూపసింహుఁ డాంగ్లేయుల ప్రాణములం గాపాడెను. శంభుసింహుని బాల్యదశలో సంస్థానము బ్రిటిషు రాజ్యాధికారులచేఁ బాలింపఁబడి ముప్పదిలక్షల రొక్కముతో రాజ్యము వానికీయఁబడెను. సజ్జనసింహుఁడీ దేశమును 1876-1881 వరకు బాగుగ నేలెను. వానికి సంతతిలేనందున రెండవసంగ్రామసింహుని వంశజుఁడైన ఫతేసింహుఁడు సర్వజనాంగీకారముతో రాజ్యమునందుంచఁబడెను. ఈరాణాకు 1887లో జి.సి.ఎస్.ఐ. బిరుదమొసఁగఁబడినది. చిత్తూరునుండి యుదయపురమునకు రైలుమార్గము వేయఁబడినది. విపత్పరంపరల కాలవాలమైన మేవారు రాజ్యమిపుడు శాంతిసుఖములనుఁ గలిగియున్నది. చల్లని యాంగ్లేయసామ్రాజ్యము క్రిందను మేవారుదేశపు ప్రజలు సుఖములఁబడయుచున్నారు.

మేవారు రాజ్యవిస్తీర్ణము 12,691 చతురపుమైళ్లు, జనసంఖ్య 10,18,805 ఆదాయము 26,50,000 రూప్యములు. దేశము నిర్జలప్రదేశమగుటంజేసి 12?,000 బావులవలనను తటాకములవలనను వ్యవసాయమునకు నీరుపయోగింపఁబడుచున్నది. దేశములో గనులు గలవుగాని యవి వాడుకలో లేవు. దేశము రాణాచే నిద్దరు మంత్రుల సహాయమువలనఁ బాలింపఁబడుచున్నది. మహారాణా గమనాగమనవేళల 21ఫిరంగుల సత్కారమున కర్హులు.

# కాశ్మీర జమ్ము దేశములు.

కాశ్మీర దేశము భూలోక దివ్యోద్యానంబునాఁ బరగుచు సుందర సందర్శన విభవాభిరామంబై హిందూదేశవాయవ్యదిశనున్నది. ఉన్నత నగరాజంబులు, గంభీర జలపాతంబులు, సుందర సరోవరంబులు, విశాలోన్నత వృక్షంబులు దేశసౌందర్యంబున కనిర్వచనీయంబైన శోభఁ గారణంబులు. ప్రకృతి సంజాతంబులైన గంభీరవైభవవిలాసంబులకీదేశం బాటపట్టు. ఈసుందరదేశము మిన్నంటిన విశాలోన్నత సౌధంబువలె నొప్పుచున్నది. ఈ సౌధంబున కంతస్తులనేకంబులు ద్వారంబులు పెక్కులు. సౌధారోహణంబునకు జమ్ముదేశప్రాంతంబుసింహద్వారంబు. ఆప్రదేశమునుండి మొదటి యంతస్తునుఁ జేరుటకు 8000 అడుగుల యెత్తయిన కొండల నెక్కవలయును. ఆప్రాంతంబతి శీతలంబుగాక రమణీయంబై దేవదారు సాలవృక్షాకీర్ణంబై యారోగ్యప్రదంబై యొప్పుచున్నది. రెండవ యంతస్తునకు మెట్లు హిమాలయపర్వత శాఖయై నపీరపంజాలు నగంబు. ఈయంతస్తులో ముత్యములచే నావృతంబైన పచ్చనుంబోలె రమ్యంబైన కాశ్మీరాంతస్సౌధంబు విరాజిల్లుచున్నది. హిమావృతంబైన యున్నత నగరాజంబుల నడుమను నీలోను పైరుపచ్చలతోను, ఫలవృక్షములతోను, పుష్పలతావితానములతోను, సెలయేఱులతోను నిండి యాశ్చర్యాద్భుతలావణ్యమయముగా నొప్పుచున్నది. వేదయుగమునందు వితస్థయని పేరొందిన జీలమునది నగంబులలో నీటిబుగ్గవలెంబుట్టి పెద్దనదియై ఈలోయలోఁ బాఱుచు దేశమును ఫలవంతముగఁ జేయుచున్నది.

ఈలోయప్రదేశము 84 మైళ్ళ పొడవును 25 మైళ్ళవెడలుపును గలిగి కొండలనడుమను నమర్పఁబడినదివ్యమందిరమువలె నలుదిశలను నగరాజంబులచే నావృతంబైయున్నది. హిమావృత నగంబు లుత్తరదిశను చంద్రకాంతశిలా నిర్మితకుడ్యంబులవలె నొప్పుచున్నవి. నంగపర్వత శృంగము 26,182 అడుగుల యెత్తునుగలిగి యుత్తరగోపురమువలెఁ బ్రకాశించుచున్నది. తూర్పు దక్షిణ దిక్కులను హరముఖము, మహాదేవము, అమరనాథము శృంగములు 17,000 అడుగుల యెత్తునుగలిగి గోపురములవలెనున్నవి. పడమటను కాజినాగము 12,125 యెత్తునుగలిగి విరాజిల్లుచున్నది. నిర్ఝరంబులతి వేగంబుగఁ గొండసందులనుండిఁ బ్రవహించుచు ఫేనపుంజంబులతోఁ దాండవమాడుచు మనోహరంబుగ నొప్పుచున్నవి. నిర్మల హిమసంజాత వారిపూరితంబులైన నదీనదంబులు నల్లనినునుపైన కొండలనడుమనుఁ నతివేగంబుగఁ బ్రవహించుచు సుధాప్రవాహంబులవలె శోభిల్లుచున్నవి. హిమావృత ధవళనగ శిఖరంబులు రజతశృంగంబులవలె గగనపథంబున విహరించుచున్నవి. ఈసౌందర్యంపు సొంపు సూర్యకిరణసంగతంబువలనఁ బొంపొందుచున్నది. ప్రభాకరుని యరుణకాంతులీప్రదేశమును రాగమయంబుగఁ జేయుచున్నవి. సూర్యకాంతులు హిమఖండంబులం దనంతమణికాంతులను జలపాతంబులం దింద్రచాపరుచులను నీలశిలాతలంబులందు ధవళకాంతులనుఁ బుట్టించునటులు తోచుచుండును. మధ్యందిన మార్తాండప్రభలు బింబప్రతిబింబితములై యీప్రదేశంబును తేజోమయంబుగఁ జేయుచుండును. సంధ్యాసమయంబున నగాగ్రంబులు స్వర్ణశృంగంబులతోను వృక్షాగ్రంబులు సువర్ణచ్ఛాయలతోను నలంకరింపఁబడినటులు రమణీయంబుగనుండును. చంద్రకాంతులవలన హిమాచ్ఛాదిత పర్వతంబులు చంద్రకాంత పర్వతములవలె శోభిల్లుచుండును. ఈయపూర్వ ప్రకృతివైభవము దివ్యవిభూతిని ననంతసుఖములఁ బ్రకటించుచున్నది. మూడవయంతస్తుగానున్న బల్తిస్థానమునకు హిమాలయ నగశాఖలు సోపానములుగ నున్నవి. నాల్గవయంతస్తునకు హిందూకుశ కనుమలు మెట్లుగనున్నవి. ఆమెట్లు పరమోన్నతమైన పామీరు ప్రస్థమునకు మార్గగాములుగనున్నవి. ఆప్రాంతములో నీసౌధమునకు 23,265అడుగుల ఎత్తుగలగుడ్విన్ ఆస్టిను శృంగము శిఖరాగ్రముగనున్నది. ఈప్రాంతమునందే 25,000 అడుగుల యెత్తుకుమించిన రాకపోషి, మాషరుబరను శిఖరములునుఁ గలవు. దేశమంతయును నగమయంబై, పర్వతావృతంబై, హిమావృత పర్వతశృంగశోభితంబై, గంభీరభరితంబై యొప్పుచున్నది. మంచుకొండలు, ఉన్నత శృంగములు,

శృంగారజలపాతములు, విశాలోన్నత వృక్షములు, రమణీయశాద్వలములు, సుందరకాసారములు, సౌగంధిక కుసుమలతా వితానములు, మధురఫలవృక్షములు, దివ్యగాథలు కాశ్మీరదేశపు ప్రఖ్యాతికిఁ గారణములు.

హిందూదేశములోని యితరదేశముల చరిత్రముల వలెఁ గాక కాశ్మీరమునకు కల్హణ కృతరాజరాజ తరంగిణి యాధారముగ నున్నది. ఈ గ్రంథ రాజమువలన 850-1,170 వరకే దేశచారిత్రము స్పష్టముగు చున్నది. జోనరాజ శ్రీవీరుల గ్రంథములు 1346 వరకును రాజావళి పతాకము 1586 వరకును నీదేశచరిత్రమును దెలుపుచున్నవి.

పూర్వము కాశ్మీరప్రదేశము జలమయముగ నుండి సతీసరోవరమను పేరనొప్పుచుండిన దనియును నాసరోవరముపై గౌరి విహరించు చుండెడి దనియును జలోద్భవుని సంహారణార్థము బారములదగ్గర గట్టునుఁ దెగఁ గొట్టుటచే స్థలముయు మైనదనియును నొక గాథ గలదు. ఈ దానవుని సంహరించుటకై గౌరి హారపర్వతమును వానిపైఁ బ్రయోగించిన దనియును నాటినుండియు నది ప్రద్యుమ్నగిరి యచ్చటి జనులచే సర్చింపఁబడు చున్న దనియును నొకవాడుక గలదు.

గోనందుఁడు కాశ్మీర రాజ్యస్థాపకుడుగ రాజరాజ తరంగిణిలోఁ బేర్కొనఁ బడెను. కనిష్కుని కాలములో ఘూడవబుద్ధ సంఘారామము కాశ్మీరదేశములోఁ గూడినటులు బౌద్ధగాథలు ప్రకటించుచున్నవి. క్రూర శిఖామణి మిహిరకులుడు 528 ప్రాంతమున నీదేశమున కేలికగ నుండెను. ఎనిమిదవ శతాబ్దములో లలితాదిత్యుడు రాజుగ నుండెను. ఈశూరుడు హిందూదేశపు రాజులను జయించుటయె కాక నాసియాఖండ మధ్యదేశములపై దండు వెడలెను. చీనా చక్రవర్తిచే సత్కరింపఁబడెను. శంకరవర్మ 883-902 వరకును దిడ్డరాణి 950-1003 వరకును నీదేశము నేలిరి. పండ్రెండవ శతాబ్దములో గయించక్ మహా రామచందు నోడించి వానికు మార్తెను కూటరాణినిఁ బెండ్లియాడి మహమ్మదీయ మతమును స్వీకరించి కాశ్మీరమునకు మొదటి మహమ్మదీయ రాజయ్యెను. ఉదయన దేవుడు రయించక్ షహా నోడించి కూటరాణిని బెండ్లియాడి రాజ్యభారమును వహించెను. వాని మరణానంతరము షాహమీర్జా రాజు కాగా కూటరాణి వానిఁ బెండ్లియాడ నొల్లకఁ బ్రాణ త్యాగమునుఁ జేసెను. సుల్తాను సికందరు 1394 లో నీ దేశమునకు రాజయి నిర్బంధముగ హిందువులను మహమ్మదీయులనుగఁ జేసెను. బ్రాహ్మణులుతప్ప నితరవర్ణస్థులు మహమ్మదీయులైరి. 1586 లో నీదేశ మాక్బరు చక్రవర్తికి లోబడెను. 1751 లో మొగలుల సామ్రాజ్యము విచ్ఛిన్నమైనపుడు కాశ్మీరము తిరిగి స్వతంత్రరాజ్యముగ మారెను.

పిమ్మట నాఫ్ఘానులును సిక్కులును నీరాజ్యమును బాలించిరి. ఇప్పటి కాశ్మీరరాజ్యమునకు నిర్మాణకుడుగ నెన్నఁదగిన గులాబసింగు 1814 లో రణరంగములోఁ బ్రవేశించెను. ఈశూరుడు కాశ్మీరరాజ్యములో నొకభాగమైన జమ్ముప్రాంతమునకు రాజుగ నుండెను. దండ యాత్రికుల యాశ కాశ్మీరముపైఁ బ్రసరించినది గాని జమ్ముపైఁ బ్రసరించలేదు. ఈ ప్రదేశమునకు డోగ్రారాజపుత్రు లేలికలుగ నుండిరి. దేశమనవరతము కల్లోలభరితమై యుండెను. పందొమ్మిదవ శతాబ్దమునకు నడుమను చండశాసనుడు గులాబుసింగు జమ్ముదేశమునకు రాజై క్రమక్రమముగ కాశ్మీరదేశమునంతను నాక్రమించుకొనెను. 1845 లో నాంగ్లేయులకును సిక్కులకును యుద్ధము సంభవించెను. యుద్ధానంతరము 75 లక్షల రూప్యములనుఁ దీసికొని బ్రిటిషుపరిపాలకులు కాశ్మీరదేశమును గులాబసింగున కిచ్చిరి. గులాబసింగు 1857 లోఁ గాలధర్మమునొందగా రణవీరసింగు రాజై 1857-1885 వరకేలెను. ఇపుడు రాజుగానున్న మహారాజా ప్రతాపసింగు 1885 లో రాజ్యము నధిష్ఠించెను. వీరి పరిపాలనము క్రింద దేశములో శాంతి స్థాపింపఁబడి దేశమభివృద్ధినిఁ జెందుచున్నది. పట్టుపరిశ్రమము వలనఁ బ్రజాపాలకులకు లాభము గలుగుచున్నది. విద్యావ్యాపనకై యత్నములు చేయఁబడు చున్నవి. మహారాజునకు జి. సి. యస్. ఐ. బిరుద మొసంగఁబడినది. గమ

నాగమన సమయములందు 21 ఫిరంగుల సన్మానమునకు మహారాజర్హుడు. రాజ్యవ్యవహారము మహారాజుచే ముగ్గురు మంత్రులసహాయమున నిర్వర్తింపఁబడు చున్నది. సర్ అమరసింగు ప్రధానమంత్రిగ నున్నాడు.

కాశ్మీరదేశ విస్తీర్ణము 80,900 చతురపుమైళ్లు; జనసంఖ్య 29,05,578; వారిలో 21,54,695 మహమ్మదీయులు, 6,89,073 సిక్కులు, 35,047 బౌద్ధులు, ఆదాయము సంవత్సరమునకు రూ. 92,99,000 వ్యయము రూ. 1,01,42,000, సైన్యరక్షణార్థము సంవత్సరమునకు పదుమూడులక్షల రూప్యములు వ్యయమగుచున్నవి. ఈసంస్థానము భాగ్యస్థితిలో నున్నది. ఏబదిలక్షల రూప్యముల గవర్నమెంటు పత్రములును, మూడుకోట్లరూప్యములు బాకీలును సంస్థానమున కాదాయము గలదు.

కాశ్మీరదేశము పుణ్యభూమిగ హిందువులచే నెంచఁబడుచున్నది. ఈదేశములో దర్శన యోగ్యంబులైన సహజసౌందర్య భరితంబులైన స్థలంబులెకాక పురాతన దేవళంబులును మందిరంబులును గలవు. అమరనాథక్షేత్రము, పశుపతి దేవాలయము, లలితాదిత్యుని కాలములో నిర్మింపబడిన మార్తాండుని దేవాలయము దర్శన యోగ్యములు. హిందువులలో శైవమతవ్యాపన మధికము. ప్రజలలో విశేషభాగము మహమ్మదీయులైనను వారు హిందువుల యాచార వ్యవహారముల నవలంబించు చున్నారు.

---

## కాలట్ దేశము.

ఈసామంతరాజ్యము పశ్చిమ బెలూచిస్థానమం దున్నది. ఇచ్చటి ప్రజలు మూడు తెగలవారయి యున్నారు. (1) ఉలూసు అనువారు రాజ్యములో నిచ్చటచ్చట నివసించుచుందురు. (2) సారవన్ జాతివారు రైసనీసర్దారను నతని యధికారముక్రింద కాలట్ నగరమున కుత్తరమునను౦దురు (3) ఝూలావాన్ జాతివారు కాలట్ కుదక్షిణమున జహారీసర్దారుక్రిందనున్నారు. వీరుస్వాతంత్ర్యులేయయినను కాలట్ పాలకుని నామకార్థము తమ యొడయుడందురు. వీరి విదేశవ్యవహారములను మాత్రము కాలట్ ఖాన్‌గారే జఱుపవలయును. కాలట్‌లో సింధుదేశములోని రాయివంశపు హిందూరాజులేలియుండిరని ప్రతీతి కలదు. ఒకవేళ వీరు 7 వ శతాబ్దమునకు ముందేలియుండవచ్చును. తరువాతనిది మహమ్మదీయుల హస్తగతమయినది.

అహమ్మద్‌జై తెగకు జెందిన యీకాలట్‌ఖాను లెప్పుడును స్వతంత్రులుగనుండలేదు. మొగలాయి చక్రవర్తులకాలమునుండి వీరొకరి సామంతులయి యున్నట్టివారే. 1854, 1876 వ సం॥లలో నింగ్లీషువారితో సంధి నేర్పఱచుకొని వారికొక లక్షరూపాయలు కప్పము కట్టునట్లును, వారికి కావలసినప్పుడు సహాయముచేయునట్లును, కాలట్‌లో బ్రిటిషుసైన్యమునుంచి రయిలులు, టెలిగ్రాఫులువేయుటకును యొప్పుకొనిరి. ఈదేశములో నింగ్లీషువారు స్వేచ్ఛగా వ్యాపారముజేయవచ్చును. క్వెట్టా, సుఖి, నాసిరాబాదు పట్టణము లనుగూడ నింగ్లీషుప్రభుత్వమువారికిచ్చిరి.

నాసర్‌ఖాన్ అను పాలకుడీ దేశములో గొప్పవాడుగనుండెను. అతడు ధైర్యవంతుడగు సైనికుడేగాక గొప్ప రాజ్యకార్యవిశారదుడుగ నుండెను. 40 సంవత్సరములు దేశమేలి అంతఃకలహములు లేకుండ శాంతిని నాట్యముజేయించుచుండెను. ఈతనికాలములోనే 1810లో హెన్రీపాటింగర్ అను ఇంగ్లీషుయాత్రీకుడు వెళ్లి తనసంచారమునుగురించి యొకపుస్తకమును వ్రాసెను. నాసర్‌ఖాన్ కుమారుడు మహమ్మద్‌ఖాన్ అనువాడు అసమర్థుడు, క్రూరుడగుటవలన సర్వాన్ జాతివారు తిరుగబడి వానిని పదభ్రష్టునిగజేసి రెండవ నాసర్‌ఖాన్ అనుపేరుతో నొకనిని రాజ్యమెక్కించిరి. ఇతడు మృతినొందినపిదప ఖుదాదాద్‌ఖాన్ నవాబయ్యెను. వీడు పరమదుర్మార్గుడు. కరుణలేనిరాక్షసుడు. 1857 మొదలు 1876 వరకు యీసంస్థానచారిత్రము అల్లరులతోను, హత్యలతోను, అరాజకముతోను నిండియుండెను. 1876 వ సంవత్సరమునందు మేజరు సర్ రాబర్ట్సాండ్‌మ్యాన్ దేశములోనున్న వివిధ తెగలవారికిని సంధినేర్పఱచి దేశము ఇంగ్లీషువారి సార్వభౌమికత్వముక్రింద నుంచునట్లును, దానిని ఇంగ్లీషు

వారు కాపాడుచు శాంతిభంగముకాకుండునట్లు చేయుట కును ఒప్పించెను. అప్పటినుండియు రాష్ట్రములో సంతః కలహములులేవు. 1893 లో మీరొ ఖుదాబాద్ ఖాన్‌తొలగింపబడి అతనికుమారుడు మీర్ మహమ్మద్ రాజ్యాధిపతిచేయబడియెను. ఈమీర్ మహమ్మదుగారే ప్రకృతపు పాలకుడు. ఈయన హిస్ హైనెస్ బేగ్లర్ బేగి సర్ మీర్ మహమ్మద్‌ఖాన్ జి.సి.ఐ.ఇ. వాలి ఆఫ్ కాలత్ అని పిలువబడుచున్నాడు. 19 ఫిరంగులీయన గౌరవార్థమై కాల్చబడుచుండును.

ఇచ్చట 300 కాల్బలము, 500 గుఱ్ఱపుబలము, 90 ఫిరంగిసైన్యము, 20 పురాతనపు ఫిరంగులు గలవు. వీనికయి యేడాదికి 82,000 రూపాయలు ఖాన్ గారికి వ్రయమగుచున్నవి.

దేశవైశాల్యము 71,593చదరపుమైళ్లు. జనసంఖ్య 4,75,000. ఆదాయము 8 లక్షలరూప్యములు. బ్రిటిషు రెసిడెంటిచ్చటగలడు. కాలట్ ఖానుగారికిని ఇతరతెగల వారికిని దగవు లంకురించినప్పుడు ఈయన మధ్యవర్తియై పరిష్కరించుట కధికారమును గలిగియున్నాడు. ఈదేశము హిందూదేశ సరిహద్దులలో నుండుటవలన ఇంగ్లీషు వారికెక్కువ యీదేశముతో సంబంధముగలిగియున్నది.

---

## బికనీరు.

రాజపుత్రస్థానమందు వైశాల్యములో బికనీరు రెండవది. ఇది జోధపురమురాజగు రావుజోధయనువాని ఆరవకుమారుడగు బికా అనువానివలన స్థాపింపబడినది. ఈ బికా 1439వ సంవత్సరమునందు జన్మించెనని చెప్పుదురు. 1504వ సంవత్సరమునందు బికమరణానంతరమాతని తరువాతి వారు రాజ్యమును క్రమేపివృద్ధిచేయుచువచ్చిరి. రావు జైత్సింగు బికనీరు నేలుచున్నదినములలో జోధపురపు రాజగు మాల్దేవుడు యీదేశముపై దండెత్తివచ్చి 1541 వ సం॥నందు నగరము దేశమును వశము చేసుకొనెనుకాని 1544 లోపల బికనీరుసేనపోయిన రాజ్యమును దిరిగి సంపాదించుకొనెను. ఈసంవత్సరమందే జైత్సింగుకుమారుడుకళ్యాణసింగు మొగలాయి చక్రవర్తితో డిల్లీవద్దజేరి ఆజ్మీరుపైకి దండెత్తివెళ్ళి ఆనగరసామీప్యమందే మాల్దేవు నోడించెను. బికనీరుసంస్థానమునకు మొగలాయిచక్రవర్తితో గలిగిన ప్రథమ సంబంధమిదియే! 1570లో నీసంబంధము బాంధవ్యముగా బరిణమించి కళ్యాణసింగు తనకుమార్తెనిచ్చి అక్బరుకు పెండ్లిచేసెను. కళ్యాణసింహునితదనంతర మాతనిపుత్రుడు రాయసింగు సింహాసనారూఢుడై 40 సంవత్సరములు దేశమేలెను. ఇతని సంతతివారిలో నొకడగు అనూప్‌సింగు 1669 మొదలు 1698వఱకు రాజ్యమేలి డక్కను యుద్ధయాత్రలలో మొగలాయి రాజ్యాధిపతులకు గొప్పసహాయమునుజేసెను. గోలకొండను బట్టుకొనుటలో అనూప్‌సింగు గొప్ప ప్రాముఖ్యతను వహించినవాడయి మహారాజాయనుగౌరవబిరుదమునందెను. అప్పటినుండియు నీగౌరవము వంశపారంపర్యవచ్చుచున్నది.

పదునెనిమిదవ శతాబ్దమునందు యోధపురమునకును బికనీరునకును యుద్ధములు జరుగుచునేయుండెను. యోధపుర మొకనిమిదిపర్యాయము లీదేశమును ముట్టడించెనట. సూరట్‌సింగనురాజు జనులను ఠాకూరులను మహావేధించుకొని తినుచుండుటవలన వారొక్కపెట్టున 1815లో అమీర్ ఖాన్ అనునతని సహాయమువలన దిరుగబడి అల్లకల్లోలములను జేయుచుండగా 1818సం॥ 9 వ మార్చి తేదిన మొట్టమొదటిపర్యాయము బ్రిటిషువారితో సంధినేర్పఱచుకొని సూరట్‌సింగు వారిసైన్యసహాయముచేత దనదేశమందలి సంక్షోభము నాపగలిగెను. 1828లో సూరట్‌సింగు మృతినొందిన పిమ్మట నాతనికొడుకు రతన్‌సింగుకు బ్రిటిషువారియందిష్టములేక జైసల్మీర్ అను స్థలముపై వెడలగా ఉదయపురము మహారాణాగారివలన నిరువకక్షులవారికిని సంధి యేర్పఱుపబడెను.

1842లో ఆఫ్ఘను యుద్ధమందును, సిక్కుయుద్ధములందును సిపాయిల తిరుగుపాటప్పుడును బికనీరు సంస్థానము ఇంగ్లీషువారికి విశేషసహాయమును జేసెను. అందుకని బ్రిటిషువారు 41 గ్రామములుగల తిబి పరగణాను బికనీరు మహారాజుగారికి బహుమానముగానిచ్చిరి. 1868 లో సర్దారుసింగుయొక్క దుష్పరిపాలనమువలన జనులు

ను గాకూరులును దిరుగబడిరికాని బ్రిటిషుసైన్యము బికనీరుకు జేరకముందే వీరందరును బ్రిటిషురాజ్యప్రతినిధిగారికి లొంగిపోయి తగవుల నాయనచేత బరిష్కరించుకొనిరి. సర్దారుసింగు బిడ్డలులేక జచ్చినందున డుంగరుసింగు 1873వ సం॥లో దత్తుగా బుచ్చుకొనబడెను. ఈతడు 1887లో సంతానములేక కాలధర్మము నొందినందున ఆతనితమ్ముడు గంగాసింగు రాజ్యాధిష్ఠాతయయ్యెను. ఈయనయే ప్రస్తుతపు బికనీరుమహారాజు. తనవంశములో నిరువదియొకటవవాడు. 1880వ సంవత్సరమందు జన్మించి ఆజ్మీరులోని రాజకుమారకళాశాలయగు మేయోవిద్యాలయములో విద్యనుగఱచెను. ఈయన బాల్యావస్థయందు రాజ్యము రాజప్రతినిధి సంఘమువలన నేలబడెను. 1898వ సంవత్సరములో గంగాసింగుగారికి పూర్ణాధికారము లొసంగబడియె. ఈయన హిస్ హైనెస్ మహారాజా సర్ రాజేశ్వర శిరోమణి శ్రీమహారాజాధిరాజ గంగాసింహుడు అని పిలువబడుచున్నాడు. కెయిజరి హింది మొదటి తరగతి పతకమును, జి.సి.ఐ.ఇ., కె.సి.ఎస్.ఐ., అను బిరుదులును యొసంగబడినవి. 17 ఫిరంగిగుండ్ల కర్హుడు. జార్జిచక్రవర్తిగారికి స్వకీయోద్యోగియులలో నొకడగుటచేత ఎ.డి.సి. అని పిలువబడును. హిందూ విశ్వవిద్యాలయపోషకులలోనీమహారాజుకడుముఖ్యుడు. ఏడులక్షలరూపాయల దీనికై యిచ్చెను. మేరిరాణియొక్క చలువరాతి ప్రతిమను ఢిల్లీలోనెలకొలుప బూనుకొనియున్నాడు. ఈ సంస్థానము ఇంగ్లీషు ప్రభుత్వమువారికి కప్పమునుగట్టదు. ఇచ్చట సామ్రాజ్యసైన్యము 500 లొట్టిసిట్టలు, 380 గుఱ్ఱపుబలము, 500 కాల్బలము, 33 ఫిరంగులుగలవు. ఈ సైన్యము చీనాలోను (1900-01) సొమాలీలాండులోను (1903-04) యుద్ధమును జవిచూచెను. దీనికగువ్యయమును మహారాజుగారు భరించెదరు. కాని హిందూస్థాన సర్వసేనాధిపతియొక్క ఆజ్ఞలకు లోనయియుండును.

ఈసంస్థానము 23,331 చదరపుమైళ్ళను 2110 గ్రామములను గలిగియున్నది. జనసంఖ్య 5,84,627. ఆదాయము 26లక్షల రూపాయలు. కాని దేశమువిశేషము ఇసుకపట్టియగుటచేత క్షామములు తఱచుగా సంభవించుచుండును. అప్పుడు రాజాదాయము పడిపోవుచుండును.



హిస్ హైనెస్ మేజర్ జనరల్ మహారాజాధిరాజ
సర్ ప్రతాపసింగు బహదూర్, జి.సి.ఎస్.ఐ.,
కె.సి.బి; ఎల్.ఎల్.డి; డి.సి.ఎల్; ఎ.డి.సి;

ఈయన జోధపురపు సంస్థానమును బహుచక్కగా నేలిన జవాన్సింగుగారి తమ్ముడు. అన్నగారి మరణానంతర మాతనికుమారుడు సర్దారుసింగు బాలుడయియుండగా మూడుసంవత్సరములు రాజప్రతినిధిగనుండెను. 1911లో అన్నకుమారుడు సర్దారుసింగు నయితము మృతినొందగా నాతని కుమారుడగు సుమేరసింగునకు ప్రతినిధిగ రాజ్యమేలుటకు బ్రిటిషుగవర్నమెంటువారివలన నిర్ణయింపబడెను. సర్ ప్రతాపసింగు 1902లో ఇడారుదేశ పాలకుడాయెను. ఒకసంవత్సరముక్రిందట నారాష్ట్రమునువిడనాడి జోధపురమును పాలించుటకైవచ్చినాడు. ఈయనగొప్ప పాలకుడు. రాజ్యకార్యవిశారదుడు. అతిశౌర్య సాహసాదులుగల రాజపుత్రయోధుడు. యోధపురమునకు కీర్తి నిదెచ్చుచున్నాడు.

1897వ సంవత్సరములో మహమ్మదు యుద్ధములో జోరి గాయపడెను. 1900లసం॥లో జోధపూరు సామ్రాజ్యసైన్యమునకు నాయకుడై చీనాలో జోరివచ్చెను. బ్రిటిషుసైన్యములో ఆనరరి మేజరుజనరలు అను గొప్పపదవి నొసంగబడియెను. ఇంపీరియల్ సర్వీసుసైన్యమునకు ఆనరరికర్నలు. జార్జిసార్వభౌమునికి ఎ. డి. సి. అను గౌరవమునుగూడ గలిగియున్నాడు. సర్ ప్రతాపసింహునకు బ్రిటిషు దొరతనమువారిచేతను, జోధపూరులోను, హిందూదేశమంతటను నెక్కువగా సన్మానింపబడుచున్నాడు.

## యోధపురము.

(లేక జోధ్పూరు, లేక మార్వార.)

రాజపుత్రస్థానమందలి స్వదేశ సంస్థానములలో నిది మొట్టమొదటిది. 1194 వ సంవత్సరమునందు కనోజునుండి తరిమివేయబడిన జయచంద్ రాథోడ్ అనురాజు యీదేశమునకువచ్చి యిచ్చటి యిసుక కొండలలో రాథోడు వంశజుల పతాకమును 1212 లో నాటెను,

1459 వ సంవత్సరమునందు యోధరావువలన యోధపురము రాజధానిగా నేర్పఱచబడెను.

ఫెరిష్టాయను మొగలాయి చరిత్రకారునివలన "హిందూస్థానములో బ్రప్రథమ వీరాగ్రగణ్యుడు" అని పిలువబడిన మాల్దేవురావు 1532 లో యోధపుర సింహాసనమెక్కి ఈదేశము నగ్రగణ్యమయిన స్థితికి దెచ్చెను. 1573 లో మాల్దేవురావు మృతినొందగా నాతని కుమారుడు ఉదయసింగు రాజ్యాధిపతి యయ్యెను. ఈతని కాలమందే రాథోడు రాజపుత్రులు తమస్వాతంత్ర్యమును గోలుపోయి మొగలాయి చక్రవర్తులకు సామంతులు కావలసివచ్చెను. ఉదయసింహుడు తనసహోదరిని అక్బరుకు రాణిగా జేసెను. తనకుమార్తె మన్గాయిని జహంగీరునకిచ్చి పరిణయము జేసెను. ఉదయసింహునివెనుక రాజ్యమేలిన శూరసింగు గజసింగులు గొప్పశూరులని ప్రసిద్ధికెక్కి మొగలాయి రాజులపక్షమున బోరుచుండిరి. అందుకయి ఈచక్రవర్తులు గుజరాతులోను, దక్కనులోను గొప్పజమీనులనొసంగిరి. బహుమతులను గౌరవములను నొసంగిరి.

1678 మొదలు 1803 వరకు యోధపురపు పాలకుల యొక్కయు రాథోడు రాజపుత్రుల యొక్కయు చారిత్ర్యము నిరుపమాన శౌర్యసాహస కార్యములతో నిండియున్నది. కాని వీరెల్లపుడును మొగలాయి రాజులపక్షమునే వహించిరి. ఈకాలములోనే యీరాథోడు రాజపుత్రులు బికనీరు, కిష్ణఘుర్, ఇడారు, గుజరాతులోని అహమ్మదునగరములలో స్వతంత్రరాజ్యములనేర్పఱచుకొనిరి. 1787 వ సంవత్సరములో సింధియా క్రింద మహారాష్ట్రులు నొక్కటిగాగూడి యెదిరించుచున్న రాజపుత్రరాజులనందరిని పట్టన్ మర్తాయుద్ధములలో నోడించిరి. వీరిదెబ్బలకు దాళజాలక యోధపురపు రాజు మాన్‌సింగు ఉన్మత్తత నభినయించి రాజ్యమును మానుకొనెను. ఈతని కుమారుడు ఛత్తర్‌సింగు బ్రిటిషువారి సహాయమువలన 1818 లో దనరాజ్యమును దక్కించుకొనెను. ఛత్తర్‌సింగు త్వరలో జచ్చిపోవుటవలన నాతనితండ్రి పిచ్చిని వదలివేసి తిరిగి రాజ్యాధిపత్యమును వహించెను. మానసింగు మరణించిన పిదప తఖ్తాసింగు జవానుసింగులు పాలకులైరి. జవాన్‌సింగు దేశమును బహుచక్కగా బాలించెను. ఇంగ్లీషువారికి సిపాయిలకలహమప్పుడు గొప్పసహాయమును జేసెను. ఈతని జి.సి.ఎస్.ఐ. అను బిరుదును, 21 గుండ్లకర్వాతనుయిచ్చి గవర్నమెంటువారు గొప్పగా సత్కరించిరి. 1895 లో జవానుసింగు మృతినొందునప్పటికి గుమారుడు సర్దారుసింగు బాలుడుగా నుండుటచేత బినతండ్రి మహారాజా సర్ ప్రతాపసింగు రాజప్రతినిధిగ 3 సంవత్సరములు రాజ్యమేలి దేశమును సుస్థితియందుంచెను. సర్దారుసింగు అల్పాయుష్యంతుడై 13 సంవత్సరములే రాజ్యమేలి తన 31 వ యేట క్రిందటిసంవత్సరము 1911 లో గాలధర్మమునొందెను. ఈయనకుమారుడు కున్వార్ సుమేరసింగు బాలుడగుటవలన బినతాతనగు సర్ ప్రతాపసింగుగారు తిరిగి రాజప్రతినిధిగ నియమింపబడిరి. రాజ్యపాలనమందొక సభవారీయనకు సలహా నిచ్చుచుందురు.

బాలరాజగు హిస్ హైనెస్ రాజరాజేశ్వర మహారాజాధిరాజ మహారాజ సుమేర్‌సింగ్ సాహెబ్ బహదూర్ గారు సర్ ప్రతాపసింగుగారి పోషణముక్రింద బాగుగా విద్యాబుద్ధులు గఱపబడుచున్నాడు. ఈయన కిప్పుడు 17 గుండ్లకధికారము గలదు.

ఈరాజ్యమందు 1210 సామ్రాజ్యసైన్యము, 2400 రాజుగారి కాల్బలము, 600 తురగబలము, 254 మంది ఫిరంగిసైన్యము 121 ఫిరంగులు కలవు. ఇదిగాక జాగీర్దారుల సైన్యము 2019 కలదు. ఈ సంస్థానము యొక్క వైశాల్యము 35016 చతురపు మైళ్ళు. 1911 వ సంవత్సరపు జనపరిగణనము ప్రకారము 20,42,967 మంది ప్రజయున్నారు. 1909-1910 లో 77,81,488 రూపాయలు రాజస్వము వచ్చినది. ఏడాదికి 1,08,000 రూపాయిలు కప్పముగాను, 15,000 రూ॥లు 1500 ల అశ్వపోషణము క్రిందను బ్రిటిషు గవర్నమెంటువారికి జెల్లింపబడును. ఈదేశముచాలవరకు ఊసరక్షేత్రముగాన నిచ్చట పండు ధాన్యపు కంకులకంటె జనులవద్ద ఖడ్గము లెక్కువగానున్నవని యొకప్రతీతియుండుట భూమియొక్క నిస్సా

రత్వమును, ప్రజలయొక్క పౌరుషమును నుద్ఘోషించుచున్నది. 4030 గ్రామములు లున్నవి. అందు 609 సంస్థానాధీశుని క్రిందను మిగిలినవి జాగీర్దారులక్రిందను నున్నవి. ఈ జాగీర్దారులు రాజుగారి కేటేట పన్నును జెల్లించుచుండెదరు. మార్-వార. లేక మరణభూమి యని యీదేశమున కొకపేరుకలదు.

---

## కోల్హాపురం.

మహారాష్ట్రసామ్రాజ్య సంస్థాపకుడగు శివాజీ మహారాజుయొక్క రెండవ కుమారుడు రాజారాము కోల్హాపురములో దన సంస్థానము నేర్పఱచుకొనెను. ఈ కోల్హాపురము రాజులందరాతని సంతతివారలే. వీరిని ఛత్రపతిమహారాజులని పిలిచెదరు. 18 1 వ సం॥నందీ దేశపాలకుడు నిపానికర్ రాజులతో బోరాడలేక ఇంగ్లీషువారిసహాయమువలన వారితో సంధినేర్పఱచుకొని బ్రిటిషువారికి మిత్రుడాయెను. కోల్హాపూరురాజులలో రాజారాం అను నాయన యూరపుఖండమును జూడబోయి 1870 లో ఫ్లారెన్సునగరములో బరలోకమున కరుదెంచెను. ప్రస్తుతము దేశమేలుచున్న హిస్ హైనెస్ మహారాజా షాహు ఛత్రపతి మహారాజు దత్తపుత్రుడు. ఈయన 1894 వ సం॥లో సింహాసనాసీనుడాయెను. శివాజిమహారాజు సంతతివారు మహారాష్ట్రమందేలుచున్న సంస్థానమిది యొక్కటియే. ఈమహారాజుగారికి జి. సి. ఎస్. ఐ, జి. సి. వి. ఒ; ఎల్. ఎల్. డి. మొదలగు బిరుదులుకలవు. 21 ఫిరంగిగుండ్ల కర్హతగలదు. కుమారుడు పుట్టడేని ఈరాజులు దత్తుపుచ్చుకొనుట కధికారమును గలిగియున్నారు. ప్రకృత కోల్హాపూరు మహారాజుగారు ఎడ్వర్డుచక్రవర్తిగారి పట్టాభిషేకమునకు లండనుకు వెళ్లియుండిరి.

ఈరాష్ట్రములో 553 కాల్బలము, 156 గుఱ్ఱపుదళము, 10 క్రొత్తఫిరంగులు, 47 ప్రాతవికలవు. వైశాల్యము 3160 చదరపుమైళ్లు. జనసంఖ్య 8,33,440. ఆదాయము 23,83,464 రూపాయలు. వ్రయము 22,51,414 రూపాయలు.

## గ్వాలియరు.

ఆరవశతాబ్దమునకు ముందిరాజ్యమున్నదనిదృష్టాంతములున్నవి. కనోజిపాలకుడు భోజరాజిచ్చట నేలినట్లు 786 వ సం॥రపు శాసనమువలన దేలుచున్నది. మహమ్మదీయులిచ్చట యేడువందలసంవత్సరము లేలిరి. సతారా సమీపమునందున్న కన్హేర్ ఖేడ్ అను గ్రామమునకు మునసబుగు సింధియావంశమువారిలో బుట్టిన రాణోజీసింధియా యను నతడు పునహాకువెళ్లి బాజీరావు పేష్వాయొక్క కొలువులోజేరి ఆతని యనుగ్రహమును సంపాదించి అతనితోపాటు 1736 వ సంవత్సరమునందు ఢిల్లీకివెళ్లెను. ఇచ్చట ముజఫర్ ఖాన్ అను సేనాని 8000 తురంగబలముతో పేష్వాను ముట్టడించగా రాణోజి సింధియాయును మల్హారావు హోల్కారును ఖాను నోడించి పారదోలిరి. పేష్వాతిరిగి పునహాకువచ్చునప్పుడు ఉజ్జయినులో రాణోజీనిలిచిపోయి సింధియావంశమును గ్వాలియరులో స్థాపించి పేష్వాయొక్క యధికారముక్రింద గ్వాలియరు కధిపతియయ్యెను. ఈగ్వాలియరునేలిన రాజులలో సుప్రసిద్ధుడు మహాదాజీసింధియా. ఇతను రోహిలాలవలన నేత్రము లూడదీయబడిన షహాఆలం చక్రవర్తినితనరక్షణత్వముక్రింద దీసుకొని రోహిలాల నోడించెను. హోల్కారు; నానాఫడ్నవిసు లితనికి శత్రువులుగ నుండిరి కాని పేష్వాను దనవలలో పూనాకువెళ్ళి చేసుకొనెను. 1794 వ సంవత్సరములో పూనా సమావేశమయిన కొద్దికాలమునకే యీమహావీరుడు వానొవ్రీ వద్ద మృతినొందకుండనుండినయెడల మహారాష్ట్రచారిత్రము వేఱుగా వ్రాయవలసివచ్చెడిది. 1802 మొదలు 1816 వరకు ఇంగ్లీషు వారితో సింధియా రాజులు పోరుచుండిరికాని తుట్టతుద కోడిపోయి సార్జె ఆంజగాం, బర్హాన్పూరు సంధులవలన బూర్తిగా నాంగ్లేయుల వశమయిరి. పెంఢారీలననగద్రొక్కుటయందు విశేషముగ సహాయపడిరి.

జయాజీరావు సింధియా బాలుడయియున్నకాలమందు రాజా సర్ దినకరరావు బహదూరు ముఖ్యమంత్రియయి దేశమును బాగుగనేలెను. ఆయనపుత్రుడే ఇప్పటికిని మంత్రిగాను మహారాజుకు గార్యదర్శిగాను ను

న్నాడు. జయాజీరావు దేశమును జక్కగాబాలించి సుస్థితికి దీసికొనివచ్చి బ్రిటిషు గవర్నమెంటువారి వలన గొప్పగా సన్మానింపబడుటయేగాక సిపాయిల తిరుగబాటు దినములలో నాంగ్లేయులపక్షము వహించినందునకయి 3 లక్షల రూపాయలువచ్చు దేశముగూడ నొసంగబడియెను. ఈయన కుమారుడు హిస్ హైనెస్ మేజర్ జనరలు మహారాజా సర్ మాధవరావు సింధియ అలీజా బహదూర్ జి. సి. ఎస్. ఐ, జి. సి. వి. ఒ, ఎ. డి. సి. ఎల్. ఎల్. డి. గారు ప్రకృతపు మహారాజుగారు. ఈయన గౌరవార్థమె 19 గుండ్లు పేల్చబడుచుండును. దేశమును మంచిస్థితియందుంచియున్నాడు. ఇంగ్లండునకు గొన్నిపర్యాయములు వెళ్లెను. బరోడా మహారాజుగారి కుమార్తె ఇందిరాదేవి యీయనకు ఇచ్చుటకేర్పాటు సేయఁబడినది. 35 వత్సరములు వయస్సుకలదు. ఈసంస్థానముయొక్క వైశాల్యము 25,000చతురపుమైళ్లు, జనసంఖ్య 29,33,000. ఆదాయము 150 లక్షలు.

---

## తిరువాన్కూరు.

సముద్రమునుండి పరశురాముడు మలబారుతీరమునంతయు వశముచేసుకొనెనని యొకగాథకలదు. ఆమలబారుతీరములోనిది తిరువాన్కూరు. చేరమన్ పెరుమాళ్ళునతడు 1200ల సంవత్సరములక్రిత మీతీరమునంతయునేలి తనదేశమునుదనపుత్రులకు బంచిపెట్టగా జ్యేష్ఠునికి తిరువాన్కూరువచ్చెనట. గుడ్‌హోపు అగ్రమునుజుట్టి ఇండియాతో వర్తకముజేయుటకై వచ్చిన పోర్చుగీసు, డచ్చి, ఇంగ్లీషువారీతీరమునకు మొట్టమొదట వచ్చియుండిరి. వీరు తిరువాన్కూరుసైన్యమును బాగుగా తరిఫీయతుచేయుచుండిరి. హైదరాలి టిప్పుసుల్తానుల దండయాత్రలు విజృంభించినప్పుడు తూర్పుఇండియా కంపెనీవారితో నీదేశపురాజు సంధినేర్పాటు చేసుకొనెను.

1805 మొదలు 1860 వరకు రామవర్మ, లక్ష్మీరాణి, పార్వతీరాణి, రామవర్మ, మార్తాండవర్మ, రామవర్మలు రాజ్యమేలిరి. లక్ష్మీరాణిగారు దివానగు కర్నలు మనోగారి సహాయముచేత దేశమును మిక్కిలిఔన్నత్యస్థితికిదెచ్చెను. రామవర్మ 17 సం॥లు రాజ్యమేలి ఆదినములలో స్వదేశాధిపతులలో దనతోనెవారును లేకుండనుండెను. మార్తాండవర్మకాలములో విక్టోరియారాణిగారికి దంతపుసింహాసనము బహుమతిగా బంపబడగా నామె బంగారపునడికట్టును, బంగారపుగడియారమును నొకస్వహస్తలిఖితలేఖనువ్రాసి తనయానందమును దెలిపిరి.

ప్రస్తుతపాలకుడు హిస్‌హైనెస్ సర్ బలరామవర్మ బహదూర్ శ్రీపద్మనాభదాసు వంశపాల శ్రీరామవర్మ కులశేఖర కిరీటపతి మన్నసుల్తాన్ మహారాజరాజ రామరాజబహదూర్ షంషర్‌జంగ్ జి. సి. ఎస్. ఐ, జి. సి. ఐ. ఇ: ఎం. ఆర్. ఎ. ఎస్ గారు 1885లో సింహాసనమెక్కిరి. ఈయన గౌరవార్థమై 21 ఫిరంగులు కాల్చబడును. ఈరాజ్యము మైసూరు బరోడాలవలె రాజ్యపాలనమందు గొప్పకీర్తిని బొందినది. 8 సభ్యులుగల శాసననిర్మాణసభ చట్టములను 1888 మొదలు చేయుచున్నది, ఇందుముగ్గురు అనధికారులుకలరు. తిరువాన్కూరునందు మొదటితరగతి కళాశాలయు, బి. ఎల్, తరగతులును గలవు. కొద్దిగాసైన్యమున్నది. 7000మైళ్ళవిస్తీర్ణమును 35 లక్షలజనులను, ఒకకోటి ఇరువదిలక్షలరూపాయలకు బయిగా నాదాయమును గలిగియున్నది.

---

## జయపురము.

ఈవంశపురాజులు దశరథతనయుడగు శ్రీరాముని సంతతివారమని చెప్పుకొనుచున్నారు. 967వ సం॥లో నీసంస్థానము డోలరాయ్‌చేత స్థాపింపబడియెను. ఈరాజ్యమనేకాంశర్భాగములనుగలిగి స్వతంత్ర, ఠాకూరుల క్రిందనుండినట్టిదై ఎల్లప్పుడును మహమ్మదీయులకును మొగలాయీలకును లోబడియుండెను. మొగలాయి చక్రవర్తుల యుద్ధములన్నింటియందును జయపురపురాజులు వారికి కుడిహస్తముగనుండిరి. వారి సైన్యాధిపత్యమును వహించిరి. ఇట్టివారిలో రాజామాన్సింగు రాజాభగవానుదాసులు సుప్రసిద్ధులు. భగవాన్‌దాసు ఒరిస్సాను డిల్లీపాదుషహాకు జయించిపెట్టినందునకయి బెంగాలు, బేహారు, డక్కన్ రాష్ట్రములకు రాజప్రతినిధిగా నియమిం

పబడియెను. జయపురపురాజులలో రెండవ సవైజయసింగు గొప్పఖ్యాతిని గడించినట్టివాడు. ఈయన గణిత, జ్యోతిశ్శాస్త్రములందును, శిల్పిశాస్త్రమందును, ఇంజనీయరింగునందును మహానిపుణుడు. 1728 వ సం. నందు అంబరు అనుస్థలమునుండి రాజధానిని విశాలముగ దాను స్వయముగాబన్ని కట్టించిన జయపురమునకు మార్చెను,

మొగలాయిల ప్రాబల్య మణగిపోయిన పిమ్మట నితర రాజపుత్రసంస్థానములవలెనె జయపురముయును మహారాష్ట్రులదాడి కాగజాలక బ్రిటిషువారితో సఖ్యత నేర్పఱచుకొనెను. అంతఃకలహముల నాపుటకును వీరి సహాయము నపేక్షించుచుండెను. మహారాజా రామ్‌సింగు సిపాయిల అల్లకల్లోలమప్పుడు ఆంగ్లేయులకు సహాయము చేసినందునకయి కోట కాశింఅను పరగణానొసంగబడెను. రాజాసింగు రెండవ సవై మాధవసింగును పెంచుకొని మృతినొందెను. ఈయనయే ప్రస్తుతపు మహారాజు 1882 లో సింహాసనారూఢుడాయెను. కర్నల్ హిస్ హైనెస్ మహారాజాధిరాజా సర్ సవై మాధవసింగు బహదూర్ జి. సి. ఎస్. ఐ; జి.సి.ఐ.ఇ; జి.సి.వి.ఓ; అని యీయన పిలువబడుచున్నాడు, 21 ఫిరంగుల కర్హతకలదు. 1902 లో ఎడ్వర్డుచక్రవర్తిగారి పట్టాభిషేకమున కింగ్లండునకు వెళ్ళి సముద్రమును దాటుటవలన సంఘసంస్కరణోద్యమమునకు దోడ్పడెను. ఈసంస్థానము 15,579 చదరపుమైళ్ళ విస్తీర్ణమును, 26,50,000 ప్రజలను, 65 లక్షల రూపాయల ఆదాయమునుగలిగియున్నది.

---

## భోపాలు.

హిందూదేశములో నిజాము రాజ్యమయిన పిమ్మట మహమ్మదీయ సంస్థానములలో నిది రెండవది. పాలకులు మహమ్మదీయ యువతులు. ఈ దేశముయొక్క చారిత్రము మొట్టమొదటినుండియు దగవులతోను, కుట్రలతోను, పోరాటములతోను నిండియుండి చదువరులకు జదువ తుచ్ఛిపుట్టించుచుండును.

1708 లో దోస్తుమహమ్మదను ఆఫ్ఘను వీరుడు ఢిల్లీకివచ్చి మధ్యఇండియాలోని బెరాసియా జిల్లాను చక్రవర్తినుండి గవులుకు పుచ్చుకొనెను. మొగలాయి చక్రవర్తి బహదూర్ షహా మృతినొందగానే భోపాలును స్వతంత్రదేశముగ జేసుకొనెను. 1704లో దోస్తు మహమ్మదు కాలధర్మము నొందగా హైదరాబాదు నిజాముయొక్క సహాయమువలన నాతని యనౌరసపుత్రుడు యార్ మహమ్మదు నవాబయ్యెను. ఇతడు 1777 లో మృతినొందగా కుమారులు ఫెయిజ్ మహమ్మద్ హాయతుమహమ్మదు లొకరితరువాత నొకరు రాజులైరి. రెండవవానిపాలనము దౌర్బల్యమయిన దగుటచేత నంతఃకలహములుపుట్టి మహారాష్ట్రులయొక్కయు పెంఢారీలయొక్కయు దాడులకు గుఱియయ్యెను. హాయత్ మహమ్మదు 1807వఱకును నామకార్థమేలినను వదినెయగు మామ్ముల్లాబేగము కుమారుడగు ఘౌసుమహమ్మదు సహాయమువలన రాజ్యమునేలుచుండెను. ఈమె రాజ్యకార్య దురంధరురాలు. విశేష శక్తిసామర్థ్యములుకలది. ప్రక్కరాజ్యము నిందూరు నేలుచున్న అహల్యాబాయి యంతగొప్పదనికీర్తినొందెను. కాని మంత్రి మురీద్ మహమ్మదుఖానను దుర్మార్గుడయి బొక్కసములోని ధనమునంతయు వ్రయముచేసెను. సింధియా దనకుజేసిన వాగ్దానముల నెరవేర్చలేదని యీమంత్రిని పట్టుకొని చెరసాలయందుంచెను. ఇట్టిసమయమందు వజీరు మహమ్మదుఖాను యొక రాజవంశ బంధువు రాజ్యపాలనము నధీనముజేసుకొని మహారాష్ట్రులు జయించిన జిల్లాలను దిరిగి వశముచేసుకొని భోపాలు నతిరమణీయముగ నేలెను. వజీరుఖానింతపరాక్రమవంతుడును గొప్పవాడునునగుటవలన ఘౌస్ మహమ్మదోర్వజాలక పెంఢారీలనాయకుడగుకరీమును, గ్వాలియరు సింధియాను, నాగపురపు భోంస్లేను సహాయమునకు బిలిచి వజీరుఖానుకు గష్టములను గలిగించుచుండెను. వజీరుఖానెంతమాత్రము జంకక వీరందరితోను దాను మృతినొందుదినమువఱకును పోరాడి శత్రువులదూరమ్మున నుంచెను. ఈతని దేశభక్తి, కార్యసాధనాశక్తి, రాజ్యకార్య కోవిదత్వము నేటివఱకును గొనియాడబడుచున్నవి. యుద్ధమునందెంతనిరుపమానుడో ఔదార్యమునందును నంత ననుపమానుడుగ నుండెను. తనశత్రువులను సయితము తన దొడ్డగుణములవలన ర

మింపజేయుచుండెను. వజీరుఖాను 1816 లో బరలోక వాసమున కేగగా గుమారుడు నాజరుమహమ్మదు తండ్రి యొక్క శాత్రవుడగు ఘయాస్ మహమ్మదు యొక్క కుమార్తెనే ఖుదీసాబేగమును బరిణయమయ్యెను. 1817 లో నింగ్లీషువారితో జేరి పెంఢారిదండులను రూపుమాపు టకొడిగట్టెను. అకస్మాత్తుగా పిస్తోలుదెబ్బతిని నాజరు మహమ్మదు మృతినొందెను. ఈతని పసికుమార్తె సికందరు బేగము మేనల్లుడుమునీరుమహమ్మదును వివాహమాడియ తనురాజ్యాధికారియగు నట్లేర్పాటుచేయబడెనుకానిరాజ్యమునుసికందరుబేగము సహితముగ 1827లో దమ్ముడగుజహాంగీరునుదీసుకొనమునిరాజ్యమును కాబోవుభార్యను వదలుకొని ఇంగ్లీషువారివద్దనుండి యొక జాగీరు నంగీకరించి నెమ్మదిగామునీరుమహమ్మదు బ్రతుకుచుండెను. సికందరు బేగముయొక్క తల్లియగుఖుదీసాబేగముకుమార్తెకు ద్వారగాబెండ్లి చేయక రాజ్యాధిపత్యమును దానేయుంచుకొన వలయునని కుట్రలుపన్నుచుండెను. తల్లికిమించిన కుట్రలను కుమార్తె చేయుచుండెను. ఎట్లయిననేమి 1835 ఏప్రియలులో వివాహము జరిగెను. వివాహానంతరము జహాంగీరు మహమ్మదు తనకు రాజ్యము గావలయుననగా గొమరికయుదల్లియుగలిసి నీతనిని దూరపఱచుచుండిరి. 1836 లో జహాంగీరు ఖుదీసాబేగమును ఖయిదీగా జేయుటకయి యత్నించెనుకాని కుట్ర ముందుగా బయల్పడెను. 1837 లో జహాంగీరు రాజ్యాధికారమును వహింపగలిగి 1844 వఱకునేలెను.ఇతని కుమార్తె షహాజహానుబేగము రాణి యని ప్రకటింపబడియెను. కాని 1866 వఱకును గుమార్తెకు బదులుగా సికందరుబేగమే యేలుచుండెను. సికందరుబేగము దూరదృష్టిగలిగి రాజ్యమును జక్కగా నేలిన యువతి.గొప్పగా నాశలనుగలిగినట్టిది.1857 లో సిపాయిల కలహములలో నింగ్లీషువారి పక్షమువహించినందునకయి వారు బెరాసియాజిల్లాను బేగమునకిచ్చిరి. ఈమెకు జి.సి.ఎస్. ఐ. అను బిరుదొసంగబడినది. 1862 లో మహమ్మదీయ న్యాయశాస్త్రము ప్రకారము భోపలు పాలకులు రాజ్యాధికారమును వహింపవచ్చునని యొక పట్టాయియ్యబడెను. సికందరుబేగము కాలగతిజెందిన తరువాత గుమార్తె షహాజహాను బేగము రాజ్యమెక్కి 1901 వరకేలెను. ఈమె కుమార్తె హార్ హైనెస్ నవాబు సుల్తానా జహాన్ బేగము జి.సి.ఎస్.ఐ; జి.సి.ఐ.ఇ. ప్రస్తుతము రాజ్యమేలుచున్నది. ఈమెకుభోపాలులో 21 ఫిరంగిగుండ్లకు, బ్రిటిషురాజ్యమందు 19 గుండ్లకునర్హతకలదు. ఈమె విశేషప్రజ్ఞావంతురాలు. చక్కగా విద్యనభ్యసించినట్టిది. రాజ్యపాలనములో బ్రతివిషయము నెట్లు నడపవలయునో దెలుసును. దేశము ననేకవిధముల వృద్ధిచేయుచున్నది. విద్య నధికముగ వృద్ధిచేయుచున్నది. స్త్రీ విద్యాలయములు దినదినాభివృద్ధినొందుచున్నవి. ఈ మధ్య లండను పట్టాభిషేకమునకయి వెళ్ళి యూరపుఖండమంతయు దిరిగి నూతన రాజ్యపాలనాంశములను గ్రహించి తనదేశములో బ్రవేశపెట్టుచున్నది. ఈమె స్త్రీవిద్యనభివృద్ధిజేసి స్త్రీలను బురుషులతో సరిసమానముగ జేసినగాని ఏదేశమయినను బాగుపడదని జనవరిమాసములో భోపాలులో గొప్పప్రసంగమును జేసెను. అచ్చటనేక స్త్రీ సమాజములను స్థాపించినది. తుర్కీకివెళ్లినప్పుడు సుల్తానుగారీమెకు వారి మతస్థాపకుడగు మహమ్మదుయొక్క గడ్డములోని యొక కేశమునిచ్చెనట. అది విలువలేని సంశోధనముగా నుంచుకొనెదనని జెప్పినది. మక్కాకీమె వెళ్ళుచుండగా నరేబియాలో దారిదొంగలడ్డగించిరి. తనసేనను వారిమీద నడిపించి స్వయముగబోరాడి వారిని బారదోలి తన పౌరుషమునుజూపెను. అందరు రాజప్రతినిధులీమెయందు విశేషగౌరవమును గలిగియున్నారు. ఢిల్లీ దర్బారునకీమె వెళ్ళియుండెను.ఈమె పాలనముక్రింద జనులు సుఖులైయైశ్వర్యవంతులైయున్నారు. ఈమెపెద్దకుమారుడు నవాబుమహమ్మదు నసురుల్లాఖానురాజ్యపాలనమందుదల్లికిసహాయముచేయుచుండును. ఏసుక్రీస్తుకుబూర్వము 300 సంవత్సరముల క్రిందట గట్టబడిన సాంచిస్థూపమిచ్చటనుండుటచే బూర్వవస్తుపరిశోధకులకీదేశము వివిధాద్భుతములతోనిండియున్నదని చెప్పవచ్చును.

రాజ్యము 7000 చదరపుమైళ్ళ విస్తీర్ణమునుగలిగియున్నది. జనసంఖ్య 6,65,960. ఆదాయము 25 లక్షలు. సైన్యము మొత్తము 1744 ఒక గుఱ్ఱపు పటాలముగూడ కలదు. ఇదినూతనసామ్రాజ్యసేన.

## ఇందూరు.

ఈరాజ్యస్థాపకుడు మల్హారురావు హోల్కారు. మహారాష్ట్ర పౌరుషమును దిగంతములవరకు వ్యాపింపజేసిన వీరసత్తములలో నీతఁడొకండు. ఖండోజియను గాపువానికి డక్కనులో నీరా నదీతీరమందున్న హోల్ అను గ్రామమందుదయించెను. హోల్‌గ్రామవాసిగాన హోల్కర్ లేక హోల్కారు అనిపిలువబడియెను. చిన్నతనమందే తండ్రిమృతినొందినందున దల్లి మేనమామయును కాదంబండేసు కొలువులో షిల్లేదారును నగు నారాయణరావువద్దకు దీసుకొనివెళ్ళి సైన్యములో బ్రవేశపెట్టించెను. స్వపౌరుషసాహసములవలన పేష్వాలను మెప్పించి మాల్వాకు సుబేదారగునంత గొప్ప గౌరవమును బొందెను. నిజామును, రోహిలాలను, పోర్చుగీసువారిని యోడించి పేష్వాకు వారిని లోబఱచెను. మల్హారురావు కుమారుడు ఖండేరావు ఖంబేరిముట్టడిలో 1754లో జచ్చెను. ఇతని కొమారుడు మాలేరావు పిచ్చెత్తి 1767లో గాలధర్మమొందినందున మాలేరావుతల్లియు, మల్హారురావు కోడలును అగు అహల్యాబాయి రాజ్యభారమును వహించెను. ఈమె ఇందూరురాజ్యమేలిన 40 సంవత్సరములలో దేశమందు శాంతము నాట్యమాడెను. జనులైశ్వర్యవంతులైరి. ఈమె రాజ్యపరిపాలనమును విక్టోరియారాణి పరిపాలనముతో సరిపోల్పవచ్చును. దేశీయ, పాశ్చాత్య చరిత్రకారులు సముత మీమెపాలనమును శేషునివలె గొనియాడిరి. అహల్యాబాయి 1795 లో మృతినొందిన పిమ్మట ఆమెకు సైన్యాధిపతిగనున్న తుకోజిరావను డెబ్బదివత్సరముల వృద్ధుడు రాజ్యమెక్కి రెండేండ్లలో 1797లో మరణించెను. తరువాత రాజ్యాంగాధిపత్యమునకయి తుకాజీరావుయొక్క యిద్దరు ఔరస మరియిద్దరు అనౌరస పుత్రులకు కలహములు జరిగి అనౌరస పుత్రులలో జ్యేష్ఠుడగు యశ్వంతరావుకు రాజ్యములభించెను. ఇతనితరువాత రెండవమల్హారురావు, రెండవ తుకాజీరావులు రాజ్యమేలిరి. రెండవ తుకాజీరావు సిపాయిలకలహములప్పుడు ఇంగ్లీషువారిని దన నగరునందుంచుకొని వారిప్రాణములను గాపాడెను. 1861-68లకు మధ్య చాలదేశమును బ్రిటిషువారు హోల్కారునకిచ్చిరి. 1886లో తుకాజీరావు మృతినొందగా గొడుకు శివాజీరావు రాజ్యపాలకుడాయెను. ఈయన 1887లో విక్టోరియా మహారాణియొక్క జ్యూబిలీకి ఇంగ్లండుకువెళ్ళెను. 1903లో కర్జనుగారు చేసిన డిల్లీదర్బారునకువెళ్ళి బాలుడుగానున్న కొమారునికి రాజ్యమిచ్చివేసి తాను రాజరికమును మానుకొనెను. మూడవతుకాజీరావు బాలాసాహెబు అని పిలువబడు యీబాలుడిప్పటికిని మైనరగుటవలన బ్రిటిషు రెసిడెంటుగారిక్రింద మంత్రులేలుచున్నారు. ఈయన హిస్ హైనెస్ మహారాజాధిరాజేశ్వర సవైబహాదూర్ అని పిలువబడుచున్నారు. గమనాగడునవేళల నీతనిగౌరవార్థమై 19ఫిరంగులుకాల్చబడును.

అహల్యాబాయికాలమందు కెవిలియర్ దుద్రెనెస్ అను ఫ్రెంచిసైనికోద్యోగి ఇందూరుసైన్యమును తరిఫియతుచేసెను. జనులీతని హుజూర బేగ్ అని పిలుచుచుండిరి. ఆదినములలో సింధూయకు 10 వేల కాల్బలము 15 వేల గుఱ్ఱపుదండు, 100 ఫిరంగులు నుండెడివి. మందేశ్వర సంధితో నింగ్లీషువారీ సైన్యమును దగ్గించివేసిరి. ఇప్పుడు 748 కాల్బలము, 800 అశ్వసేన, 210 ఫిరంగిసేన, 18 ఫిరంగులుకలవు.

ఈరాజ్యముయొక్క వైశాల్యము 9500 చతురపు మైళ్లు. జనులు 8,50,700 లున్నారు. ఆదాయము 54 లక్షలరూపాయలు.

---

## పాటియాల.

పంజాబులోని సిక్కుసంస్థానములలో పాటియాల ప్రథమమయినది. 17 వ శతాబ్దములో నొకకాపువాడు చౌదరీఫూల్ అనువాడు తిలోక, రామయను ఇద్దరు కుమాళ్ళనుగనెను. మొదటివాని వంశజులు నాభా మరియు జిందురాజులయిరి. రెండవవాని సంతతివారు పాటియాలా కధిపతులయిరి. అహమ్మద్ షా దురాని అను మహమ్మదీయ వీరుడు అలాసింగు అను నతనికి రాజా అను బిరుదిచ్చుటచేత 1762 వ సం॥లో పాటియాలా రాజ్యమేర్పడినదని యనవచ్చును.

పంజాబు సింగమనబడిన రంజితసింహుడు యీదేశము నాక్రమించుకొనుటకు బయలుదేరగా నింగ్లీషువారిసహాయమువలన పాటియాలారాజు దీనిని దక్కించుకొనెను. 1814 లో గుర్ఖాయుద్ధములో సహాయము చేసినందుకయి పాటియాలారాజు కింగ్లీషువారు సింలాకొండలలో 16 సరగణాల నేడాదికి 2,80,000 రూపాయలు చెల్లింపు షరతుమీద నిచ్చిరి. సిక్కుయుద్ధము సందును నరేంద్రసింగురాజు ఇంగ్లీషువారి పక్షమున నుండుటవలన రెండులక్ష లాదాయమువచ్చు నర్నల్ జిల్లా నిచ్చి దొరతనమువారు సత్కరించిరి. నరేంద్రసింగు 1862 లో మృతినొందెను. ఈయన కానింగు ప్రభువుయొక్క శాసనసభా సభ్యుడుగనుండెను. 1862 మొదలు 1900 వరకు మహేంద్రసింగు, రాజేంద్రసింగులును, వీరు బాలురయి యున్నప్పుడు రాజప్రతినిధులగు పంచాయతీదారులును బరిపాలించిరి. మహేంద్రసింగు మహాదాత. విద్యాపోషకుడు. 1 కోటి 23 లక్షలిచ్చి సిర్హింద్ కాలువను దనదేశములో బారునట్లు చేసుకొనెను. 10 లక్షలు వంగదేశ క్షామనివారణమున కిచ్చెను. 70 వేలు లాహోరు కళాశాల కొసంగెను. తన దేశమందొక మొదటితరగతి కళాశాలను స్థాపించెను.

రాజేంద్రసింగుకాలములో రాజపుర, పాటియాలా, భాటిండ రయిలు నిర్మింపబడెను. సామ్రాజ్యసేనను దనదేశమందుంచుకొని 1896 లో మహేంద్రసింగు టిరా దండయాత్రలో బోరాడెను. ఈయన 1900 లో మృతినొందునప్పటికి గుమారుడు పసిబాలుడుగనుండెను. 1909 వరకు పంచాయతీదారులు దేశమేలిరి. ప్రస్తుతమురాజగు హిస్‌హైనెస్ మహారాజ ఇ.రాజ్గన్ మంసూరల్ ఉమ్రా, ఫర్జిండ్ ఇ-ఖస్, దౌలతి ఇంగ్లిషియ శ్రీమహారాజాధిరాజ మహారాజా భూపేంద్రసింగు మహేంద్రబహదూర్ 1909 లో రాజ్యాధికారము నొందెను. ఈయన లాహోరులోని ఎయిట్చన్ కళాశాలలో విద్యనభ్యసించెను. ఈయనకు 17 గుండ్ల కథికారముగలదు. క్రిక్కెట్టుఆట నాడుటయందు గడు ప్రవీణుడు. క్రిందటి సంవత్సర మిండియానుండి వెళ్ళిన హైందవ ఆటగాండ్రకు నాయకుడుగానుండెను. గొప్పదాతయని పేర్వొసిగాంచియున్నాడు.

## కరౌలి.

రాజపుత్రులలో యాదవతెగకు జెందినవారు కరౌలిపాలకులు. వీరు శ్రీకృష్ణుని సంతతివారమని చెప్పుకొనుచున్నారు. కృష్ణుని తరువాత నెనుబది నెనిమిదవ రాజని చెప్పబడిన విజయపాలుడనువాడు బయన అను స్థలమందొక కోటనుగట్టుకొనెను. ఇతని జ్యేష్ఠపుత్రుడు దహనపాలుడు ధహనఘర్ కోటనుగట్టి కరౌలి దేశాధీశుడాయెను. 1196లో కున్వారపాలుడను కరౌలిరాజు మహమ్మదుగోరి, కుతుబుద్దీనులచేత నోడింపబడి పారిపోయెను. కున్వారుపాలుని తరువాతివారిలో నొకడగు అర్జునపాలు తనపూర్వుల దేశమును దిరిగి సంపాదించుటకు గృతనిశ్చయుడై 1327లో మందరేలుకోట నాక్రమించుకొని పూర్వపుదేశమును దిరిగి వశపఱచుకొనెను. 1348లో కరౌలియనుపట్టణమును గట్టెను. తిరిగి నూరువత్సరములైన తరువాత నీరాజ్యము మహమ్మదీయుల వశమై అక్బరుకాలమునాటికి ఢిల్లీసామ్రాజ్యములో జేర్చబడియుండెను. గోపాలదానుయొకకరౌలిపాలకుడు అక్బరుయొక్కఅనుగ్రహపాత్రుడగుటవలన2000 తురంగబలమున కధిపతిజేయబడి రాజ్యము నొసంగబడియెను. ఈగోపాలదాసే అక్బరుకోరగా నాగ్రాకోటకు శంకుస్థాపనమునుజేసెను. మొగలాయీలు క్షీణదశకువచ్చినప్పుడు మహారాష్ట్రులన్ని దేశములపై యధికారమును జెల్లించినట్లే కరౌలీనిగూడ దమసామంతదేశముగాజేసి సాలుకు 25000 రూ॥లను గప్పముగా గైకొనుచుండిరి. 1817లో కరౌలి ఇంగ్లీషువారి సంరక్షణము క్రిందకి వచ్చెను.

ఈరాజ్యముయొక్క చారిత్రములో నొకదత్తాభియోగము కడు ప్రఖ్యాతమైనది. నరసింగపాలను యొక బాలరాజు 1850లో రాజ్యాధికారియై 1852లో మృతినొందెను. రేవు మృతినొందుననగా నీరోజున భరతపాలనువానిని దత్తుదీసుకొనెను. ఇంగ్లీషు దొరతనమువారీదత్తునంగీకరించిరి. కాని రాజసంతతివారిలో దగవులంకురించి చాలమంది బాలుడుచేసుకొనిన దత్తు చెల్లదనియు మదనపాలుడను యొకసామీప్యబంధువు రాజ్యాధికారి కావలయుననియు దగవులాడిరి. కాని రాణులు భరత

Coronation of Their Imperial Majesties at Delhi.



శ్రీపంచమజార్జి రాజరాజేంద్రునియొక్కయు మేరీ మహారాజ్ఞియొక్కయు డిల్లీ సామ్రాజ్యాభిషేకము.

Review of Troops at Delhi by H. I. M. George V.



శ్రీపంచమజార్జి సార్వభౌముడు ఢిల్లీలో సైన్యమును పరీక్షించుట.

The Governor - General and the Indian Princes of the Imperial Cadet Corps.



రాజ. ప్రతినిధి, రాజకుమారుల

The Delhi Gate.



ఢిల్లీనగరమున దలి ఢిల్లీద్వారము.

Mr. Uan - Shi-Kai. President of the ChineseRepub lic.



యుఆన్ షికాయి. చీనాసామ్రాజ్యపాలనాధ్యక్షుడు.

Mr. Sun-yat-Sen.



సన్ యాట్ సేన్. చీనాపరివర్తనమునకు నాయకుడు.



The Imperial Legislative Council at the time of Lord Minto.

మింటో ప్రభువు కాలమునందు సార్వభౌమిక శాసన నిర్మాణ సభా సభ్యులు.





Members of the Bombay Legislative Council.

బొంబాయి శాసన నిర్మాణ సభా సభ్యులు.



అలీ ఇమ్మాం. న్యాయాంగమంత్రి. The Hon. Mr. Ali Imam.



బనగానపల్లి నవాబు. The Nawab of Banaganapalli.



The Late Maharaja of Mourbhanj.
కీర్తిశేషులైన మూర్భంజి మహారాజు.



పండిత విష్ణునారాయణధరుగారు. Pandit Vishnu Narayanadhur.

The late Hon. Mr. V. Krishnaswamy Iyer.



కీర్తిశేషులైన వి. కృష్ణస్వామయ్యరుగారు.

The Hon. Mr. J. N. Atkinson. C. S. I.



గా॥ అట్కిన్సనుగారు.

The Hon. Mr. N. Subba Rao Pantulu.



గౌరవనీయులగు న్యాపతి సుబ్బారావు పంతులుగారు.

The Hon. Mr. Mazharul Haque.



గౌరవనీయులగు మజారుల్ హక్కుగారు.

Sir Sasoon David. Baronet.



సర్ సాసూన్ డేవిడు, బారొనేట్.

The Hon. Rao Bahadur R. N. Mudholkar.



రావుబహదూర్ ఆర్. ఎన్. ముధోల్కరు గారు.

పాలునే స్వీకరించుటవలన సీతడే పాలకుడాయెను. భరతుడు సిపాయిల తిరగబాటుదినములలో నింగ్లీషువారికి జాల సహాయమొనరించెను. అందువలన జి. సి. ఎస్. ఐ., బిరుదొసంగబడి, 2లక్షలరూపాయల బాకీసొమ్ము రద్దుచేయబడి, 15నుండి 17కితని గౌరవార్థముకాల్చబడుఫిరంగిగుండ్లసంఖ్యపెంచబడెను. రాజులకుదత్తస్వీకారాధికార మొసంగబడియె. ఇప్పటికిగడచినటియేడుమంది కరౌలిరాజులును దత్తపుత్రులే! మదనపాలుని యనంతరము లక్ష్మణపాలు, జయసింగు, అర్జునసింగులు రాజ్యమేలిరి. ప్రకృతపురాజు హిస్ హైనెస్ మహారాజ సర్ భానువరపాలు దేవు బహదూర్ యదుకులచంద్రపాలుడు జి. సి. ఐ. ఇ. 1889లో రాజ్యాధికారమునువహించెను. ఇతను గమనాగమనవేళల 17 ఫిరంగిగుండ్ల సత్కారమున కర్హుడు. ఈ సంస్థానము 1242చతురపుమైళ్ళ వైశాల్యమును 1,12,500 జనసంఖ్యను,5లక్షల రూప్యము లాదాయమును గలిగియున్నది. రాజ్యపాలనమందు మహారాజయిదుగురుమంత్రులవలన సహాయము చేయబడుచుండును.

## కచ్చి.

ఈదేశమునుగురించి 2320 సంవత్సరములకు బూర్వము గ్రీకుగ్రంథకర్తలు వ్రాసియుండిరికాన నీదేశము మిక్కిలి పురాతనమైనది. హయనిత్స్యాంగను చీనాచరిత్రకారుడును దీనినిగురించి వ్రాసెను. తొమ్మిదవశతాబ్దమునం దరబ్బులు వశముచేసుకొని సముద్రతీరమందు నివసించిరి. 14వ శతాబ్దమునందు సమ్మారాజపుత్రులీ రాజ్యము నాక్రమించుకొనుటతో దీనియాధునికచారిత్రము ప్రారంభమగుచున్నది. ఈరాజపుత్రులలో జాదేజలనువారు మహమ్మదీయ హిందూమతములుగలిసిన యొకవిధమైన మతము నవలంబించిరి. 1540లో కచ్చి మూడుభాగములుగ చీలిపోయెను. కాని దక్షిణదిక్కుకధిపతి అహమ్మదాబాదురాజు సహాయమువలన కచ్చికంత కధిపతియయ్యెను. అహమ్మదాబాదు రాజితనికి మోర్వీపరగణానిచ్చి "రావు" అను బిరుదొసంగెను. ఈగౌరవబిరు దిప్పటికి పారంపర్యముగ వచ్చుచున్నది. ఖెంగర్జీరాజు భూజనగరమును రాజధానిగ 1549లో జేసి మాండ్వియను సముద్రపురేవును గట్టించెను. 1741లో రావుదేశా ఢిల్లీపాదుషహ "మిర్జా" అనుబిరుదిచ్చెను. కాబూలురాజు మహారాజాధిరాజయను గౌరవమునొసంగెను. రావులఖపత్జీ కాలమందు రాంసింగుమలాం అనునతడు యూరపుదేశమునకువెళ్ళివచ్చి ఇప్పటికిని కచ్చి కడువిఖ్యాతిగాంచియున్న కళలను దేశములో బ్రవేశపెట్టెను. 1778లో రావు రాయధన్జీ యనునతడు మహమ్మదీయమతమును స్వీకరించి జనులకు కంటకమును గలిగించెను. ఈతనికాలములో జమేదారు ఫత్తేమహమ్మదు నగరముపై దాడివెడలినందున యింగ్లీషువారు మక్మర్డో దొరగారి సంధిచేయుటకయిపంపిరి. ఇంతలో నిరువదిదినములోపలనే ఫత్తేమహమ్మదు రావురాయధంజి యిద్దరును మృతినొందుట తటస్థించెను. తరువాత దేశ మింగ్లీషువారి రక్షణత్వము క్రిందికివచ్చెను. 1815మొదలు 1886 వరకును (1) రావు భారమల్జీ, (2) రాజప్రతినిధిసభ, (3) రావుదేశాజీ, (4) రావుప్రాగమల్జీ, (5) రాజప్రతినిధిసభ రాజ్యమేలుట తటస్థించెను. ప్రకృతపుపాలకుడు హిస్ హైనెస్ మహారాజాధిరాజ మిర్జా మహారావు సవై ఖేంగార్జీ బహదూర్ జి.సి.ఐ.ఇ., 1886లో సింహాసనా రూఢుడాయెను. 1897లో నీయన లండనుకు విక్టోరియా మహారాజ్ఞిగారి జ్యూబిలీకి వెళ్ళియుండెను. ఈయనపాలనముక్రింద దేశము మంచి స్థితికి వచ్చుచున్నది.

ఇచ్చట 853 పదాతులు, 281 అరబ్బీసైనికులు, 254 గుఱ్ఱపు రౌతులున్నారు. కచ్చిసంస్థానముయొక్క వైశాల్యము 7617 చదరపుమైళ్ళు, 8పట్టణములు, 940 గ్రామములున్నవి. 4,99,000 మంది ప్రజలున్నారు. 36 లక్షల రూపాయల కొంచెమెక్కువగా రాజస్వము వచ్చుచున్నది. రావుగారికి బూర్వాధికారమున్నది. గమనాగమనవేళల 17గుండ్లు పేల్చబడుచుండును.

# హిందూదేశ రాజ్యాంగ నిర్మాణము.

హిందూదేశ రాజ్యాంగజ్ఞానము హిందూదేశవాసుల కత్యవసరము. ఈవిపులవిషయము నొకసామాన్యవ్యాస పరిమితిలో నిముడ్చుట సాధ్యముగాకున్నను విషయప్రాముఖ్యత వ్యాసలేఖనమునకుఁ గారణము. హిందూసామ్రాజము జగద్వ్యాప్తబ్రిటిషు సామ్రాజ్యములో నంతర్భాగము. బ్రిటిషుసామ్రాజ్యములో ననేకపెద్ద భూభాగములు చేరియున్నవి. ఆసామ్రాజ్యవిస్తీర్ణము 1,20,00,000 చతురపుమైళ్ళు. ఈపరిమితి భూభాగములో నాల్గవవంతు. ప్రజాసంఖ్య 40,00,00,000. ఈసంఖ్య ప్రపంచపు జనసంఖ్యలో నాల్గవవంతునకు పైగానున్నది. బ్రిటిషుసామ్రాజ్యములోని ముఖ్యభాగములు బ్రిటిషుద్వీపములు, దక్షిణాఫ్రికా, ఇండియా, ఆస్ట్రేలియ, కనడ అయియున్నవి. ఈముఖ్యభాగములు గాక న్యూజిలండు, సింహళము, ఈజిప్టు మొదలగు ననేక దేశములీ సామ్రాజ్యములో జేరియున్నవి. రమారమి తొంబది ప్రత్యేకభాగము లీసామ్రాజ్యములోఁ జేరియున్నవి. ఈసామ్రాజ్యపాలకులు బ్రిటిషురాజ్యాధిష్ఠాతలు. రాజ్యాంగవిషయములో నీసామ్రాజ్యపాలనము అయిదువిధములుగ విభజింపఁబడుచున్నది.

### బ్రిటిషుసామ్రాజ్యపాలన క్రమము.

ఈభేదములు పరిపాలన క్రమమువలనను, రాబడివలనను, రక్షణశక్తివలనను నిర్ణయింపఁబడుచున్నవి. 1. బ్రిటిషుద్వీపములు; ఇవిసామ్రాజ్యనిర్మాణకులకు జన్మభూమియై యితరభాగములపై కొద్దియో గొప్పయో యధికారమును గలిగియున్నవి. ఈభాగ మితరభాగముల రక్షణమునకుఁ గారణమై విశేషాదాయమునుఁ గలిగియున్నది. బ్రిటిషు యుద్ధనావికాదళము సామ్రాజ్యరక్షణమునకు శరణ్యము. ఈభాగముపై నితరభాగముల కధికారమేమియును లేదు. 2. రాజ్యాధి నివేశస్థలములు; (Crown Colonies) ఈదేశముల పరిపాలనము బ్రిటిషుపరిపాలకుల చేతిలోనున్నది. గవర్నరును శాసననిర్మాణసభాసభ్యులును బ్రిటిషురాజ్యాధికారులచే నియమింపఁబడుదురు. శాసనములు బ్రిటిషురాజ్యాధికారుల యంగీకారము నొందవలయును. ఆదాయవ్యయ నిర్ణయములును వారి యంగీకారమునుఁ బొందవలయును. కొన్నిదేశములలో నధికారములోఁ గొంతభాగము శాసననిర్మాణసభ కొసంగఁబడినది. 3. ప్రాతినిధ్యాధి నివేశస్థలములు; (Representative Colonies) ఈదేశములలోఁ బ్రాతినిధ్యపాలనమున్నను స్వతంత్రపాలనములేదు. బ్రిటిషురాజ్యాధికారులకు శాసనములను నిషేధించు స్వతంత్రమును, అధికారులను నియమించు స్వతంత్రమును, సభ్యులలో గొందరిని నియమించు యధికారమును, ఆదాయవ్యయముల లోఁ గొంత ప్రమేయమునుఁ గల్పించుకొను స్వతంత్రమును గలదు. 4. స్వతంత్రాధి నివేశస్థలములు; (Responsible Colonies) ఈదేశములలోఁ బ్రాతినిధ్య పాలనమును స్వతంత్రపాలనమును బూర్తిగఁగలదు. బ్రిటిషు రాజ్యాధికారులకు శాసనములను నిషేధించు స్వతంత్రము గలదుగాని ఈ యధికారము సామాన్యముగ వాడఁబడదు. గవర్నరునుతప్ప నితరాధికారులను నియమించు స్వతంత్రముగాని, ఆదాయములలోఁ బ్రమేయమును గలిగించుకొను స్వతంత్రముగాని బ్రిటిషురాజ్యాధికారులకు లేదు. కార్యనిర్వాహకసభికులు గవర్నరుచే నియమింపఁబడుదురు. ఇతరాధికారులందరును కార్యనిర్వాహక సభానుమతిని గవర్నరుచే నియమింపఁబడుదురు. ఈదేశములపాలనము స్వతంత్రవ్యక్తిని గలిగి బ్రిటిషుద్వీపముల పాలనమువలెనుండును. ఈస్వతంత్రాధి నివేశస్థలములలో గొన్ని దేశములందు సాంఘాతిక పాలనముగలదు. ఆస్ట్రేలియా, సంయుక్త దక్షిణఆఫ్రికాలు నిదర్శనములు. ఈసాంఘాతికపాలనములోఁజేరిన ప్రత్యేక భాగమును స్వతంత్రవ్యక్తినిఁ గలిగియుండి సంఘాతపాలనములోఁ జేరియుండును. అధినివేశస్థలములలో శ్వేతముఖులు గాపురముందురు. వారలకు బ్రిటిషుద్వీపవాసులకుఁగల స్వత్వములు నిరభ్యంతరముగ గలవను

సిద్ధాంత మంగీకరింపఁబడుచున్నది. ఈపాలనమునే హిందూదేశములోని స్వరాజ్యవాదు లాకాంక్షించుచున్నారు.

5. స్వాధీనస్థలములు; (Dependencies) ఇవి బ్రిటిషుప్రజలచే జయింపఁబడి బ్రిటిషుసామ్రాజ్య లాభార్థము బ్రిటిషు రాజ్యాధికారులచే నిరంకుశాధికారముతోఁ బాలింపఁబడుచున్నవి. ఈప్రదేశములలో శాసనముల నిర్మించుటకును, అధికారులను నియమించుటకును, ఆదాయవ్యయములలోఁ బ్రవేశము నుఁ గల్పించుకొనుటకును బ్రిటిషు రాజ్యాధికారులకు స్వతంత్రముగలదు. ప్రాచ్యామ్నాయపాలన మీదేశముల కపూర్వము, నిరంకుశాధికారము సహజము. హిందూదేశము సిద్ధాంతానుసరణిని నీతరగతిలోఁజేరినను వ్యవహారికములో నీస్థితిలోలేక మొదటి రెండవతరగతుల దేశములలోఁ జేరుచున్నది. కాలక్రమమున నీదేశమునకు సాంఘాతిక స్వరాజ్యపాలనము బ్రిటిషుసామ్రాజ్యములోఁగలుగవలయుననునాశ హైందవులకుఁ బూర్తిగగలదు. బ్రిటిషుసామ్రాజ్యములోని సకలప్రదేశములకును ప్రధానపాలకులు బ్రిటిషురాజ్యాధికారులచే నియమింపఁబడుదురు. వారు గవర్నరు జనరలులు, గవర్నరులు, లెఫ్టినెంటుగవర్నరులు, ఛీఫుకమిషనరులు, కమిషనరులు మొదలగుపేర్లతో దేశస్థితిగతులననుసరించి నియమింపఁబడి పిలువఁబడుచున్నారు. ఈపదవులలో హిందూదేశపు గవర్నరుజనరలు పదవి యత్యుత్తమపదవిగా నున్నది. అధికారమునందును, గౌరవమునందును, వేతనమునందును దీనికిఁ బోల్చఁదగినపదవి వేరొకటి బ్రిటిషుసామ్రాజ్యమునందేకాక మరెచ్చటను లేదు. విస్తీర్ణమై బహుజనాకీర్ణమై, నానావిధపాలనోపేతమై, భిన్నజాతిమతసంకులమైయొప్పు బ్రిటిషుసామ్రాజ్యము సామ్రాజ్యాధిష్ఠాతలను పాశముచే బంధింపఁబడుచున్నది. ఈప్రపంచవ్యాప్త సామ్రాజ్యపాలనము పార్లమెంటుచే శాసింపఁబడుచున్నది.

## హిందూ సామ్రాజ్యము.

హిందూసామ్రాజ్యము 18,00,000 చతురపుమైళ్ళ విస్తీర్ణమును 30,00,00,000 ప్రజలనుగలిగియున్నది. ఈసామ్రాజ్యములో 11,00,000 చతురపుమైళ్ళ ప్రదేశమును 23,18,99,515 ప్రజలను బ్రిటిషుహిందూస్థానమును, 7,00,000 చతురపుమైళ్ళ ప్రదేశమును 6,24,61,549 ప్రజలను స్వదేశసంస్థానములును గలిగియున్నవి. స్వదేశసంస్థానములు 675 గలవు. వాటిలోఁ గొన్ని పరిమితియందు మిక్కిలిచిన్నవై వ్యవహారస్వతంత్రమును గలిగియుండలేదు. హైదరాబాదు, మైసూరు, బరోడ మొదలగుసంస్థానములు పరిమితియందు పెద్దవిమై వ్యవహారస్వతంత్రమునుఁ గలిగియున్నవి. చెన్నపురిరాష్ట్రమునకు లోఁబడిన సంస్థానములైదుగలవు. వాటిలో ముఖ్యములైనవి కొచ్చిను తిరువాన్కూరు సంస్థానములు. పెద్దసంస్థానములన్నియును సామ్రాజ్యపాలనముతో సంబంధమునుఁ గలిగియున్నవి. వాటిసంఖ్య175 అయియున్నది.

స్వదేశసంస్థానములు సంస్థానాధిపతులచే బ్రిటిషు ప్రతినిధి (Resident) సహాయమువలనఁ బాలింపఁబడుచున్నవి. కొన్నిసంస్థానముల కంతర్వ్యవహారములం జక్కఁబెట్టుకొను స్వతంత్రము గలదు. ప్రాణశిక్షనువిధించు యధికారమునకే గలదు. కొన్నిటికి స్వంతసైన్యమును పన్నులనువిధించు స్వతంత్రమునుగలదు. సంస్థానముల కితరసంస్థానములతోగాని పరదేశములతోగాని సంధిఁజేసుకొను స్వతంత్రము లేదు. సంస్థానాధీశులు దుర్వినయులైనపుడు వారిని మందలించుటకును, తొలగించుటకును, క్రొత్తవారిని నియమించుటకును బ్రిటిషుపరిపాలకులకు స్వతంత్రముగలదు. సంస్థానముల స్వతంత్రస్థితిగతులు బ్రిటిషుపాలనమునకును సంస్థానాధీశులకును లోగడజరిగిన యొడంబడికలవలన నిర్ణయింపఁబడుచున్నవి. సంస్థానములన్నియును బ్రిటిషుసామ్రాజ్యాధికారమునకు లోఁబడి వ్యవహారములను నిర్వర్తించుచున్నవి.

## బ్రిటిషు హిందూస్థానము.

బ్రిటిషుద్వీపవాసులకు హిందూదేశ సామ్రాజ్యము విజయమువలనను సంధులవలనను లభించినది. బ్రిటిషు హిందూస్థానము పదునాలుగు భాగములుగ నేర్పరుపఁబడి విభజింపఁబడి పాలింపఁబడుచున్నది. రాష్ట్రములన్నిటిపైనను ముఖ్యాధికారి గవర్నరు జనరలు.

ఈ లెక్కలన్నియును ఇంపీరియల్ గెజెట్టియరునుండి యెత్తి వ్రాయఁబడినవి.
వంగరాష్ట్ర పునర్నిర్మాణమువలన నాలెక్కలలో మార్పులు గలుగవలసి యున్నవి.

| భాగము | పరిమితి | జనసంఖ్య | ఆదాయము | స్వాధీనకాలము | పాలకుడు |
|---|---|---|---|---|---|
| మద్రాసు | 1,41,705 | 3,82,09,436 | రూ. 14,73,50,000 | 1639–1748 | గవర్నరు. |
| బొంబయి | 1,22,984 | 1,85,15,857 | 13,00,80,000 | 1608–1685 | ,, |
| బంగాళము | 84,728 | 4,00,00,000 | 25,18,80,000 | 1633–1765 | ,, |
| సంయుక్తరాష్ట్రము | 1,07,494 | 4,84,93,879 | 13,33,42,000 | 1764–1856 | లెఫ్టినెంటుగవర్నరు. |
| బర్మా | 2,37,000 | 1,04,90,624 | 9,11,56,000 | 1824–1852 | ,, |
| పాంచాళము | 1,33,741 | 2,47,54,737 | 4,25,80,000 | 1849 | ,, |
| బీహారుఒరిస్సా | 1,11,680 | 3,00,00,000 | | 1912 | ,, |
| మధ్యరాష్ట్రములు | 1,13,241 | 1,08,47,325 | 1,64,70,000 | 1802–1817 | చీఫ్ కమిషనరు. |
| అస్సాము | 62,682 | 61,26,343 | ·66,43,000 | 1825–1826 | ,, |
| సీమాంతరాష్ట్రములు | 38,665 | 21,25,480 | 47,66,000 | 1901 | ,, |
| అజిమీరుమేర్వారా | 2711 | 4,76,912 | 14,50,000 | 1818 | ఏజెంటు |
| బలూచిస్థానము | 1,310,855 | 9,15,000 | 25,51,000 | 1854–1876 | ,, |
| కొడగు | 1582 | 1,80,607 | 7,51,000 | 1834 | కమీషనర్ |
| అండమాను ద్వీపములు | 3143 | 24,649 | | 1858 | సూపరింటెండెంటు. |

ఇపుడు ప్రాక్ప్రపంచము నందువలెఁ బదునారు పదునేడు శతాబ్దములందుఁ బాశ్చాత్యదేశములందు నూతనోత్సాహము జనించినది. షేక్స్పియర్ బేకన్ బెంజాన్సను మొదలగు విద్వాంసులు దమ గ్రంథములవలన జనులకు నూతనోత్సాహమునుఁ బుట్టించిరి. రెలె కొలంబస్ మొదలగు ధీరులు నూతనదేశములనుఁ గనుఁగొనిరి. నాక్సు మొదలగు మతాభిమానులు మతావేశముచేఁ బ్రాణములను లెక్కనుఁజేయకుండిరి. ప్రజలు రాజ్యాంగస్వత్వములకై రాజులను ధిక్కరించుచుండిరి. ప్రజలు దేశాభిమానపరవశులై మహత్కార్యోద్యమ ప్రక్రమణమునకుఁ గడంగిరి. ధైర్యవంతులు ద్రవ్యోపార్జనమునకై దూరదేశములకుఁ బోవనారంభించిరి. సాహసికులు వర్తకసంఘముల నేర్పరచి యాకాలమున ధనధాన్యసంపదలకుఁ బేరొందిన హిందూదేశముతో వర్తకమునుఁ జేయుటకుపక్రమించిరి. మొదటను పోర్చుగీసు దేశస్థులు హిందూదేశములోఁ బ్రవేశించి వర్తకముతోఁ బాటు దేశాక్రమణమునుఁ జేయుచుండిరి. పిమ్మట హాలాండులు పరాసులు ఆంగ్లేయులు వర్తకమునకై నెలవుల నీదేశములో నేర్పరచుకొనిరి. ప్రాగ్వాణిజ్యసంఘము 1600 సంవత్సరము డిసంబరు 31వ తేదిని నెలిజబెత్తురాణివలన నొకకవులుఁబొంది వర్తకమునారంభించిరి. ఈవర్తకసంఘమువారు కాలక్రమమున నితరపాశ్చాత్యదేశీయులను హిందూదేశరాజులను నోడించి సామ్రాజ్యమును స్థాపించినవిధము హిందూదేశచరిత్రమువలన వ్యక్తమగుచున్నది.

ప్రాగ్వాణిజ్యసంఘమువారు హిందూదేశములోఁ గాలుపెట్టి యిప్పటికి మున్నూరేండ్లుగతించినవి. మొదటి నూటయేబదేండ్లలోను వర్తకలాభము వారి ముఖ్యోద్దేశముగనుండెను. తరువాత డెబ్బదేండ్లలో రాజ్యలాభము గలిగెను. ఇప్పటికెనుబదేండ్లుగ నాంగ్లేయులు హిందూదేశమును నిరాటంకముగా ధర్మమార్గమునఁ బాలించుచున్నారు. ఆంగ్లేయులకు హిందూదేశసామ్రాజ్యత్వ మతిసులభముగ లభించినది. రాష్ట్రమువెనుక రాష్ట్రము వీరి హస్తగతమగుచువచ్చెను. ఒకదేశమైనను వారిస్వాధీనమైనపిమ్మట పరాధీనముగాలేదు. ఇది దైవసంకల్పము. అలంఘనీయము. విస్తీర్ణమైన భరతఖండమునంతను నేకఛత్రాధిపతులుగఁ బాలించినవా రాంగ్లేయులుదప్ప మ

జాలరులేరు. ఈయేకఛత్రాధిపత్యమె హైందవ జాతీయత్వమునకు మూలబీజము.

ఈవర్తకసంఘము 1611లో మచిలీబందరుతోను 1612లో సూరతుపట్టణముతోను వర్తకము నారంభించెను. 1637లో చెన్నపురియద్దెకుఁ దీసికొనఁబడెను. 1668 లో బొంబయి ఇంగ్లీషురాణికిఁ గానుకగాలభించెను. 1640 లో హుగ్లీసామీప్యమున మొగలుచక్రవర్తి యనుమతిని వర్తకశాలయొకటి నిర్మింపఁబడెను. 1688లో నీసంఘమునకు బోటీసంఘమేర్పడెను. కాని 1702లో నీరెండుసంఘములకు సంయోగమేర్పడెను.

దేశస్థితి: రాజ్యలాభము.

పదునెనిమిదవ శతాబ్దమునడుమను మొగలుచక్రవర్తుల యధికారము క్షీణించి మహారాష్ట్ర సంఘాతబలము వర్ధిలుచుండెను. సంఘములోని వారొండొరులతో రాజ్యకాంక్షచేఁ బోరాడుచుండిరి. పాంచాల మహాఫగను నాయకుడైన అహమ్మదుషావశమయ్యెను. రోహిలానాయకులుత్తరభాగములం గొన్నిటినాక్రమించుకొనిరి. అయోధ్య వంగదేశములు చక్రవర్తి ప్రతినిధుల పాలయ్యెను. రాజపుత్రస్థానముపై మహారాష్ట్రుల యధికారము పూర్తిగజెల్లుచుండెను. దక్షిణహిందూస్థానములో నిజాము స్వతంత్రమునువహించెను. మైసూరు మొదలగుస్వతంత్రరాజ్యములును దక్షిణమునందుండెను. ఈరాష్ట్రపాలకులలో మహారాష్ట్రులుమాత్రము ప్రబలియుండిరి. ఇతరులు రాజ్యలోభముచే నొండొరులతోఁ గలహించుచు దేశవిప్లవకారులైరి. వారిరాజ్యము లస్థిరములుగానుండెను. దేశమీస్థితిలోనుండగా ససహాయశూరుడు రాబర్టు క్లైవు రంగములోఁ బ్రవేశించెను. ఈమహనీయుడు మొదటి బ్రిటిషుసామ్రాజ్య నిర్మాణకుఁడు. ఈయన ఫ్రెంచినాయకుఁడు డూప్లెవలె హిందూదేశ రాజ్యవ్యవహారములలో సంబంధమునుఁ గల్పించుకొనఁజొచ్చెను. వ్యాపారసంఘమునకు వర్తకమును బలపరచుటకు బలమవసరమైయుండెను. ఈబలసాధనమువలన రాజ్యలాభము సులభముగ గలిగెను. 1761 సంవత్సరమున దక్షిణహిందూదేశములో వర్తకసంఘము నెదిరింపజాలిన రాజ్యములేకుండెను. 1757లోఁ గలిగిన ప్లాసియుద్ధవిజయము వలన వంగరాష్ట్రము వర్తకుల పాలయ్యెను. 1772లో వర్తకసంఘము వంగరాజ్యభారమునుఁ బూర్తిగవహించెను. అప్పటినుండియును వారిప్రధాన నగరము కలకత్తాగనుండెను. వెల్లస్లీప్రభువు దమపాలనాకాలములో సంస్థానాధీశులతో నేర్పాటుసేసిన యొడంబడికలవలన బ్రిటిషు ప్రాబల్యమును స్వదేశసంస్థానములపై స్థాపించెను. 1811 సంవత్సరమునకు చెన్నపురిరాష్ట్రములోను 1818 నకు బొంబయి మధ్యరాష్ట్రములలోను 1849 నకు పాంచాలములోను 1852 నకు లోవరు బర్మాలోను, 1876నకు బలుచిస్థానములోను 1887 నకు అప్పరుబర్మాలోను బ్రిటిషురాజ్యము సుస్థిరముగ స్థాపింపఁబడినది.

వాణిజ్యసంఘ వ్యవహారనిర్మాణము.

వర్తకసంఘపు వ్యవహారక్రమము నింగ్లాండులో నిరువదినలువురు సభికులును నొకసభాధ్యక్షుడును నిర్వర్తించుచుండిరి. సభికులేటేటను నెన్నుకొనఁబడుచుండిరి. పదునేడవశతాబ్దాంతమున నీసంఘనిర్మాణము కార్యనిర్వాహకసభకును (Court of directors) వ్యాపారసంఘస్వాములకును (General Court of Proprietors) మారినది. 2000 సవరనుల విలువగల భాగస్వాములు కార్యనిర్వాహకసభలో సభ్యులుగనుండుట కర్హులు. కార్యనిర్వాహకసభ సంఘపు వ్యవహారములను నిర్వర్తించుచుండినను భాగస్వాములు వారివ్యవహారములను రద్దుచేయ స్వాతంత్రమును గలిగియుండిరి. ఆకాలమున వర్తకవ్యాపనకై చెన్నపురి బొంబయి కలకత్తాలలో వర్తకశాలలేర్పరుపఁబడినవి. ఈశాలలె కాలక్రమమున కోటలుగ మారినవి. ఈవర్తకశాలల వ్యవహారములను సభాధ్యక్షుడును సభికులును గలిసి నిర్వర్తించుచుండిరి. అధిక సంఖ్యాకుల మతము ననుసరించి కార్యక్రమము నిర్ణయింపఁబడుచుండెను. ఈమూడువర్తకశాలాధికారులును స్వతంత్రులుగా నుండెడివారు. వారిపైయధికార మింగ్లాండులోని కార్యనిర్వాహకసభకు మాత్రముండెడిది. ఈయధికారులే కాలక్రమమున గవర్నరులుగను కార్యనిర్వాహకసభ్యులుగ

ను మారిరి. చెన్నపురి బొంబాయి గవర్నరులకిప్పటికిని హిందూదేశపుమంత్రితో స్వతంత్రముగ నుత్తరప్రత్యుత్తరములను జరుపుట కధికారముగలదు.

వ్యాపారనిర్వాహకసభకు ధనాగమమే ప్రధానోద్దేశము. వారిచేనియమింపబడినవారలు వాణిజ్యసంఘమునకును స్వకీయోపయోగమునకును ధనమునార్జించుటకు న్యాయాన్యాయ విచక్షత లేక పాటుపడుచుండెడివారు. ఇందువలన పాలనమునందనేకములైన దుర్న్యయములేర్పడినవి. 1773లో నియామకశాసనము (Regulation Act) ఏర్పడినది. ఈశాసనములవలన నియోజక నియమములలోను నధికారకాలములోను కొన్నిమార్పులు చేయఁబడినవిగాని పాలనాపద్ధతులలో మార్పులు చేయఁబడనేలేదు. 1784లో నిర్మింపఁబడిన పిట్టుశాసనము వలన నిర్వాహక సభకు సర్వాధికారములు నిధింపఁబడినవి. ఆసభలో గోశాధ్యక్షుఁడును, మంత్రులలో నొకరును, నారుగురికి మించని గూఢసభాసదులును (Privy Councillors) సభ్యులుగనియమింపఁబడిరి. సభాధ్యక్షుఁడు కార్యముల నిర్వహించుచుండెను. సభ్యులసంఖ్య క్రమముగఁ దగ్గింపఁబడినది. అధికారమంతయును సభాధిపతివశముననుండెను. 1841వ సంవత్సరమునకు సభాధిపతిమాత్రము సభ్యుఁడుగ మిగిలియుండెను. ఈసభాధిపతియె తుదకు హిందూదేశపు మంత్రిగ (Secretary of State for India) మారెను.

కార్యనిర్వాహకసభకును భాగస్వాములసభకును ననవరతము భేదభావము గలుగుచుండుటవలన వ్యవహారక్రమము కార్యనిర్వాహక సభాధ్యక్షులైన మంత్రివశమగునటులు పార్లమెంటుచే శాసనములు గల్పింపఁబడెను. హిందూదేశసామ్రాజ్యము రాజ్యాధిష్ఠాతలదనియును వాణిజ్యసంఘమువారు వారియనుమతినిఁ బాలించుచున్నారనియును సిద్ధాంతమేర్పడెను. పాలకులు సభచేనియమింపబడినను రాజ్యాధిష్ఠాతల సమ్మతి మవసరముగ నుండెను. కార్యనిర్వాహక సభకును నియామకసభకును గల ద్వైవిధీభావము 1858లో సామ్రాజ్యపాలనము రాజ్యాధిష్ఠాతల యధీనమైనపు డంతరించి సర్వాధికారము రాజ్యాధికారుల పరమైనది.

బ్రిటిషుసామ్రాజ్యములోని భాగము లన్నియును పార్లమెంటుచేఁ బాలింపఁబడుచున్నవనుట శాస్త్రసమ్మతము. ప్రజాప్రాత్యామ్నాయసభ, ప్రభువులసభ, రాజ్యాధిష్ఠాతలుచేరి సామ్రాజ్యపాలనమును నిర్వర్తించుచున్నారు. ప్రాత్యామ్నాయ సభవలనను ప్రభువులసభవలనను నిర్దేశింపఁబడిన శాసనములు రాజ్యాధిష్ఠాతల సమ్మతినిఁ బొందుచున్నవి. ప్రభువులసమ్మతినిఁ బొందకున్నను మువ్మారు ప్రజాప్రాత్యామ్నాయసభచే నంగీకరింపఁబడినశాసనములు శాసనములుగావలయునని గతసంవత్సరములో నొకశాసన మేర్పరుపఁబడినది. ఇందువలనఁ బ్రజాప్రాత్యామ్నాయసభచే బ్రిటిషుసామ్రాజ్య వ్యవహారము నడుపబడుచున్నదని యంగీకరించవలసియున్నది. ప్రజాప్రాత్యామ్నాయ సభాసభ్యులు బ్రిటిషుప్రజలచే నెన్నుకొనఁబడుదురు గాన బ్రిటిషు సామ్రాజ్యపాలనము బ్రిటిషు ప్రజాధీనమనుట యథార్థమైనను నీసిద్ధాంతము సామాన్యముగ బ్రిటిషు ద్వీపములవఱకుమాత్రము చెల్లుచున్నది. కారణమితరభాగముల వ్యవహారములలో బ్రిటిషు నియోజకగణము ప్రమేయ మంతగాఁ గల్పించుకొనుటలేదు. ఈసిద్ధాంతము హిందూ సామ్రాజ్యముపట్ల పూర్తిగఁజెల్లుచున్నది. పార్లమెంటు సర్వాధికారములను గలిగియున్నను రాజ్యాంగక్రమ మాంతరంగిక సభచే (Cabinet) నిర్వహింపఁబడుచున్నది. అంతరంగికసభలో 19 సభ్యులుగలరు. హిందూదేశపుమంత్రి యీసభ్యులలోనొకఁడు. ఈమంత్రి హిందూదేశపాలన క్రమమున కాంతరంగిక సభకును పార్లమెంటునకును బాధ్యతను వహించుచున్నాఁడు. పార్లమెంటునకు హిందూదేశాదాయ వ్యయమును జర్చించుటకును, శాసనములను నిర్మించుటకును స్వతంత్రముగలదు. ఈహేతువువలన పార్లమెంటునకు హిందూదేశపాలనముపై బాధ్యత గలదనవలసియున్నది.

## హిందూదేశమంత్రి.

ఈమంత్రికి హిందూదేశ వ్యవహారములలో సకల స్వతంత్రమునుగలదు. ఈయన మిగిలిన మంత్రులవలె రాజ్యాధిష్ఠాతల యనుమతినిఁ గార్యములను నిర్వహించుచుండును. హిందూదేశాదాయ వ్యయములపట్లను పాల

నమువట్లను మొదట కార్యనిర్వాహక సభకును, భాగిస్వాముల సభకును, నియామకసభకునుగల సకలాధికారములు మంత్రికిఁగలవు. రాజప్రతినిధికిని మిగిలిన యుద్యోగస్థులకును రాజ్యవ్యవహార క్రమమును నిరూపించు నధికార మీయనకుఁగలదు. బ్రిటిషుద్వీపములలో హిందూదేశ రాజ్యవ్యవహారములీయనచే నిర్వర్తింపబడుచుండును. హిందూదేశమున కంపఁబడు శాసనపత్రములీయన సంతకమునుఁ గలిగి యుండవలయును. ఈకార్యమును నిర్వహించుటకొక సభగలదు. ఇపుడీసభలో 11 గురు సభ్యులుగలరు. ఈసభ్యులు మంత్రిచే పదేండ్లకొకసారి నియమింపబడుచుందురు. ఈసభ్యులు పదేండ్లు హిందూదేశములోఁ బనిఁజేసినవారుగను పనిలోఁజేరుటకుఁ బూర్వము పదేండ్లకుమించక హిందూదేశమును విడువనివారుగను నుండవలయును. ఇపుడీసభలో నిద్దరు హైందవ సభ్యులుగలరు. కార్యదక్షులను మువ్వురను కాలనియమములేక నియమించుటకు స్వాతంత్ర్యము మంత్రికి గలదు. మంత్రి శాసననియమములేని విషయములలో సభ్యులతో సంప్రతింపునుఁ జేయక వ్యవహరింపవచ్చును. హిందూదేశములోని గొప్పపనులు మంత్రియాలోచనపై రాజ్యాధిష్ఠాతలచే నంగీకరింపఁబడుచున్నవి. సామాన్యముగ కార్యక్రమము సభికుల యాలోచనల ననుసరించి వారికిఁ దెల్పి నిర్వర్తింపఁబడుచున్నది. యుద్ధములకును, సంస్థానములకును సంబంధించిన విషయములు రహస్యముగా మంత్రిచే నిర్వహింపఁబడుచున్నవి. వ్యయవిషయములలో మంత్రి సభ్యులతో సంప్రతించి వ్యవహారమును నడుపవలసియుండును. నెలకు రూ. 250 జీతముగల క్రొత్తపనును గల్పించుటకును రూ. 25,000 లకు మించని వ్యయమును గల్పించుటకును హిందూదేశ పాలకుల కధికారమీయఁబడినది. ఈసభాసదులేడుశాఖాధిపతులుగ విభజింపఁబడిరి. 1. ఆదాయవ్యయము. 2. రాజ్యము. 3. సైన్యము. 4. రాజస్వము. 5. న్యాయపాలనము. 6. జనోపయోగ కార్యములు. 7. వస్తుసంచయము. ఈవ్యవహారక్రమమును నడుపుటకు కార్యదర్శులు, సహాయకార్యదర్శులు, న్యాయవిమర్శకులు మొదలగు నధికారులు మంత్రిచే నియమింపఁబడుచుందురు. క్రూప్రభువు ప్రస్తుత మంత్రి.

### గవర్నరు జనరలు. రాజప్రతినిధి.

గవర్నరు జనరలు హిందూదేశమునకు శాస్త్రసమ్మతమైన పాలకుడు. కార్యనిర్వాహక భారమంతయు వానిపైఁగలదు. దేశమునుఁ బాలించుటకై నూతనశాసనములను నిర్మించు స్వాతంత్ర్యము వానికిఁగలదు. కానియధికార మంతయును కొన్నివేళల హిందూదేశపు మంత్రిచే నాక్రమింపఁబడుచున్నది. కార్యోపక్రమాధికారము గవర్నరు జనరలునకుఁ గలదనియును నిర్ణయాధికారము మంత్రికిఁగలదనియు నాచారవ్యవహారము గలదు. కాని వాడుకలో నీసిద్ధాంతము వీరిరువురి బలాబలముల ననుసరించి వర్తిలుచున్నది. కర్జన్ప్రభువు తనమతమునె నెగ్గించుకొనుచుండె ననియును చెల్లనపుడు పనిని జాలించుకొనెననియును సర్వత్ర తెలిసిన విషయము.

1773 వ శాసనమువలన గవర్నరు జనరలు హిందూదేశ పాలనాధికారమునుఁ బొందెను. ఈయధికారమును స్వాతంత్ర్యముగ నెరవేర్చక సభ్యులలో నధికసంఖ్యాకుల మతముతో నేకీభవించి నెరవేర్చుచుండును. వారను హేస్టింగ్సుగారి కాలములో ఫిలిపుఫ్రాన్సిసు మతమును సభ్యులవలంబించుచు వానికిఁ బ్రతిఘటించుచుండిరి. కారన్వాలిసుప్రభువు 1786 లో గవర్నరు జనరలుగా నియమింపఁబడినపుడు దనకు స్వాతంత్ర్యము గావలయునని కోరగా నధికసభ్యుల మతముతోఁ బనిలేక గవర్నరు జనరలు మతముచెల్లుటకై యొక శాసనము నిర్మింపఁబడెను. ఈశాసన మిప్పటికిని హమలులోఁగలదు. కారన్వాలిసు ప్రభువు కార్యనిర్వహణమునకై భిన్నాంగములను నియమించి ప్రత్యేకాంగమునకొక యధికారిని నియమించి వారియాలోచన ననుసరించి తాను కార్యమును నిర్వర్తించుచుండెను. పిమ్మటను కోశాంగాధిపతియును, న్యాయాంగాధిపతియును నియమింపఁబడిరి. వారు దమయంగములలో స్వాతంత్ర్యమును గలిగియుండిరి. కానింగుప్రభువు మిగిలిన సభికులకుఁగూడ ప్రత్యేకవిధులనుఁగల్పించెను. 1861 లోఁ జేయఁబడిన శాసనమువలన రాజ్యాంగాధికారుల

కార్యములు గవర్నరుజనరలు పనులవలె సంగీకారము నొందెను. పిమ్మట ప్రత్యేకాంగమునకొక యధికారి నియమింపఁబడెను. ప్రత్యేకాంగాధికారికిని స్వతంత్రాధికారముగలదు. కాని గవర్నరు జనరలునకు శాఖాధికారుల నిర్ణయములను సవరణనుఁ జేయుటకును మార్చుటకును నధికారము గలదు.

రాజ్యాంగముల విభజనము.

1. విదేశాంగము:—దీనివ్యవహారమును గవర్నరు జనరలు స్వతంత్రముగఁ జూచుచుండును. చీనా, టిబెట్టు, సయాము, పారసీకము, అఫగనిస్థానము మొదలగు పరరాజులతోఁగల రాజ్యవ్యవహారములను, గిలిగిట్, చిత్రాలు, బెలుచ్చిస్థానము మొదలగు నుపాంతరాజ్యముల రాజ్యవ్యవహారములను సంస్థానాధీశులకు సంబంధించిన రాచకార్యములను నిర్ణయించుట విదేశాంగశాఖవారి పనిమైయున్నది. ఆశాఖ కార్యదర్శి విమర్శనలనుఁబట్టి రాజప్రతినిధి ఈపనులను నిర్వర్తించుచుండును.

2. స్వదేశాంగము:—ఈశాఖకొక సభికుఁడు గలడు. స్వదేశ రాజ్యవ్యవస్థలు న్యాయవిమర్శనము, చరశాలలు, రక్షకభటవర్గము, విద్యాశిక్షణము, వైద్యశాలలు, ప్రజారోగ్యము, పట్టణపాలనసంఘములు, స్థానికపాలనాసంఘములు, క్రైస్తవమత వ్యవహారములు, ఆయుధశాసన నిర్వహణము మొదలగు దేశపాలనమునకు సంబంధించిన వ్యవహారము లీశాఖాధికారులచే శాసింపఁబడుచుండును. ఆయారాష్ట్రములం బాలించు రాష్ట్రపాలకులచే నీవ్యవహారక్రమము నిర్వర్తింపఁబడుచుండును. స్వదేశాంగాధికారులీ కార్యక్రమమును శాసించుచుందురు. రాష్ట్రాధికారులలో ముఖ్యులైన హైందవ పౌరసేవాధికారులీశాఖాధికారమునకు లోఁబడియుందురు. దీపాంతరవాసశిక్షితులకు నివాసములైన అండమానుద్వీపముల పోర్టుబ్లయిరుల పాలనమీ శాఖచేఁ జూడబడుచుండును. సామ్రాజ్యపాలకులకు సంబంధించిన న్యాయాధికారులను, పురాతన మందిర రక్షకశోధక శాఖాధికారులను నియమించెడి యధికార మీశాఖకుఁగలదు.

3. ఆదాయ వ్యవసాయాంగము:—దీనికిఁ బ్రత్యేకసభికుఁడుగలడు. ఈయంగాధికారులు భూమిసిస్తుకు, వ్యవసాయాభివృద్ధికి, వ్యవసాయ మార్గాన్వేషణమునకు, క్షామపీడా పరిహారమునకు సంబంధించిన వ్యవస్థలను శాసించుచుందురు. పూర్వకాలమునుండియును హిందూదేశములో పన్నులలో ముఖ్యమైనది భూమిపన్నయియుండెను. ఇపుడు హిందూదేశాదాయములో సగము భూమిసిస్తులవలన లభించుచున్నది. రయితులకు సదుపాయములనుఁ గల్పించుటయును, వారికి భూమియందు స్థిరమైన హక్కులనుఁ గల్పించుటయును, న్యాయమార్గమున సిస్తును వసూలు చేయుటయును, కృషీవలుల యుద్ధారము నభివృద్ధిఁజేయుటయును, శాస్త్రీయపద్ధతుల ననుసరించి వ్యవసాయ మార్గములను వృద్ధిచేయుటయును మొదలగు పనులీ శాఖాధికారుల యధీనములు. ఈవిషయములన్నియును రాష్ట్రీయాధికారులచే నిర్వహింపబడుచుండును. ఈయంగాధికారుల పని శాసించుట నిర్ణయించుట మాత్రమైయున్నది. క్షేత్రనిరూపణము, వనపాలనము, కృషిరక్షణము, ఔషధ్యవలోకనము, వ్యవసాయమార్గనిరూపణము మొదలగుపనులీశాఖాయత్తములు. ఇపుడు ముఖ్యరాష్ట్రములలో వ్యవసాయ శాఖాంగము లేర్పరుపఁబడినవి. వ్యవసాయ మార్గాన్వేషణమునుఁ జేయుట, నీటివసతులనుఁ గల్పించుట, భూసారములను బలపఱచుట మొదలగుపనుల నీశాఖాధికారులు చూచుచున్నారు. ప్రత్యేకాంగాంగమునకు సంశోధకాధ్యక్షుఁడు Iuspector General) గలడు. ఈయధికారులు ప్రత్యేకరాష్ట్రములోని యధికారుల పనులను శాసించుచుందురు.

4. కోశాంగము:—దీనికిఁ గోశాధ్యక్షుడధికారి. సామాన్యకోశ నిర్ణయములన్నియును నీసభ్యుని యధీనములు. ఉద్యోగస్తుల జీతములు, సెలవులు, ఉపవేతనము లీశాఖాధికారులచే శాసింపఁబడుచుండును. టంకశాలలు, ధనాగారములు, ద్రవ్యపత్రములు, నల్లమందు, ఉప్పు, స్టాంపులు, మద్యాదులు మొదలగు శాఖల వ్యవహారములీ శాఖాధికారులచే నియమింపఁబడుచున్నవి. కార్యక్రమ మాయారాష్ట్రాధికారులచే నడుపఁబడుచుం



గౌ॥ హరిశ్చంద్ర విష్ణుదాసు. The Hon. Mr. Harischandra Vishnu Dass.



గౌ॥సర్ ఇబ్రహీంరహింతుల్లా. Sir Ebrahim Rahimtulla.



గౌ॥ సర్ విఠల్ దాసు ఠాకర్సే. The Hon. Sir Vithal Dass Thakersey.



The Hon. Sir Gangadhur Rao Chitnavis.

గౌ॥ సర్ గంగాధరరావు చిట్నవిస్.



సర్ సాపూర్జీ బరోచాగారు. Sir S. Barocha.



కార్నెజి కోటీశ్వరుడు. Mr. Carneige.



సయ్యద్ హసనలీ బిల్గ్రామిగారు. Saiyed Hasanali Biligrami.



లల్లుభాయి శ్యామలదాసుగారు. The Hon. Mr. LalluBhai Samala Dass

Members of The Madras Legislative Council.



1910-11 లో చెన్నపురి శాసననిర్మాణ సభాసభ్యులు.

The Hon. Mr. Lim Ching Tsong.



లిమ్ చింగ్ ట్సాంగుగారు.

The Hon. Mr. Alfred Chatterton.



ఆల్ఫ్రెడు చాటర్టనుగారు. చెన్నపురి పరిశ్రామికాధ్యక్షుడు.

The Hon. Mr. M. A Kuddus Badsha Saheb.



కె. కుద్దూసు బాదుషా సాహెబుగారు.

డుకు. శాఖాధికారి కార్యములను నియమించుచుండును. సైనికకోశాంగము ప్రత్యేకాంగముగ నిటీవల నేర్పరుపఁబడినది. సేనకు సంబంధించిన లెక్కలీశాకాధికారులచేఁ జూడఁబడుచుండును. కరగ్రహణమునకై తాలూకాలందును, మండలములందును, రాష్ట్రప్రధానపట్టణము లందును ధనాగారములుగలవు. కోశాధికారులీ ధనమును స్వీకరించుదురు. రాష్ట్రపాలనమునకై వినియోగింపఁ బడవలసిన ధనము రాష్ట్రములందు వ్యయము సేయఁబడి సామ్రాజ్య వ్యయమునకై నియమింపఁబడినది కోశాంగాధ్యక్షుని పరము సేయఁబడును. కోశప్రధానపర్యవేక్షకుఁడు Comptroller and Auditor General.) ఈశాఖానైపతి. ద్రవ్యపత్ర వ్యవహారము వీనిస్వాధీనమందుండును. సామ్రాజ్యాదాయవ్యయగణనము లీకార్యస్థానములందుఁ బరీక్షింపఁబడును. రాష్ట్రీయకోశ పర్యవేక్షకులును Provincial Comptrollers and Auditors) నీయంగమునందుఁగలరు. వారుసామ్రాజ్య రాష్ట్రీయగణనములను విశదీయుచుందురు. పూర్వము సామ్రాజ్యపాలకులకును రాష్ట్రీయపాలకులకును లెక్కలవిషయమై తగాదాలేర్పడుచుండెను. సామ్రాజ్యాధికారులు రాష్ట్రీయధనమును వ్యయముచేయుచుండెడివారుట. ఇపుడట్టి కలహములు లేకుండుటకై సామ్రాజ్యధనము, రాష్ట్రీయధనము నిర్ణయింపఁబడినది.

5. వాణిజ్య పరిశ్రామికాంగము:—ఇది ప్రత్యేకాంగముగ 1905 లో నిర్మింపఁబడినది. దీనికిఁ బ్రత్యేకాంగాధిపతియును ముగ్గురు సభ్యులుగల సభయునుఁగలదు. ఆసభ రైలుమార్గముల వ్యవహారములనుఁ బరిశీలించుచుండును. ఈవ్యవహారక్రమమీయంగముల ద్వారా నడచుచుండును. వాణిజ్యము, పోస్టాఫీసులు, టెలిగ్రాపులు, కర్మాగారములు, శిలాతైలము, విదారణద్రవ్యములు, ముద్రణము, శుల్కము (Customs) సముద్రయానములు, నావాశ్రయములు, వ్యాపారగణనములు, బొగ్గుగనులు, శిల్పికళలు, ఖనిజములు, కూలీలు పరదేశమునకుఁ బోవుట మొదలగు కార్యవ్యవహారమీయంగాధికారులచే నియమింపఁబడును. పూర్వము దేశోపయోగ కార్యశాఖచే (The Public Works Department) నియమింపఁబడెడి వ్యవహారము లిపుడీశాఖాధికారుల వశము సేయఁబడినవి. ఈశాఖలోని యుపాంగములకుఁ బ్రత్యేకాంగాధిపతులుగలరు. తంత్రీకార్యాలయములకును పోస్టాఫీసులకును ప్రధాననిర్వాహకులు (Director General) గలరు. నూతనముగ నీరెండుశాఖలును నొకటిగాఁ జేర్చఁబడినవి. వీరిక్రిందఁ బ్రతిరాష్ట్రమునందును ప్రధానాధికారులు గలరు. వారిక్రిందను మండలములలోను నధికారులుగలరు. పోస్టాఫీసులు, తంత్రీకార్యాలయములు సామ్రాజ్యపాలనాధికారముక్రింద నున్నవి.

6. న్యాయాంగము:—దీనికిఁ బ్రత్యేక సభికుఁడు గలడు. సామ్రాజ్యపాలనమునకును, రాష్ట్రపాలనమునకును గావలసిన న్యాయసూత్రము లీశాఖాధికారుల యాలోచనల ననుసరించి నిర్మింపఁబడుచుండును. నూతనశాసన నిర్మాణమునకీ యంగాధిపతి యోచనలు దోడ్పడుచుండును. హైందవులిపుడీ యంగాధిపతులుగ సేవింపఁబడుచున్నారు.

7. 8. సైన్యాంగములు:—ఈయంగమునకు ముఖ్యాధికారి సేనాధ్యక్షుఁడు కాని గవర్నరుజనరలు మిగిలిన యంగములపైనవలె దీనిపైనను నధికారమునుఁ గలిగియున్నాఁడు. పూర్వము భిన్నరాష్ట్రములకుఁ బ్రత్యేక సేనాధ్యక్షులుండుటగలదు. ఇపుడు సైన్యవిభాగము లన్నిటికిని సేనాధ్యక్షు డధిపతి. 1906 లో నీయంగపాలనమునకై రెండుశాఖలేర్పడినవి. సైన్యశాఖ యుద్ధసన్నాహసంభారశాఖ. సైన్యవ్యవహారములన్నియును సేనాధ్యక్షునియధీనములు. శిబిరములు, స్వేచ్ఛాసైనికులు, నియమములు, సాధనములు మొదలగున వన్నియును సేనానాయకునిచే శాసింపఁబడుచుండును. యుద్ధసామగ్రులు యుద్ధనావలు, యుద్ధోపకరణములు మొదలగు వ్యవస్థలు రెండవశాఖచే నియమింపఁబడును. ఈయంగములోని యధికారులందరు సామాన్యముగ సేనాధికారులుగ నుందురు. హిందుదేశ సైన్యమిపు డయిదుభాగములుగ విభజింపఁబడినది. ఉత్తరభాగము, తూర్పుభాగము, దక్షిణభాగము, పశ్చిమభాగము, బర్మాభాగము. దక్షిణభాగమునందు తూర్పుభాగములోఁ జేర్చఁబడునటులు నిర్ణయింపఁ బడినది.

సేనాధిపతిక్రిందను నుపనాయకులు దండనాయకులు మొదలగువారుగలరు. శిబిరపాలనము ప్రత్యేకశాసనములచే నియమింపఁబడుచున్నది. ఈపాలనము సైనికశిబిర దండనాధికారుల యధీనము. కిచనరుప్రభువుగారి యాధిపత్యముక్రింద నీయంగమునకు స్వతంత్రాధికారములు ప్రబలినవి.

9. విద్యాంగము:—ఈశాఖకుఁ బ్రత్యేకాధికారి గలఁడు. పాఠశాలలు, కళాశాలలు, విద్యావస్థలు, విద్యాశిక్షణము మొదలగు పనులీ యంగాధిపతిచే నిర్వర్తింపఁబడుచుండును.

దేశోపయోగశాఖ యొక యుపాంగముగాని ప్రత్యేకాంగముగాదు. దీని కార్యవ్యవహారము 1905 నుండియును రాజ్యవ్యవసాయాంగమునకుఁ జేర్చఁబడినది. కొంతభాగము వాణిజ్యపరిశ్రామికాంగమునకుఁ జేర్చఁబడినది. ఈశాఖాకార్యములను నిర్వర్తించుటకు యంత్రవాస్తుశాస్త్రజ్ఞులనేకులు నియమింపబడుదురు. వీరిలో రెండుతరగతుల యధికారులుగలరు. సామ్రాజ్యసేవకులు రాష్ట్రీయసేవకులు. నీటివసతులు, మార్గములు, జనోపయోగమందిరములు, మొదలగు వ్యవహార నిర్వహణ మీశాఖాధీనము. పట్టణములలోని బాటలు పట్టణ పారిశుద్ధ్య సంఘాధీనములు. మండలములలోని రాజమార్గములు మండల సంఘాధీనములు, ఈశాఖ కార్యనిర్వహణార్థమొక ప్రధానకార్యదర్శిగలఁడు. ఈయధికారి రాజస్వవ్యవసాయాంగాధిపతితో సంబంధమునుఁ గలిగియుండును.

గవర్నరు జనరలునకు సంవత్సరమునకు రూ. 2,50,800, సేనాధ్యక్షునకు రూ.1,06,000, అంగాధిపతులకు రూ. 80,000 వేతనములు. సామాన్యముగ సభికులందరును హైందవ పౌరసేవాధికార పరీక్షలోఁ గృతార్థులై పదేండ్లుగా నుద్యోగములో నున్నవారుగనుందురు. న్యాయాంగాధిపతి బారిస్టరుగా నుండవలయును. కోశాంగాధిపత్యము, విద్యాంగాధిపత్యము, వ్యాపారాంగాధిపత్యము ఉద్యోగమునుఁ జేయనివారికి నయితమీయఁబడుచున్నది. సైన్యాంగాధిపతి సైనికోద్యోగిగానుండును. ప్రత్యేకాంగమునకును కార్యదర్శి, ఉపకార్యదర్శి, నియుక్తకార్యదర్శి, సహాయకార్యదర్శి మొదలగు ఉద్యోగులనేకులుగలరు. కార్యదర్శి ఆశాఖకార్యములను శాఖాధ్యక్షునకుఁ దెలుపును. శాఖాధ్యక్షుని యనుమతిని శాఖాకార్యములు నడుచుచుండును. శాఖాధ్యక్షులకు మతభేదమేర్పడినను, శాఖాధ్యక్షులకు రాష్ట్రపాలకులకు మతభేదమేర్పడినను గవర్నరు జనరలుగాని లేక నిండుసభగాని చేరి తీర్మానములనుఁ జేయుచుందురు. నూతనశాసనములు, ముఖ్యాంశములు నిండుసభలచేదీర్మానింపఁబడును. సభ సామాన్యముగ వారమున కొకసారి గూడును. సభాచర్చలు తీర్మానములురహస్యముగ నుంచఁబడును. ఆయాశాఖల కార్యదర్శులు తీర్మానములను వ్రాయుచుందురు. సభ్యులలో మతభేదము గలిగినపు డధికసంఖ్యాకుల మతము చెల్లుచుండును. కాని గవర్నరుజనరలునకీమతమును నిరాకరించుస్వతంత్రముగలదు.

### సామ్రాజ్యపాలనము.

సామ్రాజ్యరాజ్యభారము గవర్నరుజనరలుపైఁ గలదు. కార్నవాలిసుప్రభువు కాలమునుండియును గవర్నరు జనరలుమతము సభ్యులమతముతో నేకీభవించకున్నను చెల్లుఁబడి కావచ్చునను నియమమేర్పడెను. కానివ్యవహారికమునందు సభతోఁగూడిన గవర్నరు జనరలు సామ్రాజ్యమునుఁ బాలించుననుఁ బ్రతీతిగలదు. సామాన్యముగ శాఖాధికారుల మతము నిరాటంకముగఁ జెల్లుచుండును. కాని రాజప్రతినిధికిఁగల నిరంకుశాధికారము సభ్యుల నిష్పాక్షిక స్వతంత్రాభిప్రాయములకుఁ బ్రతిబంధకమనికొందరిమతము. కాని రాజ్యభారము శాఖాంగాధిపతుల సమ్మతముతో గవర్నరు జనరలుచే నిర్వర్తింపఁబడుటంజేసి సభాసహితుడైన గవర్నరుజనరలుచే సామ్రాజ్యము పాలింపఁబడుచున్నదనుట యుచితము. ఈపద్ధతివలన నానాయంగకార్య నిర్వహణభారము ప్రత్యేకసభికునియందును సభికులందరియందునుఁ గలదు. ఇదికొంతవరకు పార్లమెంటుసభయొక్క యాంతరంగికసభ (Cabinet) యొక్క పాలనమునుఁ బోలియున్నను నీరెండుపద్ధతులకును విశేష వ్యత్యయముగలదు. ఈభేదమునకుఁగల కారణము రెండుదేశములకును పాలనాపద్ధతులలోఁగల భేదమైయు

న్నది. హిందూదేశములోని సభికులు దమవాదము నెగ్గకున్న బనులంజాలించుకొనరు. వారు ప్రజలచే నెన్నుకొనంబడక నధికారవశమున నియమింపఁబడుదురు.

రాజప్రతినిధికి రాజులకుగల సామాన్యాధికారములుగలవు. సంస్థానాధీశుల సన్మానములకుఁ బాత్రుడుఁ దోషులను మన్నింపఁగలడు. సామాన్య శాసనములకు లోఁబడవలసినపనిలేదు. సభాసదుల మతమునకు వ్యతిరేకముగాఁ బ్రవర్తింపఁగలడు.

## సామ్రాజ్యశాసనసభ.

సామ్రాజ్యపాలనమున కనుకూలములైన శాసనములను నిర్మించుటకును వ్యవహారక్రమమునుఁ బరిశీలించుటకును సామ్రాజ్యశాసనసభగలదు. గవర్నరు జనరలీసభాధ్యక్షుడు. 1858 లో హిందూదేశరాజ్యము ప్రాగ్వాణిజ్య సంఘమునుండి బ్రిటిషురాజ్యాధిపతుల వశమైనపుడీ దేశపాలన మాయేడు పార్లమెంటులో నంగీకరింపఁబడిన 21,22 శాసనముల ననుసరించి గవర్నరు జనరలు స్వాధీనము సేయఁబడియె. వానికి సహాయార్థమొక శాసననిర్మాణసభ నిర్ణయింపఁబడెను. 1861-1892 సంవత్సరములలోఁ జేయఁబడిన శాసనములవలన గవర్నరుజనరలునకు బదుగురుకంటెఁ దక్కువ లేకను 16 కంటె నెక్కువ గాకను నధికసభ్యులనునియమించుట కధికార మొసంగఁబడెను. ఈయధిక సభ్యులలో సగముమంది యనధికార సభ్యులుగ నుండవలయునని నిర్ణయింపఁబడెను. వారిలో నయిదుగురు భిన్నరాష్ట్రములలో నెన్నుకొనఁబడిన ప్రతినిధులుగానుండవలయునని నియమింపఁబడెను. 1909 లోఁ జేయఁబడిన శాసనమువలన సామ్రాజ్యశాసన నిర్మాణసభలో 60 మంది సభికులుండునటులు తీర్మానింపఁబడినది. ఇరువది యైదుగురు సభ్యులెన్నుకొనఁబడవలయును.

| | | |
|---|---|---|
| చెన్నపురి శాసనసభలోని యనధికార సభ్యులవలన | | 2 |
| బొంబాయి | ... | 2 |
| వంగరాష్ట్రము | ... | 2 |
| ఆగ్రా అయోధ్య సంయుక్తరాష్ట్రములు | ... | 2 |
| పాంచాలము | ... | 1 |
| అస్సాము | ... | 1 |
| బర్మా | ... | 1 |
| మధ్యరాష్ట్రస్థానికపాలనాసంఘములు పట్టణపారిశుద్ధ్య సంఘములు | ... | 1 |
| చెన్నపురి భూస్వాములు | ... | 1 |
| బొంబాయి భూస్వాములు | ... | 1 |
| వంగరాష్ట్రము | ... | 1 |
| సంయుక్తరాష్ట్రము | ... | 1 |
| అస్సాము తూర్పుబంగాళము | ... | 1 |
| మధ్యరాష్ట్రము | ... | 1 |
| చెన్నపురి మహమ్మదీయులు | ... | 1 |
| బొంబాయి | ... | 1 |
| వంగరాష్ట్రము | ... | 1 |
| సంయుక్తరాష్ట్రము | ... | 1 |
| అస్సాము తూర్పుబంగాళము | ... | 1 |
| వంగరాష్ట్రవర్తకసంఘము Chamber of Commerce | | 1 |
| బొంబాయిరాష్ట్రవర్తకసంఘములు | | 1 |
| పాలకులచే నియమింపఁబడు సభ్యులు 35 మంది కెక్కువగాక నుండవలయును | | 35 |
| | | 60 |

వీరిలో నధికారులసంఖ్య 28కి మించఁజనదు, అనధికారుల సంఖ్యకన్న నధికారులసంఖ్య యెక్కువగానుండవలయును. ఈసభకు పార్లమెంటుసభచే నేర్పాటుసేయఁబడిన శాసనములం జర్చించుటకు స్వాతంత్ర్యములేదు. విదేశరాజ్యతంత్రములం గూర్చియును, స్వదేశసంస్థానములంగూర్చియును, సేనకు సంబంధించిన విషయములను, న్యాయసభలలో విచారణలోనున్న విషయములను విచారించుట కధికారములేదు. సభ్యులు కోశవ్యవస్థలనుఁ జర్చింపవచ్చును. మార్పులనుఁజేయుటకై తీర్మానములను సభలోఁ బ్రవేశపెట్టవచ్చును. రాజప్రతినిధి సమ్మతముతో నూతనశాసనములనుఁ బ్రవేశపెట్టుటకు సభ్యుల కధికారముగలదు. జనోపయోగములైన ప్రశ్నల నడుగవచ్చును. సభాధిపతియైన గవర్నరు జనరలు ఆజ్ఞలకు సభ్యులు లోఁబడియుండవలయును. ఈసభయొక్క శాసనములు పార్లమెంటుచే నియమింపఁబడినవిగాన హిందూదేశపాలనము శాసనసభాధీనమైనను పార్లమెంటు సర్వాధికారమునుఁ గలిగియున్నది. అధికార సభ్యులసంఖ్య హెచ్చుగా నుండుటంజేసియును, కార్యనిర్వాహకసభ యది

కారులచే నిండియుండుటం జేసియును కార్యనిర్వాహక సభామతమె సామాన్యముగ శాసనసభలోనుం జెల్లుంబడియగుచున్నది.

యూరపుదేశములోని శాసనసభలతోం బోల్చిన నిది లోపముగానున్నను, హిందూదేశపు ప్రస్తుతస్థితి కనుకూలముగానుండవచ్చును. కార్యనిర్వాహక సభామతమునుం ద్రోసివేయు స్వతంత్రము శాసన మహాసభకు లేనందునను ప్రజాప్రతినిధు లాసభలో లేనందునను హిందూదేశపాలనము నిరంకుశాధికారమనవచ్చును. ప్రజాప్రాత్యామ్నాయ పాలనము వ్యాపించియుండు దేశములలోం గార్యనిర్వాహక సభికులును ప్రజాప్రతినిధులై యుందురు, శాసనసభలకు వాటినిర్మాణమును మార్చు స్వతంత్రముగలదు. హిందూదేశములోని సభలకట్టి స్వతంత్రములేదు. కానిహిందూదేశపాలనముపయుక్తమైన శాసనములనునిర్మించుస్వతంత్రము శాసనసభలకుంగలదు. అనధికారసభికులకు కోశనిర్ణయములకు సంబంధించిన తీర్మానములను సభలోంబ్రవేశపెట్టు స్వతంత్రము మోర్లిమింటోప్రభువులచేం గల్పింపంబడిన సంస్కారములవలనం గలిగినది. ఈనూతననిర్మితసభ కాలక్రమమున సకలస్వతంత్రములుగల ప్రజాప్రాత్యామ్నాయ సామ్రాజ్యశాసన మహాసభగాం బరిణమించుట కవకాశముగలదు.

### రాష్ట్రపాలనము.

బ్రిటిషుసామ్రాజ్య మీదేశములోం బదునాలుగు భాగములుగ విభజింపంబడినది. ఆరాష్ట్రములు మూడుతరగతులుగనున్నవి. మూడుపెద్దరాష్ట్రములు, బొంబయి, చెన్నపురి, బంగాళము. ఈరాష్ట్రపాలకులు సింహాసనాధిష్ఠాతలచే నింగ్లాండులో రాజకీయ వ్యవహారములలో ప్రముఖులైనవారిలో నొకరు నియమింపంబడుదురు. వారియధికారవిధులు పార్లమెంటుశాసనముచే నియమింపంబడును. వారికిం బ్రత్యక్షముగా హిందూదేశపు మంత్రితో నుత్తరప్రత్యుత్తరములను జరుపుకొను స్వతంత్రముగలదు. రాష్ట్రపాలనము కార్యనిర్వాహక సభతోగూడిన గవర్నరుచేం జరుపంబడును. కార్యనిర్వాహకసభలోని సభికులు నలుగురికి మించంజనదు. ఆసభికులలో నిద్దరు హైందవ పౌరసేవాపరీక్షలోం గృతార్థులై పండ్రెండేండ్లుగ దేశములోం బనిని జేయుచుండువారుగా నుండవలయును. గవర్నరునకును గవర్నరుజనరలునకువలె సభికుల మతమును నిరాకరించు స్వతంత్రముగలదు. గవర్నరులకు రక్షకభటులుగలరు. వారును ఎక్సలెన్సి (Your Fxcellency)యని పిలువంబడుదురు. రాష్ట్రపాలకులశాసనములు సామ్రాజ్యపాలకుల సమ్మతినిం బొందినంగాని శాసనములుగా నేరవు. రాష్ట్రపాలకు లయిదేండ్లకొకసారి నియమింపంబడుదురు. వారివేతనము సంవత్సరమునకు రూ. 1,20,000. కార్యనిర్వాహక సభికులజీతము సంవత్సరమునకు రూ. 64,000. మధ్యతరగతిరాష్ట్రములారు. వాటిపాలకులైన లెఫ్టినెంటు గవర్నరులవేతనము సం॥ ౧కి రూ 1,00,000. మధ్య రాష్ట్రపాలకుడైన ఛీఫుకమీషనరు వేతనము రూ. 62,000. చిన్నరాష్ట్రములయును. మధ్యతరగతిలోం జేరిన మొదటి అయిదురాష్ట్రములును పార్లమెంటు శాసనముచే నిర్మింపంబడినవి. వాటిపాలకులు శాసనసభా సహాయముచే బాలించెదరు. పాలకనియమము గవర్నరుజనరలువశమునందుం గలదు గాని రాజ్యాధిష్ఠాతల యనుమతమునుం బొందవలయును. ఛీఫు కమీషనరును నియమించు స్వతంత్రము రాజప్రతినిధికిం గలదు. రాష్ట్రపాలనము రాష్ట్రాధిపతుల యధీనము. వారియధికారము గవర్నరుజనరలునకు లోంబడియుండవలయును. ఛీఫు కమిషనరులయధికారము రాజప్రతినిధిచే శాసింపంబడుచున్నది. హిందూదేశములోని యేడురాష్ట్రములకు శాసననిర్మాణసభలుగలవు. ఆయారాష్ట్రములలోని శాసననిర్మాణసభలలోని సభికులసంఖ్యావివరము.

| | |
|---|---|
| చెన్నపురిరాష్ట్రము. | 48 |
| బొంబయి | 48 |
| వంగరాష్ట్రము | 51 |
| సంయుక్తరాష్ట్రము | 49 |
| పాంచాళము | 27 |
| బర్మా | 18 |
| బీహారు | |

ఈగణనములలో రాష్ట్రపాలకులు చేరియున్నారు. చెన్నపురిరాష్ట్రశాసన సభానిర్మాణము.

| | |
|---|---|
| అధికారులు అధికారనియుక్తులు | |
| గవర్నరు(సభాపతి) | 1 |
| కార్యనిర్వాహక సభికులు | 2 |
| ఏడ్వకేటు జనరలు | 1 |
| పాలకులచేనియమింపఁబడిన యధికారానధికారులు | 23 |
| నియమింపఁబడిన కార్యదక్షులు | 2 |
| ప్రతినిధులు | |
| చెన్నపురిపాలనసంఘము | 1 |
| విశ్వవిద్యాలయము | 1 |
| పట్టణపాలనాసంఘములు స్థానికపాలనాసంఘములు | 1 |
| జమీందారులు | 2 |
| ఇతరభూస్వాములు | 2 |
| మహమ్మదీయులు | 2 |
| చెన్నపురి వాణిజ్యసంఘము Chamber of Commerce | 1 |
| చెన్నపురి వర్తకసంఘము Trades Association | 1 |
| వాటికేశ్వరులు The Planting Community | 1 |
| | 41 |

1. గంజాము, విశాఖపట్టణము.
2. గోదావరి, కృష్ణా, గుంటూరు.
3. నెల్లూరు, చెంగల్పట్టు, ఉత్తరఆర్కాటు.
4. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం.
5. సేలం, కోయంబుత్తూరు, నీలగిరులు.
6. దక్షిణకనడ, మలయాళము.
7. తంజావూరు, దక్షిణఆర్కాడు, తిరుచునాపల్లి.
8. మధుర, తిరునల్వేలి.

ఈయెనిమిది విభాగములలోనుండు పట్టణపాలనా సంఘములును, స్థానికపాలనా సంఘములును, నొక్కొక ప్రతినిధినెన్నుకొనగలవు. తెలుగు మండలములలోని జమీందారులొక ప్రతినిధిని నితర భూస్వాములొకప్రతినిధిని నెన్నుకొనగలరు. ఈమండలములలోను మద్రాసు చెంగల్పట్టులలోనుగల మహమ్మదీయులొక ప్రతినిధినెన్నుకొనగలరు. దక్షిణమండలములలోని వారిచే మిగిలిన ప్రతినిధులెన్నుకొనఁబడియెదరు. ఈశాసన సభలో ననధికారులసభ్యులసంఖ్య యధికముగనున్నది. ఈసభకు రాష్ట్రీయసంబంధవిషయములనుఁ జర్చించుటకును, నూతనశీర్మానములనుఁ జేయుటకును స్వతంత్రముగలదు. అనధికారసభ్యులకు సామ్రాజ్యశాసన సభాసభ్యులకుఁగలస్వతంత్రములన్నియును గలవు. రాష్ట్రవ్యవహారమంతయును కార్యనిర్వాహకసభచే నిర్వర్తింపఁబడుచుండును. ఆసభలో ముగ్గురు సభ్యులుగలరు. వారిలో నొకసభ్యుడు హైందవుడుగానున్నాడు. రాష్ట్రముయొక్క ఆదాయవ్యయములు వ్యవహారక్రమము మొదలగు కార్యక్రమము రివిన్యూబోర్డుద్వారా నడుపఁబడుచుండును. రివిన్యూబోర్డులోఁ బ్రత్యేకశాఖకు కార్యదర్శులుగలరు. వారు కార్యనిర్వాహక సభాశాసనములను హమలులోఁబెట్టుచుందురు.

మండలములు.

బ్రిటిషు హిందూదేశములో 260 జిల్లాలుగలవు. చెన్నపురిరాష్ట్రములో 23 జిల్లాలుగలవు. మండలముల వ్యవహారము మండలాధిపతులచే నడుపఁబడుచున్నది. మండలాధిపతులక్రిందను నంతర్మండలాధిపతియును సహాయ మండలాధిపతియునుగలరు. మండలము తాలూకాలుగాను, తాలూకాలు ఖండములుగాను ఠాణాలుగాను విభజింపఁబడుచున్నవి. గ్రామము పాలనములో మొదటిస్థితిగానున్నది. ప్రాచీనకాలములో గ్రామములునుఁ బాలనాధికారమును గలిగియున్నను ప్రస్తుతము గ్రామాధికారులపని సిస్తును వసూలుచేయుట లెక్కలనువ్రాయుట మాత్రమైయున్నది. గ్రామములను స్థానికపరిపాలనమునకు మూలబీజములనుగాఁ జేయుటవలనను దేశపాలనము మంచిస్థితిలోనికిరాగలదు. ప్రతిమండలములోను రక్షకభటాధిపతియును న్యాయాధిపతియును గలరు. వీరి క్రిందను నంతరంతరలుగా నధికారులుగలరు. చెన్నపురి రాష్ట్రములో ప్రతిమండలమునకొక యధికారిగలడు. కాని యితరరాష్ట్రములలో నాలుగుమూడు మండలము

లకోక కమిషనరు మండలాధిపతులపైఁ గలడు. మండలములు నియమిత మండలములనియును ననియమిత మండలములనియును రెండువిధములుగా నున్నవి. నియమిత మండలములు పౌరసేవాపరీక్షలో నుత్తీర్ణులైనవారిచే శాసింపఁబడుచుండును. అనియమితమండలములలో నీనియమము లేదు. మండలాధిపతికి నిరంకుశాధికార మధికముగగలదు. మండలాధిపతియొక్క మొదటిపని పన్నులను వసూలుచేయుటయైయున్నను మండలరక్షణము వానిపనియైయున్నది. చెఱసాలలు, ఆసుపత్రులు, స్థానికపాలనాసంఘములు, పాఠశాలలు, అరణ్యములు, వృత్తిపన్నులు, ఆబ్కారి వ్యవహారములు, నీటివసతులు మొదలగు వాటిని నిర్వహించుభారము వానిపైగలదు. రెండేండ్ల ఖైదును రూ. 1000 జరిమానానువిధించు నధికారము మండలాధిపతికిగలదు. క్రిందియధికారుల తీర్మానములను విమర్శించు నధికారమును మండలాధిపతికిగలదు.

న్యాయవిమర్శనము.

న్యాయవిమర్శనమునకు తాలూకాకోక మునసబుకోర్టును దండనాధికారియును గలడు. మండలన్యాయాధీశుడును దండనాధిపతియును వీరితీర్పులను విమర్శించు స్వాతంత్రముగలదు. హిందూదేశములో కలకత్తా, మద్రాసు, బొంబయి, అలహాబాదులలో నాలుగుహైకోర్టులు గలవు. హైకోర్టులు పార్లమెంటుశాసనమువలన నిర్మింపఁబడవలసియున్నవి. మిగిలిన రాష్ట్రములలో న్యాయవిమర్శనమునకు ఛీఫుకోర్టులును,జ్యూడిషనలు కమిషనరులునుగలరు. వీరి తీర్పులను విమర్శించు స్వాతంత్రము లండనులోనుండు ప్రివికౌన్సిలునకుగలదు. అనియమిత ప్రాంతములలోఁ బ్రాంతాధిపతికి న్యాయవిమర్శనాధికారమును దండనాధికారమునుగలదు. గ్రామాధికారులకు స్వల్పాధికారములుగలవు. ఈయధికారముల నభివృద్ధినిఁ జేయుటవలన దేశపాలనము సుఖదాయకముగాగలదు.

సైన్యము.

హిందూదేశ సైన్యము బ్రిటిషుసైన్యమనియును, దేశీయసైన్యమనియును రెండువిధములు. ఈయుభయ సైన్యము దక్షిణభాగము, ఉత్తరభాగము, బర్మాభాగము అని మూడుభాగములుగ విభజింపఁబడినది. ప్రత్యేకభాగము తొమ్మిదిశాఖలుగా విభజింపబడినది. ఈశాఖాధికారులు దండనాయకులు. ప్రతిశాఖాసైన్యము యుద్ధమునకు సిద్ధముగానుండునటులు దండనాధికారులచే శిక్షింపఁబడుచున్నది. సైనికోద్యోగస్థుల శిక్షణార్థము క్వెట్టాలో సైనికవిద్యాలయము గలదు. 1907-08లో హిందూదేశములో 2,27,714 సైనికులుగలరు. వారిలో 73,947మంది బ్రిటిషుసైనికులు, ఇతరులు హైందవసైనికులు. పైసైన్యమునకుఁదోడుగ స్వచ్ఛందసైనికులు 34,962 దేశీయసంవరణ సైనికులు 34,846 సీమాంతసైనికులు 12,000 బర్మాలోని సైనిక రక్షకభటవర్గము 22,000 స్వదేశసంస్థానసైన్యము1,00,000 సంస్థానములలోసామ్రాజ్యసైనికులు 18,000 గలరు. బ్రిటిషుసైన్య రక్షణార్థమును యుద్ధసన్నాహమునకును 1912-13లో28,64,17,500 రూప్యములు వ్యయముచేయబడును. ఈవ్యయములో67 లక్షల రూప్యములు యుద్ధనావికాదళమునకైయున్న.

రక్షకభటవర్గము. (Police.)

హిందూదేశమందలి రక్షకభటవర్గము అయిర్లాండుదేశమునందలి రక్షకభటవర్గము విధమున నిర్మించబడినది. ఈశాఖకార్యక్రమము సంతృప్తికరముగలేదని యంగీకరింపఁబడుచున్నది. నేరాన్వేషణములో నీశాఖలోని దుస్థితి స్పష్టమగుచున్నది, అపరాధులనో నిరపరాధులనో నేరస్థులనుగాబట్టుకొనుట రక్షకభటులకు సహజగుణమైనది. కొన్నిసమయములందు నేరస్థులు పట్టుపడుటయు నులేదు. రక్షకవిధులలో నీశాఖకు సామర్థ్యముగలదు. హిందూదేశములో 1,45,000 రక్షకభటులుగలరు. వారికై సంవత్సరమునకు రూ. 3,50,00,000 వ్యయముచేయబడుచున్నది. వీరుగాక 5,55,000 చౌకీదారులుగలరు. వారు గ్రామరక్షక భటులుగనున్నారు. ఈశాఖయును క్రమముగ బాగుపడుచున్నది.

చెఱసాలలు.

ప్రతిజిల్లాలోను చెఱసాల యొకటికలదు. ఖైదీల యారోగ్యమును మండలవైద్యాధికారి పరీక్షించుచుండు

ను. చెఱసాలలపాలనము చెఱసాలాధికారిచే నియమింపఁబడుచుండును. ఈచెఱసాలలుగాక నచ్చటచ్చట పెద్దచెఱసాలలునుగలవు. ఆరేండ్లకుమించిన శిక్షను విధింపఁబడిన వారండమానుద్వీపముల కంపబడుదురు. అక్కడ వారు స్వతంత్రముగనుండుటకును పెండ్లిఁజేసికొనుటకును వీలుగలదు. అండమానుద్వీపములలో 14,300ను మిగిలిన చెఱసాలలో 87,400 ఖయిదీలును సామాన్యముగనుందురు. చెఱసాలలకు సంవత్సరమునకు రూ. 83,00,000 లు వ్యయమగుచున్నవి.

### ఆదాయవ్యయము.

హిందూదేశాదాయ వ్యయనిర్ణయముచివరనున్న పట్టిక వలనఁ దెలియుచున్నది. ఆదాయమునకు ముఖ్యాధారము భూమిసిస్తు. భూమిసిస్తునిర్ణయము ప్రతిరాష్ట్రమునందును వేరువేరు విధముగఁ జేయబడుచున్నది. చెన్నపురిరాష్ట్రములో సరాసరి యకరమునకు రూ. 2-5-0 చొప్పున సిస్తు వసూలగుచున్నది. మధ్యరాష్ట్రములలో యకరమునకు 0-10-0 చొప్పున వసూలగుచున్నది. సిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడిన వంగరాష్ట్రములో రైతులు సుఖస్థితిలోనున్నారు.

### విద్యాపాలనము.

హిందువులకుఁ బూర్వకాలమునుండియును విద్యయం దాసక్తిగలదు. 1835లో న్యాయమంత్రిగా నున్న మెకాలెప్రభువు విద్యాశిక్షణము పాశ్చాత్యపద్ధతుల ననుసరించి యాంగ్లేయభాషలోఁ జేయుట యవసరమని తెలియజేసెను. 1857లో బొంబయి, మద్రాసు, కలకత్తాలలో విశ్వవిద్యాలయములు స్థాపింపబడెను. అప్పటినుండియును పాశ్చాత్యపద్ధతుల ననుసరించి విద్య క్రమముగ నీదేశములో వ్యాపింపజేయబడినది. 1910-11లో హిందూదేశములో విద్యాస్థితి యీక్రింది లెక్కలవలన దెలియగలదు.

| | బాలకపాఠశాలలు. | బాలికాపాఠశాలలు. | విద్యార్థులసంఖ్య. | వ్యయము. |
|---|---|---|---|---|
| చెన్నపురిరాష్ట్రము | 28426 | 900 | 12,15,725 | రూ. 1,27,68,000 |
| బొంబాయి | 11267 | 1121 | 8,68,585 | 1,24,00,000 |
| బంగాళము | 35437 | | 15,18,239 | 1,60,71,000 |
| తూర్పుబంగాళము | 17292 | | 9,84,213 | 83,05,000 |
| సంయుక్తరాష్ట్రము | 9067 | | 6,45,787 | |
| పాంచాలము | 8321 | | 3,46,940 | 60,57,000 |
| బర్మా | 4892 | | 4,29,092 | 43,63,000 |
| మధ్యరాష్ట్రములు | 3094 | | 2,97,620 | 30,85,000 |
| పశ్చిమోత్తరసీమాంతరాష్ట్రములు | 264 | | 31,891 | 3,88,000 |
| కొడగు | 81 | | 6,640 | 92,000 |
| | | బాలికావిద్యార్థినులు. | బాలవిద్యార్థులు. | వ్యయము. |
| మొత్తము | 1,08,141 | 7,98,646 | 49,30,084 | 7,18,68,000 |

### స్థానికపాలనము.

రిపనుప్రభువు 1882లో నిర్మించిన శాసనమువలన నీదేశములో స్థానికపాలనమేర్పడినది. పట్టణపారిశుద్ధ్య సంఘములును, తాలూకాసంఘములును, మండలసంఘములును స్థానికపాలన వ్యవహారములను గొంతవరకుఁ జూచుచున్నవి. పట్టణపాలనాసంఘములలో నెన్నుకొనబడిన ననధికారసభ్యులు గొన్నిటిలోఁగలరు. సభాధ్యక్షుని నెన్నుకొను స్వతంత్రము గొన్నిటికిగలదు. మండలసభలలో నొకటిరెంటికి సభాధ్యక్షునినెన్నుకొను స్వతంత్రమీయఁబడినది. పట్టణపాలనాసంఘములలో బొంబయి,

మద్రాసు, కలకత్తా నగరపాలనాసంఘములు స్వతంత్రవ్యక్తినిగలిగియున్నవి. ఈపాలనాసంఘములన్నియును సర్కారాధీనములుగ నుండుటచేతను స్థానీయపాలనములో బలమేర్పడలేదు. గ్రామపంచాయతిసభలను నిర్మించినపుడుగాని స్థానీయపాలనములో బలమేర్పడదు 1901 వ సం॥మున నీదేశములో 742 పట్టణపాలనాసంఘములు గలవు. వాటి ఆదాయము రూ. 2,58,31,000. ఆకాలమునను 1,073 స్థానిక పాలనా సంఘములుగలవు. వాటిఆదాయము రూ. 3,17,88,000.

### హిందూదేశపాలనము.

విశాలమైన హిందూదేశము హిందూదేశపు మంత్రిచేతను, గవర్నరు జనరలుచేతను, రాష్ట్రపాలకులచేతను పాలింపబడుచున్నది. ఈకార్యనిర్వాహణమునకై కార్యనిర్వాహకసభలు శాసనసభలునుగలవు. వారియాజ్ఞలను శాసించుటకై యనేక రాజకీయోద్యోగియులుగలరు. పెద్దపనులన్నియును సామాన్యముగ దొరలకీయబడుచున్నవి. ముఖ్యముగ హైందవపౌరసేవాధికారులీపనులకు నియమింపబడుచున్నారు. 1904 లెక్కలప్రకారము సంవత్సరమునకు రూ. 12,000లనుగాని అంత కెక్కువగాని జీతమునుం బొందువారు 1370గలరు. వారిలో 1263 తెల్లవారును, 15 యూరేషియనులును, 92 హైందవులును గలరు. సంవత్సరమునకు రూ. 900మొదలు రూ.12,000 వరకు జీతముపుచ్చుకొను నుద్యోగస్థులు 26,908 గలరు. వారిలో 5205 తెల్లవారును, 5420 యూరేషియనులును, 16,283 హైందవులునుగలరు. ఇంతకు తక్కువజీతముగల పనులన్నియును హైందవులకీయబడుచున్నవి. రక్షకభటులలోను, మండలాధీశులలోను, మండల న్యాయాధిపతులలోను, ఉన్నత న్యాయాధీశులలోను, కార్యనిర్వాహకసభికులలోను, హిందూదేశపు మంత్రిసభలోను, ప్రివికౌన్సిలులోను కార్యమును నిర్వహించుటకుం దగిన శక్తిసామర్థ్యముగల హైందవమహాజనులు గలరుగాన నీపనులకుం గొందరుచూచుచున్నారు.

# బుందిసంస్థానము.

సుప్రసిద్ధులగు ఛవాను రాజపుత్రులలో హాదా తెగకు జెందినవారికి బుందిపాలకుడు ముఖ్యుడు. ఉత్తర హిందూస్థానమునుండి శంభారుకు వీరు 8వ శతాబ్దమందు వచ్చిరి. శంభారులోను అజ్మీరులోను రాజ్యమేలిన పిదప ఢిల్లీకిరాజులైరి. ఢిల్లీనేలిన హిందూసార్వభౌములలో గడపటివాడగు పృథ్వీరాజు ఛవాను తెగకు జెందినవాడే! 1192 లో మహమ్మదుగోరివలన పృథ్వీరాజోడిపోవుటచే ఢిల్లీ హిందువులచేతినుండి తప్పిపోయినను ఛవానులు శంభారులో మాత్రము రాజ్యమేలుచుండిరి.

ఈసంతతివారిలో నొకడగు హాదరాజు బుందికివచ్చి అచ్చట రాజ్యస్థాపనమును 1342లో జేసెను. ఈరాజులలో నొక్కడగు రావుసూర్జన 1654 లో రాజ్యాధిపతియై రంతంభోరుఅను చిరకాలమునుండి అక్బరుపాదుషహా కన్నువేసియున్నకోట నాతనికిచ్చి కాశీజిల్లాతో గూడ 52 జిల్లాలను, 2000 గుఱ్ఱపుదళమున కాధిపత్యమును నాచక్రవర్తివద్దనుండి బడసెను. అప్పటినుండియు బుందిరాజపుత్రులు మొగలాయిచక్రవర్తులకు మిత్రులై వారి పక్షమునబోరుచు వారికెంతేని సహాయమును జేసిరి. ఈ రావుసూర్జన మనుమడు రావురాజ ఛత్రసాలను నతడు 17వ శతాబ్దమందు దక్కనుయుద్ధములలో మొగలాయిలపక్షమునబోరి 1658వ సం॥లో దారాసైన్యము నౌరంగజేబుమీదికి నడపుచుండగా వీరస్వర్గమును గాంచెను. ఔరంగజేబు ఛత్రసాల్ కుమారుడగు భావుసింగును తండ్రితనను శత్రువనితలంచక ఔరంగాబాదుకు పాలకుని జేయుటయే బుందిపాలకులతో మొగలాయీలు స్నేహవాత్సల్యములను గలిగియుండవలయునను యభిలాషగలిగియుండిరని విశదమగుచున్నది. ఔరంగజేబు కాలధర్మమునొందినపిమ్మట సింహాసనమునకయి జరిగినకలహములలో భావుసింగు షహఆలంచక్రవర్తి పక్షమునబోరి ఆతనిని రాజ్యాధిష్ఠాతగ జేయగలిగెను. ఇందునకయి భావుసింగుకుమారుడు బుద్ధసింగుకు మహారావురాజ అనిగౌరవబిరుద మీయబడియెను. ఈబిరుదిప్పటికిని వంశపారంపర్యముగ వచ్చుచున్నది.



ఈబుద్ధసింగునకును జయపురము రాజునకును కలహములుసంభవించి బుద్ధసింగు వెడలగొట్టబడి ప్రవాసమునందేమరణించెను. కాని ఆతనికుమారుడు ఉమేదసింగు 1748 లో ముల్హార్రావు హోల్కారు సహాయమువలన పోయినరాజ్యమును సంపాదించుకొని రావుకు పట్టన్ జిల్లానిచ్చివేసెను. 1770 లో నుమేదసింగు కుమారుడు అజితసింగు రాజయ్యెను. ఇత డుదయపురము రానాయగు హరిసింగును మృగయావినోదార్థమై తీసుకొనివెళ్లి చంపుటవలన నుదయపురమునకును బుందికిని నేటివఱకును శత్రుత్వమున్నది. అజితసింహుని కుమారుడు భీషణసింగు 1804 లో ముల్హార్రావు చేతదెబ్బలుతిని పారిపోయిన కర్నలుమాన్సనుగారికి విశేషసహాయము చేయుటవలన మరాఠాలును, పెంఢారీలును 1817వరకీ బుందిదేశమును గొల్లగొట్టుచుండిరి. 1818 లో బుందిని బ్రిటిషువారు తమయధికారము క్రిందదీసుకొని ముల్హార్రా వపహరించిన జిల్లాలను దిరిగియిప్పించిరి. 1860 లో పట్టన్ జిల్లా బ్రిటిషువారికీయబడినది. 1821 లో భీషణసింగు మృతినొందునప్పటికి పుత్రుడు రాంసింగు పదివత్సరములబాలుడు. 1830 లో కిషన్ రాంఅను మంత్రిచంపబడినందున జోద్పూరముతో దగవుసంభవించెను గాని ఇంగ్లీషువారు దానినిబరిష్కరించిరి. రాంసింగు 68 సంవత్సరము లతిదీర్ఘకాలము రాజ్యమేలెను. ఈతనికి సి. ఐ. ఇ., జి. సి. ఎస్. ఐ., సామ్రాజ్యోపదేశకుడు మొదలగు బిరుదులొసంగబడెను. ఈయన పూర్వకాలపువాడయినను అతివిశ్వాసనీయుడు. గౌరవవంతుడు. స్వచ్ఛమయిన రజపుత్రవీరుడు. 1889 లో మృతినొందగా కుమారుడు సింహాసనారోహణుడయ్యెను. ఈయనయే ప్రస్తుతపుపాలకుడు, హిస్ హైనెస్ మహారావురాజా సర్ రఘువీరసింగు బహద్దూర్ జి. సి. ఐ. ఇ., కె. సి. ఎస్. ఐ. అని పిలువబడుచున్నాడు. తనరాష్ట్రమందు సర్వస్వతంత్రాధికారములను గలిగియున్నాడు. 17 ఫిరంగిగుండ్ల గౌరవమునకర్హుడు. దేశములో 200 కాల్బలము, 100 గుఱ్ఱపుదళము, 50 శతఘ్నిసేన, 48 ఫిరంగులు, 400 పూర్వకాలపుసేన కలదు.

బుందియొక్క వైశాల్యము 2220 చదరపుమయిళ్లు. 819 గ్రామము లిందున్నవి. 1,71,250 మందిజనులున్నారు. సాలుకు మొత్తమువిూద 6 లక్షలరూపాయ లాదాయ మువచ్చుచున్నది.

---

## రీ వా.

ఈసంస్థానము పంజాబులోనున్నది. ఇదిగుజరాతుకు రాజుగానున్న వీర్థవల్ అను నతనియొక్క రెండవ కుమారుడు వ్యాఘ్రదేవునివలన స్థాపింపబడినది. ఇతనికుమారుడు బీర్భన్‌దేవు రాజ్యమేలుచున్న దినములలో హుమాయూను చక్రవర్తి షర్ ఖాన్‌వలన బారదోలబడగా సింధుదేశములోని యుమర్కోటలో దాగియుండెను. గర్భిణితోనున్న హుమాయూనుభార్యయగు చోలిబేగంభర్తతోజేరవలయునని బంగనూథురునకువచ్చెను. బీర్భందేవు అన్నివిధముల సహాయమిూమెకుజేసి తనసైన్యమునిచ్చిభర్తవద్దకు ఉమర్కోటకుబంపెను. ఇచ్చటనే చోలిబేగముకు అక్బరు పాదుషహా జన్మించెను. ఈరాజుయొక్కదయను అక్బరెన్నడును మఱచినవాడుకాడు. పెంఢారీలను రూపుమాపుటకై ఇంగ్లీషువారిరాజ్యములో జోక్యమును గలుగజేసుకొనిరి. 1857లో రాజుగానున్న రఘురాజసింగు సిపాయిల తిరుగుబాటప్పుడు బ్రిటిషువారికెక్కువ యుపకారముజేసెను. ఇతనికుమారుడు రామన్సింగు మూడుసంవత్సరముల ప్రాయముగల బాలుడయియుండగా 1880లో మృతినొందెను. మంత్రులు బాలుడు పెద్దవాడగుసంతవర కేలిరి. ఈయన 1895లో రాజ్యాధికారమును వహించెను. హిస్ హైనెస్ మహారాజా సర్ వేంకటరామన్‌సింగ్ బహదూర్ .జి. సి. ఎస్. ఐ, అనిపిలువబడుచున్నాడు. ఈయన గౌరవార్థమై గమనాగమనవేళల 17 గుండ్లుపేల్చబడును. ఇచ్చట 1140 కాల్బలము, 274 తురంగబలము, 13 ఫిరంగులు కలవు. దేశముయొక్కవైశాల్యము 3778 చతురపుమైళ్లు. 4 పట్టణములు, 5565 గ్రామములుకలవు. జనసంఖ్య 13,57,390. రాజస్వము 29,08,000రూ॥లు. ఈరాజ్యమందనేకలోహపుగనులున్నవి. అడవులవలన జాల యాదాయము వచ్చుచున్నది. రాకాసిబొగ్గు పుష్కలముగాగలదు. ప్రతిగ్రామమందును బూర్వపురాజులుకట్టిన పురాతనప్రతిష్ఠాపనములున్నవి.

## జాం న గ ర ము.

జాంనగరము లేక నవనగరము కతేవాడలోని మొదటితరగతి సంస్థానములలో నొకటి. దీనిపాలకుడు యాదవరాజపుత్రుడు. జాం రావల్ అనువానిచేత 1540లో జాంనగరము కట్టబడినది. ఒకఇంగ్లీషు సైనికోద్యోగిని జంపిన అరబ్బీవానికి శరణునొసంగినందున జాం జాసాజి అనువానిని ఇంగ్లీషువారును, ఫత్తేసింగు గాయక్వాడగారును లొంగిపోవునట్లుచేసి వానిని దమ సామంతునిగా జేసుకొనిరి. జాంరాణామల్జీ అనునతడు కోట,లఖోట అను రెండు రాజమందిరములను, జెఱువులను, 1834,1839,1846 లలో వచ్చినక్షామబాధనుండిప్రజలను దప్పించుటకైనిర్మించెను.

ప్రస్తుత జాంసాహెబుగారు క్రిక్కెట్టుఆటలో లోకప్రసిద్ధినిజెందిన రంజీత్ సింగుగారు. ఈయన 1907 లో రాజ్యాధికారమును వహించెను. జాం విభాజీకి జస్వంతసింగు అనుకుమారుడు పుట్టకముందు రంజీత్ సింగును బెంచుకొనెను. కాని స్వంతపుత్రుడు పుట్టుటవలన 1895 మొదలు జస్వంతసింగు 1907 వరకు రాజ్యమేలి మృతినొందెను. ఇచ్చట 145మంది బల్లెపుబంటులు 211 మంది సైనికులుగలరు. ఈసంస్థానము 3791 మైళ్ళ వైశాల్యమును గలిగియున్నది. 3,36,780 మంది ప్రజలున్నారు. ఆదాయము 25 లక్షలు. ఇందు 1,20,093 రూపాయలు బ్రిటిషు ప్రభుత్వమువారికిని గయక్వాడ మహారాజుగారికిని జెల్లవలయును.

## భా వ ల్పూ రు.

పంజాబులోని మహమ్మదీయ సంస్థానములలోనిదియొకటి. అమీర్ సాదిక్ మహమ్మదుఖాన్ అనునతడు 18 వ శతాబ్దమందిచ్చట రాజ్యమును స్థాపించుకొనెను. అతని కుమారుడు మహమ్మదు భావల్‌ఖాన్ భావ

ల్పూరు నగరమును గట్టెను. షా ఆలం చక్రవర్తి యీ తనికి జాల బిరుదులనిచ్చెను.

పంజాబు సింగమనబడిన రంజితసింగు తనదేశమును మ్రింగివేయునని మూడవభవాల్ఖాను 1833లోనింగ్లీషువారితో సంధిజేసుకొనెను. 1848 లో మొదటి అఫ్ఘను యుద్ధమందును, దివాన్ మూల్‌రాజ్ పయిన సిక్కుయుద్ధములలోను యీనవాబు ఇంగ్లీషువారిపక్షమున బోరాడెను. నవాబు ఫతేఖాను సిపాయిల యుద్ధమప్పుడు గొప్పసహాయము నింగ్లీషువారికి జేసెను. 1879లో కాబూలుయుద్ధమునందు నాలుగవ నవాబు సాదిమహమ్మదుఖాను ఇంగ్లీషువారికి సహాయము జేసినందునకయి జి. సి. ఎస్. ఐ. బిరుదొసంగబడెను. 1899 లో నితను మరణించునప్పటికి లాహోరు రాజకుమార కళాశాలలో జదువుచున్న నీతనికుమారునికి 16 సంవత్సరముల ప్రాయముండెను. 1903 లో నయిదవ మహమ్మదు ఖానుకు లార్డుకర్జనుగారివలన పూర్ణాధికార మొసంగబడెను. కాని దురదృష్టముచేత 1907 లో మక్కాయాత్రజేసి వచ్చుచుండగా నీతడు ఏడన్‌వద్ద కీర్తిశేషుడాయెను. ప్రస్తుతము భావల్పూరు నవాబుగారు 1904లో జన్మించిన బాలుడు. ఇప్పుడు నలుగురు మంత్రులు రాజ్యపాలనమును నడపుచున్నారు. ఈరాజుకు 19 గుండ్లకర్వతగలదు. 169 గుఱ్ఱపుదండు, 344 కాల్బలము, 1144 లొట్టిపిట్టల బలము కలదు. సంస్థానముయొక్క వైశాల్యము 17,825 చతురపుమైళ్ళు. 7,20,877 మంది జనముకలరు. ఆదాయము 34 లక్షల రూపాయలు.

---

## టోంకు దేశము.

ఈసంస్థానమందున్న ఆరుజిల్లాలలో మూడురాజపుత్రస్థానమందును మూడు మధ్యఇండియాలోనున్నవి. తాలాఖాను అనుయొకపఠాను రోహిలాసైనికునివద్ద గొలువుకు గుదిరెను. అతనిమనుమడు అమీర్‌ఖాన్ సుప్రసిద్ధుడగుజుల్వాన్రావు హోల్కారుతోజేరి దేశములను గొల్లగొట్టుచు పెంధారీలకు నాయకుడై దేశమును సంపాదించెను. ఇతనిపేరు హిందూదేశమందంతటను మోగి జనులనువణకునట్లుజేసెను. ఇతను పెంధారీదండులను విడనాడి, సైన్యమును దగ్గించుకొని ఇంగ్లీషువారికి స్నేహితుడాయెను. ఇతనిపుత్రుడు 1857లో సిపాయి అల్లరులలో నింగ్లీషువారిపక్షమునందుండి తాత్యా టోపిని నోడించెను. ఇతనికుమారుడు మహమ్మదలీఖాన్ దుర్మార్గుడైనందున రాజ్యమునుండి బ్రిటిషువారు తొలగించి కాశీలో ఖయిదీగానుంచిరి. ఇచ్చటనే 1895లో నీతడు మృతినొందెను. ప్రస్తుతపు పాలకుడు హిస్ హైనెస్ అమీనుద్దౌలావజీరుల్ ముల్కు సర్ ఇబ్రహిం అలీఖాన్ బహదూర్ దౌలత్ జంగ్ జి. సి. ఎస్. ఐ 1970 లో రాజ్యమునకు వచ్చెను. దేశమును జక్కగానే పాలించుచున్నాడు గాని అప్పుల నెక్కువగాజేసినాడు. ఇప్పటికి 14 లక్షల రూపాయ లప్పున్నది. అందువలన బ్రిటిషుపాలనా ప్రతినిధి రాజ్యపాలనములో నెక్కువ జోక్యమునుజేసుకొనిదాని నడపుచుండును. 1046కాల్బలము, 443 గుఱ్ఱపుబలము, 243 ఫిరంగిసైన్యము 82 ఫిరంగులు నున్నవి.

ఈసంస్థానముయొక్క విస్తీర్ణము 2553 చతురపుమైళ్ళు. జనసంఖ్య 21,73,000, ఆదాయము 11 లక్షల రూపాయలు.

---

## కొచ్చిను సంస్థానము.

ఇది చెన్నరాజధానికి దక్షిణభాగమందున్నది. కొచ్చినుపట్టణమును కోటను ఇంగ్లీషువారు తమవశమునందుంచుకొనుటవలనత్రిచూరులో రాజును, నాతనియుద్యోగీయులును నివసించుదురు. తొమ్మిదివ శతాబ్దమువరకిది కేరళరాజ్యములో నొకభాగముగ నుండెను. రాజులు శెట్టియార్ క్షత్రియవంశమువారు. ఈరాజ్యము కళ్ళికోట జామొరిన్ క్రిందనుండెను. తరువాత బోర్చుగీసువారు వర్తకాగారముల నిచ్చటగట్టుకొనిరి. 1776లో హైదరలీ దీనిని వశముచేసుకొని యేటేట రాజులవద్దనుండి కప్పమునుబుచ్చుకొనుచుండెను. 1791లో పెరుమాళురంబురన్ అనునతడుఇంగ్లీషువారి సార్వభౌమికత్వము నొప్పుకొనిఒక లక్షరూపాయల కప్పముగట్టుట కొప్పుకొనెను. పాలియ

తాచర్ అను మంత్రి 1808లో బ్రిటిషురాజ్య ప్రతినిధిని జంపుటకు గుట్రపన్నినందున కప్పము [2,76,000 రూపాయలకు పెంచబడి తరువాత లెండులక్షలకు దగ్గింపబడినది. ఇప్పుడీమొత్తమునే యేటేట రాజాగారు బ్రిటిషువారతనమువారికి జెల్లించుచున్నాడు. దేశము పాడుగా నేలబడుచున్నందున బ్రిటిషురెసిడెంటు 1839లో పాలనాధికారమునుబుచ్చుకొని పాలనమును బాగుచేసి తిరిగి రాజువశముచేసెను. 1853లో బాలకుడైన రవివర్మ దేశము నతి చక్కగానేలి బ్రిటిషుపరిపాలనము క్రిందనున్న దేశమువలె దనదేశమునుజేసెను. కొచ్చినులో తిరువాన్కూరునందువలెనే స్త్రీలవయిపునుండి రాజులెన్నుకొనబడుదురు. రాజ్యమేలుచున్న రాజుయొక్క మేనల్లుడు రాజ్యాధిష్ఠాతయగుచుండును. 1888మొదలు 1895 వఱకు రాజ వీరకేరళవర్మ రాజ్యమేలెను. ప్రస్తుతపురాజు హిస్ హైనెస్ రాజ శ్రీ సర్ రామవర్మ కె.సి.ఎస్.ఐ, జి.సి. ఎస్.ఐ., జి.సి.ఐ.ఇ., ఎఫ్. ఎం. యు. గారు 1895లో రాజ్యపాలకుడాయెను. ఈయనకు 17 గుండ్ల కర్మాతకలదు. పడమటికనుమ లీదేశముగుండ బోవుటవలన వర్షమధికముగా గురియుచున్నది. మహావృక్షములున్న గొప్పఅడవులుకలవు. దేశము సృష్టివైచిత్ర్యములతో నతిరమణీయముగ విలసిల్లుచున్నది. శీతోష్ణస్థితి మిక్కిలి ఆరోగ్యకరముగనుండును. టేకుకలప వలనను, కాఫీ, తేయాకు, రబ్బరుతోటలవలనను మంచి ఆదాయము వచ్చుచున్నది. సముద్రపుటొడ్డున యున్న కొబ్బరితోటలు ప్రజలను, పాలకులను మైశ్వర్యవంతముగ జేయుచున్నవి. కొచ్చిను సముద్రతీరము హార్బరులుగట్టుటకు బహు వీలుగానున్నది. చెన్నపురి దొరతనమువారికి నీజలాశయము విషయ మాలోచనలోనున్నది. దర్బారువారి స్వంతరయిలు షోరనూరునుండి ఎర్నాకులమువరకు 65 మైళ్ళదూరము నిర్మింపఁబడినది. అడవులలోని కలపను సముద్రతీరమునకు దెచ్చుటకయి 40 మైళ్ళ ట్రాముమార్గము నిర్మింపబడినది.

రాజపుత్రస్థానమందలి రాజులకున్న యధికారములు కొచ్చిన్ సంస్థానాధీశునికి లేవు. దేశశాసనము లేడు గురిచేత నాలోచింపబడి దివానుయొక్క విమర్శనముతో జెన్నపురి ప్రభుత్వమువారికి బంపబడవలయును. వారి యంగీకారము నొందినపిమ్మట రాజుగారి యనుజ్ఞనుబడసి దేశశాసనములగును. కాని దేశపాలనము నతియుత్తమముగా జఱుపబడుచున్నది. బరోడా, మైసూరు, తిరువాన్కూరులతో సమానముగ రాజ్యపాలనమున్నది. ఇందుకు గారణము రాజుగొప్ప విద్యాధికుడు, దివాను బ్రిటిషు దొరతనమువారిచే నిర్ణయింపబడు యొకరాజ్యపాలనానుభవశాలి. దేశమందు విద్య విశేషముగ వ్యాపించియుండుటవైయున్నది. ఇచ్చట 309మంది పదాతులు, 16 గుఱ్ఱపురౌతులు, 4 ఫిరంగులుకలవు. సంస్థానముయొక్క వైశాల్యము 1362 చతురపుమైళ్ళు. 659 పట్టణములు గ్రామములుకలవు. జనసంఖ్య 8,15,000. ఆదాయము 29 లక్షలరూపాయలు.

---

## కోటా.

బుందిరాజ వంశమునకుజెందిన జమట్సింయను వీరునివలన యీసంస్థానము 1625లో నేర్పఱుపబడినది. ఈతని యధికారమును మహాజహాను చక్రవర్తి యొప్పుకొనెను. ఈవంశములో నాలుగవవాడగు భీమసింగుకు మొగలాయిచక్రవర్తి మహారావు అను కితాబు నిచ్చెను. ఈతని తరువాత దుర్జనసాల్, అజితసింగు, ఛత్తరసాలు, గుమాన్ సింగులు రాజ్యమేలిరి. గుమాన్ సింగు కొమారుడు ఉమేదసింగుయొక్క బాల్యావస్థయందు రాజప్రతినిధిగనేలిన జలింసింగు మిక్కిలి సత్యవంతుడు. న్యాయవంతుడు. దేశమందు ప్రజలకు సుఖకరమయిన భూమిసిస్తుపద్ధతి నేర్పఱచి సైన్యమును యూరోపియనుపద్ధతిని తరిఫియతు చేయించెను. 1817లో నింగ్లీషువారితో సంధి నేర్పఱచుకొని వారి రక్షణత్వముక్రింద దేశమునుంచెను. జలింసింగు పెంధారీలను రూపుమాపుటకయి బ్రిటిషువారికి చేసిన సహాయమునకయి యింతదనుకను హోల్కారుక్రిందనున్న నాలుగుజిల్లాల నింగ్లీషువారిప్పించిరి. ఇవి తాను స్వంతముగా దీసుకొనక జలింసింగు కోటరాజ్యముతో గలిపివేసెను. ఇంతకుపూర్వము జాలింసింగుయొక్క రాజ

భక్తికయి బ్రి... వారు శాశ్వతముగా నీతనిసంతతివారు కోటరాజ్యపు మంత్రులుగానుండునట్లుగనేర్పాటు చేసిరి. రాజునామకార్థము ఉమేదసింగు. రాజ్యపాలకుడు జాలింసింగుగా జరుగుచుండెను. ఉమేదసింగు మరణానంతరము కిషోరసింగు రాజ్యమెక్కె. జాలింసింగుయొక్క సర్వాధికారముక్రిందనుండుట కొప్పుకొనకుండెను. ప్రజలు కిషోరసింగుపక్షముననుండిరి. బ్రిటిషువారు జలింసింగుచేతిక్రింద మహారాష్ట్రుండవలయునని పట్టుపట్టిరి. ఇంగ్లీషుసేన మహారావు కిషోరసింగును మాంగ్రల్ వద్ద నోడించుటచేత నసహ్యమువలన నాతడు మేవారలోని నాతద్వారకు వెళ్ళిపోయెను. తరువాత జలింసింగు సంధిచేసుకొని తనరాజును పిలిపించి రాజ్యమెక్కించెను. 1824లో జలింసింగు మృతినొందినతరువాత వట్టి అసమర్థుడగు నాతని కుమారుడు మాధవసింగుముఖ్యమంత్రియయ్యెను. ఇతనితరువాతనాతనికుమారుడు మదనసింగు ముఖ్యమంత్రియు, రామసింగు మహారాజుయునగుట 1828లో తటస్థించెను. పూర్వపుకలతలు తిరిగి అంకురించినవి. వంశపారంపర్యము రాజు మంత్రులేర్పడుట తగవులకు గారణమాయెను. అప్పుడింగ్లీషువారు కోటరాజ్యమునుండి 17జిల్లాలను విడిచేసి వానిని మంత్రి మదనసింగునకిచ్చివేసి దానికి ఝూలావ్వారు రాజ్యమని పేరుపెట్టి అతనిని రాజుగాజేసిరి. రామసింగు తదనంతరము ఛత్రసాలుకోట రాజ్యాధీశుడాయెను. ఈతని పాలనమందు దేశస్థితి కడు శోచనీయముగానుండుటవలన నవాబు ఫయిజలిఖాన్, బ్రిటిషురాజ్య ప్రతినిధులవలన నింగ్లీషువారు దేశమునేలించి ఋణములనుదీర్చివేసి మంచిస్థితికి సంస్థానమునుదెచ్చిరి. 1880లో ఛత్రసాలకుమారుడు ఉమేదసింగు రాజ్యపాలకుడాయెను. ఈయన అజ్మీరులోని మేయోకళాశాలలో విద్యగరచెను. 1892లో రాజ్యపాలనాధికార మొసంగబడియెను. 1901లో కె.సి.ఎస్.ఐ., 1907లో జి.సి.ఎస్.ఐ., అను బిరుదులొసంగబడి ఆనరరిమేజర్ యను గౌరవబిరుద మొసంగబడెను. ఈయన పాలనమందు జరిగిన ముఖ్యాంశమేదియనగా ముఖ్యమంత్రి జాలింసింగు సంతతివారి కొసంగబడిన 17 పరగణాలలో 15 పరగణాలను దిరిగి 1899వ సంవత్సరము 1వ జనవరి తేదిన ఇంగ్లీషువారు కోటసంస్థానమున కిచ్చివేసిరి. ఇందువలన ఝూలావ్వారురాజ్యము రెండుపరగణాలను మాత్రమె కలదాయెను. హిజ్ హైనస్ మహారాజాధిరాజ మహి మహేంద్రమహారావు రాజా మేజర్ శ్రీ ఉమేద సింగు బహదూర్ జి.సి.ఎస్.ఐ, కె.సి.ఎస్.ఐగారికి 17గుండ్ల కర్వాతకలదు. ఈయన పరిపాలనముక్రింద కోటరాజ్యము రాజపుత్రస్థానమందున్న స్వదేశసంస్థానములలో నగ్రగణ్యమయిన స్థితిని వహించియున్నది. ఇచ్చట 7913 సైన్యముకలదు. ఇందు 6650 కాల్బలము, 910 గుర్రపురౌతులు, 353 శతఘ్నిసేన 193 ఫిరంగులుకలవు. ఈదేశముయొక్క వైశాల్యము 5684 చతురపుమైళ్లు. 2618 గ్రామములు పత్తనములుకలవు. జనసంఖ్య 6,37,834 ఆదాయము ౫౩లక్షల రూపాయలు.

---

# భరతపురము.

ఈరాజ్యపు పాలకులు సింసిన్వా తెగకుజెందిన జాటుకులజులు. ఔరంగజేబుకు సమకాలికుడుగనున్న బ్రిజు అనునతడీ రాజ్యమును స్థాపించెను. ఈబ్రిజుని తరువాతివారలలో నేడవవాడు శూరరమణుడు మొగలాయిదేశముపై దండెత్తగా జయపురపురాజు సవైజయసింగీతనిమీదికిబంపబడెను. ఇంతలోసంధిచేయబడుటవలనయుద్ధమాగిపోయెను. తరువాత మోఖంసింగు, బదన్సింగులు రాజ్యమేలిరి. బదన్సింగుకుమారుడు సూరాజ్మల్లుని కాలములో దేశము విస్తారముగావ్యాపించెను. ఇతని కుమారుడు జవాహరిసింగు ధైర్యవంతుడైనను అసమర్థుడు. ఆగ్రాలోని రాచనగరునందున్న జహంగీరుయొక్క నల్లని చలువరాతి సింహాసనముమీద కూరుచుండుట యితనికెక్కువ ముచ్చటగానుండెను. ఇచ్చటనే 1768వ సం॥రం జూన్ నెలలో నీతడు చంపబడెను.

1803లో భరతపురపురాజు రంజితసింగు ఇంగ్లీషువారితో సంధినేర్పఱచుకొని ఆగ్రాను ముట్టడించుటయందు వారికి సహాయముచేయుటకయి తనసేనను బంపినందున ఇంగ్లీషువారతనికి 5 క్రొత్త జిల్లాలనొసంగిరి. కాని మహారాష్ట్రులతో యుద్ధము లింగ్లీషువారికి జరిగినప్పుడు

రంజితసింగు యశ్వంతరావు హోల్కారుతో జేరగా నోడింపబడి యిదివరకీయబడిన అయిదుజిల్లాలును లాగుకొనబడి పదునాలుగులక్షలరూపాయలు చెల్లించునట్లుచేయబడెను. రంజితసింగుని మరణానంతరము రాజ్యమును సంపాదించుటకయి దుర్జనసాలు యత్నించగా లార్డుకంబరుమియరు భరతపురమును ముట్టడించి ఔరసుడగు బల్దేవసింగుకు 18 5లో రాజ్యమిప్పించెను. దుర్జనసాలు ఖయిదీగా పట్టుకొనబడి, అలహాబాదులో నుంచబడెను. బలవంతసింగు తరువాత 1835 మొదలు 1853వరకును మహారాజ జస్వంతసింగు బాగుగా రాజ్యమేలెను. ఇతనికుమారుడు రాంసింగు 1893లో రాజ్యమునకు వచ్చినను క్రూరుడగుటవలన అధికారమీయబడక 1900లో రాజ్యాధిపత్యమునుండితొలగింపబడెను. 1899లో బుట్టినకిషన్‌సింగునుయితనికుమారుడిప్పుడు రాజ్యాధికారిగానున్నాడు. ఇప్పుడు రాజప్రతినిధిసభ రాజ్యమునేలుచున్నది. హిస్ హైనెస్ మహారాజా శ్రీ బ్రజేంద్రసవై కిషన్‌సింగ్ బహదూర్ జంగను బాలరాజుయొక్క గౌరవార్థమై గమనాగమనవేళల 17గుండ్లు కాల్చబడుచుండును. ఇచ్చట 625 సైన్యము 82 ఫిరంగులుకలవు. దేశవైశాల్యము 1932 చతురపుమైళ్లు. జనసంఖ్య 6౽లక్షలు. ఆదాయము 31లక్షల రూపాయలు.

---

## బొబ్బిలి.

బొబ్బిలియొక్క సుప్రసిద్ధచారిత్రము నెఱుగని ఆంధ్రులుండరుగాన దానినిచ్చట వ్రాయుటయనవసరము. ఈజమీయొక్క ఆదాయము 5 లక్షలరూపాయలు. దొరతనమువారికి జెల్లింపవలసిన పేష్కష్ 83,652 రూపాయలు. ప్రస్తుతపు జమీదారు మహారాజ సర్ వేంకటశ్వేతచలపతి రంగారావు కె. సి. ఐ. ఇ; జి. సి. ఐ. ఇ గారు చెన్నరాజధానియం దెల్లెడలను గొప్పకీర్తిని వహించియున్నారు. ఇంగ్లండుకువెళ్లివచ్చిరి. చెన్నపురి శాసననిర్మాణసభలో సభ్యులుగనుండిరి. నూతన రాజ్యాంగసంస్కరణములు జఱిగినప్పుడు చెన్నపురి గవర్నరుగారికి కార్యనిర్వాహక సభ్యులుగా నిర్ణయింపబడి ఆయుద్యోగమును జేయుటలో గొప్పశక్తిసామర్థ్యములను జూపిరి. తమజమీని చక్కగా పాలించుచున్నారు. జార్జిసార్వభౌముడు ఢిల్లీలో వీరికి జి. సి. ఐ. ఇ. అను గొప్పబిరుదిచ్చి అంకితులనుగజేసిరి. బొబ్బిలి తహసీలుయొక్క వైశాల్యము 263 చతురపుమైళ్లు. 167 గ్రామములుగలవు. 1901 లో నిందు 1,33,577 మంది జనులుండిరి. బొబ్బిలిపట్టణములో రెండువైద్యశాలలు గలవు. ఇందొకటి స్త్రీలకొరకుంచబడినది.

---

## వెంకటగిరి.

ఈ జమీందారిలో పోలూరు, వెంకటగిరి, పొదిలి దర్శి తహశ్శీలులు, గూడూరు, కనిగిరి, వంగవోలుతాలూకాలలో 176 గ్రామములు యున్నవి. మహారాజ సర్ వెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణయాచమేంద్ర బహదూర్ కె సి. ఎస్. ఐ. గారు ప్రస్తుత జమీందారుగారు వీరికాంధ్రభాషయందు మంచిపాండిత్యమున్నది. ఆంధ్రభాషాపోషకులు. చెన్నపురి భూస్వాముల సమాజమునకధ్యక్షులు ఈజమీనుకు 8లక్షలరూపాయలాదాయమువచ్చుచున్నది.

---

## విజయనగరము.

ఇది చెన్నరాజధానియందున్న గొప్పజమీందారీలలో నొకటి. బొబ్బిలివారికిని విజయనగరమువారికిని గల వైరములు చరిత్రప్రసిద్ధములు. కీర్తిశేషులయిన ఆనంద గజపతి మహారాజుగారు మద్రాసు రాజధానియందంతట ను పేరు మ్రోగినవారు. ఈభూమి 3000 మైళ్ళ విస్తీర్ణమునుగలిగియున్నది. ఆదాయము 25 లక్షలు. ఇందు 5 లక్షలు పేష్కష్‌గా జెల్లింపబడుచున్నది. విజయనగరం రాజుగారు ఉత్తర సర్కారులలో జమీందారుల పక్షమున చెన్నపురి శాసననిర్మాణసభ్యులుగ నున్నారు. విజయనగరం రాజులు దానధర్మములకయి గొప్పకీర్తినివహించినారు.

## కిషన్ ఘరు.

యోధపురపురాజు యుదయసింగుయొక్క తొమ్మిదవ కుమారుడు కిషన్‌సింగువలన నీసంస్థానము స్థాపింపబడినది. ఈకిషన్‌ఘురుయొక్క పాలకులు మొగలాయి చక్రవర్తులపక్షమున బోరిరి. తరువాత మహారాష్ట్రులు ప్రాబల్యము నొందినకాలదిని వారిలోజేరిరి. 1818 లో కళ్యాణసింగు ఇంగ్లీషువారితో సంధి నేర్పఱచుకొనెను. ఇతనికుమారుడు సర్దారుసింగు 1880లో రాజ్యమెక్కెను. ఇతడు బహుబాగుగా దేశమేలెను. ప్రకృతపు పాలకుడు కెప్టన్ హిస్ హైనెస్ మహారాజాధిరాజ సర్ మదనసింగుబహదూర్ కె. సి. ఐ. ఇ. గారు సర్దారుసింగుయొక్క కుమారుడు. ఈదేశము 858 చతురపుమైళ్ళును 1,25,516 మంది ప్రజలను, 4,09,868 రూపాయ లాదాయమును గలిగియున్నది.

---

## దాతియ సంస్థానము.

ఇదిబుందేలుఖండులోని సంస్థానములలో నొకటి. హేమకరణుడను కాశీమహారాజు రాజ్యమునుండి దొలగింపబడగా బిందువాసినియను దేవతనారాధించి రాజ్యమును దిరిగి బడయుటకయి యత్నించెను. కాని దేవిప్రసన్నముకాలేదు. అందువలన దనశిరమును దేవికి బలిగానిచ్చుటకయి సంసిద్ధుడయి కోసుకొనుట కారంభింపగా నామాతప్రత్యక్షమయి నీసంతతివారు వేయిసంవత్సరములు రాజ్యమేలెదరని వరమిచ్చెను. ఆసమయమందు భూమిమీదబడిన రక్తబిందువులు. లేక "బుందేలు" లవలన నీతని సంతతివార్లు రాజ్యమేలిన భూమికి బుందేలుఖండు అనుపేరువచ్చెను.

దాతియరాజులు అనాదినుండియు పౌరుషతేజోవంతులని యశముగాందినవారు. వీరందరును 1676 మొదలు మొగలాయి చక్రవర్తుల కొలువులోనుండి వారివలన జాగీరులను ధనమును గౌరవములను బొందుచుండిరి. వీరిలో శుభకరణుడను వాడు 22 యుద్ధములలో బోరెను. బిజాపూరు గోలకొండ యుద్ధములలో బోరినందున కయి దలపత్రావు అనురాజుకు మొగలాయిచక్రవర్తిని యొక్క ఛోందెక్ లేక పాలకి బహుమతిగానొసంగబడెను. ఇందిప్పటికిని దాతియారాణీలు ప్రయాణముజేయుచు గొప్పసంశోధనముగా నాపాలకిని గాపాడుకొనుచున్నారు. 1803వ సం॥ 15వ మార్చి తేదిన రాజాపారీషత్ అనునతడు బ్రిటిషువారితో సంధిజేసుకొని మహారాష్ట్రులమీద బోరుటకును, భరతపురపు ముట్టడియప్పుడును బ్రిటిషు వారికి సహాయముజేసెను. 1902లోకర్జనుప్రభువు యీసంస్థానమునువెళ్ళి దర్శించెను. 1905లో ఇందూరునందు యువరాజుగావచ్చిన జార్జిచక్రవర్తిగారి దర్శనము నీదేశపురాజుచేసుకొనెను. ప్రకృతపు పాలకుడు హిస్ హైనెస్ మహారాజ లోకేంద్ర గోవిందసింగు బహదూర్జికేవులో 21వ ఆగస్టు 1907లో రాజ్యాధిష్ఠాతయయ్యెను. ఇతనికి 26 సంవత్సరములవయస్సు. దేశభాషలలో మంచిపాండిత్యముకలదట. మంచివేటకాడు. 20 పులులను నాలుగువత్సరములలో జంపెను. ఇతనికి 15 గండ్లకధికారము కలదు. "ధైర్యవంతులలో శిరోమణి. శరణాగతపోషకుడు" అను దాతియవంశజులకు గౌరవములు కలవు.

ఈమహారాజుగారు దేశమును బాగుగా బాలించుటలేదనిమూడుసంవత్సరములవరకు తమక్రిందనుంచుకొనునపుడు బ్రిటిషువారు దేశమును గతించినడిసంబరు నుండి వశముచేసికొనిరి. ఈయన డేరాడూనులో నొకసైనికోద్యోగిక్రింద నుంచబడినాడు. జనులకిది కంటకమును గలిగించినది. డిల్లీదర్బారున కాహ్వానింపబడెను. ఇతని శిబిరముగూడ సిద్ధమాయెను కాని దర్బారుకు తరువాత రావలదనిరి.

---

## జంఖండి.

ఈసంస్థానము బొంబాయిరాజధానిలోని బెల్గాము, బిజాపూరు, ధార్వార జిల్లాలలోనున్న కొన్నిగ్రామములు కలుపబడి యేర్పాటుపబడినది. 524 చతురపు మైళ్ళవైశాల్యమును, 1,05,357 జనసంఖ్యను 8 లక్షల రూపాయల ఆదాయమును గలిగియున్నది. ఈజంఖండి రాజునకు పూర్ణమైన సివిలుక్రిమినలు అధికారములుకలవు.

దక్షిణమహారాష్ట్రదేశమందు పట్వర్ధనులను బ్రాహ్మణరాజులుకలరు. ఈవంశము 1808లో జీలిపోయి కొందరు మిరజు కధిపతులయిరి. పరశురామభావుయొక్కబిడ్డలు విడిపోయి జ్యేష్ఠుడు రామచంద్రరావు జంఖండి కధిపతియయ్యెను. రెండవవాడు తాలస్గాముకు పాలకుడాయెను. రామచంద్రరావు కొమారుడు గోపాలరావు 1840లోమృతినొందగానతనికుమారుడురామచంద్రరావు అప్పాసాహెబు ఎస్టేటున కధిపతియయ్యెను. ఇతడు 1896 వఱకేలెను. ప్రకృతపుపాలకుడు పరశురామరావు లేక భావుసాహెబు పట్వర్ధన్ అనునతనికి పూర్ణాధికారమును 1903లో నొసంగబడెను.

ఈఎస్టేటు 20,515 రూపాయల నేడాదికి క్రమముగా నింగ్లీషు దొరతనమువారికి జెల్లించును.

---

# జంజీరా.

ఈసంస్థానము పశ్చిమతీరమందు బొంబాయినగరమునకు సామీప్యమున కొలాబాజిల్లాలోగలదు. ఇదిమహమ్మదీయరాజ్యము. అహమ్మదు నగరపు మహమ్మదీయరాజులక్రిందను, ఢిల్లీ పాదుషహాలక్రిందను యిదియుండి వారిప్రతినిధులచేత నేలబడుచుండెను. మహారాష్ట్రుల యధికారము ప్రబలిన తరువాత నెన్నియోపర్యాయములు దనవశము జేసుకొన జూచిరికాని పాలకులగు సిద్దీలు తమస్వాతంత్ర్యమును గాపాడుకొనుచునేయుండిరి. కాని షేక్జీయను యొక సుబేదారు ద్రోహి పేష్వాలతోచేరి సిద్దీరాజును లొంగదీయించెను. అప్పుడు తాలనిజాంపూరు, ఘోసల, బిర్వాడి, గోరెగాం మహాలులను సిద్దీరాజు పేష్వాలకీయవలసినవాడాయెను. 1833 లో యీసంస్థానమింగ్లీషువారితో సంధినేర్పఱచుకొని అప్పటినుండియు వారిక్రిందనున్నది.

ప్రకృతపాలకుడు హిస్ హైనెస్ నవాబ్ సిది సర్ అహమ్మదుఖాన్ సిది ఇబ్రహింఖాన్ జి. సి. ఐ. ఇ. 1883 లో పూర్ణాధికారముల నొసంగబడియెను. ఇతనికి 11 ఫిరంగిగుండ్ల కధికారముకలదు. ఈయన రాజకోటలోని రాజకుమార కళాశాలలో విద్యగఱచెను. పునాలో సివిలు క్రిమినలు లాను కొంతకాల మభ్యసించెను. ఇతను తన హిందూ మహమ్మదీయ పాలితులవలన నెక్కువగా ప్రేమింపబడుచున్నాడు. దేశములో మంచి సంస్కరణములనుజేసి యోగ్యమయిన స్థితియందుంచియున్నాడు.

ఈసంస్థానము 324 చతురపుమైళ్లుకలది. 284 గ్రామములున్నవి. 85,420 మంది ప్రజలున్నారు. ఆదాయము 5½ లక్షల రూపాయలు.

---

# ముధోలు.

ఇది బొంబాయిరాజధానిలో నున్నది. భహామిని రాజులవద్ద 7000 గుఱ్ఱపు పటాలముల కధిపతులగు ఘోర్పడెవంశపు క్షత్రియులీ రాజ్యమును 1551 లో నేలుచుండిరి. 1660 లో బిజాపూరురాజులు శివాజిపయిన దండెత్తినప్పుడు ముధోలురాజు బాజిరావు ముందుగా పెద్దసైన్యమును వదలివచ్చుచుండెను. ఈసంగతిని గనిపెట్టిన శివాజి రాత్రివేళ తనసంసారముతో నిదిరించుచున్న బాజిరాజుని బిడ్డలసయితముగా జంపివేసెను. అంతట వారున్న యింటికి శివాజినిప్పంటించెను. అందువలన శివాజి వంశపువారగు కోల్హాపురమురాజులకును, ముధోలుపాలకులకును శత్రుత్వమేర్పడి 1862 వఱకు నిలిచియుండెను. ఈసంవత్సరమందు ముధోలు ప్రస్తుతపురాజుగారి అత్తయొకతె కోల్హాపురం రాజుయొక్క పెత్తండ్రి కుమారునకిచ్చి పెండ్లిచేయబడి విరోధము తుదముట్టింపబడెను. డక్కనులో మొగలాయిరాజుల యధికారమంతమొందిన పిదప ముధోలురాజు పేష్వాలక్రింది సామంతుడగునట్లు చేయబడెను. మాలోజిరాజు తనకుమారులు మంక్రోజి, రాణోజీలతో 1779 తో మహారాష్ట్రులతోజేరి ఇంగ్లీషువారిపైబోరెను. ఖరదయుద్ధమందు మాలోజిరాజు జ్యేష్ఠపుత్రుడు గోవిందరావెదురుపక్షమున నుండగాబోరి కుమారుని గాయపఱచెను. మాలోజితరువాత మల్హారిరావు నారాయణరావు, వెంకటరావులు రాజ్యమేలిరి. 1854 లో వెంకటరావు బ్రిటిషువారితో సంధినేర్పాటు చేసుకొనెను. తరువాత బలవంతరావు, రెండవ వెంకటరావు 1896 వరకు రాజ్యమేలిరి.

ప్రకృతపు రాజాసాహెబుగారు 1884లో జన్మించిరి. 1904 లో పూర్ణాధికారములబడసెను. దేశమును మంచివృద్ధిలోనికి దెచ్చుచున్నాడు. 9 ఫిరంగిగుండ్ల కర్హత కలదు.

## పిఠాపురము.

ఇది గోదావరి జిల్లాలోనున్న యొక గొప్పజమీను. ఆదాయము పండ్రెండులక్ష రూపాయలు. ప్రస్తుతప్రజమీందారు రాజాశ్రీరావు వేంకటమహీపతి సూర్యారావు బహదూర్ గారు చెన్నపురివిశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షలో కృతార్థత నొందిరి. 27 సంవత్సరములు వయస్సున్నది. వీరాంధ్రదేశమందు మహాదాతయని సుప్రసిద్ధిని గాంచినట్టివారు. ఇప్పటికయిదారు లక్షలరూపాయలను బహిరంగముగ నాలుగయిదు వత్సరములలో దానముచేసియున్నారు. గుప్తదానములనంతటి శ్రీవారే యెఱుంగవలయును. కాకినాడపురములో అనాథశరణాలయమును స్థాపించిరి. కాకినాడ కళాశాలను మంచిస్థితికి దెచ్చిరి. ఆంధ్రసాహిత్యపరిషత్తునకు 30,000 రూప్యములొసంగిరి. ఏసత్కార్యమయినను శ్రీరాజావారి ఆదరపోషణములను బడయకపోదు. ఈయన సంఘసంస్కర్త. ప్రతిజమీందారుని యింటనుండి విశేషసద్వ్యయమునకు కారకులగు పనికిమాలిన దాసదాసీజనంబులను దీసివేసి సంస్కరణమునకు దోడ్పడిరి. కాకినాడలో కొద్దికాలముక్రింద స్థాపింపబడిన ఆంధ్రబ్రహ్మసమాజమతవ్యాపకులకు ధనసహాయము నొనరించుచు ఆస్తికమతవ్యాపకమునకు దోడ్పడుచున్నారు. ఆంధ్రదేశమందు సాయములేక దుస్థితియందున్న అనేకబ్రహ్మసమాజములకు శ్రీరాజాగారు ధనసహాయము చేయుచున్నారు. ఆంధ్రదేశమునకు గొప్పయుపకారములు శ్రీవారివలన జేయబడగలవు. పరమేశ్వరుడు వీరికిని వీరికుటుంబమునకును దీర్ఘాయురారోగ్యములనొసంగి రక్షించునుగాక.

---

## సావంత్వాడి.

ఇది బొంబాయిరాజధానిలో కొంకణమందున్నది. పాలకులు స్వావంతభోంస్లేలు. వీరు బిజాపూరు, మొగలాయిరాజులక్రిందను, శివాజి, షాహు, పేష్వాలక్రిందను, తరువాత ఇంగ్లీషువారి క్రిందికిని వచ్చిరి. వీరు సముద్రపు దొంగతనములకు పూర్వము ప్రసిద్ధులైయుండిరి. వైశాల్యము 925 మైళ్ళు. జనసంఖ్య 2,17,732. ఆదాయము 4½ లక్షలు. ప్రకృతపాలకుడు శ్రీరావు సావంత భోంస్లేరాజా బహదూర్ సర్ దేశాయిగారి గౌరవార్థమై గమనాగమన వేళల 9 గుండ్లు కాల్చబడుచుండును.

---

మూర్షిదాబాదుజమీను:— వంగదేశమందున్నది. ఈనవాబులు చిరకాలమునుండి దానధర్మాదులకు సుప్రసిద్ధులు.

---



## అక్కలకోట.

ఈసంస్థానపురాజులు భోంస్లేవంశమునకు జెందిన క్షత్రియులు. ఇది బొంబాయిరాజధానిలో సతారాజిల్లాలోనున్నది. పదిసంవత్సరముల యీడుగల రాణోజియను నతడు షాహురాజు పక్షమునబోరి భిల్లులనోడించి సంమసకును, కోల్హాపురం, తిరుచనాపల్లి, బండేల్ఖండు, భాగానగరపు యుద్ధములలో షాహురాజుపక్షమున బోరినందునకును ఫత్తేసింగు (లేక జయసింహుడు) అను బిరుదునుబడసి అక్కలకోటకధిపతిగ జేయబడెను. ఇతను 1749 లో మరణించగా భార్యలు అహల్యాబాయి గుజాబాయిలు సహగమనమును జేసిరి. తరువాత మొదటి షహాజిరాజు, రెండవ ఫత్తేసింగు, మొదటి మాలోజిరాజు, రెండవషహాజిరావులు రాజ్యమేలిరి. 1849 లో సతారజిల్లా ఇంగ్లీషువారి వశమయినప్పుడు రెండవ షహాజీరాజుకూడ వారి సామంతుడాయెను. ఇతని కుమారుడు రెండవ మాలోజిరావు దేశమును బాగుగ నేలనందున ఇంగ్లీషువారు 1866 మొదలు 1891 వరకు దానిని తమ వశమునందుంచుకొనిరి. తరువాత మూడవ షహాజిరాజు బిడ్డలులేక మృతినొందగా రాణి లక్ష్మీబాయి కుడ్లాభోంస్లే వంశమునుండి యొకబాలకుని 1898 లో దత్తుపుచ్చుకొనెను. ఈబాలకునికిప్పుడు 17 సంవత్సరముల ప్రాయము. రాజకోటలోని రాజకుమారకళాశాలలో విద్యనభ్యసించెను. కోల్హాపురములో నొక యింగ్లీషుద్యోగియుక్రింద రాజ్యపాలనావిధానమును నేర్చుకొనుచున్నాడు.

ఈసంస్థానముయొక్క వైశాల్యము 5000 చదరపు మైళ్లు. 103 గ్రామములున్నవి. 90,000 మంది ప్రజలున్నారు. 4,16,000 ఆదాయము వచ్చుచున్నది.

---

## మిరజ్ జ్యేష్ఠశాఖ.

ఈజాగీరు దక్షిణమహారాష్ట్రదేశమందున్నది. హరిభట్టు పట్వర్థన్ అనునతడీ వంశస్థాపకుడు. ఇతని కొమారుడు గోవిందరావుకు మిరజ్కోట 1767 లో మాధవరావు పేష్వావలన నొసంగబడెను. అన్నదమ్ములు జాగీరును పంచుకొనినప్పుడు మిరజ్ జ్యేష్ఠ, కనిష్ఠ యని రెండు

శాఖలాయెను. 1849 లో పాలకుడయిన గంగాధరరావు బాలాసాహెబు సిపాయి కలహములప్పు డింగ్లీషువారికి గొప్పసాయమొసరించెను. ఇతను త్రింబకరావు అప్పాసాహెబును పెంచుకొనెను. ఈదత్తపుత్రుడు 1871లో బొంబాయి శాసననిర్మాణసభాసభ్యుడాయెను. ఇతని మరణానంతరము భార్య బిడ్డలులేనందున సాంగ్లిరాజుయొక్క మనుమనొకని పెంచుకొనెను. ఇతను రాజకుమార కళాశాలలో రాజకోటయందు విద్యనభ్యసించినాడు. పేరు గంగాధరరావు బాలాసాహెబు. ఇతనిని మొదటితరగతి సర్దారని పిలిచెదరు. ఈజాగీరుయొక్క వైశాల్యము 3389 చతురపుమైళ్లు. జనసంఖ్య 8౽,343. ఆదాయము 3,50,000. ఇందు రూ.12,577 గవర్నమెంటువారికికప్పముగా జెల్లును.

## మిరజ్ కనిష్ఠశాఖ.

దీని హరిభట్టుయొక్క మనుమడు గంగాధరరావుయొక్క కుమారులిద్దరిలో మొదటివాడు నారాయణరావు కుమారుడు గణపతిరావుయొక్క బాల్యావస్థయందు పినతండ్రి మాధవరావు పరిపాలించెను. తరువాత లక్ష్మణరావు అన్నాసాహెబు చేతిలోనికి జాగీరువచ్చెను. ఇతడు 1,70,769 రూపాయల అప్పునుతీర్చివేసి జాగీరును మంచిస్థితియందుంచెను. ఇతను సిపాయిల కలహము లప్పుడు మంచిసహాయమును దొరతనమువారికిజేసెను. ప్రస్తుతపు సర్దారు మాధవరావు బాబాసాహెబను నతడు 1908 లో పాలకుడాయెను. ఇతనికి క్రిమినలుసివిలు అధికారము లున్నవి. ఈజాగీరు 211 చతురపుమైళ్ళ వైశాల్యమును, 35,5౽0 జనులను, 2,25,000 ఆదాయమును గలిగియున్నది. ఇందు 6412-8-0 బ్రిటిషుదొరతనమువారికి కప్పముగా జెల్లింపబడుచున్నది.

హిల్‌తిప్పరసంస్థానము:— అస్సాములోనున్నది. ఈమహారాజా డిల్లీదర్బారున కాహ్వానింపబడెను.

కపూరతల్ల మహారాజుగారు:— డిల్లిదర్బారున కాహ్వానింపబడెను. ఈయన పేరు జగత్‌జిత్సింగు. తనవిశ్వాసముచేత ప్రసిద్ధుడాయెను. బహుబీదస్థితి ననుభవించెను. తరువాత మహారాజాయెను. ఈసంస్థానము పంజాబులోని సిక్కుసంస్థానములలో నొక్కటి.

సిక్కిము:— హిమాలయ పర్వతములలోని యొకస్వదేశ సంస్థానము. రాజు బౌద్ధుడు. ఈయనడిల్లి దర్బారున కాహ్వానింపబడెను.

రాంపూరు సంస్థానము:— సంయుక్తరాష్ట్రములలోనున్నది. ఈనవాబుగారు మహమ్మదీయనాయకులలో నొక్కరు. జార్జిచక్రవర్తిగారికి ఏడికాంగుగ నియమింపబడెను.

## పన్నా.

బండేలుఖండులోని సంస్థానములలో పన్నాయొకటి. ఇది 1732 లో హర్దేసుఅను బండేలు రాజపుత్రుని వలన స్థాపింపబడెను. ఇందు సుప్రసిద్ధములైన వజ్రపుగనులున్నవి ఈసంస్థానము 2492 చతురపుమైళ్లను 192286 మంది ప్రజలను, 5 లక్షల ఆదాయమును గలిగియున్నది. ప్రకృతపురాజు 1893లో జన్మించెను. అజ్మీరములోని మేయోకాలేజిలో విద్య నభ్యసించుచున్నాడు. ఈయన హిస్‌హైనస్ మహారాజ మహేంద్ర యాదవేంద్రసింగు బహదూర్ అని పిలువబడుచున్నారు. 11 ఫిరంగి గుండ్ల గౌరవమునకర్హుడు.

ఆనెగుండిసంస్థానము:... బళ్లారిజిల్లాలోనున్నది. ఈపాలకులు కృష్ణదేవరాయల వంశజులు. ఆంధ్రభాషాపోషకులు. ప్రకృతపురాజుగారు విద్యావంతులు. దానధర్మపరులు.

గురజ జమీను:— కృష్ణాజిల్లాలోనున్నది. ఈజమీందారులు విద్యాపోషకులు దానధర్మములను గొప్పగాజేయుచుండినవారు.

### అలీ ఇమాంగారు

ఈయనరాజప్రతినిధిగారికి న్యాయాంగమంత్రి. సత్యేంద్ర ప్రసన్న సింహాగారితరువాత నీయుద్యోగమునకు నిర్ణయింపబడెను. మహమ్మదీయనాయకులలో నొకరు.

## బనగానపల్లి.

బనగానపల్లి కర్నూలుజిల్లా కలక్టరును పొలిటికలు ఏజెంటుగాగలిగిన యొకచిన్న మహమ్మదీయ స్వదేశసంస్థానము. ఇది 255 మైళ్ళ విస్తీర్ణమును గలిగియున్నది. ఇచ్చటి బంగారపు గనులు యీమధ్యకనుగొనబడినవి. ఇచ్చట 63 గ్రామములున్నవి. 1901 లో 32,264 మంది ప్ర

జిఘుండెగి. ఇందు 25,736 మంది హిందువులు. ఆంధ్రులు. 6232 మంది మహమ్మదీయులున్నారు. ఈ దేశమును పాలించుచున్న నవాబు అలీఖాన్‌గారు ఢిల్లీ దర్బారున కాహ్వానింపబడిరి. దేశము మంచి స్థితికి దీసుకొనివచ్చుచున్నారు. 1904-1905లో యీదేశపు రాబడాయము 96,000 రూపాయలు. అందు 62,500 నవాబుగారి గృహ వ్రయములకును, 23,100 ఎస్టేటు యుద్యోగీయులకును, 12,000 సింధనుదారు కును వ్రయమయినది. విద్య మిక్కిలి దుస్థితియందున్నది.

### మయూర్భంజి మహారాజు.

కేశవచంద్రసేనుని రెండవ అల్లుడు విద్యావంతుడు. పరిశ్రమికాభివృద్ధికై ఎక్కువగా పరిశ్రమను చేసినవాడు. ఈయనవ స్థానమునందు తాతా ఉక్కు పరిశ్రమనుగావించిన ఇనుముగనులు దొరికినవి రెండుమూడుమాసముల క్రిందట కలకత్తాలో మృతినొందెను.

### పండితవిష్ణునారాయణ ధర్ గారు.

1911లో కలకత్తాలో జరిగిన దేశీయమహాసభ కధ్యక్షుడుగ నుండెను. బ్యారిష్టరు సంఘసంస్కర్త దేశసేవకుడు.

### కీర్తిశేషులయిన కృష్ణస్వామయ్యగారు.

వీరిచరిత్రపూర్తిగా నాంధ్రపత్రికయందు వ్రాయబడెను. న్యాయవాది. దేశీయనాయకుడు. హైకోర్టుజడ్జి. కార్యనిర్వాహక సభ్యులు. లక్షలకొలది రూపాయలను దానముజేసినవాడు.

### గౌరవనీయులగు అట్కిన్సను సి. ఎస్. ఐ. గారు.

వీరు చెన్నపురిగవర్నరుగారి కార్యనిర్వాహకసభ్యులలో రెండవవారు 30 సంవత్సరములనుండియు చెన్నరాజధానిలో నుద్యోగము జేయుచున్నారు. కృష్ణాజిల్లాలో నెక్కువ జనప్రీతినిగడించిరి.

### గౌరవనీయులగు న్యాయపతిసుబ్బారావుపంతులుగారు.

ముప్పదిసంవత్సరములనుండియు దేశసేవను జేయుచున్నవారు. ఆంధ్రదేశమందు సుప్రసిద్ధులు న్యాయవాదిగను, చెన్నపురి శాసననిర్మాణ సభ్యుడుగను నుండెను.

మూడుసంవత్సరములనుండియు సార్వభౌమిక శాసననిర్మాణ సభలో చెన్నరాజధానిపక్షమున సభ్యులగనున్నారు.

గౌ॥ మజారుల్ హక్కు గారు మహమ్మదీయుడు:— బారిష్టరు బేహారురాష్ట్రవాసి. సార్వభౌమిక శాసననిర్మాణ సభాసభ్యుడు. ప్రత్యేకరాష్ట్రముగ దేశమును వెలిబుచ్చుటకు అసభలో గొప్ప సేవను జేయుచున్నాడు.

సర్ సాసూన్ డేవిడ్ గారు:— యూదుడు బొంబాయి పురవాసి. కోటీశ్వరుడు. లక్షలకొలది రూపాయలను దానధర్మముల కిచ్చినవాడు. మిల్లులకధిపతి. గొప్ప వర్తకుడు. సార్వభౌమిక శాసన నిర్మాణ సభాసభ్యుడు.

రావుబహదూర్ ముధోల్కరుగారు:— మధ్యపరగణాలలో అమరావతి పురవాసి. న్యాయవాది. పరిశ్రమాభివృద్ధికయి విశేషము పాటుపడిన దేశాభిమాని, సార్వభౌమికశాసననిర్మాణ సభాసభ్యుడు.

గౌ॥ హరిశ్చంద్రవిష్ణుదాసుగారు:— సింధుదేశము పక్షమున బొంబాయి శాసననిర్మాణసభలో సభ్యుడుగనున్నాడు. కాంగ్రెసు నాయకులలో నొకడు.

సర్ ఇబ్రహీం రహీంతుల్లాగారు:— బొంబాయినగరములో మహమ్మదీయనాయకులలో నొకడు. బొంబాయి పురపాలనాసంఘమున కధ్యక్షుడుగనుండెను. బొంబాయినగరపు మహమ్మదీయులపక్షమున బొంబాయి శాసననిర్మాణసభలో సభ్యుడుగనున్నాడు.

సర్ విఠలదాసు దామోదర ఠాకర్సే గారు:— గుజరాతిభాటియా వంశమునకు జెందినవాడు. కోటీశ్వరుడు. మిల్లుల కధిపతి. పరిశ్రమిక విషయములలో నధికానుభవముగలవాడు. సార్వభౌమిక శాసననిర్మాణసభలో సభ్యుడుగనున్నాడు.

సర్ గంగాధరరావు చిట్నవిస్ గారు:— నాగపురపు కాపురస్తుడు. బ్రాహ్మణుడు. గొప్పభూస్వామి. నాగపురపాలనాధ్యక్షుడుగనుండెను. సామ్రాజ్యశాసననిర్మాణ సభాసభ్యుడుగనున్నాడు.

సర్ పావూర్జీ బ్రోచాగారు:— బొంబాయినగరములో గడువిఖ్యాతినొందిన ధర్మాత్ముడు. షేరుమార్కెటుకు రాజనవచ్చును. బొంబాయినగరమునకు 1911లో షెరిఫుగనుండెను.

కార్నీజి:— ఈకోటీశ్వరుని నామము ప్రపంచమునందంతటను దెలుసును. తనకోట్లను దానములకయి వినియోగించుచున్నాడు. అమెరికాలో ప్రతినగరమందును యుచిత పుస్తకాలయములను స్థాపించెను. భూలోకరాజులకు యుద్ధములుజరుగకుండ తగవులను పంచాయతీ మూలకముగా బరిష్కరించుకొనుటకయి తగినప్రయత్నములను జేయుటకీమధ్య 10 కోట్లరూపాయలనిచ్చెను. తనకోట్లను ఉక్కు వ్యాపారమువలన నార్జించెను.

సయ్యద్‌హుసేను బిల్‌గ్రామిగారు:— హైదరాబాదువాసి. గొప్ప భాషాపండితుడు స్టేటుసెక్రటరిగారి సభలో హైందవ సభ్యుడుగ నుండియుండెను.

లల్లుభాయి శ్యామలదాసుగారు:— బొంబాయి శాసననిర్మాణసభలో సభ్యుడు. పరిశ్రమల ప్రోత్సాహమునకు పాటుపడుచున్నట్టివాడు సర్ విఠలదాసుగారితోపాటు బొంబాయి రాజధానిలో సా కవ్యవసాయ ధనాగారమును గవర్నమెంటువారి సహాయమువలన స్థాపించెను.

---

లించింగ్ట్యాంగుగారు:— బర్మాపక్షమున సామ్రాజ్యశాసననిర్మాణసభలో సభ్యుడుగనుండెను. ఇప్పుడుద్యోగమునకు రాజీనామనొసంగెను. విద్యావంతుడు.

---

ఆల్ప్రెడు ఛాటర్టనుగారు:— చెన్నరాజధానిలో పారిశ్రామికాధ్యక్షుడుగనున్నాడు క్రొత్తపరిశ్రమలను స్థాపించి హైందవులెట్లు ధనార్జనముచేయవచ్చునో అవిధము నెల్లప్పుడు పత్రికలవ్రాయుచు పరిశ్రామికోద్యమ విజృంభణమునకు సహాయపడుచుండును. చెన్నపురి శాసననిర్మాణసభా సభ్యుడుగనున్నాడు.

---

గౌ॥ నవ్వాబు బాఖసాహెబుగారు:— చెన్నపురి మహమ్మదీయుల పక్షమున చెన్నపురి శాసననిర్మాణసభలో సభ్యుడుగనున్నాడు. వర్తకముచేత విశేషము ధనమార్జించినట్టివాడు.

---

## హార్డింజి ప్రభువు.

మనప్రస్తుతపు రాజప్రతినిధి ఉదారస్వభావుడు. హిందూదేశోద్ధరణమే తన యభీష్టమని కంకణము గట్టుకొనినవాడు. జార్జిచక్రవర్తిగారికి గొప్పవిశ్వాసపాత్రుడు.

---

## క్రూ ప్రభువు.

ఇండియాదేశమునకు స్టేటుసెక్రటరి జార్జిసార్వభౌమునితోపాటు డిల్లీదర్బారుకు ఇండియాకువచ్చెను. ఈయనవలన మనదేశమునకు గొప్పయుపకారములు లభించును.

---

## సర్ జార్జిక్లార్కు.

వీరిసంగతి యనేకపర్యాయము లాంధ్రపత్రికలో వ్రాయబడెను. అయిదు సంవత్సరములనుండి బొంబాయిగవర్నరుగనున్నారు. రాజధానికి గొప్ప మేలులను జేసెను. అందరిప్రజలవలనను ప్రేమింపబడుచున్నాడు. ఈసంవత్సరము సెప్టెంబరునెలతో యుద్యోగకాలము పూర్తియగును.

---

## కార్మయికేలు ప్రభువు.

నవంబరునెలలో చెన్నపురి గవర్నరుగవచ్చెను. ఏప్రియలు 1వ తేదిన బెంగాలు గవర్నరుపదవి నంగీకరించెను. ప్రజాస్వామిత్వవాది. ఈయనవలన వంగదేశమునకు గొప్పమేలు కలుగగలదు.

## లిట్టను ప్రభువు.

ఈయన మనదేశమునకు రాజప్రతినిధిగనుండెను. ఈయనకాలమందు విక్టోరియారాజ్ఞి హిందూదేశపుచక్రవర్తినియని మొదటి డిల్లీదర్బారులో ప్రకటింపబడెను.

---

## కర్జను ప్రభువు.

ఏడుసంవత్సరము లీయన 1898 మొదలు 1905 వరకు రాజప్రతినిధిగనుండెను. ఈయనకాలమందు రెండవడిల్లిదర్బారుజరిగి ఎడ్వర్డు చక్రవర్తి హిందూదేశపుచక్రవర్తియని ప్రకటింపబడెను.

---

## సర్. ఓ. మూర్ క్రీగు.

ఈయన హిందూదేశమునకు సర్వసేనాధ్యక్షుడు. రాజప్రతినిధిగారి సభాసభ్యుడు. డిల్లీదర్బారులో 50 వేల సైన్యమునుగూర్చి విన్యాసములను జేయించెను.

---

## సర్ విలియం డ్యూక్.

30 సంవత్సరములనుండియు సివిలు సర్వీసుద్యోగిగ బెంగాలు రాష్ట్రమునందుండి తొమ్మిదినెలలు లెప్టినెంటు గవర్నరుపనిని నిర్వహించెను. ఇప్పుడు బెంగాలుగవర్నరుగారి కార్యనిర్వాహక సభ్యులలో జ్యేష్ఠుడు.

---

## సర్ లూయిడేను.

పంజాబు లెప్టినెంటు గవర్నరుగనున్నారు.

---

## సర్ జాన్ హ్యూవెట్టు.

అత్యధికమేధావంతుడు. "డిల్లీదర్బారుయొక్క మెదడు" అని వర్ణింపబడియెను. సంయుక్తరాష్ట్రములకు పాలకుడు. ఉద్యోగకాల మట్టోబరుమాసముతో నంతమొందును.

---

## సర్ రెజినాల్డు క్రాడకు.

మధ్యపరగణాలకు ఛీఫుకమిషనరుగనుండెను. ఇప్పుడు రాజప్రతినిధిగారి కార్యనిర్వాహక సభ్యులలో నొకడు. దేశీయ వ్యవహారాంగశాఖ నీతనిచేతిలోనున్నది.

---

## సర్ ఛార్లెస్ బెయిలి.

నూతన బేహారురాష్ట్రమునకు పాలకుడుగ నియమింపబడెను.

---

## సర్ గైఫ్లీట్ వుడ్ విల్సను.

రాజప్రతినిధిగారికి కోశాధ్యక్షుడు సౌమ్యస్వభావము కలవాడు. హైందవుల యుచితతృష్ణల విషయమై నీయనకు గొప్పసహానుభూతిగలదు.

### సర్ రాబర్టు కార్లయిల్.

రాజప్రతినిధిగారి మంత్రులాలోచనసభలో నొకఁడు. రెవిన్యూశాఖ కధ్యక్షుడు.

### సర్ హార్కోర్టు బట్లరు.

రాజప్రతినిధిగారి కార్యనిర్వాహకసభ్యులలో విద్యాంగశాఖ కధ్యక్షుడు ప్రారంభోచితవిద్యను నాలుగుదిశలను హిందూదేశమందు వ్యాపింపజేయునిది దొరతనమువారు సంతృప్తిజెందరని వక్కాణించి యుండెను.

### డబ్లు, హెచ్. క్లార్కు దొరగారు.

రాజప్రతినిధిగారికి వాణిజ్యవ్యాపారాంగమంత్రి. క్రొత్తగానీ పనిచేయుటకై యింగ్లండునుండి పిలిపింపఁబడెను. లైఫ్ ఇన్స్యూరెన్సుచట్టము ఫ్యాక్టొరీలచట్టము ఈయనకాలమందే శాసనములయినవి.

### సర్ లారెన్సు జెంకిన్సు.

బొంబాయి హైకోర్టులో 12 సంవత్సరములు న్యాయాధిపతిగనుండిన తరువాత బెంగాలు హైకోర్టునకు ప్రధాన న్యాయాధిపతిగ బంపబడెను. జెంకిన్సుగారియందు వంగదేశీయుల కమితభక్తి గలదు.

### సర్ బేసిల్ స్కాటు.

జెంకిన్సుగారితరువాత 1907 వ సంవత్సరమునుండియు బొంబాయి హైకోర్టు ప్రధానన్యాయాధిపతిగ నున్నాడు.

### సర్ కాలిన్ కేప్బెల్.

జార్జిచక్రవర్తిగారి మిత్రులలో నొకఁడు యుద్ధనావాధికారి. శ్రీరాజదంపతులిండియాకు వచ్చిన మెడీనా భాగనావాధికారిగ నుండెను.

### ఇ. ఎ. గైటుగారు.

జనాభా లెక్కలకు కమిషనరుగానున్నాడు. జనసంఖ్యయిదే విధముగ పెరిగెనేని 180 సంవత్సరములలో నరువదికోట్ల జనులిండియాలో నుందురని మదింపు వేసెను.

### తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు.

తెలుగులో న్యాయవాదులు, ఆంధ్రగ్రంథకర్తలు. సువర్ణలేఖపత్రికకు సంపాదకులుగ నుండిరి. అనేకపర్యాయము లాంధ్రపత్రికకు వ్యాసములను వ్రాసిరి. మాధవీకంకణమును, అర్థికచరిత్రమును భాషాంతరీకరించిరి.

శివరాజు ధామ్మన్నగారు:— గుంటూరుజిల్లా బాపట్లతాలూకాలో తాటినారపరిశ్రమను ప్రవేశపెట్టెను. ఇసుకపర్రలలో వేరుశనగపంటను పండింపజేసి జనులకు నూతనధనార్జనోపాయమును జూపెను అన్యోన్యవ్యవసాయధనాగారమును స్థాపించి రయితులకు మేలుజేయ యత్నించుచున్నాడు.

### మాస్తి భూపాలం కృష్ణశ్రేష్ఠిగారు.

వీరు సేలము మండలములోని పాలకోడు గ్రామవాస్తవ్యులు. తాలూకా జిల్లా బోర్డులలో సభ్యులుగానుండి దేశారాధనమును జేయుచున్నారు. పాలకోడు యూనియనుకు గ్రామాధిపతిగ నున్నారు. పాలకోడులో నొకధర్మశాలను స్థాపించి బీదలకన్నదానమును జేయుచున్నారు. సేలము మండలమునుండి ఢిల్లి దర్బారునకు దొరతనమువారిచే నాహ్వానము చేయఁబడిరి.

### థామస్ ఎడిసన్ గారు.

అమెరికాదేశపు సుప్రసిద్ధ ప్రకృతిశాస్త్రవేత్త, గ్రామఫోనులను, సినిమాటోగ్రాపును, విద్యుద్దీపములను వెలిగించుపద్ధతిని ఇంక నెన్నో నిర్మాణములను జేసి భూలోకమందంతటను తరుగనియశము నార్జించియున్నారు.

### రావుబహద్దరు రామగోపాలసేఠ్ గారు.

వీరు సుప్రసిద్ధులైన మార్వాడీవర్తకులు. వీరి దానధర్మములు సికిందరాబాదు హైదరాబాదులందే కాక కాశీ, రామేశ్వరమువరకు వ్యాపించినవి. వీరనేకము సాధువులకు వైరాగులకు సదావృత్తిని చెప్పిరి. ఈపుణ్యాత్ముడు సికింద్రాబాదున నొక సంస్కృతపాఠశాలను స్థాపించెను, బీదలకు గృహదానంబులం జేసెను, దేవాలయంబులు గట్టించెను, సత్రంబులను గట్టించెను, నైజాముగారికి నజరానాగా నొక సుందరమందిరంబును సమర్పించెను. ఇదియొక్కటి బీదసాదలకు వీరుచేయు దానములనేకములు గలవు. సంవత్సరమునకు రెండు లక్షల రూప్యములను వీరు దానధర్మములకై వినియోగించుచుందురు. వీరి దానధర్మములను గుర్తించి బ్రిటిషుదొరతనమువారు రావుబహద్దరు శ్రీనైజాముకేసరి హింద్ బిరుదములనిచ్చిరి.

ఆంధ్రదేశమునకు సదుపాయమున్న బెజవాడయందలి రామగోపాలసేటుగారి సత్రమునందు దిగి విశ్రమించి వారిని పొగడనివారు లేరు.

గుమ్మడెల్లి లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు బొంబాయిలో ధనికులయిన ఆంధ్రవర్తకులు. శికిందరాబాదు కాపురస్థులు. దానధర్మము లనాథులకు చేయుచు సత్కీర్తి వహించినవారు. దేవాలయమును గట్టించిరి. బ్రాహ్మణప్రియులు. బొంబాయిలోని ఆంధ్రులకు నాయకులుగ నున్నారు.

### దుండిగల్ల కృష్ణయ్యగారు.

వీరు సికిందరాబాదులో ప్రసిద్ధవర్తకులు. గొప్పధనికులు. బ్యాంకరులు. దానధర్మములను విశేషము చేసినట్టివారు. శివాలయములం గట్టించిరి. సికిందరాబాదులోని వీరి సత్రములో నిరంతరాన్నదానము జరుగుచుండును.

### ఆచంట లక్ష్మీపతిగారు, శ్రీమతి రుక్మిణమ్మగారు.

లక్ష్మీపతిగారు కృష్ణాజిల్లా కాపురస్థులు. ఇప్పుడు చెన్నపురిలో డాక్టరుగ నున్నారు. బి. ఎ. ఎం. బి. సి. యం; పరీక్షలలో కృతార్థుడాయెను. విజ్ఞానచంద్రికా గ్రంథప్రచారక సమాజమునకు వ్యవస్థాపకుడు. ఈమండలివారికొరకయి కొన్ని పుస్తకముల నాంధ్రమున వ్రాసెను.

వేఱ బ్రాహ్మణశాఖకు జెందిన శ్రీమతి రుక్మిణమ్మగారిని వివాహమాడి బ్రాహ్మణులలో వివాహసంస్కరణమునకు మార్గదర్శియయ్యెను. శ్రీమతి రుక్మిణమ్మగారు మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థురాలాయెను. ఇప్పుడింటరుమీడియేటు పరీక్షకు జదువుచున్నది.

## తెలుగుజిల్లాల జనాభాసంఖ్య 1911 మరియు 1901.

| | జనాభాసంఖ్య | |
|---|---|---|
| గంజాంజిల్లా | 19 1 | 1901 |
| అస్కా తాలూకా | 1 31 917 | 1 15 886 |
| బరంపురం | 3 86 082 | 3,44 368 |
| శ్రీకాకుళం | 2 66 117 | 2,54 922 |
| గంజాం | 1,03,563 | 95,[illegible]82 |
| ఇచ్ఛాపురం | 90 849 | 88,500 |
| పర్లాకిమిడి | 2 78 612 | 2 57 057 |
| గుంసూరు | 2 30 422 | 2 00 357 |
| ఘుముసూరు | 1 15,462 | 1,02,396 |
| రసల్కొండ | డిటో | డిటో |
| సోంపేట | 1,10,448 | 97,229 |
| సూరద | 21,471 | 18 662 |
| టెక్కలి | 1,35,852 | 1,19 498 |
| వెరసి | 18,70,826 | 16,89,754 |

### గంజాం ఏజన్సీ

| | | |
|---|---|---|
| బల్లిగూడ తాలూకా | 1,11,898 | 1,04,714 |
| పర్లాకిమిడి | 61,218 | 55,120 |
| రామగిరి | 86 149 | 76,097 |
| సోంపేట | 5,901 | 5,461 |
| సూరడ | 3 570 | 2 846 |
| ఉదయగిరి | 81 780 | 76 858 |
| వెరసి | 3 50,466 | 3,21,114 |

### విశాఖపట్టణము జిల్లా

| | | |
|---|---|---|
| అనకాపల్లి తాలూకా | 1,69,751 | 1,65,478 |
| భీమునిపట్నం | 1 39,371 | 1 26 354 |
| బొబ్బిలి | 1,42,667 | 1 33,577 |
| చీపురుపల్లి | 1,73 217 | 1,70,532 |
| గజపతినగరం | 1 42 209 | 1 34,573 |
| గొలుకొండ | 1 37 245 | 1 23 507 |
| పాలకొండ | 2 11,193 | 2 15,376 |
| పార్వతీపురం | 1 22 243 | 1,16,533 |
| సాలూరు | 99,595 | 92,717 |
| సర్వసిద్ధి | 1 68 941 | 1,6[illegible],761 |
| శృంగవరపుకోట | 1,42,543 | 1,37,724 |
| వీరవిల్లి | 2,22 532 | 2,09,228 |
| విశాఖపట్టణము | 1,14,217 | 1,10,652 |
| విజయనగరం | 1,86,896 | 1,85,670 |
| వెరసి | 21,69 670 | 20,82,662 |

### విశాఖపట్టణముజిల్లా ఏజన్సీ.

| | | |
|---|---|---|
| బిస్సంకటక్ | 62,628 | 59,445 |
| గొలుగొండ | 40 436 | 38,929 |
| గుణుపురం | 1 22,535 | 1 18 070 |
| జయపురం | 1 78 952 | 1 33,831 |
| కోరపుట్ | 54,294 | 73,818 |
| మాల్కనిగిరి | 40,563 | 35,856 |
| నవరంగపూర్ | 1,80,920 | 1,04,145 |
| పడ్వా | 96,888 | 64 415 |
| పాలకొండ | 8,947 | 11,245 |
| పార్వతీపురం | 45,735 | 48,990 |
| పొట్టగి | 77,930 | 73,013 |
| రాయగడ | 98,908 | 86,610 |
| సాలూరు | 4,800 | 5,126 |
| శృంగవరపుకోట | 5,682 | 4 293 |
| వీరవిల్లి | 11,233 | 7 560 |
| వెరసి | 1,020,151 | 8,50,376 |

### గోదావరిజిల్లా

| | | |
|---|---|---|
| అమలాపురం తాలూకా | 2 15,710 | 1 89,105 |
| కాకినాడ | 2,28,388 | 4,13,768 |
| పెద్దాపురం | 1,88,346 | 1,67,020 |
| పిఠాపురం | 96 824 | 84,089 |
| రాజమహేంద్రవరం | 1,89,260 | 1 61,070 |
| రామచంద్రపురం | 2,38 774 | 2,17,772 |
| రాజోలు | 2,17,919 | 1,94 543 |
| తుని | 2,70 736 | [illegible]8,763 |
| వెరసి | 14,45,957 | 12,8[illegible],119 |

### గోదావరి ఏజన్సీ

| | | |
|---|---|---|
| భద్రాచలం | 55 952 | 48,658 |
| చోడవరం | 26 610 | 23,229 |
| నూగూరు | 19 958 | 20,218 |
| పోలవరం | 65,727 | 58,274 |
| ఎల్లవరం | 36,655 | 29,681 |
| వెరసి | 2,06,902 | 1,80,060 |

| | | |
|---|---|---|
| *కృష్ణాజిల్లా తా॥* | | |
| బందరు | 1,15.509 | 1,02.751 |
| బెజవాడ | 1,47,323 | 1,24, 70 |
| భీమవరం | 1,66,533 | 1,44,615 |
| దివి | 1,34,008 | 1,11,565 |
| ఏలూరు | 2,08,167 | 1,82,027 |
| గుడివాడ | 1,62 306 | 1,42,055 |
| కైకలూరు | 64,500 | 56,813 |
| నందిగామ | 1.58. 86 | 1,39,958 |
| నరసాపురం | 1,71 124 | 1,51,812 |
| నూజివీడు | 1,62,166 | 1,40,817 |
| తణుకు | 2,69 858 | 2,38.758 |
| తిరువూరు | 79 175 | 69,219 |
| ఏర్నగూడెం | 1,58.680 | 1,40 048 |
| వెరసి | 19 97,685 | 17,44,188 |
| *గుంటూరుజిల్లా తా॥* | | |
| బాపట్ల | 2.41 999 | 2,15,158 |
| గుంటూరు | 2 30,928 | 2,00,557 |
| నరసారావుపేట | 1,95.137 | 1,68,547 |
| ఒంగోలు | 2,46,273 | 2,28 ↄ65 |
| పల్నాడు | 1,61,197 | 1,13.638 |
| రేపల్లె | 1,39 812 | 1,14 732 |
| సత్తెనపల్లి | 1,84,474 | 1,59,645 |
| తెనాలి | 2,03 262 | 1,72,815 |
| వినుకొండ | 91,469 | 82,493 |
| వెరసి | 16,97,551 | 14,90,685 |
| *నెల్లూరుజిల్లా* | | |
| ఆత్మకూరు | 1.05,114 | 1 10,906 |
| దర్శి | 92 5 2 | 82,459 |
| గూడూరు | 1,02,924 | 1,04,6 7 |
| కందుకూరు | 1.53,055 | 1,51,417 |
| కనిగిరి | 1,25,917 | 1,10 813 |
| కావలి | 92,773 | 87,015 |
| కోవూరు | 1,24,671 | 1,15.919 |
| నెల్లూరు | 1,67 306 | 1,62,813 |
| పొదిలి | 69.122 | 58.937 |
| పోలూరు | 64,754 | 68,781 |
| రాపూరు | 66,215 | 70,130 |
| ఉదయగిరి | 98 391 | 95,173 |
| వెంకటగిరి | 65,408 | 60.681 |
| వెరసి | 13,28,152 | 12,74,831 |
| *కడపజిల్లా తా॥* | | |
| బద్వేలు | 95.896 | 89,361 |
| కడప | 1,00,585 | 1,01,953 |
| జమ్మలమడుగు | 106360 | 103692 |
| కమలాపురం | 64350 | 61922 |
| ప్రొద్దుటూరు | 96359 | 91236 |
| పులివెందల | 106950 | 103366 |
| పుల్లంపేట | 145230 | 143521 |
| రాయచోటి | 113982 | 118912 |
| సిద్ధవటము | 64353 | 68087 |
| వెరసి | 893993 | 88.080 |
| *కర్నూలుజిల్లా తా.* | | |
| కంభం | 125598 | 115881 |
| డోను | 95724 | 83807 |
| కోయిల్‌కుంట్ల | 92681 | 88162 |
| కర్నూల్ | 14 815 | 1326 7 |
| మార్కాపురం | 99 30 | 94298 |
| నందికొట్కూరు | 1 0519 | 97174 |
| నంద్యాల్ | 91299 | 870 9 |
| పత్తికొండ | 111501 | 99722 |
| సిరివెల్ | 78532 | 72887 |
| వెరసి | 935 99 | 872.70 |
| *బళ్లారిజిల్లా తా॥* | | |
| ఆదవాని | 177207 | 1647 5 |
| ఆలూరు | 100181 | 84849 |
| బళ్ళారి | 184203 | 149548 |
| హడగల్లి | 92974 | 92139 |
| హర్పనహల్లి | 98072 | 95646 |
| హొసపేట | 92132 | 101903 |
| కూడ్లిగి | 109986 | 108985 |
| రాయదుర్గము | 84234 | 82789 |
| శిరిగుప్ప | 80447 | 71651 |
| వెరసి | 969436 | 947214 |
| *అనంతపురం జి॥ తా॥* | | |
| అనంతపురం | 106131 | 106706 |
| ధర్మవరం | 89848 | 86158 |
| గుత్తి | 149139 | 142965 |
| హిందూపురం | 97314 | 92088 |
| కదిరి | 147402 | 145503 |
| కళ్యాణదుర్గము | 83135 | 76977 |
| మడకసిర | 82121 | 81457 |
| తాడిపత్రి | 144273 | 109421 |
| వెరసి | 965223 | 938757 |
| *మదరాసు.* | | |
| టవున్ | 518660 | 509346 |

చెంగల్‌పట్.

| | | |
|---|---|---|
| చెంగల్‌పట్ | 16 796 | 15 213 |
| కాంచీనగరము | 1723 9 | 152892 |
| మధురాంతకం | 3 8 51 | 278 61 |
| పొన్నేరి | 233 50 | 229913 |
| సైదాపేట | 331597 | 312115 |
| తిరువళ్లూరు | 194405 | 181907 |
| మొ॥ | 1406 8 | 151 1 6 |

చిత్తూరు జిల్లా.

| | | |
|---|---|---|
| చంద్రగిరి | 117438 | 113750 |
| చిత్తూరు | 332850 | 2 9868 |
| కాళహస్తి | 101199 | 94182 |
| మదనపల్లి | 137493 | 136977 |
| పాలమనేరు | 50619 | 51575 |
| పుంగనూరు | 107051 | 9 852 |
| పుత్తూరు | 179638 | 170235 |
| తిరుత్తణి | 185881 | 1710 5 |
| వాయల్పాడు | 126575 | 128692 |
| మొ॥ | 1238742 | 1172885 |

ఉత్తరార్కాడు.

| | | |
|---|---|---|
| ఆర్కాటం | 164412 | 137212 |
| ఆరణి | 1 8944 | 96542 |
| చెయ్యారు | 1483255 | 128590 |
| గుడియాత్తం | 206885 | 195665 |
| కంగుండి | 68210 | 64416 |
| పోలూరు | 169557 | 152475 |
| తిరుపత్తూరు | 2 7262 | 205 86 |
| తిరువణ్ణామలె | 285641 | 244085 |
| వేలూరు | 222329 | 208789 |
| వాలాజానగరం | 216795 | 191231 |
| వందవాసి | 162620 | 132595 |
| మొ॥ | 1906960 | 1750566 |

## మదరాసు రాజధానిలోని ముఖ్యపట్టణముల జనసంఖ్య.

| మ్యునిసిపాలిటి | జనాభా సంఖ్య 19 1 | 1901 |
|---|---|---|
| బరంపురం | 31456 | 25729 |
| పర్లాకిమిడి | 18870 | 17336 |
| శ్రీకాకుళం | 178 2 | 18196 |
| విశాఖపట్టణము | 43413 | 40892 |
| విజయనగరం | 37550 | 37270 |
| అనకాపల్లి | 2 625 | 18539 |
| భీమునిపట్నం | 9814 | 10212 |
| కాకినాడ | 54110 | 48 96 |
| రాజమహేంద్రి | 48417 | 36408 |
| మచిలీపట్నము | 421 3 | 39507 |
| ఏలూరు | 37819 | 33521 |
| బెజవాడ | 32867 | 24224 |
| గుంటూరు | 40549 | 3 833 |
| తెనాలి | 18195 | 12 83 |
| ఒంగోలు | 13 83 | 12864 |
| నెల్లూరు | 33216 | 32040 |
| కడప | 17807 | 16428 |
| కర్నూలు | 26040 | 25376 |
| నంద్యాల | 16230 | 15137 |
| బళ్లారి | 34956 | 58247 |
| ఆదవాని | 31645 | 30416 |
| అనంతపురం | 8457 | 7938 |
| మదరాసు | 518660 | 5 9346 |
| కాంచీనగరము | 58864 | 46164 |
| చెంగల్‌పట్టు | 11626 | 10551 |
| తిరుపతి | 16701 | 15485 |
| వేలూరు | 49746 | 43537 |
| గుడియాత్తము | 28300 | 21885 |
| కుంభకోణము | 61647 | 59673 |
| తంజావూరు | 60341 | 57870 |
| నాగపట్నము | 60168 | 57190 |
| తిరుచినాపల్లి | 123512 | 104721 |
| శ్రీరంగం | 24799 | 23039 |



Mr. Tallapragada Suryanarayana Rao.



తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు.



The Rev. Mr. Thomossen.

రెవరెండు థామస్సెన్.

Mr. K. V. Hanumantha Jagannadha Rao.



కె. వి. హనుమంత జగన్నాధరావు గారు.

Mr. Bh. Krishna Setty.



భూపాళం కృష్ణ శ్రేష్ఠి గారు.

Thomas Edison.



థామస్ ఎడిసన్ గారు.

Rai Bahadur Seth Ramagopal.



రాయబహదూరు సేటు రామగోపాలుగారు.

Mr. G. Lakshmi Narayana.



గుజ్జెల్లి లక్ష్మీనారాయణగారు.

Mr Dundigalla Krishnayya.



దుందిగళ్ళ కృష్ణయ్యగారు.

Lady Graduates of The Madras University in 1911.

Standing:— Rev. Dr. Lazarus (Host), Mrs. T. W. Madeley, Lady Benson, The Honorable, Mr. J. H. Stone, Mrs. Lazarus (Hostess).

Seated:— Mrs. Hensman. Miss. Kausalya B. A. Miss. Samuel B. A. Miss. Subbulakshimi B. A. Miss. Maduram B. A. Miss. Masilamani B. A. Miss. H. Lazarus. B. A.



నిల్చుచుంటువారు:— రివరెండు డాక్టరు లాజరస్సు గారు, శ్రీమతి టి. డబ్ల్యూ. మాడ్లేగారు. లేడీ బెన్సన్ గారు, గౌ॥ మిస్టర్. జె. హెచ్. స్టోన్‌గారు. శ్రీమతి లాజరస్సు గారు.

కూర్చుంటువారు:— శ్రీమతి హెన్సమన్‌గారు, శ్రీమతి కన్యాకౌసల్యమ్మగారు, బి. ఏ., శ్రీమతి కన్యా శామ్యూలమ్మగారు బి.ఏ, శ్రీమతి కన్యా సుబ్బులక్ష్మమ్మగారు. బి. ఏ., శ్రీమతి కన్యా మధురమ్మ గారు, బి.ఏ., శ్రీమతి కన్యా మాసిలామణిఅమ్మగారు, బి.ఏ., శ్రీమతి కన్యా హెచ్.లాజరసమ్మగారు,బి.ఏ.

1911 వ సం॥ నందు చెన్నపురి విశ్వవిద్యాలయపు బి. ఎ. పరీక్షలో చేరిన నారీమణులు.

Widow Remarriage Conference. Rajahmundry. 1907.



శ్రీ వితంతు వివాహ సంఘసభ



Mr. A. Lakshmipathy. Mrs. A. Rukminamma.

శ్రీయుత ఆచంట లక్ష్మీపతిగారు. శ్రీమతి రుక్మిణమ్మగారు.

Elephants in Dasara Procession at Calcutta.



కలకత్తాలో యేనుగుల దసరా యూరేగింపు.

Their Imperial Majesties witnessing the Oriental Pageants at Calcutta.



శ్రీరాజదంపతులు కలకత్తా యూరేగింపును జూచుట.

His Majesty on the look out in the Jungle.



జార్జిచక్రవర్తి · వేటకై యెదురుచూచుట.

King George Shooting a tiger in the Nepal Jungle.



శ్రీజార్జిచక్రవర్తి నేపాళారణ్యములందు పులుల వేటాడుట.

Queen Mary Visiting Agra Fort.



శ్రీమేరీ మహారాణి ఆగ్రా కోటను జూచుట.

Their Imperial Majesties at the Appollo Bunder.



శ్రీరాజదంపతులు స్వదేశోన్ముఖులై బొంబయి రేవునందు పడవనెక్కి బోవుట.

# 1912-13. పరిధావి నామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గము. 1912-13.

| మార్చి. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | 31 | 3 | 10 | 17 | 24 |
| సో | ... | 4 | 11 | 18 | 25 |
| మ | ... | 5 | 12 | 19 | 26 |
| బు | ... | 6 | 13 | 20 | 27 |
| గు | ... | 7 | 14 | 21 | 28 |
| శు | 1 | 8 | 15 | 22 | 29 |
| శ | 2 | 9 | 16 | 23 | 30 |

| ఏప్రిలు. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 7 | 14 | 21 | 28 |
| సో | 1 | 8 | 15 | 22 | 29 |
| మ | 2 | 9 | 16 | 23 | 30 |
| బు | 3 | 10 | 17 | 24 | ... |
| గు | 4 | 11 | 18 | 25 | ... |
| శు | 5 | 12 | 19 | 26 | ... |
| శ | 6 | 13 | 20 | 27 | ... |

| మే. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 5 | 12 | 19 | 26 |
| సో | ... | 6 | 13 | 20 | 27 |
| మ | ... | 7 | 14 | 21 | 28 |
| బు | 1 | 8 | 15 | 22 | 29 |
| గు | 2 | 9 | 16 | 23 | 30 |
| శు | 3 | 10 | 17 | 24 | 31 |
| శ | 4 | 11 | 18 | 25 | ... |

| జూను. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | 30 | 2 | 9 | 16 | 23 |
| సో | ... | 3 | 10 | 17 | 24 |
| మ | ... | 4 | 11 | 18 | 25 |
| బు | ... | 5 | 12 | 19 | 26 |
| గు | ... | 6 | 13 | 20 | 27 |
| శు | ... | 7 | 14 | 21 | 28 |
| శ | 1 | 8 | 15 | 22 | 29 |

| జూలై. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 7 | 14 | 21 | 28 |
| సో | 1 | 8 | 15 | 22 | 29 |
| మ | 2 | 9 | 16 | 23 | 30 |
| బు | 3 | 10 | 17 | 24 | 31 |
| గు | 4 | 11 | 18 | 25 | ... |
| శు | 5 | 12 | 19 | 26 | ... |
| శ | 6 | 13 | 20 | 27 | ... |

| ఆగష్టు. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 4 | 11 | 18 | 25 |
| సో | ... | 5 | 12 | 19 | 26 |
| మ | ... | 6 | 13 | 20 | 27 |
| బు | ... | 7 | 14 | 21 | 28 |
| గు | 1 | 8 | 15 | 22 | 29 |
| శు | 2 | 9 | 16 | 23 | 30 |
| శ | 3 | 10 | 17 | 24 | 31 |

అస్య సంవత్సరస్య సృష్ట్యాదిగతాబ్దాః 1955885018;

కలియుగగతాబ్దాః 5013;

శాలివాహనశకగతాబ్దాః 1834;

విక్రమార్క శకగతాబ్దాః 1969;

హూణశకాబ్దాః 1912-1913;

ఫసలీ 1321-1322.

శ్రీకల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం।
గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణాం।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం।
నానాకర్మసుసాధనం సముచితం పంచాంగమాకర్ణ్యతాం॥



ఈసంవత్సర చైత్రవైశాఖంబులందు ఋతుధర్మసహిత పశ్చిమవాయువులీచుచు అచ్చటచ్చట స్వల్పవర్షముగా వర్షించును. జ్యేష్ఠమాసంబున తొలకరివానల కొరంతయగును, ఆషాఢద్వయంబున మధ్యవృష్టియు, శ్రావణభాద్రపదంబులయందు సువృష్టియు ఆశ్వీజంబున స్వల్పవృష్టియు కలిగి, పూర్వాపరసస్యంబులు ఫలించును. కందులు గోధుమలు జొన్నలు మొదలగు ఎఱ్ఱధాన్యములు ఫలించును. శుక్రునకు సాలు అధిపత్యములు వచ్చుటచే కొలము సౌఖ్యముగాయున్నను, శాలి, హేమవాళాదిధాన్యములధరలు కలిగియుండును. కార్తిక శు 14 శ్రీపుష్కరవాహినీ పుష్కరప్రవేశము. చైత్ర శు 15 సో. చంద్రగ్రహణంబును, ఫాల్గుణ శు 15 శ గ్రస్తోదయ చంద్రగ్రహణంబును కలుగబోవుచున్నవి. పంటలుపదివీసములకధికముగా ఫలించును.

స్వస్తి సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు.

| సెప్టంబరు. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | 1 | 8 | 15 | 22 | 29 |
| సో | 2 | 9 | 16 | 23 | 30 |
| మ | 3 | 10 | 17 | 24 | ... |
| బు | 4 | 11 | 18 | 25 | ... |
| గు | 5 | 12 | 19 | 26 | ... |
| శు | 6 | 13 | 20 | 27 | ... |
| శ | 7 | 14 | 21 | 28 | ... |

| అక్టోబరు. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 6 | 13 | 20 | 27 |
| సో | ... | 7 | 14 | 21 | 28 |
| మ | 1 | 8 | 15 | 22 | 29 |
| బు | 2 | 9 | 16 | 23 | 30 |
| గు | 3 | 10 | 17 | 24 | 31 |
| శు | 4 | 11 | 18 | 25 | ... |
| శ | 5 | 12 | 19 | 26 | ... |

| నవంబరు, | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 3 | 10 | 17 | 24 |
| సో | ... | 4 | 11 | 18 | 25 |
| మ | ... | 5 | 12 | 19 | 26 |
| బు | ... | 6 | 13 | 20 | 27 |
| గు | ... | 7 | 14 | 21 | 28 |
| శు | 1 | 8 | 15 | 22 | 29 |
| శ | 2 | 9 | 16 | 23 | 30 |

| మార్చి. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | 30 | 2 | 9 | 16 | 23 |
| సో | ... | 3 | 10 | 17 | 24 |
| మ | ... | 4 | 11 | 18 | 25 |
| బు | ... | 5 | 12 | 19 | 26 |
| గు | ... | 6 | 13 | 20 | 27 |
| శు | ... | 7 | 14 | 21 | 28 |
| శ | 1 | 8 | 15 | 22 | 29 |

| డిసంబరు. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | 1 | 8 | 15 | 22 | 29 |
| సో | 2 | 9 | 16 | 23 | 30 |
| మ | 3 | 10 | 17 | 24 | 31 |
| బు | 4 | 11 | 18 | 25 | ... |
| గు | 5 | 12 | 19 | 26 | ... |
| శు | 6 | 13 | 20 | 27 | ... |
| శ | 7 | 14 | 21 | 28 | ... |

| జనవరి. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 5 | 12 | 19 | 26 |
| సో | ... | 6 | 13 | 20 | 27 |
| మ | ... | 7 | 14 | 21 | 28 |
| బు | 1 | 8 | 15 | 22 | 29 |
| గు | 2 | 9 | 16 | 23 | 30 |
| శు | 5 | 10 | 17 | 24 | 31 |
| శ | 4 | 11 | 18 | 25 | ... |

| ఫిబ్రవరి. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 2 | 9 | 16 | 23 |
| సో | ... | 3 | 10 | 17 | 24 |
| మ | ... | 4 | 11 | 18 | 25 |
| బు | ... | 5 | 12 | 19 | 26 |
| గు | ... | 6 | 13 | 20 | 27 |
| శు | ... | 7 | 14 | 21 | 28 |
| శ | 1 | 8 | 15 | 22 | ... |

| ఏప్రిల్. | | | | | |
|---|---|---|---|---|---|
| ఆ | ... | 7 | 14 | 21 | 28 |
| సో | 1 | 8 | 15 | 22 | 29 |
| మ | 2 | 9 | 16 | 23 | 30 |
| బు | 3 | 10 | 17 | 24 | 31 |
| గు | 4 | 11 | 18 | 25 | ... |
| శు | 5 | 12 | 19 | 26 | ... |
| శ | 6 | 13 | 20 | 27 | ... |

